శాస్త్రనిఘంటువులు : తెలుగు

# వ్యాకరణ పదకోశము



# వ్యాకరణ పదకోశము

సంగ్రాహకులు

డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం, ఎం.ఏ., పి హెచ్.డి.
రీడర్, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జుననగర్

శ్రీ రవ్వా శ్రీహరి, ఎం.ఏ., బి. ఓ. యల్.
లెక్చెరర్, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాద్

పరిష్కర్త

శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి





తెలుగు అకాడమి
హైదరాబాదు
1978

vyaakaraNa padakooSamu : ***Compilers*** : Dr. B. Purushottam; Sri R. Srihari; ***Scrutiniser*** : Sri Duvvuri Venkataramana Sastry; First Edition 1978, pp. viii + 592.





*First Edition, 1978*

Copies : 1,000

Published by TELUGU AKADEMI, Hyderabad - 500029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of production of Books and Literature in Regional Languages at the University level of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



***Price*** : **Rs. 20–25**

Printed in India

Text at Jyothi Press, Musheerabad, Hyderabad - 500 380
Cover at the A. P. Govt. Text Book Press, Hyderabad-500 004
Andhra Pradesh.

# ప్రస్తావన

నన్నయ భట్టారకుని కాలంనుండి నేటివరకు తెలుగు భాషకు వ్యాకరణ గ్రంథాలు తెలుగులోనూ సంస్కృతంలోనూ అనేకం వెలువడ్డాయి. వాటిపై వ్యాఖ్యాన గ్రంథాలు కూడా చాలా వచ్చాయి. అయితే అకారాదిక్రమంలో ఉన్న వ్యాకరణ గ్రంథాలు తెలుగులో లేవనే చెప్పాలి.

సంస్కృత వ్యాకరణ పరిభాషను వివరిస్తూ అభయంకర్, కత్రేవంటి విద్వాంసులు ఇంగ్లీషులో అకారాది నిఘంటువులు ప్రచురించారు. ఇంగ్లీషులో ఇటువంటి నిఘంటువులు అనేకం ఉన్నాయి. తెలుగులో వివిధ శాస్త్రాలలో పారిభాషిక పదకోశాలను ప్రచురిస్తే విద్యార్థులకూ అధ్యయన శీలురకు ఎంతో ఉపయోగకరంగా ఉంటుందనే తలంపుతో తెలుగు అకాడమి శాస్త్ర నిఘంటువుల ప్రచురణ పథకాన్ని చేపట్టింది. ఛందః పదకోశం, సాహిత్య పదకోశం, వ్యాకరణ పదకోశం అనే మూడు శాస్త్ర నిఘంటువులను ప్రచురింపవలెననే ప్రణాళికలో మొదటి రెండు పదకోశాలు ఇది వరకే ముద్రింపబడ్డాయి. ఇప్పుడు ఈ వ్యాకరణ పదకోశాన్ని మీ ముందుంచుతున్నాం. ఆయా శాస్త్ర విషయాలలో అభిరుచి గలవారందరికీ ఇవి అందుబాటులో ఉండగలవని మా విశ్వాసం.

బోధనా భాషగా అధికార భాషగా, తెలుగు తన రంగాన్ని మరింత విస్తృతం చేసుకుంటున్న ఈ తరుణంలో వ్యాకరణ పదకోశం యొక్క ప్రయోజనం అపారమని చెప్పక తప్పదు. చిరకాలంగా కావ్యాలలో ఉపయోగింపబడుతూ వచ్చినదీ జనవ్యవహారంలో కాలానుగుణములైన మార్పులకు లోనైనదీ, పరభాషా పదములతో చెలిమిచేసి అరమరిక లేకుండా ఒదిగిపోయినదీ అయిన మన తెనుగుభాష, నిత్య పరిణామ శీలమైన పూత గోదావరీ తరంగిణి వంటిది. ఈ జీవద్భాషకు ఒక ప్రామాణిక రూపాన్ని కలిగించి, ఏకరూపత సాధించడానికి అనేక లక్షణ గ్రంథాలు వెలువడ్డాయి. విశ్వ శ్రేయోదాయకములై చిరస్థాయులై వెలుగొందవలసిన రచనలలో కాని, తాత్కాలికమూ పరిమితమూ అయిన ప్రయోజనాన్ని ఆశించి చేసే రచనలలో కాని భాషకు ఏకరూపత అవసరం అప్పుడే అవి అన్ని ప్రాంతాలవారికీ, ఏ కాలంలో అయినా, సుబోధకంగా ఉండి తమ లక్ష్యాన్ని సాధించగలుగుతాయి. ఈ దృష్టితో పరిశీలించినప్పుడు వ్యాకరణ గ్రంథాల ప్రయోజనం ఈనాడు ఎంత ఉన్నదో మనకు అవగతమవుతుంది.

ఈ వ్యాకరణ పదకోశాన్ని డా॥ బొడ్డుపల్లి పురుషోత్తం, శ్రీ రవ్వా శ్రీహరి గారలు సంకలనం చేశారు. వారికి మా కృతజ్ఞతలు వ్యాకరణ పండితుల్లో అగ్రేసరులైన శ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు దీన్ని పరిష్కరించి ముద్రణయోగ్యం చేశారు. వారికి మా శ్రద్ధాంజలి.

ఈ గ్రంథంలో పునః పరిశీలన యోగ్యములైన విషయాలేమైనా మా దృష్టికి తెస్తే వాటిని మలిముద్రణలో సవరించుకోగలమని మనవి.

# ఉపోద్ఘాతము

తెలుగు సారస్వత భాషకు వ్యాకరణ గ్రంథాలు రెండు విధాలుగా ఉన్నాయి.

(i) తెలుగులో పద్యాలలోను, వచనంలోను, సూత్రరూపంగాను ఉన్నవి.

ఆంధ్ర భాషా భూషణం. (కేతన) తెనుగు వ్యాకరణం (రావిపాటి గురుమూర్తి శాస్త్రి) బాలప్రౌఢ వ్యాకరణాలు మున్నగునవి.

(ii) సంస్కృత భాషలో కారికలుగాను, సూత్రాలుగాను రచింపబడినవి.

ఆన్ధ్రశబ్ద చిన్తామణి. వికృతి వివేకం. ఆన్ధ్రకౌముది ఇత్యాదులు.

అముద్రిత వ్యాకరణాలు కూడా ఉన్నాయి. ఇంకా అనేక వ్యాఖ్యలు, ఆధునిక వ్యాకరణ రచన లెన్నో ఉన్నాయి

ఈ వ్యాకరణ వాఙ్మయంలోని సంజ్ఞల్ని, వ్యాకరణ శాస్త్రానికి సంబంధించిన పదాలను సేకరించి వివరణతో కోశంగా ప్రచురించాలనే అభిప్రాయం తెలుగు అకాదమీ వారికి కలిగింది.

ఈ బాధ్యతను వారు మా కప్పగించారు. దీనికి పర్యవేక్షకులుగా పూజ్యపాదులు, కళాప్రపూర్ణ విద్వాన్ దువ్వూరి వేంకటరమణ శాస్త్రి మహోదయు లుండటం మా అదృష్టం.

ఈ రచనలో ఎంతవరకు న్యాయం చేకూర్చామో పాఠకలోకమే నిర్ణయించాలి.

దొసగులని తోచినవానిని పండితులు తెలియచేస్తే కృతజ్ఞతతో స్వీకరించి మలి ముద్రణంలో సవరించగలం.

హైదరాబాదు సంగ్రాహకులు.

16-6-1976

# సంజ్ఞా వివరణము

| సంజ్ఞ | గ్రంథ నామము | గ్రంథకర్త : ఇతర వివరములు |
|---|---|---|
| అ.ఛ. | అనంతుని ఛందస్సు | అనంతామాత్యుఁడు |
| అథ.కా. | అథర్వణకారికావళి | అథర్వణుడు |
| అప్ప. | అప్పకవీయము | అప్పకవి, కాకునూరి |
| అహో. | అహోబలపండితీయము | అహోబలపతి |
| ఆం.కౌ. | ఆంధ్రకౌముది<br>ఆంధ్ర సాహిత్య పరిషత్<br>సంఖ్య. 36. 1935. | గణపవరపు వేంకటపతికవి<br>ఇందు పద్యపంక్తుల సంఖ్య<br>పేర్కొనబడెను. |
| ఆం భా.చ. | ఆంధ్ర భాషాచరిత్ర<br>1,2 సంపుటములు<br>ఆంధ్ర విశ్వకళాపరిషత్ 1936. | డాక్టర్ కళాప్రపూర్ణ<br>చిలుకూరి నారాయణరావు |
| ఆం.భా.భూ. | ఆంధ్రభాషా<br>భూషణము | కేతన, మూలఘటిక<br>పద్యసంఖ్య |
| ఆం.భా.వి | ఆంధ్రభాషా వికాసము | ఆచార్య జోగి సోమయాజిగంటి<br>ద్వితీయ ముద్రణం |
| ఆం.భా.శా | ఆంధ్ర భాషాను శాసనము | సూర్యనారాయణశాస్త్రి మల్లాది<br>1940 - ముద్రణం |
| ఆం వ్యా.వి | ఆంధ్ర వ్యాకరణ వికాసము | డాక్టర్ రాజేశ్వరశర్మ అమరేశం |
| ఆం.శ.త. | ఆంధ్రశబ్ద తత్వము<br>ఒకటి రెండు భాగాలు | శేషగిరిశాస్త్రి, తాతవెళ్ళి<br>మిరాశీదార్ |
| క.చిం. | కవిలోక చింతామణి<br>(అముద్రితము) | తాతంభొట్లు, వెల్లంకి<br>ఆంధ్ర సాహిత్య పరిషత్<br>కాకినాడ |
| కవిజ. | కవిజనాశ్రయము | రేచన మల్లియ. |
| కవిజనాం | కవిజనాంజనము | బలారి సింహశ్రీ<br>నరసింహరాజు (వ్రాతప్రతి) |

| సంజ్ఞ | గ్రంథ నామము | గ్రంథకర్త : ఇతర వివరములు |
|---|---|---|
| క.సం. | కవిజన సంజీవని | రామభద్రకవి, ముద్దరాజు<br>వావిళ్ళవారి ప్రచురణ : 1930 |
| కా.చూ. | కావ్యాలంకార చూడామణి<br>నవమోల్లాసము | పెద్దన, విన్నకోట<br>వేదంవారి ప్రచురణ : 1936 |
| గు.ప్ర. | గుప్తార్థ ప్రకాశిక<br>(బాలవ్యాకరణ వ్యాఖ్య) | కళాప్రపూర్ణ వేంకటరామ శాస్త్రి.<br>కల్లూరి 1929 ముద్రణం |
| గు వ్యా. | తెనుఁగు వ్యాకరణము | గురుమూర్తి శాస్త్రి, రావిపాటి<br>వావిళ్ళవారి ప్రచురణ : 1951 |
| చూ. | | చూడుడు |
| చింతా. | ఆంధ్రశబ్ద చింతామణి | నన్నయ |
| ఛం.ద. | ఛందోదర్పణము | అనంతామాత్యుడు |
| తత్త్వ. | తత్వబోధినీవ్యాఖ్య<br>(ప్రౌఢ వ్యాకరణమునకు) | వేంకట నరసింహ భాష్య<br>కారాచార్యులు, శ్రీ భాష్యం<br>తొలిముద్రణం 1968 |
| త.చం. | తత్సమ చంద్రిక | సూర్యనారాయణ శాస్త్రి<br>సన్నిధానం, మూడవ ముద్రణం |
| తె.వ్యా వి. | తెనుఁగు వ్యాకరణ వికాసము<br>రెండు సంపుటాలు | డాక్టర్ పురుషోత్తం<br>బొడ్డుపల్లి |
| ప.పం. | పట్టాభిరామ పండితీయము | పట్టాభిరామ శాస్త్రి, వేదం<br>వావిళ్ళవారి ప్రచురణ 1951 |
| ప్ర.వ్యా. | ప్రశ్నోత్తర వ్యాకరణము | సీతారామశాస్త్రి, పుదూరి<br>వావిళ్ళవారి ప్రచురణ 1951 |
| ప్రౌ.వ్యా. | ప్రౌఢవ్యాకరణము<br>(త్రిలిఙ్గ లక్షణ శేషము) | సీతారామాచార్యులు<br>బహుజనపల్లి |
| బా.వ్యా. | బాలవ్యాకరణము | చిన్నయసూరి, పరవస్తు |
| బా.వ్యా.ఉ. | బాలవ్యాకరణోద్యోతము | చినసీతారామ శాస్త్రి, వఝ్ఝల |
| మ.ఆం.కౌ. | ఆంధ్రకౌముది (మండవారిది) | మండ లక్ష్మీనరసింహాచార్యులు |
| మ.ప.వ్యా. | పద్యాంధ్ర వ్యాకరణము | మలికార్జునశాస్త్రి మల్లంపల్లి |

| సంజ్ఞ | గ్రంథ నామము | గ్రంథకర్త : ఇతర వివరములు |
|---|---|---|
| రంగ. | ఆనంద రంగరాట్ ఛందము | రంగయకవి, కస్తూరి 1922 ముద్రణము |
| రమణీ. | రమణీయము (బాలవ్యాకరణ సమీక్ష) | వేంకటరమణశాస్త్రి దువ్వూరి 1964 |
| ల.వ్యా. | లఘువ్యాకరణము | వేంకటరమణశాస్త్రి |
| వాక్య;వా.ప. | వాక్యపదీయము-భర్తృహరి | వేదము : 1961 |
| వై.చం. | వైకృత చంద్రిక | మంచెళ్ళ వాసుదేవకవి |
| వై.పా. | వైయాకరణ పారిజాతము | చినసీతారామశాస్త్రి వజ్ఝల : 1957 |
| వ్యా.భా.వ్యా. | వ్యావహారిక భాషా వ్యాకరణము | డాక్టర్ గోపాల కృష్ణయ్య వడ్లమూడి 1958 |
| స.సా సం. | సర్వలక్షణసార సంగ్రహము | తిమ్మకవి, కూచిమంచి ఏలూరు ముద్రణం 1927 |
| సం.వ్యా. | సంగ్రహ వ్యాకరణము | వీరేశలింగం, కందుకూరి 1916 |
| సు.వ్యా. | సులభ వ్యాకరణము | సుబ్బారావు వావిలికొలను 1968 |
| సూ.ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు | ఆంధ్రసాహిత్య పరిషత్-కాకినాడి |

-అ[1] తెలుఁగు వర్ణమాలలోని తొలివర్ణము. మృదుతాలువు స్థానము. జిహ్వా మూలము కరణము. వివృత ప్రయత్నము. మహానాదము. అల్పప్రాణము. హ్రస్వము. సంపూర్ణ వివృత విస్తారితస్వరము (Central low unround vowel)

-అ[2] కొన్ని ధాతువుల చివరచేరి విశేష్యరూపముల నేర్పరచు కృత్ప్రత్యయము.

ఉదా : ఎండు+అ=ఎండ
గీఱు+అ=గీఱ
తునియు+అ=తునియ (బా.వ్యా. కృదంత. 18)

-అ[3] అవధారణార్థకము "ఆక్షణంబ తనకు శుక్లపాతంబైన"
[భార. 1. V. 595] [< సూ.ని]

-అ[4] వ్యతిరేకార్థక ప్రత్యయము పరమగునపుడు ధాతువుల తుది ఉకారమునకు ఆదేశముగా వచ్చును.

చేయు+(అ)+ఁడు=చేయఁడు
చేయు+(అ)+క=చేయక
చేయు+(అ)+మి=చేయమి
చేయు+(అ)+ని=చేయని మొదలైనవి (సూ. ని.)

-అ[5] యుష్మదస్మ ద్విశేషణముల తుది ఉకారమునకు క్రమముగా 'వు, రు, ను, ము' లు పరమగునపుడు ఆదేశముగా వచ్చును.

ఉదా : నీవు ధన్యుఁడు+(అ)+వు=ధన్యుఁడవు
మీరు ధన్యులు+(అ)+రు=ధన్యులరు
నేను ధన్యుఁడ+(అ)+ను=ధన్యుఁడను
మేము ధన్యులు+(అ)+ము=ధన్యులము
(బా. వ్యా. కారక. 34)

-అ[6] సంబోధన ప్రథమా విభక్త్యేక వచన ప్రత్యయమందలి ఉకారమునకాదేశముగా వచ్చును.

ఉదా : ఓ రాముఁడ !
ఓ గురువ !
ఓ వృక్షమ !! (బా. వ్యా. తత్సమ. 32)

-అ[7] ఉద్దేశాద్యర్థకమగు "ను" వర్ణకము పరమగునపుడు క్రియల తుది ఉకారమునకు ఆదేశముగా వచ్చును.

(౧) ఉద్దేశార్థకము

క॥.........కులము నిలుపఁగా సత్యవతీదేవి వచనమున సంతతి గావించెను వ్యాసుఁడు (భార. 1. v. 8)

(౨) భావార్థకము

ఆ॥ తమయతాల్చి యుండఁజనదు. (భార. 3. I. 217)

(౩) అనంతర్యార్థకము

నియతిఁదలంప సన్నిధిసేసె (భార. 12. V. 347)

(౪) హేత్వర్థకము

.........దుర్యోధనుండు దుష్కార్యమెత్తి దుర్నయమున శకుని కర్ణ దుశ్శాసనుల్ గలపఁబాండవులకు నలయచేయఁగడగె.

(భార. 1. III. 12. సూ. ని)

-అ[8] స్వయముగా అను నర్థమును—పరాపేక్షలేమిని తెల్పును.
"ఇమ్మగ సర్వధర్మములు నీవు యెఱుంగుదు"

(కళా. IV. 126) (సూ. ని.)

-అ[9] వ్యతిరేకార్థక క్రియలకనుప్రయక్తమై 'బొత్తిగా' "ఎంతమాత్రము" అనెడి యర్థము నొసఁగును.

"పెక్కు భంగులఁ బురికొల్ప నెవ్వరును గోల్తల సేతుర యేమిసెప్పుదున్"

(భార. 7. II. 59) (సూ. ని.)

-అ[10] మధ్యమపురుష "ము,ఁడు" లకు ప్రార్థనార్థమందు వికల్పముగా ననుప్రయుక్తమగును.

"కనుఁగొండ యితనిధైర్యము పెనుఁగొండగు" (పాండు. I. 58) (సూ. ని.)

-ఆ[11] (౧) కాకు స్వరముచే ప్రశ్నయై వ్యతిరేకార్థమును దెల్పును.
"నాయాస నిరాకరింపఁదగవా? మగవాఁడవు కావ? యర్జునా?

(హర. VII. 129)

(౨) ఆక్షేప గర్భిత ప్రశ్నమును దెల్పును. "అంతట మూర్ఛఁదేటి పులియా? యెలుఁగా? యెనుపోతః సింగమా? కాంతుము" (కకు. IV. 106)

-అ[12] అర్థవిశేషములేకయే యొకానొకచో ననుప్రయుక్తము. ఇట్టివానిని "అర్థశూన్యపదాంశములు" (empty morphs) అందురు.

"అదిసభయే? ప్రియంబెసగ నార్యులు నిల్వరయేని యార్యులే?
(భార. 5. II. 70) (సూ. ని.)

-అ[13] మతుబర్థమందు వచ్చు తద్ధిత ప్రత్యయము. అడపము – అడప (తాంబూలకరండవాహి) (బా. వ్యా. తద్ధిత. 28)

-అ[14] హలాదియగు సంస్కృత సమశబ్దములకు పూర్వాగమముగా వచ్చు వ్యతిరేకార్థక మగు నవ్యయము. ఇది అజాది సంస్కృత సమశబ్దములకు పూర్వాగమముగా వచ్చునపుడు "అన్" అగును.

అబ్రాహ్మణుఁడు, అ కాలము, అనపత్యము, అనారోగ్యము, (సూ. ని )

-అ[15] ఔప విభక్తికములగు పదముల తృతీయా సప్తమీ విభక్తుల కాదేశముగా వచ్చును.
గోర్టను గీఱను (గోటితో అని యర్థము),
ఊర్టనున్నాఁడు (ఊరియందు) (బా. వ్యా. ఆచ్ఛిక. 38)

**అ ? ఆలు**

అచ్చులని వ్యవహారము. 'వానికి అ ? ఆలు వచ్చినవి' 'కఖాలు నేర్చుకొనుచున్నాడు.' ఇందలి తొలి అకారము.

గురూచ్చారణము కలది. హ్రస్వము వెంటనే దీర్ఘము నుచ్చరించునపుడు మధ్యగల విరామమును ఆధునికులు 'glottal stop' అందురు.

అ? ఆ లై ఔలకుమఱి
ఇ?ఈ................
ఉ?ఊ................
ఒ?ఓ లకు వళ్లగున్నయోన్నతచరితా!
(కవిజనాశ్రయము. I.63)

**అంగలాదులు**

'అంగల' మున్నగు శబ్దములు.

సంస్కృత ధాతువులగు 'అంగల' మున్నగు వానికి 'ఇంచు'గాగమును జేర్చుటచే క్రియారూపము లేర్పడును.

పచించు, వచించు, త్యజించు మున్నగు సంస్కృత సమక్రియారూపము లేర్పడి నట్లే, అంగలించు, అడకించు, ఆవులించు, వంటి దేశ్యక్రియలు కూడ నేర్పడును.

"సంస్కృతంబున కంగలాదుల కించుకగు"
అని—(బా.వ్యా. క్రియా. 63)

అంగలాదులాకృతి గణము. "అంగల, అడక, ఆరగ, ఆవుల, ఉంక, ఉగ్గడ, ఓసర, కార, గాల, జాడ, తిలక, తులక, పంక, పరిక, పలవ, అప్ప, ఒప్ప, ఆల, ఇత్యాదు లీ గణములోనివి.

**అఙ్గాదులు**

'అఙ్గ' మున్నగు శబ్దములు. వీనికి ఙీప్రత్యయము చేరును. కోమలాఙ్గీ, సుగాత్రీ ఇత్యాదులు.

అఙ్గ, గాత్ర, కణ్ఠ, ఓష్ఠ, జఙ్ఘా, దన్త, కర్ణ, శృఙ్గ, పక్ష, ప్రచ్ఛ, అక్షి, సన్ధి,- ఇవి మాత్రమే అఙ్గాదులు. నియతగణము. (రమణీ. పుట. 296)

**అంగిరుఁడు**

సకారాంత మహద్వాచకము. దీని సకారమునకు లోపముకల్గి ఉత్వ, డుఙ్‌లు చేరగా 'అంగిరుఁడ'ను రూపమేర్పడును. లేదా దీని ద్వితీయైక వచనాంతతుల్య రూపమును ప్రాతిపదికగా గ్రహించి, మకారమును లోపింపఁజేసి, ఉత్వడుఙ్‌లు చేర్చినచో 'అంగిరసుఁడ'ను రూపమేర్పడును. (బా. వ్యా. తత్సమ. 81)

**అంజ్వాదులు**

'అంజు' మున్నగు శబ్దములు. వీనికి 'ఇక' వర్ణకము చేరి విశేష్య రూపములేర్పడుచున్నవి.

అంజు...అంజిక, అమరు...అమరిక, అరయు...అరయిక.

ఇది ఆకృతి గణము. "అంజు, అమరు, అరయు, అలయు, ఆడు, ఓడు, ఓపు, కను, కూడు, కోరు, పొందు, పోలు, తూను" ఇత్యాదులంజ్వాదులు.

"ఇక వర్ణకంబంజ్వాదులకగు" (బా. వ్యా. కృదంత. 12)

**అంత** : మానవాచక శబ్దము కంటె పరముగ వికల్పముగ వచ్చు శబ్దము.

ఉదా :- చేటంత సొమ్ము, చేటెడు సొమ్ము మొ॥ (అథ. కా. అజన్త. 55)

**అంతభేదము**

పదముయొక్క అంతమునందున్న ప్రత్యయమునుబట్టి లింగభేదమును గుర్తించుట.

ఒయారి = ఒయారముగల స్త్రీ. (మహతీ వాచకము)

ఒయారము - ఒకరు - ఒకర్తు మున్నగునవి. (తె. వ్యా. వి. 595. పుట)

**అంతవిధులు** - సమాసముల యంతమందు వచ్చు వ్యాకరణ కార్యములు.

చూ - సమాసాంత విధులు. (చింతా. హలన్త. 44)

**అంతరంగము**

సంస్కృతమునందు మిక్కిలి సాంకేతికమైన పదము. అల్పనిమిత్తకము. అంతరంగ సూత్రము అధికనిమిత్తకము. బహిరంగ సూత్రము."అంతః అంగాని నిమిత్తాని యస్య" అని బహువ్రీహి సమాసముగా దీనిని చెప్పుదురు. అంతరంగ సూత్రము బహిరంగము కంటె ముందు ప్రవర్తిల్లును. పూర్వము కంటె పరమును, పరము కంటె నిత్యమును, నిత్యము

కంటె అంతరంగమును, అంతరంగము కంటె అపవాదమును ప్రబలములని "పరనిత్యాన్తర జ్ఞాపవాదానామ్ ఉత్తరోత్తరంబలీయః" అను పరిభాషబట్టి తెలియును. దీనిని చిన్నయసూరి యొకచో నిహితమొనర్చెను.

జి+ఇంచు - అనగానే అంతరంగసూత్రము ప్రవర్తిల్లును. అప్పుడు 'అయున్' చేరగా 'జయ్' అగును. అప్పుడది యాంతమగును. కాగా 'ఇయట్, అనునది ఇంచునకు రాదు. 'జయించు' అను రూపమే ఏర్పడును. చూ...(బా. వ్యా. క్రియా. 50 సూ) (రమణీ. 406 పుట)

**అంతర్ధి**

మఱుఁగుట

ఎద్దాన నీ 'యంతర్ధి' యగునో దానికి 'వలన' వర్ణకము వచ్చును.

కృష్ణుడు తల్లి వలన దాఁగె. (బా.వ్యా. కారక. 9)

**అంతర్భావిత ప్రేరణార్థకములు**

లోపల భావింపఁబడిన, లేక నడుమ జొనుపఁబడిన ప్రేరణార్థము గలవి. 'కరఁగు తలఁగు, మెఱయు' మున్నగు క్రియలు కొన్ని ఇంచుగాదులు చేరకయే, స్వార్థకములే కాక, ప్రేరణార్థకములు గూడనగుచున్నవి·

ప్రయోగములకు చూడుడు- శ.ర. (ప్రౌ.వ్యా. క్రియా. 36)

"కుసుమబాణుని బాణముల్ గూడ, నైదుగరఁగి నేరిమి వాటించి"

(బాణము కరఁగునట్లు చేసి యని ప్రేరణార్థము.)

(భార. 4. II. 27,)

అంతస్థములు:- య,ర,ల,వ యను నాలుగు వర్ణములు."య ర ల వా అంతస్థాః" అని సి.కౌ. (సంజ్ఞా.) ఇవి ఈషత్–స్పృష్ట ప్రయత్నము గలవి. ("ఈషత్-స్పృష్ట మంతస్థానామ్"—సి.కౌ. సంజ్ఞా.) వర్ణసమామ్నాయముననివి స్పర్శముల కును, ఊష్మములకును మధ్య చెప్పఁబడుటచే వీనికి అంతస్థములను సంజ్ఞ సార్థకము. వీనిలో స్వరధర్మముండుటచే ఆంగ్లవ్యాకరణమున వీనిని Semi-vowels అని అందురు. ఇవి ఉచ్చారణమును బట్టి లఘువులు, అలఘువులు అని రెండువిధములు. (చింతా. సంజ్ఞా. 19)

అంతస్థలు:- య,ర,ల,వ యను నాలుగు వర్ణములు.

చూ:- అంతస్థములు.

**అంతస్సంధి**

లోపల గల్గుసంధి. స్వతంత్రములగు రెండు పదములకు గల్గుసంధి బాహ్యసంధి (external Sandhi) (చూ.) కాగా— దానికి భిన్నమైనదీసంధి. అనగా రెండు పదము

లకు గాని; పదమునకు అ పదమునకు గాని; ప్రకృతి ప్రత్యయములకు గాని, సంధిగల్గుట. ఇట్టి సంధివలన ఏక పదమేర్పడును. తెలుగు వ్యాకర్తలిట్టి సంధిని వేఱుగా నిరూపింప లేదు. కర్ణాటవ్యాకర్తలు పేర్కొనిరి.

మాన+ఎడు—మానెడు
వజ్రము +లు—వజ్రాలు. మొ॥
తె.వ్యా.వి. 549 పుట

**అంతాగమము**

శబ్దము యొక్క అంతమందు అదనముగా జేరెడి వర్ణము.

నీవు ధన్యుడ**వు**
నేను ధన్యుడ**ను**
మీరు ధన్యులరు
మేము ధన్యుల**ము**

వునులు, రుములు అంతాగమంబులు.

అఱు— అఱితి

(బా.వ్యా.కారక.34, ఆచ్ఛిక.34)

**అందదుకులు**

మిక్కిలి అదుకులు కలది అందదుకు. అందదుకు మున్నగుపదములుఅందదుకులు. ఇది ఆకృతిగణము.

అదుకు+అదుకు=అందదుకు. ఇది నిపాత (చూ.) రూపము. ప్రక్రియచే నిరూపితముకానిది. ఇట్టివే 'ఇఱ్ఱింకులు, ఇల్లిగ్గులు, తుత్తుమురు, తుత్తునియలు, మిఱుముట్లు మున్నగునవి.

(బా. వ్యా. సంధి. 42)

**అందఱ్వాదులు**

అందఱు, ఇందఱు, ఎందఱు, కొందఱు, పెక్కండ్రు, పలుగుండ్రు,—ఇవి నిత్యబహువచనాంతములు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 35)

**అందు**[1]

స్థలనిర్దేశకము. "ఇందుగల డందులేడని సందేహమువలదు."

**—అందు**[2]

సప్తమీ విభక్తి. రామునందు, భూమియందు, రాములందు

(చింతా. అజంత. 7) (బా. వ్యా. తత్సమ. 7)

**అంద్వవగాగమములు**

అందు+అవ (క)+ఆగమములు.

ఇవి చేరునపుడు సంధి యథాసంభవముగా గ్రహింపవలయును.

'అందు' పరమగునపుడు సంధి కొన్నియెడల వికల్పము—రాములందు, రాముల యందు. కొన్నియెడల సంధిరాదు—హరియందు.

'అవ' (క్) కిత్తు. ఇది పూరణార్థక ప్రత్యయము. ఇది చేరునపుడు సంధి వైకల్పికము.

ఎనిమిదవ, ఎనిమిదియవ. (బా. వ్యా. సంధి. 11)

**అంద్వాదులు** : (అందు+ఆదులు) అందు, ఇందు, ఎందు, అట, ఇట, ఎట మున్నగు శబ్దములు. వీనికి కొన్నిచోట్ల ప్రాతిపదికత్వము కలుగును. అనఁగా వీనిపై విభక్తి ప్రత్యయములు వచ్చును. ఉదా :— ఇందుకొఱకు, ఎందువలన, అటకు, ఇటకు, ఎటకు మొ॥ (అథ. కారి. అజన్త. 85)

**ఆంధ్రభాష**

చూ. ఆంధ్రభాష (కా. చూ. IX. 8)

**అంబు ప్రత్యయాంత నామము**

'—అంబు' అను ప్రత్యయము కడపటగల విశేష్యము లేక విశేషణము.

పుస్తకంబు, సింగంబు
సరసంబు, మున్నగునవి.

పుస్తకమ్బు—పుస్తకమ్మ (సమీకరణము) —పుస్తకము అనురీతిని వీని పరిణామ ముండునని చారిత్రక దృష్టితో కొన్ని ఆధునిక వ్యాకరణములు నిరూపించినవి. (ఆం. శ. త. II.సంధి. పుట. 55)

**అంశి సమాసము**

అంశము గలది అంశి—అనగా అవయవి. సమాసమునందలి అట్టి అవయవి వాచకముతో పూర్వ, అపర, ఉత్తరవంటి శబ్దములు సమసించును. అవయవి వాచక మేకవచనము నందుండును.

చూ. ఏక దేశిసమాసము.

దీనికే అవయవి సమాసమనియు నందురు.

పూర్వం కాయస్య—పూర్వకాయః

పూర్వకాయము, అపరకాయము, మధ్యాహ్నము, సాయాహ్నము మొదలగునవి. (అం. భా. శా. సమా. 47)

**అకథిత కర్మము**

చెప్పబడని కర్మము. వివక్షితము గాని కర్మము. దీనికే అముఖ్య కర్మమనియు వ్యవహారము. కొన్ని ధాతువులకు రెండు కర్మములుండును.

1. ముఖ్యకర్మ 2. అముఖ్యకర్మ

2 1

ఉదా : దేవదత్తుడు యజ్ఞదత్తుని గొంగళి నడిగెను.

గొంగళి—ముఖ్యకర్మ, ధాతువుచే చెప్పబడునది.

—అముఖ్యకర్మ ఇది ముఖ్యకర్మకు సంబంధించినది. ధాతువుచే చెప్పబడనిది. (ఆం. కే. 437,38, పంక్తులు)

**అక్[1]:** తుమున్ప్రత్యయార్థమున ధాతువునకు వచ్చుఆగమము. ఇందలి కకార మిత్సంజ్ఞకమై లోపింపఁగా 'అ' మిగులును. ఉదా; కన (కను+అ) వచ్చెన్. విన (విను+అ) వచ్చెన్ మొ॥ (మం. ఆం. కౌ. క్రియా. 424)

**అక్ 2:** సంబోధనార్థమున వచ్చు ప్రథమావిభక్తికి ఏకవచనమునఁజేరు ప్రత్యయము. ఇందలి కకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'అ' మిగులును. కిత్తగుటచేనిది ప్రథమా విభక్తికి అంతావయవముగా వచ్చును. ఉదా: రాముఁడ (రాముఁడు+అ) మొ॥ (వై. చం అజన్త 8) దీనినే చింతా. కర్త అదాగమమని వచించెను. చూ : అదాగమము.

**'అక' ప్రత్యయాంతావ్యయము**

—'అక' అను వ్యతిరేకార్థమునిచ్చు ప్రత్యయము. ధాతువునకు చేరగా నేర్పడు రూపము అవ్యయమగును. ఇది ద్రుతప్రకృతికముకాదు. కళయే.

అను+అక—అనక

కొట్టు+అక—కొట్టక

తిను+అక—తినక

సంస్కృత వ్యాకరణానుసారముగా ఈ ప్రత్యయమునకు 'కజీ' అనివ్యవహారము. జీత్ చేర్చుటచే ధాతువులో ఉత్వమున్న అది అత్వమగును. దీనినే 'వ్యతిరేక క్త్వార్థ'మందురు. (చూ).

కొట్టు+క (జీ)—కొట్టక

పో+క (జీ)—పోక

తొలి నిరూపణము ననుసరించి ఉదంతములోగాని 'లేక' 'పోక' యిత్యాదులందు అకారాభావము సమర్థనీయముఁకాదు. మఱిదానిలో అట్టి క్లిష్టతలేదు. బా. వ్యా. ఇటి

సంప్రదాయము ననుసరింపగా ప్రౌ. వ్యా దీనికి భిన్నపద్ధతి ననుసరించినది.
(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 8)

**అకర్మక కర్తరి ప్రయోగము**

అకర్మక క్రియచేఁగర్త చెప్పబడిన ప్రయోగము. చూ. అకర్మకము. రాముఁడ డవుల కేగెను. (ప్రౌ. వ్యా. వాక్య. 3.)

**అకర్మకము**

కర్మను గూర్చిన ఆ కాంక్షను గల్గింపని క్రియాపదము. క్రియావ్యాపారము, క్రియా ఫలము కర్తయందే నిష్ఠమొనర్చు క్రియ అకర్మక మనబడును.

"ఫలవ్యాపార యోరేక నిష్ఠతాయామకర్మకః (వాక్య. పద)

"కర్మలేనిది యకర్మకము" (ల.వ్యా. 68)

"అకర్మంబునాఁ గర్మాకాంక్షాను త్థాపకంబు" (బా. వ్యా. క్రియా. 48)

కర్మమును గోరనివి యకర్మకములు. పిల్లవాఁడు పరిగెత్తుచున్నాఁడు
(సం.వ్యా. క్రియా. 6)

**'అక' వర్ణకము**

అక అను కృత్ప్రత్యయము. ఇది మాఱ్చాదులకగును.

మాఱు-మాఱకము

అమ్మ-అమ్మకము

అంపు-అంపకము మున్నగునవి. (బా.వ్యా. కృత్. 19)

**అకాన్**

'అ' అను నవధారణార్థకము మీఁద "కాన్" అను "అగు" ధాతువుయొక్క అన్నంత రూపము ప్రయుక్తమయ్యేనేని రెండును గలసి 'ఇతి' అనుశబ్దార్థము (అని) గలదగునని భావము.

అపజయము+అ+కాన్=అపజయమకాన్ అపజయమని లక్షించి అని అర్థము.
(ప్రౌ. వ్యా. క్రియా. 33)

**అకారవికల్పసంధి**

అకారమునకు సంధి యొకమారు గల్గును: యొకమారు కల్గక పోవును.

ఉదా:- "తామరసనేత్రలిండ్ల బందాలుగారె"

నేత్రల+ఇండ్లన్—నేత్రలిండ్లన్=నేత్రల యిండ్లన్

(స. సా. సం. సంధి. 12)

**అకారసంధి**

అకారమునకు అకారము పరమైన దీర్ఘ మేకాదేశమగును.

అ+అ=ఆ : దేవ+అగారము=దేవాగారము

అ+ఆ=ఆ : దేవ+ఆలయము=దేవాలయము

ఆ+అ=ఆ : లతా+అంతము=లతాంతము

ఆ+ఆ=ఆ : మహా+ఆనందము=మహానందము. (తత్స: 2)

**అకారాదులు**

అకారము మొదలైనవి. అకారముమొదలు విసర్గ వరకు గల వర్ణములకు అచ్చు లని వ్యవహారము. (బా. వ్యా. సంజ్ఞా. 1.)

**అకారాదేశసంధి**

అలుక్సమాసమునందు విభక్త్యంతమయిన అకారమునకు ఇకారమాదేశముగా వచ్చును.

నీచేత+ఇ=నీచేతిపోరు

నాతోడ+ఇ=నాతోడి చెలిమి

నావలన+ఇ=నావలనినేరమి (ప్ర. వ్యా. 95,96)

**అకృత్రిమము**

కల్పితము కానిది. సహజమైనది. సాంకేతికము కానిదని యర్థము. వ్యాకరణని యమాదులచేఁగాక యాదృచ్ఛికముగా నేర్పడినది. వ్యాకరణకార్యము ఎట్లు జరిగినదను సందేహము కృత్రిమమా! (సాంకేతికమా?) అకృత్రిమమా? (సహజమా?).అకృత్రిమముగా జరిగిన దానికన్నా కృత్రిమముగా జరిగినదానికే శాస్త్రమునందు పరిగణన ఎక్కువ.

"కృత్రిమాకృత్రిమయోః కృత్రిమే కార్య సంప్రత్యయః" (శేఖ: 9)

**-అక్క**

భీమక్క, లచ్చక్క, చూ. "ఆర్యాంబాద్యర్థక శబ్దములు (i)

(ప్రౌ. వ్యా. సంధి. 1.) (సు. వ్యా. 11 3)

**అక్కటాదులు**

'అక్కట' మొదలగు శబ్దములు. వీనిలోని ద్విత్వమునకులోపమువిభాషగా కల్గును. ఇది ఆకృతి గణము.

అక్కట—అకట

అయ్యారె—అయారె

కమ్మతము—కమతము (బా. వ్యా. ప్ర. 8)

**అక్కడాదులు**

'అక్కడ' మున్నగు పదములు. ఇవి నిత్యైక వచనాంతములు.

అక్కడ, ఇక్కడ, ఎక్కడ, అచ్చట, ఇచ్చట, ఎచ్చట మున్నగునవి.

**అక్కరము**

చూ. అక్షరము (ఛం. ద. IV. 129)

**అక్షరము**

వర్ణము, అక్షరము, మాతృక, వ్రాయి అనునవి పర్యాయపదములు. అ, ఇ, ఉ మున్నగు స్వరములనేకాక, క, కి, కు మున్నగు స్వరవ్యంజనసంయోగము గలవానికిని అక్షరమని వ్యవహారము. 'బహువచనంబు పరంబగునపుడు 'ఆవు' ప్రభృతుల తుది యక్షరంబునకు లోపంబు విభాషనగు"

ఆవు+లు—ఆలు, ఆవులు (బా. వ్యా. ఆచ్చి. 22)

**అక్షరసమామ్నాయము**[1]

వర్ణమాల. ఇందు అకారాదులైన యచ్చులు; కకారాదులైన స్పర్శవర్ణములు; య, ర, ల, వ, లను అంతస్థులు; శ, ష, స, హ, లను ఊష్మములు ఉండును.

అక్షరరూపమగు వేదమగుటవలన "అక్షర సమామ్నాయము" అని యందురు.

(కే. శ. సంజ్ఞా. పుట. 5)

**అక్షరసమామ్నాయము**[2]

అక్షరసమామ్నాయమును గూర్చి రచింపడిన లఘు గ్రంథము.

పుటలు. 51. (క్రౌన్)

రచయిత : 'వ్యాకరణ విద్యాప్రవీణ' బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు.

**అఖండము**

ఖండము కానిది. అనగా పూర్ణము. ఖండముకానిదనగా ఖండరహితమనియు అర్థము చెప్పవచ్చును

తెనుంగున ఖండ బిందువనగా అర్ధానుస్వారము. అఖండబిందువనగా పూర్ణానుస్వారము. ఇట్లున్నను అప్పకవి 'ఖండాఖండప్రాస' మనుటలో ఖండబిందుయుత పదములకు ఖండబిందురహిత పదములకు ప్రాసనియమమును పేర్కొనెను.

'ఆ పన్నగముఖ్యుల వీఁపున బెట్టుకొని' (అప్ప : III. 302)

అఖు :- మొదటివర్ణము కానిది. (చూ:- ఖు) - (వై. చం. పే. 105)

**అగతికములు**

గతి సంజ్ఞాకములు కానివి. ప్ర, పరా, అప, మున్నగు ఇరువదిరెండు ఉపసర్గ

ములు. ఉపసర్గములు 'సాక్షాత్' మున్నగు శబ్దములు గతి సంజ్ఞాకములు (చూ.). ఇట్టివానితో కూడని 'భూ, సృ, కృ, రేకృ, లోకృ, లోచ, పచి, లప,' మున్నగు గతివిరహితములైన కేవలధాతువులకు 'అగతికము' అని సంజ్ఞ. ఇట్టివానికి తెలుఁగుభాషలో ప్రయోగములేదు. ఉపసర్గాదులతో కూడి యేయవి తెలుఁగున ప్రయోగింపడును.

ఉదా :- ప్రభవించు, సంస్కరించు, సాక్షాత్కరించు, మొదలైనవి.

(బా. వ్యా. క్రియా. 121)

**అగస్త్యమహాముని**

దేశభాషలకు అపభ్రంశభాషలను అపప్రథకలదు. అట్టి అపప్రథతొలగించుటకు అగస్త్యమహాముని గొప్పగా తపస్సుగావించి ద్రావిడభాషకు వ్యాకరణమును రచించెనను ఖ్యాతి కలదు. అనార్యముగా పరిగణింపబడు భాష వ్యాకరణ సంస్కారమువలన ఆర్య జనాదరణమున కర్హమగునని ప్రాచీనుల నమ్మకము. (తె. వ్యా. వి. 135)

**-అగు**

సంఖ్యావాచకమునకు పూరణార్థమునందు వచ్చును.

ఏడగు పర్వము

చూ. అవగాగమము

(ప్రౌ. వ్యా. శబ్ద. 103) (సు. వ్యా. అచ్చిక 58)

**అగ్గలాదులు**

అగ్గల మున్నగు శబ్దములకు భావార్థమునందు —'ఇక' అనుప్రత్యయము చేరును

అగ్గల+ఇక—అగ్గలిక

ఒమ్మ+ఇక—ఒమ్మిక

ఇది ఆకృతి గణము. (బా. వ్యా. తద్ధిత. 7)

**అగ్వాదులు**

అగు+ఆదులు— అగ్వాదులు. అగు, నెగయు, పోవు, చొచ్చు, పుచ్చు, తోఁచు, నడచు, పఱచు, మొలచు, వీచు, ఇత్యాదులు.

వీనికి "తెంచు" అను ధాతువు అనుప్రయుక్తమగును. అగుచో ఉత్వముపైని దాని తకారము దకారమగును.

అగుదెంచు, నెగయుదెంచు, పోవుదెంచు, చొత్తెంచు, పుత్తెంచు, ఇత్యాదులు.

(బా. వ్యా. క్రియా. 110)

**అగ్రామ్యము**

గ్రామ్యము కానిది అగ్రామ్యము. లక్షణ విరుద్ధము గ్రామ్యము. కాన లక్షణ సమ్మతము, లేక లక్షణవంతమగు శబ్దముగాని, కావ్యముగాని అగ్రామ్యమనఁదగును.

'ప్రాణగొడ్డము'ను బా. వ్యా. గ్రామ్యమనగా ప్రౌ. వ్యా. అగ్రామ్యమని 'ప్రాణ కుట్టక' శబ్దభవమని పేర్కొన్నది. (ప్రౌ. వ్యా. సంజ్ఞా. 12) (అప్ప. I. 121)

**అఘోషము**

ఘోషమనగా నాదవంతము. అఘోషమనగా నాదరహితము. అనగాశ్వాసము. బాహ్యప్రయత్న భేదములలో నొకటి. వర్గ, ప్రథమ, ద్వితీయ వర్ణములు, శ, ష, స, హ,లు అఘోషప్రయత్నముగల వర్ణములు. (అం. భా. వి. పుట. 279)

**అచలాపాదానము**

చలింపని, అనగాకదలని **అపాదానము**. చలింపనివాని కపాదానమును జెప్పి నచో అది 'అచలాపాదానము'అగును.

ఉదా:- యజ్ఞదత్తు డూరనుండి చనుదెంచుచున్నాడు.

(అం. కౌ. 463—64 పంక్తులు)

**అచేతనములు**

ప్రాణములేనట్టి వానిని దెల్పుపదములు. చేతనవాచకములకు, అచేతనవాచకము లకు భిన్నములగు వ్యాకరణ కార్యములు కల్గును గాన చేతనాచేతన వివక్ష అవసరము.

i. అచేతన ప్రథమకు గ స డ ద వా దేశము వికల్పముగా వచ్చును.

ఉదా:- నీ**వ**నుదోయి

వయః**శ్రీ**వన

పుష్పదామకంబు చెలికిదాపె.

(అం. కౌ. 836-39 పంక్తులు)

ii. తృతీయాంతములుగా వలసిన అచేతనములకు నకారమేకవచనమునందు రావ చ్చును. "అను పలుకంకుశంబున క్రియం గుదియించిన"

(స. సా. సం. విభక్తి. 75)

**అచేతన వాంతములు**

నకారమందుగల ప్రాణము లేనట్టివానిని దెలుపు వాచకములు. ఇట్టిసంస్కృత శబ్దములను తెలుఁగునకు చేర్చుకొనునప్పుడు వానికి 'ము' గాని 'వు' గాని చేరును.

ఉదా:- కర్మము—కర్మవు. (అం. కౌ. 191)

**అచేతన వాచకములు.**

ప్రాణము లేని వస్తువులను దెల్పుపదములు. ఇట్టిపదములు ద్వితీయావిభక్తిలో నుండవలసినవి. ఒకచో ప్రథమావిభక్తిలో నుండవచ్చును.

ఉదా:- బలుఁడు **సొమ్ములు** దాల్చె

చెలులు **కోకలు** గట్టిరి. (అం. కౌ. 303, 304)

అచ్చతుష్కము: (అచ్+చతుష్కము) అ, ఇ, ఏ, ఓ, అను నీ నాలుగచ్చులు. హల్లు మీదనుండు ఈ నాలుగచ్చులు ప్రశ్న, సప్రార్థన, సందేహార్థములను తెలుపును. వీనిలో అకార, ఇకారములు దీర్ఘములై ఏ కార, ఓకారములు హ్రస్వదీర్ఘములై ప్రశ్నాద్యర్థములను సూచించును.

ఉదా : ఇతఁడా మముఁగాచునట్టి యిలవేల్పు చెలీ! (ఆ—ప్రశ్నార్థకము)
ఏమేమీ జగతింగ ఠోరములు (ఈ—ఆశ్చర్యార్థకము)
రాజమాత్రుండె రాముఁడు రాజవదన (ఎ—కాక్వర్థకము)
రావే మము గావవేగ రఘుకులతిలకా (ఏ—ప్రార్థనార్థకము)
ఇంద్రుఁడొ చంద్రుఁడొ యటంచునేని క్షింపన్ (ఒ—ప్రశ్నార్థకము)
చంద్రుండో, ఇంద్రుండో రక్షింపవో (ఓ—ప్రార్థనార్థకము.)
(అధ. కా. అజన్త. 77)

**అచ్చ తెనుఁగు**

స్వచ్ఛము, నిర్మలమునగు తెనుఁగు అని శబ్దార్థము. ఇతర భాషాపదములు చేరని దేశితెనుఁగు లేక దేశ్యమునకు తొలుత నిట్టి వ్యవహార మేర్పడియుండును. ఇవి యెల్లవారికి సుబోధముగానుండును.

(ఆం. భా. భూ. 23)
(ఛం. ద. IV. 105)
(స. సా. సం. I. 64)

2. అన్యభాషాశబ్దములు ఏ భాషలోనైనను ప్రవేశించక తప్పదు. అట్టిచో దేశ్యశబ్దాకృతికి భిన్నముగా కాక, అట్టి ఆకృతిగల సంస్కృత సమేతరమగు శబ్దజాతము 'అచ్చతెనుఁగుగనే పరిగణింపఁబడెను.

(అప్ప. I. 110)
(ఆం. భా. భూ. 27)
(ఆచ్చిక. 1. బా. వ్యా.)

3. "తత్సమ, దేశ్య, తద్భవములఁగలయని తేటనుడుగు లచ్చతెనుఁగనఁ దగునను" అభిప్రాయమొకటికలదు. 'దేశ్య'మననిట అన్యదేశ్యముకావలయును(?). ఇది అప్రసిద్ధము. (ఆం. కా. 48-51)

**అచ్చ దేశ్యము**

తెలుగుదేశపు మాటలు;
అన్య దేశ్యములుకానివి.
ఇల్లు, విల్లు, మొదలగునవి. (గు. వ్యా. 82. అంశము)

**అచ్చులు**

1. అ ఇ ఉణ్ 2 ఋ ౡ క్ 3. ఏ ఓ ఙ్ 4. ఐ ఔ చ్. అను నాల్గు మాహేశ్వర సూత్రములలో అకారము మొదలు చ్ వరకు గలవానికి అచ్చులని ప్రత్యాహార సంజ్ఞ. కాని తెనుగు వ్యాకర్తలు ఈ రీతిని నిరూపింపవలసిన అవసరములేని కారణముగా

"అదులు స్వరములు అచ్చులు"— (ఆం. భా. భూ. 16)

" అదులు పదియాఱు నచ్చులు స్వరములు"

"అకారాదులచ్చులు" (బా. వ్యా. సంజ్ఞా. 1) (అప్ప. II. 7)

మాత్రమే నిరూపించినవి.

"ఇతర వర్ణ సహాయ్యము లేకయే పూర్ణముగా నుచ్చరింపబడునవి.

(సం. వ్యా. వర్ణ. 3,4)

**అచ్చ**

సంస్కృత సమముకాక యితరమగు ప్రాకృతసమ, సంస్కృతభవ, ప్రాకృత భవ, దేశ్యమునైన భాష.

1. ప్రాకృత సమము—సిరి, గారవము
2. సంస్కృతభవము—అసము, చందురుడు
3. ప్రాకృతభవము—లచ్చి, జన్నము
4. దేశ్యము—అన్న, అక్క, మేడ. (బా. వ్యా. ఆచ్ఛిక. 1)

**అచ్చ ద్విగువు**

అచ్చతెనుఁగు పదములతో నేర్పడిన సంఖ్యాపూర్వకకర్మధారయసమాసము. ఇట్టి ద్విగుసమాసము తఱచుగా ఏకవచనాంతమగును.

ముమ్మాఱు, ముప్పొద్దు, ముత్తోవ. (సు. వ్యా. సమా. 31)

**అచ్సంధి**

1. అచ్చునకు అచ్చు పరమగుచో మొదటిపదము తుదియచ్చు లోపించి రెండవపదము మొదటియచ్చు నిలుచుట.

రాముఁడ్+ఉ+ఇతఁడు

రాముఁడ్+ఇతఁడు

రాముఁడితఁడు (సం. వ్యా.)

2. అచ్చులకు అచ్చులుగాని, హల్లులుగాని గదిసినపుడు కల్గు ఆగమాదేశలోపాదికార్యములు.

i) రాముఁడు+ఇతఁడు—రాముఁడితఁడు (ఆదేశము)

2. ధీరు+ఆలు— ధీరురాలు (ఆగమము)

3. ఇంచుక+ఇంచుక—ఇంచించుక (లోపాదేశము)

**అజంత ప్రథమైక వచనము**

సంస్కృతమునందు అచ్చులంతమందుగల శబ్దములు, తెలుఁగున డు, ము, వు అను ప్రథమావిభక్తి ఏకవచనములతో కలిసి వ్యవహరింపఁబడునవి. (డుమువులు లేనిరూపములును గలవు).

రాముఁడు
వటువు
వృక్షము
హరి

(ఆం. కౌ. 174. 175)

**అజంతసంధి**

అచ్+అంతము=అజంతము

అజంతములగు పదములకుఁగల్గు సంధి అజంతసంధి

(వ్యతిరేకము. హలంతసంధులు. చూ.)

రాముఁడు+అతఁడు—రాముఁడతఁడు (ఆం. కౌ. పంక్తి. 67)

**అజడము**

జడముకానిది; అచేతనముకానిది. అనగా ప్రాణముకలది యని అర్థము.

i) చిన్నయసూరి జడవాచకములైన ఉదంత శబ్దముల తృతీయకు నవర్ణకమును విధింపగా, సీతారామాచార్యులు ఒకేఒక ప్రయోగమాధారముగా అజడమైన ఉదంత శబ్దముయొక్క తృతీయకును నిట్టి 'న' వర్ణకము చేరునని పేర్కొనెను.

"రాముఁడొక్క బాణమున వాలింగూలనేసె"

బాణముతో (బా. వ్యా. కారక. 23)

"ఏపునగిట్టి యేనుఁగున నేనుగువైచుచు

ఏనుగుతో (ప్రౌ. వ్యా. కారక. 17)

ii) అజడము తృతీయా సప్తములకును, కొన్నియెడల బహుత్వమునందు ద్వితీయ యగును.

స్తన చక్రవాకములనలరు (స్తన చక్రవాకములచే)

iii) అజడము ద్వితీయకును ప్రథమ కొన్నియెడల రానగును.

అమ్మదనాగ మెదిర్చి (మదనాగమునెదిర్చి)

(ప్రౌ. వ్యా. కారక. 18.19)

**అజన్య శబ్దములు**

అథర్వణుఁడు వికృతియందలి శబ్దములను జన్యములు, అజన్యములు అని రెండు విధములుగా విభజించెను. ఏ ఇతర ధాతువులనుండి కాక స్వతంత్రముగా నేర్పడిన శబ్దములను అజన్య శబ్దములందురు. వీనిని అవ్యుత్పన్న ములని పేర్కొనవచ్చును. ఉదా: గోడ, మేడ, నోరు మొ॥ (అథ. కా. అజ. 95). ఇట్టి శబ్దముల నహోబలపతి అధాతుప్రకృతికములని వచించెను. అనగా వీనికి ధాతువు ప్రకృతిగా నుండదని భావము (అహో. అజ. 85). చూ: జన్యశబ్దములు.

**అజహత్స్వార్థ వృత్తి**

చూ. (వ్య.) జహత్స్వార్థ వృత్తి.

వాక్యమునందువలెనే సమాసమునందును శబ్దములు తమ స్వార్థమును గోల్పోవ కుండ నన్వయింపబడుట. దీనినే "వ్యపేక్షాభావ"మనియు నందురు.

(చూ. తె. వ్యా. వి. పుట. 369)

**అజ్ఝల్విభాగము**

అచ్+హల్+విభాగము. అకారాదియగు అచ్చుల యొక్కయు, కకారాది యగు హల్లులయొక్కయు విభాగము. (బా. వ్యా. సంజ్ఞా. 1)

**అజ్ఞాతక్రియ**

తెలియనికాలము గల క్రియ. తెలియఁబడిన కాలముగల ఒక క్రియ అజ్ఞాత కాలముగల వేఱొక క్రియయొక్క కాలమునకు బోధకమగును. అట్టిచో జ్ఞాతకాల క్రియావాచియగు ధాతువునకు 'నుజీ' వర్ణకమగును. ఇది భావలక్షణార్థకము.

"చైత్రుఁడు వండ నతిథి వచ్చెను"— 'వండు' అనునది తెలిసినకాలముగలది. అతిథి వచ్చునట్టి కాలము తెలియనిది. ఇదే యజ్ఞాతక్రియ.

(గు. ప్ర. పుట. 332)

**అజ్ఞాతవస్తూద్దేశ్య ప్రశ్నము**

తెలియని వస్తువునుగూర్చిన ప్రశ్నము. ఇందు కిమర్థక శబ్దము (ఏ) బహు వచనాంతము తఱచుగా నగును.

ఎవరక్కడ? ఎవడక్కడ? (ప్రౌ. వ్యా. శబ్ద. 46)

**అజ్భక్తి**

అచ్+భక్తి

చూ. స్వరభక్తి

**అఁట, యిఁక, చుఁడు శబ్దములు**

పదాదిహ్రస్వములపై ఖండబిందువున్న శబ్దములు ఈ మూఁడుమాత్రము.

(బా. వ్యా. సంధి. 22)

**అటమటాదులు**

"అటమటము" (మోసము) మున్నగుపదములు. మతుబర్థమునందు (కలవాడు/కలది) వీనికి 'ఈ' అను తద్ధిత ప్రత్యయము చేరగా అటమటీఁడు, కమ్మటీఁడుఁ కొండీఁడు, ఖానసీఁడు మున్నగురూపములు సిద్ధించును. (బా. వ్యా. తద్ధిత. 15)

**అటాంతములు**

"అట" అంతమందుగల రూపములు.

చేయు+అట (ము)=చేయటము

కొట్టు+అట (ము)—కొట్టటము

ఇట్టి అటాంతములు గోదావరి, విశాఖాది మండలములలో శిష్టజన వ్యవహారమున గలవని వ్యాకరణ సంహితా సర్వస్వము (పుట. 1437) పేర్కొనుచున్నది.

(ఆం. భా. శా. పుట 254)

**అట్టి**

ఎల్ల యెడల ధాతుజ విశేషణములకు విభాష ననుప్రయుక్తమగును.

వచ్చినట్టి రాముఁడు—వచ్చిన రాముఁడు (సమాసము)

వచ్చునట్టివాఁడు—వచ్చువాఁడు (ఏకపదము) (బా. వ్యా. సమాస. 10)

**అట్టి ప్రభృతులు**

అట్టి, పోని బోటి, వంటి, అను శబ్దములు. (ప్రౌ. వ్యా. సమా. 48)

**-అద**

తద్ధిత ప్రత్యయము. వేఱునకిది స్వార్థమునందగును· —వేఱదము. అమహదదంతమగుటచే 'ము' వర్ణకము చేరినది. (ప్రౌ. వ్యా. తద్ధిత. 6)

**అడంగ్వాదులు**

(i) "అడంగు" మున్నగు ధాతువులు. వీనికి—కువ అను కృత్ప్రత్యయము చేరును. అడఁకువ, పెనఁకువ, ఇత్యాదులు. ఇది చేరునపుడు ధాతువులోని యంతిమాక్షరము లోపించును. (బా. వ్యా. కృ. 8)

(ii) అడఁగు, కడఁగు. వడకు మున్నగు శబ్దములలోని డకారము ణకారమగును. (బా. వ్యా. ప్ర. 13)

(iii) అడఁగు, కరఁగు, కలఁగు,—ఇత్యాదులు. వీనికి ప్రేరణార్థము నందు "చు" చేరును. అప్పుడంతిమాక్షరము లోపించును.

అడఁచు, కరఁచు, కలచు. (బా. వ్యా. క్రియా. 76)

**-అడము**

ధాతువుల కీ కృత్ప్రత్యయము చేరును. ఇది భావార్థమునఁజేరు సామాన్య కృత్ ప్రత్యయమగు "ట" వంటిది. ఇవి వ్యవహార ప్రసిద్ధములు.

తోపడము, కొసరడము, కోరడము (ఆం. కౌ. 788)

**అడాంతములు**

(అడ+అంతములు) "అడ" యను భావార్థకకృత్ప్రత్యయ మంత మందుఁగల అందడము, పొందడము, విడువడము, తరగడము, వండడము మున్నగు పదములు. ఇట్లు ప్రతి క్రియయు అడాంతమగుట ప్రసిద్ధము. కాని యిట్టి పదములకు ప్రయోగము లేదని అథర్వణుని మతము. (అథ. కా. అజ.98). చూ:- అడము. ఇట్టి శబ్దములు గ్రామ్యములగుటచే ప్రయోగార్హ్హములు కావని అహోబలపతియు నిరసించెను (అహో. అజ. 85).

**-అడి**

తద్ధిత ప్రత్యయము. "వెల్ల" అను శబ్దమునకు స్వార్థమునందు వచ్చును.

వెల్ల+అడి=వెల్లడి (ప్రౌ. వ్యా. సమాస. 7)

**అడుక్వాదులు**

'అడుకు' మున్నగు ధాతువులు వీనికి 'ఉ' వర్ణకము చేరగా, అపదాది స్వర సంధిచే "అడుకు, అంటు, ఒప్పు, ఒఱుఁగు, ఒసఁగు" అనురీతిన కృదంతరూపము లేర్ప డును.

**అడ్డాదులు**

"అడ్డ" మున్నగునవి. ఇట్టివానినుండి ధాతురూపములు సాధింపవలయునన్న "ఇంచు" చేర్చవలయును. అప్పు డడ్డించు వంటి అసాధు రూపము లేర్పడును. గు(క్) అను ఆగమము ధాతువులకు చేరగా

అడ్డ+గ్+ఇంచు→అడ్డగించు

ఓర+గ్+ఇంచు→ఓరగించు

పెల్ల+గ్+ఇంచు→పెల్లగించు - వంటి రూపములేర్పడును. ఇది ఆకృతి గణము. (బా వ్యా. క్రియా.79)

**అతిదేశము**

ఒక శబ్దముయొక్క ధర్మమును వేఱొక దానియందారోపించుట.

(i) దూతాది శబ్దములకు బహుళముగా స్త్రీలింగత్వము నతిదేశించుటచే దూత - దూతుఁడను రూపములు కల్గును. (బా. వ్యా. తత్స. 61)

(ii) కంధరాది స్త్రీలింగ శబ్దములకు నపుంసకత్వమును బహుళముగా అతిదేశించుటచే కంధ-రకంధరము, నాసిక-నాసికమను రెండు రూపములు కల్గును.
(బా. వ్యా. తత్స. 66)

(iii) ఆచ్ఛిక శబ్దములకు తఱుచుగా స్త్రీసమత్వాతిదేశముచే ప్రథమైకవచన లోపాదికము కల్గును. -అన్న, మిన్న, జాణ, ఓడ, గోడ. ఇట్లే మఱి కొన్నింటికి క్లీబసమత్వమును అతిదేశించుటచే "ము" వర్ణకము కల్గును. బియ్యము, నెయ్యము, అల్లము, బెల్లము.
(ఆచ్ఛి. 2)

**అతిచారము**

మితిమీరి సంచరించుట. సూత్రమునందు చెప్పఁబడిన నియమము మీరి వేఱొక చోటు నందు సైతము ప్రవర్తించుట. (గు. ప్ర. పుట. 353)

అతిచారమనఁగా అతివ్యాప్తి. (వ్యా. సం. స. 1532)

చదువుకొను+మి(జి) - చదువుకోమి; చదువుకొననేల - చదువుకోనేల; చదువుకొనక - చదువుకోక - వంటిరూపము లతిచారమువలన నేర్పడినవి.
(బా. వ్యా క్రియా. 60-61)

**అతిదిష్టవర్తమానము**

ఆరోపితమైన అన్యధర్మము గలది అతిదిష్టము. వర్తమానమును భర్తృహరి తన వాక్యపదీయము నందు ద్వివిధములుగా నిరూపించెను. అందొక భేదమిది. భవిష్యత్కాల ధర్మము వర్తమానకాలవాచకమునందు ఆరోపించుట.

"ఇదిగో వెళ్లుచున్నాము"—ఇదిగో వెళ్లఁబోవుచున్నామని అర్థము.
(తె. వ్యా. వి. పుట. 698) (వాక్య. III. 37)

**అతిపరోక్షవృత్తి**

ప్రత్యక్షము కానిది పరోక్షము. అందులోను మిక్కిలిగా పరోక్షమైన మార్పును 'అతిపరోక్షవృత్తి' అందురు. గుర్తింపరానంతగా మార్పుచెందిన పదమును ఇట్లు వ్యవహరింతురు.

బలీవర్ద మను పదము "బైల్"గా హిందీలో మార్పుచెందుట ఇట్టిది. ఇట్లు మార్పు చెందిన పదముల మూలరూపమును గుర్తించుట చాలాకష్టము. అట్టి వీ వృత్తిలోనివి. కృదంత రూపములలోను నిట్టి వృత్తిని గుర్తింపనగును.

కూఱు

ఱు=పొద—చ

డు (తె. వ్యా. వి. పుట. 845)

డును.

బలీవర్దము—ఎద్దు? అయినదని కొందరందురు. ద్రావిడ భాషలలోని దేశ్యపదములన్నియు నిట్టి లోకవృత్తిలో మార్పుచెందిన సంస్కృత ప్రాకృత పదములే అను వాదమొకటి కలదు. (తె. వ్యా. వి. పుట. 845.)

**అతిప్రసంగము**

చూ: అతివ్యాప్తి.

**అతివ్యాప్తి**

మితిమీఱి వ్యాపించుట. లక్ష్యముకాని దానియందు లక్షణము ప్రవర్తిల్లుట. గోవునకు శృంగిత్వము (కొమ్ములుండుట) లక్షణమన్నచో గేదెలకు, ఇంకను నితరజంతువులకు కొమ్ములుండుటచే అతివ్యాప్తి దోషము ఏర్పడుచున్నది. అందుచే లక్షణము. సమగ్రముగా నుండవలయును. దీనినే అతిప్రసంగమనియు నందురు. (చూ. అతిచారము)

**అతీతార్థకక్రియ**

భూతార్థమును దెలుపు క్రియ. (చింతా. క్రియ 9)

**అత్తు**

హ్రస్వమగు అకారము. చూ. తపరకరణము. (బా. వ్యా. సంధి. 4)

**అత్యంతార్థము**

మిక్కిలి తీవ్రతను చెప్పు అర్థము. ఇందు పదములు ద్విరుక్తమగును.
ఔరౌర, కటకటా, కనికని, వినివిని మొ. (ప్రౌ. వ్యా. శబ్ద. 112)

**అత్వసంధి**

హ్రస్వమగు అకారసంధి (చూ. బా. వ్యా. సంధి. 4)

**అత్వమడఁగుచుఁ బొడముచు నలరు సంధి**

అకారము లోపించుట, లోపింపకుండుటనై ఒప్పుసంధి.
'అది' అను పదములోని అకారము వికల్పముగా లోపించుటను తెల్పుసంధి.

ఇట వికల్పమునకు అడగుచు; పొడముచు, నుండుట అను వివరణమును గమనింపనగును ఉన్న+అది⟶ఉన్నది, ఉన్నయది; నేర్చుచున్నయిది, నేర్చుచున్నది.
(స. సా. సం. I సంధి. 47.)

**అథర్వణ మతసంధులు**

తెలుగు వ్యాకర్తయగు 'అథర్వణాచార్యులు'కి సమ్మతమైన సంధులు.

సమాసమునందు ఉదంతశబ్దములు కొన్నింటిపై పొల్లు నకార మాగమముగా వచ్చును. అది ద్రుతముకావున పైనున్న పరుషములను సరళములు గావించును. ఇట్లాదేశమైన సరళములకు పూర్వమందున్న నకారము బిందువగును. అప్పకవి ఈ సంధి కిట్లు పేరిడెను.
కను+కవ ⟶కనున్కవ⟶కనున్గవ⟶కనుంగవ. (అప్ప. V. 180)

**అదంతగుణవాచకములు**

(i) హ్రస్వమగు "అ'' కారము అంతమందుఁగల గుణమును దెల్పు శబ్దములు: నల్ల, తెల్ల, పుల్ల మున్నగునవి.

(ii) వీనికి "-తనము" అను తద్ధితప్రత్యయము త్వార్థము (చూ.) నందు పరమగునపుడు నుగాగమమగును.

నల్లఁదనము (బా. వ్యా. సంధి. 35; బా. వ్యా. తద్ధిత. 1)

**అదంత పురుష వాచకములు**

హ్రస్వమగు అకారము అంతమందుగలట్టి, పురుషబోధకములగు అచ్చతెనుఁగు పదములపై "ఁడు" వర్ణకము వికల్పముగా వచ్చును.

పాప—పాపఁడు
గొల్ల—గొల్లఁడు
మాల—మాలఁడు. (ఆం. కౌ. 256-57)

**అదంతము**

అత్+అంతము "హ్రస్వమగు అకార మంతమునందుగల శబ్దము. బాల, నృపాలాదులు. (బా. వ్యా. తత్సమ. 38)

**అదరులు లోనగునవి**

అదరులు, అటుపుళ్ళు, ఎండువులు, మిడుఁగుఱులు మొదలయినవి. ఇవి వృత్తియం దేకవచనాంతంబుల యగు—అదరుటగ్గి. (ప్రౌ. వ్యా. శబ్ద 36)

**అదాగమము**

(అత్ + ఆగమము) సంబోధనప్రథమైకవచన ప్రత్యయము యొక్క అంతమున వచ్చు ఆగమము (చింతా. అజ. 13). ఇందలి చివరి తకార ముచ్చారణార్థముకాగా 'అ మిగులును. ఉదా: రాముఁడ (రాముఁడు+అ) మొ॥

**అదాదులు**

అత్+ఆదులు. హ్రస్వమగు అకారము మున్నగునవి. అ—ఆ—ఇ—ఈ—ఎ—ఏ—ఒ—ఓ—అమ్మ—అయ్య ఇత్యాదులు.

సంప్రార్థనమునందు మధ్యమ పురుష ఏ. వ. మువర్ణకమునకు బ. వ. డు (జ్) వర్ణకమునకు అదాదులు వికల్పముగా అను ప్రయుక్తమగును.

వండుము+అ ⟶ వండుమ. ఇట్లే వండుమా, వండుమీ, వండుఁడ, వండుఁడీ, ఇత్యాదులు. (బా. వ్యా. క్రియా. 33)

**అదిత్తులు**

అత్—హ్రస్వమగు అకారము.

ఇత్తులు—ఇత్సంజ్ఞగాగల ధాతువులు. 'స్పర్థ' ఇందలి 'అత్' ఇత్సంజ్ఞ గావున లోపించును. అప్పుడు 'స్పర్థ్' అను రూపము మిగులును. దీనిపై 'ఇంచుగా'గమము రాగా స్పర్థించు అగును. ఇట్లే 'ముద'—ముద్+ఇంచు (క్)—మోదించు;

వర—వర్+ఇంచు (క్)—వరించు;

గణ—గణ్+ఇంచు (క్)—గణించు (బా. స. పుట 46)

**అదు**

అభావార్థమున ధాతువుపై వచ్చు ప్రత్యయము. ఉదా: రారాదు, లేదు, కారాదు, కాదు. మొ॥ (మం. ఆం. కౌ. 423)

**అదృష్టము**

దృష్టముకానిది, కానిపించనిది. సృష్టిలో సకల ప్రాణులు ఆహారవిహారాదులందు ప్రవర్తిల్లుటకు ప్రతిభే కారణమని, అట్టి ప్రతిభ షడ్విధములని; అందులో అదృష్టమనునది యొకవిధమగు ప్రతిభయని 'భర్తృహరి' తన వాక్యపదీయమున వివరించెను. (వాక్య. II. 154) (తె. వ్యా. వి. 1027-28

**అద్భుతశబ్దసంధి**

'అద్భుత' మను అర్థమునిచ్చు తెనుఁగు శబ్దము. 'అబ్బురము'—ఇట్టిశబ్దములోని ఉత్వము వికల్పముగా లోపించును.

అబ్బురము—అబ్రము.

తెలుగు పదములలో ఊనిక లేనికారణముగా అనాదిలోగల కొన్ని అచ్చులు లోపించును.

వేడుక—వేడ్క

కినుక—కిన్క మొ॥ (అప్ప. V. 100)

**అద్భుతార్థకములు**

(అద్భుత+అర్థకములు) ఆశ్చర్యార్థమును బోధించు అహో, ఓహో, ఔరా యను శబ్దములు. ఇవి కళాసంజ్ఞకములు. (చింతా. సంజ్ఞా· 40)

**అద్యతన, అనద్యతన సముదాయ భవిష్యత్తు**

అప్పటికి జరుగక, ఆ వెంటనేగాని, అటుపిమ్మటగాని జరుగగల భవిష్యత్క్రియారూపము.

అతఁడు వెళ్ళఁబోవుచున్నాడు.

(తె. వ్యా. వి. పుట. 698)

**అద్యతన అనద్యతన సముదాయ భూతము**

ఇప్పుడు జరిగినది, పూర్వము జరిగినది కలిపిచెప్పు భూతార్థక క్రియారూపము.

'భర్తృహరి' తన 'వాక్యపదీయము'న ఐదువిధములగు భూతకాలిక క్రియలను

చేర్కొనెను. అందిది యొకటి. (వాక్య. III. 37)

ఇట్టి భేదము తెలుగున నిరూపితముకాదు. ఆంగ్లమునందలి Past perfect continuous tense ఇట్టిదేమో! (తె. వ్యా. వి. పుట. 698)

**అద్యతన భవిష్యత్తు**

చూ. అద్యతనము.

వక్త మాట్లాడునప్పటినుండి ఆనాటిరాత్రి ప్రథమ యామాంతమువరకుగల కాలమునందు జరుగబోవు క్రియారూపము. (తె. వ్యా. వి. పుట. 698)

**అద్యతన భూతము**

కడచిన రాత్రియొక్క అంత్యయామము మొదలుకొని రాఁబోవు రాత్రియొక్క ప్రథమయామము తుదివరకు నుండుకాలము—అద్యతనము. కడచిన రాత్రి నుండి వక్త ప్రసగించునప్పటికి జరిగిపోయిన కాలము—అద్యతన భూతము.

కడచిన అర్ధరాత్రమునుండి నేటి అర్ధరాత్ర మద్యతనమని కొందఱందురు.

(తె. వ్యా. వి. 698 పుట)

**అద్రుతము**

(న+ద్రుతము) ద్రుతప్రకృతికముకాని శబ్దము. కళయని భావము. అథర్వ ణుఁడు ద్రుతప్రకృతికమను పదమును వాడినను ద్రుతప్రకృతికములు కానివానిని కళలనక 'అద్రుతముల'నియే వ్యవహరించెను (అధ. కా. సంధి 23, అజన్త 81)

**అద్విరుక్తము**

ద్విరుక్తముకానిది—అనగా రెండు సార్లు ఉచ్చరింపబడనిది.

అక్కట - ద్విరుక్తము

అకట - అద్విరుక్తము

అద్విరుక్తములగు రూపములు కొన్ని ద్విరుక్తములగుట గమనింపనగును.

తలక్రిందులు – తల్లక్రిందులు (చూ. బా. వ్యా. ఆచ్ఛి. 14)

**అధముఁడు**

తక్కువవాఁడు. కేవలము లక్షణమునే యెరిగి, లక్ష్యముతో సమన్వయము చేయలేని వానిని అప్పకవి "అధముఁడు" గా పరిగణించెను. (అప్ప. I. 12)

**అధికరణకారకము**

అధికరణమనగా ఆధారము. ఒక వస్తువును గాని, కోరిక మొదలగు గుణములకు గాని ఆశ్రయమైనది. (ఆం. శా. కారక. 51)

అధికరణార్థమునందు సప్తమీవిభక్తి వచ్చుటయే అధికరణకారకము.

చెరువు*నందు*జలమున్నది. (ఆం. కౌ. 417; ల. వ్యా. విభక్తి-95)

**అధికరణము**

అధికరణమనగా ఆధారము. ఇది మూడు విధములు.

1. ఔపశ్లేషికము
2. వైషయికము
3. అభివ్యాపకము

} చూ.

(బా. వ్యా. కారక. 17)

**అధికారసూత్రము**

ఉత్తర సూత్రములందు అనువర్తించునది. దీని అనువృత్తి పరిమితిని సూత్రకారుఁడు సూచింపవచ్చును.

చిన్నయసూరి తన బాలవ్యాకరణము క్రియా పరిచ్ఛేదమును 'ధాతువునకు' అను అధికార సూత్రముతో నారంభించెను. "ఇంక నెయ్యది యుపక్రమింపంబడు, నయ్యది ధాతువున కగునని యెఱుంగునది"— అని వివరించెను.

"ఇత ఊర్ధ్వం యదను క్రమిష్యామః

తద్ధాతో రితి వేదితవ్యమ్" అను కాశికావృత్తికి సూరి వివరణము క్రమానుసారముగా నున్నది.

(రమణీయము, పుట. 376)

క్రియా పరిచ్ఛేదము నతిక్రమించి కృదంతపరిచ్ఛేదమునందలి సూత్రములకును ఈ అధికారసూత్ర మన్వయించును.

**అధికృతగ్రంథార్థము**

"ఉద్దేశించి చేయఁబడు గ్రంథము" అను అర్థమునందు చేరు తద్ధితప్రత్యయము. "నరసభూపాలీయము"— నరసభూపాలు నుద్దేశించి రచింపఁబడిన గ్రంథము అను అర్థమునందు "నరసభూపాల" అను ప్రాతిపదికము. "ఈయ" (ఛ) అను తద్ధిత ప్రత్యయము చేరెను.

ఇట్లే విక్రమోర్వశీయము మున్నగునవి. (ఆం. భా. శా. సమా. 88)

**అధీనవాక్యసంధాయకము**

మఱియొక వాక్యముపై ఆధారపడిన వాక్యము "అధీనవాక్యము." అట్టి వాక్యమును స్వతంత్ర వాక్యముతో కలుపు శబ్దము అధీన వాక్య సంధాయకము.

"బాలుఁడు పాఠములు బాగుగాఁ జదువునేని పరీక్షలోఁ గృతార్థుఁడగును."

ఇందు '*ఏని*' అధీనవాక్య సంధాయకము. [మ. ప. వ్యా. సంధా. 8]

**అధీనసమవాక్యసంధాయకము**

మఱియొక వాక్యముపై ఆధారపడి సమముగానున్న వాక్యములను కలుపునది.

"దేవుఁడు సుజనుల రక్షించుననియుఁగుజనుల శిక్షించుననియుం బెద్దలు వక్కాణిం తురుగాని యదియంతగా నిక్కలికాలంబునఁ గానరాదు." ఇట "యు" శబ్దము సమవాక్యము లను గల్పునుగాన నది ఇట్టిది. [మ. ప. వ్యా. సంధా. 5]

**అధోవర్ణసమీకరణము**

చూ. వర్ణసమీకరణము. క్రింది వర్ణముతో పైవర్ణము సమీకరణమందుట. తద్భ వము లేర్పడుటలో నిట్టి సమీకరణము విశేషముగాఁ గాంచనగును.

భక్తి—బత్తి

శర్కర—చక్కెర

దేశ్యశబ్దములందును నిట్టిమార్పు గల్గును.

చలిది—చల్ది—చద్ది [తె. వ్యా. వి. పుట. 232]

**అధ్యారోపిత భూతభావ భవిష్యత్తు**

ఆరోపింపఁబడిన భూతభావముగల భవిష్యత్క్రియారూపము. ఈ విధమగు భవిష్యద్భేదమును భర్తృహరి తన వాక్యపదీయమునందు వివరించెను. [వా. ప. III. 37]

ఉదా.- "నేను మంత్రినైనచో ఆ పని చేసియుండెడివాఁడను.

[తె. వ్యా. వి. పుట. 698]

**అధ్యాహారము**

ఆకాంక్షితమైన పదములను తెచ్చుకొనుట. "నన్నుఁజూచి నగరె?"—

"నన్నుఁ జూచి జనులు నగరె"?— అను రీతిని అధ్యాహారము చేసికొన్నచో ఆకాంక్ష పూర్తియగును.

**అధ్యాహార్యము**

అధ్యాహారము [చూ.] కావింపబడిన పదము. ఇట్టి అధ్యాహార్యములు ప్రౌఢవ్యాకర ణమునందు విశేషముగా నిరూపితములు. [చూ. వాక్య పరిచ్ఛే. 10, 11, 12, 13, 14]

'నిన్నుఁ జూచి నగరె?' ఇట కర్తృ పదమగు జనులు అధ్యాహార్యము.

**అధ్వము**

మార్గము. దీనిని తెల్పుపదమునకు ప్రథమావిభక్తి తఱచుగా వచ్చును.

"వారు క్రోశము నడచిరి"—అనగా క్రోశము పరిమితిగల మార్గమునందు నడ చిరని యర్థము. సప్తమికి బదులుగా ప్రథమ వచ్చినది. [బా. వ్యా. కార. 25]

**అధ్వవాచి**

మార్గ పరిమితిని దెల్పు పదము. క్రోశము, ఆమడ, మైలు, ఫర్లాంగు, కిలోమీటరు

ఇత్యాదులు.

చూ. అర్ధ్వము. [తె. వ్యా. వి. పుట. 991]

**అనంతర తద్భవములు**

ప్రాచీనకాలమునగాక, తదనంతరకాలమునం దేర్పడిన తద్భవములు.

*ప్రాచీన తద్భవములు—అనంతర తద్భవములు*

| | | |
|---|---|---|
| అమవాస్య — | అమవస — | అమాస |
| సముద్రము — | సందరము — | సంద్రము |
| కుమారుఁడు — | కొమరుఁడు — | కొమారుఁడు |
| సంతోషము — | సంతొసము — | సంతోసము. |

ఇట్లు పదమధ్య దీర్ఘసంయుక్తాదులు గలవి. అర్వాచీనరూపములు.

[తె. వ్యా. వి., పుట. 206]

**అనంతామాత్యుఁడు**

క్రీ. శ. 1435 ప్రాంతమువాఁడు. 'భోజరాజీయ' మను కావ్యమును, "ఛందో దర్పణము," 'రసార్ణవమ'ను శాస్త్ర గ్రంథములను రచించిన దిట్ట. ఇతఁడు ఛందోలంకారాది విషయములందు జూపినంత శ్రద్ధ వ్యాకరణవిషయమున చూపలేదు. అయినను ఛందోదర్పణమునందు నాల్గవ ఆశ్వాసమున కతిపయ వ్యాకరణాంశములను స్పృశించెను.

**అనంతుని ఛందము**

చూ. ఛందోదర్పణము.

**అనద్యతన భవిష్యత్తు**

చూ. అద్యతనము. వక్త ప్రసంగించు నాటి రాత్రి ప్రథమ యామానంతరము జరుగనున్నకాలమునకుఁ జెందిన క్రియాపదము. భూతార్థక క్రియనువలె ఈ విధమగు భేదమును భర్తృహరి తన వాక్యపదీయమునందు పేర్కొనెను. [III. 37] [తె. వ్యా. వి. పుట. 698]

**అనద్యతనభూతము**

అద్యతనము [చూ.] నకు పూర్వము జరిగినది. ఈ అర్థమున పాణిని లఙ్[చూ.] ప్రత్యయమును విధించెను. [చూ.] అనద్యతనే లఙ్। పా॥ III. 2.8; భూతానద్యతనే లఙ్ స్యాత్। సి. కౌ.]

ఇట్టి భేదమును తెనుఁగు వ్యాకర్తలు పేర్కొనలేదు. ఆంధ్రకౌముదిలో నిట్టివి ఉటంకితములు. [తె. వ్యా. వి. పుట. 698]

**అనన్వితము**

అన్వితము [చూ.] కానిది. అన్వయింపనిది. ఇతరపదములతో అన్వయము పొందనిది. వేఱొక పదముతో నన్వయించినదికాక వేరుగా నున్న పదమని ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. [ప్రౌ. వ్యా. వాక్య. 2]

**అనభిహితకర్త**

ఆఖ్యాతాదులచే [క్రియావిభక్తి మొ॥ వానిచే] అభిహితము [తెలియఁజేయబడిన] కాని కర్త. ఇట్టి కర్తృవాచకము తృతీయ యందుండును. ఇట్టి అనభిహితకర్తకు ఒకానొకచో షష్ఠి రావచ్చును.

రామునిచే మిథిల గనంబడియె.

రామునకు మిథిల గనంబడియె. [బా. వ్యా. క్రియా. 124]

**అనమ్**

గుణవాచకశబ్దములపైనను, వర్ణవాచక శబ్దములపైనను వచ్చు తద్ధితప్రత్యయము [వై. చం. తద్ధితా. 18]. ఇందలి మకార మిత్సంజ్ఞక మగును. ఉదా :-

చల్లన, వెచ్చన—నల్లన, తెల్లన మొ॥

**అనర్థబోధకము**

అర్థ బోధకము కానిది. క, చ, ట, త, ప,—ఇత్యాది వర్ణములు అర్థబోధకములు కావు. కావున నివిపదములు కావు. [ప్రౌ. వ్యా. వాక్య. 2.]

**అనవద్యము**

అవద్యము కానిది. నింద్యముకానిది. సూత్రమునకుండవలసిన లక్షణములలోనొకటి. "అల్పాక్షరం, అసందిగ్ధం, సారవత్, విశ్వతోముఖమ్। అస్తోభం, అనవద్యం, చ సూత్రం సూత్ర విదో విదుః" [రమణీ. పుట. 37]

**అనాగరకభాష**

నాగరకముకాని భాష. గ్రామీణభాష. సామాన్యజన వ్యవహారభాష. దీనినే ఆంగ్లమున (Vulgarism) అందురు. ఇది వ్యవహారభాష కన్న (Colloquialism) తక్కువ గౌరవము గలభాష. (తె. వ్యా. వి. పుట. 151)

**అనాదరార్థము**

అనాదరమును చూపించు పట్లను శబ్దములు ద్విరుక్తములగును.

లేలే, పోపో, లేలెమ్మ, పోపొమ్మ. (ప్రౌ. వ్యా. శబ్ద. 113)

**అనాపామాయాగమములు**

అన, అప, అమ, అయ, అను ఆగమములు కొన్ని సంజ్ఞావాచకముల

కనుప్రయుక్తమగును. తిక్కన, నన్నపార్యుడు, కృష్ణమనాయఁడు, రామయ సెట్టి. (ప్రౌ. వ్యా. సమాస. 4)

**అనాలోచిత ద్విత్వము**

అప్రయత్నముగా ఉచ్చారణమునందు హల్లులు ద్విరుక్తములగుట. దీనికే Spontaneous doubling అందురు.

రెండుఁన్ + అర ⟶ రెండున్నర

ఆఱున్ + ఒకటి ⟶ ఆఱున్నొకటి

(తె. వ్యా. వి. పుట. 545-74)

**అనింద్య గ్రామ్యము**

నిందింపఁదగని, అనగా గౌరవింపఁదగిన వ్యాకరణవిరుద్ధమగు పదము. మహాకవులు లోకమందు ప్రసిద్ధములగు పదములు, అవి వ్యాకరణ విరుద్ధములైనను ప్రయోగించిరి. అట్టివానిని నిరసింపక, ఆర్యవ్యవహారమున ఉన్నవిగాన గ్రాహ్యములగును.

కఱకంతుఁడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, దినవెచ్చము మె॥

(బా. వ్యా. సంజ్ఞా 23; ప్ర. వ్యా. సంజ్ఞా. 17)

**అనిత్యము**

నిత్యముకానిది. అనఁగా వైకల్పికము. వ్యాకరణ కార్యమొకమాఱు ప్రవర్తిలుట, మఱియొకమాఱు ప్రవర్తిలకుండుట.

**అనిత్య సమాసము**

నిత్యసమాసము (చూ.) కానిది. నిత్యానిత్య సమాస విభజనమును నవ్యగీర్వాణ వ్యాకర్తలు ఏర్పరచిరి. అనిత్య సమాసమునందలి శబ్దములకు విభక్తులు చేర్చి విగ్రహవాక్యమును జెప్పుమాత్రముననే అర్థ మవగతమగును.

రాజ్ఞః పురుషః—రాజపురుషః (తె. వ్యా. వి. పుట. 871)

**అనిబద్ధ రూపములు**

నిబద్ధముకాని, అనగా స్వతంత్ర శబ్దములు. నిబద్ధరూపములకు (చూ.) వ్యతిరేకమైనవి. పుస్తకములు.

పుస్తకము—అనిబద్ధరూపము (Free Form)

—లు: నిబద్ధరూపము (Bound Form)

(తె. వ్యా. వి. పుట. 568)

**అనిరాకర్తృక సంప్రదానము**

నిరాకర్తృకము కాని సంప్రదానము. అనగా దానగృహీతచే నిరాకరింపరానిది. భర్తృహరి తన 'వాక్యపదీయము'నందు నిరూపించిన సంప్రదానములలోనొకటి. ఇందు గ్రహీత అంగీకారానంగీకారములతో నిమిత్తముండదు. ఈ దాన మాతం డాశించినది కాదు.

ఉదా: సూర్యునికొఱకు అర్ఘ్యము నిచ్చుచున్నాడు. హరికొఱకు విరి యిచ్చు చున్నాఁడు. (ఆం. కౌ. 457,58) (తె వ్యా వి. పుట. 979)

**అనిర్దిష్ట సర్వనామములు**

నిర్దిష్టములుకాని, ఇన్ని, ఇందఱు అని ప్రత్యేకముగా నిర్ణయించని సర్వనామములు (చూ.). తమతో సంబంధించు విషయములను నిర్దేశింపనివి. పెక్కుతెగలు- అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని, పలు, అందఱు, ఇందఱు, కొందఱు, పెక్కు, పెక్కండ్రు, పెక్కురు, పలువురు, పలుగుండ్రు—ఇత్యాదులు.

(సం. వ్యా. సర్వ. 19)

**అనిర్దిష్ట స్త్రీపురుషోద్దేశ్య వ్యాహారము**

నిర్దేశింపబడని స్త్రీపురుషుల నుద్దేశించిన మాటయందు, అనగా స్త్రీయనిగాని పురుషుఁడనిగాని, నిర్దేశింపక సామాన్యముగా పలుకునపుడు ఏకార్థకశబ్దము తఱచుగా నగును.

ఒకరు పోయిన తోవ నొకరుపోరు,

వారొక్కరే వచ్చిరి. (ప్రౌ. వ్యా. శబ్ద. 47)

**అనిర్దిష్టార్థము**

స్పష్టముకాని యర్థము. ఇట్టి అర్థమునందు, 'ఒక' శబ్దమునకు పూర్వాగమము వచ్చును. ఒకానొకఁడు, ఒకానొకతె, ఒకానొకటి మొదలగునవి.

(ప్రౌ. వ్యా. శబ్ద. 85)

**అనుకరణము**

ఒకరు చెప్పినట్లు చెప్పుట. ఇట్లు చెప్పినపిమ్మట 'అను' ధాతువుయొక్క క్త్వార్థక రూపముగాని, తత్తుల్యార్థముగల ఇతరరూపములుగాని వచ్చును.

"కృష్ణ కృష్ణ" అని గ్రక్కునమోడ్చి-(కళా. III. 19)

1. ఆధునికులు అన్యులు చెప్పిన మాటలను యథాతథముగా చెప్పునపుడు ఆద్యంతము లందు " " అను గుర్తు నుంతురు. అన్నిభాషలందు నిట్టి గుర్తింపు నేడుకలదు. దీనికే Direct Speech అందురు.

2. సంస్కృతక్రియలు, అవ్యయములు, విభక్త్యంత శబ్దములు వాక్యములు అనుకరణమునందు ప్రయోగింపవలయునని నియమమున్నది.

" శ్రీరంగ ధీవరాయ, భూపచంద్రాయ, తుభ్యంనమో" యటంచు, ఈ నియమమునకు అపవాదములగు ప్రయోగములు కొన్ని అర్వాచీన రచనలలో కానవచ్చును.

చూ. అనుకరణ విరహితము (రంగ. IV 21-24)

**అనుకరణ విరహితము**

అనుకరణములేనిది. 'అనుకృతేస్తి వాక్యంతు'. సంస్కృత వాక్యము అనుకరణముతో నుండవచ్చునని ఆంధ్ర శబ్దచింతామణి పేర్కొనెను. తొలుత ఇట్లే యున్నను కాలాంతరమున కావ్యములలో అనుకరణము లోపింపఁజేయబడెను ఇట్టి ప్రయోగము లాధారముగా కానోపు.

"కేచి ద్వినానుకరణం చాద్యశబ్దం ప్రచక్షతే"— అను వికృతి వివేక కారిక (సంజ్ఞా. 27)

"ఒకానొకచో ననుకరణ విరహితంబుగా సంస్కృత వాక్యంబు గానంబడియెడు" అను ప్రౌ. వ్యా సూత్రము లేర్పడినవి. (సంజ్ఞ. 15)

"కర్తు మకర్తుమ్ అన్యధాకర్తుమ్ ఉదారశక్తివి"

"అంటితి నమశ్శివాయ పాపాత్మురాలి" (జైమినీ. IV. 71)

'జయపదమును అనుకరణ విరహితముగా గలదు' (ప్రౌ. వ్యా. సంజ్ఞ.16)

"జయ, నారాయణ, పుండరీక వరదా..."

**అనుకార సంధులు**

అనుకరణము (చూ.) నందు వచ్చు సంధులు.

చూ. బా. వ్యా. సంధి. 50-54; అప్ప. V. 98.

**అనుకృతి**

చూ. అనుకరణము (బా. వ్యా. సంధి. 51)

**అను, కొను లోనగునవి**

అను, కొను, చను, మున్నగు ధాతుజ విశేషణములు. ఇట్టి 'ను' వర్ణాంత ధాతుజ విశేషణముల అంత్య "ఉ" కారమునకు హల్లు పరమగునపుడు లోపము వైకల్పికముగా నగును.

అను+పురము < అన్పురము / అనుపురము

(ప్రౌ. వ్యా. సంధి. 18)

**అనువృత్తన్యాయము** "అనువృత్తమన్య శబ్దానుశాసనవత్" (వాల్మీ. 1-1-2) అను న్యాయము. ఒక వ్యాకరణమునఁ జెప్పబడని విషయము నితర వ్యాకరణముల నుండి గ్రహించుట యని భావము. డుజ్ మున్నగు జిత్తులగు ప్రత్యయములు ఈ న్యాయానుసారము "సానునాసికోచ్చారణం జిత్" అను ప్రాకృత వ్యాకరణ సూత్రముచే బిందుపూర్వకములగును. ఉదా:- రాముఁడు, రాముండు మొ॥ ఇట్లే నుమ్ మున్నగువానిలోని యంత్యవర్ణములు ఈ న్యాయానుసారము పాణినీయ ముచే ఇత్సంజ్ఞకము లగును.

**అనుచిత విభాగము**

తగనిరీతిగా విభజించుట. ఒక పదమును అప్పటికున్న భ్రమతో విభజించుట వలన క్రొత్త శబ్దము లుత్పన్నమగును.

ఉదా : "లు" బ. వ. ప్రత్యయమను భ్రమతో కొలఁకులు, ఏనుఁగులు, ఈగలు వంటి పదములను విభజించుటచే "కొలఁకు, ఏనుఁగు, ఈగ" వంటి ఏ. వ. రూపములేర్పడినవి. విశాఖమండలములో "కానిస్టేపులు" అను ఆంగ్ల పదము లోని "లు" బ. వ. ప్రత్యయమను భ్రాంతితో 'కానిస్టేపు' అను అనుచితవిభాగ రూపము వ్యవహృతము. దీనినే ఆంగ్లమునందు "wrong splitting" అని వ్యవహారము.

**అనుత్తమ పురుషక్రియలు**

ఉత్తమపురుషేతరములగు ప్రథమ - మధ్యమ పురుషక్రియలు. వీని అంత్య హ్రస్వేకారమునకు సంధి నిత్యము. ఉదా: వినుతించి రమరులు, చేసితి వచ్యుతు పూజ మొ॥ (చింతా. సంధి 4)

**అనుదంతము**

'ఉత్' అంతమందు లేని తెలుఁగుపదము. మగఁడు, పాపఁడు, మున్నగునవి. ఇట్టి డుమంతములకు నిగాగమము నిత్యము. (వ్యతి.) ఉదంతము. మగనితో, మగనిచేత,

(బా. వ్యా. తత్సమ. 24)

**అనుదాత్తము**

ఉదాత్తము కానిది. ఇది స్వరభేదము. ప్రయత్న ప్రేరితమగు వాయువు తాల్వాది స్థానముల యధోభాగమును స్పృశించి స్వరమును పుట్టించునప్పుడది అనుదాత్తమగును.

'అర్వాఙ్'
''నీ చైరనుదాత్తః'' (పా. I. 2.30)
తెనుగున నిట్టి స్వరభేదములేదు. (తె. వ్యా. వి. పుట. 69)

**అనునాసికములు**

ముక్కుతో ఉచ్చరింపబడు వర్ణములు. వర్గధ్వనులవలె స్థానకరణ సంయోగానంతరము, నిశ్వాసము నాసిక గుండ పోయిన, అట్టి ధ్వనులు అనునాసికములనబడును.

ఙ, ఞ, ణ, న, మ, (అప్ప. II. 7)
(ఆం. కౌ. ౯౮; ఛం. ద. IV. 125)

**అనునాసిక వకారం**

"కొన్నిచోట్ల మకారానికి అనునాసిక వకారం విభాషగా వస్తున్నది. మామిడి మావిఁడి; చలిమిడి-చలివిడి, తమిదలు-తవిదలు,-ఇట్టిచోట్ల అనునాసిక చిహ్నంగా అరసున్న గుర్తును కొందరుంచుతున్నారు

ఏవిఁట, రవఁణ మొ॥ (వ్యా.భా.వ్యా. శబ్ద. 459)

రెండచ్చుల మధ్యలోను, పదాంతములోను, 'వ,స,హ' లకు పూర్వము వచ్చిన 'మ' కారము 'వఁ' కారంగా ఉచ్చరింపబడుతున్నది. అందుచే 'మ' కారమునకు 'వ' కారము ఉపవర్ణమౌతున్నది.

మామిడి—మావిఁడి
మామ—మావఁ
చీమ—చీవఁ
సంవత్సరమ్—సవ్ఁవ్వచ్ఛరవ్ఁ
సింహం—సివ్ఁహవ్ఁ
మాంసం—మావ్ఁసవ్ఁ

**అనుప్రయుక్తము**

అనుసరించి, అనగా వెంటనంటి ప్రయోగింపఁ బడినది. 'ఉండి పదంబొకానొకచో 'వలన' వర్ణకంబున కనుప్రయుక్తంబగు'-

"హిమగిరి వలన నుండి గంగ వొడమె"—'వలన' తో చేరి 'ఉండి' పదమను ప్రయుక్తమైనది. (బా.వ్యా. కారక. 10)
అనుప్రయుక్తమగు 'ఆట' శబ్దము—కోలాటము (బా.వ్యా. కృదన్త. 7)
అనుప్రయుక్తమగు 'పోవు' శబ్దము— (బా.వ్యా. క్రియా. 77)

**అనుబంధకము**

చూ:- అనుబంధము (చింతా. క్రియా. 9)

**అనుబంధ క్రియలు**

ధాతువును, క్రియావిభక్తిని కలుపునట్టి క్రియలు. వర్తమానార్థకమునందు-'ఉన్న' భవిష్యదర్థము నందు 'కల' అనుననిట్టివి.

వండుచు+ఉన్న+వాఁడు—వండుచున్నాఁడు.

వండ+కల+వాఁడు-వండకలఁడు (తె.వ్యా వి. పుట. 715)

**అనుబంధము**

ధాత్వాదుల కవ్యవహిత పరముగా ప్రయోగింపఁబడు ధాత్వాదికము. పఠించుచున్నాఁడు. పఠింపఁగలఁడు మున్నగుచోట్లుఉన్న, కలయను-నవి అనుబంధములు. (వై.చం సంజ్ఞా. 24) చింతామణి యందు అనుబంధ సంజ్ఞకు నిర్వచనములేదు. ఐనను అనుబంధసంజ్ఞ ప్రయోగింపఁబడినది. చూ : చింతా. (క్రియా. 10,11,12).

**అనుమంత్ఋ సంప్రదానము**

'అనుమంత' అనగా సమ్మతించువాడు. అతడు చేయు దానము.

"ఋషిరాజు తెరువరికిఁ జెట్టునీడ యొసఁగుచున్నాడు.

(ఆం. కౌ. 455. 56)

**అనుమన్తృ సంప్రదానము**

సమ్మతితోఁగూడినది. భర్తృహరి వాక్యపదీయమునందు నిరూపితమైన త్రివిధసంప్రదాయములలో నొకటి. ఇందుగ్రహీత ప్రేరణముండదు. కాని అతని సమ్మతితో దానక్రియ జరుగును.

ఉదా :- 'ఋషిరాజు తెరువరికిఁ జెట్టునీడ నిచ్చుచున్నాడు'.

(ఆం.కౌ. 456 పంక్తి)

(తె.వ్యా.వి. పుట. 979)

**అనువర్తితాన్య దేశ్యములు**

అనువాదము కావింపబడిన ఇతర భాషాపదములు. వీనినే 'Translated loans' అందురు. యథాతథముగా అన్యదేశ్యములను స్వీకరింపగ వాని భావము లను అనువర్తింప జేసికొను పద్ధతి యొకటి కలదు.

white paper... శ్వేతపత్రము

News paper.. వార్తాపత్రిక

Sputhnic...రోదసీనౌక (తె.వ్యా.వి.పుట. 854)

**అనువాద చిహ్నము**

ఇతర భాషలనుండిగాని, ఇతర గ్రంథములనుండిగాని వాక్యాదులు తమ భాషలో వ్యవహరించునపుడు ఉపయోగించెడి గుర్తులు "..."
"దుర్బలన్య బలంరాజా" అనవినవే. (సం.వ్యా. విరామ 1)

**అనువృత్తి**

సూత్రసమన్వయమునకుఁగాను పూర్వ సూత్రమునుండి ఉత్తరసూత్రములోనికి పదమునుగాని, పదసముదాయమును గాని లేక సంపూర్ణ సూత్రమును గాని తెచ్చుకొనుట. ఉదా;- అహమాదీనాంద్వీత్వమ్ (చింతా. సంధి 19) అను సూత్రములోనికి పూర్వ సూత్రమగు 'షష్ఠ్యా ఉతోఽచినుమ్సేచ. (చింతా. సంధి 17) అను సూత్రము నుండి 'అచి' అను నదిఅనువర్తించి అచ్చు' పరమగునపుడు అహమాదుల యంత్య వర్ణమునకు ద్విత్వము వచ్చునని సూత్రార్థమేర్పడును. ఇట్లే 'సంధిర్నాచోఽచ్యనుతః (చింతా. సంధి 1) అను సూత్రములోని సంధిపదము తరువాతి 8 సూత్రములలోనికి అనువర్తించును. అనువృత్తిని ఆశ్రయించుటచే సూత్రములకు సంక్షిప్తత సిద్ధించును.

**అనుసరణార్థము**

అనుసరించుట, వెంబడించుట అను నర్థమునందు తెనుఁగున 'తోడ' వర్ణకము వచ్చును (వ్యా.భా.వ్యా. కారక. 28)

**అనుస్వారము**

స్వరమును (అచ్చును) అనుసరించియుండు వర్ణము. సున్నగా నిరూపితము. సున్నయన, బొట్టన, అనుస్వారమన పర్యాయపదములు.

(అప్ప. II. 11.)

**అనేక కర్తృకక్రియ**

ఒక క్రియలోనికి అనేకకర్తలన్వయించుటయు జరుగును. అట్టిక్రియ అనేక కర్తృకక్రియ అని వ్యవహృతము.

అనేకకర్తలున్నప్పుడు, సమీపముగానున్న కర్త ననుసరించి మహత్వా మహత్వములను, ఏకత్వ బహుత్వములను క్రియాపదమునకు కల్గును.

''సర్వభూతంబులు దేవాసురులు వినాశగతులుకారె?'' (ప్రౌ. వ్యా. వాక్య 15.)

**అనేక మాఋలు**

కేవల సంస్కృత శబ్దమగు 'అనేక' అనునది 'మాఋలు' అను వికృతి శబ్దముతోడ సమసింపదు కావున నిది దుష్టసమాసము

(బా. వ్యా. సమా. 8)

**అనేక పద్భావి ద్విగుసమాసము.**

ఏకవచనాంతముగాని, సంఖ్యా పూర్వక మగు సమాసము. ముమ్మాఱు, ముత్రోవ, ముక్కన్ను ఏకవచనాంతములగు ద్విగుసమాసములు కాక, నలు దెసలు, ఐదురేకలు, అను బహువచనాంతములగు ద్విగుసమాసములును గలవు. (ఆం. కౌ. 612)

**అనేకాల్.**

పెక్కువర్ణములు కలది.

''అనేకాల్ శిత్సర్వస్య'' (పా. 11. 55) ఆదేశము అనేక వర్ణము (అనేకాల్) అగుచో అది సర్వాదేశమగును

తెచ్చు—తే (బా. వ్యా. క్రియా. 98)
ఉండు—ఉన్న (బా. వ్యా క్రియా. 57)
అను—నా (బా. వ్యా. క్రియా. 96)

ఇట ఆదేశములన్నియు అనేకాల్లులు కాబట్టి సర్వాదేశములు గానే వచ్చును. (రమణీ. 427)

**అనౌప విభక్తికము.**

విభక్తికి సమీపముగా వచ్చునది, ఉపవిభక్తి. ఉపవిభక్తి కలది ఔపవిభక్తికము. ఔపవిభక్తికము కానిది అనౌపవిభక్తికము. దేశ్యనామములు

(i) ఔపవిభక్తి కాంతములు, (2) అనౌపవిభక్తి కాంతములు.
అనిద్వివిధములు. (సం. వ్యా. విశే. 11)
(అప్ప. V. 128)

| | | |
|---|---|---|
| 'కల్లు' | (మద్యార్థమునందు) | అనౌప విభక్తికము. |
| | (ఱాయి అను నర్థమున) | ఔపవిభక్తికము |
| 'పల్లు' | (నిమ్నార్థమున) | అనౌపవిభక్తికము. |
| | (నోటిలోని పల్లు) | ఔపవిభక్తికము, |

**— అన్న**

రామన్న, తిక్కన్న
చూ. ఆర్యాంబాద్యర్థక శబ్దములు (i)

(సు. వ్యా. సంధి. 8.)

**అన్నంత క్రియ**

'అన్' ప్రత్యయము అంతమందుఁగల క్రియ
పోవు+అన్—పోవన్; చేయు+అన్—చేయన్

బాల వ్యాకరణము నుజీ ప్రత్యయాంత క్రియ అని వ్యవహరించినది. జీ ఇత్సంజ్ఞవలన పూర్వమందు ఉకారము అకారమగును. ఇది సాంకేతికపద్ధతి. సంస్కృత వ్యాకరణమున పాణిని పద్ధతి కాని ప్రౌఢవ్యాకర్త వివరణాత్మక, స్వతంత్ర పద్ధతి ననుసరించి యిట్టి సంజ్ఞ కావించెను.

(ప్రౌ. వ్యా. కారక. 12, క్రియా. 93)

**అన్నంతరూపము**

'అన్' అంతమందుగల క్రియారూపము. 'అన్' ప్రత్యయము పరమగునపుడు 'తిగుచు' ధాతువు 'తివ్వ' లేక 'తివ' అనురూపమును బొందును. ఇది 'తిగుచు' ధాతువుయొక్క అన్నంతరూపము.

"ఎవ్వరికిని మోపెట్టను దివ్వను శక్యంబుగాని దృఢకార్ముకము".

(భార. 1. VII. 25)

(ప్రౌ వ్యా క్రియా. 20)

**అన్నాదులు[1]**

అన్న, అయ్య, అమ్మ, ఎ, ఏ, మున్నగునవి. ఇవి ప్రార్థనార్థమునందన్నంత క్రియలపై చేరిన 'కద', 'కదవు'ల కను ప్రయుక్తమగును.

చెప్పఁగదన్న, చెప్పఁగదయ్య
చెప్పఁగదమ్మ, చెప్పగదవమ్మ
చెప్పఁగదవే, చెప్పఁగదె ఇత్యాదులు.

(ప్రౌ వ్యా. క్రియా. 9)

**అన్నాదులు[2]**

"శ్లేషార్థకశబ్దములగు 'అన్న' అయ్య, అక్క, అమ్మ, అప్ప, ఆయి, అవ్వ, అరుసు" ఇవి అన్నాదులు.

చూ.—ఆయి. (సు. వ్యా. సంధి. 8.)

**అన్ని ప్రభృతులు**

'అన్ని మున్నగు శబ్దములు. ఇవి సర్వనామములు.

అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు-పలు;
ఆ-ఈ-ఏ, నీ-నా-మన-తా;

సంఖ్యావాచకములు: అన్ని ప్రభృతులు.

(బా. వ్యా. ఆచ్ఛిక. 24)

**అన్ ప్రత్యయాంత క్రియ**

'అన్' అను ప్రత్యయము అంతమందుగల క్రియ. చూ. అన్నంతక్రియ.

ప్రార్థనార్థమునందు ఇట్టి 'అన్' ప్రత్యయాంతక్రియలపై 'కద' 'కదవు' పూర్వకముగా అన్నాదులనుప్రయుక్తములగును

ప్రోవఁగదన్న; ప్రోవగదయ్య!
ప్రోవఁగదవే! మున్నగునవి.

(ప్రౌ. వ్యా. క్రియా. 9)

**అన్యకార్యము**

వ్యాకరణముననుసరించి జరుగవలసిన కార్యముకన్న, భిన్నముగానయిన కార్యము.

హరి+హరి—హరీహరి
నిండి+నిండని—నిండీనిండని

దీర్ఘము అన్యకార్యము. (తె. వ్యా. వి. పుట. 419)

**అన్యక్రియ**

ఇతరక్రియ. వేఱొకక్రియ. దీనినే లక్ష్యక్రియ అందురు.
'చైత్రుఁడు వందనతిథి వచ్చెను'—
వచ్చుట లక్ష్యక్రియ. వందుట లక్షణక్రియ. (బా. వ్యా. క్రియా. 40)

**అన్యతరస్యామ్**

వ్యాకరణ కార్య మొకమాఱు సంభవించుట. మఱియొకమారు సంభవింపకుండుట అనుదానికి సంస్కృత వ్యాకరణమునందు 'వా', 'వికల్ప' 'విభాష' లేకాక 'అన్యతర 'స్యామ్' 'ఉభయథా, ఏకేషామ్' అనియు వ్యవహారముకలదు. (తె. వ్యా వి. పుట. 423)

**అన్యదేశ జాంధ్రములు**

ఇతరదేశమునందు పుట్టిన ఆంధ్రపదములు. ఆంధ్రులు, ఆయా ప్రదేశముల వారు వ్యవహరించు పదములు. వీనినే ఆధునికులు "మాండలికము" లని వ్యవహరింతురు (Dialects).

ఆలము, చివ్వ, కయ్యము, పోరు
పవరము, దురము మున్నగునవి. (అప్ప. I. 109)

**అన్యదేశ్య సమములు**

ఇతర దేశభాషలగు ఆంగ్లము మున్నగునవి సమానరూపముతో (ప్రకృతిలో నెట్టి మార్పును లేకుండా) తెనుగున వ్యవహరింపబడు పదములు.

రోడ్—రోడ్డు
డ్రైవర్—డ్రైవరు మున్నగునవి.

వీనినే నవీన తత్సమములనియు ననవగును.(చూ) (తె. వ్యా. వి. పుట. 358)

**అన్యదేశ్యములు**

దేశ్యములుగాని పదములన్యదేశ్యములు·

"తెలుఁగు విభక్తులు చేర్చి పలుకఁబడుచున్న ద్రావిడాది దేశముల మాటలు"— (గు. వ్యా. 82)

"తెనుఁగువారు అన్యదేశభాషను తమ భాషతోఁ గలిపి పలుకఁగా వాడుకపడినవి.

తావు, ఢాక, భళీ, మేను, మోవి, కౌను మొదలయినవి. (ప్ర వ్యా. సంజ్ఞా)

సంస్కృతము ప్రాంతీయ భాషకాక యావద్భారత భాష కావున వీనిని అన్య దేశ్యములుగా నెంచరు.

కెలసము, సాంబారు, ఖద్దరు, అసలు, మున్నగునవి.

**అన్యపదార్థ ప్రధానము**

సమాసమందలి పూర్వోత్తర పదార్థములు కాక, వేఱగు పదార్థము ప్రధానము గాఁగలది. చలివెలుగు = చల్లనికాంతి అనికాక, చల్లని కాంతిగల చంద్రుఁడని అర్థము.

'చలివెలుగు ఉదయించెను'—చలి ఉదయింపదు, వెలుఁగు ఉదయింపదు. ఈ రెండు పదార్థములను గాని చంద్రుఁడుదయించెను అని క్రియాన్వయము· ఇట్లే

వేఁడివెలుగు = సూర్యుఁడు

పులుఁగు పడగ = విష్ణువు (పక్షిధ్వజముగలవాడు)

నలువ = బ్రహ్మ (నాలుగు మోములు గలవాడు)

మచ్చెకంటి = (చేప (కన్నుల) వంటి కన్నులు కలది). స్త్రీ

అలరువిల్తుడు = (పువ్వులు విల్లుగా కలవాడు) మన్మథుఁడు.

వాతివాడి = (నోటిపదునుగలది) స్త్రీ, చేతలాడి (పనిచేయగలది) స్త్రీ (ఆం.భా.భూ. 116)

ఆంధ్రభాషాభూషణకర్త సంస్కృత సంప్రదాయానుసారము వీనినే బహువ్రీహి సమాసము లనకపోవుట గమనింపదగినది. ఇట్లే కర్మధారయాది సంజ్ఞలను అతడు వాడలేదు. ఆ భాషలోనే అవి అన్వర్థములు కావు.

"అన్యపదార్థ ప్రధానో బహువ్రీహిః (మహాభాష్య. పా. III 1.2)

**అన్యపూర్వకర్మము**

పూర్వము జరుగని దానిని చెప్పునది. అనగా ముందు జరుగబోవునది.

'అతడు గ్రామమును ప్రవేశించుచున్నాడు'-ఇంకను గ్రామమునందు ప్రవేశింప కున్నను ప్రవేశించుచున్నట్లు చెప్పుట. (తె.వ్యా.వి. పుట. 957)

**అన్యాదులు**

(అన్య+ఆదులు) అన్య, ఇతర, వేఱు మున్నగు అన్యార్థ వాచకములు మఱియు దూరము దగ్గఱ మున్నగు దిగ్వాచక శబ్దములు. ఇవి పరమగు

నపుడు పంచమీవిభక్తిలోకన్న కంటెయను ప్రత్యయములు వచ్చును ఉదా:- రామునికంటె ధీరుఁడన్యుఁడు లేడు. వనముకంటె దూరము మొ॥

(మం.ఆం.కౌ. 155, బా.వ్యా. కారక. 12)

చింతా. లో కంటె యను ప్రత్యయము మాత్రమే విధింపఁబడినది

(చూ:- చింతా. అజంత. 30)

**అన్యార్థకము**

ఇతరము. ఇట్టియర్థముగలశబ్దములతో సంబంధమన్నప్పుడు 'కంటె' వర్ణకము వచ్చును. ఘటము కంటెనన్యంబు పటంబు. (ప్ర.వ్యా. 270)

**అన్యార్థాది యోగము.**

'ఇతరము' అను నర్థముగల శబ్దములతోను, అట్టి మఱికొన్నిటితోను సంబంధమున్నపుడు కలుగునది. ఇట్టి పంచమ విభక్తి 'కంటె' వచ్చును.

'రాముని కంటె నన్యుండు ధానుష్కుండు లేడు ' ఇట్టిచో షష్ఠియు నగును-- 'రాముననన్యుండు ధానుష్కుండులేడు·' చూ. అన్వాదులు

(బా. వ్యా. కార. 12)

**అన్వంతము.**

అను+అంతము. అను శబ్దమంతమందుగల క్రియ. దీనినే ప్రౌ. వ్యా. అన్నంత క్రియ (చూ) అనెను. తిన్నగానిర్వహింపవలసిన క్రియ అన్వంత క్రియ యగునని ఆం. భా. భూ కర్త యిట్లు పేర్కొనెను.

'అకుటిల కర్తవ్య కార్య మన్వంత మగున్' (157)

తినను+ఏగెను—తిననేగెను.

వేడుకొనను+వచ్చె—వేడుకొనవచ్చె

**అన్వయము**

సంబంధము. పదములకుఁ బరస్పరము గల సంబంధము.

(ప్రౌ. వ్యా. వాక్య. 4)

'వాక్యమునందలి పదములకుఁగల పరస్పరసంబంధమని' - మఱి కొన్ని వ్యాకృతులు పేర్కొన్నవి. (సు. వ్యా. వాక్య 2,
సం. వ్యా. వాక్య. 11,
మ. ప. వ్యా. శబ్దాన్వయ. 8)

శబ్దములకుఁగల పరస్పర అనుగమనము (ఆశ్రయము, గ్రహణము) "శబ్దానామర్థాను గమనమ్".

**అనర్థకము**

అర్థమననుసరించినది. సంజ్ఞలు కొన్ని అన్వర్థకములు. కొన్ని కేవలము సాంకేతికములు.

సర్వనామము, సంఖ్య, అవ్యయము, ఉపసర్గ, కారకము మున్నగునవి. అన్వర్థ సంజ్ఞలు యోగ రూఢములు. (అన్వర్థ సంజ్ఞాత్వం యోగరూఢత్వమ్)

(తె. వ్యా. వి. పుట. 658)

**అన్వాచయ ద్వంద్వము**

ప్రధానముతోపాటు, అప్రధానమునుగూడ కలిపి చెప్పుట- అన్వాచయము.

'యత్రైకస్య ప్రాధాన్య మితర దప్రధానం తదను రోధేన అన్వాచీయ మానతా అన్వాచయః।

(న్యాస--పా. II. 2. 29)

సంస్కృతమున 'చ' కారమునకుగల నాలుగర్థములలో అన్వాచయార్థ మొకటి. (సముచ్చయ, ఇతరేతరయోగ, సమాహారములు. ఇవి ద్వంద్వసమాసభేదములు నగును. "భో! బిక్షామట, గాంచానయ''.

''బిచ్చమునకు పొమ్ము. గోవునుగూడ తెమ్ము.''-- అనుచో భిక్షయే ముఖ్యము. దీనితో పాటు లభించుపట్ల ఆవునుగూడ తేనగును. ఇది అముఖ్యము. ఇట్లు ముఖ్యాముఖ్యములును గలిపిచెప్పుట అన్వాచయము.

తెనుఁగు వ్యాకరణమునందు ఇంతటి విభాగము లేకున్నను, ఆంధ్రకౌముది యందిట్టి ద్వంద్వ సమాసభేదము నిరూపితము.'క్రియా ద్వంద్వసంబంధమును అన్వాచయ ద్వంద్వమని' పేర్కొనెను. 'అర్థమును గూర్పు ధర్మంబు నొనరింపు' అనుచో అర్థమును పోగుచేయుట ముఖ్యక్రియ. ధర్మము చేయుట అముఖ్యము. వీలున్న చేయవచ్చును

(ఆం. కౌ. 625. 26)

**అన్వాదులు**

'అను' మున్నగు ధాతువులు.

'అను, కను, కొను, తిను, మను, విను'—అనునాఱు ధాతువులే అన్వాదులు. ఇది నియత గణము. వీనికి 'చు' వర్ణకము పరమగునపుడు ఉత్వలోపము గాని 'ను' స్థానమున బిందువుగాని విభాషగా నగును.

అనుచు, అన్+చు—అన్చు— అంచు. (బా. వ్యా క్రియా. 55.)

**అన్వితము**

ఇతర పదములతో అన్వయము (చూ.) గలది. అనన్వితము (చూ.) కానిది. 'ఖంబు ఘటమునఁగలదు.' (ప్రౌ. వ్యా. వాక్య. 2)

**అపకర్ష**

సూత్ర సమన్వయము కొఱకు పరసూత్రము నుండి పూర్వ సూత్రము లోనికి పదమును లేక పదసముదాయమును తెచ్చుకొనుట. ఉదా:-

'అపిశబ్దార్థ స్యేతం' చింతా. సంధి 10) అను సూత్రములోనికి తరువాతి సూత్ర మగు 'చౌరేరు పధాత్మనశ్చలుగ్వాస్యాత్ (చింతా సంధి. 11) అను సూత్రము నుండి లుక్, వా అను పదము అపకర్ష కలిగి సూత్రార్థ ము సమన్వితమైనది.

(ఆం శా. సంధి. 10)

**అపత్యార్థకము**

అపత్యమనగా సంతానము. (చూ. తస్యాపత్యమ్ పా. IV. 1. 92) (కొడుకుగాని, కూఁతురుగాని, పౌత్రాదులుగాని కావచ్చును.) ఆ అర్థముగల పదము.

దశరథుని కుమారుఁడు—దాశరథి

గంగ కుమారుఁడు—గాంగేయుఁడు

పర్వత పుత్రి—పార్వతి

చూ. తద్ధిత, తత్సమ చంద్రిక. (ఆం.శా. సమా. 88)

**అపదము**

పదముకానిది. ఇది ప్రకృతియైనను, ప్రత్యయమైనను కావచ్చును. దీనినే శబ్దమన వచ్చును.

"అంద్వవగాగమంబులు తప్పన పదాది స్వరంబు పరంబగునపుడచ్చునకు సంధి యగు". (బా. వ్యా. సంధి. 11)

మూర+ఎఁడు మూరెఁడు. "ఎఁడు" అపదము. మానార్థక ప్రత్యయము.

**అపదాదిస్వర నిత్య సంధి**

అపదముల యొక్క ఆదిస్వరము పరమగుచో నిత్యముగా గల్గుసంధి.

గుణ+ఇయ్+ఇంచు—గుణియించు

గుణ+ఇంచు—గుణించు (గు.ప్ర. పుట. 889)

**అపదాది స్వరము**

పదముకానిది అపదము. అపదముయొక్క ఆదిస్వరము అపదాదిస్వరము.

—ఎఁడు; —ఇంచు

ఇది పరమగునపుఁడు సంధి నిత్యము.

మాన+ఎఁడు→మానెఁడు (బా.వ్యా. సంధి. 11)

**అపదాద్యము**

పదముయొక్క ఆద్యమునందు లేనట్టిది. ఇట్టి గకారము విభాషగా వకార మగును.

పలుగురు—పలువురు.

తొగ...తొవ

పగలు—పవలు

వ్యతిరేకము—పదాద్యము (చూ.) (బా.వ్యా. ఆచ్ఛిక. 27)

**అపభ్రంశకము**

'అపభ్రంశ' (చూ.) పదములతో కూడిన కావ్యము అపభ్రంశకము. దీనినే గ్రామ్యమనియు నందురనియు ఇది సంస్కార కావ్యమునకు భిన్నమైనదని ఇది హీనలక్షణ కావ్యమని అప్పకవి పేర్కొనెను. (అప్ప.I. 120,122)

**అపభ్రంశము**

బాగుగా పతితమైనది. సుశబ్దము అనగా నియమవంతమగు శబ్దము. నియమ రహితముగా బహురూపములతో వ్యవహృతమగునది. గోశబ్దము గావీ, గోణీ, గోతా గోపోతలికా అనురీతిని అపభ్రంశమైనది.

(చూ. గౌః ఇతస్య గావీ, గోణీ, గోతా, గోపోతలికా ఇత్యేవ మాదయః అప భ్రంశాః-మహాభాష్య.పా. I. 11)

అన్ని అపభ్రంశ శబ్దములకు సాధుశబ్దమే ప్రకృతియని సంస్కారిత వ్యాక రణ సంప్రదాయము. ''సర్వస్యహి అపభ్రంశస్య సాధురేవ ప్రకృతిః।

వాక్య. I. 149–వ్యాఖ్య.

2) అప్పకవి అపభ్రంశ మొక భాషాభేదమని అది సరస్వతీదేవి బాల్యదశలో మాట్లాడిన భాషయని అందుచే నది సుశబ్దమే యని పేర్కొనెను.

(అప్ప I: 72)

3) ''వెసన్ అపభ్రంశ మాభీర విషయజాతము" అనియు అప్పకవి వచించెను (అప్ప. I.73)

4) నాటకములలో ''పతిత, చండాల, యవనాది పరమనీచజాతి నరుల" సంభాషణముల కుపయుక్త మగు భాషాభేదమనియు నీతని యభిప్రాయము.

(అప్ప. I. 88)

**అపయః ప్రభృతులు**

(న + పయస్ + ప్రభృతులు) పయస్ మున్నగు శబ్దము లలో చేరని ఆయుస్, ధనుస్, శిరస్, తేజస్, ఓజస్, యశస్, మనస్ మున్నగు సకారాంత శబ్దములు తెనుగున తత్సమములుగా వచ్చు వీని అంత్య సకారమునకు లోపము వైకల్పికము, చింతా. హలంత9) లోప పక్షమున ము లేక వు వర్ణకము వచ్చి ఆయువు, ధనువు, శిరము, తేజము, ఓజము మున్నగు రూపము లేర్పడును. లోపము రానిపక్షమున ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్ (చింతా. హలంత. 3) అను సూత్రముచే ద్విత్వోత్వములు రాగా ఆయుస్సు, ధనుస్సు, శిరస్సు, తేజస్సు మొ॥ రూపము లేర్పడును. ఈ శబ్దములలో ఆయుః, ధనుః, శిరః మున్నగు ప్రథమైకవచన తుల్యరూపములే ప్రాతిపదికములుగా గ్రహింపఁబడినను విసర్గకు ద్విత్వము లేకపోవుటచే తత్స్థానియగు సకారమునకు ద్విత్వము వచ్చునని గ్రహింప వలెను. దీనికి సాంతాదపయః ప్రభృతేః స్లోప (చింతా. హలంత 9)అను సూత్రమే

ప్రమాణము (అహో. హలంత 10). పయః ప్రభృతి శబ్దములలో అంత్య సకార మునకు లోపములేదు కనుక పయస్సు, సరస్సు, అయస్సు ఇత్యాదిగా రూపము లుండును. చూ:- పయః ప్రభృతులు.

**అపవాదము**

విశేషవిధి. ఇది సామాన్య విధిని బాధించును.

ఉదా:- రంజ్+ఇంచు — రంజిల్లు (ద్విరుక్తలకారాదేశము)

రంజ్+ఇంచు=ఇంచు — రంజించు (మొదటి ఇంచుక్కునకు లోపము)

"లాదేశంబున కపవాదము—రంజించు" (బా వ్యా. క్రియా. 72)

**అపశబ్దము**

(1) లక్షణ విరుద్ధమగు శబ్దము. వ్యాకరణ నియమములచే నిరూపితము కాని శబ్దము. దీనికే మ్లేచ్ఛమనియు ప్రాచీనుల వ్యవహారము.

("మ్లేచ్ఛోహవా ఏషయదపశబ్దః-మహాభాష్య I.1.1)

2) కు సంధులు, వికృతరూపమును జెందిన యుక్తులు, గ్రామ్యోక్తులు, అపశబ్ద దోషములుగా పరిగణింపఁబడును (కవిజ V. 18)

లక్ష్యలక్షణములు రూఢిగాని పెఱవిరోధోక్తుల పశబ్ద సంజ్ఞికములు.

(ఛం. ద. IV-17)

నీవున్నజుఁడు (కవిజ. దుస్సంధి-V-21)

అంబుజపది (కవిజ. వైరిపదము V-22)

ముజ్జగద్వందితుఁడు (ఛం.ద. IV-24)

చెఱాకువిలు (ఛం ద. IV. 25 కాకుదోషము)

3) ప్రాచీనార్వాచీనాధునిక వ్యాకరణవిరుద్ధమైన దపశబ్ధ మనబడును) గ్రామ్యము వలెనే యిదియుఁ బ్రయోగార్హముగాదు.

వొస్తాడు, ఒత్తాడు, వెళ్ళిపోయ్యేస్తాను. మీరు చెప్పిరి, చిగురుకు (చివరకు) బోంచేస్తాడు మొదలైనవి. (అం భా శా. సంజ్ఞా. 78.

**అపాదాన కారకము**

ఎందుండి పాయునో అది అపాదానము. పండుచెట్టునుండి పడుచున్నది. ఇట పండు చెట్టునుండి వేఱుపడినదికాన చెట్టు అపాదానము. దీనికి పంచమీవిభక్తి వచ్చుట అపాదాన కారకము (చూ. అపాదానే పఞ్చమీ పా. II-3-28)

ఎడబాటు, భయము, మొదలగు వానికేది యవధియగునో దానికి 'వలనన్' వచ్చును. ఇదియే అపాదాన కారకము—

రాజ్యమువలన భ్రష్టుండయ్యె (అం శా. కారక. 89)

(ఆం.కౌ. 416 417)

**అపాదానము**

చూ. అపాదాన కారకము.

1) "ఒకచోటునుండి వేఱొకచోటి కరుగుట గానిపించిన నపాదానమగును.
(ఆం.కౌ. 459)

2) ఒక వస్తువునుండి మఱియొక వస్తువు విడిపోవునప్పుడు మొదటిది యపాదానం బనబడు.
(ల వ్యా విభక్తి 91)

**అపాదానర్థము**

అపాదానమును (చూ) తెలుపునట్టి అర్థము. భయము, జుగుప్స, ఎడబాటు మున్నగునవి అపాదానార్థములు "అపాదానార్థమునందు పంచమియును వచ్చును.
(ప్ర.వ్యా. 266)

'చెట్టువలనఁ బండుపడియె.' 'రాజు రాజ్యము వలన భ్రష్టుఁడయ్యెను'
(ల వ్యా. విభక్తి 91.)

**అపాయము**

విశ్లేషము, ఎడబాటు

'మైత్రుఁడు రాజ్యము వలన భ్రష్టుడయ్యె-ఇట్లు వలన వర్ణకము అపాయార్థము. నందు వచ్చును
(బా.వ్యా.కారక. 9)

**అపిశబ్దసంధి.**

'అపి' అనగా -'ఏని' అని అర్థము. హ్రస్వమైన ఇకారమునకు -'ఏని' పరమగుచో సంధి వికల్పముగా నగునని, ఇట్టి సంధికీ పేరును అప్పకవి పెట్టెను.
(అప్ప. V. 81)

ఉదా:- అహికుల స్వామియేని; సంధి కలుగు రూపమును అప్పకవి పేర్కొనలేదు.

**అపిశబ్దార్థ(క)ము**

'అపి' యనుదాని యర్థముగల (అపి శబ్దపర్యాయమగు) 'ఏని' శబ్దము. ఇందలి 'ఇ' కారమునకు లోపము వికల్పముగా వచ్చును.

ఉదా.- హరినేనబ్ధిజనేని, హరినేని యబ్ధిజనేని మొ॥

(చింతా. సంధి. 10)

**అపేక్షిత క్రియా విషయ అపాదనము.**

క్రియ స్పష్టపఱుపక, అపేక్షింపబడినట్టి యపాదానము. (చూ.)

ఉదా - ఎక్కడ నుండి తమరు? (కుతోభవాన్ ఆగచ్ఛతి,) (వచ్చుచున్నారు.)
(తె. వ్యా. వి పుట. 985.)

**అప్రేరణము.**

ప్రేరణార్థకము కానిది. స్వార్థక్రియ. రంజాదులకు ప్రేరణార్థమునందు

ఇంచు(క్) పరమగును. కాని స్వార్థమునందు బిందుపూర్వక చకారమునకు ద్విరుక్తలకార మాదేశమగును.

రంజించు (ప్రేరణము) రంజిల్లు (అప్రేరణము)
భాసించు ( ,, ) భాసిల్లు ,,

(బా. వ్యా. క్రియా. 71)

**అపోద్ధారము**

పైకెత్తుట, లేవనెత్తుట యని యర్థము. అక్షరమునుండి వర్ణములనుగాని, పదమునుండి ప్రకృతిగాని, ప్రత్యయమునుగాని; వాక్యమునుండి పదములనుగాని శాస్త్రప్రయోజనము కొఱకుసముద్ధరించుటను 'అపోద్ధారమ'ని భర్తృహరి వాక్యపదీయము (*II. 10*) నందుద్ఘాటింపఁబడెను.

(తె. వ్యా. వి. పుట 561)

**అప్పకవీయము**

కర్త: కాకునూరి అప్పకవి (చూ) ఆన్ధ్రశబ్ద చింతామణికి సవిస్తరమగునను వాదమును, అనేక లక్ష్యములతోఁజేకూర్చ నాశించి, అప్పకవి (1) భాషా పరిచ్ఛేదము (2) వర్ణపరిచ్ఛేదము (3) వళి, ప్రాస పరిచ్ఛేదము (4) పద పరిచ్ఛేదము (5) సంధి పరిచ్ఛేదము (6) తత్సమపరిచ్ఛేదము (7) దేశ్య పరిచ్ఛేదము (8) క్రియా పరిచ్ఛేదము అను విభాగములను గావించుకొని, యిందు పంచపరిచ్ఛేదములను పూర్తి చేసెను.

వ్యాకరణాంశములకన్న ఛందోవిస్తృతియే యిందధికము. బ్రహ్మశ్రీ వేదుల రామశాస్త్రి గారు, శ్రీ రావూరి దొరస్వామి శర్మ గారు దీనికి వ్యాఖ్యానములను వివరించిరి. శ్రీ గిడుగు రామమూర్తిగారి విపుల పీఠికతో నిది వావిళ్లవారిచే ముద్రింపఁబడెను. విశేషముగా పఠన పాఠనములందున్న లక్షణ గ్రంథమిది.

**—అప్ప**

గౌరవార్థము సంజ్ఞావాచకములకుఁ జేరు శబ్దము. ఇది కన్నడభాషనుండి తెలుగునందలి యొకానొక మాండలికములోఁ బ్రవేశించెను.

చూ. ఆర్యాంబాద్యర్థక శబ్దములు.

(ప్రౌ. వ్యా. సంధి. 1. సు. వ్యా. సంధి. 8.)

**అప్పకవి కాకునూరి**

క్రీ. శ. 1656. సుప్రసిద్ధ లాక్షణికుఁడు. ఇతని గ్రంథమునకు 'అప్పకవీయము' (చూ.) అనుప్రఖ్యాత వ్యవహారము కలదు.

ఆంధ్ర శబ్ద చింతామణి కనువాదముగాఁ బ్రారంభమైన ఈ గ్రంథము పంచాశ్వాసములతోనే సమసెను. ఇందు విశేషముగా ఛందస్సునకు సంబంధించిన యంశములేగలవు.

'ఉత్తముఁడు లక్ష్యలక్షణ వృత్తవేది' — ఈతఁడట్టివాడే. నలువది మూఁడు పూర్వలక్షణ గ్రంథములనితఁడు పేర్కొనెను. సుమారు నూఱు కావ్యములనుండి సుమారు మూడునూర్ల లక్ష్యముల నీతఁడుదాహరించెను.

**అప్పకవీయ భావప్రకాశిక**

శ్రీ రావూరి దొరస్వామి గారిచే అప్పకవీయమునకు విరచితమైన వ్యాఖ్యాన గ్రంథము.

**అప్పకవీయ వివరణము**

అప్పకవీయములోని తృతీయాశ్వాసమునకీ వివరణమును సుప్రసిద్ధ పండిత వరేణ్యులు కీ. శే. వేదుల రామశాస్త్రి గారు రచించిరి.

వీరు కొవ్వూరు సంస్కృత కళాశాలలో అధ్యాపకులుగా నుండినవారు.

ఇది విశేషముగా యతి, ప్రాసలకు సంబంధించినదే యయినను, తెనుఁగున యతి ప్రాసలు అనేక వ్యాకరణాంశములపై యాధారపడి యుండుటచే పరిశీలనార్హము.

**అప్పాదులు[1]**

అప్పు, ఒజ్జ, ఒప్పు. దట్టు, దీవ పాట, మున్నగునవి. వీనికి న(జి) అను కృత్ప్రత్యయము చేరగా అప్పన్న, ఒజ్జన, ఒప్పన, గడన, దట్టన, దీవన, పాటన, మున్నగు కృదంత రూపములేర్పడును. (బా. వ్యా. కృదన్త. 18)

**అప్పాదులు[2]**

అప్పు, ఒప్పు, పల్లము, కోపము—ఇవి మాత్రమే అప్పాదులు. (నియతగణము) వీని క్రియా రూపము లేర్పడునపుడు ఇంచుగాగమము చేరును. "ఇంచుక్" పరమగు 'గు' గాగమము విభాషగా వచ్చును.

అప్పు < గ్+ఇంచు అప్పగించు
+ఇంచు అప్పించు

ఒప్పు < గ్+ఇంచు ఒప్పగించు
+ఇంచు ఒప్పించు

(బా. వ్యా. క్రియా. 79)

**అప్పు డిప్పు డెప్పుడు శబ్దములు**

ఇవి నిత్యైక వచనాంతములు, కళలు ప్రథమావిభక్తి యందుండును. వీనికి పరుష ములు పరమగునపుడు గ,స,డ,ద,వ, లు బహుళముగా నగును.

అప్పుడు+చనియె < అపుడు సనియె
అపుడు చనియె

(బా.వ్యా. సంధి. 13)

**అప్రధానము**

ప్రధానమనఁగా ముఖ్యము. అప్రధానమనగా ముఖ్యముకానిది. (చూ) ఉపసర్జనము విశేష్యము ప్రధానము. ఇతర మప్రధానము. అనఁగా విశేషణాదులు. (ప్రౌ.వ్యా శబ్ద. 6)

**అప్రధాన వచనము**

సంస్కృతమునందు వచనము కేవలము నామములకేకాక, విశేషణములకు క్రియా పదములకును గలదు. నామేతరములకుఁ గల వచనమును 'అప్రధాన వచన' మందురు (Secondary number) (తె.వ్యా.వి. పుట. 604)

**అప్రవృత్తి**

'ప్రవృత్తి' (చూ.) కానిది.

వ్యాకరణ కార్యము సంభవింపకుండ నుండుట. 'బహుళ' (చూ ) సంజ్ఞలో నిది యొక యంశము.

హ్రస్వమైన అకారమునకు సంధి బహుళముగానగు ననుచో నొకపరి సంధి నిత్య ముగను, మఱియొకపరి వికల్పముగను; ఇంకొకపరి యసలు సంధి ప్రవర్తిల్లకుండ నుండు టయు సంభవించును. ఇట్లు ప్రవర్తిల్లకుండ నుండుటే 'యప్రవృత్తి'.

వెల + ఆలు — వెలయాలు. (బా.వ్యా. సంధి. 4)

**అప్రసిద్ధ శబ్దములు**

లోక వ్యవహారమునందు సుప్రసిద్ధములు గాని శబ్దములు. వీనినే మాఱుమూల శబ్దములందురు. 'పేచ' 'ఊష' మున్నగునవి సంస్కృత వ్యాకరణము లందు సిద్ధములేకాని లోకమునందు ప్రసిద్ధములుగావు. ఆ భాషలో నట్టి వాని నుపయోగింపవచ్చును గాని, తెనుఁగు నందు సంకేతిత సుప్రసిద్ధ పదములనే యుపయోగింపవలయునను కట్టడి కలదు.

(అప్ప I. 126)

**అప్రాగభావార్థము**

పూర్వములేనిదానికి వ్యతిరేకమైనది. అనగా ప్రస్తుతము లేనిది.
ఇట్టి యర్థమునందు-'అదు' అను శబ్దము ధాతువునకుఁ జేరును.
ఇప్పుడు కుజము నెగడదు.
మదకరి బెగడదు. (ఆం కౌ. 705, 706)

**అప్రాణికా దంతములు**

హ్రస్వమైన అకార మంతమందుఁగల ప్రాణములేని వానిని దెలుపు శబ్దములు.

ఇట్టి శబ్దములపై గల తృతీయా విభక్తికి, పంచమీ విభక్తికి, సప్తమీ విభక్తి మాఱుగా ద్వితీయా విభక్తి నుపయోగింపవచ్చును

బాహూలతంగట్టె — లతతోనని యర్థము
లతను జిగురు దుంచిరి — లతనుండియని యర్థము
లతను విరుల్ పుట్టె — లతయందని యర్థము (ఆం.కౌ. 856-58)

**అప్రాణి వాచకో దంతములు**

హ్రస్వమగు ఉకారము అంతమందుఁగల ప్రాణములేని వానిని దెలుపు శబ్దములు.
ఇట్టి యచ్చ తెనుఁగు శబ్దములపైఁగల తృతీయా సప్తమీ విభక్తులకు మారుగా 'నన్' వచ్చును.

కొంగునన్ విసరె—కొంగుతోనని యర్థము తృతీయ

కొమ్మనన్నిచ్చె—కొమ్మనందని సప్తమీ

(ఆం.కౌ. 350-352)

**అప్రాప్త విభాష**

త్రివిధములగు విభాషలలో (చూ.) నొకటి. ఏ సూత్రము చేతను ప్రాప్తిలేని కార్యమును వికల్పముగా విధించునది 'అప్రాప్త విభాష'.

"ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు" (బా.వ్యా. సంధి. 17) అను సూత్రము చేతనేగాని తదితర సూత్రము దేని చేతను బిందు సంశ్లేషములు ప్రాప్తములు గావు. అప్రాప్తమగు కార్యమును ఈ సూత్రము వికల్పముగా విధించుచున్నది. కావుననిది 'అప్రాప్త విభాష'.

(రమణీ. పుట 66)

**అప్యర్థము**

అపి+అర్థము—'కూడ' అని యర్థము

కొట్టినన్, తిట్టినన్,—కొట్టినప్పటికిని, తిట్టినప్పటికిని-అని యర్థము. ఇట-ఇనన్ ప్రత్యయము అప్యర్థమునందు పయుక్తము.

(తె.వ్యా.వి. పుట. 774)

**అబ్బురాదులు**

'అబ్బుర' మున్నగు శబ్దములు.

అబ్బురము, కప్పురము, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు చప్పుడు, నెత్తురు, మున్నగునవి. ఇది ఆకృతి గుణము. ఇందలి ఉత్వము విభాషగా లోపించును.

అబ్బురము—అబ్రము

కప్పురము—కప్రము

అప్పుడు—అప్డు మెదలైనవి. (బా. వ్యా. ప్రకీ. 19)

**అభావ క్రియలు**

వస్తువు యొక్క లేకుండుటను దెలుపు క్రియలు. ఇవి భావక్రియలను (చూ.) వ్యంజింపఁజేయును.

వాఁడు రాఁడేని వీఁడు రాఁడు—అనఁగా వాఁడు వచ్చునేని వీఁడు వచ్చునని యర్థము (ప్రౌ. వ్యా వాక్య. 9—తత్త్వ. పుట. 358)

**అభావ విశిష్ట వాచక విశేషణములు**

గుణాదులయొక్క లోపమును దెల్పునట్టి కొన్ని ప్రత్యేక శబ్దములు. ఇవి విశేషణములు.

నిర్గుణుఁడు, ఆస్థిరుఁడు
మందబుద్ధి, అపత్యము
అప్రాజ్ఞుడు, నిర్మోహము (ఆం. భా. శా. విశే. 8)

**అభివ్యక్తవాదులు**

వైయాకరణు లభివ్యక్త వాదులు అనఁగా శ్రవణేంద్రియ గోచరమగు వర్ణపద వాక్యములు కాక, దానిచే నభివ్యక్తమగు బుద్ధినిష్ఠమగు శబ్దము నిత్యము, అఖండము, అవికారము, అచలము, అనశ్వరమునైనదని భావించువారు.

(తె.వ్యా.వి. 71.4)

**అభివ్యాపకము**

అంతట వ్యాపించుట.

ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకమను త్రివిధములగు నాధారములలో నొకటి. చూ. అభివ్యాపకాధి కరణము.

నువ్వులయందు నూనెగలదు. అన్నింటియందీశ్వరుఁడు గలఁడు.

(ఆం.కౌ. 468; బా.వ్యా. కారక 17, సూత్రవృత్తి)

**అభివ్యాపకాధికరణము**

ఆధారము నందంతటను నిండియుండుటను దెల్పుకారకము ఈ యర్థమునందు 'అందు' అను సప్తమీ విభక్తి యుపయుక్తము.

ఔపశ్లేషిక, వైషయికాధి కరణములకన్న నీయధికరణ మతి ముఖ్యము. ఇందాధారాధేయములు సమవాయ సంబంధముతో నుండును

తిలలందు తైలము కలదు. అన్నిటియందీశ్వరుఁడు కలఁడు.

(తె. వ్యా వి. పుట. 1008)

**అభిహితకర్త**

ఆఖ్యాతాదులచేత తెలియఁజేయఁబడినకర్త.

**రాముఁడు** మిథిలను గనియెను.

ఇందు క్రియావిభక్తి (ఆఖ్యాతము) కర్తను దెలియఁజేయునుగాన తద్వాచక మగు రామశబ్దము అభిహిత కర్త యగును. అది ప్రథమావిభక్తిలో నుండును.

**అభిహిత కర్మము**

ఆఖ్యాతాదులచేఁ దెలియఁ జేయఁబడిన కర్మము.

యజ్ఞదత్తునిచేఁ జాఁప వడి నల్లఁబడుచున్నది. (ఆం.కౌ 442,448)

**అభిధాశక్తి**

సంకేతితార్థమును స్ఫురింపఁజేయు శక్తి. అభిధ, లక్షణ, వ్యంజన—యను త్రివిధ శబ్దశక్తులలో నొకటి గోడ. బల్ల, ఇల్లు (తె.వ్యా.వి. పుట. 1030)

**అభిధేయత్వము**

చెప్పఁబడుట, పేర్కొనఁబడుట, అభిధేయత్వము, ఇంద్రియగోచరత్వమనునవి పదార్థముల ముఖ్యధర్మములు. (తె.వ్యా.వి. పుట. 574)

**అభేదాన్వయము**

ఒకటిగాదెంచుట.

విశేషణ విశేష్యములకు లింగ, వచన, విభక్తుల యందభేదాన్వయమును సంస్కృత వ్యాకర్తలు పేర్కొనిరి. తెనుఁగు వ్యాకర్తలు కొందఱీ నియమమును నిరూపించిరి.

నీలమ్ ఉత్పలమ్—అనఁగా 'నీలాభిన్నముత్పలమ'ని వ్యాకర్తలందురు.

**అభ్యాగతి**

అభి+ఆగతి—దగ్గఱకు వచ్చుట.

ఇట్టియర్థమునిచ్చు 'అరుగు' మున్నగు ధాతువులకు (చూ. అరుగ్వాదులు) - తెంచుధాతు వనుప్రయుక్తమగును. అప్పుడు గువర్ణము విభాషనులోపించును

అరుగు+తెంచు < అరుగుదెంచు / అరుదెంచు

(బా. వ్యా. క్రియా. 111)

అమ్: సంస్కృతమున ద్వితీయైకవచన ప్రత్యయము. ఉదా:- రామమ్ (రామ+అమ్), హరిమ్ (హరి+అమ్) మొ॥ తెనుఁగున మహద్వాచకశబ్దములపై వచ్చు అమ్ ప్రత్యయ స్థానమున 'ని' అనునదియు, అమహద్వాచకములపై వచ్చు అమ్ ప్రత్యయ స్థానమున 'ను' అనునదియు ఆదేశమగును. ఉదా:- రామునిన్, వనమును మొ॥ (అథ. కా. అజన్త 18)

**అమలిన భాషావాదులు**

అన్యభాషా పదములచే భాషమలినమగునని, అట్లు కారాదని, అన్యభాషా పదములను బహిష్కరించువారు.

అన్యభాషా పదములకు తుల్యార్థములగు స్వభాషపదములను గల్పించుకొన వలయునేగాని, వానినే యథాతథముగా వాడరాదను ఆగ్రహము గలవారు.

తమిళులిట్టివారుగా గోచరింతురు.

సంధి—పుణర్చి

సమాసము—తొకై (గై)

అక్షరము—ఎఴుత్తు

ఈరీతిని స్వభాషా సంజ్ఞలను తమిళులు కల్పింతురేగాని తెలుఁగు వారివలె సంస్కృత వ్యాకరణ సంజ్ఞలనే యథాతథముగా వాడరు.

(తె. వ్యా. వి. పుట. 352)

**అమహత్కార్యము**

అమహద్వాచకములకు, వాని విశేషణములకును అగునట్టి వ్యాకరణ కార్యము.

కొన్నియెడల మహద్విశేషణ సంఖ్యావాచకముల కమహత్కార్యము కలుగును.

''అసురు లఱువదివేలు.''—అసురు లఱువదివేల మంది యని మహత్సంఖ్యావాచక విశేషణమునకు మారుగా అమహత్సంఖ్యావాచక ముపయుక్తము.

**అమహత్తులు**

మహత్తులుకానివి: అనఁగా (i) స్త్రీవాచకములు, (ii) పశువాచకములు, (iii) పక్షివాచకములు, (iv) జడవాచకములు, వాని విశేషణములు తెలుఁగున అమహత్తు లనఁబడును.

(i) సీత పాడినది.

(ii) ఆవు తెల్లనిది.

(iii) పక్షి వ్రాలినది.

(iv) వృక్షమున్నతము,

(చింతా. అజంత. 9, 10)

(బా. వ్యా. క్రియా. 12)

**అమహద్వాచకములు**

మహద్వాచకములు కాని శబ్దములు. చూ. అమహత్తులు.

**అమహద్విశేష్యకము**

అమహద్వాచకము విశేష్యముగాఁగలది.

డెబ్బదియొక్క రథము—'డెబ్బదియొక్క' అను సంఖ్యావిశేషణము 'రథము' అను అమహద్వాచకమును విశేష్యముగాఁగల్గినది. అందుచేనది **అమహ** ద్విశేష్యకము.

(ప్రౌ. వ్యా. శబ్ద. 4)

**అమహద్ద్వంద్వము**

పూర్వోత్తర పదములు రెండును అమహద్వాచకములయిన ద్వంద్వసమాసము. ఇది ఏకవచనాంతము నగును.

కూడు గుడ్డ, రేవగలు,

తాఁకు దాగులు

(ప్రౌ. వ్యా. సమాస. 80)

**అమాదులు**[1]:- (అమ్+ఆదులు) సంస్కృత వ్యాకరణమున 'అమ్' అనునది ద్వితీయైక వచన ప్రత్యయము. అమాదులనగా ద్వితీయాది విభక్తులని భావము.

(అథ. కా. అజన్త. 86)

**అమాదులు**[2]:- (అమ్+ఆదులు) ద్వితీయావిభక్త్యేక వచనము మున్నగు నేకవచన ప్రత్యయములు. (వై. చం. అజంత 67)

**—అమి**

లేకుండుటను దెలుపు ప్రత్యయము.

విను+అమి—వినమి.

తిను+అమి—తినమి.

(ఆం. భా. భూ. 166; ఆం. కౌ. 791—,92)

(మం: ఆం. కౌ. (క్రియా) 422)

**—అము**

మతుబర్థము నందు వచ్చు తద్ధిత ప్రత్యయము.

పెండ్లి+అము—పెండ్లము.

(బా. వ్యా. తద్ధిత. 28)

**అమూర్త నామములు**

ఆకృతి లేని వస్తువులను దెల్పు పదములు. గాలి, వాసన, మున్నగునవి. వీనినే యాంగ్లమునందు abstract nouns అందురు.

(తె. వ్యా. వి. పుట. 324)

**—అమ్మ**

స్త్ర్యర్థము నందుఁజేరు శబ్దము. (చూ.) ఆర్యాంబాద్యర్థక శబ్దములు. (i) సీతమ్మ, రామమ్మ, లక్ష్మమ్మ. (ప్రౌ. వ్యా. సంధి. 1)

**అమ్మాక్కాదులు**

(అమ్మ+అక్క+ఆదులు) అమ్మ, అక్క, మామ మున్నగు శబ్దములు. దయావాచకత్వార్థమున వీనికిఁబరముగా అణ్ణి, అల్ల మున్నగు పదములు వచ్చును. ఉదా॰- అమ్మణ్ణి, అమ్మల్లి, అక్కల్ల మొ॥ (మం. ఆం కౌ. 393)

**అమ్మాదులు**

—అమ్మ,—అయ్య, ఎ,-ఏ—ఒ,—ఓ—ఒకో మొదలగు శబ్దములు.

(ప్రౌ.వ్యా. శబ్ద. 44; ఆం. భా. శా. క్రియ. 120)

అమ్మాదులు పరమగుచో పూర్వాచ్చునకు సంధి నిత్యము.

చంద్రమ్మ, లచ్చన్న. (కవిజనాం. పత్రం 87.)

**అయవాయావల్**

'అయ్, అవ్, ఆయ్, ఆవ్, అనునవి.

సంస్కృతమునందు ఏ. ఓ ఐ, ఔ, లకు అచ్చుపరమగునపుడవి'అయ్, అవ్ ఆయ్, ఆవ్ లు క్రమముగా నగును.

నే+అన—నయన

పో+అన—పవన

నై+అక—నాయక

పౌ+అక—పావక

(ఛం. ద. IV. 44)

**అయాంతము**

యకారమంతమందు లేని ధాతువు. ఇట్టి ధాతువున కించుగాగమము పరమగుచో ఇయుడాగమము వికల్పముగా గల్గును ('ఇయుట్'లో 'ఉట్' లోపించగా 'ఇయ్' మిగులును).

వ్యయ—ఇది యాంతము
భుజ్—ఇది అయాంతము
భుజ్+ఇయ్+ఇంచు→భుజియించు, భుజించు

(బా వ్యా. క్రియా. 50)

**—అయి[1]**

ఆమ్రేడితమైన తదర్థకమగు 'ఆ' కారమునకు—అయి యను శబ్దము విభాషగా ఆదేశమగును.

ఆ+ఆ+కాలము (ఆమ్రేడితము)
ఆ+అయి+కాలము
ఆయయికాలము
అయ్యయి కాలము (త్రికసంధి) (బా.వ్యా. సమాస. 21)

**—ఆయి[2]**

వికృతి శబ్దము లందలి 'ఐ' వర్ణమునకు వికల్పముగా వచ్చు ఆదేశము ఉదా:- చెలువయి, చెలువై (చింతా. అజన్త. 65) 'వాయిరవుర్వ్యకతమౌ' అను చింతామణి సూత్రమునకు అయి, అవులు ఐ, ఔలుగా మాఱుననియు వ్యాఖ్యానించుటకు వీలుండుట చేతను, ఉదాహరణమునందలి పరిణామ క్రమమునుఁబట్టి అయి, అవులే వక్రతమములుగా మాఱినట్లు కనిపించుట చేతను ఆధునికాంధ్ర వ్యాకర్తలు అయి అవులే వక్రతమములుగా మారునని భావించినారు. చూ:- అయిక్.

**అయిక్**

ఐ, ఔ లకు వక్రతమములని సంజ్ఞ (చూ.) ఐ కారమునకు అయి (క్), ఔకారమునకు అవు (క్) వికల్పముగా ఆదేశమగును.

ఐన=అయిన
ఔర = అవుర (అప్ప. II. 110, 111)

**'అయి' పదానుప్రయోగము**

భవత్యర్థకమగు 'అయి' అను శబ్దమును జేర్చి ప్రయోగించుట అగు మున్నగు వానిలో నొకటి.

విశేషణములు పెక్కులున్నపుడు 'అయి' తొలి విశేషణమున కనుప్రయుక్త మగును.

అతులుఁడయి, అప్రమేయుఁడౌ హరిని గొల్తు.

(బా.వ్యా. కారక. 29)

**అయి కాన్ అవ్యయములు**

'అయి' 'కాన్' అను నవ్యయములు స్వయమర్థకములు. అనఁగా వేఱొకరి ప్రేరణ ప్రమేయములు లేక తనంతట తానే యను నర్థము.

వాఁడయి వచ్చెను. (వానియంతట వాడు)

వాఁడుగా వచ్చెను. ( ,, ,, )

(ప్రౌ.వ్యా. క్రియా. 32)

**అయుగాగమము**

'అయు(క్)' అను ఆగమము. ఇది కిత్తు. 'ఉక్' లోపించి 'అయ్' మిగులును. ఇది అంతమందుఁ జేరును.

ఇకారాంత ధాతువులకు 'ఇంచు (క్)' పరమగునపుడు 'అయు(క్)' అగును.

జి+ఇంచు (క్)

జి+అయ్+ఇంచు—జయించు

నీ+ఇంచు(క్)

నీ+అయ్+ఇంచు—నయించు

(జి+అయ్—జయ్—అపదాదిస్వర సంధి) 'నిర్జి' ధాతువునకు నామధాతువుల కీయాగమము కలుగదు. (బా.వ్యా. క్రియా. 64)

**—అయ్య**

శ్రేష్ఠతావాచకము. ఇది పరమగునపుడన్ని యచ్చులకును సంధి నిత్యము.

చూ. ఆర్యాంబాద్యర్థక శబ్దములు

రామ+అయ్య—రామయ్య

సామి+అయ్య—సామయ్య

(ప్రౌ.వ్యా. సంధి 1; సు.వ్యా. సంధి. 8)

**—అర[1]**

దేవ శబ్దముపై స్వార్థమునవచ్చు తద్ధితప్రత్యయము.

ఉదా:- దేవర. (వై.చం తద్ధిత. 9)

**—అర[2]**

పరమపదించిన వారిని పితృశబ్దమందలి 'ఋ' వర్ణమునకు వచ్చు ఆదేశము. ఉదా:- పెతర (వై.చం. పేజీ 115). పెతర యనునది పితృశబ్దమునకు తద్భవ రూపము.

—అర³

పితృశబ్దము నందలి ఋ వర్ణమునకు విభక్తి పరమగునపుడు వచ్చు ఆదేశము. (వై. చం. అజంత. 74) ఉదా:- పితరుఁడు, 'పితరులు'. సుతుఁడును బితరుఁడు నాండొరులతోడఁ బెనగెడుచో (విజ్ఞానేశ్వరీయము)

**అరమరాదులు**

అరమర, ఆము, అల్లిబిల్లి, నడవడి మున్నగునవి. ఇది ఆకృతి గణము.
వీనికి స్వార్థమునందు 'ఇక' అను తద్ధిత ప్రత్యయము చేరును.
అరమరిక, ఆమిక, అల్లిబిల్లిక, నడవడికవంటి రూపము లేర్పడును.
'అరమర' యన్నను, అరమరిక యన్నను అర్థమొక్కటియే.

(బా.వ్యా. తద్ధిత 9)

**అరవంకలు**

'వక్రములు' అను శబ్దమునకు 'వంకలు' తద్భవము. ఎ,ఏ,ఒ,ఓ వక్రములు-అనఁగా వంకలు. ఎ,ఒ, లు హ్రస్వవక్రములు-అనఁగా అరవంకలు ఇవి సంస్కృతము నందు లేవు.

(అప్ప. II. 122, 123)

**అరసున్న**

పూర్ణబిందువును /0/ నిలువున రెండు భాగములుగాఁ జేసిన ఏర్పడు తొలి సగము /c/. దీనికే హ్రస్వబిందువనియు ఖండబిందువనియు అర్ధబిందువనియు వ్యవహారము.

ఇది శాసనములలోఁగాని తాటియాకు ప్రతులలోఁగాని కానరాదు.
ముద్రణ యంత్రముతో పాటుగా నిది వాడుకలోనికి వచ్చినది.

చీఁకటి, ఆఁకలి, వీఁపు (అప్ప. II. 22)

**అరి**

ఇది తద్ధిత ప్రత్యయము. మతుబర్థము (కలవాడు / కలది) నందు 'జాల' మున్నగు శబ్దములకిది చేరును·

జాలరి+అరి—జాలరి

ఒఱపు+అరి—ఒఱపరి—ఇట్లే చదువరి, జూదరి, టక్కరి, తెంపరి, మున్నగు నవి. (బా.వ్యా. తద్ధిత. 17, ఆం.కౌ. 649, 50)

ముండరి, తుంటరి, కల్లరి మున్నగు రూపములందు అథమ కార్యములం‌దెలుపు నట్టి యర్థమీ ప్రత్యయమునకుఁ గలదని ఆం.భా.భూ. (165ప.) కా.చూ.( IX 148ప.)

**అరి²**

ఇది తద్ధిత ప్రత్యయము. మతుబర్థమునందిది పరమగుచో 'పూజ' శబ్దముకడ యచ్చునకు వైకల్పికముగను, 'సౌన్న' శబ్దమునకు నిత్యముగాను దీర్ఘమగును.

పూజ+అరి— పూజారి, పూజరి

సౌన్న+అరి—సౌన్నారి (ప్రౌ.వ్యా. తద్ధిత. 8)

**–అరిమ్**

మతుప్ప్రత్యయ స్థానమునవచ్చు ఆదేశము. ఇందలి మకారమిత్సంజ్ఞికమై లోపింపఁగా 'అరి' అని మిగులును ఉదా:- సుంకరి, నేతరి మొ॥ (వై.చం. తద్ధిత1.) బాలవ్యాకరణాదులందు మతుబర్థమున అరివర్ణకాదులు విధింపఁబడఁగా వై.చం యందు అరిమ్ మున్నగునవి మతుప్-ప్రత్యయమున కాదేశములుగా విధింపఁబడి నవి.

**అరిసమాసము**

విరుద్ధ సమాసము వ్యాకరణ నియమములకు వ్యతిరేకముగా నేర్పడిన సమాసము

దినకర కొడుకు, అనిమిషమొదవు

అనేకమార్లు, అప్పదండు మున్నగునవి. (తె.వ్యా.వి. పుట. 915)

**అరు**

తచ్ఛబ్దాంతములగు ధాతుజ విశేషణముల మీద— అరు శబ్దము చూపట్టదు. చూచినవారు—చూచినారు—చూచినారరు అనికాదు. ఇట్లే మొట్టినారరు, కొట్టి నారరను రూపము లుండవు. (ప్రౌ.వ్యా, కారక.17)

**అరుక్**

పొద, బొమ్మయను శబ్దములకు ఇల్లు శబ్దము పరమగునపుడు వచ్చు ఆగమము (వై.చం. సంధి. 4) ఇందలి కకారమిత్సంజ్ఞకము. ఉదా:- పొదరిల్లు (పొద+అరు +ఇల్లు) బొమ్మరిల్లు (బొమ్మ+అరు+ఇల్లు)

**అరుగాగమము**

అరు (క్)+ఆగమము

ఋకారాంత ధాతువులకు ఇంచు (క్) పరమగునపుడు అరు(క్) (ఇందు'ఉక్' లోపించును) ధాతువుయొక్క అంతమందు చేరును. తత్సమ క్రియారూప సాధ నము నందిది యొక విధము.

ధృ+ఇంచుక్

ధృ+అర్+ఇంచు—ధరించు

తృా+ఇంచు (క్)

తృా+అర్+ఇంచు—తరించు

(బా. వ్యా. క్రియా. 64)

**అరుగ్వాదులు**

'అరుగు' మున్నగు ధాతువులు—అరుగు, ఏగు, చను, ఇత్యాదులు. వీనికి 'తెంచు' అను ధాతువు అనుప్రయుక్తమగునపుడు తుది 'గు' వర్ణము విభాషగా లోపించును

అరుగు + తెంచు < అరుదెంచు / అరుగుదెంచు

ఏగు + తెంచు < ఏతెంచు / ఏగుతెంచు

(బా.వ్యా. క్రియా. 111)

**అరుసు**

'రాజు' శబ్దభవము

ఇది గౌరవ సూచకముగా కొన్ని నామముల కంతమందుఁజేరును.

తిమ్మరుసు

(చూ) ఆర్యాంబాద్యర్థక శబ్దములు

(సు.వ్యా. సంధి. 8)

**అర్ఘాదులు**

అర్ఘ, ధర్మ, వర్గ శబ్దములు. ఇది నియత గణము. వీని అత్వమునకుత్వము 'వు' వర్ణకము వైకల్పికముగాఁ జేరును.

పక్షమున 'ము' వర్ణకము

అర్ఘ < అర్ఘువు / అర్ఘము

ధర్మ < ధర్మువు / ధర్మము

(చూ.) ధర్మాది శబ్దములు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 25)

**అర్ణము**

వర్ణము, అక్షరము అనువానికిది పర్యాయపదము.

(ఛం. ద. IV. 129)

**అర్థ బిందువు**

చూ. అరసున్న

(అప్ప. II. 29, 34, 62)

**అర్థత్రయము**

వర్తమాన, భూత, భవిష్యదర్థములు. వ్యతిరేకక్రియ ఈ మూఁడర్థములను బోధించును.

1. వర్తమానము : పొఱడులేచి దిక్కులకు

(పొఱుచున్నవాఁడు కాఁడు)

2. భూతము : నలుఁగాన మివ్వనంబున

(కానము=కనినవారముకాము)

3. భవిష్యత్తు : వాసుదేవుఁడున్ రాఁడు. (రాగలవాఁడు కాఁడు(

(ప్రౌ. వ్యా. క్రియా 8)

**అర్థబోధకము**

అర్థమును శబ్దవ్యాపారముచే బోధించునది.

అర్థమును బోధించు వర్ణము లేక వర్ణసముదాయము పదమనఁబడును.

ఉ. ఊః, ఇంటి, ఘటము ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. వాక్య. 2)

**అర్థమాత్ర**

సగము మాత్ర కాలము. లఘువునకొకమాత్ర. గురువునకు రెండు మాత్రలు. వ్యాకర్తలు సూత్రరచనలో అర్ధమాత్రాకాలమును పొదుపు చేయఁగల్గినచో పుత్రుఁడు పుట్టినంతగా సంతోషపడుదురు. (అర్ధమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యన్తే వైయాకరణాః)

సంక్షిప్త రచనాశయమిందు గోచరించును.

(రమణీ. పుట. 37)

**అర్థవిశేషము**

(i) ఏడి,ఏరి,ఏది, ఏవి శబ్దములు విశేషార్థమునిచ్చునపుడు దీర్ఘాంతములగును.

"*ఏడీ* నాబలు మానికంబుల కొటారు ?"—

ఎక్కడున్నాఁడని అర్థవిశేషము.

"వారేరీ సిరి మూటఁగట్టుకొని పోవంజాలిరే ?"

—ఎక్కడున్నారని యర్థవిశేషము

(ప్రౌ. వ్యా. శబ్ద. 87)

(ii) అర్థవిశేషమునందు కొన్ని శబ్దములు ద్విరుక్తములయి అదంతము లగును.

ఒండొంద, తరతరమ (క్రమముగానని అర్థవిశేషము)

**అర్ధవివృత స్వరములు**

ఆస్యమునందలి సగభాగము తెరచుకొనఁగా ఉచ్చరింప బడు అచ్చులు. వీనినే **half open vowels** అందురు. తెనుఁగున వీనికిఁ బ్రత్యేకలిపి చిహ్నము లేదు. అందుచే అర్ధసంవృత స్వరములక్రింద గీతలు గీచి వీనిని నిరూపింప నగును.

(i) పదాంతమందలి అర్ధవివృత స్వరము, (ii) వివృతస్వరమునకుఁ బూర్వమందున్న అర్ధ సంవృత స్వరము అర్ధ వివృతమగును. కుంచె, గిన్నె. మేక, మేడ, వేద ఇత్యాదులు.

(తె. వ్యా. వి. పుట. 25)

**అర్ధసంవృత స్వరములు**

ఆస్యమునందలి సగభాగము ముడుచుకొనగా నుచ్చరితమగు స్వరములు.

ఎ, ఏ, మెట్టు, మేకు.

(తె. వ్యా. వి, పుట 25)

**అర్ధానుస్వారతత్త్వము**

కర్త: డా. మి. ఏమ్. ఏ. శేషగిరి శాస్త్రి. ద్వి. ము. 1949.

అర్ధానుస్వారము, శబ్దములయొక్క వ్యుత్పత్తులను, భిన్న స్వరూపములయిన పదములయొక్క పరస్పర సంబంధములను దెలిసికొనుటకు నుపయుక్తమని; ఉచ్చారణమునఁదిది లేకున్నను పలు తెలుఁగుల నుపయుక్తమగుటచే దీనిని విడనాడ రాదని ఈ గ్రంథకర్త యాశయము.

**అర్ధానుస్వారము**

పూర్ణానుస్వారములో సగము. 'అఁ'. దీనినే అరసున్న, ఖండ బిందువు నందురు.

ఆఁకలి, చీఁకటి, మఱఁదలు.

ఇది సిద్ధము, సాధ్యమునని రెండు విధములు. (చూ.)

(స. సా. సం. I. వర్ణ. 4,
ప్ర. వ్యా. సంజ్ఞా. 35)

**అర్వాచీన తత్సమములు**

సంస్కృత ప్రాకృత తుల్యములగు పదములు ప్రాచీన తత్సమములు (చూ.) కాగా, అరబ్బీ, పారసీకాది అర్వాచీనములగు అన్యదేశ్యములతో (చూ.) తుల్యము లగు పదములను అర్వాచీన తత్సమములనఁదగును.

ఖుసీ—ఖుసి

బందీ—బంది

కలమ్—కలము

(తె. వ్యా. వి. పుట 138)

**అర్వాచీన తద్భవములు**

సంస్కృత ప్రాకృత భవమగు పదములు ప్రాచీన తద్భవములు (చూ.) కాగా, అరబ్బీ, పారసీ కాది అర్వాచీనములగు అన్యదేశ్యముల నుండి వర్ణలోపాగ మాదేశములగు మార్పులతో తెనుఁగున నేర్పడిన పదములను అర్వాచీన తద్భవము లనఁదగును.

ఖుసి—కుసి

తరాజు—త్రాసు

కురిసి—కుర్చి

(తె. వ్యా వి. పుట 138)

**అర్వాచీన ప్రాతిదేయములు**

అరవుగొన్న పదములను ప్రాతిదేయములనఁబడును. ప్రాచీనకాలమునందు సంస్కృత ప్రాకృతములనుండి అరవుగొన్నవగుటచే ఆ భాషాపదములు 'ప్రాచీన ప్రాతిదేయము' (చూ.) లగును. (ancient loan-words)

మధ్యకాలమందు భారతదేశమునకు అరబ్బీ, పారసీకాది దేశములతో వ్యాపార మధికమగుటచే తద్భాషాపదము లనేకములు భారతీయ భాషలలోనికిఁ జేరినవి.

వీనికే అర్వాచీన ప్రాతిదేయములని వ్యవహారము. (mediaeval loan-words) కాగితము-కలము-అసలు మున్నగునవి.

(తె. వ్యా. వి పుట 350)

**అర్వాచీన విభక్తి ప్రత్యయములు**

ప్రాచీన కాలమునుండి వ్యవహృతము లగుచున్న విభక్తి ప్రత్యయములు కాక మధ్యకాలమందు భాషలోఁజేరిన విభక్తి ప్రత్యయములు కోసము, కోసరము, వల్ల, ఉంచి, వంటి మొదలైనవి. (ఆం.భా.శా. ప్రయోగ. 19)

**అర్చి**

(i) ఇది సకారాంత శబ్దము సకారమునకు లోపము బహుళము—అర్చి లోపము రాని పక్షమునందు సకారమునకు ఉత్వద్విత్వములు గలుగగా 'అర్చిస్సు' అను రూపమేర్పడును. (బా. వ్యా. తత్సమ. 80)

(ii) ఇట్టి ఇకారాంత సంస్కృత సమశబ్దములకు బహుత్వము సంపు 'లు' వర్ణకము పరమగుచో ఉపధలో నున్న తాలవ్య 'చ' కారము దన్త్యమగును.

అర్ చ్ ఇ+లు—అర్ చ్ ఉ+లు—అర్చులు

 

తాలవ్యము దన్త్యము

ఇట్లే రోచులు, వీచులు

(బా.వ్యా.సంజ్ఞా. 10)

**అఱ**

తద్ధిత ప్రత్యయము

దబ్బఱ. చిందఱ (కా.చూ. IX. 148)

**అఱు/అఱుత**

ఇవి తృతీయా విభక్తులని గు.వ్యా. (84 అంశము) మాత్రమే పేర్కొన్నది. (గు.వ్యా. 84)

**అఙ్ఞంతము**

అఙ్ఞు+అంతము అఱు—హ్రస్వమగు అకారము ఇట్లు వుఙ్ఞంతము ముఙ్ఞంత మని వ్యంజనములును పేర్కొనబడెను. వర్ణములనిట్లు వ్యవహరించు విధానము ఆ.భా.భూ. నందు కలదు. కా.చూ. యందును అక్కడక్కడ కలదు.

(ఆం.భా.భూ. 34,91; కా చూ. IX 55)

**అఙ్ఞు మొదలగునవి**

అఙ్ఞు, కఙ్ఞు, కొఙ్ఞు, గొఙ్ఞు, మిఙ్ఞు, పఙ్ఞు,ఇవి అఙ్ఞు మొదలగునవి. నియత గణము.

వీనికి ద్వితీయాది విభక్తులు పరమగునపుడు 'తి' వర్ణము చేరును అప్పుడొక రేఫము లోపించును. ఉత్వము ఇత్వమగును

అఱ్ఱు+ను — అఱ్ఱు+తి+ను
— అఱు+తి+ని
— అ ఱి తి ని

(బా. వ్యా. అచ్చిక. 34)

**అల్**

అకారము మొదలు లకారము వరకుఁ గల వర్ణముల ప్రత్యాహార సంజ్ఞ.

మాహేశ్వర సూత్రములలోని వర్ణములన్నియు నిందు చేరుటచే 'అల్' అనగా వర్ణమను నర్థమేర్పడెను. 'అలోన్త్యస్య' (1-1-52) ఏక వర్ణమగుచో స్థానిలోని తుదివర్ణమునకు మాత్రమే ఆదేశమగును. 'ఇచ్చు'నకు 'ఈ' అగునని సూరి రచించియున్నచో 'ఈ' ఏకాల్ కావున పై పాణిని సూత్రము ప్రకారము 'ఇచ్చు' ధాతువునకు చివరగల 'ఉ' వర్ణమునకు 'ఈ' ఆదేశమయ్యెడిది. అందుచేతనే సూరిగారు ఇచ్చునకు సర్వంబునకు 'ఈ' యగునని పేర్కొన వలసి వచ్చినది.

(బా॰ వ్యా. క్రియా. 92, రమణీ. పుట. 427.)

**—అల**

అవ్యయము. ఇది కొన్ని స్త్రీసమములకు స్త్రీవాచకములకు సంబోధనమునం దంతమందు జేరును.

అక్కల, అన్నల, మున్నగునవి. (ప్రౌ.వ్యా.శబ్ద 15)

**అలక్ష్యప్రవృత్తి**

లక్ష్యముకాని దానియందు లక్షణము ప్రవర్తించుట.

"కర్మధారయ సమాసమునందుకారాంతముల కచ్చుపరమగుచో'ట' కారాగమము తఱచుగా నగు" ననుచో 'ఉ' కారాంతములుగాని దుక్కిటెద్దు మున్నగు లక్ష్యము లందును; వేల్పుటావువంటి తత్పురుష సమాసము లందును ఈ ఆగమము వచ్చునని యర్థము. దీనినే అలక్ష్యప్రవృత్తి యందురు. (ల.వ్యా. సంధి 17)

**అలఘుకౌముది**

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

ప్రచురణ : 1921 (వావిళ్లవారు)

శకట రేఫమునకే (ఱ) అలఘురేఫ మనియు వ్యవహారము. శకటరేఫతో గూడిన పదములు వాని యర్థములతో నీచిన్న గ్రంథము నందకారాది క్రమమున నిరూపితములు.

**అలఘురేఫము**

అలఘూచ్చారణము గలరేఫము (చూ.) అలఘువు. దీనికే శకటరేఫమను (అ) ప్రసిద్ధ వ్యవహారము.

(చూ) లఘురేఫము. (ప్రౌ. వ్యా. సంజ్ఞా. 9)
(చూ.బా.వ్యా. ,, 18)

**అలఘులకారము**

ఉచ్చారణమునందలి గురుత్వ లఘుత్వ ధర్మములను బట్టి లకారము లఘు లకారము, అలఘులకారము అని ద్వివిధము. బెళుకుంజూపులు, తళుకుంజెక్కులు ఇత్యాదులలోని ళకారము గురుత్వ ధర్మముగలదౌటచే అలఘులకారము. (చింతా. అహో. సంజ్ఞా 19). లఘ్వలఘులకారములకు వైధర్మ్యము లేదు. అనఁగా వానికి పరస్పరము యతి ప్రాస మైత్రి యున్నదని భావము.

**అలఘుళకారము**

అలఘూచ్చారణము గల 'ళ' కారము. బహుత్వమందు ర, ల, డ ల కాదేశముగా వచ్చు 'ళ' కారము. ఇది వర్ణసమామ్నాయములోని 'ళ' కారముకన్న భిన్నమైనది.

ఏళులు, పాళులు, త్రాళులు.

(బా. వ్యా. సంజ్ఞా. 8)

**అలఘువు**

ఉచ్చారణము-లఘువని, అలఘువని ద్వివిధము. స్థానకరణ సంయోగము నందు శైథిల్యములేనిచో అలఘువు.

కాయ, బోయ - ఇత్యాదులందుఁగల శబ్దగత యకారము;

మెఱఁగు, కఱఁగు - ఇత్యాదులందలి శకట రేఫము;

ఏళులు, పాళులు - ఇత్యాదులందాదేశముగా వచ్చిన ళకారము

వాన, వంకర - ఇత్యాదులందు అవయవమైన వకారము అలఘువులు.

(బా. వ్యా. సంజ్ఞా. 18)

**అలరుఁబోఁడీత్యాదులు**

'అలరుఁబోఁడి' మున్నగునవి.

తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిఁబోఁడి, ఇగురుఁబోఁడి, చిగురుఁబోఁడి, తలిరుఁ బోఁడి, పువ్వుఁబోఁడి, పూఁబోఁడి మున్నగునవి.

ఇవి ఉపమాన పూర్వపద కర్మధారయములు.

(ప్రౌ. వ్యా. సమాస. 19)

బాల వ్యాకరణాను సారమివి బహువ్రీహి సమాసములగును. 'అలరు+మేను' అని విభాగము. 'మేను' నకు 'బోఁడి' యాదేశమగును. 'అలరువంటి మేనుగలది' యని యర్థము. పూర్వపదాంతము ఉదంతేతరమగుచో బిందువుండదు.

(బా. వ్యా. సమాస. 28)

**—అలి**

సామానాధి కరణ్యములందు అందు మున్నగు సప్తమీ విభక్తి ప్రత్యయములకు వచ్చు ఆగమము. ఉదా.- నీ యందలి కరుణ మొ॥ (చింతా. సంధి 38). ఇట పూర్వపదము మీది విభక్తికి లోపము రాకుండుటచే నివి అలుక్సమాసములు. (అహో. సంధి 38). అథర్వణుఁడు అందు, ఇందులకు అల్యాగమము వచ్చునని తెలిపెను. ఉదా :- అందలి రత్నసానువులు, ఇందలి పువ్వుఁజొంపములు. (అథ. కా. సంధి 28) చూ:- అలిగాగమము.

**అలిగాగమము**

అలిక్+ఆగమము. 'అలిక్' లోని కకారము ఇత్సంజ్ఞ. అదిలోపించును.

అందు, ఇందు, ఎందు - అను శబ్దములకీ యాగమము అంతమందుఁ జేరును'

నాయందలి కరుణ

ఇందలి జనులు

ఎందలి వారు - ఇవి సమాసములు.

(చూ.) అల్యాదేశము (బా. వ్యా. సంధి 44)

**అలీన నవీనపు ఎరవు పదములు**

కలిసిపోనట్టి, నూతనముగా అన్యభాషల నుండి యెరవు తెచ్చుకొన్నట్టి పదములు. (unassimilated modern loan-words)

ఒక భాషకుఁగల నైజశబ్దాకృతితో (Structure) గలిసిపోక, స్వకీయ శబ్దాకృతితోనే యన్యభాషల యందు వ్యవహృతమగుచున్న ఆధునిక కాలమునకుఁ జెందిన ఇతరభాషాపదములు. వీనినే 'నవీనతత్సమము' లనియు ననఁదగును(చూ).

(చూ.) హాస్పిటల్, కిరోసిన్, గెస్ట్, ఆఫీసు

(తె. వ్యా. ప. అనుబంధము)

**అలీన ప్రాచీనపు ఎరవు పదములు**

ఇతర భాషాకృతితో లీనముకాకుండ, తద్భిన్నమగు ఆకృతితో, ప్రాచీన కాలమునుండి అన్యభాషలలో వ్యవహృతమగుచున్న ఎరవు పదములు. (unassimilated ancient loan-words). తెలుగు భాషలో నుపయుక్తమగు అనాంధ్ర వర్ణఘటితమగు సంస్కృత ప్రాకృత పదములిట్టివి.

(సం) ఖరము, ఘాతము, ఝషము

(ప్రా. అట్ఠము, వజ్జ ఇత్యాదులు వీనినే 'ప్రాచీనతత్సమము (చూ.) లందురు. (తె. వ్యా. వి అనుబంధము)

**అలీన అర్వాచీనపు ఎరవు పదములు**

ఒక భాషకు నైజమగు పదముల యాకారముతోఁగాక, భిన్నమగు ఆకారము కలిగినట్టి, అర్వాచీనముగా ఎర వుగొన్నట్టి అన్య భాషాపదములు (unassimilated mediaeval loan-words).

చూ అర్వాచీన తత్సమములు
ఉదా :- ఖుసి, ఖరీదు,

(తె. వ్యా. వి. అనుబంధము)

**అలుక్సమాసము**

విభక్తి లోపింపని సమాసము.

(i) సిద్ధ సమాసములలో-ఖేచరులు, వనేచరేశ్వరులు, కంఠేకాలుఁడు ఇత్యాదులు. (ఛం. ద. IV. 101)

(ii) అచ్ఛిక సమాసములలో - ఊరఁబంది, నోరఁగ్రొవ్వు (ఆం. కౌ. 636)

తలఁబ్రాలు, నీచేతిప్రాపు, నీతోడి చెలిమి (బా. వ్యా. సంధి)

(iii) మిశ్రసమాసములలో - దొంగవలని భయము. కువలయంబున వారు, నిజకులంబున వారు. (ప్రౌ. వ్యా. సమాస. 87)

**అలుగ్వాదులు**

'అలుగు' మున్నగు ధాతువులు. ఆకృతి గణము. వీనికి 'క' అను కృత్ప్రత్యయము పరమగునపుడు అంతిమాక్షరము లోపించును.

అలుగు—అలుక

కలఁగు—కలఁక

మొలచు—మొలక ఇత్యాదులు

(బా. వ్యా. కృదంత. 8)

**అలౌకిక విగ్రహము**

వృత్తియొక్క యర్థమును బోధించునది విగ్రహము. ఇది లౌకికమని, అలౌకికమని ద్వివిధము.

శాస్త్రప్రక్రియా నిర్వహణమునకై శాస్త్రప్రకారము కల్పితమైనది అలౌకిక విగ్రహము.

రాజన్+అస్; పురుష+సు(అలౌకిక విగ్రహము)

రాజ్ఞః పురుషః (లౌకిక విగ్రహము)

రాజపురుషః (సమాసము)

(తె. వ్యా. వి. పుట. 822)

**అల్పప్రాణములు**

కొలది వాయువుతో నుచ్చరింపఁబడు వర్ణములు. బాహ్యోచ్చారణ ప్రయత్న భేదములలో నొకటి. (వ్య.) మహాప్రాణములు. (చూ.)

అన్ని అచ్చులు వర్గప్రథమ, తృతీయ, పంచమాక్షరములు; య,ర,ల,వ,లు

(రంగ. II. 154)

**అల్పార్థకము**

అల్పము, తక్కువ, యనునర్థము కలది. ఒక శబ్దము కొన్ని ప్రయోగాలలో ఈ యర్థము నందుపయుక్తము.

ఒక మున్నులు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు (భాగ. IX. 262)

(ప్రౌ. వ్యా. శబ్ద. 84)

**అల్పాక్షరము**

తక్కువ వర్ణములను గల్గినది.

సూత్రరచన అల్పాక్షరములలో అసందిగ్ధముగా నుండవలయునని ప్రాచీనుల యాశయము.

అల్పాక్షర మసందిగ్ధమ్
సారవత్, విశ్వతోముఖమ్
అస్తోభ మనవద్యంచ
సూత్రం సూత్రవిదో విదుః॥

(చూ. రమణీ. పుట. 37)

**అల్యాగమము**

(అలి+ఆగమము) చూ:- 'అలి' (అధ. కా సంధి. 28)

**అల్యాదేశము**

అలి+ఆదేశము

సమాసమునందు విభక్తి కంతమునందు 'అలి' అను ఆగమము చేరును.

ఉదా: శేషశాయియందలి భక్తి. ఆదేశమనుటకన్న ఆగమమనుట సముచితము.
చూ. అలిగాగమము. (అప్ప. V. 86)

**అవగాగమము**

అవక్+ఆగమము—కకారమిత్సంజ్ఞ
ఈ ఆగమము సంఖ్యావాచకమునకు పూరణార్థమునందు వచ్చును.
రెండవ, మూఁడవ, నాల్గవ ఇత్యాదులు.

(బా. వ్యా. ఆచ్ఛిక. 27)

**అవఙాదేశము**

అవ (ఙ్) ఆదేశము.

'గో' శబ్దమునకు, 'అక్ష' శబ్దము పరమగునపుడు 'అవ' అను నాదేశము వచ్చును.

గో+అక్ష—గవాక్షము. ఇచ్చట 'అవ్' ఆదేశము కాదు. అగుచో 'గో+అక్ష' గవక్షమను నసాధురూపమేర్పడును.

'ద్యో' శబ్దమున కచ్చుపరమగునపుడు 'అవ్' ఆదేశమగును.
ద్యు+అధీశుఁడు—ద్యవధీశుఁడు (అ. ఛం. IV. 46)

**అవధారణార్థకము**

నిశ్చయార్థము నిచ్చుశబ్దము- 'అ'. నీవు+అ—నీవ-నీవేయని యర్థము. చూ. ఏవార్థకము.

**అవధారణార్థకాంతములు**

నిశ్చయార్థముగల శబ్దము లంతమందుఁగల పదములు.

వానికి, వీనికి, నీకు, నాకు, తనకు--మున్నగు షష్ఠ్యంత పదములకు అవధారణార్థకములయిన —అ,—ఎ, అను శబ్దములతోఁగూడిన ప్రథమాంతములగు అట్టి పదములే పరమగుచో 'తనకు తానే'-స్వయముగా ననునర్థము వచ్చును.

వానికి వాఁడె, వీనికి వీఁడె, నీకునీవే, నాకునేనే, తనకు తాన మున్నగునవి.

(ప్రౌ. వా. శబ్ద. 108)

**అవధారణము**

నిర్ణయము. ఒక వస్తువును మరియొక వస్తువుగా నిర్ణయించుట.

అజ్ఞానాంధకారము—అజ్ఞానము, అంధకారము (చీఁకటి) యనునవి వేరువేరు వస్తువులయినను, అజ్ఞానమునే చీఁకటిగా నిశ్చయించుట.

(సు. వ్యా. పీఠిక.)

**అవధారణా పూర్వపద కర్మధారయము**

నిశ్చయార్థకమగు శబ్దము పూర్వమందుఁగల కర్మధారయ సమాసము (చూ.)

అజ్ఞానాంధకారము

విద్యాధనము (సు. వ్యా.)

సిగ్గు సొమ్ము

కొలువు పంట (ఆం. కౌ. 607, 608)

**అవధారణ పూర్వపద సమాసము**

అవధారణ (నిశ్చయము) వాచకము పూర్వమందుఁగల సమాసము.

నిశాకాంత, రేవెలఁది

ఇదియే రూపకసమాస మనఁబడును. (చూ.)

(సం. వ్యా. సమా. 9)

**అవమ్**

పూరణార్థమున సంఖ్యావాచకములపై వచ్చు తద్ధితప్రత్యయము. ఇందలి మకార మిత్సంజ్ఞకము.

ఉదా : పదునాల్గవ మనువు మొ॥ (వై. చం. తద్ధితా. 24)

**—అవన్**

యానపాత్ర వాచకమగు పోత శబ్దముపై స్వార్థమున వచ్చు ప్రత్యయము. ఇందలి సకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- పోతవ.

(వై. చం. తద్ధితా. 18)

**అవసానము**

చివర, ముగింపు, మేర, విరామమని యర్థము. దానికి తరువాత ఏ యక్షరమును లేకుండుట.

అతిశయముగ బుద్ధిమంతుఁడగు

బుధసేవన్

ఇట ద్రుతమునకవసానము పరమైనది. ఇట్టిచో ద్రుతస్వరమునకేని, ద్రుతమునకేని లోపము బహుళముగానగును ఈ లోపము పద్యాంతములందు గణానుసారముగా వ్యవస్థితము. (బా. వ్యా. సంధి. 20)

ఇట చూడుము – ఇట చూడు – అనుచో అవసానము పరమగునపుడు మధ్యమపురుష 'ము' వర్ణకమునకు లోపము విభాషగా నగును.

(బా. వ్యా. సంధి. 47)

( చూ॥ 56)

**అవాదేశము**

'అవ్' అను శబ్ద మాదేశమగుట.

'ద్యు' శబ్దమున కచ్చు పరమగుచో 'అవ్' ఆదేశమగును.

ద్యు + అధీశుఁడు

ద్యు + అవ్ + అధీశుఁడు — ద్యవాధీశుఁడు

(ఛం. ద. IV. 46)

**అవికృతాంతము**

వికారమును (మార్పును) బొందని అంతముగల శబ్దములు.

బిరుదాద్యుత్తరపద స్త్రీ, పురుష సంజ్ఞావాచక పూర్వపద మిశ్ర కర్మధారయ సమాసములగు 'కృష్ణరాయఁడు, రామరావు' మున్నగువానిలో 'కృష్ణ' 'రామ' శబ్దములు అవికృతాంతరములు, అనఁగా మార్పును బొందనివి. సిద్ధ సమాసము

నందువలె సంస్కృత ప్రాతిపదికము లట్లే తెనుఁగున జేరినవి.

(ప్రౌ. వ్యా. సమా. 6)

**అవిధాత్రాదులు**

'విధాత్రాదులు' (చూ.) కాని 'ఋ' కారాంత శబ్దములు.

వీనికి అత్వాస్త్రీ వద్భావము నిత్యము.

**పిత, మాత, స్వస, జామాత,** క ర్త, హ ర్త మున్నగునవి.

(మ. ప. వ్యా. సంధి. 10)

**అవిభ క్తిక తత్సమములు**

డు, ము, వు - అను ప్రథమైక వచన విభక్తులు చేరని సంస్కృత సమ శబ్దములు.

హరి, చక్రి మున్నగునవి.

(చూ.) అవిభ క్తికము, విభ క్తికము. (అప్ప. V. 47)

**అవిభ క్తికము**

'డు, ము, వు' అను ప్రథమైక వచన విభక్తులు చేరని పదము.

హరి, చక్రి, సుందరి

బరువు, గోడ, పిక్క, లక్క. (అప్ప. V. 14, 15)

**— అవుక్**

వక్రతమమగు ఔకారమునకు వికల్పముగా నాదేశమగు శబ్దము.

కకార మిత్సంజ్ఞ.

ఔర — అవుర

ఔను — అవును. (అప్ప. II. 110, 111)

**అవుగాగమము**

అవు(క్) అను ఆగమము.

ఉకారాంత ధాతువులకు ఇంచు (క్) పరమగునపుడు 'అవ్' ('ఉక్' లోపించును) అను ఆగమ మంతమందుఁ జేరును.

ఇది తత్సమ క్రియారూపములను సాధించు విధానమునకు సంబంధించినది.

ద్రు + ఇంచు ⟶ ద్రు + అవ్ + ఇంచు ⟶ ద్రవించు

లూ + ఇంచు ⟶ లూ + అవ్ + ఇంచు ⟶ లవించు

(బా. వ్యా. క్రియా. 64)

**—అవు**

కృత్ప్రత్యయము.

'తగు' మున్నగు ధాతువులకుఁజేరును.

తగవు, నగవు, ఉలవు. (బా. వ్యా. కృత్. 22)

**అవ్యయము**

వ్యయము లేనిది 'అవ్యయము'. అనఁగా మార్పులేనిది. లింగ, విభక్తి, వచన శూన్యమైన పదము.

పాణిని దీనిని సంజ్ఞగా పరిగణించెను. స్వర్, ప్రాతర్, అన్తర్ మున్నగునవి; అవ్యయీభావ సమాసములు; అన్ని విభక్తులు చేరని కొన్నితద్ధితాంతములు; కొన్ని కృదంత రూపములు అవ్యయములుగా పరిగణింపఁబడినవి.

"మూఁడు లింగములందు, అన్ని విభక్తులందు, అన్ని వచనములందు మార్పు చెందని పదము అవ్యయమను నర్థమునిచ్చు కారిక, కాశికావృత్తి పేర్కొన్నది. లోక ప్రసిద్ధము. (పా. I-1-37 క్రింద)

"సదృశం త్రిషులింగేషు
సర్వాసు చ విభక్తిషు
వచనేషు చ సర్వేషు
యన్నవ్యేతి తదవ్యయమ్"

(i) సంస్కృతావ్యయములకుఁ దెనుఁగునఁ బ్రవేశము లేదు. అవి సిద్ధసమాస రూపమున తెనుఁగునఁ బ్రవేశించును.

సర్వధూమణి, వృథాశంక
పునఃప్రణతి, ఉచ్చైర్నినాదము (ఛం. ద. IV. 117)
అయినను 'వృథ' అనునదిందుల కపవాదము 'వృథసేయక'

(ఛం. ద. IV. 118)

(ii) పూర్వపు తెలుఁగు వ్యాకరణములలో అవ్యయ నిరూపణ గావించినవారు కనుపట్టరు. అయినను ఆంధ్రకౌముది "అప్పుడు, ఇప్పుడు, అచ్చట, ఇచ్చట ఇక్కడ, కాక, అడ, ఈడ, వేమఱు, పలుమఱు, వెండి, క్రమ్మఱ" మున్నగు వానిని అవ్యయములుగాఁ బేర్కొన్నది. (377-379 పంక్తులు)

(iii) ఓహో, ఔర, మరి, సుమ్మ, గదా, అకటా, అయ్యో, కటకటా, మఝు భళి, మున్నగునవి అవ్యయములని అర్వాచీన వ్యాకరణములు కొన్ని పేర్కొన్నవి.

(ప్ర. వ్యా. 128)

(iv) నవీన వ్యాకరణములు కొన్ని అవ్యయ ప్రకరణముల నేర్పఱచినవి. చూ ఆంధ్రశబ్దాను శాసనము.

(v) ప్రౌఢ వ్యాకరణమును, దాని ననుసరించి మఱికొన్ని నవీన వ్యాకరణము లును "పదములవి నామములు క్రియలు అవ్యయములని త్రివిధముల"ని విభజించి, ప్రతిపదోక్తములు లాక్షణికములని (చూ.) అవ్యయములలో రెండు విభాగములు గావించినవి. (ప్రౌ. వ్యా. వాక్య. 8)

"కొన్ని అవ్యయములు బహువచనాంత తుల్యంబులు నగు అట్టు—అట్లు; ఇట్టు—ఇట్లు; నిచ్చలు. (ప్రౌ. వ్యా. శబ్ద. 34)

(vi) తెనుఁగు నందలి 'అవ్యయ లక్షణములు' ఆంధ్రభాషావికాసాది భాషా గ్రంథములందు కొంత సమగ్రముగాఁగలవు.

(చూ. ఆం. భా. వి. పుటలు. 426-429 ద్వి. ము.)

**అవ్యయ వికల్పము**

అవ్యయము మీఁది పురుషములు వికల్పముగా గ,స,డ,ద,వ, లగును. ఇట్టి సంధిని 'అవ్యయ వికల్పసంధి'గా కొందఱు లాక్షణికులు పేర్కొనిరి.

కాన తగం బొందుట కార్యము.

(క. సం. I. 16)

**అవ్యయీభావము**

అవ్యయము మీఁది పదముతో సమసించుట. ఇందు పూర్వపదమగు అవ్యయమే ప్రధానము.

చిన్తామణ్యాదు లందుఁగాని, బాలప్రౌఢ వ్యాకరణము లందుఁగాని యిట్టి నిరూపణము గానరాదు. కాని ఛందోదర్పణము, ఆంధ్రకౌముదివంటి లక్షణగ్రంథములలోను; ఆంధ్రభాషానుశాసనము, సులభ వ్యాకరణము, సంగ్రహ వ్యాకరణమువంటి నవీన వ్యాకరణము లందును నిది పేర్కొనఁబడెను. నిర్జనము, మధ్యేమార్గము, నిర్మాక్షికము, యథా శక్తి వంటి సిద్ధరూపములట్లుంచి కాసంత, గోరంత, ఇసుమంత మున్నగువవి పరిశీలింపఁదగును. (ఆం. కౌ. 627-629)

మీఁగాలు, పెడతల వంటి రూపములు సముచితముగా దోచును.

**అవ్యవహితము**

వ్యవహితమనఁగా దూరము. దూరముకాని దనఁగా సమీపము, సన్నిహిత మని యర్థము. (వ్య.) వ్యవహితము (చూ.)

తెనుఁగున సాధారణముగా విశేషణము విశేష్యమునకు సన్నిహితముగా నుండును. నల్ల కలువ.

(తత్త్వ. ప్రౌ. వ్యా శబ్ద. 11)

**అవ్యాప్తి**

పూర్తిగా వ్యాపింపకుండుట.

లక్షణము లక్ష్యము లన్నింటియందును ప్రవర్తిలక, కొన్నింటియందే ప్రవర్తిలుట.

"ధ్వన్యనుకరణ శబ్దంబులు ద్విరుక్తంబులయగు" – అనుచో ద్విరుక్తములు కాని ధ్వన్యనుకరణ శబ్దములు కూడ నుండుటచే లక్షణ మవ్యాప్తమైనది.

'తటాలున దూకెను.' తటాలున – అనునది ధ్వన్యనుకరణ శబ్దమేయైనను ద్విరుక్తము కాలేదు.

(ప్రౌ. వ్యా. సంధి. 20)

**అవ్యుత్పన్నములు**

వ్యుత్పన్నములనఁగా అవయవార్థములు కలవి. ఉదా :– పంకజము, లావణ్యము, ఎండ మున్నగునవి.

అవయవార్థము నిరూపింపరాని పదములు అవ్యుత్పన్నములు: దిద్దుఁడు.

దేశ్యశబ్దము లవ్యుత్పన్నములను అపప్రథకలదు. కాని నేఁడు వానికి కూడ వ్యుత్పత్తి కోశములు రచింపఁబడుచున్నవి. (Etymological Dictionary)

(తె. వ్యా. వి. పుట 242)

**అశిష్యము**

నిర్ణయింపరానిది.

సంస్కృతమునందు 'లింగము' కొన్ని శబ్దములకిట్టిదని నిర్ణయించుట యెంత వానికేని సాధ్యపడదు. లోకములో దానికిఁగల ప్రయోగమును బట్టియే గ్రహింప వలసి యున్నది.

అందుచేతనే "లిఙ్గం అశిష్యం, లోకాశ్రయత్వాల్లిఙ్గస్య" (మహా. II. 1.36)
(తె. వ్యా. వి. పుట 584)

**అష్టభాషలు**

ఎనిమిది భాషలు - (1) సంస్కృతము (2) ప్రాకృతము (3) శౌరసేని (4) మాగధి (5) పైశాచిక (6) చూళికాపైశాచి (7) అపభ్రంశము (8) ఆంధ్రముఁ ? (అప్ప. I. 77)

ఇట ప్రాకృతమనఁగా మహారాష్ట్రి ప్రాకృతమని గ్రహింపవలయును. ఆంధ్రముకూడ నొక ప్రాకృతభేదమే యను నభిప్రాయము పూర్వాంధ్ర లాక్షణికుల కున్నట్లు నిదర్శనములు కలవు. (కా. చూ. IX. 8)

**అష్టాధ్యాయి**

ఎనిమిది అధ్యాయములు అని శబ్దార్థము. పాణిని మహర్షి విరచితమగు ఎనిమిద ధ్యాయములు గల వ్యాకరణమునకు 'అష్టాధ్యాయి' యని రూఢ వ్యవహారము.

మానవ నిశిత మేధాశక్తికిది శాశ్వత చిహ్నమని బ్లూమ్ ఫీల్డువంటి భాషాశాస్త్రజ్ఞులు దీనిని ప్రస్తుతించిరి. ప్రపంచములో మరేభాషకును నిట్టి సమగ్రమగు వర్ణనాత్మక వ్యాకరణము (discriptive grammar) లేదనియు నిది పేరు గాంచెను.

సమస్త భారతీయ భాషావ్యాకరణ రచనములపైని దీని ప్రభావమే కొంతయో యుండియుండకపోదు.

"అష్టాధ్యాయీ జగన్మాతా"

**అస్**

అమ్, ఔట్, శస్ అను ద్వితీయా విభక్తి ప్రత్యయములను తెలుపు ప్రత్యాహారము. ఇది 'సుప్స్వాదిరంత్యహలా' అనుప్రాకృత వ్యాకరణ సూత్రముచే సిద్ధించును.
(వై. చం. విభక్తి 3)

**అసందిగ్ధము**

సందేహము కలుగనీయనిది. సూత్రలక్షణములలో నిది రెండవది.—"అల్పాక్షరం,[1] అసందిగ్ధమ్[2]" చిన్నయసూరి బాలవ్యాకరణమందలి సూత్రరచన ఈ లక్షణమును బోషించుచు మొదటి లక్షణమును సాధించినది.

**ఉదాహరణము :–** 'ఇ, రై, గ్లావుగతంబుల' అనుచో 'వుగంత' శబ్దము సందిగ్ధతకు దారి తీయును. అందుచేతనే సూరి క్రమమును మార్చి 'ఇగ్లౌరా

యుగంతములని అసందిగ్ధ మొనర్చెను. అంతేకాక, "ఇకారాంతములకు, గ్లౌ, రై శబ్దములకు, మఱి యుగాగమాంతములకని" విషయమును మఱింత స్పష్టపరిచెను.

సందిగ్ధతకు దారితీయు అల్పాక్షర రచన శాస్త్రరచనకే మాత్రము పనికిరాదు.

(చూ. రమణీ. పుట. 40)

**అసంధి**

ఏ రెండు పదముల కయిన సంధిచేసిన పక్షమున స్పష్టత లేకపోవుట గాని, విరుద్ధార్థ మేర్పడుటగాని, అశ్లీలార్థము స్ఫురించుటగాని అన్వయసందేహము కలుగుటగాని చెప్పఁదలఁచిన విషయమునందవసరమైన చోట ఊనిక చెడిపోవుటగాని సంభవించునని తోఁచిన చోటులందు సంధి మానవచ్చును. అట్టిదానిని విసంధి (చూ.) యనక 'అసంధి' యనుట లెస్స. (రమణీ. 285-86 పుటలు)

**అసంపూర్ణవాక్యము**

ఆకాంక్ష పూర్తిగాని వాక్యము అసమాపక క్రియలు గల వాక్యము.

"దాని విడిచిపోవగా నోపక అచుచు నంతరిక్షముననుు హంసలెల్లఁ బిండుగట్టి తిరుగుచుండె" ఇందు (i) హంసలు విడిచి (ii) హంసలు పోవఁగా నోపక (iii) హంసలఅచుచు (iv) హంసలు పిండుగట్టి యను అసంపూర్ణ వాక్యములు గలవు. (ప్రౌ. వ్యా. వాక్య. 7.)

**అసంలక్ష్యక్రమము**

గుర్తింపరాని క్రమము. ఇది పూర్వము, ఇది పరము అని గుర్తుపట్టజాలమని భావము.

చంద్రుఁడుదయించుటకును, కలువలు వికసించుటకును వ్యవధి ఏలేశమో యున్నను అది గుర్తింపరానిది. అందుచేతనే భూతార్థక క్రియగాక అనంతర్యార్థక క్రియ (చూ.) యుపయుక్తము.

'జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె' (రమణీ. పుట. 408)

**అసంయుక్తము**

సంయుక్తమనఁగా కూడుకొనుట. కూడుకొనకుండుట యసంయుక్తము. హల్లుల కూడిక లేక కలయిక సంయుక్తము. అట్లు కలియకుండ ఒకే హల్లుండుట అసంయుక్తము.

అచ్చట...సంయుక్తము

అచట—అసంయుక్తము.

ఆ+కడ... ,, (బా. వ్యా. సమాస. 14)

**అసంస్కృతము**

సంస్కృత సమముకాని శబ్దము. ఇట్టి శబ్దముకంటె పరమందున్న సంస్కృత సంబంధి పరుషములకు గ,స,డ,ద,వ లు, రావు. ఉదా:- అయ్యెకరుణించె, సిరి చంచలము మొ॥ (వై. చం. సంధి. 34)

**అసమర్థ సమాసము**[1]

సమర్థము కాని సమాసము. సమ+అర్థము = ఏకార్థము. ఏకార్థీభావము లేకున్న సమాసమేర్పడదు. కాని 'అసూర్యం పశ్యా' ఇత్యాదిగా ఏకార్థీభావము లేని సమాసము అసమర్థ సమాసమని యందురు.

(త. చం. 519)

**అసమర్థ సమాసము**[2]

సమర్థముగాని సమాసము.

సమాసమందలి శబ్దము, మరియొక పదముతో నన్వయించుట.

ఇట్టి యన్వయము వ్యాకరణశాస్త్ర సమ్మతము కాకపోయినను వాడుక మూలమున సమ్మతమైనది. అర్థగ్రహణమున కవరోధము కల్గదు.

దేవదత్తస్య గురుకులమ్.

దేవదత్తస్య దాస భార్యా

అశ్రద్ధ భోజీ బ్రాహ్మణః

(తె. వ్యా. వి. పుట 364)

**అసమస్తము**

సమస్తము (చూ.) అనఁగా సమాసము (చూ.). అసమస్తమనఁగా వ్యస్తము. సమసింపనిది — ఏకపదము.

చూ. అసమాసము.

**అసమాపక క్రియ**

సమాప్తముగాని వ్యాపారముగల క్రియ.

ఉదా:- వచ్చి, వచ్చుచు, వచ్చిన వచ్చుడు మున్నగునవి.

**అసమాపకము**

ముగియని వ్యాపారమును దెల్పు క్రియ.

ఉదా:- కొట్టి, కొట్టుచు.

(సం. వ్యా. క్రియా. 8)

**అసమాన విభక్తికము**

సమానము గానట్టి, అనఁగా భిన్నమైన విభక్తులు గలది. దీనినే 'వ్యధికరణ తత్పురుషము' (చూ.) అందురు.

(వ్య.) సమాన విభక్తికము (చూ.)

(ల. వ్యా. సమాస. 88)

**అసమాసము**

సమాసము కానిది, వ్యస్తము.

'అసమాసమునం బూశబ్దము పూవు శబ్దము యొక్క పర్యాయము.'

(ప్రౌ. వ్యా. సంధి. 11)

'సింధువారమునఁబూ శిథిలపడఁగ'

(భీమఖండము II. 48)

**అసహాయత**

సాహాయ్యము లేనిస్థితి. కాలమును సూచించు శబ్దముల సాహాయ్యములేని యపుడను నర్థమునందుపయుక్తము.

తద్ధర్మార్థక విశేషణము అసహాయమైత్రికాల వాచి యగుచున్నది.

'అనునయించు సితకృష్ణతంతు రాజిత తంత్రము'.

(ప్రౌ. వ్యా. క్రియా. 1)

**అసాధారణము**

సాధారణమనఁగా సామాన్యము. విశేషముగలది - యసాధారణము.

సాధారణమగు కేవల 'న్' కారము గాక, ఉత్వసహితత్వ విశేషము గలది అసాధారణ నకారము -ను. ఇదే ద్రుతము.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 7)

**అసాధువులు.**

అపశబ్దములు. ఒక వ్యాకరణముచే అసాధువులయినవి వేఱొక వ్యాకరణముచే సాధింపఁబడినచోనవి సాధువులగును.

(i) బాల వ్యాకరణానుసారము 'ప్రాణగొడ్డము' గ్రామ్యముకాగా, ప్రౌఢ వ్యాకరణానుసారమిది అగ్రామ్యము

(ii) పాణినీయముననుసరించి 'మీననేత్రి' 'పద్మనేత్రి' ఇత్యాదులు 'అసాధువుల'ని బా. వ్యా. (తత్సమ. 85) మీనములవంటి నేత్రములు గలది—మీననేత్రి—ఈ యర్థమునందిది యసాధువైనను, మీనసులకు నేతృత్వము వహించునవి యనుచో ఈ పదము సాధువేయగును (గు. ప్ర. పుట. 149)

(iii) కాశికావృత్తికారుడు, ముగ్ధబోధ వ్యాఖ్యాత రామతర్కవాగీశుడు మున్నగువారు 'మీనములవంటి నేత్రములు గలది' యనునర్థము నందీరూపములు సాధువులనిరి. (వ్యా. సం. స. పుట 679—680)

చదువరికిఁగల ప్రామాణికస్థాయిని బట్టివీనిని గ్రహించుటో త్రోసిపుచ్చుటో జరుగును.

**అసాధు శబ్దాను కరణము**

వ్యాకరణసమ్మతము కాని శబ్దముల ననుకరించుట. అనుకరణమునందలి భాష సాధువైనను అసాధువైనను గావచ్చును.

"మొక్కేము సామి" అనిరి.

గ్రామ్య మిట్టి యనుకరణము నందు ప్రయోగయోగ్యమగును.

(తె. వ్యా. వి. పుట 527)

**—అసి**

**రూపు**, బలుపు శబ్దములకు మతుబర్థము నందు వచ్చు తద్ధిత ప్రత్యయము.

రూపు+అసి—రూపసి

బలుపు+అసి—బలపసి (ఉ > అ) (ఆం.భా.శా. తద్ధిత. 12)

**అసుర శబ్దము**

రాక్షసుఁడను అర్థముగల శబ్దము. ఇది వికల్పముగా స్త్రీ తుల్యమగును. అనఁగా ప్రథమైకవచన లోపము వచ్చిన రూపము నుండును.

అసుర—అసురుఁడు.

సంస్కృత సమాసమునందు స్త్రీ తుల్యరూపముండదు—రావణాసురుఁడు.

మిశ్ర సమాసములందు రూపద్వయముండును.

ఎల్లయసురలు—ఎల్లయసురులు.

(బా. వ్యా. తత్సమ. 60)

**అసున్**

(న+సున్) సున్ కానిది అని శబ్దార్థము. సున్ అనఁగా ప్రథమావిభ[illegible] అసున్ అనఁగా ప్రథమేతర విభక్తి యని యర్థము. (వై.చం. సంధి. 1[illegible]

**అస్తోభము**

అధికమైన అనావశ్యకమైన పదములు లేనిది. సూత్ర లక్షణములలో [illegible] యొకటి. 'అస్తోభ మనవద్యంచ'.

సూత్రరచన గంభీరముగా, అత్యావశ్యక పదసమేతముగా ధారణ చేయు[illegible] కుచితముగా నుండవలయును (చూ. రమణీ' పుట. 8[illegible]

**అస్త్యర్థము**

అస్తి+అర్థము

అస్త్యర్థమనఁగా 'కలుగు' ధాతువు. దీనికి 'లే' యనునది వ్యతిరేకార్థమునం[illegible] వచ్చును. లేఁడు, లేరు, లేవు, లేను, లేము మున్నగునవి.

(బా. వ్యా క్రియా. 106

**అస్పృష్టము**

స్పృష్టమనఁగా స్పర్శము—స్థానకరణ సంయోగము స్పర్శము.

స్థానకరణ సంయోగము పూర్తిగా లేకుండ ఉచ్చరింపఁబడు వర్ణములు—అచ్చులు, అనుస్వారము శ,ష,స,హ లు (స్వరానుస్వారోష్మణామస్పృష్ట్ కరణమ్ స్థితమ్। ఋ. ప్రా XIII. 8)

నవీను లీయభిప్రాయముతో కొంత భేదింతురు.

**అస్మచ్ఛబ్దము (అస్మద్+శబ్దము)**

అస్మద్ శబ్దమునకు తెనుఁగున పర్యాయవాచకమగు నేను అను శబ్దము[illegible] దీనికంటెఁ బరమందున్న పరుషములకు గ,స,డ ద,వ,లు రావు. ఉదా:- నేఁజ[illegible] వితిన్ మొ॥ (చింతా. సంధి. 23) నేను శబ్దములోని ద్రుతమునకు సరళస్థిరము[illegible] పరమగునపుడు వికల్పముగా లోపము వచ్చును. ఉదా:- నే వింటిని, నేనువింటి[illegible] మొ॥ (చింతా. సంధి. 40)

**అస్మత్పదములు**

నేను, మేము; నన్ను, మమ్ము మున్నగు పదములు

(ఆం. భా. భూ. 10[illegible])

**అస్మదర్థకము**

'నేను' అను అర్థమును బోధించునది. (బా. వ్యా. ఆచ్ఛిక. 23)

**అస్వతంత్రాచ్చులు**

స్వతంత్రముగాని యచ్చులు. హల్లులతోఁజేరిన యచ్చులు. లిపిలో కకారాది హల్లులకుఁజేరు తలకట్టు, గుడి, కొమ్ము మున్నగునవి

క,కి,కు ఇత్యాదులు ✓, ి, ు (గు. వ్యా 16)

**అస్వపద విగ్రహక సమాసము**

విగ్రహ వాక్యమందలి పదములతో నేర్పడని సమాసము.

ప్రతి గృహము (గృహేగృహే)

(త. చం. పుట. 318)

**అస్వరము**

1. స్వరము కానిది-హల్లు

2. ఉదాత్తాది స్వరములు లేని లౌకికోచ్చారణము.

**అస్ఫుటార్థాహ్వయములు**

స్పష్టముకాని యర్థముగల పేళ్ళు. అన్యదేశ్యము లిట్టివని పట్టాభిరామ పండితీయము పేర్కొన్నది. అట్టి శబ్దముల యర్థము స్పష్టపడదు. వాని వ్యుత్పత్తులు సులభముగా గ్రాహ్యము కావని భావము. (ప. పం. 24 ప)

**అహమాదులు:- (అహమ్+ఆదులు)**

అహమ్, కిమ్, ఝుమ్ మున్నగు పదములు. అను కరణమున అచ్చుపరమగునపుడు వీని చివరి యక్షరమునకు ద్విత్వము వచ్చును. అహమాదులు వాక్యాంతమందున్నను వ్యస్తముగా నున్నను అనుకరణమున నీ ద్విత్వము వచ్చును. ఉదా:- దాసోఽహమ్మన్ (దాసోఽహమ్+అన్) జ్ఞాతిశ్ఛేదన లేన కిమ్మనెడి (కిమ్+అనెడి) ఇత్యాదులలో వాక్యాంతమందు ద్విత్వము అహమ్మని (అహమ్+అని) ఇత్యాదులు వ్యస్తముగా నున్నవానికి ఉదాహరణములు. (చింతా, అహో. సంధి. 19) చింతామణికర్త అహమాదులకే ద్విత్వము విధింపఁగా అథర్వణుఁడు పదాంతములగు నన్ని హల్లులకు ద్విత్వము వచ్చుననియు కొన్నిచోట్ల నా ద్విత్వము వైకల్పిక మనియు చెప్పెను. (అథ. కారి. సంధి. 10,11) ఉదా:- జగత్తనియె మొ॥(ఇట ద్విత్వము నిత్యము) దాసోఽహమ్మనియె దాసోఽహమనియె మొ॥

(ఇట ద్విత్వము వైకల్పికము) చి. సూ. అహమాదుల కనుకరణమున ద్విరుక్తి విభాషగానగు (బా. వ్యా. సంధి. 53) నని పేర్కొనెను

**ఆ**[1]

ఆంధ్ర వర్ణ సమామ్నాయములోని ద్వితీయ వర్ణము.

మృదు తాలువు—స్థానము

జిహ్వామూలము—కరణము

వివృత ప్రయత్నము

నాదము

అల్పప్రాణము

దీర్ఘము—నిర్దేశ విధానములందు, కారము, ఇఫము (చూ.) అను ప్రత్యయములు రానిచో హ్రస్వమగును. 'ఆ'కారమునకు మాఱుగా 'ఆ' వచ్చును. 'ఆ' కు) 'ఊ' వచ్చును. (ప్రౌ. వ్యా. సంజ్ఞా. 3)

**-ఆ-**[2]

తద్ధిత ప్రత్యయము.

వగాదులకు, బహువచనాంతములకు పుంస్త్వమున మతుబర్థమునందు వచ్చును.

వగలు+ఆ+ఁడు → వగలాఁడు

కులుకులు+ఆ+ఁడు → కులుకులాఁడు.

'ఆ' మగాది గణమునందు పరిగణింపఁబడుటచే డుజ్ చేరును.

(బా. వ్యా. ఆచ్ఛిక. 4

(బా. వ్యా తద్ధిత. 28)

**-ఆ**[3]

సంబోధనమునందు అకారాంత శబ్దములకు వచ్చును.

రాముఁడు+ఆ → రాముఁడా !

రామ+ఆ → రామా !

మగఁడు+ఆ → మగఁడా !

మిత్రుఁడు+ఆ → మిత్రుఁడా !

(బా. వ్యా. తత్సమ. 33)

ఆ-[4]

(i) దూరమందలి వస్తువును నిర్దేశించు సర్వనామము. ఇది పూర్వాగమము.

ఆ బాలుఁడు, ఆ వనిత, ఆ కొండ

ఇది త్రికము (చూ.) లో నొకటి. దీని మీది హల్లు (ఊష్మరేఫేతరము మాత్రమే) ద్విత్వమగుచో నిది హ్రస్వమగును.

అబ్బాలుఁడు, అవ్వనిత, అక్కొండ.

(ii) పదాద్యంతగతమగు నీ 'ఆ' శబ్దము, సమస్తము, వ్యస్తమునయి కొన్ని యెడల నర్థశూన్యమగును

అర్చనలు చేసిన పువ్వుల యవ్విధంబునన్.

పాడు గాపు నా గతి

ఒక్క సత్క్రతు వది మేలు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 63)

-ఆ-[5]

ది, వి, అనునవి కాక, తక్కిన క్రియావిభక్తులు పరమగునపుడు 'ఉన్నా'ను బంధమున కాదేశమగును.

ప్రథమ : వండుచున్నాఁడు — వండుచున్నారు

మధ్యమము : వండుచున్నావు — వండుచున్నారు

ఉత్తమము : వండుచున్నాను — వండుచున్నాము.

(బా. వ్యా. క్రియా. 15)

-ఆ[6]

ప్రశ్నార్థమునందు క్రియాపదములఁజివరఁజేరును.

చేయును+ఆ ⟶ చేయునా ?

తినును+ఆ ⟶ తినునా ? (సూ. ని.)

-ఆ[7]

క్రియాపదముల యంతమందు వచ్చి, 'ఏని' 'ఎడల' అను నర్థము నిచ్చును.

ఆనతి యిచ్చెను + ఆ ⟶ ఇచ్చెనా ? — ఇచ్చెనేని, ఇచ్చినయెడల అని యర్థము.

మెచ్చెనా?, చొచ్చెనా? ఇత్యాదులు. (సూ. ని.)

-ఆ[8]

సం[ప్రార్థనమునందు మధ్యమ పురుష'ము' వర్ణకమునకు, 'డుఙ్' వర్ణకమునకు నను ప్రయుక్తమగును.

నీవు చెప్పుము+ఆ — చెప్పుమా!

మీరు చెప్పుఁడు+ఆ—చెప్పుఁడా! (సూ.ని.)

**ఆంధ్ర కౌముది**[1]

గణపవరపు వెంకటకవి (చూ.) ప్రణీతము.

ఇది 'సర్వలక్షణ శిరోమణి'యను సమగ్రలక్షణ గ్రంథములోని తృతీయోల్లాసము —వ్యాకరణ సీసమాలిక.

ప్రచురణ: ఆంధ్రసాహిత్య పరిషత్—కాకినాడ సంఖ్య 86. 1985

ఇందు 1023 సీసపాదములు గలవు వానినీక్రింది ప్రకరణములుగా విభజింపవచ్చును.

1. ఆంధ్రోద్భవ కారణము
2. పంచ విధాంధ్ర భాషాస్వరూపము
3. సంజ్ఞా ప్రకరణము
4. అజంత సంధి
5. హలంత సంధి
6. విభక్తినిర్ణయము
7. అవ్యయ పద్ధతి
8. స్త్రీప్రత్యయ కథనము
9. కారక గ్రథనము
10. సమాస భేదము
11. తద్ధిత పదనిష్పత్తి
12. సుప్తిఙన్త వాచక విన్యాసము
13. కృదంత ప్రత్యయరీతి
14. వికల్ప జశ్త్వాదేశ విధము
15. శకార, సకార భేద నిశ్చయము
16. ఖ, ఘ, ధ, థ, వర్ణ సరణి

17. వకార, యకార ద్విత్వశబ్దసరణి
18. సంయుక్తహకార శబ్దభేద ప్రకటనము.
19. రేఫ, ఋకార వివరణము

సంస్కృత వ్యాకరణ సంజ్ఞలు పరిభాష లిందు విశేషముగా కానవచ్చును.

లక్ష్యలక్షణ సమన్వయ మిందుకలదు. ఇందుండి గైకొనఁబడిన సంజ్ఞలకు పాదపంక్తులుటంకితము.

**ఆంధ్రదేశ్యములు**

అన్యదేశ్యములు కానివి. ఆంధ్రదేశము నందు తత్ప్రజావ్యవహారము నందా విర్భవించిన మాటలు. 'తేటగా నర్థమిడునట్టి తెలుఁగు మాటలు'. ఉట్టి, జుట్టు, ఆట, పాట, రోలు-ఇత్యాదులు. (ప. పం 25 పద్యము)

**ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజము**

కర్త: శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులు బి.ఏ

ప్రథమ ముద్రణం : 1933

ద్వితీయ ముద్రణం : 1960

విశాలాంధ్ర ప్రచురణాలయం-విజయవాడ. ఇందు రెండు వ్యాసములున్నవి—

1. మిథ్యాప వాదము
2. భాషాభేషజము.

గ్రామ్యములుగా నిరసింపఁబడిన కతిపయ పదములను సమర్థించుచు, కవి ప్రయోగములను జూపించుట కీరచన కావింపఁబడెను.

భాషాపరిణామ విజ్ఞానమునకీ రచన తోడ్పడును.

**ఆంధ్రభాష**

ఆంధ్రజాతి మాట్లాడుభాష. ఇది తత్సమ, తద్భవ, దేశ్య, అన్యదేశ్యములతో గూడినది.

ఈ భాషకు వర్ణము లేబది యైదు.

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ

ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అఁ, అః॥

క, ఖ, గ, ఘ, ఙ
చ చ,ఛ,జ జ,ఝ,ఞ
ట, ఠ, డ, ఢ, ణ
త, థ, ద, ధ, న
ప, ఫ, బ, భ, మ
య ర ల వ
శ ష స హ ళ —36

55

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 1)

**ఆంధ్రభాషాచరిత్రము**

రెండు సంపుటములు.

ఆంధ్ర విశ్వకళా పరిషత్ప్రచురణము 1936.

కర్త: 'కళాప్రపూర్ణ' చిలుకూరి నారాయణరావు.

విశేష పరిశ్రమతో రచింపబడిన పరిశోధక గ్రంథము. ఇందు 11వ శతాబ్దపు భాషకు వ్యాకరణము కూడ నున్నది. ఆంధ్రభాష సంస్కృత ప్రాకృత భాషా జన్యమని దీని సిద్ధాంతము.

**ఆంధ్ర భాషాను శాసనము**

ప్రథమ ముద్రణము 1926. కర్త: శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి.

దీనికే 'సూర్యనారాయణీయ'మనియు నామాంతరము. ఇది పండితులకు, విద్యార్థులకును నుపయుక్తమగు రీతిని వ్రాయఁబడెను. ఇందు భాషాపరిణామ పద్ధతి పాటింపబడెనని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారి యభిప్రాయము.

ఇందు 'అవ్యయ ప్రకరణము' 'ప్రయోగ విశేష ప్రకరణము' విశేషమైనవి. సంస్కృత సిద్ధరూపములు కొన్ని నిరూపితములు.

**ఆంధ్రభాషా భూషణము**

కర్త: మూలఘటిక కేతన (చూ.) క్రీ.శ. 13వ శతాబ్ది, 192 గద్యపద్యములు. తెలుఁగు భాషకు, తెలుఁగులో లక్ష్యలక్షణములతో వెలసిన తొలిసంక్షిప్త వ్యాకరణము.

ఇందు 'తెలుఁగునఁగల భేదములు-తత్సంధులు--విభక్తులు—సమాసములు—క్రియలు' సంక్షిప్తముగా నిరూపితము (15ప.) సాంకేతిక కాఠిన్యవిరహితముగా కాతంత్ర మార్గమునందు విరచితమైనదీ లక్షణ గ్రంథము.

**ఆంధ్రభాషా భూషణము—దివ్యప్రభా వివరణము**

కర్త: శ్రీ దేవినేని సూరయ్య.

ఆంధ్రభాషాభూషణము (చూ) లోని ప్రతిపద్యమునకు ప్రతిపదార్థ తాత్పర్యములతో గూడిన వివరణ గ్రంథము. దీనికి శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు అనేక వాదోపవాదములతోఁ గూడిన సుదీర్ఘమగు పీఠిక రచియించిరి.

**ఆంధ్రభాషా వికాసము**

కర్త: ఆచార్య శ్రీగంటి జోగిసోమయాజి. ప్రథమ ముద్రణము 1947; ద్వి:ము. 1968

ఆంధ్రభాష సంస్కృత ప్రాకృతజన్యము కాదని, ఇది ద్రావిడభాషా కుటుంబమునకుఁజెందిన భాషయని దాని చరిత్రను వివరించిన తొలిప్రామాణిక గ్రంథము. ఇందు తెనుఁగు వ్యాకరణముల చరిత్ర; అనేక వ్యాకరణ పారిభాషిక పద నిరూపణము, నిశితతార్కిక బుద్ధితో పాండిత్యస్ఫోరకముగా రచింపఁబడెను.

**ఆంధ్ర వ్యాకరణ వికాసము**

ఆంధ్ర వ్యాకరణములపై ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సమర్పింపఁబడిన పరిశోధక వ్యాసము.

కర్త: డాక్టర్ అమరేశం రాజేశ్వర శర్మగారు.

ఇందు ప్రధానముగా ఆన్ధ్రశబ్దచిన్తామణ్యాదుల కర్తృత్వములను గూర్చి, ఆయా వ్యాకరణముల విశేషప్రతిపత్తిని గూర్చి వివరింపఁబడెను.

**ఆంధ్రము**

ఆంధ్ర దేశమునందు ప్రభవించిన భాష. ఇదియు నొకానొక ప్రాకృతభేదమే యని అప్పకవి మున్నగువారి యభిప్రాయము. (అప్ప. I. 81)

**ఆంధ్రవర్ణ సమామ్నాయము**

ఆంధ్ర భాషకుఁగల వర్ణమాల. ఈ వర్ణమాల వేదమువలె అనాదిసిద్ధము, గురుశిష్య పరంపరా ప్రాప్తమగుటచే దీనికి 'సమామ్నాయమ'ను వ్యవహారమేర్పడెను.

ఇందలి సంఖ్య యేఁబదియైదని కొందఱు. కొందఱు ఱ కారమునుగూడఁజేర్చి యేఁబదియాఱందురు. కొందఱు, 'ళ' కారమును దొలగించి, శకట రేఫమును జేర్చిరి.

(తె. వ్యా. వి. పుటలు 1—6
అ. ఛం IV. 123, 126, 127
అప్ప. II. 52)

**ఆంధ్రవ్యాకరణము**[1]

తా. వెంకయ్యచే విరచితమైన ఈ చిన్న వ్యాకరణము విశేషముగా నున్నత పాఠశాల విద్యార్థులకు పఠనీయముగా నుండెడిది. 1916 నాఁటికేమూఁడు ముద్రణ ముల నందినది'

ఇందు (1) సంజ్ఞా (2) సంధి (3) అజంత (4) హలంత (5) క్రియా పరిచ్ఛేదములుండుటను బట్టి ఆంధ్రశబ్దచిన్తామణినే యిది యనుసరించినట్లు కనిపించును.

**ఆంధ్ర వ్యాకరణము**[2]

(చూ.) పట్టాభి రామ పండితీయము.

**ఆంధ్ర వ్యాకరణ సర్వస్వతత్త్వము**

'కళాప్రపూర్ణ' శ్రీవేదం వెంకటరాయ శాస్త్రిగారిచే 'ఆంధ్రవ్యాకరణ సర్వస్వమ'ను గ్రంథముపై కావింపఁబడిన విమర్శ గ్రథము.

ప్రచురణ—1950

**ఆంధ్రీ వ్యాకరణ సంహితా సర్వస్వము**

రెండు సంపుటములు.

కర్త : 'కళాప్రపూర్ణ' వజ్ఝల చిన సీతారామశాస్త్రి.

తొలి సంపుటము—సంజ్ఞా, సంధి, తత్సమ, అచ్ఛిక పరిచ్ఛేదములకు సంబంధించినది.

మలి సంపుటము—కారక, సమాస, తద్ధిత, క్రియా,కృత్, ప్రకీర్ణ పరిచ్ఛేదములకు సంబంధించినది.

ఆంధ్రశబ్ద చిన్తామణికిని, తత్పూరకమగు వికృతి వివేక కారికలకు; తత్సంబంధియగు బాల వ్యాకరణమునకును విపులాతివిపులమగు వ్యాఖ్యానగ్రంథము

ఆంధ్ర విశ్వకళాపరిషత్ ప్రచురణము-1952

**ఆంధ్రశబ్దచింతామణి వృత్తి**

ఆంధ్రశబ్దచింతామణికి సంస్కృతమున వ్రాయఁబడిన వ్యాఖ్య. ఇది సూత్రార్థమును వివరించు వృత్తి, ఉదాహరణములు—వీనితోఁగూడిన లఘువ్యాఖ్య. ఇది యముద్రితము. ఇందలి చివరి పద్యమున మంచెళ్ళ వాసుదేవ కవి ప్రశంస యుండుటచే దీనికి 'వాసుదేవవృత్తి' యనియు వ్యవహారము కలదు. మంచెళ్ళ వాసుదేవుఁడు 'వైకృత చంద్రిక' యనునొక తెనుఁగు వ్యాకరణ గ్రంథమును రచించియున్నాడు. అందీ యాంధ్రశబ్దచింతామణివృత్తిని వ్రాసినట్లు పేర్కొనఁబడకపోవుటచే నీ వృత్తి మంచెళ్ళ వాసుదేవకవిదే యని నిశ్చయముగా చెప్పలేము. (ఆం. వ్యా వి 486 పు.)

**ఆంధ్రశబ్ద తత్త్వము**

కర్త : తాతవెల్లి ముతాదార్ శ్రీ శేషగిరి శాస్త్రి.

ప్రచురణ : 1949

ఇది రెండు భాగములుగా ప్రచురితము. క్రియా ప్రకరణమొక్కటి మొదటి భాగము.

అక్షర, పద, నామ, సర్వనామములు రెండవభాగము.

ఇందు తమిళ, కర్ణాట భాషారూపములతో తులనాత్మక పరిశీలనము గావింపఁబడుట విశేషము

**ఆంధ్రశబ్ద మంజరి**

కర్త : శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు.

చిన్నతరగతి పిల్లలకు ఆంగ్ల సంజ్ఞలతో, సంస్కృత శబ్దమంజరి పద్ధతిలో సంస్కృతాంధ్ర నామములకు వివిధ విభక్తి రూపములు; క్రియలకు వివిధ లకార రూపములు ప్రదర్శితములు.

**ఆంధ్ర శబ్దాను శాసనము**

బాలవ్యాకరణమునకుఁబూర్వము చిన్నయసూరిచే తెనుఁగున సూత్ర ఫక్కిలో విరచితమైన వ్యాకృతి.

ఇందు సంజ్ఞా, సంధి, తత్సమ, ప్రకీర్ణములను నాల్గు పరిచ్ఛేదములే కలవు. ఇది అసమగ్ర రచన. ఇది 1944 లో రచింపఁబడియుండునని, సూరి వ్యాకరణములలో నిది మూడవదని విజ్ఞుల యభిప్రాయము.

దీనిని 1931 లో కాకినాడ ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారు ప్రచురించిరి.

**ఆఁగు పరిభృతులు**

ఆఁగు, రేఁగు, పాయు, విఱుఁగు, చూచు, నేరుచు, మేయు, లేచు, కలియు, తడియు, తెలియు—ఇత్యాదులు.

వీనికి 'అడంగ్వాదుల'కు వలె 'చు' గాగమము; మాయ్వాదులకు వలె పుగాగమము; కొన్నింటికించుగాగమము; కొన్నింటికొక్కటి ప్రేరణమునందగును.

ఆఁగు—ఆఁచు, ఆఁపు, ఆఁగించు

రేఁగు—రేఁచు, రేఁపు, రేగించు

పాయు—పాఁచు, పాపు

లేచు—లేపు.

(బా. వ్యా. క్రియా. 76)

**-ఆఁడి**

'కలది' యను నర్థమున వచ్చు తద్ధిత ప్రత్యయము. ఇది స్త్రీ లింగమున బహువచనముకంటె పరముగా వచ్చును.

ఉదా:- వన్నెలాఁడి. మొ॥ (అథ. కా. అజన్త. 51) చూ· ఆ2.

**-ఆఁడు[1]**

'ఆ' తద్ధిత ప్రత్యయమని, దీనిని మగాది గణము నందుఁజేర్చి—డుఙ్ చేర్చు ప్రక్రియను బాలవ్యాకరణము నిరూపింపగా (చూ. -ఆ-[2]) స్వతంత్ర వ్యాకరణములనఁదగు ఆంధ్ర భాషా భూషణము, కావ్యాలంకార చూడామణి, ఆంధ్రకౌముది '-ఆఁడు' తద్ధిత ప్రత్యయముగాఁ బేర్కొన్నవి. ఇది నీచార్థమును దెల్పునని ఆం. భా. భూ. (165). నీచార్థము ప్రకృతియందే కలదు. ఉదా:- బొంకులాఁడు, తగవులాఁడు

(కా. చూ. IX. 143)
(ఆం. కౌ. 644–46)

**-ఆఁడు[2]**

'కలవాడు' ఇత్యాద్యర్థములందు వచ్చు తద్ధితప్రత్యయము. ఇది పుంలింగమున బహువచనము కంటె పరముగా వచ్చును. ఉదా:- మాయలాఁడు మొ॥ (అథ. కా. అజన్త 50). స్త్రీ లింగమున మాత్రము ఆఁడి యను వర్ణకము వచ్చును. ఉదా:- వన్నెలాఁడి మొ॥ (అథ. కా. అజన్త. 51) చూ:- ఆ 2.

**-ఆఁడు**[3]

(చూ. -ఆ-[2])

ప్రథమ పురుష ఏకవచన ప్రత్యయము.

పల్కుచున్న+ఆఁడు—పల్కుచున్నాఁడు.

(ఆం. కౌ. పంక్తి. 701)

**ఆఁదోశేత్యాదులు**

'ఆఁదోక' (ఆవు+తోక) మున్నగు ఆచ్ఛిక సమాసములు ఇట్టి సమాసములు కొన్నిటియందు వర్ణలోపాగమాదేశ వికారములు నిత్యములు.

ఆ వల (ఆ+వలను) ఇబ్బంది (ఇరు+పంది) కవ్వడి (కవ+వడి) మున్నగు నవి. (ప్రౌ. వ్యా. సమాస. 36)

**-అక్**

సంపద్, ఆపద్ శబ్దములకు విభక్తులు పరమగునపుడు వచ్చు ఆగమము - ఇందలి కకారమిత్సంజ్ఞకమై లోపించును. ఇది కిత్తగుటచే సంపద్, ఆపద్‌శబ్దములకంత్యావయవముగా వచ్చును. ఉదా:- సంపదా, ఆపదా. పిదప దీనికి హ్రస్వము వచ్చి సంపద, ఆపద అని యగును.

(వై. చం. హలన్త. 85)

**అకాంక్ష**

నిలుపుదల లేక పయింబయిఁబోయెడి పదార్థముల మీఁది యాదరము. అది వినువారికి తెలిసికొనవలయుననియెడి యపేక్షారూపమయినది. ఇది యర్థమునకు సంబంధించినది.

(ప్రౌ. వ్యా. వాక్య. 1, తత్త్వ. పుట. 344)

అన్వయమునకై యొకపదము మరియొక పదమును గోరుట — క్రియనుబట్టి కర్తృ కర్మాదులను, విశేష్యమును బట్టి విశేషణమును దెలిసికొనుటకుఁజేసెడి ప్రశ్నము.

**ఆకాంక్షా సమాప్త స్వరాంతములు**

ఆకాంక్ష (చూ.) పూర్తియగునట్లుచ్చరింపఁబడిన వాక్యములు. వాక్యభేదములలో నొకటి. వీనినే యాంగ్లమున 'Statements' అందురు.

(తె. వ్యా. వి పుట 1057)

**ఆకారము**[1]

'ఆ' అను వర్ణము. చూ. ఆ[1].

(త. చం. 14)

**ఆకారము**[2]

తదర్థకము—వాఁడు, అది ఇత్యాదులు.

దీని యామ్రేడితమునకు (చూ.) 'అయి' (చూ.) విభాషగా నగును.

(బా. వ్యా. సమాస. 21)

**ఆకృతి గణము**

ఆకారమును బట్టి యింకను కొన్ని పదములను జేర్చుకొనుట కవకాశమిచ్చు పద సమూహము.

ఒకేవిధమగు వ్యాకరణ కార్యము కల్గు పదముల సమూహము. ఇట్టి గణము నందలి కొన్ని పదములను మాత్రమే వ్యాకర్త ప్రదర్శించి, "ఇత్యాదుల"ని కడపట పేర్కొనును.

ఇట్లు గణములనేర్పరచుటలోనే వ్యాకర్త నేర్పుండును. ఇట్టి పదసమూహము నందు సుప్రసిద్ధము, శ్రుతి మనోహరమునగు పదము నొక దానిని వ్యాకర్త యెన్నికఁజేసి, దాని పేరట నీ గణము నేర్పఱచును. ఉదా:- కడాదులు, అంద దుకు ప్రభృతులు, చరిత్రాదులు. వ్యతిరేకము - నియత గణము (చూ.)

(రమణీ. 491–494)

**ఆఖ్యాత**

చెప్పువాఁడు — గురువు, అధ్యాపకుఁడు.

నియమపూర్వక విద్యాస్వీకారమునందు ఆఖ్యాతకు 'తోడ' వర్ణక మగును.

రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి.

(చూ. ఆఖ్యాతోపయోగే, పా. I 4 29)
(బా. వ్యా. కారక. 7)

**ఆఖ్యాతము**

'చెప్పఁబడినది' అని శబ్దార్థము. తిఙ్ప్రత్యయము గాని తిఙన్త పదముగాని 'ఆఖ్యాత'మన నగును.

ఆఖ్యాతము కర్తనుగాని, కర్మనుగాని చెప్పును. 'రాముఁడు రావణుని సంహరించెను.'—ఇందు ఆఖ్యాతము—ఎను. ఇది కర్తను జెప్పునది కావున తద్వాచకమగు 'రామ' శబ్దమునకుఁ బ్రథమయయ్యెను.

'రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె' — 'పడియె' నను ఆఖ్యాతము కర్మను జెప్పును. కావున తద్వాచకమగు 'రావణ' శబ్దము కర్మమయ్యెను.

(బా వ్యా. కారక. 1)

భావప్రధానమైనది ఆఖ్యాతమని, నామము, సత్త్వప్రధానమైనదని నిరుక్తము (భావప్రధాన మాఖ్యాతమ్; సత్త్వ ప్రధానాని నామాని॥ నిరుక్త. I. 1)

నాల్గు విధములగు పదజాతములో ఆఖ్యాతము రెండవది (చత్వారి పదజాతాని। నామాఖ్యాతోపసర్గ నిపాతాశ్చ। నిరుక్త I. 1). 'క్రియావచన మాఖ్యాతమ్'—వాజసనేయప్రాతిశాఖ్య-V-1. ఇట్టి ప్రమాణములను బట్టి క్రియారూపముగూడ ఆఖ్యాతమగును.

**ఆగమము**

'రాక' యని శబ్దార్థము. ఇట అధికముగా వచ్చెడి వర్ణమని యర్థము. 'ఆగమ మనగా వర్ణాధిక్యమ'ని చిన్నయసూరి, 'మిత్త్రివ దాగమః'—శత్రువు వలె ఇతర వర్ణములను ద్రోసిపుచ్చికాక, మిత్త్రునివలె ఉన్నవర్ణముల నట్లుంచి అదనముగాఁజేరుట.

ఆగమ వర్ణము పూర్వమందుఁజేరిన పూర్వాగమమగును—రథము; అరదము అంతమందుజేరిన 'అంతాగమ' మగును. (చూ.)

(బా. వ్యా. సంధి. 8)

**ఆగమ 'ము', 'వు' వర్ణములు**

(i) ఆగమముగా వచ్చిన 'ము' 'వు' అను వర్ణములు.

వృక్షము — వర్ణకము (చూ )

వృక్షములు, వృక్షములను — ఇత్యాదులలో ముగాగమము. ఇది వర్ణము మాత్రమే. ఇట్లే ధేనువు - ధేనువులు—ఇత్యాదులు

(ii) ఇట్టి ఆగమ 'ము' 'వు' వర్ణములకు-'అందు' వర్ణకము పరమగునపుడు 'ను'గాగమము విభాషగా నగును.

వనమునందు — వనమందు

ధేనువునందు — ధేనువందు.

(బా. వ్యా. తత్సమ. 40, 80)

**ఆగమయకారము**

పదము నందవయవముగాఁగాక సంధి నివారకమగు ఆగమముగా వచ్చిన యకారము.

హరి+అతఁడు ⟶ హరియతఁడు

(బా. వ్యా సంజ్ఞా. 18)

**ఆగమ శాస్త్రము**

వివిధములగు ఆగమములను విధించు శాస్త్రము. 'ఆగమ శాస్త్ర మనిత్యమ్' అని పరిభాష అనఁగా కొన్ని యాగమములు ప్రయోగములనుబట్టి కొన్ని యెడల రాకపోవచ్చును.

'షష్ఠీసమానము నందుకార ఋకారములకచ్చు పరంబగునపుడు నుగాగమము' విధింపబడినను 'బచ్చింట' 'రాజంతవాని' అను ప్రయోగములందు నుగాగమము రాకున్నది.

అయినచో 'కు వర్ణకము పరమగునపుడు......కొన్నియెడల నగాగమంబు చూపట్టదు' (ప్రౌ. వ్యా. శబ్ద. 19) అను సూత్రమనావశ్యకమగునుగదా ! ఇట్టి శంకను వారించుటకు ప్రౌఢ వ్యాకరణ కర్త "కుశ్నార్థ దోష విస్ఫురణంబు కలుగక వువర్ణాంత శబ్దముల మీఁద నకారాగమము వచ్చుటకే తత్సూత్రారంభ ప్రవృత్తియై యుండునుగాన నచ్చోమాత్ర మయ్యది యత్యావశ్యకమనియెుఁదోచు చున్నద"ని వ్రాసికొనెను. అయినను 'తూపుకోర్వక'. 'సొంపుకుఁ బస జూపు' వంటి ప్రయోగములు లేకపోలేదు.

(ప్రౌ. వ్యా శబ్ద. 19)

**ఆగమ సంధి**

ఆగమములచే నివారింపఁబడిన సంధి. నుగాగమ సంధి, టుగాగమ సంధి, రుగాగమ సంధి మున్నగునవి.

రాజునాజ్ఞ, చిగురుటాకు,ధీరురాలు.

(ప్ర. వ్యా. సంధి. 56)

**ఆగమాన్యచకారములు**

ఆగమ చకారము, అన్య చకారము.

ఇంచుగాగమములోని చకారము—ఆగమ చకారము. ధాతు గతమగు చకారము—అన్య చకారము. వీనికి క్రమముగాఁగొన్ని చోట్ల ప, వ, లు వచ్చును.

పచించు+డు ⟶ పచింపఁడు

పచించు+ము ⟶ పచింపుము

పిలుచు+ఁడు ⟶ పిలువఁడు

పిలుచు+ము ⟶ పిలువుము

(బా. వ్యా. క్రియా. 88, 89)

**ఆగామ్యర్థక క్రియ**

భవిష్యత్కాలిక క్రియ. (చింతా. క్రియా, 9)

ఉదా:- చేయఁగలడు మొ॥

**ఆచ్ఛిక ద్వంద్వము**

సంస్కృత సమేతరమగు—అనఁగా ప్రాకృతసమ, సంస్కృతభవ, ప్రాకృత భవ దేశ్యపదములతో నేర్పడిన 'ఉభయపదార్థ ప్రధానమ'గు సమాసము.

ఇట్టిసమాసములందు పూర్వపదము తఱుచుగా స్త్రీసమము (చూ.) గా నుండును.

అన్నదమ్ములు, తల్లిదండ్రులు

కూరగాయలు—మున్నగునవి.

(బా. వ్యా. సమాస. 7.)
(సు. వ్యా. ,, 8.)

**ఆచ్ఛిక మిశ్రము**

అచ్ఛిక పదముతో అన్యదేశ్యపదము సమసింపగా నేర్పడిన సమాసము.

రేడియోపాట

సామానుబండి ఇత్యాదులు.

(వ్యా. బా. వ్యా. సమాస. 12)

**ఆచ్ఛికము**

'అచ్చ' సంబంధమైనది. (చూ.) 'అచ్చ'

ప్రాకృతసమ, సంస్కృతభవ, ప్రాకృతభవ, దేశ్యపదములతోఁగూడిన భాష.

సిరి, అసము, ఒజ్జ, ఇల్లు ఇత్యాదులు.

(బా. వ్యా. క్రియా. 103.
,, ప్రకీర్ణ. 17)

తేరు — తేట

సకలధాతువులకును భావార్థమునందు 'ట' అను ప్రత్యయమొకటి చేరును. ఇది చేరునపుడు 'ట' అంత లోపముండదు. ఆడ్వాదులకుఁ మాత్రమే యిట్టి 'ట' వర్ణకము చేరును. అప్పుడంతిమాక్షరము లోపించును.

ఆడు < ట — ఆడుట (Playing)
ట — ఆట (Play)

(బా. వ్యా. కృదంత. 7; రమణీ, 454-455)

**అత్మ**

ఈ శబ్దమునకు స్త్రీత్వము (ప్రథమైక వచన లోపము) బహుళము.

ఆత్మ - ఆత్మము - ఆత్ముఁడు

(బా. వ్యా. తత్సమ. 77)

**అత్మనేపద కర్త్రర్థకము**

తన కొఱకై తానుజేయు క్రియ.

'చైత్రుఁడు వంటకమును వండుకొనుచున్నాఁడు' — అనఁగా అన్యులకొఱకుఁగాక తన నిమిత్తమే వంటకమును వండుచున్నాఁడని యర్థము.

ఇట్టి యర్థమునందు - కొను ధాతువనుప్రయుక్తమగును.

(బా. వ్యా. క్రియా. 122)

**ఆత్మనేపద కర్మార్థకము**

తనకొఱకై తనచేత చేయఁబడు క్రియ.

మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను — ఈ యర్థమునందు '-కొను' '-పడు' అను రెండు ధాతువు లనుప్రయుక్తమగును. కర్త తృతీయావిభక్తియందును, కర్మ ప్రథమా విభక్తియందును నుండును.

(బా. వ్యా. క్రియా. 122)

**ఆత్మనే పదార్థము**

'తఙానా వాత్మనేపదమ్ (అష్టా 1-4-100) అను పాణినీయముచే సంస్కృతమున తఙ్ (త, ఆతాం, ఝ ఇత్యాదులు) ఆన (శానచ్, కానచ్) ప్రత్యయ

ములకు ఆత్మనేపదసంజ్ఞ విధింపఁబడినది. క్రియాఫలము సాధారణముగా ఆత్మకు అనఁగా కర్తకు చెందుటను తెలుపు క్రియలు ఆత్మనే పదార్థమునకు చెందును. చి. సూ. క్రియాఫలంబు కర్తృగామియగుచో కొనుధాతువు అనుప్రయుక్తంబగు (బా. వ్యా క్రియా. 52) అను సూత్రముచే ఆత్మనేపదార్థమున కొను ధాతువు అను ప్రయోగమును విధించెను. ఉదా - వండుకొనుచున్నాఁడు మున్నగునవి. ఇట క్రియాఫలము కర్తకే చెందుటచే వండుకొనుచున్నాఁడు ఇత్యాదులు ఆత్మనే పదార్థమునకు చెందిన క్రియలు. క్రియాఫలము కర్తకుకాక ఇతరులకు చెందినచో వండుచున్నాఁడు అనియే యుండును. చింతామణికర్త ఆత్మనే పదార్థమున కొను ధాతువు అను ప్రయోగమును తెలుపకయే 'ఆత్మనే పదార్థముగల గ్రహిధాత్వర్థము పరమైనపుడు ఇంచుగాగములోని చువర్ణమునకు వికల్పముగా ఇత్వము వచ్చునని తెలిపెను ఉదా:- ఘటించుకొని, ఘటించికొని ఇత్యాదులు. (చింతా. క్రియా. 38). ఆత్మనే పదార్థమునందేకాక కొన్ని ధాతువులకు స్వార్థ (ధాత్వర్థ) మందును కొను ధాతువను ప్రయుక్తమగును. ఉదా:- పండుకొను, ఈకొను, రక్కొను ఇత్యాదులు (బా. వ్యా. క్రియా. 109)

**ఆత్మభ్వాదులు**

ఆత్మభూ, మనోభూ, స్వయంభూ మున్నగు శబ్దములు. పృథ్వీవాచక భూ శబ్దము తెలుఁగులో సమాసము చివర నుండదని నిషేధింపఁబడినది. పై సమాస శబ్దముల చివరి భూశబ్దము పృథ్వీవాచకము కాకపోవుటచే నవి ప్రయోగార్హములే (అథ. కా. అజన్త. 46). వీనియందలి భూశబ్దము భూధాతు రూపమేకాని పృథ్వీ వాచకముకాదు.

**ఆత్మశబ్దము**

ఆత్మశబ్దమునకు తెలుఁగులో పర్యాయ వాచకమగు 'తాను' అను శబ్దము. దీని కంటె పరమందున్న పరుషములకు గ, స, డ, ద, వ, లు రావు. ఉదా:- తాఁ జదివె మొ॥ (చింతా సంధి. 28). తాను శబ్దములోని ద్రుతమునకు సరళస్థిరములు పరమగునపుడు వికల్పముగా లోపము వచ్చును. ఉదా:- తాఘనుఁడు; తానుఘనుఁ మొ॥ (చింతా. సంధి. 40)

**ఆత్మార్థకము**

| (i) | ఏక.వ. | బ.వ. |
|---|---|---|
| ప్రథమా విభక్తి | తాను | తాము, తారు, తమరు |
| ద్వితీయా విభక్తి | తన్నను | తమ్మను |
| తృతీయా విభక్తి | తనచేతను | తమచేతను |

(ii) **ఆత్మార్థకమగు** 'తాను' శబ్దము కర్తయగుచో ధాతువునకును విశేషణములకును ఆ 'తాను' అనుదాని లింగవచనములే యమరును. వాక్యమునందు పెక్కు కర్తలున్నను వానితోపాటు 'తాను' అనునదియునున్నచో విశేషణములును, ధాతువును, తక్కిన కర్తలయొక్క లింగవచనముల ననుసరింపక 'తాను' అనుదాని లింగవచనములనే పొందును.

'రాముడు రావణుం బరిమార్చి సీతయుం**దాను** సౌమిత్రి సహితంబుగఁ బుష్పకారూఢుం*డయి* సాకేతంబున కేతెంచె— ఈవాక్యమునందు 'తాను' లేకున్నచో 'పుష్పకారూఢు*లయి* సాకేతంబున కేతెం*చిరి*' అని యుండవలసి వచ్చును.

(బా. వ్యా. ఆచ్ఛిక. 24)

(బా. వ్యా. క్రియా. 120)

(iii) ఆత్మార్థ మొకానొకచో నామార్థమును, అస్మదర్థము నొసఁగును. **తనకు** మఱితానె చుట్టము - (స్త్రీకి) : తమసొమ్ము తమకిచ్చి (మాసొమ్ము)

(ప్రౌ. వ్యా. శబ్ద. 73)

**ఆత్మాస్మచ్ఛబ్దములు**

(ఆత్మన్+అస్మద్+శబ్దములు) ఆత్మశబ్దమునకు పర్యాయవాచకమగు తాను శబ్దము, మఱియు అస్మచ్ఛబ్ద పర్యాయవాచకమగు నేను శబ్దము (చింతా. సంధి. 23, 40) చూ:- ఆత్మశబ్దము, అస్మచ్ఛబ్దము.

**ఆదంతపాది శబ్దము**

(అ+ఆత్+అంత=ఆదంత) అకారము లేక ఆకారము అంతమ దుఁగల పకారాది శబ్దము. ఉదా:- పడు (అకారమంతమందుఁగల పకారాది శబ్దము), పాటు (ఆకారమంతమందుఁగల పకారాది శబ్దము) మొ॥ ఇట్టి శబ్దములు పరమగునపుడు ప్రథమైకవచనప్రత్యయమగు 'ము' వర్ణమునకు లోపబిందువులొకానొకచో నగును ఉదా:- భయపడి, భయంపడి, భయముపడి-సంతోషపాటు, సంతోషంపాటు, సంతోషముపాటు మొ॥ (అథ. కా. సంధి. 9, అహో.సంధి. 16)

**ఆదరార్థము**

అతిశయమగు ప్రీతియే ఆదరము. ఇట్టియాదరమును దెల్పునట్టి యర్థమునందు శబ్దములు ద్విరుక్తములగును.

కృష్ణ కృష్ణ ; హరిహరి

(ప్రౌ. వ్యా. శబ్ద. 11)

**ఆదులు**

అ+ఆదులు.

అకారమాదిగాఁగల స్వరములు. వీనినే అచ్చులందురు.

(ఆం. భా. భూ. 16; అప్ప. II. 7)
ఆం. కౌ. 58 పంక్తి

**ఆదేశము**

ఒక వర్ణమును గొట్టివేసి మఱియొకటి దాని స్థానమునఁ జేయుట.

నిద్ర+పోయె — నిద్రవోయె

ఇట పకారమునకు వకార మాదేశము.

'శత్రువదాదేశః' అను ప్రసిద్ధోక్తి నప్పకవి యిట్లనువదించెను.

"పుడమిఁ దొల్లింటి రాజుల వెడలనొత్తి
వారి నెళవులఁ దాముండు వైరినృపుల
పగిది మునుపున్న వ్రాలను బాఱఁద్రోలి
తామచట నిల్చు నాదేశ నామకములు"

(అప్ప. V. 19)

**ఆదేశ సరళములు**

పరుషములగు 'క, చ, (చ) ట, త, ప' లను ద్రోసివచ్చి వాని స్థానము నందు క్రమముగా వచ్చిన 'గ, జ, జ, డ, ద, బ' లు

పూచెను+కలువలు — పూచెనుగలువలు

వ్యతిరేకము - సహజ సరళములు (చూ.)

(బా. వ్యా. సంధి. 17)

**ఆద్యక్షరము**

ఆది + అక్షరము

పదముయొక్క మొదట నున్న అచ్చుగాని, అచ్చుతోఁగూడిన హల్లుగాని యక్షరమగును.

"నిందయం దామ్రేడితంబు నాద్యక్షరమునకు 'గి' 'గీ' లగును."

కుంభకర్ణుఁడు + కుంభకర్ణుఁడు

కుంభకర్ణుఁడు + గింభకర్ణుఁడు

వాలి + వాలి — వాలి, గీలి

(బా. వ్యా. ప్రకీర్ణ. 22)

**అద్యక్షర శేషము**

తక్కిన యక్షరములు లోపింపగా మిగిలిన మొదటి యక్షరము.

క్రొత్త + ఛాయ

క్రొ + ఛాయ

↓ ఆద్యక్షర శేషము

క్రొ + ను + ఛాయ – క్రొంజాయ

(బా. వ్యా. సంధి. 38)

**అద్యపదములు**

ఆద్య భాషయగు సంస్కృత భాషయందలి పదములు. ప్రథమా విభక్తికంటె పరమందున్న ఇట్టి శబ్దముల తొలి పరుషములకు గ, స, డ, ద, వ లు రావు ఉదా:- రామనామము పాపహరము. (అథ. కా. సంధి 16) ఐనను గసడదవా దేశము ఇట్టి యుదాహరణములలో కొన్నింట కాన్పించును.

**అద్య ప్రకృతి**

మొదటి మూలము; మొదటి కారణము.

(చూ.) ప్రకృతి.

ఆంధ్ర భాషకు అద్యప్రకృతి సంస్కృత భాష యని; ప్రకృతి ప్రాకృతమని ప్రాచీనుల యభిప్రాయము.

ఆ రెండింటికి తెనుఁగు 'వికృతి' (చూ.) యనియు వారు పేర్కొనిరి.

(అప్ప. I. 84)

**అనంతర్యము**

ఆంతరమనఁగా రెండింటి నడుమను నుండు కాలవ్యవధి. అంతరము లేనిది అనంతరము. అనంతరత్వమే ఆనంతర్యము.

(i) అవ్యవధికముగా వెంటవెంటనే జరుగు వ్యాపారములలో తొలిదానిని

(కారణక్రియ చూ.) దెలుపు ధాతువునకు-డున్ వర్ణకము వచ్చును

'జాబిలి తోఁతెంచుడుం'

గువలయంబులు వికసిల్లె"—ఇందలి రెండుక్రియలలో పౌర్వాపర్యములేదు. కావున తొలిక్రియ భూతార్థమందుండదు దానికి—డున్ వర్ణకము చేరినది.

(బా. వ్యా. క్రియా. 42, రమణీ. 402 పుట)

(ii) కొన్ని యెడల భావార్థక క్రియపై 'ను' శబ్దము పరమై ఆనంతర్యార్థక మగును.

'అనుటయు లుబ్ధకుండిట్లనియె' అనిన వెంటనేయని యర్థము.

(ప్రౌ. వ్యా. క్రియా. 12)

**ఆనంతర్యార్థకము**

అనంతరమునకు సంబంధించిన యర్థము కలది.

చూ ఆనంతర్యము. (ప్రౌ. వ్యా. క్రియా 12)

**ఆనందరంగరాట్ఛందము**

కర్త :- లక్షణకవి కస్తూరి రంగయ్యకవి.

వావిళ్ళవారి ప్రచురణ-1922

ఇది ప్రధానముగా ఛందోగ్రంథమే యయినను చతుర్థాశ్వాసమునందు కొన్ని 'సంధిభేదములు' 'అచ్చెరువైన విభక్తి రీతులు' 'అరుదైన సమాస సంగతులు, కవిప్రయోగ ప్రదర్శనముతోపాటు నిరూపితములు.

**ఆనాదేశము**

-'ఆన' అను శబ్దముయొక్క ఆదేశము

(i) మహత్త్వమునందు మతుబర్థక 'త' కారమునకు ఒకానొకచో విభాషగా ఆన ఆదేశింపఁబడెను

హనుమంత < హనుమాన-హనుమానుఁడు / హనుమంతుడు

భగవంత < భగవాన-భగవానుఁడు / భగవంతుడు

(బా. వ్యా. తత్సమ. 74)

(ii) ఆమ్రేడితము పరమగుచో 'కోటి' శబ్దఇత్వానికి ఆనాదేశము విభాషగా వచ్చును.

కోటి+కోటి+లు→కోటానకోట్లు/కోట్లు కోట్లు

(వ్యా. భా. వ్యా. శబ్ద. 405)

**అనీలు**

ఆ ఈలు—వీనికి హల్లు పరమైన నివి నిడుపుగా నుండిన నుండవచ్చును. లేదా మీఁది హల్లు ద్విత్వము చెందిన నిడుపులు హ్రస్వము లగును.

ఆకరి, అక్కరి, ఈవిధి, ఇవ్విధి. చూ. త్రికసంధి

(కా. చూ. IX 186, 187)

**అనునాసిక్యము**

అనునాసిక ధర్మము; ముక్కుతోఁబలుకుట. ముక్కులోనుండి గాలిని వదలు నట్లుగా నుచ్చరింపఁబడు ధ్వనులు అనునాసిక్యమును (Nasalisation) బొందును.

ఙ, ఞ, ణ, న, మ (ఆం. భా. వి. పుట. 298)

**అపదాదులు**

'ఆపద' మున్నగు పదములు

వీని ప్రథమైక వచన తుల్యరూపములపై ఉత్వద్విత్వములు చేరగా నొక విధ మగు రూపములు ద్వితీయైక వచన తుల్యరూపములలోని 'ము' లోపము చేరగా నేర్పడు రూపములు. ఇట్లు ద్వివిధ రూపములు సిద్ధించును.

ఆపత్తు—ఆపద

తృట్టు—తృష

సంపత్తు—సంపద

క్షుత్తు—క్షుధ

ఉత్వద్విత్వరూపములు అర్వాచీనములు. (వ్యా. భా. వ్యా. శబ్ద. 121)

**ఆబాదులు**

(ఆప్+ఆదులు) ఆప్ మున్నగు ప్రత్యయములని శబ్దార్థము. టాప్, డాప్, చాప్, అను ప్రత్యయములన్నింటిలో ఆప్ అను అనునది సమముగా నుండుటచే

ఆప్ అనుదానిచే టాప్, డాప్, చాప్ అను మూఁడును గ్రహింపఁబడును. ఆబాదులనఁగా టాప్, డాప్, చాప్, జీప్, జీష్, జీన్, ఊఙ్, తి అను స్త్రీప్రత్యయములు. ఇవి తెనుఁగునను తత్సమ పదములపై నిత్యముగా వచ్చును. ఉదా:- అజ, అశ్వ మొ॥ చూ.:- స్త్రీ ప్రత్యయములు, టాబాదులు.

**ఆభాస కర్మధారయము**

కర్మధారయ సమాసమను భ్రాంతిని గల్గించు బహుబ్రీహి సమాసము. ఇట్టివి ప్రయోగింపరాదందురు.

కలరవము (కలః రవః యస్యసః) ఇట కలమైన రవమని కర్మధారయ భ్రాంతికలుగును. కాని 'పారావతః కలరవః' అని 'కలరవ' పదము బహుబ్రీహిగానే 'పావురము' అనునర్థమునందు ప్రయోగింపఁబడెను (అమరకోశము). ఇట్లే 'చలివెలుఁగు' అనుచో 'చల్లని వెలుఁగు' అను కర్మధారయ భ్రాంతి కలుగ వచ్చును.

(వి. వి. హలన్త. 17; త. చం. 612 (జ)

(బా. వ్యా. సమాస. 6)

**ఆభాస బహుబ్రీహి[1]**

'బహుబ్రీహి' సమాసమను భ్రాంతిని కలిగించు కర్మధారయ సమాసము. ఇట్టి దానిని ప్రయోగింపరాదందురు

అధ్యాసిత తరువు (అధ్యాసితశ్చ అసౌతరుః) ఈ కర్మధారయ సమాసము—అధిష్ఠింపఁబడిన తరువు గలవాఁడు—అనురీతిని 'బహుబ్రీహి'యను భ్రాంతిని కలిగించుచున్నది.

(వి. వి. హలన్త. 19; త. చం. సమాస. 536 21)

**ఆభాస బహుబ్రీహి[2]**

బహుబ్రీహివలె కనిపించుసమాసమని శబ్దార్థము. ప్రథమాంతములగు వాఁడు, అది యను శబ్దములంతమందు గల బహుబ్రీహి ఆభాసబహుబ్రీహి. ఉదా:- మూఁడు కన్నులవాఁడు, మూఁడు కన్నులయది మొ॥ (అథ. కా. హలన్త 29) పై సూత్రమున 'ప్రథమాంత ప్రయోగతః' అనుటవలన తచ్ఛబ్దము (వాఁడు, అది, అనునవి) మాత్రమేకాక ఇతరప్రథమాంత శబ్దములంత మందుఁగల శబ్దములును ఆభాస బహుబ్రీహులగును. ఉదా:- పట్టుపుట్టముదొర మొ॥

**అభ్యంతర ప్రయత్నము**

భాషాధ్వని నుచ్చరించుటకు నోటియందు జరుగు ప్రయత్నము. ఇది నాల్గు

విధములు:-

(i) స్పృష్టము—వర్గాక్షరములు.

(ii) ఈషత్ స్పృష్టము—య, ర, ల, వ

(iii) వివృతములు—శ, ష, స, హ, -అచ్చులు

(iv) సంవృత్తము—ప్రయోగమందలి అకారము.

(వ్యతి.) బాహ్య ప్రయత్నము (చూ.)
(ఆం. భా. వి. పుట 279)

**ఆమ్**[1]

సంస్కృతమున షష్ఠీవిభక్తి బహువచన ప్రత్యయము. ఉదా:- మరుతామ్ (మరుత్+ఆమ్) మొ॥

**ఆమ్**[2]

షష్ఠీబహువచన ప్రత్యయాంతమునకు పరముగా మతుప్ప్రత్యయ స్థానమున వచ్చు ఆదేశము. ఇందలి మకార మిత్సంజ్ఞకము. ఇది మిత్తగుటచే వికృతి పదములపై మాత్రమే వచ్చును. (చూ. మిత్) ఉదా:- వన్నెలాడు, వగలాడు మొ॥
(వై. చం. తద్ధితా. 2)

**ఆమంత్రణము**

సంబోధనము.

సంబోధనమునందు ఓ -

అను శబ్దము సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడును.

ఓ రాముఁడా!

ఓ కృష్ణ

(బా. వ్యా. తత్సమ. 14)

**ఆమ్రేడితము**

రెండు పర్యాయములు గాని, మూఁడు పర్యాయములుగాని యుచ్చరింపఁబడినది 'ఆమ్రేడిత'మని అమరసింహము. (ఆమ్రేడితమ్ ద్విస్త్రిరుక్తమ్) 'తస్యపర మామ్రేడితమ'ని పాణిని. (8-1-2) 'ద్విరుక్తస్యపరం రూపమామ్రేడిత సంజ్ఞం స్యాత్' అని సిద్ధాంత కౌముది. ఇట్టి నిరూపణమాధారముగా 'ద్విరుక్తముయొక్క పరరూపమామ్రేడితమ'ని చిన్నయసూరి స్పష్టముచేసెను.

ఒక పదమును రెండుసారులుచ్చరించుచో రెండవసారి యుచ్చరించునది ఆమ్రేడితము.

ఆహా[1] + ఆహా[2] — ఆమ్రేడితము.

(అప్ప. V. 96)

(బా. వ్యా. సంధి. 10; రమణీ పుట 199)

**ఆమ్రేడిత సంధులు**

(i) అచ్చున కామ్రేడితము (చూ.) పరమగుచో సంధి తఱుచుగానగును.

సామాన్యముగా దీర్ఘాంతములైన పదములు తెనుఁగున నుండవు. ఉన్నను సంధి కలుగదు. దీనికపవాద మీ సంధిలోఁ గానవచ్చును.

ఆహా+ఆహా — ఆహాహా !

ఎట్టూ+ఎట్టూ — ఎట్టెట్టూ !

(బా. వ్యా. సంధి. 10)

(ii) ఈ సంధిలో 'కడాదుల' (చూ.) తొలియచ్చుమీఁది వర్ణముల కెల్ల అదంతమగు ద్విరుక్త 'ట'కారమగును

కడ+కడ — కట్టకడ

ఎదురు+ఎదురు — ఎట్టయెదురు

(బా. వ్యా. సంధి. 40)

(iii) ఆమ్రేడితము పరమగుచో విభక్తి లోపము బహుళముగా నగును

అప్పటికిన్ + అప్పటికిన్ < అప్పటప్పటికిన్ / అప్పటికప్పటికిన్

ఇంచుక + ఇంచుక — ఇంచించుక.

(బా. వ్యా. సంధి 41)

(iv) 'అందదుకు' ప్రభృతులు (చూ.) యథాప్రయోగముగా గ్రహింపనగును.

అదుకు+అదుకు—అందదుకు - ఇట్లే తుత్తునియలు, బట్టబయలు ఇత్యాదులు.

(v) ఆమ్రేడితము పరమగునపుడు కృత హ్రస్వమునకు దీర్ఘము వచ్చును.

లెమ్ము+లెమ్ము — లేలెమ్ము

పొమ్ము+పొమ్ము — పోపొమ్ము

(ప్రౌ. వ్యా. సంధి. 27)

(vi) 'ఏగి+ఏగి' అనుచో ఆమ్రేడితము పరమైనను క్త్వార్థక సంధి చేయ రాదు కావున ఇచట సంధి రాదని చిన్నయసూరి పేర్కొనెను.

(బా. వ్యా. సంధి. 10)

కాని అప్పకవి 'ఆడాడి' యని యుదాహరించుటను బట్టి ఆమ్రేడిత సంధి నిత్యముగానే యెంచబడి యుండును (అప్ప. V. 97)

(vii) నిందయందామ్రేడితము పరమగుచో హ్రస్వ దీర్ఘములకు గి, గీ, లగును.

హరి+హరి — హరిగిరి

రావణుఁడు+రావణుఁడు - రావణుఁడు గీవణుఁడు

(బా. వ్యా. ప్రకీర్ణ. 22)

**అయాదేశము**

'రై' (ధనము) అను పదములోని ఐకారమునకు సంధిలో 'అయ్' ఆదేశ మగును.

రై+అధీశ్వరుఁడు — రాయ్+అధీశ్వరుఁడు — రాయధీశ్వరుఁడు.
(ఛం. ద. IV. 47)

**-ఆయి**

ఆప్యాయార్థమునుగాని, అల్పార్థమునుగాని తెల్పు శబ్దము.

అన్నాయి, సీతాయి

అబ్బాయి, అమ్మాయి

(అప్ప III, 221, 237)
(సు. వ్యా. సంధి. 3)

**ఆయీత్యాదులు**

ఆ, ఈ, మున్నగునవి.

ఇవి రెండును విశేషణములు. వీనితోఁ గూర్పఁబడినవి 'విశేషణోభయ పదకర్మ ధారయ' సమాసములని ప్రౌఢ వ్యాకరణ కర్త పేర్కొనెను

(ప్రౌ. వ్యా. సమాస. 17)

ఆయీ నేరములు

ఈయాదేశము.

ఇట్టివి 'స్నాతానులిప్తః' అను రీతిని భావింపఁబడినను సంస్కృతమునందు విశేషణములకు విభక్తి వివక్షింపఁబడుటచే ఆభాషయందువలె నీ భాషలో నంతగా నతకవు. (తత్త్వ. పుట. 246)

**ఆయీయేలు**

ఆ, ఈ, ఏ, లు. వీనికే త్రికమను సంజ్ఞ ప్రసిద్ధము. (చూ )

ఆ, ఈలు నిర్దేశ సర్వనామములు. ఏ—ప్రశ్నార్థకము

వీనికి హల్లు పరమగుచోఁ గ్రుంగును. క్రుంగుచో వలపలి వ్రాయికి జడ్డ యొదవును.

ఊష్మ రేఫములు పరమగుచొ నీ వర్ణములు క్రుంగవు. సాగియే యుండును.

ఆకుమారి...అక్కుమారి

ఈగయాళి...ఇగ్గయాళి

ఏచెనంటి?—ఎచ్చెనంటి?

ఆరాఘవుఁడు, ఆశరము (ఆం. భా. భూ. 186 ప; స. సా)
సం. సంధి 199-201.

**అర/ఆరా**

సంబోధనము నందు బహువచనాంత శబ్దములకు -అర/-ఆరా అను శబ్దములు వికల్పముగాఁ జేరును.

నరులారా! ఖలులారా!!

వృక్షములారా! ఖగములారా!!

కవులారా! కవులు. (స. సా. సం. విభక్తి 78, 79)
(కా. చూ. IX. 115) (ఆం. కౌ. 219 పంక్తి)

**అరక్**

సంబోధనార్థమున వచ్చు ప్రథమావిభక్తికి బహువచనమున చేరుప్రత్యయము. ఇందలి కకార మిత్సంజ్ఞకమై లోపింపఁగా 'అర' యనునది మిగులును. ఇది కిత్తగుటచే ప్రథమావిభక్తికి అంతావయవముగా వచ్చును. ఉదా:- రాములార (రాములు +అర) మొ॥ (వై. చం. అజన్త. 8) దీనిని చింతామణికర్త అరదాగమమని వచించెను. చూ:- అరదాగమము.

**ఆరగాగమము**

ఆర(క్)+ఆగమము

ఆర(క్) కిత్తు గావున అంతమునఁ జేరును.

దీనికి పాక్షికముగా దీర్ఘము వచ్చును. మధ్యమ పురుషయోగమున్నప్పుడీ యాగమము విభాషగా వచ్చును.

వినుఁడు బాలకులార!

వినుఁడు బాలకులారా!!

వినుఁడు బాలకులు!! (బా. వ్యా. తత్సమ 36, 37)

**ఆరత్** — చూ:- ఆరదాగమము

**ఆరదాగమము**

(ఆరత్+ఆగమము) సంబోధన ప్రథమా విభక్తి బహువచన ప్రత్యయము చివర వచ్చు ఆగమము (చింతా, అజన్త. 13). ఇందలి తకారముచ్చారణార్థము. ఉదా:- రాములార (రాములు+ఆర) మొ॥ మధ్యమ పురుష క్రియా పదముతో యోగమున్నపుడు సంబోధన బహువచనమున నాకానాకచో నీ యాగమము రాదు. ఉదా:- వినుడు బాలకులు, అలుగకుడీ వధూజనులు మొ॥ (అధ. కారి. అజన్త 12). కొన్ని వ్యాకరణములందీ యాగమము ఆరగాగమముగా చెప్పఁబడినది. ఆగమములు సాధారణముగ టిత్తులుగను, కిత్తులుగను, మిత్తులుగను చెప్పఁబడుటచేతను, ఇది అంత్యావయవముగ వచ్చునదగుటచేతను కిత్తుగ చెప్పఁబడియుండవచ్చును. చూ. ఆరగాగమము.

**ఆరాటాదులు**

'ఆరాట' మున్నగు శబ్దములు. వీని ప్రథమేతర దీర్ఘమునకు హ్రస్వము విభాషగానగును.

ఆరాటము - ఆరటము

కేళాకూళి - కేళకూళి

కొమారిత - కొమరిత

(బా. వ్యా. ప్రకీర్ణ. 11)

**—ఆరు**

'ఉన్న' అను క్రియాను బంధముపై ప్రథమ, మధ్యమ, పురుషల బహువచనము నందు '—ఆరు' అను శబ్దము చేరును.

ధీరులు పల్కుచున్న+ఆరు⟶పల్కుచున్నారు.

మీరు పల్కుచున్న+ఆరు⟶పల్కుచున్నారు.

(ఆం. కౌ. 702 పంక్తి)

**ఆర్యవ్యవహారములు**

ఆర్యులనఁగా నన్నయ, తిక్కన శ్రీనాథాది మహాకవులు. వీరెక్కడైన గ్రామ్యములు ప్రయోగించినచో నవి దుష్టములని నిరసింపరాదు. వానిని గ్రహింప నగును.

కలకంఠుఁడు, ప్రాణగొడ్డము.

జీవగఱ్ఱ మున్నగునవి.

(బా. వ్యా. సంజ్ఞా. 28)

**ఆర్యాంబాదిక శబ్దములు**

ఆర్య, అంబ మున్నగు శబ్దములకు పర్యాయవాచకములగు అయ్య, అమ్మ మున్నగుశబ్దములు. ఇవి శ్రేష్ఠార్థమును దెలుపు శబ్దములు. ఉదా:- రామయ, లక్కమ మొ॥ (అధ. కా. హలన్త 111)

**ఆర్యంబాద్యర్థక శబ్దములు**

ఆర్య, అంబ, మున్నగు నర్థములనిచ్చు శబ్దములు. అయ్య, అమ్మ మున్నగు నవి. వీనినిగూర్చి విశేషముగా ప్రౌఢవ్యాకరణకర్త నిరూపించెను.

(i) ఇవి శ్రేష్ఠతావాచకములు. ఇవి పరమగుచో సంధినిత్యము:

రామ+అయ్య—రామయ్య

సీత+అమ్మ—సీతమ్మ

తిమ్మ+అరసు—తిమ్మరుసు. (సంధి. 1)

(ii) నామపదములకుఁజేరి వ్యతిరేకమును వ్యంజింపఁజేయును. పాడియయ్యా? అర్హమయ్యా? --ఇట్టిచో ఆర్యాద్యర్థపరకత్వమునఁగాక, కాకువు మూలమున వ్యతిరేకము వ్యంజింపఁజేయఁబడు చున్నది.

(శబ్ద. 115)

(iii) తద్ధర్మభూతక్రియలు వీనివలన ప్రశ్నార్థకములగునను అభిప్రాయము కూడ సముచితముగాఁగానరాదు. కాకువేఋందును వ్యతిరేకము వ్యంజింపఁ

జేయఁబడుచున్నది. సలుపుదయ్యా?, వర్తింతురయ్యా? పంచితయ్యా?.

(క్రియా. 3.)

(iv) తద్ధర్మక్రియ, వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకమగును.

తగునయ్యా?—తగదని యర్థము

మెత్తురమ్మ?—మెచ్చరని యర్థము.

**ఆర్యులు**

పెద్దలు, మహాజనులు, మహాకవులు, లక్ష్య లక్షణపరిజ్ఞానము కలవారు.
చూ. ఆర్యవ్యవహారములు

(బా. వ్యా. సంధి. 55)

**ఆర్షము**

రాజశేఖరుఁడు తన కావ్యమీమాంసలో నిరూపించిన వాక్యభేదములలో నొకటి.

మంత్ర భాగముతోఁగూడి, నామవిభక్తి సమన్వితమై, ప్రత్యక్షాభిహితమగు వాక్యభేదము. (తె. వ్యా. వి. 71-14)

**ఆర్షికము**

రాజశేఖరుఁడు తన కావ్యమీమాంసలో నిరూపించిన వాక్యభేదము. నిగమ ప్రసిద్ధములగు వివిధ శబ్దములతోఁగూడి, నిపాతబహుళమై సుదీర్ఘమగు వాక్యము.

(తె. వ్యా. వి. 71-14)

**ఆఱ్వాదులు**

'ఆఱు' మున్నగు ధాతువులు. వీనికి కృత్ప్రత్యయమగు 'డు' చేరును. అపుడు ధాతుగతమగు చ, య, లకు పకారమగును.

ఆఱు - ఆఱుడు

అమ్ము - అమ్ముడు

అల్లు - అల్లుడు

దంచు - దంపు - దంపుడు

మాయు - మాపు - మాపుడు.

(బా. వ్యా. కృదన్త. 20)

**ఆలు శబ్దము**

వ్యస్తముగా భార్యయని యర్థము.

వృత్తియందు స్త్రీమాత్ర పరము— వెలయాలు, ధీరురాలు, గుణవంతురాలు.

స్త్రీత్వద్యోతకముగా బల్లిదాదులకుఁజేరును -- బల్లిదురాలు, అక్కజురాలు, బెట్టిదురాలు, ఇత్యాదులు.

(బా. వ్యా. సంధి 31.
,, అచ్చిక. 3)

**ఆల్వాదులు**

'ఆలు' మున్నగు శబ్దములు. వీనికి బహువచన లకారము పరమగుచో దానికి రేఫమాదేశమగును. అట్టిచో ఆల్వాదులలోని లకారమునకు బిందుపూర్వక డకార మగును.

ఆ+ల్+ఉ +ల్+ఉ
↓ ↓
ఆ+డ్+ఉ +ర్+ఉ—ఆండ్రు

ఆలు, చెలియలు, చెల్లెలు, కోడలు, మఱఁదలు—ఇవి ఆల్వాదులు. (నియత గణము).

ఈ అన్ని పదాలలోను—ఆలు/—అలు అను రూపములే కానవచ్చును

చూ. దారాదికము. (బా. వ్యా. అచ్చిక. 11)

**—ఆవ**

నౌ శబ్దములోని ఔకారమునకు విభక్తులు పరమగునపుడు వచ్చు ఆదేశము. ఉదా:- నావ (చింతా. అజంత. 62)

**—ఆవాదేశము**

'గ్లౌ' (చంద్రుఁడు) శబ్దమునకు సంధిలో 'ఆవ్' ఆదేశమగును.

గ్లౌ+ఉదీర్ణము ⟶ గ్లావ్+ఉదీర్ణము ⟶ గ్లావుదీర్ణము.

(ఛం. ద. IV. 47)

**'ఆవు' ప్రభృతులు**

'ఆవు మున్నగు పదములు.

వీనికి బహువచన ప్రత్యయము పరమగుచో తుది యక్షరమునకు లోపము విభాషగానగును.

ఆవు+లు < ఆలు / ఆవులు

జాము + లు < జాలు / జాములు

చుట్టము+లు < చుట్టలు / చుట్టములు

మీసము+లు < మీసలు / మీసములు

(బా. వ్యా. అచ్చిక .22)

**'ఆవులించు' లోనగునవి**

'ఆవులించు' మున్నగు ధాతువులు. వీనికి 'త' అను కృత్ప్రత్యయము పరమగుచో అంతమందలి 'చు' లోపించును.

ఆవులించు⟶ఆవులింత

ఇగిలించు⟶ఇగిలింత

కొక్కిరించు⟶కొక్కిరింత

ఇది ఆకృతి గణము. (బా. వ్యా. కృదంత. 10)

**ఆశీరాద్యర్థకము**

ఆశీస్సు మున్నగువానిని తెల్పునది. ఈ అర్థమునందు—ఎడున్;—తన్ అను వర్ణకములు ధాతువుల తుదను జేరును.

పోషించెడున్,

పోషించుతన్

కొట్టెడున్, కొట్టుతన్ (సం వ్యా. ఆశీ. 1.)

**ఆశీర్వచనము**

ఆశీస్సును దెల్పుశబ్దము. విధి, ఆశీర్వచనములు పురుషత్రయమునందు. రెండు వచనములందు నొకేరీతి నుండును.

—ఉను;—దురు అను శబ్దము లంతమందుండు క్రియలపై—కాఁత అను శబ్దమును జేర్చిన నది ఆశీర్వచనమగును.

శివము చేయుఁగాఁత శివుఁడు. త్రిదశులు శోభనము చేయుదురు గాఁత

(కా. చూ. IX. 158)

**ఆశీశ్శాప సంప్రార్థన విధులు**

ఆశీస్సునుగాని, శాపమునుగాని, సంప్రార్థనమును గాని తెల్పుధాతువునకు 'లూట్' (చూ.) వర్ణక మగునని బా. వ్యా.

ఈ లకారమును సూరిక్రొత్తగాఁ గల్పించెను. లూడర్థమునందు ద్రుతాంతము లగు—ఎడు,—త, వర్ణకములు వచ్చును.

మేలు గలిగెడును, మేలు గలుగుతను (ఆశీస్సు); రాక్షసత్వము గలిగెడును; రాక్షసత్వము గలుగుతను (శాపము); హరిననుఁ గృపఁగాంచెడును; హరిననుఁ గృపఁగాంచుతను (ప్రార్థన) (బా. వ్యా. క్రియా. 6, 26)

**ఆశీస్సు**

(i) తద్ధర్మాద్యర్థకము లందొకటి (లాట్టు) (బా. వ్యా. క్రియా. 11)

(ii) లూట్టు నందొకటి (బా. వ్యా. క్రియా 6)

దీర్ఘాయువగుము.

దీర్ఘాయులరగుడు (బా. వ్యా. క్రియా. 29)

**ఆశ్చర్యార్థక స్వరాంతములు**

ఆశ్చర్యమును ప్రకటించు కంఠస్వరము అంతమందుఁగల వాక్యములు. నాల్గు విధములగు స్వరాంత వాక్యములలో నొకటి.

(తె. వ్యా, వి. పుట. 1057)

**ఆయువు**

ఇది సకారాంత శబ్దము. ఈ సకారమునకు లోపము బహుళముగా నగును. లోపమురాని పక్షమున ఉత్వద్విత్వములు వచ్చును. 'ఆయుస్సు' అను రూపము సిద్ధించును. (బా. వ్యా. తత్సమ. 80)

**ఆసత్తి**

పదముల చేరిక. వాక్యమందలి పదములు అధిక వ్యవధానము లేక యుచ్చరింపఁబడవలయును· యోగ్యతా కాంక్షలు గల పదార్థములను బోధించు శబ్దము లయినను కాలవ్యవధాన మధికముగా నుండునట్లు పలుకఁబడునేని వానివలన

అర్థబోధము కలుగదు. పదార్థములు మఱుపురాని రీతిని దగ్గరకాలములో పదములు పలుకఁబడవలయును. (ప్రౌ. వ్యా. వాక్య. 1. తత్త్వ. పుట. 346)

ఇ[1]

తెలుఁగు వర్ణమాలలోని మూఁడవ వర్ణము
సంపూర్ణ సంవృత విస్తారితాగ్రస్వరము (closed front unround vowel)
కఠినతాలువు-స్థానము
జిహ్వామధ్యము - కరణము
సంవృతప్రయత్నము
నాదము
అల్పప్రాణము
నిరోష్ఠ్యము.
హ్రస్వము

—ఇ[2]—

కొన్ని దేశీయశబ్దముల విభక్తులకుఁ బూర్వమునందు వచ్చును దీనినే ఔప విభక్తికమందురు.

ఊరియందు
కాలి చేత

(బా. వ్యా. అచ్చిక. 28)

—ఇ[3]—

చేత, తోడ, వలనలకు సమాసమునందు సంబంధ ద్యోతకముగా వచ్చును.

నీ చేతన్ + ప్రోపు—నీచేతిప్రోపు
నీతోడన్ + చెలిమి—నీతోడిచెలిమి
నీవలనన్ + భయము—నీవలనిభయము

(బా. వ్యా. సంధి. 13)

—ఇ[4]

(i) ఇ, ఈ, ఐల మీఁది 'కు', 'ను' అను విభక్తులయొక్కయు, 'వు' 'ను' లను ఆగమములయొక్కయు ఉత్వమున కాదేశముగా వచ్చును.

హరి+ను - హరిని

హరి+కి — హరికి

శ్రీ+కు+ను - శ్రీకిని

నీవు సుకృతి+వు - నీవుసుకృతివి

నేను సుకృతి+ను - నేనుసుకృతిని

పై+కు - పైకి

(బా. వ్యా. తత్సమ. 26; కారక. 34)

(ii) టి, తి, వర్ణములు పరమగునపుడు ఔప విభక్తిక శబ్దముల ఉత్వమున కాదేశమగును.

రెండిటికి, పగలిటికి, అఱితిని

(బా. వ్యా. అచ్చిక. 86)

(iii) ఇ కారముమీఁది క్రియా విభక్తుల కాదేశమగును.

వండి+రు - వండిరి

వండితి+వు - వండితివి

వండితి+రు - వండితిరి

వండితి+ను - వండితిని

వండితి+ము - వండితిమి

(బా. వ్యా. క్రియా. 18)

(iv) ఇత్వము కాని ఎత్వము కాని కూడుచో ధాతువులయొక్క అనాద్య మగు ఉత్వమునకాదేశమగును.

నిగుడు+ఇ - నిగుడి - నిగిడి

నిగుడు+ఎ - నిగుడె - నిగిడె

(బా. వ్యా. క్రియా. 65)

ఇట్టి మార్పునే ఆధునికులు 'స్వరాకర్షణ' మందురు. (చూ.) (vowel harmony)

—ఇర

(i) చేయు, వ్రాయు మున్నగు ధాతువులకుఁ జేరు కృత్ప్రత్యయము.

చేయు+ఇ - చేయి

వ్రాయు+ఇ - వ్రాయి

(బా. వ్యా. కృదంత. ౭౭)

(iii) దయ్యు, డయ్యు, నొచ్చు, పుచ్చుల కిక్ప్రత్యయము పరమగు నపుడు వానికడ హల్లులు పకారములగును.

దయ్యు - డప్పు+ఇ - డప్పి. ఇట్లేయితరములు

(ప్రౌ. వ్యా. కృదంత. 1.)

—ఇ[6]

లేమిని కొన్నింటిలోఁ దెల్పు తద్ధిత ప్రత్యయము.

గ్రుడ్డు+ఇ - గ్రుడ్డి

(సు. వ్యా. తద్ధిత. ౭౫)

—ఇ[7]

ఓయారాదులకు (చూ.) మతుబర్థమందు వచ్చుతద్ధిత ప్రత్యయము.

ఓయారి, అక్కసి (బా. వ్యా. తద్ధిత. 18)

—ఇ[8]

సంప్రార్థనములయందు మధ్యమ పురుష 'ము,డుఙ్' వర్ణకములకు విభాషగా ననుప్రయుక్తమగును. ఇది ఆదాదుల (చూ ) లోనిది.

వందమి, వండుఁడి (బా. వ్యా. క్రియా. 33)

—ఇ[9]

ఏకాశ్రయమగు క్రియలలోపల ఏది పూర్వకాలికమగునో, తద్వాచియగు ధాతువున కనుప్రయుక్తమగు. (చూ. క్త్వార్థము)

చైత్రునిచేత మైత్రుఁడు కొట్టఁబడి మడిసె. (బా. వ్యా. క్రియా. 38)

—ఇ[10]

మహన్మహత్త్వర్థకముల కనుప్రయుక్తమై ప్రశ్నార్థమును దెల్పును

ఏఁడు+ఇ⟶ఏఁడి?

ఏవు+ఇ—ఏవి?

(సూ. ని.)

—ఇ[11]

'కాను' ధాతు వనుప్రయుక్త మగునపుడు యాంతధాతువులకు నిత్యముగను, ఇతర ధాతువులకు వికల్పముగను వచ్చును.

చేయు+ఇ—చేసికొనియె

వండు+ఇ—వండికొనియె; వండుకొనియె

(బా. వ్యా. క్రియా. 53)

—ఇ[12]

ధాతువులకు భూతార్థమునందువచ్చును.

కొట్టు+ఇ+రు—కొట్టిరి

తిట్టు+ఇ+రు—తిట్టిరి (బా. వ్యా. క్రియా. 17)

**—ఇంచుక్**

సంస్కృత ధాత్వాదులకును; 'అంగల' మున్నగు దేశ్యధాతువులకును - స్వార్థమునందును; అన్ని ధాతువులకుఁ బ్రేరణార్థమందును వచ్చునాగమము.

భాషించు, శయనించు

అంగలించు

వ్రాయించు, వచింపించు.

(బా. వ్యా క్రియా. 63, 70)

(చింతా. క్రియా 13, 14)

**—ఇంచుక్చుక్పుగాగమములు**

ఇంచు(క్), చు(క్), పు(క్) ఆగమములు. ప్రేరణార్థమునందు కొన్నింటికి ఇంచుగాగమము, కొన్నింటికి చుగాగమము మఱికొన్నింటికి పుగాగమమును;

కొన్నింటికి రెండుగాని. మూఁడుగాని రావచ్చును. ఇవిచేరునపుడు ఆగమాదేశ లోపములు పెక్కు తెలియుచుండును.

పచించు; పూనుచు, పూనించు,

ఆగు - ఆఁచు, ఆఁపు, ఆగించు

అగు - కావించు; నిలుచు - నిలువరించు

పోవు - పుచ్చు, పనుచు; అనుచు - అనుపు

(బా. వ్యా. 70, 73, 74)

**ఇంచుగ్వ్రక్రములు**

ఇంచుక్+వక్రములు

(చూ.)ఇంచుగాగమము; (చూ.)వక్రములు. (చూ.)ఇయుడాగమము.

గురుమంతము కానట్టి, యయాంతముకానట్టి ఏకస్వర, ద్విస్వర ధాతువులకు ఇంచు(క్) కాని, వక్రములు (ఎ, ఏ, ఒ, ఓలు) కాని పరమగుచో ఇయుడాగమము విభాషగా వచ్చును.

భుజ్+ఇంచు < భుజ్+ఇయ్+ఇంచు—భుజియించు
భుజించు

నగు+ఎను < నగు+ఇయ్+ఎను - నగియెను.
నగెను.

ఇట్లే నగియెడి, నగియెడు మున్నగు రూపములు వికల్పముగా నేర్పడును.

(బా. వ్యా. క్రియా. 50)

—ఇండి[1]

చూ. రూపాంతరము —'ఇఁడి[1]'

(ఆం. భా. భూ. 164)

—ఇండి[2]

రూపాంతరము—ఇఁడి[2]

'పసి' అను శబ్దమున కనుప్రయుక్తములు ధర్మి వాచకమును గావించును. పసింది.

(ఆం. కౌ. 655, 56)

—ఇండ్లు

బహువచనమునందు 'పెండ్లి' మున్నగువానికిఁ జేరు ప్రత్యయము.

పెండ్లిండ్లు

(ఆం. కౌ. 269)

-ఇంత

స్త్ర్యర్థమునందు వచ్చు తద్ధిత ప్రత్యయము.

చూలింత, బాలింత

(ఆం. భా. చ. పుట 843)

-ఇందు[1]

సప్తమీవిభక్తి ప్రత్యయము. (చింతా. అజంత 7). అధికరణములనఁదగిన సమీపవర్తి పదార్థములనుఁ జెప్పుటకు ఇది ఉపయోగింపఁబడును. ఉదా:- రాముఁడిందు భుజించెన్, ఇందు శయనించెను మొ॥ (చింతా. అజంత. 27)

**ఇందు**[2]

సమీపమునందున్న వస్తువును దెల్పు 'ఈ' అను దేశ్యశబ్దమునకు సప్తమ్యర్థము నందు ఆదేశముగా వచ్చును.

ఇందు భుజించెన్ (ప్ర. వ్యా. 320. ప్రశ్న)

**—ఇంపు**

కొన్ని క్రియారూపములందు—ఇంచు (క్) నకు మాఱుగా నుపయుక్తము.

వచింపుము

ఆకర్ణింపుదురు

పచింపడు (కా. చూ. IX. 165)

(ఆం. కౌ. 732-33)

(బా. వ్యా. క్రియా. 88, 90)

**ఇంప్వంతములు**

(ఇంపు+అంతములు). భావార్థకమగు 'ఇంపు' అనునది అంతమందుఁగల రాణింపు, తేలింపు మున్నగు పదములు. ఇట్టి పదములను కొందఱు చెప్పినను అథ. కా. కర్త తనకివి యిష్టములు కావని తెలిపెను. (అథ. కా. అజన్త. 98)

**—ఇఁడి**[1]

'ముక్కు' లోనగు వానికి తదభావద్యోతకమయి మతుబర్థమునందు వచ్చు వర్ణకము.

ముక్కిఁడి—ముక్కులేని వాఁడు ఇట్లే వాలిఁడి, వెరవిఁడి ఇత్యాదులు.

(ఆం. కౌ. 654; కా. చూ. IX. 198)

(బా వ్యా. తద్ధిత. 24)

**—ఇఁడి**[2]

చూ. రూపాంతరము—ఇండి[2] (ఆం. కౌ. 655. 56)

**—ఇఁడి**[3]

కల్గుటను దెల్పుతద్ధిత ప్రత్యయము

కట్టు+ఇఁడి—కట్టిఁడి

వెరవు+ఇఁడి—వెరవిఁడి (ఆం. కౌ. 653-54)

**ఇఁకాదులు**

'ఇఁక' మున్నగు శబ్దములు.

'ఇఁక' 'ఇగ' 'ఎట్టకేలకు' 'ఎట్టకేని'-అను నాల్గు శబ్దములే ఇఁకాదులు. ఇది నియతగణము.

వీనికచ్చు పరమగునవుడు సంధి వికల్పముగాఁ గల్గును.

(బా. వ్యా. సంధి. 9)

—ఇక[1]

'అంజు' మున్నగు ధాతువులకు (చూ. అంజ్వాదులు)పరమగు కృత్ప్రత్యయము

అంజు+ఇక—అంజిక

అరయు+ఇక—అరయిక (బా. వ్యా. కృత్. 12)

ఇట్లే పొందిక, పోలిక, కోరిక, మున్నగునవి, (ఆం. కౌ. 792 పంక్తి)

—ఇక[2]

'అగ్గల' (చూ.) మున్నగు నామములకు త్వార్థము (చూ.) నందు వచ్చు వర్ణకము.

అగ్గల (ము)+ఇక—అగ్గలిక

ఒమ్మ+ఇక—ఒమ్మిక

అరమర (చూ.) మున్నగు నామములకు స్వార్థము నందువచ్చును.

అరమర+ఇక—అరమరిక

ఆము+ఇక—ఆమిక (బా. వ్యా. తద్ధిత. 9)

—ఇక[3]

పూను, కోరు, పోలు, ఎన్ను, చేరు, మున్నగు ధాతువులపై స్వార్థమునవచ్చు కృత్ప్రత్యయము. ఉదా:- పూనిక, కోరిక, పోలిక మొ॥ (వై. చం. కృదంత. 23, 24)

ఇకారసంధి

ఇకారమునకు ఇకారము పరమగునపుడు దీర్ఘము ఏకాదేశమగును.

ఇ+ఇ > ఈ : హరి+ఇందిర—హరీందిర

ఇ+ఈ > ఈ: కవి+ఈశ్వరుఁడు—కవీశ్వరుఁడు

ఈ+ఇ > ఈ: మహీ+ఇంద్రుఁడు—మహీంద్రుఁడు

ఈ+ఈ > ఈ : గౌరీ+ఈశ్వరుఁడు—గౌరీశ్వరుఁడు

(త. చం. 2—2)

**ఇకార వికల్ప సంధి**

ఇకారమున కచ్చుపరమగుచో సంధి యొకమాఱు కల్గుట, ఇంకొకమాఱు కలుగకుండుటయు సంభవించును.

ఆనతి+ఇచ్చె < ఆనతిచ్చె / ఆనతియిచ్చె

(స. సా. సం. I. 6,7,8)

**ఇకారాంతములు**

ఇకారమంతమందుఁగల శబ్దములు. ఇట్టి ఇకారాంత దేశ్యశబ్దములను సంస్కృత శబ్దములతో సమసింపఁజేయవచ్చును.

వాఁడి శరము, వేఁడి మరీచులు.

(కా. చూ. IX. 139)

**ఇకారాంత సంస్కృత పదములు**

ఇకార మంతమందుఁగల సంస్కృత పదముల మీఁది యచ్చతెనుఁగు పదములతో సమాసములేర్పడవచ్చును.

దంతి కొమ్ములు

అరాతిపోరు (కా. చూ. IX. 140)

**-ఇకి**

చూ:- ఇకి ప్రత్యయము.

**-ఇకి ప్రత్యయము**

'కోరు' మున్నగు ధాతువులకుఁజేరు కృత్ప్రత్యయము.

కోరు+ఇకి — కోరికి

పూను+ఇకి — పూనికి

విను+ఇకి — వినికి.

(ఆం. కౌ. 793-94)

(బా. వ్యా. కృత్. 16)

(వై. చం. కృదంత. 21, 22, 23)

**-ఇగా**

అర్థభేదమందొకానొక శబ్దముపై వచ్చు వర్ణకము. ఇది నింద్దార్థమును సూచిపచును. ఉదా:- గోపాలిగాఁడు మొ॥. ఈ ప్రత్యయము వచ్చునపుడేర్పడు ంగా

మునకు బహువచనముండదు. మఱియు సంబోధనైక వచనమున డుజ్ఞా రాక ఇగా లోని చివరి దీర్ఘమునకు హ్రస్వము వచ్చును. ఉదా:- గోపాలిగ మొ॥

(అథ. కా. అజన్త 71; ప్రౌ. వ్యా. 22)

**ఇగాగమము**

ఇ(క్)+ఆగమము

భూతార్థవృత్తి యగు ధాతువునకు ఇ(క్) ఆగమముగా వచ్చును.

వండు+ఇ+రు — వండిరి

వండు+ఇ+తి+వు — వండితివి

వండు+ఇ+తి+ను — వండితిని

(బా. వ్యా. క్రియా. 18)

**ఇగ్లౌరా యుగంతములు**

ఇ+గ్లౌ+రై+ఉక్ అంతములు.

(i) ఇకారాంత శబ్దములు - హరి, గిరి, శ్రీ

(ii) గ్లౌ (చంద్రుఁడు) శబ్దము.

(iii) రై (ధనము) శబ్దము.

(iv) ఉ(క్) అంతమందుఁగల శబ్దములు, - రుక్కు, వాకు వీని ప్రథమైక వచన లోపమగును.

(బా. వ్యా. తత్సమ. 44)

**ఇగ్వర్ణములు**

ఇక్+వర్ణములు.

ఇ, ఉ, ఋ, ఌ అను వర్ణములు

(మ. ప వ్యా. సంస్కృత సంధి. ౧.)

**ఇ, టి, తి వర్ణములు**

విభక్తులకు సమీపమందు ఆదేశాగమాత్మకముగా వచ్చు వర్ణములు.

వీనికే 'ఔపవిభక్తికములు' (చూ.) అను వ్యవహారము.

త్రాడు - త్రాటిని (ఆదేశము)

అన్ని - అన్నిటిని (ఆగమము)

పగలు - పగలిటిని, పగటిని

నూఱు - నూటిని, నూఱిటిని.

(బా. వ్యా. ఆచ్ఛిక. 28, 31)

**-ఇడి**

(i) స్వార్థమునందు వచ్చు తద్ధిత ప్రత్యయము.

తెలివిడి, విరివిడి, వినికిడి, లేమిడి, రాపిడి.

(ప్రౌ. వ్యా. తద్ధిత. 8)

(ii) 'రాయు'నకు వచ్చు కృత్ప్రత్యయము.

రాయిడి. (ప్రౌ. వ్యా. కృత్. 2)

**-ఇడిమ్**

హీనార్థము (లేకుండుటయను నర్థము)న నామము కంటె పరమందు వచ్చు ప్రత్యయము. ఇందలి మకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ఇడి' మిగులును. ఉదా:- వెరవిడి (వెరవు+ఇడి), ముక్కిడి (ముక్కు+ఇడి) మొ॥.

(వై. చం. తద్ధితా. 4)

**-ఇత**[1]

స్వార్థమునందు వచ్చు తద్ధిత ప్రత్యయము

ఇంపు+ఇత—ఇంపితము.

బిగు+ఇత—బిగితము

పోరు+ఇత—పోరితము

(ప్రౌ. వ్యా. తద్ధిత. 9)

**-ఇత**[2]

కృత్ప్రత్యయము

పొగడు+ఇత—పొగడిత (ఆం. భా. శా. కృదన్త. 15)

**ఇతరేతరయోగద్వంద్వము**

ఒండొంటి కలయికను లేక సంబంధమును బోధించునట్టి ద్వంద్వసమాసము(చూ.)

తల్లిదండ్రులు, అన్నదమ్ములు

(ఆం. కౌ. 619, 620)

ఇట్లు సమసించు శబ్దములకుఁ బ్రత్యేకాన్వయ ముండును.

అన్నదమ్ములు చదువరులు (సు. వ్యా. సమాస. 8)

**ఇత్తు**[1]

కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధములు ప్రయోగించునపుడు మానఁబడు వర్ణము.

డుఙ్, తఙ్—ఇందలి ఙకారము ఇత్తు. ఙిత్తు, (ఙ్+ఇత్తు) బిందుపూర్వక మగును,

రాము+డుఙ్—రాముండు/రాముఁడు

చేయు+తఙ్—చేఁత

(బా. వ్యా. తత్సమ. 19, 22 కృత్ 5)

**ఇత్తు**[2]

హ్రస్వమగు ఇకారము. (ప్రౌ. వ్యా. శబ్ద. 68)

(i) 'ఏమి' మున్నగు శబ్దము లందున్న యిత్తునకు క్రియాపదములందున్న యిత్తునకు సంధి వైకల్పికము.

(ii) మధ్యమ పురుష క్రియలందున్న యిత్తునకు సంధి నిత్యము.

(iii) క్త్వార్థమైన యిత్తునకు సంధిలేదు (బా. వ్యా. సంధి-5,6,7,8)

**ఇత్వసంధి**

హ్రస్వమగు ఇకారమునకుఁగల్గుసంధి.

భూతార్థక అసమాపక క్రియాపదము లందలి ఇత్తునకు ఒక్కొక్కచో సంధి చేయవచ్చునని కొందఱి మతము.

చాపము నాకందిమ్మనుడు

ఎల్లపనుల నెఱిగించిపుడే (క. సం. వి I 14 15,16, నుండి 21 వరకు)

**ఇకారాంతము**

హ్రస్వమగు 'ఇ' కారము అంతమందుఁగల శబ్దము.

ఒకకర్తచేయు పనులలో మొదటపూర్తిఅయిన పనినిదెల్పు క్రియావాచకము.

'ఆడఁబోయి చూచియలిగె'

(ఆం భా. భూ. 157, 158)

**ఇత్యర్థకము**

ఇతి+అర్థకము. ఇతిఅనగా 'అని' అర్థము.

'అ' అను నవధారణార్థకము మీఁద 'కాన్' అను 'అగు' ధాతువుయొక్క అన్నంత రూపము ప్రయుక్తమయ్యేనేని, రెండును గలసి 'ఇతి' అనుదాని యర్థము (అని) గల దగునని భావము.

'అపజయము కాంక్షించి' — అపజయమనిలక్షించి అని యర్థము.

(ప్రౌ. వ్యా. క్రియా. 33)

**-ఇద**

(i) స్వార్థమునందు 'ఒప్పు', 'తప్పు', 'పెల్లు'లకుఁజేరు తద్ధితప్రత్యయము-
ఒప్పిదము, తప్పిదము, పెల్లిదము.

(ii) మతుబర్థమునందు 'క్రొవ్వు' 'బెట్టు' శబ్దముల కగును.
క్రొవ్విదము, బెట్టిదము.

(ప్రౌ. వ్యా. తద్ధిత 10)

**ఇదమర్థకము**

'ఇదమ్' అను శబ్దముయొక్క అర్థమునిచ్చు సర్వనామము.

వీఁడు, వీరు— ఇది, ఇవి.

(బా. వ్యా. ఆచ్ఛిక. 24)

**ఇదాదేశము**

(ఇత్+ఆదేశము) సమాసమున చేత, తోడ, వలన అను విభక్తుల యంతిమాక్షరమునకు వచ్చు హ్రస్వ-ఇకారాదేశము. ఉదా:- నీచేతి ప్రోపు, నీతోడిచెలిమి, నావలన నేరమి మొ॥ (చింతా. సంధి 87, అథ.కా. సంధి 28) చూ. ఇత్

**ఇదుదంత సంస్కృత పదములు**

ఇత్, ఉత్ (హ్రస్వములగు ఇ, ఉ లు) అంతమందుఁగల సంస్కృతపదములు, ఇవి ఆచ్ఛిక పదములతో సంబంధార్థమందు సమసించును.

దంతి కొమ్ములు

సుకవి పల్కులు

అరాతి పోరు

తరువాకులు. (ఆం. కౌ. 526-28)

**-ఇన**

భూతార్థమునుదెల్పు ప్రత్యయము.

వచ్చిన, కొట్టిన—ఇట్టివి కర్తృ, కరణ, కర్మములకు విశేషణములగును.

(ఆం. భా. భూ 160;
ఆం. కౌ. 594-596)

**ఇనన్నంతక్రియ**

-'ఇనన్' శబ్దమంతమందుఁగల క్రియ. ఇట్టి క్రియ పూర్వమందుఁగల 'కాక' 'కాని' అను నవ్యయములు సంగ్రహ వాక్యమునందుండి విస్తర వాక్యమును గమ్యమానమొనర్చును.

"నీవు నలునకుఁ బేర్మితో దేవివైన కాక నీ సముజ్జ్వల రూపకాంతి విభవ నిత్యసౌభాగ్యభాగ్యాభిజాత్య భద్రలక్షణావళులవి సఫలంబు లగునె? అనఁగా

నీవు నలునకుఁ బేర్మితో దేవివైన నీ సముజ్జ్వల రూపకాంతి విభవాదులు సఫలములగును. అట్లు కాకున్నచో అవియన్నియు విఫలము లగునని యర్థము.

(ప్రౌ. వ్యా. వాక్య. 18)

**ఇపుక్**

కొను మున్నగు ధాతువుల కించుక్కు పరమగునపుడు వచ్చుఆగమము. ఇందలి కకార మిత్సంజ్ఞకము. ఉదా:- కొనిపించుచున్నాఁడు మొ॥ (వై. చం. తిజంత, 187)

**-ఇ ప్రత్యయాంతావ్యయము**

ధాతువునకు—'ఇ' ప్రత్యయమును జేర్చుట వలన భూతార్థక అసమాపక క్రియా రూపము సిద్ధించును.

ఎఱుఁగు+ఇ ⟶ ఎఱిఁగి.

చెప్పు+ఇ ⟶ చెప్పి

వీనినే బా. వ్యా. క్త్వార్థమనినది (చూ.) (ప్రౌ. వ్యా. సంధి 2)

**-'ఇఫ' ప్రత్యయాంతము**

వర్ణనిర్దేశమునందు, ఒక వర్ణమునకు వేఱొక వర్ణమును విధించు విధానము నందును అకారాది వర్ణములకు—కార (చూ.) ప్రత్యయము చేరుచుండగా, ర వర్ణమునకు మాత్రము—ఇఫప్రత్యయము చేరుటచే రవర్ణము—ఇఫ ప్రత్యయాంత మగు చున్నది.

రేఫము (ర+ఇఫము) (ఛం, ద. IV. 123)

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 2)

**ఇమనంతములు**

(ఇమన్ + అంతములు) ఇమనిచ్ ప్రత్యయమంతమందుఁగల శబ్దములు. పృథ్వాదిభ్య ఇమనిజ్వా (అష్టా 5-1-122) అను పాణినీయ సూత్రముచే పృథు, గురు, లఘు, మహత్ మున్నగు శబ్దములపై భావార్థమున ఇమనిచ్ ప్రత్యయము రాఁగా ప్రథిమన్, గరిమన్, లఘిమన్, మహిమన్ మున్నగు రూపములేర్పడును. ఇవియే ఇమనంతములు. వీనిపై 'సు' ప్రత్యయస్థానమున 'డా' ప్రత్యయము వికల్పముగా వచ్చును (చింతా. హలన్త. 7) డాప్రత్యయము వచ్చిన పక్షమున

డిత్వ ప్రయుక్తమగు టిలోపము, పిదప హ్రస్వము రాగా ప్రథిమ, గరిమ, లఘిమ మహిమ, మున్నగు రూపములు సిద్ధించును. డాప్రత్యయము రానిపక్షమున అంత్య హల్లు (నకారము) నకు లోపము, మువర్ణకమును వచ్చును. ఉదా - గరిమమము, లఘిమము, మహిమము మొ॥ చూ. డా.

-ఇమి[1]

'కలుగు" మున్నగు ధాతువులకు—ఇమి ప్రత్యయము చేరును. అంతిమాక్షరము లోపించును.

కలుగు+ఇమి

కలు+ఇమి—కలిమి

కూరుచు+ఇమి

కూరు+ఇమి—కూరిమి (ఆం. భా. భూ. 166, బా. వ్యా. కృదంత. 4)

-ఇమి[2]

'పేరు' మున్నగు నామములకు త్వార్థమునందు (భావార్థము) పరమగు తద్ధిత ప్రత్యయము.

పేరు+ఇమి—పేరిమి

వేడి+ఇమి—వేడిమి (బా. వ్యా. తద్ధిత. 5)

-ఇమి[3]

బల, హేలా శబ్దములపై స్వార్థమునవచ్చు తద్ధిత ప్రత్యయము. ఉదా:- బలిమి, ఎలిమి (వై. చం. తద్ధి 81). బలిమియను శబ్దము కానవచ్చుచున్నను ఎలిమియను రూపము కానరాదు. ఎలమి యనియే కానవచ్చును.

ఇమ్యాదులు

(ఇమి+ఆదులు). బలిమి, పోడిమి మున్నగు ఇమి వర్ణకాంత శబ్దములు మఱియు ములికి, ఉదిరి ఇత్యాది శబ్దములు. బహువచనము పరమగునపుడు వీనియుపోత్త మేత్తునకు హ్రస్వోకార మాదేశమగును. బలిమి > బలుములు, పోడిమి > పోడుములు, ములికి > ములుకులు, ఉదిరి > ఉదురులు మొ॥ (వై. చం. అజన్త 58)

-ఇయ

( ) కొన్ని అచ్చిక శబ్దాన్తములందు వినిపించు ధ్వని దీనికి ఎత్వము బహుళముగా నాదేశమగును.

కన్నియ — కన్నె

వన్నియ — వన్నె

నన్నయ భాషలో 'ఇయా'ంతములే కలవు. నన్నయానంతర భాషలో ఎత్వాంతము లెక్కువ.

(బా. వ్యా. అచ్ఛిక 23)
(వై. చం. అజంత. 88)

(ii) -'ఇయ' లోని ఇకారమునకు లోపమును గూడ కొందఱు పేర్కొనిరి)

ముత్తియము < ముత్తెము / ముత్యము

కళ్లియము < కళ్లెము / కళ్యము

(ప్రౌ. వ్యా. శబ్ద. 49)
(బా. వ్యా. అచ్ఛిక 28.)

**ఇయదర్థకము**

'ఇయత్' అను శబ్దముయొక్క అర్థమునిచ్చునది.

ఇంచుఱు, ఇన్ని మొదలగునవి.

(బా. వ్యా. అచ్ఛిక. 24)

**ఇయాంతములు**

(ఇయ+అంతములు) ఇయ అనునది అంతమందుఁగల విడియము, ముత్తియము, కడియము, మిరియము, కన్నియ, వన్నియ, గడియ మొ॥ శబ్దములు ఇవి వికల్పముగా ఎకారాంతములగును. ఉదా:- విడెము-విడియము; ముత్తెము-ముత్తియము; కడెము-కడియము మొ॥

(చింతా. అజంత. 81)

**-ఇయించు**

సంయుక్తములుగానట్టి లఘువులైనట్టి సంస్కృత ధాతువులను తత్సమీకరించునపుడు వికల్పముగా 'ఇయించు' అనునాగమము చేరును.

వరియించు, వరించు

ప్రతిఘటియించు, ప్రతిఘటించు

(చూ.) ఇయు డాగమము.

(ఆం. భా. భూ. 152, 153)
(క. సం. వి. I. 100 101)

**-ఇయుడాగమము**

ఇయుట్+ఆగమము. టిత్సంజ్ఞ.

గురుమంతము కానట్టి, యకారాంతము కానట్టి, ఏకస్వర, ద్విస్వర ధాతువుల మీది ఇంచుగ్వ్రక్రములకు (చూ.) 'ఇయు(ట్)' ఆగమము విభాషను వచ్చును

భుజ్+ఇంచు < భుజ్+ఇయ్+ఇంచు — భుజియించు
.............. — భుజించు

గుణ+ఇంచు < గుణ+ఇయ్+ఇంచు — గుణియించు
.............. — గుణించు

నగు+ఎను < నగు+ఇయ్+ఎను — నగియెను
.............. — నగెను

నగు+ఎడి < నగు+ఇయ్+ఎడి — నగియెడి
.............. — నగెడి.

(బా. వ్యా. క్రియా. 50)

**ఇర**

వేగ శబ్దముపై స్వార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయము.

ఉదా:- వేగిరము. (వై. చం. తద్ధితా. 9)

**-ఇరము**

కొన్ని తద్భవములందు కానవచ్చు శబ్దము. భిక్ష—బికిరము

(క. సం వి. *III*. 4)

**-ఇరి**[1]

కొన్ని తద్భవములందు కానవచ్చు శబ్దము. సాక్షి—సాకిరి

(క. సం. వి. *III*. 4)

**-ఇరి**[2]

స్వార్థమునందు 'వాపు' నకు వచ్చు తద్ధిత ప్రత్యయము.

వాపు+ఇరి - వాపిరి

(ప్రౌ. వ్యా. తద్ధిత. 11)

**ఇరిస్**

సాక్షిశబ్దముపై స్వార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయము. ఇందలిసకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- సాకిరి (వై. చం. తద్ధిత. 12)

**ఇత్వాంతము**

ఇత్వు + అంతము హ్రస్వమగు ఇకార మంతమందుఁగల పదము.

చూ. అత్వాంతము (ఆం. భా. భూ. 51)

**-ఇలు**

చూ. —ఇల్లు

శోభిలు, సంధిలు మొదలైనవి.

(ఆం. భా, భూ. 176

**-ఇల్లు**

కొన్ని ధాతువులకు అప్రేరణమునందు అనుప్రయుక్తమగు శబ్దము.

సంధిల్లు, శోభిల్లు మొదలైనవి.

(ఆం. భా. భూ. 176)

(చూ. బా. వ్యా. క్రియా. 71)

**ఇవార్థకములు**

'ఇవ' అనునర్థము నిచ్చుశబ్దములు.

అట్లు, పోలె, బలె, వలె అనునవి.

(ప్రౌ. వ్యా. సమాస. 38

**-ఇలి**[1]

**తద్ధిత ప్రత్యయము**

అంకు+ఇలి—అంకిలి

**-ఇలి**[2]

కృత్ప్రత్యయము

ఒదుగు+ఇలి—ఒదిగిలి

(ఆం. భా. శా. కృత్.35)

ఇస్సీ

'పాపదర్శనాదులందు ఈశ్వరస్మరణము చేయుటయను నర్థమున నిపతింపఁబడిన యవ్యయ శబ్దము. ఉదా:- 'ఇస్సీ' యెంతలు పుట్టె శీతకిరణుండిట్లేఁచునే రాధికన్ మొ॥ (వై. చం. అవ్య. 28)

**ఈ**[1]

తెలుగు వర్ణమాలలోని నాల్గవ వర్ణము

ఇకారముయొక్క దీర్ఘము

కఠిన తాలువు—స్థానము

జిహ్వామధ్యము—కరణము

సంవృత ప్రయత్నము

నాదము

అల్పప్రాణము

**ఈ**[2]

(i) సర్వనామము

దగ్గఱగా నున్నదానిని తెలుపును. త్రికము (చూ.) లో రెండవది. దీనిమీఁది హల్లు ద్విత్వమగుచో నిది హ్రస్వమగును.

ఈకన్య—ఇక్కన్య

(బా. వ్యా. అచ్చిక. 24; సమాస. 4)

(ii) సమాస ఘటితమై ఒక్కచో సూచనార్థకమగుసు.

ఈయున్న ప్రాఘ్యపాలికిం బోయి (ఇదిగో నున్నయని యర్థము)

(ప్రౌ. వ్యా. సమా. 11)

**ఈ**[3]

(i) 'అటమట' మున్నగు కొన్ని శబ్దములకు మతుబర్థమునందు పుంస్త్వ బోధకమగు తద్ధిత ప్రత్యయము.

అటమటీఁడు, బానసీఁడు

(ii) కొన్ని శబ్దములకు స్వార్థమునందు వచ్చు తద్ధిత ప్రత్యయము.

మొక్కపీఁడు, కల్లరీఁడు (బా. వ్యా. తద్ధిత. 15, 16)

**ఈ**[4]

(i) 'ఇచ్చు' ధాతువునకు సర్వాదేశముగా వచ్చును. ఈఁడు, ఈఁగలఁడు, ఈమి మున్నగునవి. (బా. వ్యా. క్రియా. 92)

(ii) ప్రార్థనాద్యర్థములందు అన్నంత క్రియకు 'ఇచ్చు' ధాతు వనుప్రయుక్త మగును. అట్టిచో ఇచ్చు ధాతు మధ్యమపురుషైక వచనాంత రూపమగు 'ఇమ్ము' అనుదానికి 'ఈ' ఆదేశముగా వచ్చును.

'ఓర్పుమై నుప్పిండి యుపవాసముండనీ' (ఉండనిమ్ము)

(ప్రౌ. వ్యా. క్రియా. 10)

**ఈ**[5]

సంప్రార్థనమునందు మధ్యమ పురుష 'ము, డుఁజ్' లకు విభాషగా నను ప్రయుక్తమగును.

ఇది 'అదాదుల' లోనిది (చూ.)

వండుమీ, వండుఁడీ (బా. వ్యా. క్రియా. 33)

(వై. చం. అవ్యయ. 5,6)

**ఈ**[6]

ఇకారాంత పదములకు సంబుద్ధిని వైకల్పికముగా ఆదేశమగును.

హరీ, తండ్రీ, ఓరీ, ఓసీ, ఓయీ

(బా. వ్యా. తత్సమ. 16, 33)

**ఈ**[7]

'ఏఁడి, ఏరి, ఏవి, ఏవి,' అనుశబ్దములకు అర్థవిశేషమునందు పరమగును.

'ఏఁడీ నాబలుమానికంబుల కొటారు"—అనఁగా ఎక్కడ? ఎక్కడ నున్నా దని ఇత్యాదిగా అర్థవిశేషము. (ప్రౌ. వ్యా. శబ్ద. 87)

(వై. చం. అవ్యయ. 5,6)

**-ఈఁడు**

చూ. ఈ[3]

బాసను, గుణమును, కులమును దెల్పు తద్ధిత ప్రత్యయము.

కన్నడీఁడు, కపటీఁడు, సాలీఁడు.

(ఆం. భా. భూ. 168; ఆం. కౌ. 651,'52)

(అథ. కా. అజన్త. 50, 51)

**ఈదు**

సమానార్థకము, దేశ్యవిశేషణము, నిత్యైక వచనాంతము.

'సురుచిరపదములు, రదనములు, నిరువురకును నొక్కయీదైయునికిన్'

(ప్రౌ. వ్యా. శబ్ద. 32)

**ఈదంతములు**

(ఈత్+అంతములు) దీర్ఘ-ఈకారాంతములగు శబ్దములు-ఉదా:- గ్రామణీ, సేనానీ మొ॥ ఇట్టి శబ్దములు తత్సమములుగా మాఱునపుడు హ్రస్వ-ఇకారాంతములై హ్రస్వ-ఇకారాంతశబ్దములవలె ఆయా విభక్తి రూపములను పొందును. ఉదా:- గ్రామణి (ఏక), గ్రామణులు (బహు) మొ॥ (చింతా. అజంత 41).

**-ఈప్**

జనపదవాచియగు తద్భవ శబ్దమునకు 'అక్కడ పుట్టుకగలది' యను నర్థమున వచ్చు స్త్రీ ప్రత్యయము. ఇందలి పకారమిత్సంజ్ఞకము. ఉదా:- కన్నడి, గుజ్జరి, మరాటి మొ॥ (వై. చం. స్త్రీ ప్ర. 9) ఇట ఈప్ ప్రత్యయమురాగా కన్నడీ, గుజ్జరీ, మరాటీ అనికాగా ఈకారమునకు హ్రస్వము వచ్చినది.

**ఈప్సితానీప్సితకర్మ**

ఇష్టము, అనిష్టమునగు కర్మ.

"బాలుఁడు దువ్వగప్పిన పాయసాన్నమును మెసవెను"—అనుచో 'పాయస' మునందిష్టము, 'దువ్వ గప్పియుండుట'చే అనిష్టము-రెండును గల్గిన కర్మయని యర్థము.

(ఆం. కౌ. 485, 486)

**ఈప్సితకర్మ**

మిక్కిలి యిష్టమగు కర్మ

'జనపతియన్నంబు సాపడియెడి'

(ఆం. కౌ. 483 పంక్తి)

**ఈమ్**

మతుప్ప్రత్యయ స్థానమున వచ్చు ఆదేశము. (వై. చం. తద్ధి. 1) ఇందలి మకారమిత్సంజ్ఞకమై లోపించును. ఇదిమిత్తమగుటనే వికృతి శబ్దముల మీద మాత్రమే వచ్చును. (చూ. మిత్) ఉదా:- తొంటరీడు మొ॥

**ఈర్ష్యాదులు**

(ఈర్ష్యా+ఆదులు) ఈర్ష్య, భిక్ష, వీటి మున్నగు శబ్దములు. ఇవి తద్భవములగునపుడు విధా శబ్దము వలె క్లీబసమములగును. ఉదా:- ఈ రసము (ఈర్ష్య), బికిరము (భిక్ష), విడియము (వీటి) మొ॥

(వై. చం. అజన్త. 79)

ఉ[1]

తెలుఁగు వర్ణమాలలో ఐదవ వర్ణము

సంపూర్ణ సంవృత పశ్చాద్దోష్ఠ్య హ్రస్వ స్వరము

(high back round short vowel)

స్నిగ్ధ తాలువు - స్థానము

జిహ్వామూలము - కరణము

సంవృత ప్రయత్నము

నాదము

అల్పప్రాణము

ఉ[2]

(i) హలంత సంస్కృత శబ్దములను తత్సమీకరించునపుడు అంతాగమముగా వచ్చును.

వాక్ + ఉ - వాకు, వాక్కు

దిక్+ఉ - దిక్కు (బా. వ్యా. హలన్త. 68)

(ii) పుంలింగము, మహద్వాచకముననగు సంస్కృత శబ్దమును తత్సమీకరించునపుడు తుది అకారమున కాదేశమగును.

రామ+డు (జ్) —రాముఁడు, రాముండు.

(iii) ఆలు శబ్దము పరమగునపుడు కొన్ని సంస్కృత శబ్దములకిట్లే యాదేశమగును.

ధీర+ఆలు - ధీరురాలు; గుణవంతురాలు

(iv) బల్లిదాదులగు (చూ.) కొన్ని ఆచ్ఛికశబ్దములకును నిట్లేయాదేశమగును—బల్లిద+డు (జ్) —బల్లిదుఁడు, బల్లిదుండు

(బా. వ్యా. తత్సమ. 21; ఆచ్ఛిక. 3, సంధి 31)

ఉ[3]

(i) హ్రస్వమగు ఇకారమంతమందుఁగల శబ్దములకు బహువచన ప్రత్యయము పరమగునపుడు ఆదేశమగును.

కవి+లు—కవులు

తేది+లు—తేదులు

దీనినే యాధునికులు స్వరాకర్షణము (vowel harmony) (చూ.) అందురు. (బా. వ్యా. తత్సమ. 45)

(ii) మూడు గాని, అంతకుమించినట్టిగాని వర్ణములుగల ఇకారాంతములగు అచ్చికపదముల ఉపోత్తమ ఇత్వమునకు (చూ. ఉపోత్తమేత్వము) బహువచన ప్రత్యయము పరమగునపుడు కొన్నింటికి ఆదేశమగును.

కలికి+లు ⟶ కలుకులు

ములికి+లు ⟶ ములుకులు (బా. వ్యా. తత్సమ. 46)

(iii) ప్రేరణార్థమునందు వచ్చు 'చు' 'పు' వర్ణములు పరమగునపుడు ధాతువులలోని 'ఇ' కారమునకు ఆదేశముగా వచ్చును.

బిగియు—బిగుచు

తెలియు—తెలుపు (బా. వ్యా. క్రియా. 75)

(iv) కొన్ని కృత్ప్రత్యయములు పరమగునపుడు నిట్టిమార్పు కల్గును—

కినియు—కినుక; బలియు—బలుపు (బా. వ్యా. కృదంత. 3)

ఉ[4]

(i) సముచ్చయార్థమును దెలుపును.

'ఇవియేనున్ సతతంబు నా యెడ'

(ii) 'కూడ' 'సయితము' 'అయినప్పటికి' మున్నగు వాని యర్థముల నిచ్చును.

ఎట్టి విశిష్ట కులంబునఁబుట్టియు

(iii) కి మర్థకమగు 'ఏ' 'ఎవఁడు' 'ఎప్పుడు' మున్నగు పదములకు; 'ఒకడు' మున్నగు మఱికొన్ని పదములకు అనుప్రయుక్తమై సర్వార్థమునిచ్చును. అపుడు వ్యతిరేక క్రియలతోడనే సంబంధించి యుండును.

ఎన్నడును వికారంబు పుట్టనేరదు.'

దీనికెన్నఁడున్ బుట్టదు' – మున్నగునవి. (సూ. ని.)

ఉ[5]

ఆనంతర్యార్థమును దెలుపును.

'అనుటయుఁ చిన్న నవ్వు నగి' (సూ. ని.)

**ఉ**[6]

వాక్యాలంకారముగా నుపయుక్తము.

'విషయోప భోగాభిలషణమింకను నాకు

వదలక పెరుఁగుచున్నదియుఁగాన'

(ప్రౌ. వ్యా. శబ్ద. 116)

**ఉ**[7]

'అడుకు' లోనగు ధాతువులకుఁ బరమగు కృత్ప్రత్యయము.

అడుకు+ఉ - అడుకు

అంటు+ఉ - అంటు

(బా. వ్యా. కృదంత. 21)

**ఉంగ్రము**

ఉంగర శబ్దముయొక్క రూపాంతరము. ఉంగరశబ్దమందలి గకారముమీది అ వర్ణమునకు లోపము బహుళము. ఉదా:-ఉంగ్రము, ఉంగరము.

(వై. చం. వైకృత. 2.

**ఉండి**

(i)ఒకానొకచో 'వలన' వర్ణకమున కనుప్రయుక్తము 'హిమగిరి వలన నుండి గంగ వొడమె'.

(ii) ఇది పరమగునపుడు 'వలన'కు ద్వితీయా సప్తములు తరచుగా నగును.

వనమునుండివచ్చె (ద్వితీయ)

వనమునందుండి వచ్చె (సప్తమి)

(బా. వ్యా. కారక. 10)

(iii) ఇది పరమగునపుడు 'వలన'కు 'న' వర్ణకముకూడ నగును.

'చనుదెంచె బ్రహ్మలోకంబున నుండి'

(ప్రౌ. వ్యా. కారక. 10)

(iv) 'వలన' కాదేశమయిన ద్వితీయా సప్తములమీఁది 'ఉండి'కి లోపము బహుళము.

విచ్చేయు మదితి గర్భముఁ జెచ్చెర (గర్భమునుండి)

నూతిలో వెలువడ (నూతినుండి)

(ప్రౌ. వ్యా. కారక. 11)

**ఉక్**

(1) వాచ్ శబ్దము, కుల్యార్థక సరిత్ శబ్దము - వీని యంత్యహల్లునకు వచ్చు ఆగమము. ఇందలి కవర్ణమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ఉ' మిగులును. ఉదా:- వాక్కు (వాక్+క్+ఉ) (వై. చం. హలన్త 36). ఇట కకారమునకు "ద్విత్వంచ దిగాదేః" (వై .చం. హలన్త.32) అను సూత్రముచే ద్విత్వము; చూ:-ఉగాగమము.

**ఉక్**

(2) ఉ, ఋ, ౠ అను వర్ణములను తెలుపు ప్రత్యాహారము.

**ఉక**[1]

దేశ్యములగు స్త్రీవాచక పదములపై స్వార్థము(ప్రకృత్యర్థము) న వచ్చు ప్రత్యయము ఉదా:- వెలదుక, పొలతుక, నెలతుక, పడతుక, మొ॥ (మం. ఆం. కౌ. 279)

**-ఉక**[2]

'చిఱుత' మున్నగు శబ్దములకు స్వార్థము నందువచ్చు తద్ధిత ప్రత్యయము.

చిఱుతుక, నాతుక (బా. వ్యా. తద్ధిత. 10)

**ఉకారసంధి**

ఉకారమునకు ఉకారము పరమైన దీర్ఘమేకాదేశ మగును.

ఉ+ఉ > ఊ ; భాను+ఉదయము ⟶ భానూదయము.

ఉ+ఊ > ఊ , ధేను+ఊధస్యము ⟶ ధేనూధస్యము

ఊ+ఉ > ఊ : వధూ+ఉక్తము ⟶ వధూక్తము

ఊ+ఊ > ఊ : వధూ+ఊరీకారము ⟶ వధూరీకారము

(త చం. 2-8)

**ఉకార ఋకారాంతములు**

(i) ఉకారముకాని ఋకారముకాని అంతమందుఁగల పదములకు 'కు' వర్ణకము పరమగునపుడు నగాగమ మగును.

రామునకును, విష్ణునకును

సవితృనకును, విధాతృనకును

(*ii*) వీనికి 'అందు' వర్ణకము పరమగునపుడు 'ను' గాగమ మగును.

రాము+న్+అందు ⟶ రామునందు

విష్ణు+న్+అందు ⟶ విష్ణునందు

సవితృ+న్+అందు ⟶ సవితృనందు

(బా. వ్యా. తత్సమ. 28, 29)

**ఉకారాంతపురుషాఖ్యలు**

పురుష బోధకములగు ఉకారాంత శబ్దములు. వీనికి 'వు' త్వముగాని 'డు' త్వము గాని చేరును.

ప్రభువు—ప్రభుఁడు

గురువు—గురుఁడు (ఆం కౌ. 167, 168)

**ఉకారాంత జడము**

(i) ఉకారమంతమందు గల్గినట్టి, ప్రాణము లేనట్టిదానిని తెలుపునట్టి పదము. ఇట్టి పదమునకు సప్తమ్యర్థమునందు 'న' వర్ణకమును వచ్చును.

ఘటమున జలమున్నది.

మోక్షమున నిచ్చ గలదు.

(బా. వ్యా. కారక. 18)

(ii) ఇట్టి ఉకారాంత జడమునకు తృతీయార్ధము నందును న వర్ణకము రావచ్చును.

రాముఁడొక్క బాణంబున వాలింగూలనేసె - బాణముతోనని యర్థము.

(బా. వ్యా. కారక. 23)

**ఉకారాంత శబ్దములు**

ఉకారాంత సంస్కృత శబ్దములను తెనుఁగు సేయునపుడు 'వు' వర్ణకము చేరును. లేదా లోపించును.

బాహువు — బాహు

రాహువు — రాహు

(క. సం. II-1; కా. చూ. IX. 189,
రంగ. IV. 27; స. సా. సం. I 183)

**ఉక్త వర్ణకములు**

ఉక్తార్థమునందు (చూ.) వచ్చు ప్రత్యయములు - ౦డి, డు, ము, వు, లు.

(మ. ప. వ్యా ప్రత్యయ. 8)

**ఉక్తార్థము**

ఉక్తమనఁగాఁ జెప్పఁబడినది.

క్రియా విభక్తిచేఁజెప్పఁబడిన యర్థము. ఉక్తార్థమునందు ప్రథమ వచ్చును.

రాముఁడు రావణుని సంహరించెను.

ఇందు ఆఖ్యాతము కర్తను జెప్పినది కావునఁ దద్వాచకమగు 'రామ' శబ్దమునకుఁ బ్రథమ వచ్చును.

రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె -

ఇందాఖ్యాతము కర్మమును జెప్పినది. కావునఁ దద్వాచకమగు 'రావణ' శబ్దమునకుఁ బ్రథమ వచ్చును.

(బా. వ్యా. కారక. 1)

**ఉగంతములు**[1]

(ఉక్+అంతములు) ఉక్ అంతమందు గల శబ్దములు. ఉక్ అను ప్రత్యాహారము ఉ, ఋ, ఌ అను మూడింటికి సంజ్ఞయైనను తెలుగులో ఌకారాంత శబ్దములకు ప్రయోగము లేనందున ఇట ఉ, ఋ వర్ణములే గ్రహింపఁబడుటచే నీ రెండు వర్ణములంతమందుఁగల శబ్దములు ఉగంతములని భావము.

(వై. చం. అజన్త 20)

**ఉగంతము**[2]

ఉక్+అంతము.

'ఉక్' అను ఆగమమంతమందుఁగల పదము. (చూ.) ఉగాగమము.

హలన్తములగు సంస్కృత శబ్దములను తత్సమీకరించునపుడు వానికి అంతమందు 'ఉత్తు' చేరును. తుది హల్లు బహుళముగా ద్విత్వమగును. ప్రథమైక వచనము లోపించును.

రుక్కు, వాక్కు, వాకు.

(బా. వ్యా. తత్సమ 44, 68)

**ఉగాగమము**

ఉక్+ఆగమము.

హలంతములగు సంస్కృత శబ్దములను తత్సమీకరించునపుడు వానికి ఉగాగమము చేరును. తుది హల్లు బహుళముగా ద్విత్వమగును. వీని ప్రథమైక వచనమునకు లోపము కల్గును.

రుక్కు, వాక్కు, వాకు.

(బా. వ్యా. తత్సమ. 69)

**ఉచ్చారణ స్థాయి**

ఉచ్చారణము నందలి ధ్వనులనన్నింటిని లిఖించి నిరూపించుస్థితి. దీనినే Phonetic Status అందురు, (వ్యతి.) వర్ణస్థాయి(Phonemic Status) (చూ.)

మామ - వర్ణస్థాయి - మాఁవఁ - ఉచ్చారణస్థాయి.

(తమిళము) పామ్బు —,, —పామ్బు — ,,

పాము+తేఁడు — పాఁపతేఁడు—ఇత్యాదులలోని 'ప' కారము వర్ణస్థాయినుండి వచ్చినది. (తె. వ్యా. వి. పుట 472)

**-ఉటపరపదములు**

— ఉట అను శబ్దము పరమందున్న పదములు

చేయుట, త్రోయుట, ఇత్యాదులు

(ఆం. భా.భూ. 149, 150)

(ఆం. కౌ. 787)

**-ఉట ప్రత్యయము**

తెలియుట, కలఁచుట, తలఁచుట ఇత్యాదులలో అంతమందు గలది - ఉట ప్రత్యయమని, ఇది భావార్థము నందు వచ్చునని ఆంధ్రకౌముది పేర్కొన్నది.

(ఆం. కౌ. పంక్తులు 807-10)

**-ఉడు**

తిరుగు, విరుగు, కలఁగు, మ్రింగు, పొసఁగు ధాతువులపై భావార్థమున వచ్చు కృత్ప్రత్యయము. ఉదా:- తిరుగుడు, విరుగుడు, కలగుడు, మ్రింగుడు మొ॥ (వై. చం. కృదన్త. 25; ఆం. కౌ. 786)

**ఉత్తమపురుష**

తన్ను గూర్చిన పలుకు ఉత్తమ పురుష క్రియ అనబడును. ఇది అలింగకము.

(అ. ఛం. IV. 113)

**ఉత్తమము**

మూడుగాని, యంతకెక్కువగాని యక్షరములుగల శబ్దములందలి చివరి యక్షరము. "త్ర్యాదీనామంత్య ముత్తమమ్" అని నియమము. ఇది సంస్కృత వ్యాకరణ సంజ్ఞ. బలిమి, కలిమి ఇత్యాదులలోని 'లి' వర్ణముత్తమము బహువచనము పరమగునపుడు ఉపోత్తమము నందును, ఉత్తమము నందును హ్రస్వ - ఇకారముగల ఉపోత్తమేకారమునకు ఉకారమాదేశమగును. ఉదా:- బలుములు (బలిమి) మొ॥ (చింతా. హల న్త. 85)

**ఉత్తమము**[2]

అస్మదర్థము నందలి 'ను' 'ము' అను క్రియావిభక్తులు.

వచ్చుచున్నాను—ఏ.వ

వచ్చుచున్నాము—బ.వ. (బా. వ్యా. క్రియా 9,11)

**ఉత్తముఁడు**

కేవల లక్ష్యపరిజ్ఞానముగాని, కేవల లక్షణ పరిజ్ఞానముగాని కాక లక్ష్యలక్షణ సమన్వయము బాగుగా తెలిసినవాఁడు. (అప్ప. I. 12)

**ఉత్తమపురుష వికల్పసంధి**

ఉత్తమపురుష క్రియా విభక్తులందలి ఇత్తునకు సంధి వికల్పముగా వచ్చును.

చూచితిమి+ఒకయెలుకన్ < చూచితిమొకయెలుకన్ / చూచితిమియొకయెలుకన్

(స. సా. సం. I. సంధి 28,29)

**ఉత్తరపదము**

సమాసమందలి కడపటి పదము. (ల. వ్యా. సంధి. 11

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు—అనుచో 'శత్రుఘ్నుడు' ఉత్తరపదము.

రాముఁడు+లక్ష్మణుఁడు—రామలక్ష్మణులు

పూర్వపదము+ఉత్తరపదము—ఏకపదము - సమాసము

**ఉత్తరపదద్విగువు**

త్రివిధములగు ద్విగు సమాసములలో (చూ.) నొకటి. చూ. తద్ధితార్థ ద్విగువు, సమాహారద్విగువు

పంచగవధనుఁడు —ఇత్యాదులు

(పంచగావో ధనం యస్యసః—పంచగవధనః। అయిదుగోవుల మొత్తము ధనముగాఁగలవాఁడు).

ఇంక మూఁడు పదములుండును. (బా. వ్యా. ఉ. పుట. 254)

'గో' శబ్దమునకు 'అవ' ఆదేశము 'నౌ' శబ్దమునకు 'ఆవ' ఆదేశమును బహు వ్రీహియందు రాదు. ద్విగువునందు మాత్రమే వచ్చును. అందుచేతనే యిది ఉత్తర పద ద్విగువైనది. (త. చం. పుట. 378. ద్వి.ము)

**ఉత్తరపదలోప సమాసము**

ఉత్తరపదము లోపించిన సమాసము జవాదిసెట్టి—జవాది (నమ్ము) సెట్టి

చనుబాల రామక్క—చనుబాల (నిచ్చు) రామక్క

వంటల రంగమ్మ—వంటల(ను చేయు) రంగమ్మ

(ప్ర. వ్యా. 290. ప్రశ్న)

దీనిని 'మధ్యమ పదలోప సమాసము' (చూ.) అనుట సముచితము.

**ఉత్తర పదార్థ ప్రధానము**

ఉత్తర పదముయొక్క అర్థము క్రియతో నన్వయించు సమాసము.

'చలిగాడ్పు వీచెను'

ఇచట 'గాడ్పు' అను నుత్తర పదమునకే క్రియాన్వయము.

(ఆం. భా. భూ. 113)

**ఉత్తర పదోపమాన సమాసము**

సమాసమందలి యుత్తరపదము ఉపమానముగానున్న సమాసము.

పురుష సింహుఁడు—సింహమువంటి పురుషుఁడు. సింహము—ఉపమానము. (అ. ఛం. IV. 104)

**ఉత్సర్గము**

సామాన్యవిధి లేక సామాన్య నియమము.

విశేషవిధి సామాన్య విధిని బాధించును. ఇది సాధారణ పద్ధతి. ఇట్టి నియమము నకు వ్యతిరేకముగా విశేష విహితములగు 'ఠికాదులు' (తద్ధిత ప్రత్యయములు) ప్రవర్తించిన చోటులందన్నిటను సామాన్య విహితమగు 'తన' వర్ణకము సయితము ప్రవర్తిల్లును.

చిన్నటికము—చిన్నతనము

(బా. వ్యా. తద్ధిత. 2; రమణీ. 371. పుట)

**ఉత్వడుజ్ఞులు**

(i) అత్వము ఉత్వమగుట

(ii) డుజ్ చేరుట.

సంస్కృత శబ్దములను తెనుఁగునఁజేర్చుకొను విధానములలో నొకటి.

సంస్కృతమునందు పుంలింగములై, తెలుఁగు వ్యాకరణానుసారము మహద్వాచకములైన శబ్దముల యత్వమున కుత్వము, డుజ్‌లు అగును.

దిద్ధ—దిద్ధుఁడు

రామ—రాముఁడు

భార్గవ—భార్గవుడు

రాజపురుష—రాజపురుషుఁడు (బా. వ్యా. తత్సమ. 21,22)

**ఉత్వమడఁగుట**

ను, లు, డు అను వర్ణములు నడుమఁగల పదములందలి ఉత్వము వికల్పముగా లోపించును.

కినుక—కిన్క

చిలుక—చిల్క

గాడుపు—గాడ్పు

(స. సా. సం. I. సంధి; బా. వ్యా. ప్రకీ. 17)

**ఉత్ప్రేక్షాద్యోతకములు**

ఉత్ప్రేక్షార్థమును తెలుపునవి. సాదృశ్యమునే కాక సంభావనను (ఊహను) గూడ బోధించునవి.

'పోలె' మున్నగు శబ్దములు ప్రథమాది విభక్త్యంత నామములకు; 'దానికొఱకు' అనునర్థమునిచ్చు (తాదర్థ్యార్థకము—చూ.) క్రియలకును జేరి ఉత్ప్రేక్షాద్యోతకము లగును.

'దారు చక్రంపు బిళ్లవోలె— ఇది దారుచక్రపు బిళ్లయాయని యూహింపఁదగియున్నదని యర్థము.

ఇట్లే తడఁపుచున్నదివోలె, దుఃఖమునఁబోలె; మాన్పఁగఁబోలె ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా సమాస. 41)

**ఉదంతతద్ధర్మార్థ విశేషణము**

హ్రస్వమగు 'ఉ' కార మంతమందున్న తద్ధర్మార్థ విశేషణము (చూ.)

చేయునతఁడు

చేసెడు నతఁడు (బా. వ్యా. సంధి. 33)

**ఉదంత టాంతములు**

హ్రస్వ - ఉకారాంతమగు టకారము (టు అనునది) అంతమందుఁగల అటు, ఇటు, ఎటు మొదలగు శబ్దములు. ఇవి స్థానార్థవాచకములై యుక్తార్థ బోధకములగును. ఉదా:- ఇటురమ్ము, అటుపొమ్ము, ఎటు పోయెదు మొ॥ 'కు' పరమైనపుడు వీని ఉవర్ణమునకు అవర్ణ మాదేశమగును. ఉదా.- ఇటకు, అటకు, ఎటకు మొ॥ మఱియు నివి లుకారాంతములుగను, లకారాంతములుగను అగును. ఉదా.- ఇట్లు, ఇటులు, ఇటుల; అట్లు, అటులు, అటుల మొ॥ (అథ కా. అజ న్త. 59)

**ఉదంతధాతువులు**

హ్రస్వమగు 'ఉ'కార మంతమందుఁగల ధాతువులు.

(i) వచించు, పచించు వంటి సంస్కృత ధాతువులు

(ii) అంగలించు, ఆవులించు వంటివి

(iii) శయనించు, పయనించు మున్నగు నామధాతువులు

(iv) వండు, పండు, విను, కను మున్నగు సహజములగు దేశ్య ధాతువులు ఉదంతధాతువులనఁబడును.

వీనికి వర్తమానార్థమునందు 'ఉన్నా'ను బంధమగును.

(బా. వ్యా. క్రియా. 18)

**ఉదంత నామము**

హ్రస్వమగు ఉకారమంతమందుఁగల ప్రాతిపదికము (చూ. నామము)

ఇట్టి సంస్కృతప్రాతిపదికకు అనుకరణము నందచ్చు పరమగుచో వుగాగమము వచ్చును

ఇయంధేనుః+అనియె—→ఇయంధేను+అనియె

—→ఇయంధేనువనియె

(బా. వ్యా. సంధి 54)

**ఉదంతమగు తెనుఁగు డుమంతము**

హ్రస్వమగు ఉకారమంతమందుఁగల అచ్చికమగు డుమంతము (చూ.)

బల్లిదుడు, కావలుఁడు మున్నగునవి

(i) వీనికి సంస్కృత డుమంతములకు వలె నిగాగమము విభాషగానగును.
బల్లిదునిచే, బల్లిదుచే

(ii) సంబుద్ధిలో వీనిడుజ్‌నకు,సంస్కృత డుమంతములకువలె లోపములేదు
ఓ బల్లిదుఁడ !

(బా. వ్యా. తత్సమ. 28. 24, 34)
(గు. ప్ర పుట 101)

**ఉదంతసంస్కృత నామము**

హ్రస్వమగు 'ఉ' కారమంతమందుఁగల సంస్కృత ప్రాతిపదికము. ఇట్టి ప్రాతిపదికముపైగల సంబోధన డుజ్ఞునకు ఊకారము, ప్లుతము విభాషగానాదేశ మగును.

ఓ విష్ణూ³!!! ఓ శంభూ³!!!

(బా వ్యా. తత్సమ. 85)

**ఉదంత స్త్రీసమము లు**

హ్రస్వమగు ఉకార మంతమందుఁగల ప్రథమైక వచన విభక్తులులోపించిన అచ్చిక పదములు.

చిగురు, తళుకు, ఇత్యాదులు.

ఇట్టివానికి పరుష సరళములు పరమగునపుడు నుగాగమ మగును.

చిగురుంగయిదువు తళుకుగజ్జెలు

చిగుఁగయిరుమవు తళుకున్గజ్జెలు

చిగురున్గయిదువు తళుకుంగజ్జెలు

సొగసుందనము

సొగసుఁదనము

సొగసున్దనము. (బా. వ్యా. సన్ధి. 25,35)

చిగురుంబోఁడి (ప్రౌ. వ్యా. సమాస. 19)

(బా. వ్యా. ,, . 23)

**ఉదంతములగు అమహత్తులు**

హ్రస్వమగు ఉకారమంతమందున్న అమహద్వాచకములు.

వీనికి —అందు వర్ణకము పరమగునపుడు నగాగమము కొన్నియెడల కానిపించును.

అనిమిష నాయకత్వమునయందు

(ప్రౌ. వ్యా. శబ్ద. 21)

**ఉదంతమగు నజదము**

హ్రస్వమగు ఉకార మంతమందుఁగల ప్రాణివాచకము. ఇట్టి శబ్దమునకును తృతీయా విభక్త్యర్థమునందు (కరణార్థము) నవర్ణకము కానవచ్చును.

'ఏనుఁగున నేనుఁగువైచుచు'—ఏనుఁగుతోనని యర్థము.

కాని యిట్టి ప్రయోగము లనేకములు కానరావు.

(ప్రౌ. వ్యా. కారక. 17)

**ఉదాదేశ రేఫాగమములు**

హ్రస్వమగు 'ఉ' కార మాదేశమగుట ; రేఫ ఆగమముగా వచ్చుట అను కార్యములు.

కర్మధారయ సమాసమునందు సంస్కృతోక్తులకు 'ఆలు' అను తెలుఁగు పదము పరమగునపుడు అత్వమునకుత్వము, రేఫాగమము కలుగును.

బుద్ధిమంత+ఆలు — బుద్ధిమంతుర్+ఆలు

—బుద్ధిమంతురాలు

ఇట్లే ధీరురాలు, భీరురాలు ఇత్యాదులు. (అప్ప. V. 89,90)

**ఉద్దేశ్యము**

ఉద్దేశించి చెప్పఁదగినది.

ఇది వక్తృశ్రోతల కుభయులకుఁ దెలియును. ఇది విశేష్యాదికము. అనఁగా విశేష్యముకాని, విశేషణముకాని, సర్వనామముకాని కావచ్చును.

"ఈ హయములు పవనగతింబఱచు"—హయములు—విశేష్యము, ఉద్దేశ్యము.

"వచ్చినవాఁడు ఫల్గునుఁడు"—వచ్చినవాఁడు విశేషణము, ఉద్దేశ్యము.

"కొందలు పిశాచంబని పఱచిరి"—కొందలు— సర్వనామము, ఉద్దేశ్యము

(ప్రౌ. వ్యా వాక్య. 6)

**ర్థము**

ఉద్దేశించి చేయుపని.

ఉద్దేశార్థమునందు ద్వితీయ మీఁద 'కూర్చి' 'గుఱించి' 'గుఱిచి' చేరును.

వర్షముఁగూర్చి జపము

దేవుని గుఱించి తపస్సు

(ఆం. భా. శా. కారక . 25

**వర్ణకము**

వర్తమానార్థక శత్రర్థము (చూ.) నందు వచ్చు ప్రత్యయము.

వచ్చుచు+ఉన్న+వాఁడు — వచ్చుచున్నవాడు.

(బా. వ్యా. క్రియా. 46)

**నుబంధము**

ఉన్న+అనుబంధము

హ్రస్వమగు ఉకారమంత మందుఁగల ధాతువునకు వర్తమానార్థమునందు 'ఉన్న' అను అనుబంధము వచ్చును.

ఇది ధాతువును క్రియా విభక్తిని అనుబంధించును. దీనికి అమహదర్థమునందుఁ దప్ప తక్కినచోట్ల దీర్ఘమును వచ్చును.

వచ్చుచున్నాఁడు—వచ్చుచున్నారు

వచ్చుచున్నావు—వచ్చుచున్నారు

వచ్చుచున్నాను—వచ్చుచున్నాము

వచ్చుచున్నది—వచ్చుచున్నవి

(బా. వ్యా. క్రియా. 13,14,15)

**పకృతి క్రియలు**

చింతా. కర్త విభజించిన త్రివిధ క్రియాభేదములలో నొక భేదము. సంస్కృత ధాతువులన్నింటిని తెలుఁగున చేర్చుకొనుటకనువుగా నుండునని చింతా. కర్తవానిని ఉపకృతి క్రియలు, పరిణతిక్రియలు. సంవృతిక్రియలు అనిమూఁడు విధములుగా విభజించెను. ఏ ధాతువుల ప్రకృతులు తెలుగున కృత్ప్రత్యయాంతములుగ నుండునో అవి ఉపకృతి- క్రియలు. ఉదా:- పుష్, ణుమొ॥ పోషించు, నుతించు మున్నగు క్రియారూపములలో పోష, నుతి అను కృత్ప్రత్యయాంత రూపములు ప్రకృతులు. (చింతా. క్రియా. 15)

ఉప=సమీపే=అంతే (ఇత్యర్థః) కృతిః=కృత్ప్రత్యయ—విధానం యస్యాఃసా ఉపకృతిః (సమీపమున అనగా అంతమున దేనికి కృత్ప్రత్యయ విధానముండునో అది ఉపకృతి) అనువ్యుత్పత్తిచే ఈ సంజ్ఞఅన్వర్థము. (అహో. క్రియా. 15)

**ఉపక్రియలు**

కాలము మొదలగువాని నేర్పఱచుట యందుఁ గ్రియలకు సహాయముగావచ్చు క్రియలు.

తెలుఁగునట్టి యుపక్రియలు నాలుగు—ఉండు, కలుగు, పడు, కొను.

(సం. వ్యా. క్రియా 18)

**ఉన్లుగ్విషయములు**

ఉన్+లుక్+విషయములు.

'ఉన్' లోపమువచ్చు శబ్దములు.

'ఊరు, చోటు, మేను' మున్నగువానికి సప్తమ్యర్థక నవర్ణకముచేరగా, 'ఉన్' లోపించును.

ఊరు+నన్—ఊరన్; చోటు+నన్—చోటన్.

వీనిలో సప్తమ్యర్థమే కాని, తృతీయార్థము గోచరింపదు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 108)

**ఉపదేశకాలము**

ఆద్యోచ్చారణ కాలము. చూ:- ఉపదేశము

**ఉపదేశము**

ఆద్యోచ్చారణము. శాస్త్రాచార్యులు మొదట ఉచ్చరించిన **ధాతు, సూత్ర,** గణోణాది వాక్య, లింగానుశాసనములు, ఆగమప్రత్యయా, దేశములును **ఉపదేశ**ములు. "ధాతుసూత్ర గణోణాది వాక్యలింగానుశాసనమ్ ఆగమప్రత్యయాదేశా ఉపదేశాః ప్రకీర్తితాః" అని అభియుక్తోక్తి.

**ఉపధ**—

అంత్యవర్ణమునకు పూర్వమందుండు వర్ణము. "అలోంత్యాత్పూర్వ ఉపధా" (అష్టా. 1-1-64) అను పాణినీయ సూత్రముచే ఉపధా సంజ్ఞ చెప్పఁబడినది. ఉదా:- 'రామ' శబ్దములోని అంత్యవర్ణమగు అకారమునకు పూర్వమందున్న మవర్ణ ముపధయగును. ఇట మకారములోని అవర్ణమొక వర్ణముగాను, హల్మాత్ర మగు మవర్ణమొకవర్ణముగాను గ్రహింపఁబడినవి. కాని తెనుఁగు వ్యాకరణమున అజ్విశిష్టమగు హల్లు మొత్తము నొకవర్ణముగా పరిగణింపఁబడుటయు, తత్పూర్వ

మందున్న అజ్విశిష్టవర్ణమే ఉపధా సంజ్ఞకమగుటయును కలదు. కనుకనే అమరిచి, తనరిచి మున్నగుచోట్ల ఉపధా భూతమైన రివర్ణములోని ఇకారమునకు చవర్గము పరమగుటచే "చౌ రేరుపధాత్మనశ్చలుగ్వాస్యాత్" (చింతా. సంధి 11) అను సూత్రముచే లోపము వికల్పముగా రాగా అమర్చి, అమరిచి ఇత్యాదిరూపము లేర్పడును. ఇట అచ్చుతోఁగూడిన వర్ణమును (చి అనుదానిని) ఒక వర్ణముగా పరిగణించుటచే 'రి' ఉపధావర్ణమైనది-పాణినీయమున నిట్లు అజ్విష్టవర్ణము నొకవర్ణముగా గ్రహించి తత్పూర్వమగు అజ్విశిష్ట వర్ణమునకు ఉపధాసంజ్ఞ చెప్పుట కూడదు. చిన్నయసూరి (చి సూ.) పాణినీయానుసారము తుది వర్ణమునకు ముందున్న వర్ణమునే ఉపధగాఁ బేర్కొనెను. ఉదా:- రోచి, రోచ్ + ఇ

↓ ↓ (బా.వ్యా.సంజ్ఞా 10)
ఉపధ తుదివర్ణము

**ఉపధా చ, జ లు**

చివరి వర్ణమునకు ముందున్న చ, జ లు

ఇకారము తుదియందున్న సంస్కృత శబ్దములయొక్క ఉపధలో చ, జ లున్నచో, అట్టి శబ్దములకు బహువచన ప్రత్యయమగు 'లు' పరమగునపుడు ఇకారము ఉకారముకాగా ఆ చ, జ లు తమ తాలవ్యోచ్చారణమును గోల్పోయి, దన్త్య చ, జలుగా ఉచ్చరింపఁబడును.

అర్చి—అర్ + చ్ + ఇ + లు ⟶ అర్చులు.
↓ ↓ ↓
ఉపధతాలవ్యము తుదివర్ణము దన్త్యము

రాజి—రాజ్ + ఇ + లు ⟶ రాజులు

ఇట తాలవ్యమగు 'ఇ', స్వరాకర్షణముచే (Vowel harmony) 'ఉ'గా మారుటచే, తాలవ్యేతరాచ్చు తోడి సంయోగము మూలమున తాలవ్యములగు చ, జ, లు తాలవ్యేతరోచ్చారణమును బొందినవి.

ఇట్టి మార్పును పాక్షిక వర్ణసమీకరణము (చూ.)(Partial assimilation) అననగును. (బా. వ్యా. సంజ్ఞా. 10)

**ఉపధ్మానీయము**

'ప', 'ఫ' లకు ముందున్న విసర్గమునకుఁబేరు.

మన ᳵ పద్మము

మన ᳵ ఫలకము

(ఆం. కౌ. 65, 66)

**ఉపపదసమాసము**

చూ. నిత్య సమాసము

(ఆం. భా. శా. సమాస)

**ఉపమానపూర్వపద కర్మధారయము**

ఉపమానము పూర్వపదముగాఁగల కర్మధారయ సమాసము.

కాకినలుపు, బొగ్గుతెలుపు

(ఆం. కౌ. 601, 602)

అలరుఁబోఁడీత్యాదులు ఉపమాన పూర్వపద కర్మధారయములని ప్రౌఢ వ్యాకరణ కర్త యభిప్రాయము.

(ప్రౌ. వ్యా. సమాస. 19)

**ఉపమాన సమాసము**

ఉపమానము గల సమాసము.

పండుమోవి—*పండు* వంటి మోవి.

(ప్ర. వ్యా. 289 ప్రశ్న)

**ఉపమానోత్తరపద కర్మధారయము**

ఉపమానము ఉత్తరపదముగాఁ గల కర్మధారయ సమాసము.

మగ పులి—పులివంటి మగవాఁడు. ఇట్లే 'రాచసింగము' మున్నగునవి. (ఆం. కౌ. 603, 14)

**ఉపమానము**

పోలిక తెలుపుటకు గ్రహింపఁబడిన వస్తువు. 'అట్లు' మున్నగు ఇవార్థకములు (చూ.) ఉపమాన వాచకమునకుఁ బరమగుచో ఉపమేయమునుబట్టి ఉపమానమునకు విభక్తులు మాఱుచుండును. ఇట్టిమార్పులు ప్రౌఢవ్యాకరణమునందు 'లుగలుక్సమాసములు' (చూ.) అను శీర్షికను నిరూపితములు.

(చూ. ప్రౌ. వ్యా. సమాస. 33)

**ఉపమేయము**

పోల్చఁబడిన వస్తువు.

(చూ.) ఉపమానము.

(ప్రౌ. వ్యా. సమాస. 38)

**ఉపయోగము**

నియమపూర్వక విద్యాస్వీకారము. ఇందు గురువుకూడ శిష్యునితోపాటు విద్యాసాధనమునందు పాల్గొనును. అందుచే సహార్థకమగు 'తోడ' వర్ణకము ఆఖ్యాతకుఁ జేరును. ఇది తెలుఁగు నందలి విలక్షణమగు విధానము.

రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి.

సంస్కృతమునందు 'ఆఖ్యాతోపయోగే' (1-4-29) అను పాణినేయ నియమాను సారము అపాదాన కారకమగును.

'రామకృష్ణులు సాందీపని వలన వేదంబులఁ జదివిరి' యనురీతిని ప్రయోగముండును. ఇది సంస్కృత కారక ప్రభావముచేఁగల్గినది.

(బా. వ్యా. కారక. 7)

(చూ. తె. వ్యా. వి. పుటలు. 967-976;

**ఉపలక్షణము**

సూచకము, గ్రాహకము

'చిట్టడవి' లోని పూర్వపదము 'చిట్టి' యనునదియేకాని, 'చిఱు' కాదని' 'చిట్టడవి' యను పదమును మాత్రమే నిర్దేశించినను, అది చిట్టాముదము 'చిట్టిఁదు) 'చిట్టుడుకు' మున్నగు వానిని గూడ సూచించునని బహుజనపల్లి సీతారామాచార్యులవారు తెల్పిరి. (ప్రౌ. వ్యా. సంజ్ఞా. 4)

**ఉపవిభక్తి**

విభక్తికి సమీపముగాఁ బూర్వమందు వచ్చు అక్షరము.

ఊరు+అందు

ఊరు+ఇ+అందు (ఉపవిభక్తి)

ఊరియందు (సం. వ్యా. ఔప. 1)

**ఉపసర్గములు**

నిరుక్తకారుఁడు యాస్కుఁడు, కావించిన పదజాత విభాగము నందలి మూఁడవ విభాగము— (i) నామము (ii) ఆఖ్యాతము (iii) ఉపసర్గము (iv)నిపాతము. ఇవిప్రాయికముగా క్రియాయోగమును గలిగియుండును.(ఉపసర్గాః క్రియాయోగే। పా. (IV-59)

ఇవి యిరువది రెండు : ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్ దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి ఉప.

వీనికే 'ప్రాదుల'నియు వ్యవహారము. వీనికి తెలుఁగు శబ్దములతో కలిసిన ప్రయోగములు లేవు. కాని వీని ప్రభావ మటనట కానవచ్చును దురలవాటు. నిర్మోగమాటము మున్నగునవి (బా. వ్యా. క్రియా 121)

**ఉపసర్జనత్వము**

అప్రధానము, విశేషణ భావము.

'హతరాజుఁడు పరశురాముఁడు—చంపఁబడిన రాజులు కలవాఁడు పరశురాముఁడని యర్థము.

పరశురాముఁడు—విశేష్యము, ప్రధానము

హతరాజుఁడు—విశేషణము, ఉపసర్జనము

(బా వ్యా. తత్సమ. 78)

**ఉపోత్తమము**

(ఉప+ఉత్తమము) మూఁడుకాని అంతకెక్కువకాని యక్షరములుగల శబ్దములందలి చివరి యక్షరము ఉత్తమము. అట్టి ఉత్తమమునకు పూర్వమందున్న యక్షరము ఉపోత్తమమనఁబడును. "త్ర్యాదీనామంత్యముత్తమమ్ - తస్య సమీప ముపోత్తమమ్" అని సంస్కృత వ్యాకరణ నియమము. బలిమి, కలిమి ఇత్యాదులలో లవర్ణము మీది ఇవర్ణ ముపోత్తమము దీనికి బహువచన ప్రత్యయము పరమగునపుడు "ఇదుపోత్తమానాం బహువచనే ఉపోత్తమేత ఉద్భవతి" (చింతా. హలన్త. 35) అను సూత్రముచే ఉవర్ణమాదేశమై బలు-ములు కలుములు ఇత్యాది రూపములేర్పడును.

**ఉపోత్తమేత్వము**

ఉప+ఉత్తమ+ఇత్వము

మూఁడుగాని, యంతకు మించిగాని యక్షరములుగల పదములందు తుది యక్షరము ఉత్తమము. దాని సమీపమందున్న ఇత్వముఉపోత్తమ ఇత్వము.

ఇట్టి ఇత్వము గూడ 'లు' వర్ణకము పరమగుచో ఉత్వముగా మాఱును.

కలికి—ఉత్తమము



ఉపోత్తమ ఇత్వము

కలికి+లు—కలుకులు

ములికి+ములుకులు

(బా. వ్యా. తత్సమ. 46)

**ఉభయము**[1]

దన్త్యతాలవ్యములను ద్వివిధోచ్చారణము లు చ, జలకు తెలుఁగు బాసలో కలవు.

ద్వ్యర్థి కావ్యములందు 'జ' కారమొకటి ఒక యర్థమునందు దన్త్యము, వేఱొక యర్థమునందు తాలవ్యము కావచ్చును.




(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 5)

**ఉభయము**[2]

అగమాదేశములను రెండు విధానములు.

పగలు < పగటిని (ఆదేశము) / పగలిటిని

(బా. వ్యా. అచ్చిక. 81)

**ఉభయప్రార్థనము**

ఎదిటివాఁడు, తాను కలిసిచేయు ప్రార్థనము.

ఇట్టి ప్రార్థనమునందు దుగాగమము (చూ.) నకు అత్వమగును.

మనము వందుదము. (బా. వ్యా. క్రియా. 80)

**ఉభయ లింగములు**

స్త్రీ పురుష సామాన్యలింగములు

అపత్యము, చుట్టము. బిడ్డ (ఇట లింగమనఁగా లౌకిక లింగమని గ్రహింపనగును.) (ఆం భా శా. నామ. 25)

**ఉభయవచనములు**

ఏకవచనము, బహువచనము అనునవి.

'డు, ము, వు న' అను నామవిభక్తులు ఏకవచన మాత్రములు,

'లు' బహువచనమాత్రము.

తక్కిన నామవిభక్తులు రెండు వచనములందును నుపయుక్తమగును.

(ల. వ్యా. సుబన్త. 10)

**ఉభయములు**[1]

చూ. ఉభయవచనములు. (బా. వ్యా తత్సమ, 13)

**ఉభయములు**[2]

సంస్కృత సమములు, సంస్కృత సమేతరములను రెండు వర్గములకుఁ జెందిన పదములు.

ఇట్టి యుభయములు గూడినది మిశ్రమనఁబడును.

రాజు ముదల.

చెఱువునుదకము. (బా. వ్యా. సమాస. 2)

**ఉభయపదార్థ ప్రధానము**

సమాసము నందలి పూర్వోత్తర పదముల యర్థములు రెండును క్రియతో నన్వయించు ద్వంద్వ సమాసము.

రామలక్ష్మణులు వనముల కేగిరి.

(రాముఁడు వనముల కేగెను. లక్ష్మణుఁడు వనములకేగెను.

(ఆం. భా. భూ. 118)

**ఉభయార్థకము**

యుష్మదర్థకము, అస్మదర్థకము అను రెండింటి యర్థముల నిచ్చునది.

ఎదిటి వానినిగాని, ఎదిటివారినిగాని కలుపుకొనినది ఇది నిత్యబహువచనాంతము.

మనము, మనలను, మనచేత మున్నగునవి.

(బా. వ్యా. అచ్చిక. 24)

**ఉభయాక్షరములు**

స్వరధర్మము, వ్యంజనధర్మము రెండునుగల యక్షరములు.

ఖండబిందువు, పూర్ణబిందువు, విసర్గము నను నవి.

(ల. వ్యా. సంజ్ఞా. 15; సం. వ్యా. వర్ణ. 8)

**ఉరుక్**

అలు శబ్దము పరమగునపుడు వర్ణవాచకములు కాని అకారాంత శబ్దములకు వచ్చు నాగమము. ఇందలి కకార మిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ఉరు' అని మిగులును. ఇది కిత్తగుటచే అకారాంత శబ్దమున కంత్యావయవముగా వచ్చును. **ఉదా:-**

ప్రియురాలు (ప్రియ+ఉరు+ఆలు) ధీరురాలు (ధీర+ఉరు+ఆలు) మొ॥ (వై.చం) చింతా. కర్త ఉరుగాగమని చెప్పక రేఫాగమమును, అవర్ణమునకు కారాదేశమును విధించి పై రూపములను సాధించెను. (చింతా. సంధి. 34) ఈ యాగమము సామానాధికరణ్యము నందే వచ్చుననుటచే సామానాధికరణ్యములేనిచోట్ల 'ప్రియునాలు అనియే యుండును. మఱియునిది సంస్కృత సమేతరములగు లోపధ శబ్దములకు రాదు. ఉదా:— ఇల్లాలు, చూలాలు మొ॥

**ఉలగాగమము**

ఉలక్+అగమము

'ఎంపల దానవు?' అనురీతిని ఆంధ్రమహాభారతమునందు ఉలగాగమము పయుక్తము. (ఆం. భా. చ. పుట. 874; ఆం. భా. శా. పుట 100)

**ఉలుస్**

మేఘశబ్దముపై స్వార్థమున వచ్చుతద్ధిత ప్రత్యయము – ఇందలి సకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:— మొగసలు, (వై. చం. తద్ధి. 14)

**ఊ[1]**

తెలుఁగు వర్ణమాలలోని ఆఱవవర్ణము.

చూ. ఉ.

దీర్ఘము

**ఊ[2]**

ఉకారాంత తత్సమముల మీఁది సంబుద్ధి డుజ్ఞునకు వికల్పముగా ఆదేశమై వచ్చును .

ఇది ప్లుతముగా నుచ్చరింపఁబడును.

శంభూ३, విష్ణూ३ (బా. వ్యా. తత్సమ. 85)

**ఊఁ**

(i) కథాదులు వినుచున్నట్లు సూచనముగా శ్రోతచేయుధ్వని విశేషము.

(ii) సమ్మతిని తెలియఁజేయును

ఊఁవెళ్ళుము

(iii) దీనిని ఉచ్చగా నుచ్చరించుచో అసమ్మతి క్రోధము మున్నగు భావము వ్యంజింపఁబడును.

ఊఁ ↑ వాఁడెక్కడి కేగెను?

(సూ. ని; సు. వ్యా. పుట. 57)

**ఊదుట, తేలుట**

ఒత్తిపలుకుట, తేల్చిపలుకుట

హ్రస్వముల మీఁది సున్నల నొకమాఱు ఊది, యుచ్చరింపవచ్చును. లేదా తేల్చి పలుకవచ్చును.

ఘనుండు, ఘనుఁడు

(ఆం. భా. భూ. 118. 119)

**ఊదుట, ఊదకుండుట**

సంస్కృత సమాసములందలి క్రారను గూడిన యక్కరము లూదియుండును ఒక్కొక్కచో ఊదకుండుటయు కద్దు.

"కావున కామక్రోధములఁ గాచుచు, (ఊదకుండుట)

"వినయ వివేకశీలముల విశ్రుతుఁడాతడు (ఊదుట)

(స. సా. సం సమాస. 24,25)

**ఊయేలాదులు**

'ఊయేల' మున్నగునవి.

(i) తాలవ్య వక్రములగు ఎ, ఏ, ఐ గల తెలుఁగు పదములు మూఁడింటిలో నొకటి. (ఊయేల తాయెత్తు పైయెద) దీనికీ క్రిందిరీతిని రూపాంతరము లుండును.

ఊయేల—ఉయ్యేల—ఉయ్యెల

ఊయేల—ఊయెల—ఉయ్యాల

ఉయల—ఊయల—ఊయాల, ఉయ్యల

(బా. వ్యా ప్రకీర్ణ 84)

(ii) 'ఊయేల' మున్నగు పదములు. వీని తొలియచ్చుమీఁది హల్లునకు ద్విత్వము కూడ కల్గును.

ఇది ఆకృతి గుణము. ఉయ్యేల, ఎల్లిదము మున్నగునవి

(బా. వ్యా. ప్రకీర్ణ. 6)

**ఊరు, చోటు, మేన్వాదులు**

ఊరు, చోటు, మేను, మున్నగు శబ్దములు వీనికి 'ఉన్' లోపము వచ్చును.

'న' అను సప్తమి విభక్తి పరమగునపుడు 'ఊరునన్' అని యేర్పగా రేఫము మీఁది 'ఉ' కారము నకారము తోఁగూడి లోపించి ఊరన్ అను రూపమేర్పడును. ఇట్లే చోటన్, మేనన్ మున్నగునవి. ఇవి సప్తమ్యర్థమునే కాని తృతీయార్థము నీయఁజాలవు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 106)

**ఊరు మొదలగునవి**

'ఊరు' మొదలగు ద్వితీయాది విభక్తులు పరమగుచో ఔపవిభక్తికమగు 'ఇ' వర్ణము చేరును.

ఊరు+ఇ+ని ⟶ ఊరిని

కాలు+ఇ+ని ⟶ కాలిని

(బా. వ్యా. ఆచ్ఛిక. 30)

**ఊష్మములు**

శ, ష, స, హ, అను వర్ణములు. శల ఊష్మాణః అని సి. కౌ. విసర్గము, జిహ్వామూలీయము అనుస్వారము-ఇవియు ఊష్మములే వీనికి వివృత ప్రయత్న ముండును. (సి.కౌ సంజ్ఞా.)"ఊష్మావాయుః, తత్ప్రధానా వర్ణాః ఊష్మాణః"అని వ్యుత్పత్తి. (ఋక్ప్రాతిశాఖ్య 1-12) (అప్ప. II. 7; ఆం. కౌ. 64)

**ఊష్మ రేఫములు**

ఊష్మములగు—శ, ష, స, హ. లు, రేఫము,

అనువర్ణములు

త్రికము (చూ.) మీఁది ఊష్మరేఫములద్విరుక్తములయ్యెను. ద్విత్వము కలుగదు.

ఆ రూపము, ఈశబ్దము, ఏషండము

ఆసుకృతి; ఆహయము (బా. వ్యా సమాస. 14)

**ఊష్మలు**

చూ. ఊష్మములు (ఆం. భా. భూ. 17, 186)

(కా. చూ. IX. 10)

(ఛం. ద. IV. 126)

**ఋ**

సంస్కృత వర్ణ సమామ్నాయములోని ఏడవ వర్ణము

ఋతువు, ఋణము మున్నగు సంస్కృతసమములనుగూడి తెనుఁగున వ్యవహరింపఁబడును.

(i) పదాద్యమగు నీస్వరము రేఫతోతుల్యము. కావున స్వరసంధులురావు.
అతఁడు+ఋషి—ఇట సంధిలేదు

ఆ+ఋషి—ఇట యడాగమములేదు.

(బా. వ్యా. సంజ్ఞా 1, 4; ప్రకీర్ణ. 1 )

(ii) ఋకారమునకు ఋకారము పరమైన దీర్ఘమేకాదేశమగును.

పితృ+ఋణము—పితౄణము.

(ఛం. ద. IV. 42)

(iii) అకారమునకు ఋకారము పరమైన రేఫాదేశము వికల్పముగా నగును

బ్రహ్మ+ఋషి < బ్రహ్మర్షి / బ్రహ్మఋషి.

(ఛం. ద. IV. 48)

(iv) ఋకారమునకు భిన్నమగు అచ్చుపరమైనచో రేఫాదేశమగును.

పితృ+అర్థము—పిత్రర్థము (ఛం. ద. IV. 43)

(v) ఇ+ఋ—య్ృ : గిరి+ఋషి < గిర్యృషి / గిరిఋషి

ఉ+ఋ—వ్ృ : ధేను+ఋషభము < ధేన్వృషభము / ధేనుఋషభము

రై+వృద్ధి—రాయ్వృద్ధి

గ్లౌ+వృద్ధి—గ్లావ్వృద్ధి

(ఛం. ద. IV. 49)

(vi) ద్వంద్వసమాసమునందు ఋకారమునకు రవర్ణము విభాషగా నగును.

మాతృ+పితృ < మాతాపితలు / మాత్రపితలు

(క. సం. వి. I. 125, 126)

(బా. వ్యా. సమాస. 24)

(చూ. గు. ప్ర. పుట 281)

**ఋకారాంతము**

(i) 'ఋ'కార మంతమందుఁగల సంస్కృత శబ్దము. ఇట్టిశబ్దములను తెనుఁగునకుఁదేవలయుననన్న అత్వమును, స్త్రీవద్భావము (చూ.) నగును.

భ్రాత, జామాత, కర్త, హంత.

(బా. వ్యా. తత్సమ. 52)

(ii) ఋకారాంత శబ్దము లైదింటికి మాత్రము అత్వస్త్రీవద్భావములు వికల్పముగానగును. అనఁగా డుజ్ చేరును.

విధాతృ < విధాత
విధాతృఁడు

దాతృ < దాత
దాతృఁడు

నేతృ < నేత
నేతృఁడు

సవితృ < సవిత
సవితృఁడు

ధాతృ < ధాత
ధాతృఁడు.

(బా. వ్యా. తత్సమ. 53

**ఋకారసంధి**

ఋకారమంతమందుఁగల శబ్దములకు ఋకారము పరమగునపుడు దీర్ఘమేకాదేశమగును.

పితృ+ఋణము < పితౄణము
పితృఋణము (ప్రకృతిభావ సంధి)

(త. చం. 4)

**ఋత్విగాదులు**

ఋత్విక్+ఆదులు

'ఋత్విక్' మున్నగు సంస్కృత శబ్దములయొక్క ద్వితీయైక వచనాంతములతో తుల్యములగు రూపములు తెలుఁగున విభాషగా ప్రాతిపదికములగును.

ఋత్విక్ < ఋత్విజమ్—ఋత్విజ—ఋత్విజుఁడు
ఋత్విక్+క్+ఉ—ఋత్విక్కు

ఇది ఆకృతి గణము.

(బా. వా. తత్సమ. 78)

**ఋత్వవర్గవ్యంజన సంధి**

వర్గప్రథమాక్షరములకు 'ఋ' కారము పరమగుచోనవి తద్వర్గ తృతీయాక్షరములుగా మాఱును.

వాక్+ఋజుత్వము—వాగృజుత్వము

షట్+ఋతువులు—షడృతువులు

భవత్+ఋషిత్వము—భవదృషిత్వము

(ఛం. ద IV. 59)

**ౠ**

సంస్కృత వర్ణసమామ్నాయములోని ఎనిమిదవ వర్ణము. పితౄణము వంటి పదములనుగూడి తెలుఁగున వ్యవహృతము

(బా. వ్యా. సంజ్ఞా. 1, 4)

**ఌ**

(i) సంస్కృత వర్ణ సమామ్నాయమందలి తొమ్మిదవ వర్ణము.

క్లృప్తము మున్నగు పదములంగూడి తెలుఁగున వ్యవహరింపఁబడును.

(బా. వ్యా. సంజ్ఞా 1,4)

(ii) పదాద్యమయిన ఈ వర్ణము లకారముతో తుల్యము కావున సంధియుండదు.

ఉచ్చరించెను+ఌకారము. (సంధిలేదు)

(బా. వ్యా. ప్రకీర్ణ. 1.)

(iii) అకారమునకుఁబరమైన ఈవర్ణము లకారమగును.

తవ+ఌకారః—తవల్కారః

(రమణీ. 465 పుట)

**ౡ**

(i) సంస్కృత వర్ణసమామ్నాయమందలి పదియవ వర్ణము.

ౡకారము మున్నగు సంస్కృత సమములనుగూడి తెలుఁగున వ్యవహరింపఁబడును.

(బా. వ్యా. సంజ్ఞా. 1,4)

(ii) 'ౡకారగ్రహణము సంస్కృత ప్రాకృత భాషావ్యాకరణజ్ఞులసమ్మతము అయ్యెది మంత్రశాస్త్రప్రసిద్ధము'

(ప్రౌ. వ్యా.సంజ్ఞా. 1..)

**ఎ**[1]

తెలుఁగు వర్ణమాలలోని ఏడవ వర్ణము

అర్ధసంవృత విస్తారితాగ్రస్వరము

(half-closed unround front vowel)

కఠిన తాలువు - స్థానము

జిహ్వామధ్యము - కరణము

అర్ధసంవృత ప్రయత్నము

నాదము

అల్పప్రాణము
హ్రస్వము—
సంస్కృతమునందిట్టి ధ్వనిలేదు.
ప్రాకృతము నందిట్టిధ్వని కొందఱమతమునలేదు.

(బా. వ్యా. సంజ్ఞా 1,2.)

-ఎ$^2$

అవధారణార్థకము (చూ )
నీవెయీపని చేయవలయును.
నీతియె బ్రతుకునకుఁదెరువు

(ఆం. భా. భూ. 183, 184)

ఎ$^3$

నిర్దేశమును బలపఱుచును.
"ఇదెయొక పిన్నవాడదరి యెక్కఁడు మూకలక్రందు దోలెడున్"

(సూ ని )

-ఎ$^4$

ఆధిక్యమును తెలుపును.
"అతనిని శేషుఁడె వర్ణింప లేనపుడు
ఇతరులు చాలరని చెప్పవలెనా?"

(సూ.ని )

-ఎ$^5$

స్వయమర్థకము
తనంతటతాను (అన్యప్రేరణము లేదు) అనుభావమును దెల్పును.

వాఁడె వచ్చెను, తానెపోయెను

(ప్రౌ. వ్యా. శబ్ద. 108)

-ఎ$^6$

ప్రశ్నార్థకమై సందర్భానుసారముగా పరిహాసాధిక్షేపాదులను దెలుపును
'ద్రుపదమహారాజులె యిట్లు కృపణులై పట్టుపడన్ వీరికి వలసెనె?'
(సూ.ని.)

-ఎ[7]

ప్రార్థనార్థకములగు మధ్యమ ముదుజ్ లకు అనుప్రయుక్త మగును.

రమ్ము+ఎ→రావె

రండు+ఎ→రారె

రాకుము+ఎ→రాకువె

రాకుఁడు+ఎ→రాకురె

(బా. వ్యా. క్రియా. 34)

-ఎ[8]

స్త్రీత్వమును దెలుపును

'మాఱు పేరము లేలె మంజువాణి'

(సూ.ని)

ఎ[9]

ద్విరుక్తమగు హల్లునకు పూర్వమందలి ఏకారముయొక్క హ్రస్వరూపము.

ఏకాలము—ఎక్కాలము

(బా. వ్యా. సమాస 13,14)

-ఎ[10]

స్త్రీవాచకమగు 'త' వర్ణకము పరమగు కొన్నినామముల చివర నాదేశమగు ను

మాలెత, చెంచెత, గుబ్బెత.

(బా. వ్యా. తద్ధిత. 20)

-ఎ[11]

శబ్దము చివరనున్న —'ఇయ'కు ఆదేశమగును.

కన్నియ—కన్నె

కొండియము—కొండెము

(బా. వ్యా. అచ్చిక. 28)

ఎ ఏ, ఒ, ఓ లు

వీనిని వక్రములని ప్రాచీనులు వ్యవహరింతురు.

చూ. వక్రములు

(బా. వ్యా. సంజ్ఞా. 2)

**ఎ, ఒ లు**

వీనికి హ్రస్వ వక్రములని (చూ.) వ్యవహారము.

కొందఱ మతమున నీహ్రస్వ వక్రములు ప్రాకృతములలో లేవు.

కొందఱ మతమునఁగలవు.

(బా. వ్యా. సంజ్ఞా.6)

**-ఎడి**

తృవర్థకార్థము (చూ.) నందువచ్చు ప్రత్యయము. చూ. -ఎడు

ప్రవర్తించెడి వాఁడు —ప్రహర్తయని యర్థము.

(బా. వ్యా. క్రియా. 44)

**-ఎడిగాగమము**

ఎడిక్+ఆగమము

తద్ధర్మాదులందు ప్రథమ పురుష నువర్ణకము పరమగునపుడు ధాతువు అంతమునందు '—ఎడి' యనునాగమము చేరును.

వండెడిని (బా. వ్యా. క్రియా. 28)

**-ఎడు**

తృవర్థకార్థము (చూ.) నందు వచ్చుప్రత్యయము.

చూ.-ఎడి

ప్రహరించెడు వాడు—ప్రహర్తయని యర్థము.

(బా. వ్యా. క్రియా. 44)

**-ఎఁడు**

మానార్థకములగు (కొలతకు సాధనములగు వానిని జెప్పు) జేన, బార, తూము, గిద్ద మున్నగు శబ్దములపై ఏకత్వమున పరిమాణార్థమున వచ్చు తద్ధితప్రత్యయము (అ.కా. సంధి. 7) ఉదా:- జేనెఁడు (జేన+ఎఁడు), బారెఁడు (బార+ఎఁడు), దోసెఁడు (దోసిలి+ఎఁడు) మొ॥ దోసిలి, పిడికిలి, గుప్పిలి మున్నగు శబ్దములపై ఎఁడు వర్ణకము పరమగునపుడు చివరి 'లి' వర్ణము లోపించును (అ.కా. సంధి 7). పరిమాణార్థకమగునీ 'ఎఁడు' వర్ణకముపరమగునపుడు అన్ని యచ్చులకును సంధి నిత్యముగా వచ్చును. (చింతా. సంధి. 5, ఆం బా. భూ. 189; ఆం. కా. 254, 255; బా. వ్యా. తద్ధిత. 25)

**-ఎడుగాగమము**

ఎడుక్ + ఆగమము

తద్ధర్మాదులందు ప్రథమ పురుష నువర్ణకము పరమగునపుడు—'ఎడు' అను నాగమము ధాతువు అంతమందు చేరును.

వండెడును (బా. వ్యా క్రియా. 28)

**-ఎడున్**

ఆశీశ్శాప సంప్రార్థనములందు (చూ. లూట్) ధాతువుల కీప్రత్యయము వికల్పముగాఁ జేరును.

ఆశీస్సు : మీకు మేలు గలిగెడును

శాపము : నీకు రాక్షసత్వము గలిగెడును

సంప్రార్థనము : హరిననుఁగృపఁగాంచెడును

చూ కావుతాదులు.

(బా. వ్యా. క్రియా. 26; ల. వ్యా. క్రియా. 60)

**ఎడుమ్**

పరిమాణ వాచకములపై వచ్చు తద్ధిత ప్రత్యయము (వై. చం. తద్ధి. 5) ఉదా - తూమెడు, బారెడు మొ॥ ఇది మిత్తగుటచే వికృతి శబ్దములపై మాత్రమే వచ్చును (వై. చం. స్త్రీప. 6) చూ. మిత్. ఎడు.

**-ఎదగాగమము**

ఎదక్ + ఆగమము

తద్ధర్మాదులందు ప్రథమ పురుష బహువచన విభక్తి 'రు'; మధ్యమపురుష—వు, రు; ఉత్తమపురుష విభక్తులు 'ను' 'ము' లు పరమగునపుడు ధాతువుల యంతమందు—ఎద(క్) అను ఆగమము చేరును.

ప్ర—వండెదరు.

మ వండెదవు, వండెదరు.

ఉ. వండెదను, వండెదము.

(బా. వ్యా. క్రియా. 28)

**-ఏాదులు**

ఎత్ + ఆదులు

తపరకరణము (చూ) చే హ్రస్వముగు —ఎ, మున్నగునవి యని యర్థము

—ఎ —ఏ, —ఒ, —ఓ మున్నగునవి ఎదాదులు. సంప్రార్థనమునందు ఎదాదులను ప్రయుక్తమగును.

వినవె, వినరె, వినకువె, వినకురె

వినవొ, వినవో ఇత్యాదులు (బా. వ్యా. క్రియా. 34)

**ఎన**[1]

దేశ్యవిశేషణము సమానమని యర్థము. నిత్యైకవచనాంతము.

'సతులీ భార్గవికి భాగ్యసంపదనెనయే?' (ప్రౌ. వ్యా. శబ్ద 32)

**-ఎన**[2]

ఈర్చు, ఉబ్బు, కందు, దువ్వు, వడ్డించు ధాతువులకు—ఎనవర్ణకమగును.

ఈర్పెన, ఉప్పెన, కందెన, దువ్వెన, వడ్డెన (ప్రౌ. వ్యా. కృదన్త 8)

**-ఎను**

భూతార్థమందు ప్రథమపురుషైక ప్రత్యయమగు 'డుఙ్' నకాదేశముగా వచ్చును.

వండెను, తినెను (బా. వ్యా. క్రియా. 16)

**ఎ గ్రామర్ ఆఫ్ ది జెంటు లాన్‌గ్వేజ్**

**A grammar of the gentoo Language**

కర్త : విలియంబ్రౌన్

ఇది మచిలీపట్నములో శ్రీ మామిడి వెంకయ్యగారి సాయముతో రచింపఁబడి 1807లో ఆంధ్రాంగ్ల పదజాలముతో ముద్రింపఁబడిన వ్యాకరణము.

**ఎ గ్రామర్ ఆఫ్ ది తెలింగా లాంగ్వేజ్**

**A grammar of the Telinga Language**

కర్త : విలియంకారే

శిరాంపోర్ మిషన్ ప్రెస్సువారిచే క్రి. శ. 1814లో ప్రచురింపఁబడిన వ్యాకరణము.

**ఎ గ్రామర్ ఆఫ్ ది తెలుగు లాంగ్వేజ్**

**A grammar of the Telugu Language**

తెలుఁగు భాషకెనలేని సేవచేసిన సి పి. బ్రౌన్ మహోదయునిచే రచింపఁబడిన ఈ వ్యాకరణము క్రీ.శ. 1840లో బాలవ్యాకరణమునకు ముందే వెలసినది.

దీని ప్రభావము తదనంతర కాలములందు వెలసిన తెలుఁగు వ్యాకరణములపై విశేషముగా కానవచ్చును.

**ఎ గ్రామర్ ఆఫ్ తెలూంగు లాంగ్వేజ్**
**A grammar of Teloongu Language**

మద్రాసు సివిల్ సర్వీసులో ఉద్యోగిగానున్న కాంబెల్ అలెగ్జాండర్ డన్కన్ మహాశయునిచే క్రీ.శ. 1816లో తొలుత ముద్రింపఁబడిన వ్యాకరణము.

**ఎ ప్రొగ్రెసివ్ గ్రామర్ ఆఫ్ తెలుగు లాంగ్వేజ్**
**A Progressive grammar of Telugu Language**

రచన : ఎ. హెచ్. ఆర్డెన్

క్రీ.శ. 1873లో మద్రాసు క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ వారిచే ప్రచురింపబడెను.

ఇది విశేషముగా వ్యాప్తిలోనున్న వ్యాకరణము. అనేక ముద్రణముల నందినది.

**ఎరవు పదములు**

దేశ్యేతరమైన పదజాలము.

కాలమునుబట్టి—ప్రాచీనములు, అర్వాచీనములు, నవీనములని త్రివిధములు.

ఇవి భాషలో ప్రవేశించిన తీరును బట్టి అలీనములని, విలీనములని ద్వివిధములు. వీనినే ఆధునిక భాషాశాస్త్ర పరిభాషలో unassimilated loan-words, assimilated loan-words అందురు.

(తె. వ్యా. వి. పుట. 349)

**-ఎలు**

—ఏలు (చూ.) యొక్క హ్రస్వరూపము.

కుందేలు—కుందెలు

తోదేలు—తోడెలు (బా. వ్యా. ప్రకీర్ణ. 2)

**ఎల్లశబ్దము**

'సర్వ' అనునర్థము నిచ్చు ఈ శబ్దము ద్రుతాంతమయిన అవ్యయము.

దీని కసమాసమున విశేష్యమునకు ముందు ప్రయోగములేదు.

ఎల్లయర్థములు, ఎల్లకలుషములు (బా. వ్యా. సంధి. 24)

దీనికపవాదముగా విశేష్యమునకు ముందు శ్రీనాథమహాకవి ప్రయోగమొక్కటి కానవచ్చుచున్నది.

"ఎల్లన్ శిష్యులఁగొంచు వత్తునా?" (ప్రౌ. వ్యా. సంధి. 7)

**ఎవ్వరితాదులు**

'ఎవ్వరిత' మున్నగు శబ్దములు

(i) వీనిలోని రేఫముమీది ఇత్తునకు లోపము విభాషగానగును.

ఎవ్వరిత—ఎవ్వర్త, ఎవర్తి

ఒకరిత— ఒకర్త, ఒకర్తి

(ii) వీనిలోని 'రి' వర్ణమునకు లోపము విభాషగానగును.

ఎవ్వరిత—ఎవ్వత

ఒక్కరిత—ఒక్కత

ఒక్కరుతుక—ఒకతుక ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 68, 70

ఎ (æ)

అర్ధవివృతవిస్తారితాగ్రస్వరము

(half-open unround front vowel)

కఠిన తాలువు—స్థానము

జిహ్వామధ్యము—కరణము

అర్ధవివృత ప్రయత్నము

నాదము, అల్పప్రాణము

హ్రస్వము.

(i) గిన్నె, వన్నె, దొన్నె ఇత్యాది పదముల యంతమందీ ధ్వని మాండలిక భేదముగా శ్రుతము.

(ii) వివృత స్వరమునకుఁ బూర్వమందున్న . అర్ధసంవృతమగు ఎ, అర్ధ వివృతమగు ఎ (æ)గా నుచ్చరింపఁబడుచున్నది. ఇట్టి ధ్వని మార్పును పాక్షిక స్వరసమీకరణ మనవచ్చును. (Partial vowel assimilation)

మెట్టు—మెట్ట చెట్టు—చెట్ట

పెట్టు— పెట్ట

ఇది ప్రత్యేకవర్ణము (Phoneme) కాదు. ధ్వనిమాత్రమే (Phone).వర్ణాత్మ కలిపి (Phonemic Script)లో దీనికి ప్రత్యేక లిపిచిహ్నముండదు.

ఏ[1]

తెలుఁగు వర్ణమాలలోని యెనిమిదవ వర్ణము. ఏకారము యొక్కదీర్ఘము.తక్కిన లక్షణములకు (చూ.) ఎ[1].

-ఏ[2]

అవధారణార్థకము (చూ.)

'నీవే తప్పనితః పరంబెఱుఁగ'

(అప్ప. V. 29)

-ఏ[3]

తనంతట తాను—అన్యప్రేరణము లేక అను భావమును దెలుపును.
నేను బిలువకుండ వాఁడే వచ్చెను. (సూ.ని)

-ఏ[4]

నిర్దేశించి చూపుటను బలపఱుచును. 'ఇతఁడే రామనరేంద్రుడు[1]

(సూ.ని)

-ఏ[5]

ప్రశ్నార్థకము

ఇది సందర్భానుసారముగా ఆశ్చర్యప్రశంసా పరిహాసాదులను సూచించును

1. వార్చెనే సంధ్య? (ప్రశ్న)
2. చూచితిరే! శ్రీహరి మాయాచాతురి (ఆశ్చర్యము)
3. అయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లింతయొప్పునే? (ప్రశంస)
4. మామిడన్న సుతుఁడే తన్మాత్రుఁడే చెప్పఁగన్ (పరిహాసము)

(సూ.ని.)

-ఏ[6]

స్త్రీతో మాట్లాడునపుడుపయుక్తము.

'మఱేటి సుద్దులే?'

'గతజల సేతుబంధములు గావె? ధనార్జన పుంప్రసంగముల్'

(సూ. ని.)

-ఏ[7]

ప్రార్థనార్థకములగు మధ్యమ ము, డుఙ్ఞల కనుప్రయుక్తమగును.
"రావే ఈశ్వర! కావవే వరద!! (సూ.ని)

ఏ[8]

యచ్ఛబ్దార్థకము. ఇది తచ్ఛబ్దార్థకము నపేక్షించును.

"ఏయది హృద్య, మపూర్వంబేయది......
ఆకథయవినఁగ నభీష్టము మాకున్" (సూ. ని)

కిమర్థకము (ప్రశ్నార్థకము)

ఏకె? ఏడ? ఏది? ఏపె?

ఏ పురుషుఁడు? (సూ. ని.)

'ఏమి' శబ్దముయొక్క ఆద్యక్షర శేషము. హల్లుగాని అవసానముగాని పర మగునవుడు 'ఏమి' శబ్దము యొక్క 'మి' వర్ణమునకు లోపము వైకల్పికముగా నగును.

నీకేమి+బ్రాఁతియె (హల్లుపరము)

⟶ నీకే బ్రాఁతియె?

ఉండెడిదేమి? φ (అవసానము)

⟶ ఉండెడిదే? (ప్రౌ. వ్యా. సంధి. 16)

దీర్ఘ వక్రములు. (బా. వ్యా. సంజ్ఞా. 2)

**దేవి శబ్దములు**

"ఏఁడు, ఏరు, ఏది, ఏవి" అను శబ్దములు వీనికి 'ఈ' కారమంతమందుఁ జేరిన 'ఏఁడీ' 'ఏరీ' 'ఏదీ' 'ఏవీ' అనురూపము లేర్పడును. అప్పుడివి ప్రశ్నార్థ మునే కాక విశేషార్థమును గూడ స్ఫురింపఁజేయును.

'ఏఁడీ? నాపలుమానికంబుల కొటారు'—అనుచో ఎవఁడను ప్రశ్నగాక, ఎక్కడున్నాఁడను విశేషార్థమును స్ఫురింపఁజేయును.

'వారేరీ? సిరిమూటగట్టుకొని' అనుచో 'వారిప్పుడెక్కడున్నారు? లేరుగదా! అను అర్థవిశేషము.'

'ఏది? ఏదీ యిది చాలక్రొత్త' అనుచో మఱియొకసారి పలుకుము' అని యర్థము. (ప్రౌ. వ్యా. శబ్ద. 87)

**ర్తృక క్రియలు**

ఒకేక ర్తగల క్రియలు

**'రాముఁడు లంక** **చేరి**, రావణుని బరిమార్చెను.'

'ఏగు' 'పరిమార్చు' అనురెండు క్రియలకు కర్తరాముఁడే కావుననని ఏకకర్తృ కములు. (రమణీ. పుట 399)

**ఏకకాలిక వ్యాకరణము**

ఒక కాలమునకుఁ జెందిన భాషను అభివర్ణించు వ్యాకరణము. దీనినే Synchronic grammar అందురు.

ఇట్టి వ్యాకరణ రచనకు, తొలుత ప్రయత్నించిన వారు కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు. క్రీ. శ. 11శతాబ్ది తెలుఁగు భాషకు వ్యాకరణమును వారు తమ ఆంధ్రభాషా చరిత్రగ్రంథము నందను బంధించిరి. శ్రీగంటి జోగిసోమయాజి గారు, శ్రీగిడుగు సీతాపతిరావుగారు, శ్రీదివాకర్ల వెంకటావధానిగారు 11శతాబ్ది భాషకు వ్యాకరణ రచన గావింప యత్నించిరి.

(తె. వ్యా. వి. పుట. 104)

**ఏకత్వము**

ఒకటియను సంఖ్యను దెలుపునది.

"మానార్థంబున కేకత్వంబునందెఁడు వర్ణకంబగు"—తూమెడు, మానెడు

(బా. వ్యా. తద్ధిత. 25)

**ఏకదేశాన్వయము**

ఒకభాగముతో సంబంధమును గూర్చుట, వ్యస్తపదమునకు సమాసములోని యొక శబ్దముతో నన్వయమును గూర్చుట.

వారి యుష్మదీయోరు చమూ సమూహము -ఇట 'ఉరు చమూ సమూహమ'ను ఉత్తర పదములోనికి 'వారి(యొక్క)' అను శబ్ద మన్వయించుచున్నది.

(ప్రౌ. వ్యా. సమాస. 85)

చూ. తత్త్వబోధినీ వ్యాఖ్య.

**ఏకదేశిసమాసము**

చూ. అంశి సమాసము

పూర్వపదార్థము, ఉత్తరపదార్థము యొక్క భాగమైన యెడల నది 'ఏకదేశి సమాసమ'నఁబడును.

దీనినే ప్రథమా తత్పురుషమని కొందఱందురు.

కాయముయొక్క పూర్వము—పూర్వకాయము.

ఇట్లే ఉత్తర కాయము, అధఃకాయము

(ఆం. భా. శా. సమాస. 47)

**ఏకపదము**

సమాసము (చూ.)

(బా. వ్యా. సమాస. 1)

**ఏకప్రకృతిపక్షము**

ఒకేమూల భాషను గ్రహించుపక్షము. (వ్య.) ప్రకృతిద్వయ పక్షము (చూ.)

సంస్కృత ప్రాకృతములు రెండును తెలుఁగు నకు మూలములని భావించు వర్గము—ప్రకృతిద్వయ పక్షము: చిన్తామణికర్త, చిన్నయసూరి యిట్టి పక్షము నకుఁజెందుదురు.

సంస్కృతమొక్కటియే సంస్కృతమునకు మూలమని భావించువారు—ఏక ప్రకృతి పక్షమువారు—కేతన, విన్నకోట పెద్దన,బహుజనపల్లి సీతారామాచార్యులు మున్నగువారు ఈపక్షమునకు జెందుదురు.

(తె. వ్యా. వి. పుటలు 206, 207)

**ఏకప్రాణ భావము**

సంహిత అఖండము, అయినను భాష నన్యులకు గఱపు నపుడు ఒక్కపట్టున ఉచ్చరింపఁగల్గినంత మేరకు నాపుదురు.

ఇట్టి విభాగమునే ఏకప్రాణభావమని ప్రాచీనులు వ్యవహరింతురు.

(తె. వ్యా. వి. పుట 561)

**ఏకము**

ఒక్కటి. ఇతర పదముతో నన్వయింపక, ఒక్కటిగానున్నది. దీనినే పదము అందురు.

ఖంబు, ఘటము

(ప్రౌ. వ్యా. వాక్య. 2)

**ఏకవచనతటము**

ఏకవచనమందు ద్వితీయా విభక్త్యంత రూపము ప్రాతిపదికముగా తృతీయాది విభక్తులు చేరును.

ఇట్టి ద్వితీయా విభక్త్యంత ప్రాతిపదికమునకే ఏకవచన తటము (oblique case) అని శ్రీరావిపాటి గురుమూర్తి శాస్త్రి పేర్కొనెను.

(గు. వ్యా. 93 అంశము)

**ఏకవచనము**

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయము

డు—ము—వు—న.

(బా. వ్యా. తత్సమ. 11)

**ఏకవద్భావి ద్విగుసమాసము**

ఏకవచనాంతమైన సంఖ్యాపూర్వక సమాసము.

ముజ్జగము, ఇరువంక, ముమ్మొన

(ఆం. కౌ 610, '11)

**ఏకవచన విశేషణములు**

బహువచనాంత విశేష్యములకు ఏకవచనాంత విశేషణములును తెలుఁగునందు ప్రయోగింపవచ్చును

కులిశధారలు కుంఠితంబయ్యె

(విశే) బ వ. (విణ) ఏ.వ.

(క. సం. II.87; స. సా. సం. II విణ. 11)

**ఏకవర్ణము**

ఏకాచ్కమగు శబ్దము. ఉదా:- మా, శ్రీ, క్ష్మా, జ్యా, హ్రీ మున్నగునవి. ఇట్టి ఏకాచ్క దీర్ఘాంతములగు తత్సమ శబ్దములందు హ్రస్వమురాదు.

(అథ కా. అజన్త 80, చింతా. అజన్త 47)

**ఏకశేషవృత్తి**

ఒకేవిభక్తియందున్న సమానరూపశబ్దములలో నొకటి మిగులుట. ఆశబ్దములు రెండుగాని, యెక్కువగాని యుండవచ్చు.

ఏకప్రకృతజన్యములై స్త్రీ పురుష వాచకములలోఁ బురుషవాచకము శేషించును.

మాతాచ, పితాచ ⟶ పితరౌ

⟶ పితరులు.

(అం.బా. శా. సమాస.89 98)

**ఏకస్థల జమ్మలు**

ఏకస్థానమందుఁబుట్టిన వర్ణములు ఐ, ఔలు, ఏ, ఓ,లు ద్విస్థానోద్భూతములు.

కాగా, తక్కిన వర్ణములు ఏక స్థానమునందుత్పన్నములగునవి.

(చూ.) ద్విస్థానోద్భూతములు. (అప్ప. I.15)

**ఏకాంతము**

ఏక+అంతము.

'ఒక్క' అను సంఖ్య అంతమందుఁగలది.

దెబ్బదియొక్కరథము. (ప్రౌ. వ్యా. శబ్ద. 4)

**ఏకాదులు**

(ఏక+అదులు) ఏకశబ్ద పర్యాయమగు ఒక్క మున్నగుశబ్దములు. అవి ఒక్కఁడు, మగఁడు, అతఁడు, ఇతఁడు, ఎవ్వఁడు, గొల్లఁడు, మనుమఁడు, అబ్బఁడు, అప్పఁడు, మిండఁడు, గండఁడు ఇత్యాదులు. గంగఁడు, మంగఁడు, సింగఁడు మున్నగు జననామధేయవాచకములును ఏకాదులే. (అహో. అజన్త. 52) డుజ్ఞు పరమగునపుడు వీని అంత్య హ్రస్వాకారమునకు "మహతోఽత ఉత్విభక్తౌ" (చింతా. అజన్త. 16) అను సూత్రముచేవచ్చు హ్రస్వ-ఉకారాదేశము రాదు.

ఉదా:- ఒక్కఁడు, మగఁడు, అతఁడు, మొ॥ (చింతా. అజన్త 52) హనుమ, రాయ మున్నగు శబ్దములును ఏకాదులలోనివే (అహో. అజన్త. 52)

**ఏకార్థక శబ్దము**

'ఒకటి' యను అర్థమిచ్చు శబ్దము. ఒకఁడు, ఒకరు, ఒకటి, ఒకరిత— ఇత్యాదులు. (బా. వ్యా. అచ్చిక. 24)

**ఏకార్థమునందు వృత్తి**

వేఱు, వేఱు పదార్థములకు ఒకే యర్థమునందు కలయిక.

రాజ+ఉద్యోగి

రాజోద్యోగి (Official)

(బా. వ్యా. సమాస.1)

**ఏకార్థీ భావము**

పరస్పర భిన్నముగానున్న పదార్థములు ఏకపదార్థముగా భావింపఁబడుట.

దేవదత్తునియొక్క గురువు— దేవదత్తుని గురువు

'దేవదత్త' 'గురు' అను పదార్థములు పరస్పరము భిన్నమైనవి. వీనికి అన్యోన్యాపేక్షవలన సంబంధమేర్పడును.

గురువు—విశేష్యము

దేవదత్తుఁడు—విశేషణము.

దేవదత్త, గురుపదార్థములు రెండును విశేషణ విశేష్య సంబంధముచే నన్యోన్యము మిశితములై దేవదత్తసంబంధి గురువని అఖండార్థముగా భావింపఁబడును.

ఇట్లు ప్రక్రియావస్థయందు వేర్వేఱుగా నున్న పదార్థములయర్థములను అన్యోన్యమును విశేషణ విశేష్యభావమునందు మేళగించి, యేకపదార్థముగా భావించుట ఏకార్థీభావము.

(బా. వ్యా. సమాస. 1)
(గు. ప్ర. పుట 251)

ఏకాశ్రయ క్రియలు

కర్తృరూపమునఁగాని, కర్మరూపమునఁగాని ఒకేవ్యక్తి నాశ్రయించినక్రియలు.

'రామునిచే రావణుఁడు కొట్టంబడి మడిసె' —ఇట కొట్టినవాఁడు రాముఁడు మడిసినవాడు—రావణుఁడు. భిన్నకర్తృకములు. అయినను నివి ఏకాశ్రయములు.

'కొట్టు' క్రియకు కర్మ—రావణుడు

'మడియు' క్రియకు కర్త—రావణుఁడు.

ఇట్లు రెండు వ్యాపారములును ఏకాశ్రయములగును.

(బా. వ్యా. క్రియా. 38; ల.వ్యా. క్రియా. 20;
రమణీ. 399-400 పుటలు)

ఏకాక్షర పదములు

ఒకే యక్షరము పదమునైనవి—క్ష్మా, మా, భా, శ్రీ, స్త్రీ, హ్రీ, ఇత్యాదులు. వీనికి హ్రస్వరూపము లుండవు.

వీని ప్రథమైక వచనమునకు లోపము కల్గును.

(ఆం. కౌ. 196, 197;
బా. వ్యా. తత్సమ. 55)

ఏకాది శబ్దములు

ఒక్కఁడు, మగఁడు, అతఁడు, గొల్లఁడు, మనుమడు, అప్పఁడు మున్నగు తెనుఁగు డుమంతములు.

(ప్ర. వ్యా. 170 ప్రశ్న)

**ఏకాదేశము**

ఏక+ఆదేశము (చూ.)

రెండింటిని తొలగించి యొక్కటి ఆస్థానమున ప్రవర్తిలుట

రాముఁడ్+ఉ+అతఁడు

V

అ ⟶ రాముఁడతఁడు.

ఇట పూర్వపరస్వరములకుఁ బరస్వర మేకాదేశమైనది.

(బా. వ్యా. సంధి 1.)

**ఏజ్**

ఏ, ఓలకు సంజ్ఞ. ఏ ఓ ఙ్ అను మాహేశ్వర సూత్రమున ఏవర్ణమునకు జకారముతో ప్రత్యాహారము చేయఁగా 'ఏజ్' అను సంజ్ఞ సిద్ధించును. తెనుగున ఏ, ఓలకు వక్రములని పేరు. (చింతా. సంజ్ఞా 29)

**ఏతాదులు**

ఏత+ఆదులు—'ఏత' మున్నగు శబ్దములు.

వీనికి 'ము' వర్ణకము పరమగుచో దీర్ఘము విభాషగానగును.

ఏతము—ఏతాము

ఇట్లే గాలము—గాలాము

గోతము—గోతాము మున్నగునవి. (బా. వ్యా. ప్రకీర్ణ. 15)

**ఏత్వము**

ఏకారము

మూఁడక్షరములకు తక్కువ గాని అచ్చిక పదములలోని 'రు, లు; డు'ల ముందటి ఏత్వము విభాషగా హ్రస్వమగును.

నల్లేరు - నల్లెరు

ఆదేలు - ఆడెలు

నేరేడు - నేరెడు ఇత్యాదులు

(బా. వ్యా. ప్రకీర్ణ. 2)

**ఏని ప్రభృతి శబ్దములు**

ఏని, పోలెన్, వలెన్, అట్టు. అయ్యును, పొంటెన్—ఇత్యాది శబ్దములు.

వీనిని నియమ మపేక్షించి ప్రయోగింపఁ దగును. అనఁగా 'ఏని' మున్నగునవి ఏశబ్దములతో నన్వయించునో, వానికి వ్యవధానముగా కాక, సన్నిహితముగాఁ బ్రయోగింపవలయును.

గాలి వీచెనేని హాయిగా నుండును,

(బా. వ్యా. కారక. 37)

(గు. ప్ర. 248 పుట)

**ఏన్యంత తద్ధర్మార్థకములు**

'ఏని' యనునవ్యయము అంతమందుఁగల తద్ధర్మార్థక క్రియలు

వాఁడు వచ్చునేని వీఁడు వచ్చును— ఇట్టి ప్రయోగము 'వాఁడు రాఁడేని వీఁడు రాఁడు' అను వ్యతిరేక క్రియలుగల వ్యాకరణమును వ్యంజింపఁజేయును.

(ప్రౌ. వ్యా. వాక్య. 9)

**ఏన్యంత వ్యతిరేకార్థకములు**

'ఏని' యను నవ్యయము అంతమందుఁగల వ్యతిరేకార్థక క్రియలు.

"వాఁడు రాఁడేని వీఁడు రాఁడు"— ఇది "వాఁడు వచ్చునేని, వీఁడు వచ్చును" అను భావక్రియలుగల వాక్యమును స్ఫురింపఁ జేయును.

(ప్రౌ. వ్యా. వాక్య. 9)

**ఏమ్యాదులు**

ఏమి+ఆదులు.

ఏమి, మఱి, కిషష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, ఇత్యాదులు.

ఇది ఆకృతి గణము

ఇందలి ఇత్తునకు సంధి వైకల్పికముగా నగును.

ఏమి+అంటివి < ఏమంటివి / ఏమియంటివి.

(బా. వ్యా. సంధి. 5)

**ఏలాద్యదులు**

ఏలు—మున్నగు ధాతువులు

వీనికి—బడి యను కృత్ప్రత్యయముచేరగా ఏలుబడి, కట్టుబడి, మున్నగు రూపములేర్పడును. (బా. వ్యా. కృద స్త. 14)

**ఏలాద్యవ్యయములు**

'ఏల' మున్నగు అవ్యయములు. ఇవి క్రియాదికము'లోని భాగము. (చూ. క్రియాదికము) (ప్రౌ. వ్యా. వాక్య. 6)

**—ఏలు**

ఇది కొన్ని ధాతువులకుఁజేరగా కొన్ని జంతు పక్షి వాచకము లేర్పడును.

కుందు+ఏలు⟶కుందేలు; తోఁడు+ఏలు⟶తోఁడేలు

పొటేలు, తాబేలు, ఇత్యాదులు.

(ఇందు ధాతువులలో మార్పు గోచరించును)

అడు+ఏలు⟶అడేలు

(చూ. తె. వ్యా. వి. పుట. 844

**ఏవార్థకము**

(ఏవ+అర్థకము) సంస్కృతమందలి అవధారణార్థకమగు 'ఏవ' యను శబ్దముయొక్క అర్థముగల తెనుఁగు శబ్దము. నిన్నె (నిన్ను+ఎ), నన్నె (నన్ను+ఎ) మొదలైన పదములలో చివరి 'ఎ' వర్ణమును, రాముఁడ (రాముఁడు+అ) ఇత్యాది పదములో చివరి 'అ' వర్ణమును ఏవార్థకములు (చింతా. అహో. సంజ్ఞా. 40, అప్ప. 5-59; క. సం. వి. I-1-8).

**ఏవావ్యయ సమానార్థములు**

అవధారణార్థకమగు 'ఏవ' యను సంస్కృతావ్యయమునకు సమానార్థకములుగా తెలుఁగులో వాడఁబడు అ, ఎ, ఏ అను వర్ణములు. ఉదా:- నీవ (నీవు+అ) దొరవు, అతఁడె (అతఁడు+ఎ) ఘనుఁడు, నేనే (నేను+ఏ) భృత్యుఁడను మొ॥ (అథ. కా. అజన్త. 78)

**ఏసి**

పరిమాణసూచక శబ్దములపై చేరు ప్రత్యయము. ఉదా:-ఇంతలేసి కన్నులు, ఇంతేసి కన్నులు, చేటంతేసి కన్నులు, చేటెడేసి కన్నులు మొ॥ (అథ కా. అజన్త. 55, అప్ప. III-218, 19, 20) 'మానాంతాచ్చేసిః' అను అథర్వణ కారికయందలి 'చ' అను పదముచే మానార్థకములు కాని శబ్దముల మీఁదను 'ఏసి' వచ్చును. ఉదా:- నాలుగేసి ఇత్యాదులు.

ఏ (æ:)

(i) అర్ధవివృత విస్తారి తాగ్రస్వరము (half-open unround front-vowel)

కఠినతాలువు—స్థానము

జిహ్వామధ్యము—కరణము

అర్ధవివృతము—ప్రయత్నము

నాదము, అల్పప్రాణము

దీర్ఘము

(ii) వివృత స్వరమునకు (open vowel-అ)ముందున్న ఏ > ఏ (æ:) అనఁగా అర్ధ సంవృత స్వరము, వివృతస్వర ప్రభావముచే అర్ధ వివృత మైనది. ఇట్టి మార్పును 'పాక్షిక స్వరాకర్షణము' (Partial vowel harmony) అననగును.

మేకు—మేక

పేడు—పేడ

(iii) ఇ+ఆ > ఏ

తాటి+ఆకు→తాటేకు

వచ్చి+ఆడు→వచ్చేడు.

(iv) లు-లి-న లు పరమగునపుడు 'ము' వర్ణమునకు లోపముకల్గగా పూర్వ మందలి ఎకారము ఏ(æ:) గా మాఱును.

ముత్తెములు—ముత్తేలు

పందెములు—పందేలు

(వ్యా. భా. వ్యా. శబ్ద. 267)

(v) వండేఁడు, తగ్గేఁడు

వచ్చేఁడు, ఇత్యాది ప్రథమపురుష భూతార్థక క్రియారూపములయందు ఈధ్వని వినవగును.

ఇట్లే వచ్చేము, తెచ్చేము ఇత్యాది ఉత్తమ పురుష భూతార్థక క్రియారూపము లందును శ్రుతము.

కాని మధ్యమ పురుష భవిష్యదర్థకములందు వినరాదు.

కొట్టేవు/రు; తెచ్చేవు/రు.

(వ్యా. ఖా. వ్యా. క్రియా. 22)

**ఐ[1]**

తెలుఁగు వర్ణమాలలోని తొమ్మిదవ వర్ణము.

(i) 'అ+ఇ' అను అచ్చుల కలయిక వలన నేర్పడిన కంఠతాలవ్యమగు సంధ్యక్షరము. (diphthong)

అయిదు—ఐదు

కయిదువు—కైదువు.

(బా. వ్యా. క్రియా. 103)

(ఆం. భా. వి. పుట. 269)

(ii) ఇది ఇకారముతో తుల్యము.

రై+ను→రైని

పై+కు→పైకి

(బా. వ్యా తత్సమ. 65)

చూ. వక్రతమములు.

**ఐ[2]**

'కలిగి' అను క్రియాపదము నిలుపదగినచోట 'ఐ' అనుశబ్దము ఆ యర్థమునే యిచ్చును.

'బంధుర కంధరంబు వెడలుపుటురమునై ద్రోణుఁడొప్పె'.

(క. సం II. 25,26; స. సా. సం. II. 13,15 రంగ. IV. 49,50)

**ఐ[3]**

'అగు' ధాతువుయొక్క క్త్వార్థక రూపమగు 'అయి' అనుదాని రూపాంతరము.

ఆకాశము స్వచ్ఛమైయున్నది.

అయిరి—ఐరి

(బా. వ్యా. క్రియా. 99)

**ఐ[4]**

చతుర్థీ విభక్త్యర్థకములగు 'కి', 'కు' లంతమందుఁగల పదముల కనుప్రయుక్తమగును.

నరునకునై = నరుని నిమిత్తము. (సూ. ని.)

**ఐ, ఔకారాంత పదసంధి**

ఐకారము, ఔకారము అంతమందుఁగల శబ్దముల కచ్చుపరమగుచో క్రమముగా ఆయ్, ఆవ్, లు ఆదేశములగును.

రై + ఆశ — రాయాశ

గ్లౌ + ఉదయము — గ్లావుదయము

నౌ + అభిలాష — నావాభిలాష (త. చం. 16)

**ఐఔలు**

వీనిని వక్రతమములని (చూ.) ప్రాచీనులు వ్యవహరింతురు.

ప్రాకృతములలో నీరెండున్ను లేవని కొందఱందురు.

(బా. వ్యా. సంజ్ఞా. 2)

**ఐచ్**

ఐ, ఔ లకు సంజ్ఞ 'ఐఔచ్' మహేశ్వర సూత్రమున ఐ వర్ణమునకు చకారము ప్రత్యాహారము చేయఁగా ఐచ్ అనుసంజ్ఞ సిద్ధించును. ఐచ్ ప్రత్యాహార బోధ్యములగు ఐ, ఔలకు తెలుఁగు వ్యాకరణమున వక్రతమములని పేరు. (చింతా. సంజ్ఞా 30)

**ఐత్వము**

ఐకారము. (అప్ప. II. 8)

**ఐదంతములైన చజలు**

ఐత్ + అంతములు.

ఐకారమంతమందున్న చకార జకారములు సంస్కృతసమేతరములైన శబ్దములందు లేవు. కావున నివి తాలవ్యములా? దంత్యములా? అను ప్రసక్తి లేదు.

'చెయువులు' అనుదాని ఉచ్చారణ సామ్యముచే నేర్పడిన 'చైవులు' అను. రూపము లాక్షణికము కాదు. (బా. వ్యా. సంజ్ఞా. 9; రమణీ. పుటలు 171,172)

**ఐ, ఔలసంధి**

అకారమునకు ఏ, ఐలు పరమైన ఐకారము; ఓలు పరమైన ఓఔకారము క్రమముగా నేకాదేశమగును.

దీనినే వృద్ధిసంధి (చూ.) అందురు.

అఖిల+ఏకవిభుఁడు—అఖిలైకవిభుఁడు

సకల+ఐశ్వర్యము—సకలైశ్వర్యము

వన+ఓషధి—వనౌషధి

గుణ+ఔత్సుక్యము—గుణౌత్సుక్యము (ఛం. ద. IV. 51)

**ఐశ్వర్య వాక్యము**

అసంక్షిప్తము, దీప్తగంభీరము, అర్థవంతము, ప్రత్యక్ష పరోక్షము లందును లక్ష్యముగానున్న వాక్యము.

రాజశేఖరుఁడు తన కావ్యమీమాంసలో పేర్కొన్న వాక్యభేదములలో నిదియొకటి. (తె. వ్యా వి. 71-14)

**ఒ[1]**

తెలుఁగు వర్ణమాలలోని పదవ వర్ణము

అర్ధసంవృత పశ్చాదోష్ఠ్యస్వరము

(half-closed back round vowel)

స్నిగ్ధ తాలువు—స్థానము

జిహ్వామూలము—కరణము

అర్ధసంవృత ప్రయత్నము

నాదము, అల్పప్రాణము

హ్రస్వము

**ఒ[2]**

(i) ప్రశ్నార్థకము

'పవనునకు నీకును బాంధవము గలదొ?'

(ii) కాక్వర్థకము

'ప్రాణంబు ప్రాణంబుగా నిను మన్నింపదొ!'

(iii) సందేహమును దెలుపును

'మహికి నర్థినుదెంచిన పద్మహితుఁడొ!'

(iv) ఊహను దెలుపును

'నాకు వినిపింతురొకతఱి
నీకేఁజెప్పుదునొయనుచు నృపకుల తిలకా!' (సూ. ని)

## –ఒ[3]

అప్రాచుర్యమును దెలుపును.

'ఎన్నఁడొ పిశాచులనుగాని యిందుముఖులనెల్లకాలంబుఁదలఁచు భీమేశ్వరుండు' (సూ. ని)

## –ఒ[4]

ప్రార్థనాదులను దెలుపును

'పాతాళమునకుఁజనరొ!' (సూ. ని)

## ఒకవిభక్తికి మఱియొకవిభక్తి

ఒకేభావమును ఒకేవిభక్తితో మాత్రమే కాక, మఱియొక విభక్తితోఁగూడ ప్రకటింపనగును.

(i) మైత్రుఁడు గృహమునుండి వెడలె—పంచమీవిభక్తి
మైత్రుఁడు గృహమును వెడలె—ద్వితీయావిభక్తి

(ii) వారు సుఖముతో నున్నారు—తృతీయావిభక్తి
వారు సుఖమున్నారు—ప్రథమావిభక్తి ఇత్యాదులు.

(బా. వ్యా. కారక. 21)

## ఒత్తు

ఒకహల్లు క్రింద చేఱిన మఱియొకహల్లు.

కాకు కాఒత్తు—అక్క
తాఒత్తు—అత్త (అప్ప. II. 18)

## ఒత్తక్షరములు

ఊది పలుకఁబడు అక్షరములు. వర్గద్వితీయ, చతుర్థాక్షరములు.

వీనికే మహాప్రాణములు (చూ.) అని వ్యవహారము.

(ఆం. భా. వి. పుట. 848; వ్యా. బా. వ్యా. సంజ్ఞా. 81)

## ఓ[1]

తెలుఁగు వర్ణమాలలో పదునొకండవ వర్ణము.

ఒకారము యొక్క దీర్ఘము

ఇతర లక్షణములకు (చూ.) ఒ[1]

ఓ[2]

సంబోధనమునందు సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడును.

ఓ రాముఁడ!

ఓ రాములార!! (బా. వ్యా. తత్సమ. 14)

ఓ[3]

రై శబ్దములోని అంత్య వర్ణస్థానమున వచ్చు నాదేశము. ఉదా:- రో యావి (చింతా. అజన్త 62) 'రాస్తు ద్వయోః' అనుకోశ ప్రామాణ్యముచే రై శబ్దమునకు స్త్రీలింగత్వమును ఉండుటచే రై శబ్దము మీఁది 'సు' ప్రత్యయమునకు లోపము వచ్చును. (అహో. అజన్త. 62)

—ఓ[4]

వ్యతిరేకార్థక క్రియపై ప్రశ్నార్థమునవచ్చు అవ్యయము. ఉదా:- ఊరకుండెదు రక్షింపవో గుణాఢ్య మొ॥ ఇది సుబంతముపైనను అనుబంధముగా వచ్చునని కొందఱమతము. (వై. చం. అవ్యయ. 8) స్థాణువో, పురుషుఁడో మున్నగుచోట్ల 'ఓ' సంశయార్థకము (వై. చం. అవ్యయ. 15)

**ఓకారాంతపద సంధి**

'గో' శబ్దమునకు అకారాది పదము పరమగునేని 'గవ' ఆదేశము బహుళముగా నగును.

గో+అశ్వములు→గవ+అశ్వములు→గవాశ్వములు

గోఽశ్వములు (ప్రకృతి భావము)

గో+ఆలయము < గవాలయము / గఆలయము

(త. చం. 18)

**ఓత్వము**

ఓకారము

(అప్ప. II. 8)

**ఓత్వాదేశము**

ఓత్వ+ఆదేశము

'ఒక' శబ్దమునకు 'ఓ' కారము కొన్నియెడల ఆదేశమగును.

ఒకర్తు—ఓర్తు

బా(. వ్యా. ఆచ్ఛిక. 24)

ఒకనాఁడు—ఓనాఁడు

(వ్యా. భా. వ్యా. శబ్ద. 842)

**ఓత్వౌత్వయుగ్మవికల్పసంధి**

ఓత్వ, ఔత్వములు వికల్పముగా వచ్చుసంధి.

సంస్కృతమునందు అకారమునకు ఓతు, ఓష్ఠ శబ్దములు పరమగుచో ఒక మాఱు ఔత్వము ఏకాదేశమగును.

ఘన+ఓతు < ఘనోతు / ఘనౌతు

బింబ+ఓష్ఠ< బింబోష్ఠ / బింబౌష్ఠ

(ఛం. ద. IV. 52)

**ఓయారాదులు**

'ఓయారము' మున్నగునవి.

వీని తొలిదీర్ఘమునకు హ్రస్వము విభాషగానగును.

ఓయారము—ఒయారము

గూడారము—గుడారము

(బా. వ్యా. ప్రకీర్ణ. 12)

**ఓయారాదులు[2]**

వీనికి మతుబర్థమునందు 'ఇ' వర్ణక మగును.

ఒయారి, అక్కసి, కడలి

(బా. వ్యా. తద్ధిత. 18)

**ఓయి**

(i) పురుష సంబోధమునందు విభాషగా సంబోధ్యవాచకమునకు ముందు ఉపయుక్తము. దీని యంతిమాక్షరమునకు లోపమును గలుగును.

ఓయి రాముఁడ !

ఓ రాముఁడ !!

(ii) దీనికి స్వతంత్ర ప్రయోగమును గలదు

సంగతియెయ్యోయి !

(అధ. కా. అజ్ఞ. 1)

(బా. వ్యా. తత్సమ. 15, 16)

**ఓయీ**

ఓయి (చూ.) యొక్క దీర్ఘ రూపము

ఓయీ ! విప్రకులావతంస !!

(బా. వ్యా. తత్సమ. 16)

**ఓరి !**

(i) నీచ పురుషామంత్రణమునందు సంబోధ్యవాచకమునకుఁ బూర్వమం దుపయుక్తము

ఓరి దుష్టుఁడ !

(ii) మైత్రియందుపయుక్తము.

ఓరి చిన్ని కృష్ణ !

(iii) దీనికి స్వతంత్ర ప్రయోగమును గలదు.

ఓరోరి ! యింకెందుఁబోవచ్చు.

(బా. వ్యా. తత్సమ 15, 16)

**ఓరీ**

ఓరి (చూ.) యొక్క దీర్ఘ రూపము.

'ఓరీ ! దుష్ట నిశాటులార !'

(బా. వ్యా. తత్సమ. 16)

**ఓష్ఠ్యములు**

పెదవులు స్థానము, కరణములుగా నుచ్చరింపఁబడు వర్ణములు

ఉ, ఊ, ప, ఫ, బ, భ, మ

(ప్ర. వ్యా. సంజ్ఞా. 41)

**ఓష్ఠభవములు**

పెదవులనుండి పుట్టినవి.

ఉత్వము, పవర్గాక్షరములు.

(ఆం. కౌ. 61 పంక్తి

**ఓసి**

(i) నీచస్త్రీ సంబోధనమునందు సంబోధ్య వాచకమునకు ముందుపయుక్తము
ఓసి దుష్టురాల !

(ii) మైత్రియందు—ఒసిముద్దుబాల

(iii) స్వతంత్ర ప్రయోగమును గలదు
ఓసి పోవే

(బా. వ్యా తత్సమ. 15, 16)

ఓసీ

'ఓసి '(చూ.) యొక్క దీర్ఘరూపము. 'ఓసీ ననుఁజెనక రాకు'
(బా. వ్యా. తత్సమ. 16)

**ఔ**

తెలుఁగు వర్ణమాలలో పంద్రెండవ వర్ణము
అ+ఉ ల కలయికచే నేర్పడిన
సంధ్యక్షరము. కంఠోష్ఠ్యము.
వక్రతమములలో (చూ.) రెండవది.

**ఔత్వము**

ఔకారము

**ఔపవిభక్తికంబుల వివర్ణ, సలలు, వర్ణములు**

'లి' వర్ణాంతములు, 'ల్ల' అను వర్ణములతోఁ గూడినట్టివియు, నగు ఔపవిభక్తికములయిన శబ్దములు.

వీనికి బహువచనము పరమగునపుడు బిందుపూర్వక డువర్ణము బహుళముగా నగును.

కొడవలి+లు > కొడవండులు, కొడవండ్లు
కొడవలులు, కొడవళులు, కొడవళ్లు

ఇల్లు+లు < ఇండులు, ఇండ్లు
ఇల్లులు.

(బా. వ్యా. ఆచ్ఛిక. 16)

**ఔపవిభక్తిక నామములు**

టి, ంటి, తి, ్రి మున్నగు ఔపవిభక్తికము లంతమందుఁగల ప్రాతిపదికములు. వీనికి సప్తమీవిభక్త్యర్థమునను, తృతీయావిభక్త్యర్థమునను హ్రస్వాకారము వచ్చును. ఉదా:- మింటన్, పంటన్, కంటన్, వింటన్ మొ॥(చింతా. అజన్త79)

**ఔపవిభక్తికములు**

టి, ంటి, తి, ్రి మున్నగువర్ణములు. ఇవి విభక్తులు పరమగునపుడును, సమాసమునందును రు, లు, డు, లి మున్నగు వర్ణములంతమందుఁగల శబ్దములపై వచ్చును. (చింతా. సంధి. 39) ఉదా:- ఏటికి, వింటికి, తాటికి, అంబటికి మొ॥ (విభక్తి పరమగునపుడు) ఏటికాలువ, వింటికొప్పు, తాటిచెట్టు మొ॥ (సమాసము నందు) చి. సూ. ఇ, టి, తి, వర్ణములకు మాత్రమే యీ సంజ్ఞను పరిమితము చేసెను. (బా. వ్యా. ఆచ్ఛిక 28,29) చూ:- ఔపవిభక్తికాంతములు. టింట్యాది వర్ణము లౌపవిభక్తికములని మాత్రమే చింతా. కర్త వచించెను. కాని వానిని విశేషించి నిరూపింపలేదు. అథ. కా. కర్త విభక్తి పరమగునపుడును, సమాసము నందును టింటీతరములగు మఱికొన్ని యౌపవిభక్తిక వర్ణములును ఆదేశములుగా వచ్చుననియు, వాని భావాభావములు ప్రయోగములవలన గ్రహింపవలయుననియు ఏవి ఔపవిభక్తికములో, ఏవి అనౌప విభక్తికములో నిర్ణయించుట కష్టమనియు, దానికి ప్రయోగమే శరణమనియు తెలిపెను. (అథ. కా. సంధి. 29,30 అజంత 60). ఇవి కొన్నిచోట్ల సమాసమున మాత్రమే వచ్చును. ఉదా:- పాపటేడు (పామునకు) వేపచెట్టు(వేమునకు) మొ॥ కొన్నిచోట్ల సమాస-స, విభక్తులు రెండిం టను ఔపవిభక్తికములు వచ్చుటలేదు. ఉదా:- పైరు జొంపము. పైరునకు మొ॥ కొన్నిచోట్ల విభక్తి పరమగునపుడు మాత్రమే ఔపవిభక్తికములు వచ్చును. ఉదా.- ముంటికి (ముల్లుకంప), మింటికి (మిన్నేఱు) మొ॥ (అహో. సంధి. 49) ఔపవిభక్తిక నామములకు తృతీయా సప్తములయందు 'అన్' వచ్చును ఉదా:- వింటన్‌ ఇంటన్, కంటన్ మొ॥ (చింతా. అజంత 79). ఔపవిభక్తికములగు కొన్ని లివర్ణాంత శబ్దములకు లు, లలు పరమగునపుడు ఇత్తునకు లోపమును బిందుపూర్వక డు వర్ణమును బహుళముగా వచ్చును. ఉదా:- గుద్దండ్లు, రోకండ్లు మొ॥ (చింతా. అజంత 76) టింట్యాదులు విభక్తి సమీపమున వచ్చున వగుటచే వీనికి ఔపవిభక్తులను నామము సార్థకము.

**ఔపవిభక్తికాంతములు**

ఉపవిభక్తులంతమందు వచ్చు దేశ్యశబ్దములు. (చూ.వ్య.) అనౌప విభక్తి కాంతములు.

(i) 'పల్లు' శబ్దము దంతమను నర్థమునందు ఔపవిభక్తికాంతము - పంటిని, పంటితో మున్నగునవి. నిమ్నమను నర్థమునందు అనౌపవిభక్తికాంతము. ఇట్టి పరిజ్ఞానమును వ్యాకరణము, కోశము కల్గింప వలసియున్నవి.

(సం. వ్యా. విశే. 11)

(ii) ఔపవిభక్తి కాంతములగు చేయి, నేయి, లోనగు శబ్దముల యాద్యచ్చున హ్రస్వమును, మీఁది హల్లునకు ద్విత్వమును ప్రథమైకవచనమునందు వికల్పముగా నగును.

చేయి—చెయ్యి, చెయి

నేయి—నెయ్యి, నెయి (ప్రౌ. వ్యా. శబ్ద. 105)

**ఔపశ్లేషికము**

త్రివిధములగు నాధారములలో నొకటి.

కొంతభాగమున వ్యాప్తిని దెలుపునది.

ఘటమునందు జలమున్నది. (బా. వ్యా. కారక. 17)

**ఔపశ్లేషికాధికరణము**

కొంతభాగమునందలి వ్యాప్తిని దెలుపునది.

చూ. ఔపశ్లేషికము, అధికరణము త్రివిధములగు నధికరణములలో నొకటి.

గురుఁడు మంచమునందుఁ గూరుచుండెను.

(ఆం. కౌ. 469. పంక్తి)

**అం**

తెలుఁగు వర్ణమాలలో పదుమూడవ వర్ణము.

దీనికే ఖండబిందువనియు, పూర్ణానుస్వారమనియు (చూ.) వ్యవహారము.

వర్గ పంచమాక్షరములకిది ప్రాతినిధ్యము వహించును. కావుననిది తెలుఁగునఁ బరుష సరళములకు ముందే కానిపించును.

ఙ
ఞ
ణ → ం
న
మ

(బా. వ్యా. సంజ్ఞా 8, 16)

అః

సంస్కృత వర్ణమాలలో పదునాఱవ వర్ణము.

దీనినే 'విసర్గ' (చూ.) అందురు. కంఠ్యము. దుఃఖము. నిఃఖేదము మున్నగు సమములనుగూడి తెలుఁగున వ్యవహరింపఁబడును.

(బా. వ్యా. సంజ్ఞా 1,4)

అఁ

తెలుఁగు వర్ణమాలలో పదునాలుగవ వర్ణము.

ఖండబిందువు. దీనినే యర్ధానుస్వారమనియు (చూ.) అందురు. ప్రాచీనార్వాచీన శాసనము లందుఁగాని, తాళపత్రప్రతులలోఁ గాని ఈ చిహ్నము కానరాదు. దీని స్థానమునందు పూర్ణబిందువే యందుపయుక్తము. ముద్రణ యంత్రముతో పాటు ఇది తెలుఁగు లిపిలోఁ బ్రవేశించెను.

దీనికుచ్చారణము లేకపోవుటనే నిది నిరర్థక చిహ్నమని భావింపఁబడును. ఇది కేవలము తెలుఁగు శబ్దములకే పరిమితము. ఆఁకలి, చీఁకటి, వీఁపు, మఱఁదలు మున్నగునవి. ఇప్పుడిది అనునాసికోచ్చారణమునకు సూచకముగా కథలలో, నవలలలో, నాటకములలోఁ బ్రచురముగా నుపయుక్తము. ఊఁ, ఏవోయ్, ఆఁ, మాఁవఁ.

(బా. వ్యా. సంజ్ఞా. 814; తె. వ్యా. వి. 112 పుట)

క[1]

జిహ్వామూల హనుమూలీయ స్పర్శము

(dorso-velar stop)

మృదుతాలువు—స్థానము

జిహ్వామూలము—కరణము

స్పర్శ ప్రయత్నము

శ్వాసము,

అల్పప్రాణము

—క[2]

కొన్ని ధాతువులకుఁజేరు కృత్ప్రత్యయము.

అలుక, కినుక, పోక మున్నగునవి.

(ఆం. కౌ. 300 పంక్తి,

బా. వ్యా. కృదంత. 8)

క³

ఆత్మనేపదార్థమునందు అనుప్రయుక్తమగు 'కొను' ధాతువుయొక్క క్త్వార్థకరూపమగు 'కొని' అనుదానికి వికల్పముగా ఆదేశమగును. (ఇది కవిత్రయేతర కవుల రచనలయందే కానిపించును)

'గరళంబెత్తుక క్రోలఁగాఁదలఁచితే కష్టాత్మ' (భాస్కరరామాయణము)

(సూ. ని.)

క⁴

చూ. కా²

'అగు' ధాతువుయొక్క సుజ్యంత రూపము (కన్) క్రియావిశేషణముల కనుప్రయుక్తము.

లెస్సగ, న్యాయ్యముగ, బెట్టుగ

(బా. వ్యా. క్రియా. 115, 116)
(చూ. సూ. ని. క²)

క⁵

స్త్రీసమము గాని స్త్రీలింగముగాని యయిన వైకృత ప్రాతిపదికమునకు పరమందు స్వార్థమున వికల్పముగవచ్చు ప్రత్యయము. ఈ వర్ణకము పరమగునపుడు పూర్వమందు ఉత్వము వచ్చును. ఉదా:- పొలఁతుక, పొలతి- నెలఁతుక. నెలఁత- గొంతుక, గొంతు,- వెలఁదుక, వెలది మొ॥ (చింతా. హలన్త. 29, అథ. కారి. క్రియా. 21) చూ:- ఉక.

క⁶

వ్యతిరేక క్త్వార్థమునందు వచ్చు ప్రత్యయము. ఉదా:- ఘటింపక, చేయక మొ॥ (అథ. కారి,) చూ:- కఁజ.

క⁷

అర్థవిశేషము లేకయే తుమున్నంతముల కనుప్రయుక్తమగును.

చూడఁగ, తగఁగ (సూ. ని. క³)

**కంఠ తాలవ్యములు**

కంఠము, తాలువు రెండును స్థానములుగా నుచ్చరింపఁబడు వర్ణములు.

ఏ,ఐ

(ఆం. కౌ. 63 పంక్తి)

**కంటె**

"అన్యారాదితర_ర్తే దిక్చబ్దాంచూ_త్తర పదాజాహియు_క్తే" (అష్టా. 2-3-29) అను పాణినీయ సూత్రముచే సంస్కృతమున అన్య, ఆరాత్, ఇతర మున్నగు పదములతో యోగమున్నపుడు పంచమీవిభ_క్తి విధింపఁబడినది. అట్టి పంచమీవిభ_క్తి స్థానమున తెలుఁగున 'కంటె' అను విభ_క్తి ప్రత్యయము వచ్చును, (చింతా. అజన్త. 80) ఉదా;- రామునికంటె నన్యుఁడు (అన్యశబ్దయోగము), వనముకంటె చేరువ (ఆరాదర్థక శబ్దముతో యోగము)-ఆరాత్ శబ్దమునకు దూరము, చేరువ అను రెండర్థములు గలవు.

**కంఠభవములు**

కంఠస్థానమునం దుత్పన్నములగు ధ్వనులు

అకారము, క, ఖ, గ, ఘ, ఙ లు

హకారము, విసర్గ

(ఆం. కౌ. 59. పం_క్తి)

**కంఠోష్ఠ్యములు**

కంఠము, ఓష్ఠము స్థానములుగా నుత్పన్నమగు ధ్వనులు.

ఓ, ఔలు (ఆం. కౌ. 68)

**కంఠ్యములు**

కంఠము స్థానముగా నుత్పన్నమగు ధ్వనులు

అ, ఆ, క, ఖ. గ, ఘ, ఙ

హ, అః

(ప్ర. వ్యా. సంజ్ఞా. 41)

**కంధరాదులు**

'కంధర' మున్నగు శబ్దములు.

కంధరా, నాసికా, భిక్షా, మున్నగునవి. ఇది ఆకృతిగణము.

ఇవి నపుంసక లింగ తుల్యములు బహుళముగా నగును.

కంధరము—కంధర

నాసికము—నాసిక

(బా. వ్యా తత్సమ. 66)

**కంపితము**

రేఫము కంపితధ్వని (trill) (తె. వ్యా. వి. పుట, 47)

**కకారాదులు**

కకారము మున్నగు వర్ణములు. వీనినే హల్లులందురు. (చూ.)

(బా. వ్యా. సంజ్ఞా. 1)

**కగచయవలు**

క, గ, చ, య, వ—అనునట్టి వర్ణములు.

కృత్సంబంధులగు 'కాదులు'[2] (చూ) పరమగునపుడు ధాతువుల యంత మందుండు ఈ వర్ణములు లోపించును.

కలుగు—కలిమి

తిరియు—తిరిపము ఇత్యాదులు. (బా. వ్యా. కృదంత. 2)

**కజి**

(i) వ్యతిరేక భూతార్థక అసమాపక క్రియారూపమును సాధించుటకు ధాతువునకు పరముగావచ్చు ప్రత్యయము. 'జి' ఇత్సంజ్ఞి. 'కజి' పరమగునపుడు ఉత్వమున కత్వమగును.

వండు+క(జి) ⟶ వండక

వచ్చు ⟶ రా+క(జి) ⟶ రాక (బా. వ్యా. క్రియా. 39)

(ii) పురార్థయోగమునందు, భావార్థమునందు విభాషగానగును—వండక మునుపు—వండుటకు మునుపు (బా. వ్యా. క్రియా. 36)

(iii) 'తప్పదు' 'తీఅదు' ఇత్యాదుల సంబంధమున, భావార్థము నందగును.

చెప్పక తప్పదు, చేయక తీరదు. (రమణీ. పుట. 398)

**క, చ, ట, త, ప, లు**

ఇవి శ్వాసాక్షరములు (surds). వీనికే తెనుఁగు వ్యాకరణమునందు పరుషములని (చూ.) వ్యవహారము. తాలవ్యచకారము, దంత్య చకారమునకును గ్రాహకము. కాఁగానివి 'క, చ, చ̄, ట, త, ప.' లగును. (బా. వ్యా సంజ్ఞా: 5)

(బా. వ్యా. సంజ్ఞా. 7)

**-కడ ప్రత్యయము**

నిలుకడ, పోకడ ఇత్యాదులందు కానవచ్చు నీ ప్రత్యయము కృత్తు.

(ఆం. కౌ. 801)

**కద్రవాలు**

తుది వర్ణములు.

అడఁగు, మాయు మున్నగువానికి చుక్ప్రాగాగమములు పరమగుచో వాని 'కద్రవాలు' లోపించును.

అడఁగు—అడఁచు

మాయు—మాపు (బా. వ్యా. క్రియా. 76

**కడాదులు**

'కడ' మొదలగునవి.

ఆమ్రేడితము (చూ.) పరమగునపుడు కడాదుల తొలియచ్చుమీఁది వర్ణముల కన్నింటికి అదంతమగు ద్విరుక్తటకారమగును.

కడ+కడ → కట్టకడ

చివర + చివర → చిట్టచివర (బా. వ్యా. సంధి. 40)

**కడుబిందువు**

పూర్ణబిందువు (చూ.) (ఆం. కౌ. 202)

**కతిపయార్థకము**

కొందఱు, కొన్ని (ల. వ్యా. అచ్చ. 78; బా. వ్యా. అచ్చ. 24)

**-క త్తియ**

స్త్రీత్వమునందు వచ్చు తద్ధిత ప్రత్యయము.

(i) మతుబర్థమునందు 'ఆటాదుల'కుఁ జేరును.

ఆటక త్తియ, నీటుక త్తియ.

(బా. వ్యా. తద్ధిత. 11)

(ii) కొన్నింటికి స్వార్థమునందుఁ జూపట్టును.

చెలిక త్తియ, హెగ్గడి క త్తియ

(బా. వ్యా. తద్ధిత. 13)

(iii) ఇందలి కకారమునకుఁ గొండొకచో గకారము కానఁబడును.

అఁదగత్తియ, కొండెగత్తియ.

(బా. వ్యా. తద్ధిత. 12)

**-కత్తె**

స్త్ర్యర్థమున వచ్చు ప్రత్యయము. ఉదా:- బాపనకత్తె, చెలికత్తె, కుమ్మరకత్తె, బిచ్చకత్తె మొ॥ (మం. ఆం. కౌ. 391)

**కద**

ప్రార్థనార్థమున ద్రుతప్రకృతికము కంటె పరమందు అర్థవిశేషమున వచ్చు శబ్దము. ఉదా:- దయసేయంగదె, ప్రోవంగదె, రాఁగదె మొ॥. ఇది ఉత్తమ పురుషాదు లందును ప్రశ్నార్థకము కంటె పరముగా అర్థవిశేషమున వచ్చును.

ఉదా:- వచ్చితింగదా, ఘటించితింగదా, వచ్చెంగదా.

(అథ. కా. క్రియా. 14, 15

**కద, కదవులు**

'అన్' ప్రత్యయాంత క్రియలమీద కద, కదవులను శబ్దములు చేరును. ఇట్టి రూపములకు 'అన్నాదులు' (చూ.) ప్రార్థనార్థమందనుప్రయుక్తమగును.

ప్రోవఁగదన్న

చెప్పఁగదవే ఇత్యాదులు. (ప్రౌ. వ్యా. క్రియా. 9)

**కద్రువ**

ఇది ఊకారాంత స్త్రీలింగ శబ్దము నామముల తుది దీర్ఘమునకు హ్రస్వము, వు వర్ణకము చేరగా 'కద్రువు' అను రూపము సిద్ధించును. కాని 'కద్రువు' అను పదము పింగళవర్ణమను నర్థము నందొకటి కలదు.

ఈ రెండింటిని వేఱుచేయుటకాయనునట్లు 'కద్రువ' రూపము నాగమాతయను నర్థమునందు నిపతింపఁబడినది.

(బా. వ్యా. తత్సమ. 51)

**కనుమ్వాదులు**

కనుము + ఆదులు.

కనుము, జనుము మున్నగు శబ్దములందలి 'ము' వర్ణమునకు సమాసమునందు 'వ' వర్ణమాదేశమగును.

కసుము+పులు — కనుపపులు (రెల్లు గడ్డి)

జనుము+నార — జనపనార

(బా. వ్యా. సమాస. 19)

**-కన్న**

పంచమీ విభక్తి.

'కు+అన్న' — 'కన్న' అయినదని అప్పకవి ఉభయ యతులలో దీనిని నిరూపించెను.

'హైహయు కన్నన్ దోర్వీర్య మెక్కుడగు' (స్వరయతి)

'కన్నను శూరుండు ముజ్జగంబులఁగలఁడే' (వ్యంజన యతి)

(అప్ప. III. 288, 289; వ్యా. బా. వ్యా. శబ్ద. 5)

**కన్వాదియోగము**

'కను' మున్నగు క్రియలతో సంబంధము. ఇట్లు సంబంధ మున్నచో ప్రయోజ్యకర్తకు (చూ.) షష్ఠి నిత్యముగా నగును.

విశ్వామిత్రుఁడు రామునకు మిథిలంగానిపించెను.

కృష్ణుఁడర్జునునకు విశ్వరూపమును జూపెను.

(బా. వ్యా. క్రియా. 124)

**కన్వాదులు**

'కను' మున్నగునవి.

కను, తిను, విను - ఇత్యాదులు. (సు. ప్ర. పుట 425)

**కపలు**

క, చ, ట, త, ప యను పరుషములు. వీనిలో తొలివర్ణమగు కకారమునకు చివరి వర్ణమగు పకారముతో ప్రత్యాహారము చేయగా 'కప' యను సంజ్ఞ సిద్ధించును. (అధ. కా. సంధి. 19)

**కప్ప్రత్యయము**

క(ప్) అను ప్రత్యయము.

'ఉరః' ప్రభృతులకు బహువ్రీహి అర్థము నందిది యుపయుక్తము.

మహోరస్కుఁడు, యశస్కుఁడు

(క. చిం సంజ్ఞా. 61)

**—కయి**

చతుర్థీ విభక్తి.

రామునికయి

(బా. వ్యా. తత్సమ. 4)

**కయిరాదులు**

'కయిర' మున్నగు శబ్దములు.

కయిర, కత్తళ, జన్న, నీల మున్నగునవి. ఇది ఆకృతి గణము. ఇవి తిర్యగ్వాచకములు. (చూ.) అమహత్తులు. అయినను వీనికి —డు(ఙ్) చేరును. మగాదులకువలె (చూ.) వీని యత్వమునకు ఉత్వము కలుగదు.

కయిరఁడు, కత్తళఁడు ఇత్యాదులు.

(బా. వ్యా. ఆచ్ఛిక. 4)

**కరణ కారకము**

ఆఱువిధములగు కారకములలో (చూ.) నొకటి. ఈకారకమునందు తృతీయా విభక్తులు వచ్చును. (చూ.) కరణము.

ఖడ్గము **చేత** ఖండించె

కోల **తోడ** కూలనేసె.

(బా. వ్యా. కారక. 4)
(ఆం. భా. శా. కారక. 28)

**కరణము**

పనిని నెఱవేర్చుటయందు మిక్కిలిగా నుపయోగించు సాధనము.

ఖడ్గముచేత ఖండించె—ఖండించుటకు బాగుగా నుపయోగించు సాధనము ఖడ్గము. అందుచే ఖడ్గము శబ్దమునకుఁ 'చేత' యను తృతీయా విభక్తికి చేరినది.

(బా. వ్యా. కారక. 4)

**కరణార్థము**

కరణము (చూ.) అనునట్టి యర్థము. ఈ యర్థమునందు కరణమునుదెల్పు వాచకమునకుఁ దృతీయావిభక్తి వచ్చును.

కత్తి**తోడ** నరికెను.

ఖడ్గము**చేత** ఖండించెను.

(ల.వ్యా. విభక్తి. 89; ప్ర. వ్యా. 266 ప్రశ్న)

**కరణ్యాదులు**

'కరణి' మొదలైనవి.

అట్లు, పోలె, వలె మున్నగువానివలెనిది ఇవార్థకము (చూ.)

నారాయణుని *కరణి* నారాయణ భట్టు. (ఉపమానము షష్ఠీవిభక్తి; ఉపమేయము ప్రథమ)

(ప్రౌ. వ్యా. సమాస. 38)

**కర్ణావతంసాదిశబ్దములు**

(కర్ణావతంస + ఆది శబ్దములు) కర్ణావతంసము, శ్రవణకుండలములు, శిరశ్శేఖరము, ధనుర్జ్యాధ్వని, ముక్తాహారము, పుష్పమాల, కరికలభము ఇత్యాది శబ్దములు వీనిలో అనవతంసాది శబ్దములచే కర్ణాదిశబ్దములు గతార్థములైనను సాన్నిధ్యాది విశేష ప్రతీతి యుండుటచేనవి పునరుక్త దోషదుష్టములు కానేరవు.

(అహో. అజన్త. 72; కా. సూ. వృ. 2-2-12, నుండి 17)

**కర్త**

(i) ధాత్వర్థమైన వ్యాపారమున కాశ్రయమైనది.

(ల. వ్యా. విభక్తి, 88; బా. వ్యా. కారక. 3)

(ii) వాక్యమునందు స్వతంత్రముగా నుండునది ముఖ్యమైన ధాత్వర్థమున కాశ్రయమగుట స్వాతంత్ర్యము. క్రియయందిట్టి స్వాతంత్ర్యముచే వివక్షింపఁబడిన యర్థము 'కర్త' యనఁబడును.

రాముఁడు రావణుని సంహరించెను—ఇచట సంహారక్రియయందు స్వతంత్రముగా వివక్షింపఁబడినవాఁడు 'రాముడు'.

అందుచే 'రాముఁడు' కర్త. (ఆం. భా. శా. విభక్తి. 12)

**కర్తరి ప్రయోగము**

క్రియచేఁగర్త చెప్పఁబడునేని యది కర్తరి ప్రయోగము.

రాముఁడు రావణుని సంహరించెను.

(ప్రౌ. వ్యా. వాక్య. 8)

**కర్తృకర్మము**

కర్తగను, కర్మగను నుండు పదము. '**మూర్ఖశిష్యుఁడు గ్రామమును గూర్చి పోవుచుండగా, గురుఁడు తచ్ఛిష్యుని మదినిఁ దలఁచెను.**'

ఇట 'శిష్యుడు' అను శబ్దము కర్తృకర్మ నామముచేఁదనరారును.

(ఆం. కౌ. 339-441)

**కర్తృకారకము**

క్రియచేఁజెప్పఁబడని కర్తకు 'చేత' ప్రత్యయమగును. ఇదియేకర్తృకారక మనఁబడును.

హనుమంతునిచేత సీత చూడఁబడెను. ఇందు క్రియచే కర్త చెప్పఁబడలేదు. 'చేత' వర్ణకమందుచే కర్తృవాచకమునకుఁజేరినది.

(ఆం. కౌ. 415 పంక్తి; ఆం. భా. శా. కారక. 27)

**కర్తృగామి**

కర్తను జేరునది, దేవదత్తుఁడు వంటకమును వండుకొనుచున్నాఁడు—'వండుట' అనఁగా 'వంట' అను క్రియా ఫలముకర్తను జేరును.

'కొను' ధాతు ప్రయోగము వలన నిట్టి యర్థమేర్పడును. (చూ.)ఆత్మనే పదార్థము.

(బా. వ్యా. క్రియా. 52)

**కర్తృపరుషలు**

క్రియలకు కర్తలను దెలుపు క్రియా విభక్తులు.

ఇవి ప్రథమపురుష, మధ్యమపురుష. ఉత్తమపురుష(చూ.) అని త్రివిధములు.

(ప్ర. వ్యా ప్రశ్నలు-854,355)

**కర్తృభూత క్రియ**

కర్తవలె వర్తించుక్రియ.

'వేఱొక క్రియకుఁ గర్తయగుచున్న భావార్థక క్రియాశబ్దము'

నీవు రావచ్చును, బోవచ్చును — ఇందు 'రాన్' 'పోన్' అను కర్తభూతక్రియలతో వానికిఁగర్తయను 'నీవ'ను దానికన్వయము. (ప్రౌ. వ్యా. క్రియా. 27)

**కర్త్రర్థకప్రయోగము**

కర్తప్రథమా విభక్తియందున్న వాక్యము. ఉపాధ్యాయుఁడు శిష్యుని శిక్షించెను.

(సం. వ్యా. క్రియా. 8)

**కర్త్రర్థకము**

కర్తను ప్రధానముగాఁగలది. చూ. కర్త్రర్థక ప్రయోగము.

ఇందు కర్తృవాచకము ప్రథమాంతమును, కర్మవాచకము ద్వితీయాంతమును గా నుండును.

ఈశ్వరుఁడు లోకములను సృజించెను. (ల. వ్యా. క్రియా. 70)

**కర్పూరాదులు**

(కర్పూర+ఆదులు) కప్పురము, ఒక్కండు, తమ్మలము, గయ్యాళి, ఒయ్యారి, ఎవ్వరు, ఎప్పుడు, అప్పుడు, ఇప్పుడు అనుశబ్దములు. వీనిలో సంయుక్తవర్ణములోని యొకహల్లు లోపించును. ఉదా:- కపురము, ఒకండు, తమలము, గయాళి ఒయారి మొ॥ (వై. చం. వైకృత. 7. సూ,)

**కర్మ**

(i) ధాత్వర్థఫలాశ్రయము.

క్రియచెప్పెడి యర్థము వలని ఫలము పొందునది.

రాముఁడు సీతను పెండ్లాడెను. (ఆం. భా. శా. సంజ్ఞా. 13)

(ii) కర్తకుఁ గ్రియ చేతఁగడు నిష్టముగఁ బొందఁదగినది.

రాముఁడు ఫలముల నారగించెను. చూ. కర్మము. (ఆం. కౌ. 429)

**కర్మకారకము**

క్రియచేఁ జెప్పఁబడిన కర్మవాచకమునకు ద్వితీయ వచ్చును. ఇదియే కర్మ కారకము.

రాముఁడు రావణుని సంహరించెను. (ఆం. కౌ. 415; ఆం. భా. శా. కారక. 23)

**కర్మణి ప్రయోగము**

క్రియచేఁ గర్మము చెప్పఁబడునేని యది కర్మణి ప్రయోగము.

వానరులచే సేతువు గట్టఁబడెను. (ప్రౌ. వ్యా. వాక్య.)

(సు. వ్యా. వాక్య. 9)

**కర్మము**

చూ. కర్మ.

'దేవదత్తుఁడు వంటకమును వండెను'. ఇట వండెనను మాటకు వంటచేసెనని యర్థము. వంట - ఫలము; చేయుట—వ్యాపారము వంటయనఁగాఁబాకము. పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మంబయ్యెను.

(బా. వ్యా కారక. 2)

**కర్మధారయ 'ట' కారము**

కర్మధారయ సమాసము. (చూ.) సందు సంధి నివారించుటకు విభాషగా వచ్చుటకారము.

కలుకు+అమ్మ → కలుకుటమ్మ (ఇటనిత్యము)

చిగురు+ఆకు < చిగురాకు
చిగురుటాకు (స. సా. సం. I. సంధి 58-64)

**కర్మధారయము**

(i) దేనికేది గుణమగునో దానిని మొదట నిడినచో కర్మధారయమగును.
మధురోదకము, మేచకాభ్రము (ఛం ద. IV. 99)

(ii) విశేషణమునకు విశేష్యము తోడ సమాసము సమానాధికరణమనఁ బడును. (చూ.) ఇదియే కర్మధారయము.

ఆచందము, పోఁడిమాట, వచ్చినవాఁడు

(బా. వ్యా. సమాస. 6)

**కర్మధారయ విశేషములు**

ద్విగువు, (చూ.) ఉపమానోత్తరపద సమాసాదులు (చూ.) కర్మధారయ విశేషము లనఁబడును.

ముచ్చిచ్చు, ముజ్జగములు
రాచసింగము, చెక్కుటద్దము (బ. వ్యా. సమాస. 102)

**కర్మధారయ సమాసము**

విశేషణమగు ప్రథమాంత పదము, విశేష్యమగు ప్రథమాంత పదముతోఁగూడి యొక పదమగుట.

(చూ.) కర్మధారయము. (బ. వ్యా. సంధి 27; అథసూచిక)

**కర్మధారయాభాసము**

(కర్మధారయ+ఆభాసము) కర్మధారయ సమాసమువలె కనిపించు సమాసమని శబ్దార్థము. కర్తృగతమైన క్రియాస్వరూపధర్మము కారకము నాశ్రయించి

యన్నపుడు కర్మధారయాభాసమగును. ఉదా:- నీవు పోషించిన భృత్యుఁడు మొ॥ (అధ. కా. హలంత. 27) ఇట నీచే పోషింపఁబడిన భృత్యుడు అనియుండగా 'కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ' (చింతా. హలంత 88) అను సూత్రముచే నీ 'చే' యను కర్మార్థమునకు కర్తృత్వమగు కర్తృవాచక తృతీయకు ప్రథమయురాఁగా నీవు పోషించిన భృత్యుఁడని యేర్పడును. మంచెళ్ల వాసుదేవకవి తన వై. చం. యందు ఉవర్ణకము మొదలగునవి అంతమందుగల విశేషణములు సమసించినది కర్మధారయాభాసమని తెలిపెను. ఉదా:- రక్షించు దేవత, రక్షించిన దేవత మొ॥ (వై. చం. సమా. 22)

## కర్మపురుషక్రియలు

కర్మార్థమునందు ప్రయోగింపఁబడు సకర్మక క్రియలు. వీనికి 'పడు' అను ధాతువనుప్రయుక్తమగును.

రావణుఁడు రామునిచే *సంహరింపఁబడెను.* (గు. వ్యా. 315)

## కర్మప్రవచనీయార్థము

కర్మప్రవచనము (చూ) యొక్క అర్థములందు 'కూర్చి' వర్ణకము వచ్చును కోవిదుల జపముంగూర్చి వర్ణించె (ప. పం. 116 పద్యము, ప్ర వ్యా. 267 ప్రశ్న).

## కర్మవ్యతీహారము

వ్యాపార వినిమయము. ఒండొరులొక విధమగు పనినిచేయుట సప్తమ్యంతము లగు గ్రహణ విషయ సరూప పదములును, తృతీయాంతములగు ప్రహరణ విషయ సరూప పదములున; 'ఈ యుద్ధము ప్రవర్తిల్లినది' అను నర్థమునందు ఒండొరులొకేవిధమగు పనిని చేయుచున్నపుడు (కర్మవ్యతీహారము) సమసించును.

ఇది బహువ్రీహిసమాసము. ఇందు పూర్వపదమునకు దీర్ఘము, సమాసాంతము నందు 'ఇ'కారాదేశము వచ్చును.

కేశేషు కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తమ్—కేశాకేశి.

(త. చం. 641)

## కర్మాదులు

(i) కర్మ మున్నగునవి.

కర్మ, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము (చూ) అనునవి.

వీనికి ప్రాధాన్యమును వివక్షింపవలయునన్నచో ధాతుజ విశేషణము నుపయోగింపవలయును.

'రాముఁడు రక్షించిన భృత్యుఁడు' ఇత్యాదులు.

(బా. వ్యా. సమాస 26)

(ii) కర్మాదులు కారకములు : ఇవి ఆఱు :

1. కర్మకారకము
2. కర్తృకారకము
3. కరణకారకము
4. సంప్రదానకారకము
5. అపాదానకారకము
6. అధికరణకారకము (చూ.)

(ప్రౌ. వ్యా. కారక. 1)

**కర్మార్థక ప్రయోగము**

కర్మము ప్రథమావిభక్తియందుండునది.

శిష్యుఁడు ఉపాధ్యాయునిచేత శిక్షింపఁబడెను.

(సం. వ్యా. క్రియా 8)

**కర్మార్థకము**

సకర్మక ధాతువుయొక్క తుమున్నర్థక (చూ) రూపము తుదను 'పడు' ధాతువు చేర్చుటవలన నిష్పన్నమగు క్రియ కర్మార్థక క్రియ యగును.

పోషింపఁబడు, కొట్టఁబడు (సం. వ్యా. కర్మార్థక. 1)

**కఱకంఠముఖములు**

కఱకంఠుడు, ప్రాణగొడ్డము, జీవగఱ్ఱ, కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు మున్నగు శబ్దములు. ఇవి వ్యాకరణ విరుద్ధములగుటచే గ్రామ్యములు. ఐనను ఆయా స్వభావ వర్ణనముల యందు ఇట్టి గ్రామ్య శబ్ధములు సాధువులే (అథ. కా. సంజ్ఞా. 29). బహువ్రీహి స్త్రీ సమముగా నుండుటచే కఱకంఠుడు, కర్మధారయమున త్రికముకాని, స్త్రీ సమశబ్దముకాని, మువిభక్తిసహిత పూర్వపదముకాని పూర్వపదముగానుండవలయునను నియమముచే కపిలకన్నులు, కపిల

కన్నులు, కపిల గడ్డము, కపిల జడలు అను శబ్దములును, తెనుఁగు విభక్తి చేరని సంస్కృత పదములకు వేనికిని తెలుఁగు పదములతో సమాసము రాకపోవుటచే ప్రాణగొడ్డమును గ్రామ్యములగును.

**కఱకంఠుఁడు**

'నల్లని కంఠము కలవాఁడు' అనునర్థమును బట్టి 'కఱ' దేశ్యముకావున, దీనిని అహోబలపతి మిశ్రబహువ్రీహిగా నుద్ఘాటించెను.

కానీ మిశ్రబహువ్రీహిసమాస ముండదని, యిట్టి సమాస మశాస్త్రీయమని తలంచి చిన్నయసూరి దీనిని గ్రామ్యముగాఁ పేర్కొనెను.

బహుజనపల్లి సీతారామాచార్యుల వారు దీనిని 'గరకంఠ' శబ్దభవముగాఁ బేర్కొనిరి. అప్పుడిది సాహసిక తద్భవమగును.

(బా. వ్యా. సంజ్ఞా. 23; ప్రౌ. వ్యా. సంజ్ఞా. 9; సమాస. 27)

**కలజ్యనుబంధము**

కలజి+అనుబంధము

'ల్రుట్టు' (చూ.) పరమగునపుడు ధాతువునకు 'కల(జి)' యనుప్రయుక్తమగును.

'కల' శబ్దము 'జి' యను ఇద్వర్ణము కలది. అనగా జిత్తు, జిత్తు. పరంబగున పుడు ధాతువు ఉత్వము సత్వమగును. నుగాగమమువచ్చును.

వండు+కల(జి) ⟶ వండ+ను+కల ⟶ వండఁగలడు మున్నగు నవి. (బా. వ్యా. క్రియా. 19,20,21)

**కలన్వాదులు**

'కలను" మున్నగునవి.

కలను, కెలను, కొఱను, కొలను, గవను, నెఱను, మ్రాను, వరను, వలను - ఇవి కలన్వాదులు. నియతగణము.

వీని 'ను' వర్ణమునకు 'కుక్' ఏకవచనమందు వికల్పముగను, బహువచనము నందు నిత్యముగను ఆదేశమగును.

కలను < కలఁకు, కలను (ఏ.వ.) / కలఁకులు (బ.వ.)

(బా. వ్యా. అచ్చిక. 18)

ఇట్లు వర్ణనాత్మకముగా నిరూపింపఁబడినను, చారిత్రక దృష్టితో తిలకించినపు డిందు బహువచనమున 'కులు' అను ప్రత్యయము చేరినట్లును:-లు మాత్రమే

బహువచన ప్రత్యయమను జ్ఞానముతో దానిని వేఱుచేయగా 'కలఁకు' అను ఏకవచన రూప మింకొకటి యేర్పడినట్లును స్ఫురించును.

దీనినే అనుచితవిభాగము (చూ.) (wrong splitting) అందురు.

**కలానుబంధము**

'కల' అనునట్టి యనుబంధము.

ఇది భవిష్యదర్థమునందుఁ గ్రియలమీఁద వచ్చును.

జయింపఁగలఁడు

జయింపఁగలరు—ఇక్ష్వాకులు. (ల. వ్యా. క్రియా. 26)

**-కలి**

కను, విను, మున్నగు ధాతువులకుఁజేరు కృత్ప్రత్యయము.

కనుకలి, వినుకలి (బా. వ్యా. కృదంత. 22)

**కలుగ్వాదులు**

'కలుగు' మున్నగు ధాతువులకు— ఇమి వర్ణకము వచ్చును.

కలుగు+ఇమి—కలు+ఇమి —కలిమి

తాలు+ఇమి—తాలిమి (బా. వ్యా. కృదంత. 4)

**కళాప్రదేశములు**

ద్రుతములు తలచూపని శబ్దములు. (అప్ప. V. 28-32)

**కవిజన సంజీవని** [క. సం.]

క్రీ. శ. 16వ శతాబ్దిఁ జెందిన ముద్దరాజు రామభద్రకవి విరచితము.

ఇది అప్పకవీయమునకు పూర్వమందలిది. ఇది సంపూర్ణముగా లభించుటలేదు.

ఇందు (i) యతిపద్ధతి (ii) విభక్తిపద్ధతి (iii) సమాస పద్ధతి (iv) సంధి పద్ధతి అను నాలుగు తరంగములు కలవు.

ఆంధ్రమహాభారత పద్యములే యిందు విశేషముగా బ్రదర్శితములు. ఆముక్త మాల్యద రాఘవ పాండవీయాది ప్రబంధములనుండియు పద్యములు కొన్ని యుద్ధరింపఁబడినవి.

మొత్తము 189 గద్యపద్యములలో ఏబది మాత్రమే లక్షణమును వివరించునవి. తక్కిన 139 లక్ష్యప్రదర్శనమునకై ఉద్ధరింపఁబడినవి.

**•ంజనము** (కవిజనాంజ)

అముద్రితము. కర్త : బలారి సింహశ్రీ నరసింహ రాజసింహ.

ఇందు సంజ్ఞా, తద్భవ, తత్సమ. క్రియా పరిచ్ఛేదములుకలవు. దీని కాగితపు ప్రతి తిరుపతి ప్రాచ్యపుస్తక భాండాగారమున నున్నది.

దీనిలో కవి సంశయ విచ్ఛేద ప్రసక్తియుండుటచే దానికిది పరకాలికమని భావింపవచ్చును ఇందలి తద్భవసూత్రములు శ్రీ వజ్ఝల చిన సీతారామశాస్త్రిగారిచే వైయాకరణపారిజాతమునందు వ్యాఖ్యానింపఁబడినవి.

**•శ్రయము**

తెలుఁగు ఛందోగ్రంథములలో మొదటిది. క్రీ. శ. 11 శతాబ్దమునకుఁ జెందిన దందురు. దీని కర్త వేములవాడ భీమకవియని ప్రశస్తి.

ఇందు దోషాధికారమునందు కుసంధి, దుస్సంధి, వైరిపదము మున్నగు కొన్ని సంజ్ఞలు వివరింపఁబడినవి సంజ్ఞాధికారము, వృత్తాధికారము, జాత్యధికారము, షట్ప్రత్యయాధికారము, దోషాధికారము, నను నైదు విభాగములు కలవు.

**టు మతసంధులు**

'కవిభల్లటుఁడ'ను లాక్షణికుని పేరట అప్పకవి చెప్పిన సంధులు.

రేఫలకారాంత ధాతువులకు హల్లు పరమగునపుడు ఉత్వలోపము వికల్పముగా నగును.

ఎన్నుదురు+విబుధులు < ఎన్నుదుర్విబుధులు / ఎన్నుదురు విబుధులు

విలు + పూనె < విల్పూనె / విలుపూనె

(అప్ప V. 117-119)

**్లటుఁడు**

"కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోప ఇష్యతే హ్యేషు" (హలన్త 28) అను చింతామణి సూత్రమున కవి భల్లటుని మతము చెప్పఁబడినది వై కారికననుసరించి యీతని మతమున 'క్రియలయొక్కయు, నామములయొక్కయు ఉకారమునకు లోపము వచ్చును. ఉదా:- చూడర్జనులు, వత్తుర్ఘనులుఁ క్రియలలోని

ఉకారము లోపించుట) కన్దెఱచి, చన్గుడిపి, విల్బూని, కర్ల్దావి (నామములలోని ఉకారములోపించుట) ఇత్యాదులు. ఆంధ్రకౌముది (మండవారిది) యందును "నినులు ప్రభృత్యంత క్రియానామ్నామిగ్లుక్క విభల్లటాదీనామ్ (హలన్త 257 సూ.) అను సూత్రము నందునుకవిభల్లటమతము పేర్కొనఁబడినది. అప్పకవి కవిభల్లట ప్రక్రియను పేర్కొనియున్నాడు (అప్ప. I-5 వచనము) వీనినిబట్టి కవిభల్లటుఁ-డొక ప్రాచీనాంధ్ర వ్యాకర్త యనియు, అతడు 'కవిభల్లట ఫక్కిక' యనునొక యాంధ్ర వ్యాకరణమును వ్రాసెననియు తెలియుచున్నది. కాని యీ లక్షణ గ్రంథము లభింపలేదు. ఇతఁడు విక్రమార్కచరిత్రము, పదమంజరి, గణ మంజరి యను గ్రంథములనుఁగూడ రచించినట్లు వీరేశలింగంపంతులుగారు తమ కవుల చరిత్రలో తెలిపినారు మఱియు "లక్ష్మీర్బుద్ధన్నృపాలేనయం ప్రాప్తారి కవిభల్లటమ్. తేనకావ్య దృశాప్రాప్తాసప్రాసా పదమంజరీ" అను శ్లోకమును పద మంజరిలోనిదిగను, 'శ్రీమద్దాక్షారామ భీమనాథ వరప్రసాదలబ్ధ సకల భాషాకవితా నిర్వాహక కవిభల్లట రచితా గణమంజరీ సమాప్తా' అను గద్యమును గణమంజరి లోనిదిగను పేర్కొనినారు. కాని ప్రస్తుతము మనకీ గ్రంథములు లభింపలేదు. ఈతఁడు పదమూఁడవ శతాబ్దిలోని వాఁడని పంతులుగారు తెలిపియున్నారు. (ఆం. వ్యా. వి. పేజీ. 185)

**కవిలోక చింతామణి** [క. చిం]

కర్త: వెల్లంకి తాతంభట్టు: క్రీ.శ. 1500 ప్రాంతము. అముద్రితము. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తునందు దీనివ్రాఁతప్రతి కలదు.

అప్పకవీయమునందును, తదితర లక్షణ గ్రంథము లందును నిందలి పద్యము లుద్ధరింపఁబడుటనుబట్టి, యిది పూర్వకాలమున బాగుగా పఠన పాఠనములందున్న లక్షణ గ్రంథముగాఁ బేర్కొన నగును.

**కవి శిఖామణి**

'కేచిచ్చామహతః శబ్దామతే కవిశిఖామణేః,' పురుషాఖ్యా భవంత్యత్ర (అథ. కా. అజన్త. 9) అను కారిక యందీతనిపేరు పేర్కొనఁబడినది. ఈతని మతమున కొన్ని అమహచ్ఛబ్దములును తెలుఁగులో పురుషనామములగును. ఉదా:- భుజగ జాల్మ్కుఁడు, పర్వతుఁడు మొ॥ ఇతఁడొక లక్షణకర్త యనుటకన్న ఆంధ్రమహా భారత కర్తయగు నన్నయయే కవిశిఖామణిగా పైకారికయందు కీర్తింపఁబడెనేమో! మహాభారతమున ఉరగోత్తముఁడు, భుజగజాల్మ్కుఁడు మున్నగు పదములు పురుష వాచకములుగా ప్రయోగింపఁబడినవి. (ఆం. వ్యా. వి. పేజీ. 195)

**కవిసంశయ విచ్ఛేదము** [క. సం. వి.]

కర్త: సూరకవి, అడిదము (చూ.)

ఇందు మూఁడు తరంగములు గలవు.

(i) విశేష లక్షణములను నిరూపించు తరంగము భారతాది ప్రాచీన గ్రంథములనుండి అనేక లక్ష్యములిందు ప్రదర్శితములు.

(ii) రేఫ—శకటరేఫ నిర్ణయ తరంగము.

(iii) తద్భవ పద లక్షణము.

శ్రీ వజ్ఝల చిన సీతారామశాస్త్రిగారు తమ వైయాకరణ పారిజాతమునందు ఈ ప్రకరణమును బాగుగా వ్యాఖ్యానించిరి.

ఇందలి నియమములు చాలావఱకు "తద్భవీ కరణము"ను శీర్షిక క్రింద నిందు నిరూపితము.

**కళలు**

శబ్దముయొక్క పుట్టుకను బట్టికాక వాని యంతములను పురస్కరించుకొని తెనుఁగు పదజాతమును కళలు, ద్రుతప్రకృతికములు అని రెండు విధములుగా విభజింపనగును. ద్రుతమంతమందులేని పదములు కళలు. తిఙ్మధ్యక్రియలు (పోషించితివి, పోషించితిరి. ఇత్యాది మధ్యమ పురుషరమాంత క్రియలు), శేష-షష్ఠి (యొక్క) సు సంతము (రాముడు మొ॥ ప్రథమాంతములు), కర్మప్రవచనీయజ విభక్తి (రాముంగూర్చి మొ॥ చోట్ల కూర్చియనునది), కించిదర్థకములు (ఇంచుకంత, కాసంత, సుంత మొ॥) ప్రశంసార్థకములు (బళి, మజ్జా మొ॥). అద్భుతార్థకములు (అహో, ఓహో, ఔరా మొ॥), సంతాపార్థకములు (అక్కట, అయ్యో మొ॥), యదా, తదార్థకములు (ఎప్పుడు, అప్పుడు), కిమర్థకము (ఏమి), ఏవార్థకములు (నిన్నే, రాముఁడ మొ॥) క్త్వార్థకములు (ప్రకాశించి, హరించి, చేయక మొ॥), కిలార్థకములు (చేసెనట ఇత్యాదులలోని అఁట), తూష్ణీమర్థకములు మిన్నక, ఊరక మొ॥) మఱియు పట్టి, కయి అను విభక్తులు, సుమ్ము, కద, ఏలా, మఱి మొదలగునవి, ఏని యనునది —ఇవిఅన్నియు ద్రుతాంతములు కానందున కళలు. (చింతా. సంజ్ఞా 40) కూర్చిరి, ఘటింపఁగలఁడు మొ॥ తిఙ్మధ్యములు కాకున్నను ప్రథమావిభక్తి సమములుగా గ్రహింపఁబడుటచే నివియును కళలే. (అహో. సంజ్ఞా 40) వికృతి వివేక కర్త కళా. ద్రుత ప్రకృతిక విభాగమునుఁగూర్చి యేమియును చెప్పలేదు. ఈతఁడు ద్రుతసంజ్ఞనుపయోగించినను కళాసంజ్ఞను మాత్రముపయోగింపలేదు. కళాశబ్దమునుపయోగింపవలసిన చోట్ల 'అద్రుతము'నియే పేర్కొనెను (అ. కా. సంధి. 23, అజన్త 72, 81) కళాద్రుతప్రకృతిక విభాగమును తెనుఁగు భాషకుఁగల విశేషలక్షణము. ఇది చింతామణి కర్త స్వోపజ్ఞతచే కల్పించిన సంజ్ఞ.

కా[1]

దీర్ఘాకారము (ఆ) తోఁగూడిన కకారము. (చూ.) క[1] యొక్క ఇతర లక్షణములు

-కా[2]

(i) పుంస్త్వమున మతుబర్థమునందు 'ఆటాదుల'కు (చూ.) చేరుతద్ధిత ప్రత్యయము.

ఇది మగాది గణము (చూ.) నందు గణింపఁబడుటచేడుజ్ఞగు.

ఆటకాఁడు, సొగసు కాఁడు మున్నగునవి. (బా. వ్యా. తద్ధిత 11)

(ii) స్వార్థము నందు కొండొక వానికిఁజూపట్టును.

చెలికాఁడు, హెగ్గడి కాఁడు (బా. వ్యా. తద్ధిత. 13)

(iii) తిర్యక్కులకును గానఁబడియెడి.

కొమ్ముకాఁడు, పరికాఁడు (బా. వ్యా తద్ధిత. 14)

(iv) ఈ 'కా' ప్రత్యయమునకుఁగొండొకచో గకారము కానవచ్చును.

అందగాఁడు, ఇబ్బందిగాఁడు (బా. వ్యా. తద్ధిత. 12)

-కా[3]

విధేయ విశేషణములకును, క్రియావిశేషణములకును అనుప్రయుక్తమై 'అగు నట్లు' అనునర్థమిచ్చును.

బ్రాహ్మణముఖ్యుఁబురోహితుండుగాఁజేకొనువారము. (సూ.ని.)

-కా[4]

అర్థవిశేషము లేకయే తుమున్నంతములకు అనుప్రయుక్తమగును.

'నీపెంపెట్లునుంజేయఁగానోపండు'. (సూ.ని.)

-కా[5]

'కి' 'కు' లకు అనుప్రయుక్తమైహేతువును దెలుపును.

'ఆచపలాక్షికిఁగా మనకీచకులందఱను రాత్రి గీటడఁచె"

"నీకుఁగా ననిసేయుటొకటి దక్కంగ." (సూ ని.)

-కా[6]

'అని' అను నవ్యయమువలె పూర్వోక్త విషయమును సూచించును. ఈ యర్థమునందిది తఱచుగా నవధారణార్థమున కనుప్రయుక్త మగును.

'తల్లికి నివేదించిన నెఱుంగక యెప్పటి యట్లకావగచి'
'ఇట్లభిమన్యుఁడు మదిసెనకావగచి' (సూ.ని )

-కా[7]

నిశ్చయార్థము —'కదా' యనియర్థము.
'న్నేఁడుగా మాకనిందిత పర్వసామగ్రి' (సూ.ని )

**కాంతము**

కకారమంతమందుగలది. ఇది వ్యతిరేకార్థమును దెలుపును. వినక పలికె; ఇయ్యకచనియె.

(ఆం. భా. భూ. 157. 158)

**కాఁ**

'అగు' ధాతువుయొక్క నుజ్యంత రూపము
'అగుటకు' 'అగునట్లు' మొదలగు నర్థములను దెలుపును
'ధర్మాభి వృద్ధిగాఁదగువడువున' (బా. వ్యా. క్రియా. 115)
(సూ.ని.)

**కాక**

ఆశీరర్థమునందు క్రియ మీఁదఁగాత, కావుత, కాక అను శబ్దములు ద్రుతాంతము లనుప్రయుక్తమగును. కాతురు గాకన్. (ల. వ్యా. క్రియా. 61)

**కాక కాన్యవ్యయములు**

కాక, కాని అను నవ్యయములు.

'ఇనన్' అంత క్రియా పూర్వకములగు కాక, కాని అను నవ్యయములు ఉక్తమగు సంగ్రహ వాక్యమందుండెనేని, అనుక్తమగు విస్తరవాక్యమునందలి పదముల నభివ్యంజింపఁజేయును

"నీవు నలునకుఁబేర్మితోదేవివై నఁగాక" నీవు నలునకు దేవివైన నీసౌందర్యాదులు సార్థకమగును. కాకున్న వ్యర్థములగు ననియర్థము.

(ప్రౌ. వ్యా. వాక్య. 18)

**కాకు దోషము**

అనవసరముగా లేని దీర్ఘములను కల్పించుట.

పొగడ దండలు—పోగాడ దండలు

మకర లాంఛనుఁడు—మకారలాంఛనుఁడు

చెఱకు విల్లు—చెఱాకు విలు మున్నగునవి.

(కవిజ. V. 28; అ. ఛం. IV. 25)

**కాకువు**

'వక్రోక్తి' అను శబ్దాలంకారమని రుద్రటుఁడు. ఇది అభిప్రాయవంతమగు పాఠ ధర్మమే కాని, అలంకారము కాదని రాజశేఖరుని అభిప్రాయము.

కాని తెనుఁగు నందు విశేషముగా వాక్యాంతస్వరమును మలుపుటలో కాకు వుప్పతిల్లును.

దేవునియెదుట నిల్చినిజంచెప్తాను ↑ — ఇటు కంఠస్వరము నూర్ధ్వముగా మలచుటచే'చెప్పను' అను వ్యతిరేకార్థము వ్యంజింపఁబడును.

'ఎఱిఁగి యెఱిఁగి నన్ను ఏకార్థసమపేతుపాడియయ్య ↑ యిట్టిపనికి పనుప'— కాదని యర్థము.

(తె. వ్యా. వి. పుట 459)

**కాకుస్వర వికల్పము**

(చూ.) కాకువు.

కాకు స్వరముపై క, చ, ట, త, ప లు వికల్పముగా గ, స, డ, ద, వ లగును.

'వే। యే చక్కంబెట్టువాడనే పాండవులన్.'

(క. సం. I. 14; ఆం. కౌ 812-'18)

**—కాత (న్)**

దీవించుటయందు తద్ధర్మక్రియ మీఁదఁగాత, కావుత, కాకలు ద్రుతాంతము లగును.

దేవతలు రక్షింతురు గాత(న్).

(ల. వ్యా. క్రియా. 61)

కలవాఁడు మున్నగు నర్థములను బోధించు తద్ధిత ప్రత్యయము. ఇది పుంలింగ ము న ఏకవచనముకంటె పరముగా వచ్చును. ఉదా:- వన్నెకాఁడు మొదలగునవి.

(అథ. కా. అజంత 50, 51) చూ:- కా2.

కకారము మున్నగు వర్ణములు

వ్యంజనములకు (హల్లులకు) తెలుఁగున 'కాదుల'ని వ్యవహారము.

(ఆం. భా. భూ.16 ప; ఆం. కౌ. 53)

కృత్సంబంధులగు క, గ, త, ప, వ, ఇమి అనువర్ణకములు.

ఇవి పరమగునపుడు ధాతువులయొక్క అంతమందలి క, గ, చ, య, వ అను వర్ణములు లోపించును.

ఆవులించు —— ఆవులింత

మాయు —— మాపు ఇత్యాదులు

(బా. వ్యా. కృదంత 2)

దులు

'కా' ఆదేశము మున్నగునవి. (చూ : కా, నా, కానలు

అవు, కావుతను, కాతను, అనవుడు, నావుడు మున్నగునవి.

(బా. వ్యా. క్రియా. 102)

ఒకానొకచో సంబోధనమందు వికృతి శబ్దముకంటె పరమగు వచ్చు వర్ణకము. ఉదా:- నాయయ్యకాన, నాయమ్మకాన మొ॥ (అథ. కా. అజన్త. 72, ప్రౌ. వ్యా. శబ్ద. 15)

కానలు

ముజ్జీత్తులు (చూ.) పరమగునపుడు

'అగు' నకు 'కా'

'అను' నకు 'నా', 'కను' నకు 'కాన'

అను శబ్దములు విభాషగా నగును

అగుము—కమ్ము

అనఁడు— నాఁడు

కనఁడు— కానఁడు మొదలైనవి.

(బా వ్యా. క్రియా. 68)

**కాప్వాది శబ్దములు**

(కాపు+ఆది శబ్దములు) కాఁపు, బాపన, కోమటి, అట్టి, ఇట్టి మున్నగు శబ్దములు. వీనికంటె పరమందున్న ఆదియను శబ్దములోని అకారమునకు వికల్పముగా లోపమువచ్చును. ఉదా:- కాపుది-కాపది; బాపనది-బాపనయది; కోమటిది-కోమటియది, అట్టిది-అట్టియది మొ॥ (అహో. సంధి. 14)

**కామ్**

మతుప్రత్యయ స్థానమునవచ్చుఆదేశము. (వై. చం. తద్ధితా1). ఇందలి మకారమిత్సంజ్ఞకమై లోపించును. ఇది మిత్తగుటచే వికృతి పదములపై మాత్రమే వచ్చును (చూ:-మిత్) ఉదా·- వన్నెకాఁడు మొ॥

**కారకము**

క్రియాన్వయము గలిగించునది. అనఁగాఁ క్రియాన్వయముకలది.

ఇది ఆఱు విధములు·

(*i*) కర్మ కారకము

(*ii*) కర్తృ ,,

(*iii*) కరణ ,,

(*iv*) సంప్రదాన ,,

(*v*) అపాదాన ,,

(*vi*) అధికరణ ,, (చూ.)

(ఆం. కౌ. 412-18;

ప్రౌ. వ్యా. కారక. 1)

**కారక ప్రయోగము**

విశేష్య విశేషణ ప్రయోగము.

"హరి కరుణాకరుఁడు" అనగా 'హరి' విశేష్యము, 'కరుణాకరుఁడు' విశేషణము. ఇట్లు చెప్పుట కారక ప్రయోగము. క్రియాన్వయము లేకున్నను నిట్టి ప్రయోగములు అర్థపరిసమాప్తిని గల్గియుండును.

(అ. ఛం. IV. 120)

**కారణహేత్వర్థ సంధాయకము**

కారణమును హేత్వర్థమును అనుసంధానించునది.

'వాఁడు బాగుగాఁ జదివెఁ *గానఁ* బరీక్షలోఁ గృతార్థుఁడయ్యెను.'

(మ. ప. వ్యా. సంధా.7)

**కారము**[1]

(*i*) వర్ణమును నిర్దేశించుటలోను—అకారమునకు ఉకారము వచ్చును.

(*ii*) వర్ణమును విధించుటలోను—ఉకారము, గకారము.

(*iii*) ఒకధ్వనియొక్క యుచ్చారణమిట్టిదని పేర్కొనుటలోను—ఇకారము. కారప్రత్యయము రేఫేతరమగు వర్ణములకుపయుక్తము.

(అ. ఛం. IV. 128)

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 2)

**-కారము**[2]

(సం) కటుః ⟶ (ప్రా.) కారో ⟶ (తె) కారము. ఈరీతిని ప్రాకృతసమముగా నిది బాలవ్యాకరణము నందు నిరూపితము. (బా వ్యా. సంజ్ఞా. 19)

క్షారశబ్ద భవము కారమనుట సముచితమని ప్రౌఢవ్యాకరణకర్తచే నుద్ఘాటింపఁబడెను.

(ప్రౌ. వ్యా సంజ్ఞా. 10)

**-కారము**[3]

తద్ధిత ప్రత్యయము.

(*i*) భావార్థమందు వచ్చును. చెలికారము.

(బా. వ్యా. తద్ధిత. 8)

(*ii*) నుడి, కొలతలకు స్వార్థమునందు వచ్చును.

నుడి కారము, కొలగారము, (ప్రౌ. వ్యా. తద్ధిత. 18)

**కాలపరిమితి**

కాలముయొక్క పరిమాణమునుదెల్పు పదములు. వీనికి 'కు' వర్ణము చేరును.

కొండొక సేపునకుఁ దెలిసి; వర్షావధికి—ఇత్యాదులు

(ప్రౌ.వ్యా. శబ్ద. 14)

**కాలవాచకములు**

కాలమునుదెల్పు శబ్దములు.

వీని సప్తమికి ప్రథమ ప్రాయికముగా నగును.

పగలు మేల్కొని యుండెను.—పగటియందని యర్థము.

(ఆం. కౌ. 343-44; ఆం. భా. శా. కారక 20)

**కాలవాచి**

కాలమును దెలుపు శబ్దము.

నాఁడు, అప్పుడు, ఇప్పుడు మున్నగునవి.

(ఆం. భా. చ. పుట 1392)

**కాలాధ్వములు**

కాలమును, దూరమును దెల్పు శబ్దములు. ఇవి సామాన్యముగాఁ బ్రథమా విభక్తియందుండును.

వాఁడు నిన్న వచ్చె

వాఁడు క్రోశము నడిచె

(బా. వ్యా కారక. 25)

**కావత్తు**

క కారము హల్లుల క్రింద వ్రాయునప్పుడిచ్చు గుర్తు— ్క

అక్క, కుక్క (గు. వ్యా. 12 అంశము)

**కావుత(న్)**

ఆశీరర్థమున నిపతింపఁబడిన యవ్యయము. ఇది తిజన్తమున కనుబంధముగా వచ్చును. ఉదా:- ప్రోచుగావుత మిమ్ము నంభోధికన్య మొ॥ (వై. చం. అవ్యయ 9; ల. వ్యా. క్రియా 61)

చూ:- కాత(న్), కావుతాదులు.

**కావుతాదులు**

(కావుత+ఆదులు) కావుత, ఎడు, త అను నీ మూడువర్ణకములు. ఇవి యాశీరర్థమును దెలుపు ప్రత్యయము. ఉదా:- ప్రోచుఁగావుతన్, ప్రోచెడున్, ప్రోచుతన్. ఇవి శాప, సంప్రార్థనార్థములందును వచ్చును. ఉదా:- నీకు రాక్షసత్వంబు గలిగెడున్ (శాపార్థము), హరినను కృపఁగాచుతన్, హరినను కృపఁగాచెడున్ మొ॥ (సంప్రార్థ నార్థము). (అథ. కా. అజంత 66)

**కావ్యాలంకార చూడామణి**

కర్త : విన్నకోట పెద్దన (చూ.). క్రీ. శ. 15వ శతాబ్దము

తెలుఁగున రచింపఁబడిన తొలియలంకార శాస్త్రము. ఇందలి నవమోల్లాసము- ఆంధ్రభాషా విశేషసంధి సమాస దేశీయ ప్రయోగక్రియా నిరూపణ లక్షణ సముద్దేశ్యము.

ఇందు 171 గద్య పద్యములు గలవు. ఇది విశేషముగా ఆంధ్రభాషా భూషణము ననుసరించి విరచితము.

'ఆంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము' అని పెద్దన సుద్ది. దీనిని తాను 'ఎల్లిదముగా' రచించినాడట.

తెనుఁగు వ్యాకరణ రచనా పరిణామమును గ్రహించుట కిది యుపయుక్తము.

**కించిదర్థకములు**

(కించిత్+అర్థకములు) కించిత్ అను సంస్కృత శబ్దముయొక్క అర్థముగల ఇంచుకంత, కాసంత, సుంత అను తెనుఁగు శబ్దములు. ఇవి కళలు.

(చింతా. సంజ్ఞా, 40)

**కి(న్)**

హ్రస్వ-ఇకారాంత శబ్దములకంటె పరమందున్న ఙస్ (షష్ఠేకవచన) ప్రత్యయస్థానమునవచ్చు విభక్తి ప్రత్యయము. (చింతా. అజన్త. 89) ఉదా:- హరికిన్, గిరికిన్, శౌరికిన్ మొ॥ 'ఙమః కురనితామ్' (చింతా. అజన్త 25) అను సూత్రముచే ఇదంతములు కాని శబ్దముల షష్ఠికి 'కు' విధింపఁబడినది ఇందలి 'అనితాం' అని ఇదంత పర్యుదాస పూర్వకముగ విధానముండుటచే పరిశేష న్యాయమున హ్రస్వేకారాంతముల షష్ఠ్యేకవచనమున'కి' ప్రత్యయము తనంత దానేవచ్చు చుండుటవలన 'ఇతాం ఙసః కిః స్యాత్ (చింతా. అజన్త 89) అను సూత్రమును మఱల నారంభించుటవలన హ్రస్వేకారాంత శబ్దములపై విధింపఁ బడిన 'కి' ప్రత్యయము ఏకాక్షరములగు శ్రీ మున్నగు ఈకారాంత శబ్దముల పైనను షష్ఠ్యేకవచనమున వచ్చునని తెలియుచున్నది. కనుకనే 'శ్రీకి' మున్నగు

రూపములేర్పడును (అహో. అజన్త 33). యుష్మచ్ఛబ్దార్థకమగు 'నీ' అను శబ్దముపై మాత్రము కివర్ణకము రాదు. (చింతా. హలన్త. 17)

**కిత్తులు**

క కారము ఇత్సంజ్ఞగాఁ గలవి.

నుక్, రుక్, టుక్ ఇత్యాదులు కిత్తులనఁబడును. శబ్దము యొక్క అంతము నందీ యాగమములు చేరును. (ఆద్యన్తౌటకితౌ. అష్టా.)

ఇందు కకారముతో పాటు పూర్వహల్లుల యందలి ఉత్వముకూడ లోపించును.

రాజు(యొక్క)+ఆజ్ఞ⟶రాజు+న్+ఆజ్ఞ⟶రాజునాజ్ఞ

ఇట్లే ధీరురాలు, కఱకుటమ్మ మున్నగునవి

(రమణీ 53 పుట; గు.ప్ర. 66-69)

**కిమర్థకము**

(*i*) (కిమ్+అర్థకము) కిమ్ అను సంస్కృత శబ్దము యొక్క అర్థముగల 'ఏమి' యను తెనుఁగు శబ్దము- ఇదికళ. (చింతా. సంజ్ఞా 40)

(*ii*) ఎద్ధి, ఎయ్యది. ఏమి ఇత్యాదులు కిమర్థములు. ఇవి కళలు.

(అప్ప. V. 31)

**కిమాదికము**

(కిమ్+ఆదికము) కిమ్ అను సంస్కృత శబ్దమునకు తెనుఁగున పర్యాయమగు ఏమి మున్నగు శబ్దములు. అవి ఏమి, మఱి, కి- షష్ఠి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి మున్నగునవి. వీనిని తెనుఁగు వ్యాకర్తలు ఏమ్యాదులనిరి. (చూ:- ఏమ్యాదులు) ఇది ఆకృతిగణము. వీని ఇత్తునకు సంధి బహుళముగానగును. (చింతా. సంధి 9) ఉదా:- ఏమయ్య, ఏమియయ్య మొ॥

**కిమేకార్థకశబ్దములు**

'కిమ్' 'ఏక' అను శబ్దముల యర్థముగల తెలుఁగు శబ్దములు. అనఁగా 'ఏ' 'ఒక'.

ఇవి అజ్ఞాత వస్తూద్దేశ్య ప్రశ్నాదులందుఁ దఱచుగా బహువచనాంతములగును

ఎవరక్కడ ?

ఒకరు పోయినత్రోవ నొకరుపోరు. (ప్రౌ. వ్యా. శబ్ద. 47)

**కియదర్థాదికములు**

(కియత్ + అర్థ + ఆదికములు) కియత్ అను సంస్కృతశబ్దార్థముగల తెనుఁగు శబ్దమగు ఎంత మున్నగు శబ్దములు. అవి ఎంత, కొంత, ఇంత, అంత,

యను శబ్దములు. ఇవి మహత్వర్థమును, మహదర్థమును చెప్పునపుడు ఉవర్ణాంతములగును. ఉదా:- ఎందఱు, కొందఱు, ఇందఱు, అందఱు. జడవాచకములగునపుడు ఇవిన్న్యంతములగును. ఉదా: ఎన్ని, కొన్ని, ఇన్ని, అన్ని, మొ॥

**కియద్యావదర్థకము**

కియత్, యావత్ అనువానియర్థముగలది. అనఁగా ఎందఱు, ఎన్నియని యర్థము.

(బా. వ్యా. ఆచ్చిక. 24)

**కియావడి**

హల్లులపై యకారమును జేర్చి వ్రాయునప్పటిగుర్తు 'య'.

అయ్య; వ్యాజము

(గు వ్యా. 18 అంశము)

**కియ్య**

(చూ.) కియావడి.

(అప్ప. II. 226)

**కియ్యావడి**

(చూ.) కియావడి

యకారమునకు 'కియ్యావడి' సంకేతము.

(ప్ర. వ్యా. సంజ్ఞా.48)

**కిలార్థకము**

(కిల+ అర్థకము) సంస్కృతమున వార్తార్థకమును, అలీకార్థకమును అగు కిల అను నవ్యయము ("కిలేతి వార్తాయామలీకేచ" బా. మ. అవ్యయ-ప్రకరణము) యొక్క అర్థముగల అఁట యను తెనుఁగు శబ్దము. ఉదా:- వచ్చెనట మొ॥ (చింతా సంజ్ఞా 40, అప్ప. 5-29)

**కుజ్**

బహువచనము పరముగునపుడు కొన్నినువర్ణాంతప్రాతిపదికల నువర్ణమునకు వచ్చు ఆదేశము (చింతా. అజంత 68) ఇందలి జకారమిత్సంజ్ఞకమై లోపించును. ఇదిజిత్తగుటచే 'సానునాసికోచ్చారణం జిత్' అను ప్రాకృత వ్యాకరణసూత్రముచే బిందుపూర్వకమగును. ఉదా:- కెలఁకులు (కెలను+లు), కొలఁకులు (కొలను+లు) మొ॥ ఇట్లు బహువచనమునందే కుజాదేశము పూర్వవ్యాకర్తలచే చేయఁబడినను చి. సూ. దీనిని ఏకవచన వికల్పముగను బహువచనమునందు నిత్యముగను

కావించెను. ఉదా:- కొలను కొలకు మొ॥ (బా. వ్యా. ఆచ్చిక 18) చూ:- (కు, ంకు. 'న్యంతాన్నామ్నః కుజ్నోర్బహువచనే' (చింతా. అజంత 68) అను సూత్ర మందలి కుజ్ అనునది గు అనుదానికిని ఉపలక్షణమగుటచే గోఁగులు (గోను+లు) రేఁగులు (రేను+లు) ఇత్యాది రూపములు సిద్ధించును (అహో. అజంత 69) అథ ర్వణుఁడు 'కొన్ని' సువర్ణాంతములగు శబ్దములకు బిందుపూర్వకమగు కువర్ణక, గువర్ణకములు వచ్చునని వచించెను. (అథ. కా. అజంత 48). ఇందు బహువచ నము పరమగునపుడు అను నిమిత్తము లేనందున గోఁగు చెట్టు ఇత్యాది సమాస ములందును 'గు' ఆదేశము సిద్ధించుచున్నది. (అహో. అజంత 69)

**-కుజీ**

వ్యతిరేకార్థమునందు మధ్యమపురుష ము, డు(జ్) వర్ణకములు పరమగునపుడు 'కు(జీ)' యగును.

కు(జీ) జిత్తు. (జి+ఇత్తు) కావున ఉత్వమున కత్వమగును.

వండు+కు(జి)+ము ⟶ వండకుము.

వండు+కు(జి)+డు ⟶ వండకుఁడు.

(బా వ్యా. క్రియా. 32)

**'కుచ' ధాతువు**

దీనికి 'ఇంచు గాగమము కల్గుచో గుణమురాదని అహోబలపతి యభిప్రాయము. కాని 'సంకోచించు' అని గుణయుక్తముగనే సర్వత్రప్రయుక్తము.

(బా. వ్యా. క్రియా. 68)
(రమణీ. పుట 417)

**కు(న్)**

ఇదంతములు కాని శబ్దములకంటె పరమందున్న ఙస్ (ఙస్, ఓస్, ఆమ్ అను షష్ఠీ విభక్తి ప్రత్యయముల) స్థానమునవచ్చు ప్రత్యయము ఇది పరమగునపుడు ఏకవచనమున మహద్వాచక ప్రాతిపదికమునకు నవర్ణము ఆగమముగా వచ్చును. ఉదా.- రామునకున్ మొ॥ బహువచనమున మహద మహత్ప్రాతిపదికములకు లవర్ణమాగమమగును ఉదా:- రాములకున్, భామలకున్, వనములకున్. మొ॥ (చింతా. అజన్త. 24, 25 అహో. అజన్త 18) హ్రస్వ-ఇకారాంతములగు శబ్దములపై షష్ఠ్యేకవచన (ఙస్) ప్రత్యయ స్థానమున మాత్రము 'కి' వర్ణకము వచ్చును. (చింతా. అజన్త 30) ఉదా:- హరికిన్, గిరికిన్ మొ॥

**కుమారదేవ పండితీయము**

ప్రౌఢ వ్యాకరణమునకు విద్వాన్ తాఝ్నూరు ఆర్ముగంపిళ్ల రచించిన వివరణము. ప్రచురణ : వేదం వేంకట రాయశాస్త్రి అండ్ బ్రదర్స్. మే 1947

**కుఱు**

'కుఱుచ' అను శబ్దముయొక్క లుప్తశేషము.

దీనికి అచ్చు పరమగునపుడు ఱకారమునకు ద్విరుక్తటకార మాదేశమగును.

కుఱు+ఉసురు ⟶ కుట్టుసురు

(బా. వ్యా. సంధి 12)

**కుఱుచలు**

హ్రస్వములు

(అప్ప. II. 10)

**కుఱుచకొమ్ము**

ఉత్వమునకుఁగాని, ఊకారమునకుఁగాని కుఱుచకొమ్మనియు వ్యవహారము.

(అప్ప. II. 8)

**కుంకము**

ఒక పద్యములోని పదములకు వేఱొక పద్యమునందలి పదముతోఁగాని పదములతోఁగాని యన్వయము.

"తానొక పండు చెచ్చెరన్"

"కొని వచ్చుడున్"...

**-కులు**

కొఱను, నెఱను, కొలను, మ్రాను, కలను, గవను, కెలను, వలను మున్నగు వాని'లు' వర్ణమునకు బహువచనమందాదేశమగు బహువచన పదాంశము.

కొఱకులు, నెఱకులు, కొలకులు అనురీతిని బహువచన రూపములేర్పడును.

(ఆం. భా. భూ. 73, 74)

**-కువ**

'అడఁగు' మున్నగువానికిఁ (చూ. అడంగ్వాదులు) జేరు కృత్ప్రత్యయము.

అడఁగు+కువ⟶అడఁకువ

పొలయు+కువ⟶పొలకువ

(బా. వ్యా. కృదంత. 6)

**కువర్ణకము**

వ్యతిరేక ప్రార్థనార్థమునందు క్రియపైవచ్చు ప్రత్యయము ఇది ము, వు,

డుఙ్ వర్ణకములకు పూర్వమందు వచ్చును. ఉదా:- ఘటింపకుము, అలుగకువే, పోషింపకుఁడు మొ॥ (అథ కా. క్రియా. ౭; ల వ్యా. క్రియా. ౩౯)

**కుశగ**

కుశ మున్నగుశబ్దముల గణము. చూ:- (గ) (వై. చం. అజంత ౩4) చూ:- కుశాదులు.

**కుశగణము**

కుశ, దర్భ, పనస, కుండ, కంద శబ్దములు. (చూ ) కుశాదులు.

(కవిజనాం. 57పుట)

**కుశాదులు**

(కుశ+ఆదులు) కుశ, హంస, దర్భ, దూత, చరిత, చరిత్ర, భ్రమ, అభిలాష, విజృంభణ, అక్షత, పులక, తరంగ, వేగ, కుండ, పనస, స్ఫురణ, ఘోష మున్నగు శబ్దములు. వీనిపైవచ్చు ము వర్ణకము నకు లోపము వచ్చును (చింతా. అజంత 54) ఉదా.- కుశ, హంస, దర్భ, దూత మొ॥

**కుసంధి**

దుష్ట సంధి, హితవుగాని సంధి

(i) ఇకారముపై యచ్చొదవిన యడాగమమును గావింపక సంధిచేయుట.

'దీనియెడ యండిది యెట్లొదవె?' అనక

'దీనొదయండి దెట్లొదవె?' ననుట.

(అ ఛ. IV—19)

(ii) మగువొకతె, పొలఁతొకతె,

చేడొకతె యను రీతిని సంధులు గావించుట

(అప్ప. V. 11)

**కుసంధి వర్గము**

(చూ.) కుసంధి.

ఇకారమునకు ఇకారము పరమైన సంధి చేయుట.

'ఎవ్వరిది యిల్లు' అనక, 'ఎవ్వరిదిల్లు' అనుట. (కవిజ. V. 10)

**కూఁతు శబ్దము**

దీని ప్రథమైకవచనమునకు 'రు' వర్ణమగును.

కూఁతురు—కూఁతులు

కూఁతురులు, కూఁతుళ్లు, కూతురిని వంటి రూపములు గ్రామ్యములని చిన్నయ సూరి హెచ్చరిక (బా. వ్యా. అచ్చిక. 9)

**-కూర్చి**

(i) ద్వితీయా విభక్తి. దీనికి లోపముకూడఁ గల్గును.

పరాశరసుతుంబ్రఁజ మిల్లి (స, సా. సం. I విభక్తి 14, 16, 17)

(ii) లక్ష్య లక్షణ భావము నందగును.

జపములఁగూర్చి వర్ణించెను.

(ల వ్యా. అజన్త. 35)

**కృత్కగతప వేములు**

కృత్ప్రత్యయములగు క, గ, త, ప, వ, ఇమి అనునవి.

ఈప్రత్యయములు పరమగునపుడు ధాతువుల తుదినున్న 'క, గ, చ, య, వ' అను వర్ణములు లోపించును.

అలుగు—అలుక

చేయు—చేఁత ఇత్యాదులు

(బా. వ్యా. కృదంత. 2.)

**కృతోత్కము**

చేయఁబడిన హ్రస్వోకారము గలది.

రామ—రాము

కృష్ణ—కృష్ణు. (బా. వ్యా. తత్సమ. 84)

**కృత్తు**

కృత్ప్రత్యయము.

ధాతువునకు విహితమగు డుఙ్ (చూ.) భిన్నప్రత్యయము.

ఏలు—ఏలిక (-ఇక)

కొను—కొనుబడి (-బడి) మున్నగునవి.

**కృత్ప్రత్యయములు**

కృత్తులగు ప్రత్యయములు.

ధాతువులకు విహితమైనట్టి, క్రియా విభక్తులకన్న భిన్నమైనట్టి ప్రత్యయములు.

—క, —త, —ఇమి, —కువ, మొదలైనవి.

(వ్యా. భా. వ్యా. కృత్ప్రకరణము. 1.)

**కృదంతము**[1]

కృత్ప్రత్యయమంతమందుఁగల శబ్దము. ఉదా:- నుతి, స్తుతి, సంతోష, రోష ఇత్యాదికము. (వీనిలో మొదటి రెండు పదములలో క్తిన్ అనునది, తక్కిన వానిలో ఘఞ్ అనునది కృత్ప్రత్యయము). ఉపకృతి క్రియలు కృత్ప్రత్యయాంతములుగ నుండును ఉదా:- నుతించు, స్తుతించు, సంతోషించు, రోషించు మొ॥ (చింతా. క్రియా. 5) చూ:- ఉపకృతి క్రియలు.

**కృదంతము**[2]

కృత్+అంతములు

కృత్ప్రత్యయములు (చూ.) అంతమందుఁగల శబ్దములు.

ఏలిక, కలిమి మున్నగునవి.

(సం. వ్యా. విశే. 8.)
(సు. వ్యా. కృదంత. 1.)

**కృద్వర్ణకములు**

కృత్+వర్ణకములు (చూ.)

కృత్ప్రత్యయములు (చూ.)

**కృద్వృత్తి**

కృత్+వృత్తి: కృత్ప్రత్యయముల కలయిక.

ధాతువులకంటె విహితములయినట్టి, క్రియావిభక్తులు కానట్టి ప్రత్యయములు కృత్తులు. ఇట్టివాని కలయికవలనఁగలుగు విశిష్టార్థమును బోధించునది కృద్వృత్తి.

భర్త, భార్య, భక్తుఁడు మున్నగు శబ్దములందలిది.

(ఆం. భా. శా. సమాస 87)

**కృశము**

'కృశ్' అను సంస్కృత ధాతువు.

దీనికి 'ఇంచు' గాగమము చేరునపుడు గుణములేదు. కృశించు

(బా. వ్యా. క్రియా. 68)

**కెంజడలు**

కెంపు+జడలు

పరుషేతరములు పరమగునపుడు 'ను' గాగమప్రాప్తి యుండదు. ద్విత్వము రావలయును. కాన 'కెంజడలు' అను రూపమును నిపాతముగ గ్రహింపవలయును. (బా. వ్యా. సంధి. 38)

**కృష్ణభూపాలీయము**

ఆంధ్రశబ్ద చింతామణికి వ్యాఖ్య. దీని కర్త చంద్రకవి. ఇది మైసూరు మహారాజు శ్రీ ముమ్మడి శ్రీకృష్ణరాజేంద్రవడయర్‌కు అంకితముగా వ్రాయఁబడుటచే కృతిభర్త పేరనే వ్యవహృతమైనది. ఇది శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిచే సంస్కరింపఁబడి 1924. సం. న మైసూరుప్రభుత్వ ముద్రణాలయమున ముద్రింపఁబడినది. ఇది మూడాశ్వాసముల గ్రంథము. అప్పకవీయాను సరణమిందు బహుళముగా కలదు. (ఆం. వ్యా. వి. 440 పు.)

**కెంధూళి**

కెంపు+ధూళి

పరుషేతరములు పరమగునపుడు నుగాగమమురాదు.

ఇది నిపాతము.

(బా. వ్యా. సంధి 38)

**కె**

తదాది శబ్దముల (ఆ, ఈ, ఏ అనువాని) పై స్త్ర్యర్థమున వచ్చు దేశ్య శబ్దము. ఉదా:- ఆకె. ఈకె, ఏకె (మం. ఆం. కౌ. 890)

**కేతన—మూలఘటిక**

క్రీ. శ. 13వ శతాబ్ది. ఆంధ్రభాషా భూషణమను (చూ.) తొలిపద్యాంధ్ర వ్యాకరణమును రచించెను.

ఇతఁడు సంస్కృత దశకుమారచరిత్రను చంపువుగారచియించెను. ఇతని కందువలన 'అభినవదండి' యను బిరుదము కల్గెను.

యాజ్ఞవల్క్యముని విరచితమగు 'విజ్ఞానేశ్వరము'నకు విజ్ఞానేశ్వరుఁడు రచించిన 'మితాక్షరి' వ్యాఖ్యానము ననువదించెను.

ఇతఁడు తిక్కనకు సమకాలికుఁడు.

**కేవల సంస్కృత శబ్దము**

తెలుఁగు విభక్తిచేరని సంస్కృతశబ్దము. ఇది వికృతిశబ్దములతో సమసింపదు. అట్లుసమసింపఁజేసిన సమాసము దుష్టమగును.

అనేకమాఱులు, అల్పదండు. (బా. వ్యా. సమాస. 8)

**కేవలాంధ్రములు**

సంస్కృత సమములుకాక, సంస్కృతభవ. ప్రాకృతసమ, ప్రాకృతభవ, దేశ్యములైన శబ్దములు వీనినే 'అచ్చ తెలుఁగు' (చూ.) లనియు నందురు.

అసము. జమ్ముఁడు, సిరి, ఇల్లు ఇత్యాదులు.

(అప్ప. I. 100)

**కై**

చతుర్థీవిభక్తి ప్రత్యయము. చూ:- కొఱకు. (చింతా. అజంత.) దీనికి 'కయి' అను రూపాంతరమును కలదు.

**కొడవలి**

ఔపవిభక్తికమగు నీశబ్దమునకు బహువచన రూపము లిట్లున్నవి.

1. కొడవండులు. 2. కొడవండ్లు
3. కొడపఖులు 4. కొడవళ్లు
5. కొడవలులు 6. కొడవండ్లులు
7. కొడవళ్లులు. (బా. వ్యా. అచ్ఛిక. 16)

**'కొను' ధాతువు**

ధాతువునకు దీని నను ప్రయుక్తము గావించుటవలన క్రియాఫలము (చూ.) కర్తృగామి (చూ.) యగును

దీనినే 'ఆత్మనే పదార్థము' అందురు.

దేవదత్తుఁడు వంటకమును వండుకొను చున్నాఁడు.

(బా. వ్యా. క్రియా. 52)

**కొమ్ము**

ఉకారమునకు సంకేతము. [ు]

హల్లులతోఁజేర్చి వ్రాయు నప్పుడిది యుపయుక్తము. కు, ను. (గు.వ్యా.11)

**కొమ్ము దీర్ఘము**

ఊకారము హల్లుతోఁ జేర్చి వ్రాయునప్పటి గుర్తు. [ూ]

కూ, నూ. (గు. వ్యా. 11)

**కొమ్మువయి సంధి**

ఉత్వసంధి. ఇది నిత్యము.

'తప్పక కొమ్మువయి సంధి దనరు' నవి యప్పకవి.

గోవిందుఁడు + ఎప్పుడు ⟶ గోవిందుఁడెప్పుడు.

(అప్ప. V. 64)

**-కొఱకు**

చతుర్థీవిభక్తి ప్రత్యయము. ఇది జేస్ (చతుర్థీవిభక్తి ప్రత్యయములు) స్థానమునవచ్చును. (చింతా. అజంత 22; బా. వ్యా. తత్సమ. 4), సంస్కృతమున 'చతుర్థీ సంప్రదానే' (అష్టా. 2-3-13) ఇత్యాది సూత్రములచే విధింపఁబడిన చతుర్థి వచ్చుచోట్లనిది వచ్చును. ఉదా:- రామునికొఱకు. కోసము అనునది కొఱకు, కై లవలె, చతుర్థీ విభక్తి ప్రత్యయముకాదు చతుర్థ్యర్థమును చెప్పు దేశ్యశబ్దము.

(అహో. అజంత 22)

**కొలకొలగ**

కొలకొల మున్నగు శబ్దముల గణము. సూ:-గ అవి-యివి. కొలకొల, గదిదిగ నిగనిగ, తుకతుక మున్నగు శబ్దములు. ఇవి యనుకరణమున నిపతింపఁబడిన యవ్యయములు ఉదా:- అబ్జరుచి తూర్పు *దిగదిగ* యంచు మెఱసె.

నడవి కాకాళి *కొలకొల* యంచుమునిఁగె
నసమ శరువాలు *నిగనిగ* యంచు నెఱసె
నతివ డెందంబు *తుకతుక* యంచు నుడికె

(వై. చం. అవ్య. 28)

**-కొలఁది**

దఘ్నార్థము నందువచ్చు తద్ధిత ప్రత్యయము.

మోకాలికొలఁది, బొమ్మ కొలది.

(బా. వ్యా. తద్ధిత. 27)

**-కో**

అనుప్రయుక్తమగు 'కొను' ధాతువునకు (చూ.) బహుళముగా నగును.

చదువుకొనక—చదువుకోక

చదువుకొనఁగలడు—చదువుకోఁగలడు.

(బా. వ్యా. క్రియా. 60)

**కోట**

ఇది దేశ్యమని బాలవ్యాకరణము.

వైకృతమని, 'కోట్ట' శబ్దభవమని ప్రౌఢవ్యాకరణము.

(బా. వ్యా. సంజ్ఞా. 21)

(ప్రౌ. వ్యా. ,, ,, )

**కోటి**

ఇది తత్సమము అయినను ఆచ్ఛికశబ్దములట్లు బహువచన రూపములను బొందుచున్నది.

కోటి+లు < కోట్లు / కోటులు

(బా. వ్యా. ఆచ్ఛిక. 12)

**కోర్వాదులు**

'కోరు' మున్నగు ధాతువులు.

వీనికి —ఇమి (చూ.) అను కృత్ప్రత్యయము చేరును. కోరికి, పూనికి వంటి కృదంత రూపము లేర్పడును (బా. వ్యా. కృదంత. 16)

**-కోలు**

భావార్థమందు ధాతువున కనుప్రయుక్తమగు 'కొను' ధాతువుయొక్క 'ట' వర్ణకాంత రూపము నకు 'కోలు' శబ్దము వికల్పముగా నాదేశమగును

ఇచ్చుకొనుట—ఇచ్చుకోలు.

(ప్రౌ. వ్యా. క్రియా. 18)

**-కోలెన్**

పంచమీ విభక్తి

ఇది కాలవాచకముల కనుప్రయుక్తమగును.

నాఁటఁగోలెన్, అప్పటి గోలెన్.

(ఆం. శ. త. II. 68పుట)

**-కోసరము**

(చూ.) కోసము. చతుర్థీవిభక్తి.

(గు. వ్యా. 84 అంశము; వ్యా. భా.వ్యా శబ్ద 4)

**-కోసము**[1]

చతుర్థీవిభక్తి (గు.వ్యా. 84) "పరా। ధీనులు గాక మీరు వసుదేవ కుమారకు ముక్తికోసమై" (అప్ప. IV. 311)

**-కోసము**[2]

చతుర్థ్యర్థమును చెప్పు దేశ్యశబ్దము. కొఱకు, కైలవలె నిది చతుర్థీ విభక్తి ప్రత్యయము కాదు. (అహో. అజంత 22)

**క్తవతు**

సంస్కృతమున భూతార్థవృత్తియగు ధాతువుపై కర్త్ర ర్థమున వచ్చు కృత్ప్రత్యయము. ఇందలి తొలికకారము, చివరి యుకారాము ఇత్సంజ్ఞకములై లోపింపఁగా 'తవత్' అని మిగులును. ఉదా - కృతవాన్ (కృ+తవత్), గతవతీ (గమ్+తవత్+ఈ), స్థితవత్ (స్థా+తవత్) మున్నగునవి లింగత్రయమున క్తప్రత్యయాంత రూపములు. ఈ ప్రత్యయమును సంస్కృత వ్యాకరణమున 'నిష్ఠ' యందురు. (అష్టా 1-1-26, 3-2-102) తెనుఁగున క్తవత్తుప్రత్యయాంతములకు తత్సమములుగా ప్రయోగములేదు. (వై. చం. హలన్త 88)

**క్తవతు ప్రత్యయాంతములు**

'దత్తవాన్' 'కృతవాన్' మున్నగునవి. ఇవి తెనుఁగునఁజేరవు.

(ఆం. కౌ 759)

**క్తవదర్థము**

భూతార్థము. ఈయర్థమునందు 'న' వర్ణక మగును.

వండిన వాఁడు (బా వ్యా. క్రియా 46)

**క్యజర్థము**

'క్యచ్' అర్థము. సంస్కృతమునందలి 'క్యచ్' ప్రత్యయమునకు తెలుఁగున 'వలె' అనునది సమానార్థకము.

'కృష్ణుని వలె నాచరించు చున్నవాఁడు'

(ఆం. కౌ. 741-'42)

**క్రమ నిరపేక్షము**

క్రమమునపేక్షింపనిది.

పూర్వమిది, పరమిది యను నియమమును గోరక, వాక్యమందెల్ల పదములు వలచినట్టు ప్రయోగించుట.

గాలి చల్లగా వీచెను

చల్లగా గాలి వీచెను

వీచెను గాలి చల్లగా

గాలి వీచెను చల్లగా

చల్లగా వీచెను గాలి

ఇట్టి క్రమ నిరపేక్షత్వము సర్వత్ర సాధ్యపడదు. (చూ.) (వ్యా.) క్రమ సాపేక్షము. (బా. వ్యా. కారక. 37)

**క్రమసాపేక్షము**

క్రమము నపేక్షించునది.

వాక్యము నందలి పదము లొకక్రమపద్ధతి ననుసరించి యుండును.

చల్లని గాలి వీచెను.

ఇట 'చల్లని' అను విశేషణము, విశేష్యమునకుఁ బూర్వమందే యుండును (చూ.) (వ్యతి.) క్రమనిరపేక్షము.

**క్త్వాప్రత్యయాంతములు**

పేచివాన్ (వండిన వాఁడు)

ఏయివాన్ (వెళ్లిన వాఁడు)

డిఁచి వాన్ (చెప్పిన వాఁడు) మున్నగు క్త్వాప్రత్యయాంతములగు సంస్కృత శబ్దములు తెలుఁగున బ్రవేశింపవు. (ఆం. కౌ. 760)

**క్వాచిత్కములు**

కొన్నిచోట్ల మాత్రమే యుండునవి.

వ్యాకరణ కార్య విధానములు నిత్యములు, బహుళములు, ప్రాయికములు,

సార్వత్రికములు, క్వాచిత్కములు, వైకల్పికములు, వైభాషికములు అని యేడు రీతులు.

క్వాచిత్కములైన వ్యాకరణకార్యములు "కొన్నింటికి, కొండొకవానికి, కొండొకచో, కొన్నియెడల" ఇత్యాదులచే తెలుపఁబడును.

(రమణి. పుటలు 59-62)

**క్త్వాంతములు**

(క్త్వా+అంతములు) క్త్వా ప్రత్యయ మంతమందుఁగల పదములు. ఏకకర్తృకములగు రెండు క్రియలలో ముందు జరిగినక్రియపై 'క్త్వా' ప్రత్యయము వచ్చును. ఇందలి కకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'త్వా' మిగులును. భుక్త్వా వ్రజతి, స్నాత్వా గచ్ఛతి, ఇత్యాదులలోని భుక్త్వా, స్నాత్వా మున్నగునవి క్త్వాంతములు. సంస్కృతమున ధాతువులకుపసర్గలు చేరినపుడు క్త్వాప్రత్యయమునకు ల్యప్ ఆదేశమగును. (అష్టా. 7-1-37) ఉదా:- ఆగత్య, సంస్కృత్య మొ॥ ఇట్టిపదములను ల్యబంతము లందురు. క్త్వాంతములగుసంస్కృత పదములకు అనుకరణమునందు తప్ప తత్సమములుగా తెలుఁగున ప్రయోగములేదు. (చింతా. సంజ్ఞా. 38) సంస్కృతమున క్త్వాప్రత్యయము వచ్చునర్థమున తెలుఁగునక్రియల చివరివర్ణమునకు హ్రస్వ-ఇకారమాదేశమగును. ఉదా:- ఘటించి, వచ్చి, చని, కని మొ॥

(చింతా. క్రియా. 17)

**క్త్వా ప్రత్యయాంతములు**

కృత్వా, భుక్త్వా, ఇత్యాదులు.
ఇట్టివి తెనుఁగునఁజేరవు. (ప్ర వ్యా. 842)

**క్త్వాప్రత్యయాంతార్థ వాచకములు**

సంస్కృతమునందు 'క్త్వా' ప్రత్యయాంత శబ్దములయొక్క అర్థమునిచ్చు శబ్దములు. అనఁగా భూతార్థక అసమాపక క్రియలు. (చూ.) విచారించి, కాంచి, కరుణించి, మున్నగునవి. ఇవి కళలు.

(అప్ప. V. 29; (చూ.) ఆం. కౌ. 771,'72)

**క్త్వాప్రత్యయాంతార్థ సంధి**

'క్త్వా'అను ప్రత్యయమంతమందుఁగల పదములవంటి తెలుఁగు పదములకచ్చు పరమగుచో సంధిచేయరాదు. ప్రకృతి భావమే యుండును.

కాంచి యాలకించి,

ఎంచి యాలోచించి ఇత్యాదులు.

(అప్ప. V. 82, 83)

**క్త్వార్థేత్తు**

(క్త్వా+అర్థ+ఇత్తు) 'క్త్వా' ప్రత్యయార్థముగల హ్రస్వ-ఇవర్ణము. ఏకకర్తృకములగు రెండుక్రియలలో ముందు జరిగినక్రియను తెలుపు శబ్దముపై సంస్కృతమున క్త్వాప్రత్యయము వచ్చునని. పాణినీయమున చెప్పఁబడినది తెనుఁగున క్త్వార్థమందు ధాతువు చివరి వర్ణమునకు హ్రస్వ- ఇకారము ఆదేశమగును. (చింతా. క్రియా 17) ఉదా:- వచ్చి, మ్రొక్కి మొ॥ వీనిలోని చివరి ఇవర్ణము క్త్వార్థేత్తు. ఈ క్త్వార్థే కారమునకు అచ్చు పరమగునపుడు సంధిరాదు. ఉదా:- వచ్చియిచ్చెను, చేసియడిగెను. మొ॥ (అథ. కా. సంధి 6)

**క్రార**

రేఫ ఇతర హల్లులపైని గూడునపుడు క్రార యనఁబడును. [ ‿ ]

(ప్ర. వ్యా. సంజ్ఞా. 43)

**క్రారవడి**

(చూ.) క్రార

(గు॰ వ్యా. 12)

**క్రారకొమ్ములు**

కొమ్ముతోఁగూడిన హల్లులకు క్రార చేర్చుట. క్రు, త్రు మున్నగునవి.

తెలుఁగులో క్రారకొమ్ములేకాని వట్రువలులేవు. రెండును నుచ్చారణముసందొకటిగనే యుండునుగాన భ్రాంతిపడరాదు.

త్రుళ్లె. క్రుంకె అని వ్రాయవలెనే కాని తృళ్లె, కృంకె యని వ్రాయరాదు.

(అప్ప. II. 66, 71)

**క్రియ**

(i) వ్యాపార వాచకము

(ల.వ్యా. క్రియా. 1; సం. వ్యా. క్రియా. 1)

(ii) వాక్యములో కర్తచేయు పనిని దెలియఁజేయుచు, వాక్యమును బూర్తిచేయునది.

మిత్రుఁడు వచ్చెను, ఆవుపాలిచ్చెను (అం, భా. శా. సంజ్ఞా 81)

(iii) ధాతువు (చూ.) భూతాదిక్రియావృత్తియైనపుడు క్రియ యనఁబడును. వచ్చు, ఉండు, పోషించు మొదలైనవి ధాతువులు. వీనికి డు, రు, వు, రు, ను, ము అను క్రియా విభక్తులు చేరునపుడు క్రియారూపములు నిష్పన్నములగును.

వచ్చుచున్నాఁడు, వచ్చుచున్నారు
వచ్చిరి, వచ్చితిని, వచ్చితిమి మున్నగునవి.

(ఆం. భా. శా. సంజ్ఞా. 47)

**క్రియాకాంక్షములు**

క్రియను కోరునవి.

తుమున్నర్థము, క్త్వార్థము, శత్రర్థము (చూ.) మున్నగునవి.

పడున్; పడి; పడక; పడుచున్ ఇత్యాదులు.

(సం. వ్యా. క్రియా. 18.)

**క్రియాజన్య విశేషణములు**

ధాతువుల వలనఁబుట్టిన విశేషణములు. వీనినే ధాతుజ విశేషణము (చూ.) లనియు నందురు.

వచ్చిన రాముఁడు, ఇచ్చిన గోవులు.

( ఆం. భా. శా. విశే. 7 )

**క్రియాజన్య విశేష్యములు**

ధాతువులకు కొన్ని ప్రత్యయములను జేర్చుటచే నేర్పడిన నామరూపములు.

అలుక, కలిమి, కోఁత—వీనినే (చూ.) కృదంతములనియు నందురు.

(సం. వ్యా. విశే. 9.)

**క్రియాదికము**

క్రియ మొదలగునవి.

క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము

(ప్రౌ. వ్యా. వాక్య. 6)

**క్రియానిహిత నామములు**

క్రియారూపములు వెంటనే స్పష్టపడక, దాగియున్న నామములు.

తోఁట—ఇది 'తోఁడు' అను క్రియనుండి నిష్పన్నమైనది.

ప్రొద్దు < పొఱుదు < *పొఱు=పొడుచు.

(తె. వ్యా. వి. పుట 824)

**క్రియాన్వయ వాక్యములు**

సమాపక క్రియలతో నన్వయించు వాక్యములు.

వాఁడు వచ్చెనేని వీఁడు వచ్చును. ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. వాక్య. 9.)

**క్రియాప్రయుక్త విశేషణము**

విశేషణముగాఁ బ్రయోగింపఁబడినక్రియ.

పోవు వాఁడు, వచ్చు మనుజుఁడు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 3)

**క్రియాఫలము**

'క్రియ' యనఁగా వ్యాపారము. వ్యాపారము వలన సిద్ధించునది క్రియాఫలము. దేవదత్తుఁడు వంటకమును వండెను—వండె నన‌ఁగా వంటచేసెనని యర్థము. వంట ఫలము. చేయుట—వ్యాపారము.

(బా వ్యా. క్రియా. 52)
( ,, కారక. 2)

**క్రియా విభక్తులు**

ధాతువునకుఁజేరు విభక్తులు -డు(ఁ్), -రు; -వు -రు; -ను, -ము అనునవి.

వచ్చుచున్నాఁడు — వచ్చుచున్నారు

వచ్చుచున్నావు — వచ్చుచున్నారు

వచ్చుచున్నాను — వచ్చుచున్నాము

(బా. వ్యా. కారక. 34)

**క్రియావిశేషణములు**

క్రియాపదముల ధర్మములను దెలుపునవి. ఇవి క్రియలయొక్క అర్థములను హెచ్చింపఁగలవు. తగ్గింపఁగలవు. వేఱుచేయగలవు.

వడిగా వచ్చెను

ఎంతయు నొవ్వఁగూర్చెను.

పెద్దయు మెచ్చె.

(అ. ఛం. V. 12; ఆం. కౌ. 767, '68)
(ఆం. భా. శా. విశే. 8)

**క్రియావిశేష్యము**

పోషించుట, వ్రాయుట.

(మ. ప. వ్యా. శబ్ద. 1.)

**క్రీఁగడుపు క్రీఁగాలు, క్రీఁదొడ ఇత్యాదులు**

క్రిందు+ కడుపు; క్రిందు+కాలు; క్రిందు+తొడ, 'క్రిందు' శబ్దము 'ప్రాఁతాదుల'లోనిది. (చూ.) ఇందలి తొలియచ్చుమీఁది వర్ణములకు లోపమురాగా 'క్రి' శబ్దము మిగులును. దానిపై 'ను' గాగమము వచ్చును. హ్రస్వముపైనది పూర్ణబిందువు గావలయును, దీనికి భిన్నముగా 'క్రి' లోని యచ్చు దీర్ఘముకాగా ఖండబిందువు మాత్రమే యగును.

క్రి+కడుపు; క్రి+ను+కడుపు → క్రి+ను+గడుపు→ క్రీఁగడుపు ఇత్యాదులు. (బా. వ్యా. సంధి. 88)

**క్రీడా విశేష వాచకములు**

ఆటల పేళ్లు. ఇవి నిత్య బహువచనాంతములు.

అచ్చన గాయలు, ఓమన గుంటలు మున్నగునవి.

(ప్రౌ. వ్యా. శబ్ద. 88)

**క్లీబ తుల్యములు**

నపుంసక లింగముతో సమానములగు సంస్కృత శబ్దములు.

కంథరాదులు (చూ.) సంస్కృతమునందు స్త్రీలింగములు. ఇవి తత్సమము లగునపుడు దీర్ఘమునకు హ్రస్వము, ప్రథమైక వచనలోపము కల్గినరూపమేకాక, 'ము' వర్ణకము చేరిన రూపములును నేర్పడు చున్నవి. 'ము' వర్ణకము చేరిన రూపములు సాధింపఁబడవలయునన్న వీనికి క్లీబతుల్యత నతిదేశింపవలయును.

కంథరా < కంథర<br>కంథరము. ఇత్యాదులు.

(బా. వ్యా. తత్సమ. 66)

**క్లీబత్వము**

నపుంసక లింగత్వము. ఇట్టి నపుంసకలింగత్వ మారోపింపఁబడిన రూపము లకుదెల్పుఁగున 'ము' వర్ణకము చేరును.

మహతీతరములగు (చూ.) స్త్రీలింగముల విశేషణములకు క్లీబత్వము వికల్పముగా నగును. అందుచే మువర్ణకము చేరును.

హృద్యా యగు విద్యా. (స్త్రీలింగములు)

హృద్యా మగు విద్య (క్లీబము)

**క్లీబములు[1]**

నపుంసక లింగములు. మిత్రశరణ ప్రధాన పాత్రాదులు.

(బా. వ్యా. తత్సమ. 18)

**క్లీబములు[2]**

నపుంసకములైన స్వరములు.

ఋ, ౠ వీనికి రు. లు అను వ్యంజనోచ్చారణము కలదు. అందుచేతనే ప్రాకృత భాషలలో నివిలోపించినవి. (గు. వ్యా . 8 అంశము)

**క్లీబసమములు**

నపుంసకలింగ సమములగు ఆచ్ఛికశబ్దములు. తుల్య సమశబ్దములు సమానార్థకములే యైనను, వ్యాకరణ శాస్త్రీమునందు క్లీబతుల్యములను (చూ.) వ్యవహారము సంస్కృత శబ్దముల పట్లను, క్లీబసమములను వ్యవహారము 'ము' వర్ణకాంతములగు ఆచ్ఛిక శబ్దముల పట్లను గావింపఁబడెను.

బియ్యము, నెయ్యము, కయ్యము మున్నగునవి.

(బా. వ్యా. ఆచ్ఛిక. 2)

**క్విప్ప్రత్యయాంతములు**

సంస్కృతమునందు 'క్విప్' ప్రత్యయము ఆచారార్థమునందు వచ్చును. అట్టి దానికి పర్యాయముగాఁ దెలుఁగునందు భావప్రకటన మిట్లుండునవి ఆంధ్రకౌముది కర్త యిట్లు పేర్కొనెను.

ఇలకుఁ గోకగుచున్న సంద్రంబు.

'అశ్వతి', 'గార్దభతి' అను 'క్విప్' ప్రత్యయాంతములకు తుల్యముగా తెలుగున 'అశ్వమగుచున్న' 'గార్దభమగుచున్న అని చెప్పనగునని తత్కర్త యభిప్రాయము

(ఆం. . కౌ 727,'28)

**క్రొత్తాదులు**

క్రొత్త, నెఱ, ముందు, పెను-మున్నగు పదములు. క్రొత్తాదులలోనివి. ఇది యాకృతి గణము.

వీనిలు త్తశేషములకు గ్రొన్నియెడల నుగాగమమును, కొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వమును నగును.

క్రొత్త+చాయ ⟶ క్రొంజాయ

క్రొత్త+తావి ⟶ క్రొత్తావి

నెఱ+మనము ⟶ నెమ్మనము

ముందు+కోపము ⟶ ముంగోపము

(బా. వ్యా. సంధి. 38; ప్రౌ. వ్యా. సమాస. 7)

**ఖ**

ఆంధ్ర భాషావ్యంజన సముదాయమునందు రెండవది.

ఇతర లక్షణములకు చూ. క[1]

మహాప్రాణము

ఖడ్గము, ఖరము, మున్నగు సంస్కృత సమములనుగూడి యిది వ్యవహరింప బడును. (ప్రౌ. వ్యా, సంజ్ఞా. 1; బా. వ్యా. సంజ్ఞా. 4)

**ఖండబిందువు**

(*i*) అర్ధబిందువు /ఁ/

ప్రాచీన శాసనములందుగాని, తాటియాకు ప్రతులలోగాని ఈ గుర్తులేదు. ముద్రణయంత్రముతోపాటిది యేర్పడినది. (చూ. తెలుగు మెఱుఁగులు—శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి—అరసున్న పుట 63)

(*ii*) కావ్యభాషలోనిది యుచ్చారణమును గోల్పోయిన అనునాసిక చిహ్నము-అఁకలి, చీఁకటి, మఱఁదలు అరఁటి ఇత్యాదులు. కాని నేటి వ్యవహారభాషలో అనునాసికోచ్చారణ సూచకముగా నాటకములలోను, నవలలలోను నిది యుపయుక్తము—అఁ, ఊఁ, మ్మాఁవఁయ్య ఏఁవోఁయ్.

(తె. వ్యా. వి. పుట. 111)

**ఖు**

ప్రాకృత వ్యాకరణమున ఆది వర్ణమునకు సంజ్ఞ (వాల్మీ 1-1-9, వై.చం. సంజ్ఞా 9) ఈ సంజ్ఞ వై. చం. యందు వాడబడినది (వై. చం. తద్భవ 8)

**గ[1]**

ఆంధ్రవర్ణ సమామ్నాయము నందలి వ్యంజనములలో మూఁడవవ్యంజనము.

ఇతర లక్షణములకు (చూ.) క[1]

నాదము. (ప్రౌ. వ్యా. సంజ్ఞా. 1)

**గ²**

ప్రాకృత వ్యాకరణమున గణమును తెలిపెడి ఆదిశబ్దమునకు సంజ్ఞ. గుణాదు లనిచెప్పుటకు 'గుణగ' అనిచెప్పుట మొ॥ (వై. చం. సంజ్ఞా 11, వాల్మీ1-1-10 ఇట్టే కుశగ, దారగ, చెల్లగ, కొలకొలగ, ఖడ్గగ మున్నగునవి. (వై .చం. అజంత 34, 65, అవ్య. 24, 28, స్త్రీ. 19)

**గకారము వకారమగుట**

తెలుఁగు పదము లందలి అనాది గకారము కొన్నిచోట్ల వకారమగును.

పగడము—పవడము

నురుగు—నురువు

(స. సా. సం. I. సంధి. 201)
(ఆం. కౌ. 883-884)

**గ, జ, డ, ద, బ, లు**

వర్గతృతీయ వర్ణములు. వీనికే సరళములను (చూ.) ప్రసిద్ధవ్యవహారము. ఇట తాలవ్యజకారము మాత్రమే పేర్కొనఁబడిన దంత్య జకారము కూడ గ్రహింప వలసియున్నది. (బా. వ్యా. సంజ్ఞా. 8)

**గట్టిసొట్టు**

పూర్ణబిందువు లేక దీర్ఘబిందువు. దీనినే పూర్ణానుస్వారమనియు నందురు. (౦) ఇది ఆచ్ఛికమగు వ్యవహారము. (అప్ప. II. 22)

**గతాదులు**

ఠ, డ, థ, ద, ధ, ఱ, గ, జ, బ, మ— ఈ పది వర్ణములకు గతాదులని పేరు. వీనికి ముందున్న ద్రుతము బిందువుగా మాఱును

(గు వ్యా. సంధి. 64,65)

**—గడ**

కొన్ని ధాతువులకుఁజేరు కృత్ప్రత్యయము. విఱుగడ, తేరుగడ, దిద్దుగడ,
(ఆం. కౌ. 801-'2)

**గతి తత్పురుషములు**

గతి సంజ్ఞాకములతో (చూ.) నేర్పడిన తత్పురుష సమాసములు.

అస్తమయము, సత్కారము, అలంకృతి, పురస్కారము, తిరస్కారము — మున్నగునవి. (సు. వ్యా. సమాస. 52)

**గతివిరహిత ధాతువులు**

(చూ.) అగతికములు.

గతి సంజ్ఞగల ప్రాదులతోఁగలియని కేవల ధాతువులు.

భూ, సృ. కృ, రేకృ, లోచ, పచి, లప ఇత్యాదులు.

వీనికిఁదెనుఁగునఁ బ్రవేశము లేదు.

'ప్రభవించు' అని యుండునే కాని 'భవించు' అని యుండదు.

(బా. వ్యా. క్రియా. 121)

**గతి సంజ్ఞాకములు**

గతి సంజ్ఞ కలవి

ప్రాదు లిరువది రెండును; ఊరీప్రభృతులును; సాక్షాత్ప్రభృతులును గతి సంజ్ఞాకములు.

(బా. వ్యా. క్రియా. 121)

**గత్యర్థకములు**

గతి+అర్థకములు.

సంస్కృతమునందు గమనార్థక ధాతువులు 'పొందుట' యను నర్థమునిచ్చును. (యే గత్యర్థకాః తే ప్రాప్త్యర్థకాః)

'పొందు' మొదలయినవి గత్యర్థకములు. అప్రేరణమునందు) వీని కర్తలు, ప్రేరణార్థమునందు కర్మములగును.

ఉదా : మైత్రుఁడు గ్రామమును బొందెను. (అప్రేరణము)

చైత్రుఁడు మైత్రుని గ్రామమును బొందించెను. (ప్రేరణము)

(బా. వ్యా. క్రియా. 128)

**గద్య చింతామణి**

కర్త : శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులు

ప్రాచీనకాలమునందును గద్యరచన వ్యవహారభాషలోనే జరిగెనని నిరూపించుటకు అనేక గద్యభాగము లిందు నిరూపితములు.

**-గలక్**

చేయుచున్నాఁడను నర్థమున విహితమైన ఇంచుకున్ పరమైనపుడు దేశ్య ధాతువునకు వచ్చు ఆగమము. ఇందలి కకారమిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- ఒడుగలింపుచున్నాఁడు, వరగలింపుచున్నాఁడు మొ॥ ఆగమ శాస్త్రమనిత్యమగుటచే నీ యాగమము ఇనుమడింపుచున్నది మున్నగుచోట్ల రాదు.

(వై. చం. తిజంత 199)

**గలగాగమము**

(గలక్+ఆగమము) చూ:- గలక్

**గసడదవలు**

ప్రథమా మాత్రము కంటె పరమందున్న పరుషములకు వచ్చు ఆదేశ వర్ణములు. ఉదా:- సిరిగలవాఁడు, దానముసేయున్, ఒరుఁడుడెక్కుల, తనయిల్లు దామర తంపర, నిజమువలుకున్ మొ॥ తాను, నేను శబ్దములకు పరమందున్న పరుషములకు మాత్రము గసడదవలు రావు. ఉదా:- తాఁజదివె, నేఁజదివితిన్ మొ॥ (చింతా. సంధి. 28. బా. వ్యా. సంధి. 18)

సంస్కృత సమేతరములైన శబ్దములకంటె పరమగు సంస్కృత శబ్దాది యందున్న పరుషములకు గసడదవలు రావు. ఉదా.- దొర కరుణించె, సిరి చంచలము, మా యయ్య టంకాయుధుఁడు, నా వేల్పుతోయాధిపతి, వీఁడు పావనుఁడు మొ॥ (చింతా. సంధి. 24). ద్వంద్వ సమాసమున పదముకంటె పరమందున్న పరుషములకును గసడదవలు ఆదేశములగును. ఉదా:- అరిగోరులు, కాలుసేతులు, టక్కుడెక్కులు, తల్లిదండ్రులు, ఊరువల్లెలు మొ॥

(చింతా.సంధి. 32)

**గసడద వాదేశము**

ప్రథమావిభక్తి పయినిలుచు 'కచటతప' లకు 'గసడదవ' ల యాదేశము వికల్పముగా నగును

వాఁడు కొట్టె, వాఁడుగొట్టె
చూ. గ స డ ద వ లు

(స సా. సం. I. సంధి. 98, 99)

**-గాఁడు**

కలఁవాఁడు ఇత్యాద్యర్థములందువచ్చు తద్ధితప్రత్యయము. ఇది పుంలింగమున ఏకవచనముకంటె పరముగా వచ్చును ఉదా:- అందగాఁడు మొ॥ (అథ. కా. 50, 51; ఆం. కౌ. 687, 688) చూ:- కా 2.

**గాదులు**

గ, జ. బ, మ—ఈ నాల్గువర్ణములకు గాదులు అనిపేరు.

చూ, గతాదులు

(గు. వ్యా. 64 అంశము)

**గిదుసులు**

హ్రస్వములు

(అప్ప. II. 10)

**గిత్వము**

పలుకులను జంటగాఁగూర్చి నుడువుచో రెండవనుడి మొదటి వ్రాఁతకి గిత్వము వచ్చును.

పులి—గిలి, విల్లు—గిల్లు, చూ. గి గీలు (కా. చూ. IX. 167, 168; ఆం. కౌ. 881-882)

**గి గీ లు**

నిందయందా మ్రేడితము యొక్క ఆద్యక్షరము హ్రస్వమగుచో 'గి'; దీర్ఘమగుచో 'గీ' ఆదేశమగును.

కుంభ కర్ణుఁడు+కుంభకర్ణుఁడు→కుంభకర్ణుఁడు, గింభకర్ణుఁడు.

రావణుఁడు+రావణుఁడు→ రావణుఁడు, గీవణుఁడు.

(బా. వ్యా. ప్రకీ. 22)

**గిణ్వాదులు**

'గీఙు' మున్నగు ధాతువులు.

వీనికి 'అ' వర్ణకము పరమగుచో కృదంత రూపము లేర్పడును.

గీఙు+అ→గీఙ.

(బా. వ్యా. కృదంత. 18)

**గుగాగమము**

గుక్+ఆగమము. కిత్సంజ్ఞ.

అడ్డాదులకు ఇంచుక్కు పరంబగునపుడుఁ గుఁక్ అనునాగమ మగును.

అడ్డగ్+ఇంచు(క్)→అడ్డగించు

అప్పగ్+ఇంచు(క్)→అప్పగించు

(బా. వ్యా. క్రియా. 79)

**గుంజాదులు**

(గుంజా+ఆదులు) గుంజా శబ్దపర్యాయమగు గురిగింజ మున్నగునవి. అవి గురిగింజ, కణ్ణ, కుంచె, కాసు, రూక మొ॥ వీనిపై ప్రమాణార్థమున 'అంత' యను ప్రత్యయము వచ్చును. (మం. అ. కౌ. 395)

**-గు**

గుణవాచకమగు దేశ్యశబ్దముమీఁద ఇంచుక్కు పరమగునపుడువచ్చు ఆగమము. ఉదా:- తెల్లగింపు చున్నది, సన్నగింపుచున్నది. ఒకానొకచో గుణవాచకము కాని దేశ్య శబ్దముపైని గూడ నీయాగమము వచ్చును. ఉదా.- బారగింపు చున్నది.

(వై. చం. తిఙంత 201)

**గుగాగమము**

(గుక్+ఆగమము) చూ:- గుక్.

**గుఙ్**

బిందుపూర్వక 'గు' వర్ణము.

రేను, గోను, శబ్దములందలి నువర్ణము బహువచనము పరంబగుచో 'గు'ఙగు.

రేను---రేఁగు---రేఁగులు.

గోను---గోఁగు---గోఁగులు.

(బా. వ్యా. ఆచ్ఛిక. 19)

**గుజ్జులు**

హ్రస్వములకు గుజ్జులనియు వ్యవహారము. (అప్ప. II. 10)

**గుడి**

ఇకారమునకు హల్లులతోఁజేర్చి వ్రాయునప్పటిగుర్తు

'ి' కి, గి ఇత్యాదులు. (గు. వ్యా 11)

**గుడిదీర్ఘము**

ఈ కారము హల్లులతోఁజేర్చి వ్రాయునప్పటి గుర్తు.

'ీ' కీ, గీ (అప్ప II. 8; గు వ్యా. 11)

**గుణపదము**

గుణమును వర్ణించునట్టి పదము.

దీనినే గుణవాచకమందురు. (చూ.) ఇది విశేషణము (చూ.)

(క. చిం. సంజ్ఞా 20)

**గుణప్రయుక్త విశేషణము**

గుణవాచకము విశేషణముగాఁ బ్రయుక్తమైనది.

నల్లనివాఁడు (ప్రౌ. వ్యా. శబ్ద. 3)

**గుణము**

వస్తువుయొక్క ధర్మము

సముదాయమునుండి గుణమునుబట్టి యొకవస్తువును బృథక్కరించుటకు షష్ఠీ విభక్తియగు 'లోపల' శబ్ద ముపయుక్తము.

గోవుల లోపలఁ గపిల బహుక్షీర. (బా. వ్యా. కారక. 16)

**గుణములు**

అ, ఏ, ఓ—ఈ మూఁడును గుణములని పాణిని వ్యవహరించెను. ఋస్థానికం బగు గుణము రపరంబయి యుండు. (రేఫపరమందుఁగల్గియుండుననఁగా 'అర్' అని యర్థము.)

సంస్కృత ధాతూపధలకు ఇ,ఉ,ఋ అనువానికి సొరిదిని ఏ,ఓ, అర్ అనునవి యిఁచుక్కు పరంబగునపుడగునని యెఱుంగునది.

ఛిద్—ఛేదించు, ఘుష్—ఘోషించు

వృష్—వర్షించు. (బా. వ్యా. క్రియా. 66)

**గుణయోగము**

గుణములతోఁగలయిక ఇటఁబురుష గుణసాదృశ్యము గోచరించును.

సముద్రుఁడు, మేఘుఁడు, హిమవంతుఁడు, మైనాకుఁడు మున్నగునవి.

(ల. వ్యా. సుబన్త. 18)

**గుణవచనములు**

(i) గుణవచనములనుదెల్పు విశేషణములు. నల్లాదులు (చూ) వీనికి భావార్థమునందు న వర్ణకము చేరును.

నల్లన, తెల్లన, పచ్చన, మొదలైనవి.

(ii) కర్మధారయ సమాసమునందు వీనికి నిగాగమము బహుళముగానగును.

నల్లనివాఁడు, తెల్లనిగోడ (బా. వ్యా. తద్ధిత. 6; సమాస.12)

**గుణవదాదులు**

'గుణవత్' శబ్దము మున్నగునవి.

వీని ద్వితీయైకవచనాంత తుల్య రూపములు తెలుఁగునందు ప్రాతిపదికము లగును. అంత్యవర్ణమునకు లోపము గల్గును.

గుణవంత(మ్) { గుణవంతుఁడు / గుణవంతురాలు / గుణవంతము.

ఇట్లే బుద్ధిమంతమ్, శ్రీమంతమ్, విద్వాంసమ్ మున్నగునవి.

(ల. వ్యా. హలన్త. 52; బా. వ్యా. తత్సమ. 70)

**గుణవాచక దేశ్య విశేషణములు**

గుణములను దెల్పు దేశీయములగు విశేషణములు. ఇవి నిత్యైక వచనాంతములు. (ప్రౌ. వ్యా. శబ్ద. 33)

**గుణవాచకములు**

విశేష్యముల గుణములను దెలుపునవి గుణ విశేషణములు.

తెల్ల, మంచి, నిగ్గు ఇత్యాదులు.

(రూపము రసము, స్పర్శము మున్నగునవి గుణములు.)

(సం. వ్యా గుణ. 8)

**గుణవిశేషణము**

తెల్ల, నల్ల, పుల్ల. మున్నగు విశేషణములయిన గుణవాచకములు. (చూ.)

(మ. ప వ్యా. విశే 2)

**గుణవిశేష్యములు**

ధైర్యము, సాహసము మున్నగునవి.

(మ ప. వ్యా. శబ్ద. 1)

**గుణవర్ధనము**

(చూ ) గుణవదాదులు.

(చింతా. హలంత. 2; కవిజనాం. 67 పత్రము)

**గుణసంధి**

అకారమునకు ఇ. ఉ, ఋ, లు పరమగుచో ఏ, ఓ, అర్, లు క్రమముగా నేకాదేశమగును.

గుణములు (చూ.) వచ్చు సంధి కావున గుణసంధి.

పరమ+ఈశ్వరుఁడు — పరమేశ్వరుఁడు

సూర్య+ఉదయము—సూర్యోదయము

దేవ+ఋషి—దేవర్షి. దేవఋషి

(ఆం. భా. శా. సంధి. 95–97)

**గుణాదివాచక విశేషణములు**

గుణము మున్నగువానిని దెలుపు శబ్దములు

స్వభావము, అవస్థ, శక్తి, సామ్యము మున్నగువానిని ఆదిశబ్దముచే గ్రహింప నగును.

సుందరుఁడు, ప్రియుఁడు, సితపద్మము, మధురవచనము, బల్లిదుఁడు, వచ్చి నట్టివాఁడు. (ఆం. భా. శా. విశే. 2)

**గుణాదివాచకములు**

గుణము, స్వభావము, అవస్థ, భావార్థకము, ధాత్వర్థము మున్నగువానిని దెలి పెడి శబ్దములు.

ఇవి ప్రాణినో, వస్తువునో ఆశ్రయించియుండును. కావున వీనినొక తర గతిలోఁజేర్చనగును.

తామరపువ్వు, తీపి, మంచి, తెల్లన, ఎత్తు, పొడుగు, బాల్యము, మెలఁకువ సుఖము, చావు.

(ఆం. భా. శా. నామ. 10)

**గురుమంతము**

గురువు గలది. గురువుగాగల ధాతువు. దీనికి 'ఇయుడాగమము' రాదు (చూ.)

యాచ్, అర్థ ఇత్యాదులు.

(బా. వ్యా. క్రియా. 50)

**-గుఱించి**

ద్వితీయా విభక్తి.

హరి గుఱించి తపమాచరించె.

(ఆం. కౌ. 139 పంక్తి)

**-గుఱిచి**

ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచి కూడ నను ప్రయుక్తమగును.

'మము గుఱిచి నామగోత్ర క్రమమున' చూ కూర్చి.

(ప్రౌ. వ్యా. కారక. 2)

**గోత్రాపత్యార్థకములు**

'వంశమునందుఁబుట్టిన సంతతి' యను నర్థము నందుఁజేరు తద్ధిత ప్రత్యయ ములు అంతమందుఁగల శబ్దములు.

గార్గ్యుఁడు – గర్గుని వంశమునందుఁబుట్టినవాఁడు.

(ఆం. భా. శా. సమాస. 28)

**గోపాల కృష్ణయ్య, వడ్లమూడి**

1. ధ్వని-లిపి-పరిణామము

2. వ్యావహారిక భాషావ్యాకరణము (చూ.)

అను లక్షణ గ్రంథములను రచించి కీర్తిగడించినవారు.

**గురుమూర్తి శాస్త్రి రావిపాటి**

క్రీ. శ 1770-1836.

చెన్నపురి ఫోర్టుసెంటు జార్జి కళాశాల ప్రధానోపాధ్యాయ పదవి నలంకరించిన పండితుడు. ఆంధ్ర భాషాసేవ గావించిన ఏ. డి. కాంపుబెల్, సి. పి బ్రౌన్ మున్నగువారి ప్రశంసలనందుకొన్నవారు. ప్రభుత్వముచే 'శాస్త్రి' బిరుదమును గూడ నీతడందుకొనెను.

ఇతఁడు శిష్టవ్యవహార రూపములనుగూడ తన వ్యాకరణమునందుఁ (చూ. తెనుఁగు వ్యాకరణము) ప్రదర్శించెను. ఈతని వ్యాకరణమును బాలవ్యాకరణకర్త పరవస్తు చిన్నయసూరి (చూ ) కొన్ని యేండ్లు పాఠమును జెప్పెను.

ఈతని 'విక్రమార్క కథలు' వచన రచనలోఁ బ్రసిద్ధము.

**గురువు**

దీర్ఘము, సంయుక్తపరకము, సానుస్వారము, విసర్గయుక్తము నయినస్వరము.

యాచించి, అర్థించు, ప్రశంసించు, దుఃఖించు. (బా. వ్యా క్రియా. 60)

**గృహ్ణాత్యర్థకము**

(గృహ్ణాతి+అర్థకము) గ్రహ=ఉపాదానే యను సంస్కృతధాతువు అర్థము గల 'కొను' అనునది. (చింతా. క్రియా. 38) ఇది యాత్మనేపదార్థమున ధాతువుకనుప్రయుక్తమగును. ఉదా:- చదువుకొను, వ్రాసికొను మొ॥

**గోయి ప్రకృతులు**

'గోయి' మున్నగు శబ్దములు.

వీనికి విభక్తి పరమగుచో తుది యక్షరమునకు 'తి' వర్ణమగును.

గోయి+లు—గోతులు

గోయి+ని—గోతిని—ఇట్లే గోతులందు.

నూయి, వాయి, చేయి మున్నగునవి.

(బా. వ్యా. అచ్చిక. 85)

**గో శబ్దము**

(i) ఈ శబ్దమునకు ఉకారాంత శబ్దములకు వలె 'వు' వర్ణకము చేరును

గో—గోవు

(ii) వు వర్ణకేతర విభక్తి పరమగుచో ఈశబ్దమునకు నిత్యముగా వుగాగమ మగును.

గోవులు, గోవులతో ఇత్యాదులు

(బా. వ్యా. తత్సమ. 48, 49)

**గౌణక్రియ**

అసమాపక క్రియ (చూ.)

(తె వ్యా. వి పుట 778)

**గౌణము**

అప్రధానము.

సమాసాంతర్గతమైన పదప్రవృత్తి గౌణము. ఇతర పదప్రవృత్తి ముఖ్యము విశేషణము అప్రధానము. విశేష్యము ప్రధానము.

"హతరాజుఁడు పరశురాముఁడు" అనుచో 'హత' 'రాజ' శబ్దార్థములు గౌణములు. 'పరశురామ' శబ్దార్థము ముఖ్యము. (క. చిం. సంజ్ఞా 44)

**గ్రహణము**

కొనుట ఈ యర్థమునందు వలన వర్ణకము వచ్చును.

మైత్రుని వలన ధనంబు గొనియె. (బా. వ్యా. కారక. 9)

**గ్రహ్యాది యోగజమగు పంచమి**

కొనుట ఎఱుఁగుట, వినుట మున్నగునవి గ్రహ్యాదులు. ఇట్టి యర్థముల కలయిక యందుఁగలిగిన పంచమీ విభక్తి—గ్రహ్యాది యోగజమగు పంచమి—వలన.

ఇట్టి పంచమికి మాఱుగా-'చేత' వర్ణకమును గూడ నుపయోగింపనగును.

1 జరాసంధుఁడు రాజుల వలన గప్పంబు గొనియె

2. మైత్రుఁడు చైత్రుని వలన ఋణము గొనియె

3. ఈ యర్థము నీ వలన నెఱింగితి.

4. ఈ వృత్తాంతమును నీ వలన వింటిని

—'వలన' కు మాఱుగా—'చేత' వర్ణకమును కూడ నుపయోగింపనగును.

(బా. వ్యా. కారక. 4)

**గ్రామ్యము**

గ్రామమునకు సంబంధించినదని శబ్దార్థము. నాగరికము కానిది. మొరటైనది.

ఇది రెండు విధములు – (i) అర్థసంబంధము. (ii) శబ్దసంబంధము. అర్థ సంబంధమైన గ్రామ్యము అలంకార శాస్త్రమునకుఁజెందినది. శబ్దసంబంధమైనది. వ్యాకరణ శాస్త్రమునకు సంబంధించినది. కొందఱు దీనిని నిరూపించుటలో ఈ రెండింటికి సాంకర్యమొనర్చినట్లు కనిపించును—

(i) అక్షర విలోపమై, నియమ మెడలిన పలుకు. దీనిని అపభ్రంశకమనియు నందురు. (అప్ప. I. 124; స. సా. సం. I. 65)

ఆడ, ఈడ, అషు, ఇషు, బామ్మఁడు.

(ii) ఇతరులను నిందించుపట్లగాని, పరిహాసము చేయుపట్లగాని, దీనినుపయోగింతురు. (అం. భా. భూ. 27; కా. చూ. IV. 20. ఆం కౌ. 52-56)

(iii) లక్షణమునకు విరుద్ధముగా సర్వజనులచేత సాధారణముగా వ్యవహరింపఁబడు మాటలు. ఇవి గ్రంథములయందుపయోగపడవు. ఒకటొకటి మాత్ర ముపయుక్తము. (గు. వ్యా. 82)

(iv) తత్తజ్జాతి వర్ణనమునందు దీనిని వాడుదురు.

"మొక్కేముసామి" "బాగెము సేసినాము (ప్రౌ. వ్యా. సంజ్ఞా.14)

(v) శిష్టవ్యవహార విరుద్ధమైన భాష : కూకో, వస్తది

(వ్యా. భా. వ్యా. సంజ్ఞా)

**గ్రామ్యపదములు**

లక్షణ విరుద్ధములైన పదములు. (చూ.) గ్రామ్యము. దినవెచ్చము, కరకంఠుఁ డున్నగునవి. ఇట్టివి కొన్ని కృతులం దొప్పును

(స. సా. సం. II. సమాస 20-22)

**గ్రామ్యోక్తులు**

గ్రామ్యమునకు సంబంధించిన పదములు. వస్తాఁడా? తెస్తాఁడా? చూస్తాడా? మున్నగునవి.

(అప్ప. I 125)

**ఘ**

ఆంధ్ర వ్యంజనమాలలో నాల్గవ వర్ణము. మహాప్రాణము

ఘటము, ఘాతము మున్నగు సంస్కృత సమములను గూడి . ఆంధ్రభాషలో వ్యవహరింపబడును.

(బా. వ్యా. సంజ్ఞా 4; ప్రౌ. వ్యా. సంజ్ఞా 1)

**ఘంటాపథము**

బాల వ్యాకరణమునకు నవీనముగా వెలసిన వ్యాఖ్యలలో నిది యొకటి. (1970)

కర్త: శ్రీ వంతరాం రామకృష్ణరావు

బ్రహ్మశ్రీ దువ్వూరు వేంకట రమణశాస్త్రి గారివలన వ్యాకరణ ప్రవీణుఁడైన ఈతఁడు ఉత్తమ వ్యాఖ్యలు రచించు సదాశయమును గలవాఁడుగాఁగనుపట్టును.

**ఘోషలు**

ఘోష ప్రయత్నముచే నుచ్చరింపఁబడు వర్ణములు—వర్గతృతీయ, చతుర్థ పంచమాక్షరములు. య, ర, ల, వ లు.

అచ్చులు (అప్ప. *II.* 12)

**ఘోషము**

పదునొకండు విధములైన ఆభ్యంతర ప్రయత్నభేదములలో నొకటి.

(చూ.) ఆభ్యంతర ప్రయత్నము.

(చూ.) ఘోషలు (ఆం. భా. వి. పుట. 279)

**ఙ**

ఇది కవర్గముయొక్క ఆనునాసికవర్ణము.

ఇది స్వతంత్రముగా నుండక తద్వర్గాక్షరముల ననుసరించియే యుండును.

ప్రాచీన శాసనముల యందిదియుపయుక్తము. ఒఙ్గోడు, వఙ్గిపఙ్ఱు, క్రఙ్కటవ్వా. ఇత్యాదులు. కాని ప్రాకృతము నందువలె, బిందూపయోగమెక్కువగుటచే, ప్రాకృతములలోవలె, తెలుఁగు వర్ణమాలలోఁగూడ నీవర్ణము లోపించినది కాని సంస్కృతమునందు వర్గాక్షరమునకుఁ బూర్వము, తద్వర్గానునాసికమే యుపయుక్తమగుటచే అఙ్కము, పఙ్క్తి పఙ్కము మున్నగు సంస్కృతములను గూడి యిది తెలుఁగున వ్యవహరింపఁబడునని వ్యాకర్తలు పేర్కొందురు.

(బా. వ్యా. సంజ్ఞా. 3,4)

**జమ్**

జస్, ఙస్, ఆమ్ అను షష్ఠీవిభక్తి ప్రత్యయముల ప్రత్యాహారము. కనుక జమ్ అనగా షష్ఠీ విభక్తి ప్రత్యయములని భావము. "న విభక్తౌ తుస్మాః (అష్టా.) అను సూత్రముచే విభక్తులయందలి మకారమునకిత్సంజ్ఞా నిషేధముండుటచే 'ఆదిరంత్యేన సహేతా (అష్టా.) అను సూత్రముచే ప్రత్యాహారము సిద్ధింపదు.

కనుకనీ ప్రత్యాహారమపాణినీయము. 'సుప్సు ఆదిరంత్యహలా (వాల్మీ. 1-1-4) అను ప్రాకృత వ్యాకరణ విధిచే నీ ప్రత్యాహారమును చెప్పవలెను. ఇదంతములుకాని శబ్దములపైవచ్చు జమ్ స్థానమున కువర్ణకమును, ఇదంత శబ్దములపై కి వర్ణకమును వచ్చును. ఉదా:- రామునకున్, సీతకున్-హరికిన్, గిరికిన్ మొ॥ (చింతా, అజన్త. 25, 39)

**జసిస్**

జసి, భ్యాం, భ్యస్ అను సంస్కృత పంచమీ విభక్తిప్రత్యయముల ప్రత్యాహారము 'న విభక్తౌ తుస్మాః (అష్టా.) అను సూత్రముచే విభక్తిస్థమగు సకారమున కిత్సంజ్ఞ నిషేధింపఁబడుటచే 'ఆదిరన్త్యేన సహేతా(అష్టా ) అను సూత్రముచే ప్రత్యాహారము సిద్ధింపదు. కనుక నీ సంజ్ఞ యపాణినీయము. 'సుస్స్వాదిరంత్యహలా' అనువాల్మీకి ప్రాకృత వ్యాకరణ సూత్రానుసారమీ ప్రత్యాహారము సిద్ధించును. ప్రాకృతవ్యాకరణమున అంత్య హల్లు ఇత్సంజ్ఞకము కావలయునన్న నియమము లేదు. ఈ పంచమీ విభక్తిప్రత్యయముల స్థానమున తెనుఁగున 'వలన' యనునది ఆదేశమగును. ఉదా:- రామునివలన, రాములవలన మొ॥ (చింతా. అజన్త. 28)

**ఙి**

సంస్కృతమున సప్తమి విభక్త్యేకవచనప్రత్యయము. ఇందలి ఙకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ఇ' మిగులును. ఉదా॰- మరుతి (మరుత్+ఇ), రామే(రామ+ఇ) మొ॥తెనుఁగున 'ఙి'స్థానమున 'అందు' అనునది ఆదేశమగును. (చింతా అజంత 26) ఉదా:- రామునియందు, రామునందు మొ॥ ము, వు, బు వర్ణములంతమందుఁగల అమహచ్ఛబ్దములపై, జడవాచకమగు స్త్రీసమ- ఉదంతములపైనను సప్తమ్యేకవచనమునకు (ఙి అనుదానికి) 'న' ఆదేశమగును. ఉదా:- వనమున, ధనువున, పర్వతంబున, పేరున మొ॥

(అథ. కా. అజన్త 16, 17)

**ఙిత్తు**

ఙ్+ఇత్తు (చూ.)

ఙకార మిత్సంజ్ఞగాఁగలది ఙిత్తు ఙకారమిత్తుగాఁగల దానికి ముందు బిందువు వచ్చును.

రాము+డు(ఙ్) — రామున్డు.

(బా. వ్యా. తత్సమ. 19)

**ఙిప్**

ఙి[illegible]న్[illegible]సుప్ అను సప్తమీ విభక్తిప్రత్యయముల ప్రత్యాహారము తెలుఁగున

ఈ ప్రత్యయముల స్థానమున 'అందు' అనునది ఆదేశమగును. (చింతా. అజన్త. 26) ఉదా:- రామునందున్, రామునియందున్, రాములందున్ మొ॥

**జీత్తు**

జి+ఇత్తు (చూ.)

జీత్తు పరమగునపుడు ధాతువు తుది యుత్వము అత్వమగును

లజి, కజి ఇత్యాదులు.

వండఁడు, వండరు } ప్రథమపురుష
వండదు, వండవు }

వండవు, వండరు - మధ్యమపురుష

వండను, వండము - ఉత్తమపురుష

వండక - వ్యతిరేక క్త్వార్థకము మున్నగునవి

(బా. వ్యా. క్రియా. 20, 30)

**జీప్**

ఆయా శబ్దములపై స్త్రీత్వార్థ వివక్షయందు వచ్చు స్త్రీ ప్రత్యయము. ఇందలి ఙకార పకారములిత్సంజ్ఞకములై లోపింపఁగా 'ఈ' మిగులును. ఈ ప్రత్యయము సంస్కృతమున ఋకారాంత నకారాంత శబ్దములపైని, ఉ, ఋ, ౡ వర్ణము లిత్తులుగా గల ప్రత్యయములంత మందుఁగల శబ్దములపైని, టిత్ప్రత్యయములంత మందుఁగల శబ్దములపైని, టిత్ప్రయాంత శబ్దములపైని, ఢ, అణ్, అఞ్, ద్వయసచ్, దఘ్నచ్, మాత్రచ్, తయప్, ఠక్, ఠఞ్, కఞ్, క్వరప్ ప్రత్యయాంత శబ్దములపైని స్త్రీత్వ వివక్ష యందు వచ్చును. ఉదా:- కర్త్రీ (కర్తృ+ఈ), గుణినీ (గుణిన్+ఈ), బుద్ధిమతీ (బుద్ధిమత్+ఈ) మొ॥ (అష్టా 4-1-16 నుండి 24, క. చిం. సంజ్ఞా 37)

'హ్రస్వో దీర్ఘసమాసేఽపి క్వచిద్ జేపః ప్రయోగతః' (అథ. కా. అజన్త 29) అను కారికచే ఒకానొకచో షష్ఠీసమాసమందు జీప్ ప్రత్యయాంతమునకు హ్రస్వము వచ్చును.

ఉదా:- "నదిసుత గురుకర్ణ శల్య నాగపురీశుల్" మొ॥ పై కారికయందలి జీపోఽపి అను చోట అపిశబ్ద సారస్యముచే టాబంతమునకును హ్రస్వము వచ్చును.

ఉదా:- తమసతీర సికతావిలసనములు. ఈ హ్రస్వము సమాసముకాని చోట్ల నిత్యముగా వచ్చును.

ఉదా:- రమ, నది మొ॥ చూ:- జే ప్రత్యయము.

**జీ ప్రత్యయము**

సంస్కృత వ్యాకరణమునందు జీప్, జీష్, జీన్, అను స్త్రీ ప్రత్యయములు మూఁడింటిని నిర్దేశించునపుడు సంగ్రహామునకై తుది పొల్లులు విడిచి 'జీ' యని వ్యవహరింతురు

జకారము లోపింపగా 'ఈ' యనునదియే ప్రత్యయము.

జనయిత్రీ—జనయిత్రి

మతిమతీ—మతిమతి (బా. వ్యా. తత్సమ. 85)

**జేశ్**

జే, భ్యాం, భ్యస్ అను సంస్కృత చతుర్థీ విభక్తి ప్రత్యయముల ప్రత్యాహారము నవిభక్తౌ తుస్మాః (అష్టా.) అను సూత్రముచే విభక్తిస్థ సకారమునకు ఇత్సంజ్ఞ నిషేధింపఁబడుటచే భ్యస్‌లోని సకారముతో ప్రత్యాహారము సిద్ధింపదు. కనుక నీ సంజ్ఞ పాణినీయముకాదు. "సుప్స్వాదిరంత్యహలా" (వాల్మీ 1-1-4) అను ప్రాకృత వ్యాకరణ సూత్రముచే నీ ప్రత్యాహారము సిద్ధించును. ఇందు అంత్య హల్లు ఇత్సంజ్ఞి కావలయునన్న నియమములేదు. కనుకనే జెస్, టాస్, జసిస్, మున్నగు నపాణినీయములగు ప్రత్యాహారములు ప్రాకృత వ్యాకరణాను సారము సాధింపఁదగినవి. (అహో.అజన్త 21) ఈ చతుర్థీ విభక్తి ప్రత్యయముల స్థానమున తెలుఁగులో కొఱకు, కై అను ప్రత్యయము లాదేశములగును ఉదా:- రాముని కొఱకు, రాముల కొఱకు మొ॥ (చింతా. అజన్త. 22)

**చ[1]**

తాలవ్య స్పర్శము (Palatal Stop)

కఠిన తాలువు—స్థానము

జిహ్వామధ్యము—కరణము

స్పర్శప్రయత్నము

శ్వాసము

అల్పప్రాణము

ఇది చలము, చాటువు, చూళిక, చోరుడు,చౌర్యము మున్నగు సంస్కృత సమములను గూడి తెలుగున వ్యవహరింపఁబడును.

**చ[2]**

తాలవ్యస్పృష్టోష్మము (apico-palatal affricate)

కఠిన తాలువు స్థానము.

జిహ్వాబర్స్వము కరణము.

స్పృష్టోష్మ ప్రయత్నము (వాయు స్థంభన కాలమందు
స్పర్శప్రయత్నము; వాయుస్ఫోటన కాలమందు ఊష్మప్రయత్నము)
ఇ, ఈ, ఎ, ఏ ఎ, ఏ లంగూడి నప్పుడే యిట్టి యుచ్చారణము.

ఉదా :

చిలుక, చీమ, చెఱువు, చేపు, మెడ, చేప
ఇది దన్తమూలీయ చకారమునకు సవర్ణము.

**చ**

దన్తమూలీయ స్పృష్టోష్మము
(apico-alveolar affricate)
దన్తమూలము స్థానము.
జిహ్వాబర్సము కరణము.
స్పృష్టోష్మము ప్రయత్నము
శ్వాసము, అల్ప ప్రాణము
ఉ, ఊ, ఒ, ఓ, ఔ లం గూడి తెలుఁగున, వ్యవహరింపఁబడును.
చుక్క, చూపు, చొరవ, చోటు, చౌక.
ఇది తాలవ్యస్పృష్టోష్మచకారమునకు, సవర్ణము. (చూ. చ[2])

**చంద్రకవి**

కృష్ణభూపాలీయమను ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యనురచించిన పండితుఁడు. 19వ శతాబ్ది పూర్వభాగమునకు చెందినవాఁడు. ఈతఁడు కోలారు ప్రాంతమందలి కుందలగుర్కి గ్రామ వాస్తవ్యుఁడనియు, నీతని తండ్రి నారాయణ మంత్రియనియు, వీరు ఆర్వేల నియోగి శాఖకు చెందినవారనియు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు తెలిపియున్నారు. (చూ. కృష్ణభూపాలీయము)

**చకారభావము**

సముచ్చయార్థము. చూ. సముచ్చయము.

(కా. చూ. IX. 58)

**చచ్చు నొచ్చులు**

'చచ్చు' అను ధాతువునకు 'చావు' అను రూపమును; 'నొచ్చు' అను ధాతువునకు 'నోవు' అను రూపమాదేశమగును.

చచ్చు—చావఁడు, చావుము
నొచ్చు—నోవఁడు, నోవుము

(బా. వ్యా. క్రియా. 94)

**చతుర్థి**

నాలుగవ విభక్తి. కొఱకు, కై (కయి) అనునవి ఈవిభక్తి ప్రత్యయములు.

(i) గృహీతను దెలుపు ప్రాతిపదికము కంటె వచ్చును. బలిచక్రవర్తి వామనుని కొఱకు మూఁడడుగులు దానమొసఁగెను.

(ఆం. భా భూ. 68)

(ii) సంప్రదానంబునకుం జతుర్థి యగును జనఁకుడు రాముని కొఱకుఁగన్య నిచ్చెను. (బా. వ్యా. కారక. 8)

(iii) ఉద్దేశ్యమాత్రమునకును జతుర్థియగును. —పురుషార్థము కొఱకు యత్నింప వలయును.

(బా. వ్యా. కారక.8)

**చతుర్థీ తత్పురుషము**

చతుర్థీ విభక్త్యంత పదమునకు మీది పదముతో సమాసము.

దొంగవలన భయము ⟶ దొంగభయము.

(ఆం. కౌ. 486,'87)

**చతుర్థీ బహువ్రీహి**

చతుర్థీ విభక్త్యర్థముతో గూడిన బహువ్రీహి

'దత్తాస్త్రుడు రాముడు'—అనుచో నెవనికొఱకు అస్త్రములు దత్తములాయెనో వాఁడు రాముఁడు.

(సు. వ్యా. సమాస. 58)

**చరితాదిక శబ్దములు**

చరిత, చరిత్ర, అలక, అభిలాష, అక్షత ఘోష, తరంగ, భ్రమ, విజృంభణ, వధ, వేగ, స్ఫురణ, హంస, కుశ, దర్భ, పనస, కుంద ఇత్యాదులు. వీనికి స్త్రీ సమత్వమును, నపుంసకత్వమును కలుగును. ఉదా:- చరిత్ర చరిత, అలక, అభిలాష మున్నగునవి స్త్రీసమరూపములు. చరిత్రము, చరితము, అలకము, అభిలాషము మున్నగునవి నపుంసకరూపములు (అ కా. అజన్త. 40) చూ:- చరిత్రాదులు.

**చరిత్రాదులు**

(చూ ) చరిత్రాదిక శబ్దములు

'చరిత్ర' మున్నగునవి. వీని మువర్ణకమునకు లోపముబహుళముగా నగును. చరిత్ర, అభిలాష, భ్రమ, వధ, హంసాదులు.

(బా. వ్యా తత్సమ. 58)

**చలాపాదానము**

కదలుచున్న వస్తువునుండి యెడబాటు.

'రౌతు కదలెడి గుఱ్ఱమువలనఁబడుచున్నాఁడు.'

(వ్యా.) అచలాపాదానము (చూ.) (ఆం. కౌ. 461-'62)

**చలి**

ఈ శబ్దమునకు స్వార్థమునందు — మిరి వర్ణకమగును.

చలిమిరి. (ప్రౌ. వ్యా. తద్ధిత. 14)

**చాఁపులు**

దీర్ఘములు - ఆ ఈ ఏ మున్నగు స్వరములు. కే, కూ మున్నగు వ్యంజనము లందలి స్వరములు.

(అప్ప. II. 10; బా. వ్యా. ప్రకీర్ణ. 4)

**చార్థము**

(చ+అర్థము) సంస్కృతమందలి 'చ' అను - నవ్యయమునకున్న అర్థము. దీనికి సముచ్చయము, అన్వాచయము, ఇతరేతరయోగము, సమాహారము అను నాలుగర్థములు గలవు. 'చాన్వాచయ సమాహారేతరేతర సముచ్చయే' అని యమరము. (అ. కో. నానార్థ వర్గము. 241 శ్లో.) పరస్పరనిరపేక్షములగు ననేకార్థములకొక యర్థమునందన్వయమున్నచో సముచ్చయము. ఉదా:- ఈశ్వరం గురుం చ భజస్వ మొ॥ ఇట పరస్పరాపేక్ష లేకయే ఈశ్వర గురు శబ్దములకు భజన క్రియయందు కర్మగా నన్వయముండుటచే నిట సముచ్చయము. రెండింటిలో నొకటి ప్రధానమై రెండవది అప్రధానమైనచో అన్వాచయము. ఉదా:- భిక్షామట, గాంచానయ మొ॥ భిక్ష కొఱకు వెళ్లునపుడు గోవు కాన్పించిన తీసుకొని రమ్మని దీనికర్థము. ఇట భిక్ష ప్రధానమై గవానయన మప్రధానమగుటచే నిది అన్వాచయము. పరస్పరాపేక్ష కలిగియే అనేకార్థములకొక యర్థమునందన్వయమున్నచో ఇతరేతర యోగము. ఉదా:- ధవఖదిరౌ (ధవశ్చ ఖదిరశ్చ) మొ॥ ఇట ధవఖదిర శబ్దములు పరస్పరము మిళితములై క్రియ యందన్వయించుటచే నిట ఇతరేతర యోగము. సమూహము సమాహారము. ఉదా:- పాణిపాదమ్ మొ॥ పాణీ చ పాదౌ చ తేషాం సమాహారః అని విగ్రహము. ఇట పాణి పాదములను విడివిడిగా గ్రహింపక సముదాయముగ గ్రహించుటచే సమాహారము. ఈ నాలుగర్థములలో ఇతరేతర యోగ, సమాహార రూప చార్థములందుమాత్రమే ద్వంద్వము వచ్చును. (సి. కౌ. 2-2-29). తెలుఁగులో చార్థమున 'ను' అను నవ్యయము నిపతింపబడినది. ఉదా:- "యక్షేశుండును దైవతేశుఁడును నిత్యంబున్సుఖంబీయరో" మొ॥ (వై. చం. అవ్య. 10)

**చావునోవులు**

'చచ్చు' అను ధాతువునకు, 'నొచ్చు' అను ధాతువునకును ఆదేశముగా వచ్చు రూపములు.

(చూ.) చచ్చునొచ్చులు. (బా. వ్యా. క్రియా. 94)

**చిచ్చి**

'బాలగ్రహమును దూరముచేయుట' యను నర్థమున నిపతింపఁబడిన యవ్యయము. ఉదా:- మెచ్చుల్లోప యశోద పల్కు సుతుఁగూర్మి న్మూపునందార్చుచున్ చిచ్చి! బాలక నిద్రగై కొనుము బూచిరాకు మిచ్చోటికిన్ (వై. చం. అవ్యయ 22).

**చిట్టడవి**

బాలవ్యాకరణానుసారము 'చిఱు+అడవి' కాని ప్రౌఢ వ్యాకరణానుసారము 'చిట్టి+అడవి' ఇది సంజ్ఞావాచకము కాన సంధి నిత్యము అని తత్కర్త యభిప్రాయము.

ఇది తదితర రూపములకును నుపలక్షణమనియు నాతని యభిప్రాయము.

(ప్రౌ. వ్యా. సంధి. 4)

**చిన్నయసూరి, పరవస్తు**

క్రీ శ. 1806-1862.

తెలుఁగు దేశమందు విశేషముగాఁ బఠన పాఠనములందున్న బాలవ్యాకరణమును రచించి, ప్రఖ్యాతిగాంచిన వైయాకరణుఁడు.

ఈతఁడు ఏకసంధాగ్రాహి. బహుశాస్త్ర కోవిదుఁడు. వచనరచనయందు సిద్ధహస్తుఁడు. తెలుఁగునకు సమగ్ర లక్షణగ్రంథమును రచింపవలయునను సదాశయముతో సంస్కృతము నందట్టి దానిని రచించి బాలురకు సుబోధముగా నుండుటకై అందుకొన్ని సూత్రముల నీతఁడు బాలవ్యాకరణమను పేర సనుపదించెను.

నేఁడు మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలకు మూలమైన రాజధాని పాఠశాలలో ఆంధ్రభాషా ప్రధానాధ్యాపక పదవిని చిరకాల మలంకరించినారీయన (1847-1861)

అర్బుత్‌నాట్ దొర వీరిని 'సూరి' యను బిరుదమునిచ్చి సత్కరించెను. వీరి నీతిచంద్రిక తెనుఁగు వచనరచనకు జీవమును బోసెను.

(చూ.) బాలవ్యాకరణము.

**చిన్నయసూరీయము**

ఇది చిన్నయసూరిచే ఆంధ్రశబ్ద చింతామణికి సంస్కృతమున వ్రాయఁబడిన వ్యాఖ్యయని శ్రీ చిలుకూరి పాపయ్యగారు తమ "చిన్నయసూరి"యను గ్రంథమున తెలిపి యున్నారు. కాని యీ వ్యాఖ్య లభింపలేదు. కనుక దీని వివరములు ప్రస్తుతము తెలియరావు. (ఆం. వ్యా. వి. 451. పు).

**చిన్నాదులు**

'చిన్న' మున్నగునవి.

వీనికి భావార్థమందు—టికవర్ణకమగును.

చిన్నటికము, కన్నెటికము మున్నగునవి.

చిన్న, కన్నె, చుట్టము, దొంగ, పేద మున్నగునవి.

(బా. వ్యా. తద్ధిత. 3)

**చిలుక మొకరి**

ఇది విశేష్య పూర్వపద కర్మధారయము.

సంస్కృతము నందలి 'మయూర వ్యంసకము' (ధూర్తమయిన మయూరము) వంటిదిది. మాటకారియైన చిలుక యని యర్థము. ఇట్టివి చాలా స్వల్పముగా నుండును. (ప్రౌ. వ్యా. సమాస. 16)

**చిఱుతాదులు**

చిఱుత, నాతి, నిప్పు, మున్నగునవి.

వీనికి స్వార్థమునందు—ఉక వర్ణకమగును. చిఱుతుక, నాతుక, నిప్పుక మున్నగునవి. (బా. వ్యా. తద్ధిత. 10)

**చు**

క్రియాపదము లన్నింటిపైని వర్తమానార్థమందు వచ్చు వర్ణకము. ఉదా:- జయింపుచున్నాఁడు, చేయుచున్నాఁడు, గెలుచుచున్నాఁడు మొ॥(చింతా.హల న్త.30)

**చుక్కు**

చూ. చుగాగమము.

దేశ్యధాతువుల చివర ప్రేరణార్థమునందు బహుళముగాఁజేరును.

(i) ఇది చేరునపుడు 'ఆడు' 'ఓడు' 'కూడు' (చూ. ఆడోడుకూడులు) ధాతువులందలి డకారమునకు రేఫయగును.

ఆడు— ఆరుచు

ఓడు—ఓరుచు

కూడు—కూరుచు

(ii) చెడు, పడులకు, చుక్కు పరమగునపుడు అలఘురేఫమగును.

చెడు, చెఱుచు, పడు—పఱుచు (బా. వ్యా. క్రియా. 80,81,82)

**చుక్పరక రువర్ణము**

చు(క్) నకు పరమందున్న 'రు'వర్ణము.

ఇట్టి 'రు' వర్ణమునకు ముందున్న 'దు' వర్ణములోని ఉత్వమునకు లోపము వికల్పముగా నగును.

అదురుచు—అద్రుచు

పదురుచు—పద్రుచు

ఇట్టిచో సంయుక్తమగు 'ద్రు' కు పూర్వమందున్న అక్షరము గురువుకాదు. సంయుక్తమును తేల్చి పలుకవలయును. (బా. వ్యా. ప్రకీర్ణ. 20)

**చుగాగమము**

చుక్+ఆగమము

సంయుక్తము కానట్టి న, ల, డ, ర యను వర్ణము లంతమందున్నట్టి ఆచ్ఛిక ధాతువులకుఁ ప్రేరణమునందు బహుళముగా నగును.

పూను < పూనుచు / పూనించు

విను—వినుచు (బా. వ్యా. క్రియా .78)

**చుట్టుప్రావు**

శ్రుతిదుష్టమయినసంధికి పేరు కవిజనాశ్రయమందుఁగలదు.

'భూతమున నిచ్చెడు నెడ నినుమడి సిరి' 'పడు నీజోడు' మున్నగునవి (కవిజ. V. 21)

**చురాదులు**

(చుర్+ఆదులు) చుర్ మున్నగు ధాతువులు. పాణిని చెప్పిన దశగణములలో చివరిదగు చురాది గణమునఁజెప్పఁబడిన చుర (స్తేయే), జ్ఞా (నియోగే), గణ (సంఖ్యానే) మొ॥ ధాతువులు. వీనిపైణిచ్ ప్రత్యయము రాఁగా చోరయతి, జ్ఞాపయతి, గణయతి మున్నగు రూపములేర్పడును. (అహో. క్రియా. 9)

**చువర్ణకము**

వర్తమానార్థమునందు ధాతువులకుఁజేరు ప్రత్యయము.

వండుచున్నాడు

మండుచున్నది. (బా. వ్యా. క్రియా. 14)

**చువర్ణముతోడ దుగ్దకారము**

నువర్ణాంతములయిన ధాతువులకుఁ జేరిన 'దుక్' అను ఆగమములోని దకారము. ఈ రెండు వర్ణములకు—అనఁగా 'చుద్' అను శబ్దమునకు తకార మాదేశమగును.

నిలుచుదురు—నిలుతురు

పిలుచుదురు—పిలుతురు

అడఁచుదురు—అడఁతురు మున్నగునవి. (బా. వ్యా. క్రియా. 108)

**చూళిక పైశాచి**

'పైశాచిక' మను ప్రాకృతభాషా భేదము. అష్టవిధ ప్రాకృత భాషలలోనొకటి. పాండ్య, కేకయ, సాల్వ, బాహ్లిక, గాంధార, నేపాళ, కుంతలాది దేశముల యందిది వ్యవహృతము. (అప్ప. I. 74-83)

**చెంచు**

మతుబర్థమునందీ శబ్దమునకు తద్ధితమగు 'త' వర్ణకము పరమగుచో ఇత్వ మగును.

చెంచు + త — చెంచు+ఇ+త — చెంచిత

(ప్రౌ. వ్యా. తద్ధిత. 4)

**చెక్కు ప్రకృతులు**

చెక్కు, అంకు, ఒదుగు, పొత్తు మున్నగునవి.

వీనికి - ఇలి వర్ణకము స్వార్థమునందగును.

చెక్కిలి, అంకిలి, ఒదుగిలి, పొత్తిలి.

(వ్యా. బా. వ్యా. కృదంత. 55)

**చెడుగు, దుడుకు, నిడుపులు**

ఈ మూఁడు శబ్దములకు పుంస్త్వమున మతుబర్థకమగు అకారమగును. ఆ పైనిదుజ్ చేరును.

చెడుగఁడు, దుడుకఁడు, నిడుపఁడు (ప్రౌ. వ్యా. తద్ధిత. 5)

**చెలి, నయములు**

చెలియను శబ్దమునకు, 'నయ' యను శబ్దమునకు కార వర్ణకమగును.

చెలికారము. నయగారము (ప్రౌ. వ్యా. తద్ధిత. 18)

**చెల్లగ**

చెల్ల మున్నగు శబ్దముల గణము. చూ:- గ. ఇవి సంతాపాద్యర్థములలో నిప తింపఁబడిన శబ్దములు. ఉదా:- వల్లభుఁడు కూర్మిఁజూపఁడు వనితయెడల, చెల్ల మరుఁడెంత కోపించె చెలియలార మొ॥ (వై. చం. అవ్య. 24)

**చేచ్ఛబ్దము**

(చేత్+శబ్దము.) సంస్కృతమందలి చేత్ శబ్దమునకు తెనుఁగున పర్యాయ వాచకమగు 'ఏని' శబ్దము. ఇది కళ (అహో. చింతా. సంజ్ఞా. 40) చూ:- ఏని.

**చేత(న్)**

తృతీయావిభక్తి ప్రత్యయ స్థానమున వచ్చు ఆదేశము. (చింతా. అజంత.21) ఇది 'చే' అను దానికిని ఉపలక్షణము. సంస్కృతమున 'కర్తృకరణ యోస్తృతీయా' (అష్టా.) హేతౌ (అష్టా.) ఇత్యాది సూత్రములచే తృతీయా విభక్తి వచ్చుచోట్ల 'చేత' వచ్చును. ఉదా:- రామునిచేతన్, రామునిచేన్, బాణము చేతన్, బాణముచేన్ ఇత్యాదులు. తెనుఁగున వ్రాయబడిన వ్యాకరణములలో నిది సంస్కృత విభక్తిప్రత్యయముల కాదేశముగా కాక స్వతంత్రముగా విధింపబడి నది (కా. చూ. IX. 75; బా. వ్యా. తత్స. 3).

**చేతురు, కోతురిత్యాదులు**

చేతురు, కోతురు మున్నగు క్రియాపదములు. ఇవి సాధువులు కావని చిన్నయ సూరి హెచ్చరిక. ఏలన వీనిలో తకార మాదేశమగుట కవకాశము లేదు.

'చు వర్ణముతోఁడ దుగ్గకారము'నకే తకార మాదేశమగును. చూచుదురు — చూతురు. (బా. వ్యా. క్రియా. 103)

**చేదర్థము**

చేత్+అర్థము

'అయినచో' అనునర్థమునందు ద్రుతాంతమగు న వర్ణకము ధాతువున కగును.

కురియు—కురిసినన్

వానలు గురిసినం బంటలు పండును. (బా. వ్యా. క్రియా. 41)

**చేదర్థయోగము**

'చేత్' అనునర్థమునిచ్చు, ఆ, ఏని మున్నగు వానితో క్రియకు సంబంధము.

ఇట్టి సంబంధమున్నచో భవిష్యదర్థక క్రియకు మాఱుగా భూతార్థకక్రియ యుపయుక్తమగును.

ఆ ఋషీశ్వరుండు వచ్చెనా కార్యములు ఫలించును.

(బా. వ్యా. క్రియా. 119)

**-చేన్**

— చేతన్ (చూ.) అను వర్ణకముయొక్క ఆద్యక్షరశేషము. తృతీయా విభక్తి. (బా. వ్యా. తత్సమ. 10)

**-చేయు**

—'చేయు' అను ధాతువు 'అన్నంత క్రియ' (చూ) కనుప్రయుక్తమగుచో ప్రేరణార్థకమగును.

'చొక్కుచుఁజొక్కఁజేయుచు' (ప్రౌ. వ్యా. క్రియా. 18)

**చేయ్యాదులు**

చేయు+ఆదులు—చేయు మున్నగు ధాతువులు.

వీనికి తజ్వర్ణకము చేరుటచే చేఁత, కోఁత, వ్రాత మున్నగు కృదంత రూపములు నిష్పన్నమగును.

చేయు, కోయు, వ్రాయు మున్నగునవి చేయ్యాదులు.

(బా. వ్యా. కృదన్త. 5)

**చేర్వాదులు**

చేరు+ఆదులు—'చేరు' మున్నగునవి చేరు, తిరుగు, తీఱు, తేఱు ఇత్యాదులు. వీనికి-గడ వర్ణకము చేరుటచే చేరుగడ, తిరుగడ, తీఱుగడ వంటి కృదంత రూపములు సిద్ధించును. (బా. వ్యా. కృదన్త. 15)

**-చేసి**

కొన్ని యెడలఁ 'జేత' విభక్త్యర్థక వర్ణకములకును; 'వలన' వర్ణకమునకును దఱచుగ నను ప్రయుక్తమగును.

ఏకవిప్ర సంబోధనఁజేసి

బహువేద ఘోషమునఁజేసి (ఆం. కౌ. 140; ప్రౌ. వ్యా. కారక. 4)

**చొచ్చు, చూచులు**

చొచ్చు, చూచు అనుధాతువులకు ముత్తు (చూ.) పరమగునపుడు 'చొరు' 'చూడు' లాదేశమగును.

చొచ్చు—చొరఁడు, చొరుము

చూచు—చూడఁడు చూడుము. (బా. వ్యా. క్రియా. 91)

**చోటు శబ్దము**

(*i*) చేయఁబడిన హ్రస్వములమీఁది చోటు శబ్దముయొక్క ఓత్వమునకు అత్వ హ్రస్వములు విభాషనగును.

అచ్చోటు-అచ్చొటు-అచ్చటు

ముచ్చోటులు-ముచ్చొటులు-ముచ్చటలు

(*ii*) 'చోట' శబ్దము ఉత్తరపదమగుచో టాక్షరమునకు లోపము విభాషగానగును

అచ్చోటనున్నాఁడు

అచ్చోనున్నాఁడు (బా. వ్యా. సమాస. 16)

**ఛందోదర్పణము**

దీనికే 'అనంతుని ఛందము' నియునామాంతరము.

కర్త : అనంతామాత్యుఁడు (చూ.) ఇది విశేషముగా ఛందోవిషయములను వివరించు గ్రంథమేయైనను చతుర్థాశ్వాసమునందు వ్యాకరణ విషయములు కొన్ని పేర్కొనఁబడినవి.

ఈ ఆశ్వాసమునందు 150 పద్యములు గలవు. ఇందు సంస్కృత సంధులు, సమాసములు నిరూపితములు.

**జ**[1]

తాలవ్య స్పర్శము (palatal stop)

కఠిన తాలువు స్థానము

జిహ్వామధ్యము కరణము

స్పర్శ ప్రయత్నము

నాదము

అల్ప ప్రాణము

జాగృతి, జగము, మున్నగు సంస్కృత సమములను గూడి తెలుఁగున వ్యవహరింపఁబడును.

**జ**[2]

తాలవ్య స్పృష్టోష్మము (apico-palatal affricate)

కఠిన తాలువు స్థానము

జిహ్వాబర్సము (tip of the tongue) కరణము

స్పృష్టోష్మ ప్రయత్నము

అల్ప ప్రాణము

నాదము

ఇ, ఈ, ఎ, ఏ, ఐ, ఏ, ఐ లంగూడినపుడు మాత్రమే

æ æː

జిడ్డు, జీడి, జెముడు, జేగురు, జైన మున్నగునవి.

జ

దన్తమూలీయ స్పృష్టోష్మము (apico-alveolar affricate)

దన్తమూలము స్థానము

జిహ్వాబర్సము (tip of the tongue) కరణము

స్పృష్టోష్మ ప్రయత్నము

నాదము

అల్పప్రాణము

అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, లంగూడి వ్యవహరింపఁబడును.

జలుబు, జాతర' జుట్టు, జూలు, జొన్న, జోలి, జౌకు మున్నగునవి.

**జగదింద్రజిత్తులు**

జగత్, ఇంద్రజిత్—అను సంస్కృతశబ్దములు

వీని 'త'కారమునకు లోపము విభాషగాఁ గలుగఁగా 'జగము' 'ఇంద్రజి' అను రూపములేర్పడును.

లేనిచో 'జగత్తు' 'ఇంద్రజిత్తు' అను రూపములేర్పడును.

(బా. వ్యా. తత్సమ. 79)

**జడ పదము**

(i) ప్రాణము లేని దానిని దెలుపు పదము. కొండ, రథము మున్నగునవి.

ఇట్టిపదము మీఁద —'తోడ' విభక్తికి —'మెయి' -'మై' లు విభాషగా నగును.

'అందఱుఁ గూడి మోసలకు నర్థి మెయింజనుదెంచి' (ప్రౌ. వ్యా. శబ్ద. 18)

(ii) వీని ద్వితీయావిభక్తిస్థానమున ప్రథమావిభక్తియు వచ్చును. **ఉదా:-** కొండదిగి. రథమెక్కి, పూలుకోసి మొ॥ (చింతా. అజన్త. 61)

**జడము**

ప్రాణము లేని దానిని తెలుపు పదము.

ఉకారాంతమైన జడ వాచకమునకు సప్తమ్యర్థమునందు—న వర్ణక మగును.

ఘటంబున జలమున్నది. (బా. వ్యా. కారక. 18)

**జడ్డ**

ద్విత్వము. సమానమైన హల్లుల కలయిక,

ఇట్టి ద్విత్వము కొన్ని పదములందు విభాషగా లోపించును,

అక్కట — అకట

చెల్లియలు — చెలియలు. (అప్ప. II. 13; బా. వ్యా. ప్రకీ. 8)

**జడ్డలోపము**

చూ. జడ్డ; ద్విత్వము.

రెండు సమాన హల్లుల కలయికనుండె యొక హల్లు లోపించుట.

ద్విత్వయుక్తములైన శబ్దములకు పదాది హల్లులు పరమగునపుడు ద్విత్వమునకు లోపము విభాషగానగును.

వెన్ను+వెంట — వెనువెంట (నిత్యము)

విల్లు + వంపు < విలువంపు / విల్లువంపు.

(ఆం. కౌ, 536-'38 పంక్తులు)

**జన్యశబ్దములు**

అధర్వణుఁడు వికృతియందలి శబ్దములను జన్యములు, అజన్యములు అని రెండు విధములుగా విభజించెను. అజన్యములగు ధాతురూపములకు ప్రత్యయములు చేర్చుటచే నేర్పడు శబ్దములు జన్యశబ్దములు. ఇట్టి శబ్దముల చివరి వర్ణములు విచిత్రములుగా నుండును. ఉదా:- ఓకిలింత (ఓకిలించు+త), అలయిక (అలయు+క), చూపు (చూడు+పు) ఇత్యాదులు. (అధ. కా. అజన్త. 95) వీనిని అహోబలపతి అధాతు ప్రకృతులని వ్యవహరించి అనేకములగు నుదాహరణములను చూపెను. (అహో. అజన్త. 86)

**జయశబ్దము**

ఇది సంస్కృతమునందు 'జి' ధాతులోణ్మధ్యమ పురుషైక వచనరూపము. 'జయించుగాక' అనిగాని, 'జయింపుము' అనిగాని దీని యర్థము.

అట్టి యీ పదము తెనుఁగునం దనుకరణ విరహితముగాఁ బ్రయోగింపఁబడ రాదు. కాని తఱచుగా నిది యనుకరణ విరహితముగానే కనుపట్టును.

జయజయ ధ్వనులిచ్చిరి.

జయ ! నారాయణ పుండరీకనయనా ! ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 16)

**(?)జశ్వరీతులు**

'జశ్' అను ప్రత్యాహార సంజ్ఞ "జబగడద"లకు అష్టాధ్యాయియందుఁగలదు.

దీనిని 'ఆంధ్రకౌముది' కర్త, గణపవరపు వేంకటపతికవి 'గసడదవ' లకుఁ గల్పించుట చిత్రము.

ప్రథమాంతములపయి 'కచటతప' లకు 'గసడదవ' లగుట జశ్వరీతులని యిందు వివరింపఁబడెను. (ఆం. కౌ. 125-127)

**జశ్త్వము**

ప్లుతము మీఁది 'కచటతప'లు 'గజడదబ'లగుటను 'జశ్త్వము' అని ఆంధ్ర కౌముది కర్త పేర్కొనెను.

జశ్త్వము వికల్పముగా నగునని పేర్కొనుట తెనుఁగు వ్యాకరణ సంప్రదాయ మునకు విరుద్ధముగా నున్నది. (ఆం. కౌ. 498-500)

**జహత్స్వార్థవృత్తి**

(చూ.) (వ్య.) అజహత్స్వార్థవృత్తి.

సమాసగతశబ్దములు స్వార్థమును గోల్పోయి, యేకోన్ముఖమై సామూహికార్థము నిచ్చుట.

దీనినే 'ఏకార్థీభావమ' నియునందురు. (చూ.) (తె. వ్యా. వి. పుట. 868)

**జస్**

సంస్కృత వ్యాకరణ మందలి ప్రథమాబహువచన ప్రత్యయము. ఇందలి జకార మిత్సంజ్ఞకమై లోపింపఁగా అస్ మిగులును. ఉదా:- మరుతః (మరుత్ + అస్) మొ॥ తెలుఁగులో జస్ ప్రత్యయస్థానమున 'లు' ఆదేశమగును. ఉదా:- రాములు మొ॥ (చింతా. అజన్త. 14)

**జామ్వాదులు**

'జాము' మున్నగునవి.

వీనికి బహువచన ప్రత్యయము పరమగునపుడు అంతిమాక్షరమునకు లోపము వికల్పముగా నగును.

జాము+లు > జాలు
జాములు

ఆవు+లు > ఆలు
ఆవులు (మ. ప. వ్యా. శబ్ద. 64)

**జాతిప్రయుక్త విశేషణము**

ఆఱు విధములగు విశేషణములలో మొదటిది.

బ్రాహ్మణత్వాది జాతులను బట్టియేర్పడిన విశేషణము.

బ్రాహ్మణుఁడు, వస్త్రము, పుస్తకము, మున్నగునవి.

(ప్రౌ. వ్యా. శబ్ద. 8)

**జాతివాచకములు**

జంతువస్తు సముదాయములలో నొక్కొక్క తరగతిలోని వానికి సామాన్యముగాఁ జెందునవి.

మనుజుఁడు, వృక్షము, ఆవు, రాయి. (సం. వ్యా. విశే. 4)

**జాత్యశ్వ వాచకము లు**

ఉత్తమ జాతికిఁ జెందిన గుఱ్ఱములను దెలుపు శబ్దములు.

వీనికి బిందుపూర్వక డు వర్ణకము చేరును.

నీలండు, నీలఁడు, జన్నఁడు, సారంగుఁడు మున్నగునవి.

(ఆం. కౌ. 159-161; బా. వ్యా. ఆచ్ఛిక. 4)

**జాత్యాది భేదములు**

జాతి మున్నగు భేదములు.

జాతియనఁగా ననేక వ్యక్తులయందుఁడు ధర్మము. బ్రాహ్మణత్వ మొక్క వ్యక్తియందుఁగాక యనేకులయందుండును గాన 'బ్రాహ్మణుఁడు' అనునది జాతి ప్రయుక్త విశేషణమగును.

క్రియా, గుణ, ద్రవ్య, సంఖ్యా, సంజ్ఞా ప్రయుక్త విశేషణములు ఆదిపదముచే గ్రహింపనగును. (ప్రౌ. వ్యా. శబ్ద. 8)

**జాత్యేక వచనములు**

జాతినంతను దెలుపు ఏకవచనములు. వీనికి బహువచన రూపములుండవు.

పాలు, తెమ్మెరలు, అఱ్ఱు

(క. చిం. I. 66; క. సం. వి. I. 85, 87)

**జాలాదులు**

'జాల' మున్నగు శబ్దములు.

వీనికి మతుబర్థమునందు - 'అరి' వర్ణకము చేరును.

జాలరి, ఒఱపరి మున్నగునవి.

జాల, ఒఱపు, కల్ల, చదువు, జూదము మున్నగునవి జాలాదులు. ఆకృతి గణము. (బా. వ్యా. తద్ధిత. 17)

**జిహ్వామూలీయము**

జిహ్వయొక్క మూలమునకు సంబంధించినది.

కకార ఖకారములకుఁ బూర్వమందున్న విసర్గమునకు జిహ్వామూలీయమని పేరు.

మన ఁ కమలము.

దు ఁ ఖము. (ఆం. కౌ. 65, 66; ఆం. భా. శా. సంజ్ఞ. 31)

**జుగుప్స**

ఏవగింపు. ఈ యర్థమునందు 'వలన' వర్ణకమగును.

పాపంబువలన నేవగించె (బా. వ్యా. కారక. 9)

**జూదాదులు**

'జూదము' మున్నగు పదములు.

వీని 'ద'కారమునకు 'జ'కారము విభాషగానగును.

జూదము — జూజము

జాది — జాజి

అవుదు, జవాది, జాది, జాదు, విరవాది — జూదాదులు.

(బా. వ్యా. ప్రకీర్ణ. 21)

**జోగి సోమయాజి, గంటి.**

ఆంధ్రవిశ్వకళా పరిషదాంధ్రశాఖకధిపతిగాను, ఆచార్యులుగాను చాలకాలము పనిచేసి, విరమించిన పిమ్మట కేంద్రప్రభుత్వమునందు పారిభాషిక పదరచనా సంఘమున కధ్యక్షులుగాను వీరుపనిచేసి విశ్రాంతి వహించినారు.

వీరి 'ఆంధ్రభాషా వికాసము' ద్రావిడ భాషా విజ్ఞానకరదీపిక. ఆంధ్రదేశము నందు భాషా విజ్ఞానమును విశేషముగా వ్యాప్తి గావించిన వారిలో వీరగ్రగణ్యులు. తెలుఁగులో పరిశోధనకు వీరు మార్గదర్శకులు. వీరికి తమిళ కర్ణాటాంధ్ర సంస్కృత భాషలు కరతలామలకములు.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వీరిని కళాప్రపూర్ణ, డాక్టరేటు బిరుదములతో సత్కరించినది.

**జ్ఞాతి వైరము**

పుట్టుకను బట్టి శత్రుత్వము.

రేఫకు, శకట రేఫకు వైయాకరణులు లఘ్వలఘు భేదమును మాత్రమే యుచ్చారణమందుఁ జేర్కొనిరి. అయినను, ఛందశ్శాస్త్రానుసారము వీరును, లఘ్వలఘురేఫలకు యతి మైత్రినిగాని, ప్రాసమైత్రిని గాని, యంగీకరింపరైరి. అందులకుఁగారణము చారిత్రకముగా ఈ రెంటికిఁగల జ్ఞాతివైరమేయని భావింపఁబడుచున్నది.

ఇట్లెంతగా నిషేధింపఁబడినను, ఉచ్చారణము నందలి యీషద్భేదము మూలమున నన్నయానంతర కవులనేకులు ఈరెండింటికి సాంకర్యమును కొలఁదిగనో, గొప్పగనో చేకూర్చినవారే యైరి. (అప్ప. II. 229)
(బా. వ్యా. ప్రకీర్ణ. 24)

**జ్ఞాపకము**

సూత్రమునందు వ్యర్థమగుచు ఒకానొక విశేషమును తెలుపునది. "సామానాధికరణ్యేషూదంతానాంటుగాగమోఽచి స్యాత్ (చింతా. సంధి 33)" అను సూత్రమున 'సామానాధికరణ్యే' అని ఏకవచనము సరిపోఁగా 'సామానాధికరణ్యేషు' అను బహువచనము వ్యర్థమై అసామానాధికరణ్యములందును, టుగాగమము వచ్చునను విశేషమునకు జ్ఞాపకమగుచున్నది. కనుకనే చెక్కుటద్దములు ఇత్యాదులు సామానాధికరణ్యములు (కర్మధారయములు) కాకపోయినను టుగాగమము వచ్చినది. (అహో. సంధి 33)

**ఝల్**

ఝభఞ్, ఘఢధష్, జబగడదశ్, ఖఫఛఠథ చటతవ్, కపయ్, శషసర్, హల్ అను మాహేశ్వర సూత్రములలో ఝ వర్ణమునకు చివరి ల వర్ణముతో ప్రత్యాహారము చేయగా సిద్ధించు సంజ్ఞ. దీనిచే అనునాసికవర్ణములు (ఞ మ ఙ ణ న-లు)మఱియు యవరల-లు తప్ప ఇతర హల్లులన్నియు గ్రహింపఁబడును.

**ఞమ్ములు**

"ఞ, మ, ఙ, ణ, న" అను అనునాసిక వర్ణములకుఁబ్రత్యాహార సంజ్ఞ.
(మ. ప. వ్యా. వర్ణ. 8)

**ట[1]**

మూర్ధన్యస్పర్శము (retroflex stop)

మూర్ధము స్థానము

ప్రతివేష్టిత జిహ్వాగ్రము కరణము

స్పర్శప్రయత్నము

శ్వాసము

అల్పప్రాణము

**-టు²**

సర్వధాతువులకు భావార్థమునందు (చూ.) వచ్చు కృత్ప్రత్యయము.

హరించుట, చేయుట, తినుట మున్నగునవి. (చూ.) ట వర్ణకము

(బా. వ్యా. క్రియా. 85)

**-టు³**

కొన్ని ధాతువులకు భావాద్యర్థములందు వచ్చు విశేష కృత్ప్రత్యయము.

ఇది పరమగునపుడు తుదియక్షరము లోపించును.

వండు — వంట, ఆడు — ఆట

(బా. వ్యా. కృదంత. 7)

**టకారాగమ సంధి**

కర్మధారయ సమాసములయందు పదాంతమునందు ఉకారమున కచ్చు పరంబగునపుడు టకార మాగమముగా వచ్చును.

దీనినే టకారాగమ సంధి యందురు

చిగురుటాకులు

కఱకుటమ్ములు

సిగ్గుటద్దము.

(ప్ర. వ్యా. 63)

**ట వర్ణకము**

క్రియాపదము లన్నింటిపైని (తత్సమదేశ్య క్రియలన్నింటిపైని) భావార్థమున వచ్చు ప్రత్యయము. ఉదా:- ఘటించుట, చేయుట, వచ్చుట మొ॥ (చింతా. క్రియా. 48) ఇది సమాసమందును, అసమాస మందును క్రియలచివర వచ్చును. ఉదా:- అతఁడు వచ్చుట మొ॥ (అసమాసము) నావచ్చుట, సాటివచ్చుట మొ॥ (సమాసము) టవర్ణమునకు పూర్వమందున్న ధాతుగత నువర్ణమునకు వికారము రాదని అథర్వణుఁడు చెప్పుటచే అంట, వింట, కంట, ఇత్యాది భావార్థకరూపములు సాధువులు కావనియు 'మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి పనిగొంట' (శృం నై. 3-126) అను పద్యములోని పనిగొంట యనునది ప్రామాదికమేనని యహోబలపతి యాశయము. 'మింటగడు తెల్లనై పొఱచుంటఁజూచి' ఇత్యాది

స్థలములలో డువర్ణ లోపమని గ్రహింపపలెను. (అహో. క్రియా. 48) కేతన, తింట, కంట మొ॥ పదములను సాధువులుగా తెలిపెను. చూ:ట2

**టా**

సంస్కృత వ్యాకరణమున తృతీయైకవచన ప్రత్యయము. ఇందలి టకార మిత్తై లోపింపఁగా 'ఆ' మిగులును. ఉదా:- మరుతా (మరుత్+ఆ) మొ॥ తెనుఁగున టాస్థానమున చేత యను ప్రత్యయమాదేశమగును. (అథ కా. అజన్త 39. చింతా. అజన్త. 21)

**టాది విభక్తులు**

(టా+ఆదివిభక్తులు) తృతీయావిభక్తి మొదలుకొని సప్తమీ విభక్తి వఱకుగల విభక్తులు. పాణినీయమున 'స్వౌజసమౌట్ఛస్ టాభ్యాంభిస్' (అష్టా 4.1.2) అను విభక్తి ప్రత్యయములను తెలుపు సూత్రమున టా, భ్యాం, భిస్ అను తృతీయా విభక్త్యేకవచన ప్రత్యయమగు టాతో ప్రారంభమగుటచే టాది విభక్తులనఁగా తృతీయాది విభక్తులని భావము, ఇవి పరమగునపుడు మహద్వాచకముల కేకవచన బహువచనములందు క్రమముగాని,ల అను నాగమములు వచ్చును.(చింతా.అజంత. 18) ఉదా:- రామునిచేతన్, రాముల చేతన్ మొ। కొందఱ మతమున టాది విభక్తులు పరమగునపుడు 'ని' అనునాగమమురాదు ఉదా:- రాముచేతన్, రాముకొఱకున్ మొ॥ (చింతా. అజంత 19) హ్రస్వేకారాంత శబ్దములకు ఇవిపరమగునపుడు 'ని' ఆగమమురాదు. ఉదా:- హరిచేతన్, శౌరిచేతన్ మొ॥ (చింతా. అజంత. 40)

**టాదులు**

(టా+ఆదులు) తృతీయాద్యేకవచన ప్రత్యయములు. (చింతా. అజంత. 40) చూ;- టాది విభక్తులు.

**టాబాది ప్రత్యయములు**

(టాప్+అది, ప్రత్యయములు) ఆయాసంస్కృత శబ్దముల పై స్త్రీత్వవివక్ష యందు విధింపఁబడిన టాప్, డాప్, చాప్, ఙీష్, ఙీన్ మున్నగు స్త్రీప్రత్యయములు. వీనిలో మొదటి మూడింటిలో ఇద్వర్ణములకు లోపము రాఁగా 'ఆ' అనునదియు, చివరి మూడింటిలో ఇద్వర్ణములకు లోపము రాఁగా 'ఈ' అనునదియు మిగులును. ఉదా.- అజా (టాప్), సీమా (డాప్), కారీషగంధ్యా (చాప్), పచంతీ (ఙీప్), గౌరీ(ఙీష్), శార్ఙ్గరవీ (ఙీన్) మొ॥ (అష్టా. 4-1-4. 6, 18, 42, 73, 74) తెలుఁగు భాషలో నిట్టి స్త్రీవాచకశబ్ద మాత్ర సాధారణములగు స్త్రీప్రత్యయము లేవియులేవు. (అహో. అజంత 57)

**టాన్**

ఇది (టా భ్యాం భిస్ అను తృతీయా విభక్తి ప్రత్యయములకు) ప్రాకృత వ్యాకరణానుసారముగనేర్పడిన ప్రత్యాహారము. దీనిచే తృతీయావిభక్తి ప్రత్యయ

ములు గ్రహింపఁబడును. భిస్‌లోని సకారమునకు 'నవిభక్తౌ తుస్మాః (అష్టా') అను పాణినీయ సూత్రముచే విభక్తిగతమైనసకారమునకిత్సంజ్ఞా నిషేధముండుటచే 'ఆదిరంత్యేన సహేతా' (అష్టా) అను సూత్రముచే టాస్ అను ప్రత్యాహారము సిద్ధింపదు. ప్రాకృత వ్యాకరణమున అంత్యహల్లు ఇత్తుకావలయునన్న నియమము లేకపోవుటచే 'సుప్సుఆదిరంత్యహలా' (వాల్మీ 1-1-4) అను ప్రాకృత వ్యాకరణ సూత్రానుసారము 'టాస్' ప్రత్యాహారము సిద్ధించును. ఇట్లే జసిన్, జమ్, జేస్ మున్నగునవి ప్రాకృత వ్యాకరణానుసారముగనే సాధ్యములు. (అహో. అజన్త. 21) టాస్ స్థానమున 'చేత' అనునది ఆదేశముగా వచ్చును. ఉదా:- రామునిచేత, రాములచేత మొ॥ (చింతా. అజన్త 21)

ంటిమ్

బహుర్వీహి సమాసమున కన్ను శబ్దములోని 'న్ను' అనుదానికి వచ్చు ఆదేశము. ఇందలి మకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ంటి' మిగులును.

ఉదా:- తమ్మికంటి, ముక్కంటి, మొ॥ (వై. చం. సమా. 84)

—టి[1]—

(i) ఇ, టి, తి, యను నౌపవిభక్తులలో నొకటి.
ఏఱు-ఏటిని

(ii) పదాద్యమగు హ్రస్వము మీఁది 'టి' వర్ణమునకు ముందు పూర్ణబిందువగును.

కన్ను—కంటిని; ఇల్లు—ఇంటిని

(ii) హ్రస్వముమీఁది టివర్ణమునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగును.

మూఁడిటిని—మూఁడింటిని (బా. వ్యా. అచ్చిక. 28, 32, 33)

టి[2]

ఒకశబ్దములోని చివరియచ్చు మొదలుకొని యుండుభాగము. అజన్తములైన రామ ఇత్యాది శబ్దములలో చివరి అ కారమును, రాజన్ ఇత్యాది హలన్త శబ్దములలో చివరియచ్చు మొదలుకొని యుండుభాగము (అన్ అనునది) 'టి' యనఁబడును. 'అచోఽంత్యాది టి'(అష్టా.) అను పాణినీయమున నీసంజ్ఞ చెప్పఁబడినది. మహిమన్ శబ్దముపై 'ఆతఁన ఇమనంతానాం డావా' (చింతా. హలన్త. 7) అను సూత్రముచే డా అనునది రాఁగా 'డా' డిత్తగుటచే మహిమన్ శబ్దములోని టికి (అన్ అనుదానికి) లోపము రాఁగా 'మహిమా' అని యగును. పిదప హ్రస్వము. (అహో. హలన్త. 7)

**టింటాౘదులు**

(టి, ంటి+ఆదులు) టి, ంటి, తి, త్రి మున్నగునవి. ఇవి ఔప విభక్తికములు. విభక్తి పరమగునపుడును, సమాసమందును ఇవి ర, ల, డ మున్నగువాని స్థానమున ఆదేశములుగా వచ్చును. ఉదా:-ఏటికి, ఏటికాలువ; -వింటికి, వింటి కొప్పు, -నేతికి, నేతిముంత; -మిత్రికి, మిత్రిచేను మొ॥ (చింతా. సంధి. 39) చూ:- ఔపవిభక్తికములు.

**టుక్[1]**

కర్మధారయ సమాసములలో హ్రస్వ-ఉకారాంతములకచ్చు పరమగునపుడువచ్చు ఆగమము (చింతా. సంధి. 33; అప్ప. V-91, 92; ఆం. కౌ. 5--53, 54, బా.వ్యా.సంధి.28,29) ఇందు ఉకారకకారము లిత్సంజ్ఞకములై లోపింపగా 'ట్' మిగులును. 'ఆద్యంతౌటకితౌ' (అష్టా. ) అను సూత్రముచే కిత్తైన ఈయాగమము ఉకారాంత శబ్దములకంత్యావయవముగ వచ్చును, ఉదా:- చిగురుటాకు, కఱకు టమ్ము మొ॥ టుగాగమమును విధించు 'సామానాధికరణ్యేషు...' (చింతా. సంధి. 33) అను సూత్రమునందలి 'సామానాధికరణ్యేషు' అను బహువచన ప్రయోగము అసామానాధికరణ్యము (కర్మధారయేతరస్థలము) లందును కొన్నిచోట్ల టుగాగమము వచ్చునని తెలియఁజేయుచున్నది. కనుక వేల్పుటావు, కప్పురపుటనటులు, చెక్కుటద్దములు మున్నగురూపములేర్పడును. (బా. స. సంధి, 32, అహో. సంధి. 33)' జ్ఞాపకసిద్ధంన సర్వత్ర (జ్ఞాపకముచే సిద్ధించిన కార్యము అంతట ప్రవర్తించదు) అను పరిభాషచే చిగురమ్ము ఇత్యాది స్థలములలో టుగాగమము రాదు. (అహో. సంధి 33)

**టుక్[2]**

తదాది వాచకములగు ఆ, ఈ, ఏ, శబ్దములపైని థాల్ ప్రత్యయస్థానమున వచ్చు ఆదేశము. ఇందలి కకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- అట్టు, ఇట్టు, ఎట్టు (వై. చం. తద్ధితా. 35)

**టుట్**

సూర్యగణ ప్రాతిపదకము నందలి డు, రు వర్ణములకు పరమగు ద్వితీయాద్యేక వచన ప్రత్యయమునకు వచ్చుఆగమము. ఇందలి చివరి టకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా;- గోటిని, గోటిచే మొ॥ (వై. చం. అజంత 68) పేరు మున్నగు శబ్దములపై మాత్రమీ యాగమమురాదు. ఉదా;- పేరిని, పేరి చేత మొ॥ (వై. చం. అజంత. 69)

**ఠ**

మూర్ధన్యస్పర్శము—(Retroflex stop)
మూర్ధము— స్థానము

ప్రతివేష్టిత జిహ్వాగ్రము—కరణము

స్పర్శప్రయత్నము, శ్వాసము, మహాప్రాణము.

మఠము, పీఠము, మున్నగు సంస్కృత సమములను గూడి తెనుఁగున వ్యవహరింపఁబడును.

**ఠాదులు**

ఠ, ఢ, ఢ, ద, ధ, క్ష – ఈ ఆఱు వర్ణములకు ఠాదులని పేరు.

(గు. వ్యా. 64)

**—ం(డ్రులు**

చెలియలు, చెల్లెలు, ఆలు, మఱఁదలు, కోడలు అను పదములకు బహువచన లకారమునకు రేఫమును, దానికి ముందు బిందుపూర్వక డ వర్ణమునగును.

చెలియలు+లు→చెలియలు+రు→చెలియండ్+రు→చెలియండ్రు

ఇట్లే ఇతరములు. (ఆం. భా. భూ. 8[1]; బా. వ్యా. ఆచ్ఛిక. 11)

**—ండ్లు**

ఇల్లు, కల్లు, ముల్లు, పల్లు, విల్లు మున్నగువాని అంతిమాక్షరమునకు బహువచనమందు —ండ్లు ఆదేశమగును.

ఇండ్లు, కండ్లు, ముండ్లు, పండ్లు, విండ్లు. (ఆం. భా. భూ. 75)

**డ**

మూర్ధన్యస్పర్శము (Retroflex Stop)

మూర్ధము—స్థానము

ప్రతివేష్టిత జిహ్వాగ్రము—కరణము, స్పర్శప్రయత్నము, నాదము, అల్పప్రాణము.

**దకార లకారములు**

బహువచన శ్లిష్టములయి, అద్విరుక్తము లయిన దకార లకారముల కలఘు లకారము నిత్యముగా నగును.

త్రాడు+లు → త్రాళులు → త్రాళ్ళు

మొసలి+లు ⟶ మొసళలు ⟶ మొసళ్ళు

(బా వ్యా. అచ్చిక. 13,14)

**డ, ల, టు, ర, లు**

ఈ వర్ణముల యుత్వమునకు బహువచన ప్రత్యయము పరమగునపుడు లోపము వికల్పముగా నగును.

గుండు+లు > గుండ్లు / గుండులు

మొసలి+లు > మొసళ్ళు / మొసలులు

గొంటు+లు > గొంట్లు / గొంటులు

గోరు+లు > గోర్లు / గోరులు

(బా. వ్యా. అచ్చిక. 12)

**డ, ల, ర, లు**

అసంయుక్తములయి, ఉదంతములయిన డ, ల, ర, లకు బహువచనము పరమగునపుడు అలఘులకారము బహుళముగా నగును.

త్రాడు+లు > త్రాళలు ⟶ త్రాళ్ళు / త్రాడులు

పిడికిలి+లు ⟶ పిడికిలులు > పిడికిళలు ⟶ పిడికిళ్లు / పిడికిలులు

పందిరి+లు ⟶ పందిరులు > పందిళలు / పందిరులు

(బా. వ్యా. అచ్చిక. 18)

**-డా**

ఆత్మన్ శబ్దముపైనను, ఇమనంతములపైనను సు (ప్రథమైకవచన) ప్రత్యయ స్థానమున వికల్పముగవచ్చు ఆదేశము (చింతా. హలన్త. 7) ఇందలి డకార మిత్సంజ్ఞకమై లోపింపగా 'ఆ' మిగులును. ఆత్మన్ శబ్దముపైనను, గరిమన్, లఘిమన్ ఇత్యాది ఇమనంతములపైనను సుస్థానమున 'డా' ఆదేశమును, డిత్వప్రయుక్తమగు టిలోపమును రాగా ఆత్మా, గరిమా, లఘిమా, మున్నగు రూపములగును.

"పిదప దీర్ఘాణాం హ్రస్వః స్యాత్"(చింతా. అజ న్త. 46)అనుసూత్రముచే హ్రస్వముాగా ఆత్మ, గరిమ, లఘిమ, మున్నగు రూపములు సిద్ధించును. 'రాని డా' పక్షమున అమహత్త్వమున 'ము' వర్ణకముాగా ఆత్మము, గరిమము, లఘిమము మున్నగు రూపము లేర్పడును. మహత్త్వమున డుజ్వర్ణకము వచ్చి ఆత్ముండు అను రూపమును సిద్ధించును. (అహో. హల న్త. 7)

**డాకు ణకారము**

'అడఁగు' మున్నగు వానిలోఁగల డకారమునకు ణకారము విభాషనగును.

అడఁగు—అణఁగు

పోఁడి—పోణి (బా. వ్యా. ప్రకీర్ణ. 18)

**-డాప్**

విధాత్రాది గణమునఁజేరని ఋకారాంత శబ్దముల ఋవర్ణమునకు వచ్చు ఆదేశము. ఇందలి పకారము చ్చారణార్థము. డకార మిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ఆ' మిగులును. ఉదా:- కర్త, భ్రాత మొ॥ విధాత్రాది గణమునఁజేరని కర్తృ, భ్రాతృ ఇత్యాది ఋకారాంతము లందలి ఋవర్ణమునకు డాప్ (ఆ) ఆదేశము (కర్త్+ఆ) దీర్ఘాణాం హ్రస్వః స్యాత్ (చింతా. అజన్త. 46) అను సూత్రముచే చివరి దీర్ఘము నకు హ్రస్వము (కర్త్+అ=కర్త) (చింతా. అజన్త. 48) విధాత్రాది గణమందలి విధాతృ మున్నగు శబ్దములకు డాబాదేశము వైకల్పికము. ఉదా:- విధాత, విధాతృఁడు మొ॥ (చింతా. అజన్త. 49) చూ:- విధాత్రాదులు.

**-డి(న్)**

తద్ధర్మ ప్రథమైక వచనమందు క్రియపై వికల్పముగా వచ్చు ప్రత్యయము. (అథ. కా. క్రియా. 9) డివర్ణకము పరమగునవుడు ధాతువు చివరి ఉకారమునకు ఎకార మాదేశమగును. ఉదా;- వచ్చెడిన్, పోషించెడిన్ మొ॥ డి వర్ణకము రాని పక్షమున వచ్చున్, పోషించున్ మొ॥ రూపములుండును. చూ:- ఎడిగాగమము.

**-డీఙ్**

బహువచనముపై విధింపఁబడిన 'ఆ' ప్రత్యయముపై వచ్చు స్త్రీ ప్రత్యయము. ఇందలి ఙకారమిత్తై లోపించును. ఇది ఙిత్తగుటచే బిందుపూర్వక మగును. ఉదా;- వగలాఁడి. వన్నియలాఁడి. (వై. చం. స్త్రీప్రత్యయ 5) చూ:- ఆడి

**-డున్**

తద్ధర్మ ప్రథమైక వచనమందు క్రియపై వికల్పముగా వచ్చు ప్రత్యయము. (అథ. కా. క్రియా. 9) డు వర్ణకము పరమగునపుడు ధాతువు చివరి ఉకారము నకు ఎ కారమాదేశమగును. ఉదా:- వచ్చెడున్, వచ్చున్ మొ॥ కొన్నిచోట్ల ఈ

డు వర్ణకము విశేషణమగును. (అథ. కా. క్రియా. 10) ఉదా:- వచ్చెదువాఁడు, చల్లెడువాఁడు మొ॥ విశేషణార్థమున నీ డువర్ణమునకు లోపము వచ్చును. ఉదా:- రక్షించువాఁడు మొ॥ చూ:- ఎడుగాగమము.

**-డు కారము**

దేవమనుష్యాదికములను దెనిఁగించునెడ అజంత శబ్దముల తుదనుజేరును.

రజనికరుఁడు, విజయుఁడు (కా. చూ. IX. 25, 26)

**-డుఙ్[1]**

అనిదంతమైన (హ్రస్వ-ఇకారాంతముకాని) మహచ్ఛబ్దముపైవచ్చు సు (ప్రథమైకవచన) ప్రత్యయస్థానమున పుంలింగమునవచ్చు ఆదేశము. (చింతా.అజంత.12) ఇందలి ఙకార మిత్సంజ్ఞకమై లోపింపఁగా 'డు' మిగులును. ఇది ఙిత్తగుటచే 'సానునాసికోచ్చారణం ఙిత్' అను ప్రాకృత సూత్రానుసారము అనునాసికోచ్చారణముచే రాముఁడు అని యగును. 'హ్రస్వాత్పూర్ణోఽపి భవేత్' (చింతా. సంధి. 20) అను సూత్రముచే పూర్ణబిందువురాగా రాముండు అని యగును. (చింతా. అహో. అజంత. 12) సంబోధనైక వచనమునందును డుఙ్వచ్చి రాముఁడ అనియగును. కొందర మతమున సంబోధనమున డుఙ్రాదు. అదాగమము మాత్రమే వచ్చి రామ, కృష్ణ మున్నగు రూపములగును. (చింతా. అజంత. 20) దశరథాపత్యము, బ్రహ్మము, లోకము, మున్నగు శబ్దములు మహద్వాచకములైనను పుంలింగములు కానందున వీనిపై 'సు' స్థానమున డుఙ్రాదు. 'సర్వేభ్యోవిధిభ్యో లోపవిధిర్బలీయాన్' అను పరిభాషచే హ్రస్వేకారాంత శబ్దములపై సు ప్రత్యయమునకు లోపము అవశ్యము రావలసియున్నది. అనగా ఇకారాంతములపై సుస్థానమున డుఙ్నకు ప్రసక్తియేలేదు. కనుక మహతస్సోర్డుఙనితః (చింతా. అజంత 12) అను సూత్రమందలి అనితః అను పర్యుదాసము వ్యర్థమై మహద్వాచకములగు కొన్ని శబ్దములకు అవి నపుంసకలింగ శబ్దములైనను డుఙ్రావచ్చునని జ్ఞాపింపఁజేయుచున్నది. మహద్వాచక మిత్ర, పాత్ర శబ్దములపై సుప్రత్యయమునకు డుఙ్వచ్చి మిత్రుండు, పాత్రుండు ఇత్యాది రూపములేర్పడును. వీనికి మిత్రము, పాత్రము మున్నగు రూపాంతరములును ఉండును. (అహో. అజంత 12, అథ. కా. అజంత 4) చూ:- డుఙ్వర్ణకము.

**డుఙ్[2]**

నాథ, నాయక, సారంగ, పారిజాత మున్నగు అమహచ్ఛబ్దముల కంటెను ఈ ప్రత్యయము వచ్చును. ఉదా:- పతంగ నాఁథుడు, పక్షినాయకుఁడు, దాసమనోజ్ఞ సారంగుఁడు, దానపారిజాతుఁడు మొ॥ (అథ. కా. అజంత 7) మహచ్ఛబ్దము స్వార్థమునందు ఒకానొకచోట ము వర్ణకాంతమును, డుజంతమును అగును. ఉదా:- రాజవృషభుఁడు, రాజ వృషభము మొ॥ అమహచ్ఛబ్దమునకు

స్వార్థమున |శ్లేషతయందు ఒకానొకచో డుజ్ఞు వచ్చును. ఉదా:- రాజహంసుల బట్టరాదు సుమ్మి మొ॥ (అథ. కా. అజంత 5)

**డుఞ్[3]**

వ్యతిరేకార్థమందును, భవిష్యదర్థమందును, వర్తమానార్థమందును క్రియాపదముల ప్రథమ పురుషైకవచనమున వచ్చు ప్రత్యయము. ఇందలి ఞకారమిత్తై లోపింపఁగా డు మిగులును. ఉదా:- ఘటింపఁడు, ఘటింపఁగలఁడు, ఘటింపుచున్నాఁడు మొ॥ (చింతా. క్రియా. 19)

**డుఞంతము**

డుఞ్+అంతము

బిందుపూర్వకమగు డువర్ణకము అంతమునందు వచ్చునట్టి శబ్దము డుఞంతమనఁబడును.

రామున్డు, మగఁడు (ల. వ్యా. అజన్త. 19)

**డుజ్ఞు[1]**

'డుఞ్' అను హలంత శబ్దమున కుత్వదిత్వములు చేర్పగా నేర్పడిన శాస్త్రీయ పదము.

ఞకార మిత్సంజ్ఞ. కావున ప్రయోగమునందు మానఁబడును.

జిత్తు బిందుపూర్వకమగును—రాముండు, రాముఁడు. ఇత్యాదు లందిది మహదేకవచన ప్రత్యయము.

(చూ.) డుజ్ఞు[2]; డుఞ్[1], డుఞ్[2] (బా. వ్యా. తత్సమ. 20)

**డు|ఱులు**

డుఞ్, రు—అను ప్రథమ పురుష ఏకవచన బహువచన ప్రత్యయములు.

వచ్చుచున్నాడు

వచ్చుచున్నారు. (బా. వ్యా. క్రియా. 12)

**డు|ఱువురునుముఞ్**

డుఞ్, రు—ప్రథమము

వు, రు—మధ్యమము

ను, ము—ఉత్తమము

'లట్' (చూ.) మున్నగు లకారములకు ఈ డుఞాదు లాదేశమగును.

ఇందు 'ఞ్' కారము ప్రత్యాహారార్థము.

(చూ.) డుఞ్ (బా. వ్యా. క్రియా. 8)

**డుజ్ లోపము**

కొన్ని శబ్దములందు డుజ్ లోపించును.—కొండవీటి జంగమునోదు.

(క. సం. వి. III. 4)

**డుజ్వర్ణకము**

'డుజ్' అను ప్రత్యయము. జకారము ఇత్సంజ్ఞ. (చూ.) కావున 'డు' బిందు పూర్వకమగును.

రాముండు, రాముఁడు

చూ. డుజ్ఞు[1] (బా. వ్యా. తత్సమ. 20)

**డుఙ్**

డుజ్, రు, వు, రు; సు, ముఙ్ -అను ఆఖ్యాత క్రియా విభక్తులయొక్క ప్రత్యాహార సంజ్ఞ.

డు......ఙ్ అను వాని నడుమనున్న రు; వు, రు; ను, ము; అనువానికిని, డువర్ణకము నకును నిదిసంజ్ఞ. (బా. వ్యా, కృదన్త. 1.)

**డుత్వము పాయుట**

పాఱుఁడు, అల్లుఁడు, తమ్ముఁడు మున్నగు పదములు సమాసములగునపుడు డుత్వము లోపించును.

పాఱువాండ్రు, అల్లువాండ్రు

తమ్ముఁగుఱ్ఱలు మున్నగునవి. (క. సం. వు. II. 109)

**-డున్ వర్ణకము**

అనంతరార్థము నందు-డున్ అను వర్ణకము ధాతువునకుఁజేరును.

జాబిలితోఁ తెంచుడుం గువలయంబులు వికసిల్లెను.

అంతరము లేనిది యనంతరము. జాబిలితోఁ తెంచిన వెంటనే కువలయములు వికసిల్లెనని యర్థము. ఇది యవ్యవధానమున జరుగును.

(బా. వ్యా. క్రియా. 42)

**డుమంతము**

'డు' కలది యని యర్థము.

" 'డుజ్' వర్ణకమునకుం బ్రకృతి యయినది డుమంత మనఁబడును."

రాము, దిద్దు, భార్గవు మున్నగునవి. (బా. వ్యా. తత్సమ. 23)

**-డుమ**

ఆశీరర్థమున నిపతింపఁబడిన యవ్యయము. ఇది తిఙంతమున కనుబంధముగా వచ్చును. ఉదా:- కరుణ రక్షింపుడుమ మమ్ముఁగ్రైటభారి (వై. చం. అవ్య. 9)

**డుమత్తులు**

'డుజ్' ప్రత్యయము విధింపఁబడుశబ్దములు. ఉదా:- రామ, కృష్ణ, బాల మొ॥ డుమత్తులగు శబ్దములపైవచ్చు 'అమ్' ప్రత్యయస్థానమున 'ని' ఆదేశమగును. ఉదా:- రాముని, కృష్ణుని మొ॥ (వై. చం. అజన్త 11)

**డు, ము, వు, లు**

ఇవి ప్రథమా విభక్తులు.

ఇందు డు, ము, వు—అనునవి ఏకవచన విభక్తులు.

'లు' బహు వచన ప్రత్యయము. (బా. వ్యా. తత్సమ. 1, 11, 12)

**డువర్ణకము[1]**

ప్రథమావిభక్తి ఏకవచనము.

డుజ్ వర్ణకమునే కొందఱు వ్యాకర్తలు ఇత్సంజ్ఞ లేకుండ వ్యవహరించిరి.

బాలి గాఁడు, ఒక్కఁడు (ప్రౌ. వ్యా. శబ్ద. 22, 81, 82)

**డువర్ణకము[2]**

ప్రార్థనార్థమునందు మధ్యమ పురుష బహువచన 'రు' వర్ణకమునకాదేశముగా వచ్చును.

పరిభవింపుఁడు (ల. వ్యా. క్రియా. 31)

**డువర్ణకము[3]**

'ఆఱు' మున్నగు ధాతువులకు (చూ. ఆఱ్వాదులు) పరమగు కృత్ప్రత్యయము

ఆఱు—ఆఱుడు

అమ్ము—అమ్ముడు (బా. వ్యా. కృదన్త. 20)

**డువర్ణకాదులు**

డు, ము, వు, లు మున్నగు నామ విభక్తులు. (ప్రౌ. వ్యా. తద్ధిత. 1.)

**-ౖడువు?**

విందురు, కందురు ఇత్యాది క్రియలందలి—దురులకు —ౖడు ఆదేశమగును.

విండ్రు, కండ్రు. (అం. కౌ. 707; చూ. బా. వ్యా. క్రియా. 62)

**ఢ**

మూర్ధన్య స్పర్శము (retroflex stop)

మూర్ధము-స్థానము

ప్రతివేష్టిత జిహ్వాగ్రముకరణము

స్పర్శప్రయత్నము

నాదము

మహాప్రాణము

మూఢము, ప్రౌఢ మున్నగు సంస్కృత సమములనుగూడి తెలుఁగున వ్యవహృతము.

**ణ**

మూర్ధన్యాను నాసికము (retroflex nasal)

మూర్ధము-స్థానము

ప్రతివేష్టిత జిహ్వాగ్రము-కరణము

స్పర్శ ప్రయత్నము

నాదము

అల్ప ప్రాణము

తెనుఁగు పదముల యాదియందీవర్ణముండదు.

**ణకారము డకారమగుట**

కొన్ని పదములందలి 'ణ' కారము 'డ' కారముగా నగును.

పణఁతి—పడఁతి

అణఁకువ—అడఁకువ (ఆం. కౌ. 890 -'91)

**ణిజంతము**

ణిచ్ + అంతము

ప్రేరణార్థమునందు వచ్చు ప్రత్యయమునకు సంస్కృతమునందు 'ణిచ్' అని వ్యవహారము.

అట్టిప్రేరణార్థక ప్రత్యయమంతమందుఁగల శబ్దమునకు ణిజంతమని వ్యవహారము.

కావించెను, కావింపుము (కా. చూ. IX. 159)

**ణిచ్చులు**

ప్రేరణార్థక ప్రత్యయములు

-ఇంచు, -ఇంపు, -ఇంత మున్నగునవి. (ఆం. కౌ. 729, '30)

**ణిజర్థము**

'ణిచ్' అను ప్రేరణ ప్రత్యయము యొక్క అర్థమునిచ్చు తెలుఁగు ప్రేరణ క్రియాపదము.

చేయించును, సేవింపుదురు

పరగింతురు—ఇత్యాదులు. (కా. చూ. *IX*. 161)

**త**[1]

దంత్య స్పర్శము (dental stop)

పై దంతముల వెనుకటి మూలభాగము స్థానము.

జిహ్వాగ్రము - కరణము, స్పర్శప్రయత్నము, శ్వాసము, అల్పప్రాణము

**-త**[2]

(i) కులవాచకమునకు స్త్రీ వాచ్యమగునపుడు మతుబర్థమునందు వచ్చు **తద్ధిత** ప్రత్యయము.

కొఱవత, చాకిత (బా. వ్యా. తద్ధిత. 19)

(ii) స్త్ర్యర్థకము. (క) ఎవరియొక్క ఆడుది? అను నర్థమునందు '**ఎవ్వరిత?** ఎవరిత ?

(చ) ఒకరియొక్క ఆడుది — ఒక్కరిత, ఒకరిత

(ట) ఒక్క ఆడుది — ఒక్కొరిత, ఒకొరిత

అనురీతిని రూపములేర్పడును. (ప్రౌ. వ్యా. శబ్ద. 65)

**-త**[3]

(i) ఆశీశ్శాప సంప్రార్థనములందు 'త' వర్ణకము ద్రుతాంతమగును.

మీకు మేలు గలుగుతను (ఆశీస్సు)

నీకు రాజసత్వము గలుగుతను (శాపము)

హరి నను గృపఁగాంచుతను (సంప్రార్థనము)

చూ. కావుతాదులు (బా. వ్యా. క్రియా. 26)

(ii) దీనికచ్చు పరమగునపుడు మకారమగును.

నీకు మేలు కలుగుతమనియె (బా. వ్యా. క్రియా. 28)

**-త**[4]

'ఆవులించు' మున్నగు ధాతువులకు పరమగు కృత్ప్రత్యయము.

ఆవులించు — ఆవులింత

కొక్కరించు — కొక్కరింత (బా. వ్యా. కృదంత. 10)

**-ంత**

పరిమాణార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయము.

ఉదా:- అంత, ఇంత, ఎంత మొ॥ (వై. చం. తద్ధితా. 37)

**తకారాంత శబ్దములు**

పురుషపరములైన తకారాంత శబ్దములు ఊదుచు, తేలుచు రెండు విధములుగా తెనుఁగునందుండును.

పరీక్షిత్ < పరీక్షిత్తు / పరీక్షితుఁడు

(రంగ. IV. 47, 48)

**తట్ వర్ణకము**

బిందుపూర్వకమగు తకారమను కృత్ప్రత్యయము.

'చేయు' మున్నగు ధాతువుల కిది చేరును. అప్పుడు ధాతువు చివరి యక్షరము లోపించును.

చేయు — చేఁత

కూయు — కూఁత (బా. వ్యా. కృదంత. 5)

**తచ్ఛబ్ద 'వా' లోపము**

'వాడు' 'వారు' అను శబ్దములలోని 'వా' కొన్నిచోట్ల లోపించును.

ఎట్టివాఁడు — ఎట్టిఁడు ?

అట్టివాఁడు — అట్టిఁడు

ఇట్టివారె — ఇట్టిరె ?

(క. సం. వి. II. 98, 100, 103, 104)

**తచ్ఛబ్దాంత ధాతుజ విశేషణములు**

వాఁడు, అది మున్నగునవి యంతముందుగల ధాతుజ విశేషణములు.

చూచినవాఁడు, చూచిన యది.

(ప్రౌ. వ్యా. కారక. 27)

**తచ్ఛబ్దార్థకము**

వాఁడు — వారు, వారలు, వాండ్రు

వానిన్ — వారిని, వారలను, వాండ్రను (ల. వ్యా. అచ్చ. 78)

**తచ్ఛబ్దము**

తత్+శబ్దము

వాఁడు, అది - అని యర్థము.

ధాతుజ విశేషణములకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దమనుప్రయుక్తమగును.

వచ్చినవాఁడు, వచ్చినది

రానివాఁడు, రానిది. (బా. వ్యా. సమాస. 9)

**తచ్ఛీలము**

దానియొక్క స్వభావమని యర్థము. తద్ధర్మాదులలో నొకటి. ఈ యర్థము నందు తద్ధర్మాద్యర్థక క్రియయుపయుక్తము.

జ్వలన జ్వాలము లుప్పరంబెగయు. (బా. వ్యా. క్రియా. 22)

**తజ్జ**

(తత్+జ) సంస్కృత ప్రాకృతములనుండి పుట్టిన తెనుఁగుభాష. (చింతా.) ఇదియే తద్భవ మనఁబడును. చూ:- తద్భవము.

**తటు విభక్తులు**

తృతీయ మొదలుగాఁగల విభక్తులు. ఇది యాంగ్లమందలి oblique case అనుదాని కనువాదముగా గనుపట్టును. (గు. వ్యా. 98)

**తత్త్వబోధినీవ్యాఖ్య**

ఇది త్రిలిఙ్గలక్షణ శేషమను ప్రౌఢ వ్యాకరణమునకు శ్రీ భాష్యం వేంకట నరసింహ భాష్యకారా చార్యుల వారు విపులముగా రచించిన వ్యాఖ్యానము.

వీరు విజయనగరము సంస్కృత కళాశాలాధ్యాపకులుగాఁబనిచేసి యీమధ్యనే పరమపదించిరి.

**తత్పురుషము**

ఉత్తర పదార్థ ప్రధానము.

ఇది 'నఞ్' పూర్వసహితమై యెన్మిది విధములు.

(ఛం. ద. IV. 87,93)

(ఆ. కౌ.. 477 పంక్తి)

**తత్పురుషలు**

తెనుఁగు పదము మీఁద దేవతా భాషయు; సంస్కృతము మీఁద తెనుఁగు రూఢి మీఱ తత్పురుషలయి వర్తిలును.

తన కూర్మిరేని యప్పు

చెలువనేత్ర విలాసము

ముత్యాల తాటంకములు

(స. సా. సం. *II*. (సమాస) 12-15)

**తత్పురుష సమాసములు**

మల్లెపూవు, కోకచెరుగు, మామిడి చిగురు, పట్టుపుట్టము, నెలతక్కువవాఁడు, దొంగపలుకు, మాటనేర్పరి—ఇత్యాదులు. (ప్ర. వ్యా. 286)

**తత్పురుషాదులు**

తత్పురుషము, ద్వంద్వము, బహువ్రీహి మున్నగునవి.

వీని లక్షణములు ప్రాయికముగా సంస్కృత వ్యాకరణమునందుఁ జెప్పబడి నవియే కాని అందులేని జుంటిమోవి, చిగురుఁగేలువంటి యుపమాన పూర్వపదకర్మ ధారయ సమాసములీ తెలుఁగు బాసలో విశేషించి కొన్ని కలవు.

(బా. వ్యా. సమాస. 1.)

**తత్రార్థగత సప్తమి**

తత్రయను సంస్కృత శబ్దార్థముగల 'అందు' అనునది. ఇది సాశ్రయమును అనాశ్రయమును అగును. రామునందు, వనమునందు ఇత్యాదులలోని అందు అను సప్తమి సాశ్రయము. అందలి పువ్వుఁబోఁడులు ఇత్యాదులలోని అందు నిరాశ్రయము. (అథ. కా. అజన్త. 16)

**తత్సమక్రియలు**

తత్సమక్రియలు, తద్భవక్రియలు, దేశ్యక్రియలు, అని త్రివిధములు

ఇందు తత్సమ క్రియలు—ఉపకృతి, పరిణతి, సంవృతి (చూ ) అని త్రివిధ ములు.

(ప్ర. వ్యా. 346, 347)

**తత్సమము**

తత్+సమము—సంస్కృత ప్రాకృత తుల్యమగు భాషయని సాంప్రదాయిక వ్యాకరణముల నిర్వచనము.

రామః-రాముఁడు

సిరీ-సిరి (అప్ప. *I*. 103; బా. వ్యా. సంజ్ఞా. 18)

(ii) సంస్కృత శబ్దముపై తెనుఁగు విభక్తి ఘటించి తేట పడగఁ జెప్పినది.

పురుషుఁడు, అబల, వనము. (ఆం. భా. భూ. 20: శా. చూ. IX. 12, 13)

**తత్సమము సేయుట**

సంస్కృత సమము కావించుట.

(చూ.) తత్సమీకరణము.

సంస్కృతమును తత్సమము సేయునపుడు ఉత్వమగును. దీర్ఘము హ్రస్వము గావింపఁబడును.

భానుకులుఁడు, సీత మొదలైనవి. (క. సం. I, 25-28)

**తత్సమ విశేషణములు**

లింగ, విభక్తి, వచనములకు సంబంధించిన భేదములను బొందునవి.

ధన్య—ధన్యుఁడు, ధన్యము, ధన్యురాలు, ధన్య

నిపుణ—నిపుణుఁడు, నిపుణము, నిపుణురాలు, నిపుణ. (గు. వ్యా. 219)

**తత్సమ సమాసము**

తత్సమ పదములతో నేర్పడు సమాసము. ఈ సమాసములయందు విభక్తి సంబంధియగు ద్రుతమునకు లోపము వచ్చును. ఉదా:- రాముని గుణములు, రాముల గుణములు మొ॥ (అహో. చింతా. సంధి. 30) పై సమాసములందు షష్ఠీ విభక్తికి ద్వితీయాతుల్యత్వము (చింతా. హలన్త. 34) రాఁగా వచ్చు ద్రుతమునకు లోపము వచ్చునని గ్రహింపవలెను.

**తత్సమ సర్వనామములు**

సర్వము, విశ్వము, ఉభయము, ఇతరము, అన్యము, ఏకము, శతము, సహస్రము, ద్వితీయము మొదలైనవి.

తత్, మత్, మొదలైనవి శబ్దాంతరములతోఁగూడి తెలుఁగునఁ జేరును.

త్వదాజ్ఞ, మత్కులము, యుష్మత్కీర్తి

(ఆం. భా. శా. సర్వ. 1)

**తత్సమీ కరణము**

విశేషమగు మార్పులు లేకుండ ప్రాచీనములగు సంస్కృత ప్రాకృత శబ్దములను గాని, అర్వాచీనములగు పారసీకము, అరబ్బీ శబ్దములనుగాని నవీనములగు ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు, ఆంగ్లము మున్నగు భాషా శబ్దములనుగాని తెనుఁగు బాసలోని కనువగు విభక్తులను జేర్చి ప్రవేశింపఁజేయుట.

రామః—రాముఁడు

సిరీ—సిరి

కలమ్—కలము

ఖుసి—ఖుసి

కమాన్—కమాను

అల్మైరా—అల్మైరా

రోడ్—రోడ్డు మున్నగునవి. (తె. వ్యా. వి. పుట. 287)

**తథార్థకావ్యయము**

'తథా' అను సంస్కృత శబ్దముయొక్క అర్థముగల అవ్యయము - అట్లు అనునది.

ధాతుజ విశేషణము 'అట్లు' అనునవ్యయము తోఁగూడి కర్మధారయ సమాస మగును.

భూసురోత్తముల్ వేదముల్ **చదువునట్లు**

పెద్దదవ్వు **పోయినయట్లు**

(ప్రౌ. వ్యా. సమాస. 8)

**తదర్థకము**

తత్+అర్థకము.

వాఁడు - వారు; అది - అవి యను నర్థమునిచ్చు సర్వనామములు.

(బా. వ్యా. ఆచ్ఛిక. 24)

**తదాదులు**

(తద్+ఆదులు) తచ్ఛబ్ద పర్యాయమగు అది, మఱియు ఇది, ఏది మున్నగు హ్రస్వ ఇకారాంతశబ్దములు - వీనితుదనున్న హ్రస్వ ఇకారమునకు సంధి వికల్పముగా వచ్చును. ఉదా:- అదేమి, అదియేమి -ఇదేమి, ఇదియేమి -ఏదయ్య, ఏదియయ్య మొ॥ (చింతా. సంధి 8, అప్ప. V 78)

**తదాద్యర్థ వాచకములు**

(**తదా**+ఆది+అర్థవాచకములు) తదా, యదా, ఇదానీం మున్నగు శబ్దముల యర్థములను జెప్పు అపుడు, ఎపుడు, ఇపుడు అను తెలుఁగు శబ్దములు వీనిలో పువర్ణములోని ఉవర్ణమునకు 'పోశ్చతదాద్యర్థ వాచకేషాతః (చింతా. సంధి. 16) అను సూత్రముచే లోపము వికల్పముగ వచ్చును ఉదా:- అప్డు -అపుడు; ఎప్డు -ఎపుడు; ఇప్డు - ఇపుడు.

**తదార్థకము**

(తదా+అర్థకము) 'తదా' అను సంస్కృత శబ్దముయొక్క అర్థముగల 'అపుడు' అనునది. ఇది కళాసంజ్ఞకము. (చింతా. సంజ్ఞా. 40),

**తద్ధర్మ క్రియాసంధి**

తద్ధర్మార్థక క్రియలమీఁది యచ్చునకు సంధిలేదు. సంధి నాపుటకు నుగాగమము వచ్చును.

'మనచు నీశ్వరుఁడు' అనియేకాని 'మనుచీశ్వరుఁడ'నరాదు.

(స. సా. సం. I. సంధి 30, 31)

**తద్ధర్మ భూతక్రియలు**

తద్ధర్మార్థక్రియలు, భూతార్థక్రియలు.

ఇవి రెండును ఆర్యాద్యర్థ పరకములయి (చూ.) ప్రశ్నార్థకములగును.

సద్ధర్మమార్గంబు **నలుపుదయ్యా?**

పంచితయ్యా?

(నిజమునకిందలి కాకువు మూలముననే ప్రశ్నార్థక స్ఫురణము కల్గును)

(ప్రౌ. వ్యా. క్రియా. 8)

**తద్ధర్మము**

(i) భూతభవిష్యద్వర్తమాన విలక్షణమైన యొకానొకధర్మము.

(కవిజనాం. 86)

(ii) తద్ధర్మాదులలో నొకటి, వాని/దానియొక్క ధర్మము.

కులాలుఁడు కుండలు చేయును. (బా. వ్యా. క్రియా. 22)

**తద్ధర్మాదులు**

'తద్ధర్మము' మున్నగునవి.

తచ్ఛీలము, సంభావనము, సంప్రశ్నము, సాతత్యము, వర్తమానము, భావి, ఆశీస్సు (చూ.) మున్నగునవి యాది పదముచే గ్రహింపనగును.

తద్ధర్మాదులకే 'లాట్ట' ని(చూ.) వ్యవహారము. (బా. వ్యా. క్రియా. 22)

**తద్ధర్మార్థకము**

వర్తమానాది కాలత్రయ సాధారణ కాలమును దెల్పు క్రియావాచకములు

పురుగులు ప్రాఁకును.

(ల. వ్యా. క్రియా. 4; సం. వ్యా. క్రియా. 12)

**తద్ధర్మార్థక విశేషణము**

ధాతువు తుదను, -ఎడు, -ఎడి వర్ణకములను **వికల్పము**గాఁ **జేర్పుట**వలననిది నిష్పన్నమగును.

పోషించు, పోషించెడు, పోషించెడి (సం. వ్యా. విశ. 4)

**తద్ధర్మార్థ విశేషణము**

తద్ధర్మార్థవిశేషణము ఉదంత మగుచో **దానికచ్చు పరమగునపుడు** నుగాగమ మగును.

వచ్చు+ఆతఁడు—వచ్చున్+అతఁడు—వచ్చునాతఁడు.

(బా. వ్యా. సంధి. 33)

**తద్ధిత ప్రత్యయము**

తద్ధితములనఁగా ప్రయోగములకొఱకు **హితము**లయినవని శబ్దార్థము. (**తేభ్యః**-ప్రయోగేభ్యః, హితాః-తద్ధితాః) ఇట్లు హితము లయిన **ఈ** ప్రత్యయములనేకార్థ ములందు నామములకుఁజేరును.

-అరి, -ఇఁడి, -కాఁడు మున్నగునవి. (ఆం. కౌ. 687, 688 ఆం. భా. శా. సమాస. 87; (ఆం. భా. వి. పుట 551)

**తద్ధిత పదములు**

-అరి, -ఇఁడి, -కాఁడు మున్నగు తద్ధిత ప్రత్యయములతో **గూడిన** పదములు. వీనినెఱుఁగుట 'పరమ విజ్ఞానము' (చూ. తద్ధితప్రత్యయములు)

(కా. చూ. IX. 142)

**తద్ధితములు**

'ప్రయోగములకొఱకు హితములయినవి' అనిశబ్దార్థము. (**తేభ్యః**, ప్రయోగేభ్యః, హితాః)

విశేష్యములకుఁగాని, విశేషణములకుఁగాని భావార్థము, స్వార్థములోనగు నర్థముల యందు రాదగిన ప్రత్యయములు.

(చూ.) తద్ధిత ప్రత్యయములు.

(సు. వ్యా. తద్ధిత. 1.)

**తద్ధిత వర్ణకములు**

(చూ.) తద్ధిత ప్రత్యయములు.

-తన, -ఱిక, -న, -ఇ, -అరి మున్నగునవి. (మ. ప. వ్యా. ప్రత్యయ. 8.)

**తద్ధిత వృత్తి**

తెలుఁగునఁగల త్రివిధములగు వృత్తులలో నొకటి. (కృద్వృత్తి, సమాస వృత్తి, తద్ధితవృత్తి. చూ.)

విశేష్యములుగాని, విశేషణములుగాని అయిన శబ్దముల మీఁద భావాద్యర్థములందు ఆయా తద్ధితప్రత్యయముల కలయిక.

అందగాడు, చాకిత, జాలరి. (తె. వ్యా. వి. 846-50)

**తద్ధితార్థ ద్విగువు**

సంఖ్యాపూర్వకము ద్విగువు. ఇది త్రివిధములు:

(i) తద్ధితార్థద్విగువు. (ii) ఉత్తరపద ద్విగువు.

(iii) సంఖ్యాపూర్వక ద్విగువు. (చూ.)

సమాసముచే తద్ధిత ప్రత్యయార్థము చెప్పఁబడినది తద్ధితార్థ ద్విగువు.

పఞ్చభిర్గోభిః క్రీతః—పఞ్చగుః (అయిదు గోవులచేఁగొనఁబడినది)

(వ్యా. సం. న. 268/V. బా. వ్యా. ఉ. 253, '54)

**తద్భవములు**

(i) సిద్ధాక్షరములఁబొదివిన వర్ణములఁదూలి పోఁబలుకఁగ, అర్థవంతమై ప్రాకృతముతో సమానమగు పదములు.

యజ్ఞము—జన్నము

లక్ష్మి—లచ్చి

బీభత్సుఁడు— విబ్బచ్చుఁడు

(ఆం. భా. భూ. 21; కా. చూ. IX. 14, 15)

(ii) సంస్కృత, ప్రాకృత భాషాద్వయమునుండి యుద్భవించిన తెలుఁగు పదములు.

చంద్రుఁడు—చెందురుఁడు (సంస్కృత భవము)

యముఁడు—జముఁడు (ప్రాకృత భవము)

(అప్ప. I. 102; బా. వ్యా. సంజ్ఞా. 18)

(iii) వర్ణలోపాగమాదేశాది వికారములను విధివిహితముగాఁబొంది తెలుఁగున వ్యవహరింపఁబడు సంస్కృత, ప్రాకృత పదములు.

రథ—అరదము

భక్తి—బత్తి

ఉపాధ్యాయుడు—ఒజ్జ (సం. వ్యా. ఆంధ్రభాష. 2)

**తద్భవ సర్వనామములు**

సంస్కృత ప్రాకృత భవములైన సర్వనామములు.

ఎక్కటి, ఎక్కము, పనసమున్నగునవి.

(ఆం. భా. శా. సర్వ. 1.)

**తద్భవీకరణము**

తద్భవము గావించుట. తద్భవ మేర్పడునపుడు స్వరములలోను, వ్యంజనములలోను మార్పులు గల్గును. వానినీ క్రింది రీతిని సూత్రరూపమున నిరూపింపనగును.

*I* స్వరములలోని మార్పులు :

(i) -అ -> -ఇ :

కాకము—కాకి

కూష్మాండము—గుమ్మడి

ద్వయము—దోయి

లాంగలము—నాగలి

(ii) -ఇ > -అ : యువతి—ఉవిద

శష్కులి—చక్కిలము

(iii) ఉ > ఒ : కులము—కొలము

కుమారుఁడు—కొమరుఁడు

తుండము—తొండము

(iv) -ఉ -> ఇ : పశువు—పసి

మృత్యువు—మిత్తి

(v) ఋ > ఎ : నృత్యము—నెత్తము

మృదువు—మెదవు

(vi) ఋ > రి : ఋక్షము—రిక్క

(vii) ఐ > ఏ : వైరము—వేరము

(viii) ఔ > ఒ : క్రౌంచము—కొంచ

(ix) ఉత్వాదేశము : రూపము—రూపు
మీనము—మీను
వాదము—వాదు
రాజన్—రాజు

(x) ఉవాదేశము : అర్ఘ్యము—అగ్గువ
సత్త్వము—సత్తువ

(xi) ఎత్వాదేశము : సంధ్య—సందె
దండము—దండె
చిహ్నము—చిన్నె
విద్య—విద్దె

(xii) అచ్చులపైవత్వాదేశము :
ఓఢ్ర—వడ్డె
ఉత్కృష్టము—వెక్కసము

(xiii) సున్నలోపము : ఏకాంతము—ఏకతము
కూష్మాండము—గుమ్మడి

సున్నచేరుట : కేతకి—గేదంగి/గేదఁగి

(xiv) దీర్ఘము > హ్రస్వము :
ఆకాశము—ఆకసము
ఏకాంతము—ఏకతము

II వ్యంజనములలో మార్పులు:

(i) -క -> -గ
ద్వికము-దుగ

(ii) -క > -య
దీర్ఘిక—డిగ్గియ
ఘటికా—గడియారము

(iii) క్ష > చ/స/క్క/క
లక్ష్మి—లచ్చి
క్షేమము—సేమము

పక్షి—పక్కి

లాక్ష—లక్క

క్షారము—కారము

పరీక్షించు—పరికించు

(iv) చవర్గమునకు తవర్గము

చించ—చింత

సూచి—సూది

వ్రజ—వ్రేత

బీజము—విత్తు

(v) —చ- > -స:

నారాచము - నారసము

హంస - అంచ

(vi) - ట > - డ : అటవి - అడవి

జట - జడ

మంటపము - మండపము

(vii) - ఢ -> - డ ప్రౌఢ - ప్రోడ

(viii) -ణ > - డ ప్రేంకణము - పెంకడము

గ్రామణి - గామిడి

(ix) - త > - డ పతాక - పడగ

(x) -త > -చ/జ : భూతము - బూచి

జాతి - జాజి

(xi) - త > - య : రాత్రి - రేయి (?)

వక్త్రము - వాయి (?)

(xii) - థ >-డ/చ : పృథివి - పుడమి

రథ్యము - రచ్చ

(xiii) -ధ >-ద వర్ధకి - వడ్రంగి

శ్రద్ధ - సడ్డ

వృద్ధి - వడ్డి

(xiv) -న> - డ : అంగనము - అంగడి

(xv) -న> - ణ : విజ్ఞానము - విన్నాణము

శాణము - సాన

(xvi) -జ్ఞ> - న : విజ్ఞానము - విన్నాణము

ఆజ్ఞ - ఆన

సంజ్ఞ - సన్న

(xvii) -ణ> - న : గుణము - గొనము

పూర్ణిమ - పున్నమ

(xviii) -ప> - వ : ద్రౌపతి - ద్రోవది

(xix) -మ> - వ : హిమము - ఇవము

(xx) చతుర్థములకు తృతీయ : ఘని - గని

జంఝాటము - జంజాటము

(xxi) అనునాసికములకు బంధుత్వము :

ద్రోణము - తూము (?)

రాజ్ఞి - రాణి

సంజ్ఞ - సన్న

(xxii) య> - జ : యోగి - జోగి

యముఁడు - జముఁడు

(xxiii) య> - $\phi$

యశము - అసము

మాణిక్యము - మానికము

(xxiv) -ర> - - $\phi$

ధాత్రి - దాది

వర్తిక - వత్తి

(xxv) ల> - డ

ప్లవము - పడవ

(xxvi) -ల> - ర

స్థూలము—తోరము

కర్తశము—కత్తెర

(*xxvii*) అంతస్థల కన్యోన్యవ్యత్యయ :

తిత్తిరము—తీతువు

కల్హారము—కలువ

వర్తులము—వట్రువ

(*xxviii*) హ> - φ హంస—అంచ

హడపము—అడపము

(*xxix*) హ-> - గ

సింహము—సింగము

(*xxxx*) -హ> - య

స్నేహము — నెయ్యము

సందేహము—సందియము

(*xxxxi*) శ, ష > స

శాల—సాల

ఆశ—ఆస

శుల్కము—సుంకము

రోషము—రోసము

(*xxxxii*) ఊష్మలు > - అంతస్థలు

గృహము—గివము/గీము

శేఫాలిక—వావిలి

వైశ్యులు—బేరులు

(*xxxxiii*) -శ >-డ :

ప్రవాళము—పవడము

వకుళము—పొగడ

(*xxxxiv*) వర్గద్వితీయములకు వర్గప్రథమలు :

ముఖము - మొకము

పీఠము - పీట

గ్రంథి - కంతి

(*xxxxv*) సంయోగము తొలఁగుట :

స్నిగ్ధము - నిద్దము

స్వామి - సామి

(xxxxvi) వర్ణలోపము :

కపోతము - గువ్వ

తామరసము - తామర

కాననము - కాన

(xxxxvii) మధ్య వర్ణలోపము :

అమావాస్య - అమాస

కబళము - కడి.

(ఇందుకొన్ని తద్భవము లగునో, కాదో పరిశీలింపవలసి యున్నది.)

(క. సం. వి. III -1-10)

**—తన**

త్వార్థము (భావార్థము) న వచ్చు తద్ధితప్రత్యయము. ఉదా:- దొరతనము, దొడ్డతనము, పెద్దతనము మొ॥ (చింతా. హలన్త. 28). తన ప్రత్యయము పరమగునపుడు హ్రస్వ-ఉకారాంతముకంటె ను మాగమము వచ్చును. ఉదా:- సొగసుందనము (సొగసు+న్+తనము) మొ॥ (చింతా. సంధి 81) మం. ఆం. కౌ. యందు 'తన' యనునది ప్రత్యయముగా కాక ఆగమముగా చెప్పఁబడినది. (278 సూ)

**-తనమ్ :-**

సంస్కృతమున భావార్థమున వచ్చు 'త్వ' ప్రత్యయ స్థానమున ఆదేశముగ వచ్చు ప్రత్యయము. ఇందలి మకారమిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- దొరతనము మొ॥ (వై.చం. తద్ధితా. 29)

**-తనము**

చూ. -తన ప్రత్యయము.

మంచితనము, లోభితనము మున్నగునవి. (ఆం. భా. భూ. 166)

**తపరకరణము**

తకారమును బరమందుంచుట.

తకారమును హ్రస్వమునకుఁబరము చేసిన హ్రస్వమే; దీర్ఘమునకుఁ బరము చేసిన దీర్ఘమే. (తపర స్తత్కాలస్య॥ పా. 1-1-70)

అట్లుకాక -కార ప్రత్యయమును (చూ.) జేర్చినచో నాస్వరము హ్రస్వముగాని దీర్ఘముగాని కావచ్చును.

ఇత్తు - హ్రస్వమగు ఇకారము

ఈత్తు - దీర్ఘ మగు ఇకారము

ఇకారము - ఇ, ఈ. (బా. వ్యా. తత్సమ. 45)

**త-ప్రత్యయము**

చూ. తజ్

కృత్ప్రత్యయము. కోఁత, వ్రాఁత, చేఁత, మోఁతాదులయందు కర్త్రర్థము నందు వచ్చును. (ఆం. కౌ. 791)

**తమ్ :-**

సూర్యగణ రూపముననున్న జాతివాచక శబ్దముకంటె పరముగా స్త్ర్యర్థమున వచ్చు ప్రత్యయము. (ఇట సూర్యగణరూపమనఁగా గురువు, లఘువు (గలము) కలది మాత్రమే గ్రహించవలెను). ఇందలి మకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- బాపత, కాపత మొ॥ (వై. చం. స్త్రీప్ర. 7). ఇది తచ్ఛబ్దములపైనను. ఏకశబ్దము పైనను స్త్రీప్రత్యయముగా వచ్చును. ఉదా;- అవ్వత, ఒక్కత (వై, చం. స్త్రీప్ర. 8)

**తమ్మిఁగుజ్జులు**

కుజ్జులయిన తమ్మిలు సమసించుచో కుజ్జతమ్ములు కావలయును. అట్లుగాక తమ్మిఁగుజ్జులయినది. అనఁగా విశేషణోత్తరపద కర్మధారయము. (చూ.)

ఇట్లే చిలుకమొకరి. (మొకరియైన చిలుక. మాటకారి యయిన చిలుక) ఇట్టివి విరళముగానే యుండును. సంస్కృతమునందలి 'మయూరవ్యంసకా'దు లిట్టివి.

(ప్రౌ. వ్యా. సమాస 16)

**తర, తమ భావనిరూపణము**

—తర, —తమములనునవి సంస్కృతమునందు తద్ధితప్రత్యయములు.

బుద్ధిమాన్ - బుద్ధిమత్తరః - బుద్ధిమత్తమః. బుద్ధిమాన్ - బుద్ధిమంతుఁడు. బుద్ధిమత్తరః - ఇరువురిలోనెక్కువ బుద్ధి కలవాడు, బుద్ధిమత్తమః - అనేకులలో అతిశయమైన బుద్ధికలవాఁడని యర్థము. ఇట్టివానినే యాంగ్లమున degrees of comparison అందురు. comparative degree, superlative degree.

ఇట్టి తర, తమ భావ నిరూపణమునకు ప్రత్యేకమగు ప్రత్యయములు సంస్కృతాంగ్లాది భాషలలో నిర్దేశింపఁబడుటచే ఆ భాషా వ్యాకరణములందిది ప్రత్యేక ప్రకరణమగును.

కాని తెలుఁగులో నట్టి ప్రత్యయములు లేవు, -కంటె యను నిర్ధారణపంచమీ విభక్తి-తరభావ నిరూపణమునకు, -లోపల యను నిర్ధారణ షష్ఠి (చూ.) తమ భావ నిరూపణమునకు నుపయుక్తము.

బ్రాహ్మణునికంటె క్షత్రియుండు శూరుండు

గోవుల లోపల కపిల బహుక్షీర.

(ఆం. భా. వి. 428, 24) (బా. వ్యా. కారక. 12, 16)

**తరతమార్థము**

(చూ.) తర, తమ భావ నిరూపణము తారతమ్యము.

తద్ధిత వృత్తిభేదము - మృదుతరము, మృదుతమము, గరిష్ఠము.

(ఆం. భా. శా. సమాస. 88)

**తఱచు**

ఇది 'బహుళమ'ను సంజ్ఞార్థము నందుపయుక్తము చూ. బహుళము)

కొన్నిట నిత్యము, కొన్నిట వైకల్పికము, కొన్నిట లక్ష్యముకాని దానియందు ప్రవర్తించుట యని యర్థము. "కర్మధారయ సమాసమందుకారాంత పదమున కచ్చు పరమగునపుడు టకారాగమంబు *తఱచుగా* నగు" అనుచో

చిగురుటాకు-చిగురాకు ఇత్యాదులందు వైకల్పికము.

నిగ్గుటద్దము-ఇత్యాదులందు నిత్యము

దుక్కిటెద్దు-వేల్పుటావు మున్నగువానియందు అలక్ష్య ప్రవృత్తి.

(ల. వ్యా. సంధి. 17; పుట 15-అధస్సూచిక)

**తలకట్టు**

అకారము హల్లులతోఁ జేర్చి వ్రాయునప్పటిగుర్తు. ✓

క త ప ఇత్యాదులు (గు. వ్యా. 11)

**తలకట్టుసంధి**

అత్వసంధి

ఈ సంధి వికల్పముగా నగునని యప్పకవి పేర్కొనెను.

పెద్దమ్మ, మేనయత్త (అప్ప. V. 55)

**'తలఁబ్రాలు' మొదలగు సమాసములు**

తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు, సేసఁబ్రాలు, ఊరఁబంతి, ఊరఁబిచ్చుక, తోడఁబుట్టువు తోఁబుట్టువు, ఒల్లఁబాటు, ఒదఁబాటు - ఇత్యాదులు. (బా. వ్యా. సంధి. 27)

**-తవర్ణకము**[1]

దీవించుట యందు ధాతువు మీఁద—ఎదు,—త వర్ణకములు ద్రుతాంతము లగును.

పోషించుతన్, కొట్టుతన్ (ల. వ్యా. క్రియా. 60)

**-తవర్ణకము**[2]

ఉభయ కర్తృక ప్రార్థనమునందు 'ము' వర్ణకము పరమగునపుడు క్రియమీఁద తవర్ణకమగును.

పరిభవింతము, మోతము (ల. వ్యా. క్రియా. 34)

**'తవ్య' ప్రత్యయార్థము**

'తగినది' యను నర్థమునందు సంస్కృతమున 'తవ్య' ప్రత్యయముప యుక్తము.

తెలుఁగున 'తగినది' యని వాడుదురు.

చేయఁదగినది.

ఈయఁదగినది (ఆం. కౌ. 763)

**తాంతములు**

తకారాంతములయిన సంస్కృత శబ్దములు. ఇవి ద్విరుక్తముగను అద్విరుక్తముగను నుండును.

మరుత్తు—మరుతు

మరుత్తులు—మరుతులు (ఆం. కౌ. 235,'36)

**తాచ్ఛీల్యము**

తచ్ఛీలమునకు సంబంధించినది.

ఈ యర్థవిశేషమునందు—మారి,—పోతు,—కోరు,—దారు—గొట్టు మున్నగు తద్ధిత ప్రత్యయము లుపయుక్తము.

మాయలమారి, జగడాలకోరు మొదలైనవి. (బా. వ్యా. తద్ధిత. 28)
(ఆం. భా. శా. , 37)

**తాతంభట్టు, వెల్లంకి**

కాలము: సుమారు క్రీ. శ. 1500-1600.

ఇతఁడప్పకవికిఁ బూర్వుడైన లాక్షణికుఁడు. ఇతఁడు రచించిన "కవిలోక చింతామణి" (చూ.) ఇంతవఱకు నముద్రితముగా నుండుట విచార్యము.

ఇతని గ్రంథమునుండి గుప్తార్థ ప్రకాశిక కర్త కొన్ని లక్షణ పద్యముల నుద్ధరించెను. పూర్వకవి ప్రయోగములనేకము లితనివే సంతరించెను.

**తాదర్థ్యార్థక క్రియలు**

తదర్థమనఁగా దానికొఱకు. ఇట్టి యర్థమునిచ్చు క్రియాపదములు తాదర్థ్యార్థక క్రియలు.

ఇట్టి క్రియలపై పోలె ప్రత్యయము చేరుటచే ఉత్ప్రేక్షాద్యోతకములగును.

పయట కొంగది మాన్పఁగబోలె.

(ప్రౌ. వ్యా. సమాస. 41)

**తాదర్థ్యము**

తదర్థ సంబంధము - తాదర్థ్యము. ఈ యర్థమునందు చతుర్థీవిభక్తి వచ్చును.

వాని కొఱకు వెతకుచున్నాఁడు.

దాని కొఱకు నిరీక్షించుచున్నాఁడు.

(ప్ర. వ్యా. 266

**తాను**

చూ. ఆత్మార్థము

ఇందలి ద్రుతమునకు సంశ్లేషము లేదు.

తాను+చదివె—తాఁజదివె; తానుజదివె అనియేకాని 'తాన్జదివె' అను సంశ్లేష రూపముండదు.

దీర్ఘము మీఁదిదిగాన దీనిన నెఱసున్న లేదు.

(బా. వ్యా. సంధి. 24

**తామరాదులు**

(తామర+ఆదులు) తామర, తములము మున్నగు పదములు. సమాసమున వీనిపై పవర్ణకము వచ్చును. ఉదా:- తామరపాకులు, తములపాకులు మొ॥ (మం. ఆం. కౌ. 396)

**తాముడి**

చూ. తావత్తు

తకారమునకు తాముడి సంకేతము

(‿)

(గు. వ్యా 12; ప్ర. వ్యా. సంజ్ఞా. 12)

**తారకము** [*]

గ్రంథమునందలి విషయమును గూర్చిన వివరములు అడుగున వ్రాయఁబడిన వని సూచించుగుర్తు.

(సం. వ్యా. విరతులు. 1)

**తాలవ్యాచ్చులు**

తాలువునకు సమీపముగా నాలుక ముందుభాగమున్నతమగుటచే నుచ్చరింపఁబడు స్వరములు. (**palatal vowels**)

ఇ, ఈ, ఎ, ఏ, ఎ, ఏ, ఐ లు.

(చూ.) తాలవ్యేతరాచ్చులు. (తె. వ్యా. వి. పుట 48)

**తాలవ్యాలు**

(*i*) ఇ, ఈ, చ, ఛ, జ, ఝ, ఞ, య, శ, లకు స్థానము తాలువులు. కావున వీనికి తాలవ్యాలని వ్యవహారము. (ప్ర. వ్యా. 41: వ్యా. భా. వ్యా. సంజ్ఞా .12)

(*ii*) ఇ, ఈ, ఎ, ఏ, ఎ, ఏ, లతోఁగూడిన చ, జ లు మాత్రమే తెనుఁగున తాలవ్యములు. తక్కిన యచ్చులతోఁగూడినవి దంత్యములు.

(వ్యా. భా. వ్యా. సంజ్ఞా, 40)

**తాలవ్యీకరణము**

తాలవ్యోచ్చారణమును బొందించుట. తాలవ్యాచ్చులతో (చూ.) గూడిన కకారము (ప్రాచీన ద్రావిడ భాషకుల జెందినది) తెనుఁగునందు తాలవ్యీకరణమును (palatalisation) బొందును. అనఁగా చకారమగును.

*కిళి—చిలుక

*కిలుమ్—చిలుము. మొదలైనవి. (ఆం. భా. వి. 298 పుట)

**తాలవ్యేతరాచ్చులు**

తాలవ్యాచ్చులు (చూ ) కాక, తదితరములైనయచ్చులు. అనఁగా అ, ఆ, ఉ,) ఊ, ఒ, ఓ, ఔలు.

ఇట్టి యచ్చులతోఁగూడిన చ, జ లు తెలుఁగునందు దంత్యోచ్చారణమును బొందును. (తె. వ్యా. వి. పుట 66

**తాలుజాక్షరములు**

తాలుస్థానమునుండి ఉత్పన్నమైన యక్షరములు. ఇ, ఈ, ఎ, ఏ, లతోఁగూడిన చ, జ లు. =చిలుక, చీమ, చెత్త, చేత, జిల, జీడి, జేజె, మున్నగునవి.

(అప్ప. *II*. 118)

**తాలుభవములు**

(*i*) తాలువుస్థానముగా నుత్పన్నమైన చ, జ లు.

(చూ.) తాలుజాక్షరములు.

చిఱుత, జెట్టి యిత్యాదులు. (అప్ప. II. 120)

(ii) ఇకారము. చవర్గము, యకార శకారములు. -(ఆం.కౌ. 60)

**తావత్తు**

తకారము నితర హల్లులకుఁబరముగా వ్రాయునపుడు గుర్తు '—ు'

అత్త, గిత్త, రక్తము (గు. వ్యా. 12)

**తావదర్థకము**

'తావత్' అనుదాని యర్థమునిచ్చు "అన్ని" అను సర్వనామము.

(బా. వ్యా. ఆచ్ఛిక. 24)

**తిగుచుధాతువు**

దీని యన్నంత రూపములు—తివ్వు, తివ, అగును.

'ఎవ్వరికిని మోపెట్టను, తిప్పను శక్యముకాదు'

'కొప్పువట్టి తివంబోవ' (ప్రౌ. వ్యా. క్రియా. 20)

**తిఙ్**

సంస్కృత ధాతువులపై లట్ మున్నగు దశలకారముల స్థానమున వచ్చు ప్రత్యయములు (అష్టా). అవియివి.

| ఏ.వ. | ద్వి.వ. | బ.వ. | |
|---|---|---|---|
| తిప్ | తస్ | ఝి | (ప్రథమ పురుషము) |
| సిప్ | థస్ | థ | (మధ్యమ పురుషము) |
| మిప్ | వస్ | మస్ | (ఉత్తమ పురుషము) |

ఇవి పరస్మైపది ధాతువులపై వచ్చును.

| | | | |
|---|---|---|---|
| త | ఆతాం | ఝు | (ప్రథమ పురుషము) |
| థాస్ | ఆథాం | ధ్వమ్ | (మధ్యమ పురుషము) |
| ఇట్ | వహి | మహిఙ్ | (ఉత్తమ పురుషము) |

ఇవి ఆత్మనేపది ధాతువులపై వచ్చును. 'తిప్' ప్రత్యయములోని తివర్ణమునకు మహిఙ్లోని ఙకారముతో ప్రత్యాహారము చేయఁగా తిఙ్ అను సంజ్ఞ సిద్ధించును. తిఙంతములగు పచతి, పచతే యనునవి తెలుఁగులో అనుకరణమునఁదప్ప ఇతరత్ర ప్రయోగింపఁదగవు (చింతా. సంజ్ఞా .38)

**తిఙ్ంతము**

(తిఙ్+అంతము) తిఙ్ (తిప్, తస్ మున్నగు క్రియావిభక్తి ప్రత్యయములు

అంతమందుఁగల పదము. ఉదా:- పచతి, పచతే మొ॥ వీనికి తెనుఁగున అను- కరణమునఁదప్ప ఇతరత్ర ప్రయోగము లేదు. (చింతా. సంజ్ఞా. 38) చూ: తిఙ్.

**తిఙ్ ప్రత్యయములు**

'తి' మొదలు 'ఙ్' వఱకుఁగల క్రియా విభక్తులకు సంస్కృతమునందు తిఙ్ప్రత్యయములని వ్యవహారము.

తెలుఁగున 'డుఙ్, రు; వు, రు; ను, ము' అను నాఱుమాత్రమే క్రియా విభక్తులు. వీనినే సంస్కృత పద్ధతితో తిఙ్ప్రత్యయములనియు నందురు.

(తె. వ్యా. వి. పుట. 940)

**తిఙ్మధ్యములు**

మధ్యమ పురుష క్రియా పదములు మఱియు రేఫకాని మకారము కాని అంత మందుఁగల క్రియాపదములు. ఉదా:- రంజించితివి, చేసితివి (మధ్యమపురుష క్రియలు). పోయిరి, ఘటించిరి (రేఫాంతక్రియలు) ఘటించితిమి, చేసితిమి (మకారాంతక్రియలు) మొ॥ (చింతా. క్రియా. 37, వై. చం సంజ్ఞా. 28) తిఙ్మధ్య సంజ్ఞకములగు క్రియలు కళలు. (చింతా. సంజ్ఞా. 40)

**తిఙ్వృత్తి**

'తిఙ్' ప్రత్యయము (చూ.) అనఁగా క్రియా విభక్తితోఁగలయికను 'తిఙ్వృత్తి' యని రాజశేఖరుఁడు తన కావ్యమీమాంసలోఁ బేర్కొనెను.

(తె. వ్యా. వి. పుట. 8?2)

**తిఙ్సుబంతములు**

తిఙన్తములు, సుబంతములు. అనఁగా క్రియలు, నామములు.

సంస్కృత సుబన్త, తిఙన్త పదములను తెనుఁగు బాసలో ననుకరణము నందుఁగూర్పనగును.

'ధిక్కృత దురితాయ భగవతేఽస్తునమో' యంచు.

(అ. ఛం. IV. 29)

**తి దు ట లు**

తి, దు, ట అను వర్ణములు.

'అను' మొదలగు ధాతువులకు, తి, దు, ట, అను వర్ణములు పరమగునపుడు 'ను' స్థానమునందు సున్న వచ్చును.

తినుదురు - తిన్దురు - తిందురు.

అనుట - అణ్ట - అంట

సున్న విధింపఁబడుట కేవలము లేఖనమునకు సంబంధించినది. పైరీతిని పరిణామమును గుర్తింపనగును.

బిందువు మీఁది త, ద, లకు నిత్య వైకల్పికములుగా ట, డ లగును.

అనితివి - అంటివి (నిత్యము)

అనుదురు - అందురు, అండ్రు. (వైకల్పికము)

(బా. వ్యా. క్రియా. 58, 59)

**తిమ్మకవి—కూచిమంచి**

కాలము : క్రీ. శ. 1700-1757.

ఇతఁడు సర్వలక్షణ సార సంగ్రహమను లక్షణగ్రంథమును (చూ.), నీలా సుందరీ పరిణయము, అచ్చతెనుఁగు రామాయణము మున్నగు కావ్యములను గూడ రచించెను.

"నన్నయభట్టాదులు గృతులన్నిలిపిన లక్ష్యములును లక్షణములు యుక్తిన్నెమకి" ఈతఁడు లక్షణకృతి నొనఁగూర్చెను.

**తిరియ్వాదులు**

తిరియు+ఆదులు. 'తిరియు' మున్నగు ధాతువులు. కలయు, పొలయు, మురియు మున్నగునవి.

వీనికి పవర్ణకము చేరినచో అంతిమాక్షరము లోపించును. 'ము' ప్రత్యయము చేరును.

తిరిపము, కలపము, పొలపము, మురిపము అను కృదన్త రూపములేర్పడును.

(బా. వ్యా. కృదంత.9)

**తిర్యక్కులు**

i) పశువులు, పక్షులు, (అడ్డముగా సంచరించునవి)

కొన్ని తిర్యక్కులకు 'కా' వర్ణకము (చూ.) కానఁబడియెడి. 'కా' మగాది గణము (చూ.) లోనిదిగావున 'డుఙ్' చేరును.

ఇబ్బందిగాఁడు, ఒంటిగాఁడు, కొమ్ముకాఁడు, పరికాఁడు మున్నగునవి మృగ విశేష వాచకములు.

గిజిగాఁడు పక్షివాచకము (బా. వ్యా. తద్ధిత. 14)

ii) వీనిని తెల్పు శబ్దములు అమహత్తులు.

కుక్క, కాకి మున్నగునవి. (బా. వ్యా. తత్సమ. 17)

క్రియాంతరము ప్రయోజనముగా గల క్రియ ఉపపదమై యుండఁగా తుమున్ ప్రత్యయము విధింపఁబడినది. ఇందలి చివరి నకారమిత్సంజ్ఞకము. ఉకారముచ్చారణార్థము. కాగా 'తుమ్' అని మిగులును. ఇది యంతమందుఁగల ద్రష్టుమ్, భోక్తుమ్,, పఠితుమ్ మున్నగు పదములు తుమున్నంతములు- ఈ సంస్కృత పదములకు తెలుఁగున ప్రయోగము లేదు. (చింతా. సంజ్ఞా 38, ఆం భా. భూ. 29, ఆం. కౌ. 761)

**తుము న్నర్థము**

సంస్కృతమునందలి 'తుమున్' ప్రత్యయార్థమునిచ్చు 'ను' (జి) యను ప్రత్యయము.

తుమున్నర్థమనఁగా నొక క్రియకు మఱియొక క్రియ హేతువై యుండుట, ఈ యర్థమునందుఁ గ్రియలమీఁద ద్రుతాంత మయిన అకార మాదేశమగును.

వాఁడా కార్యమును *జేయన్* వచ్చెను.
రాజు శత్రువులను *సంహరింప* వెడలెను. (ల. వ్యా. క్రియా. 89)

**తురీయ వర్ణాలు**

వర్గ చతుర్థ వర్ణములు.
ఘ, ఝ, ఢ, ధ, భ. (వ్యా. భా. వ్యా. సంజ్ఞా. 31.)

**తులనాత్మక వ్యాకరణములు**

ఒక భాషాకుటుంబమునకుఁజెందిన భాషలను సోదరభాషలందురు. (**cognate languages**) ఇట్టి సోదరభాషలలోఁగల సమానాంశములను బరిశీలించి వ్రాయఁబడిన వ్యాకరణమునకు 'తులనాత్మకవ్యాకరణము' అని పేరు. (**A comparative grammar of the Dravidian Languages or south Indian Family of languages**),. ఇది 1875లో ప్రచురింపఁబడెను.

ఇందలి వాదమును బ్రతిఘటించు చిలుకూరి నారాయణరావు గారు (చూ.) ఆంధ్రభాషాచరిత్రను రెండు సంపుటములుగా రచింపఁగా ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారు దానిని ప్రచురించిరి.

ఆచార్యగంటి జోగిసోమయాజి గారి ఆంధ్రభాషావికాసమను నుద్గ్రంథము కాల్డ్వెల్ సిద్ధాంతమును బలపఱచును. శ్రీ వజ్ఝల చిన సీతారామశాస్త్రిగారు 'ద్రావిడభాషా పరిశీలనము' (రెండు సంపుటములు) సోదర భాషలలోని వ్యాకరణము లాధారముగా రచించిరి.

**తుల్యార్థము**

సమానమను నర్థముగల శబ్దములతో సంబంధమున్నపుడు '**తోడ**' వర్ణకము గాని, -కు వర్ణకముగాని యగును.

చైత్రుని తోడ మైత్రుఁడు తుల్యుఁడు

చైత్రునకు మైత్రుఁడు తుల్యుఁడు. (బా. వ్యా. కారక.5)

**తు వర్ణకము**

బహువ్రీహి సమాసమున ఉత్తరపదమగు విల్లు శబ్దమునకు పరముగా వచ్చు ప్రత్యయము. ఉదా:- అలరు విలుతుఁడు మొ। (వై. చం. సమా. 35)

**తూష్ణీమర్థకములు**

(తూష్ణీమ్+అర్థకములు). 'తూష్ణీమ్' అను సంస్కృత శబ్దముయొక్క అర్థముగల ఊరక, మిన్న, మున్నగు తెలుఁగు శబ్దములు ఇవి కళాసంజ్ఞకములు. (చింతా. సంజ్ఞా. 40)

**తృతీయ**

తృతీయా విభక్తులు, చేతన్, చేన్, తోడన్, తోన్.

(కా. చూ. IX. 97; ఆం. కౌ. 183; ఫం. ద. IV. 107; బా. వ్యా. తత్సమ. 3, 10)

**తృతీయకు ప్రథమ**

తృతీయా విభక్తికి బదులు ఒక్కొక్కచో ప్రథమావిభక్తి నుపయోగింపనగును.

'సుఖముతో నుండెను'నుటకు మాఱు

'సుఖముండెను' అననగును.

(స. సా. సం. I. విభక్తి 66)

**తృతీయా విభక్తులు**

చేతన్, చేన్

తోడన్, తోన్

(ప్ర. వ్యా. 142)

**తృతీయ దేశ్యములు**

(చూ.) ప్రథమ దేశ్యములు, ద్వితీయ దేశ్యములు కానివి. ఎట్టి విభక్తులునంత మందు కానిపించనివి.

తల, నెల, పని యిత్యాదులు. (గు. వ్యా. పుట. 35)

**తృతీయవర్ణములు**

పంచవర్గములలోని మూఁడవ వర్ణములగు గ జ డ ద బ యను నైదు సరళ వర్ణములు. (అథ. కా. సంధి 19)

**తృతీయా తత్పురుష**

తృతీయా విభక్త్యంత పదమునకు మీఁది పదముతో సమాసమయినచో నది తృతీయా తత్పురుష సమాసమగును.

నెల (చేత) తక్కువబిడ్డ

గురుతుల్యుఁడు (గురువుతో తుల్యుఁడు) మొదలైనవి.

(ఆం. కౌ. 483, 484) (వ్యా. భా. వ్యా. సమాస. 25)

**తృవర్థకార్థము**

తృ (చ్) ప్రత్యయము సంస్కృతమునందు కర్త్రర్థము నందు వచ్చును. ఇట్టి యర్థమునందు తెనుఁగున—ఎడి,—ఎడు వన్నియలగును.

ప్రహరించెడి వాఁడు }
ప్రహరించు వాఁడు } ప్రహర్తయని యర్థము

వీనికి లోపము కూడనగును— ప్రహరించువాఁడు.

(బా. వ్యా. క్రియా. 44,45)

**-తె**

జాతివాచకములగు దేశ్యశబ్దములపై స్త్రీత్వ వివక్షయందు వచ్చు ప్రత్యయము, ఉదా;- గొల్లతె, కుమ్మరతె, చాకలతె, మాలతె, మొ॥ (మం. ఆం. కౌ. 266)

**తెగడుచోటు**

నిందించు సందర్భము

ఇట్టిచో ఏత్వము వచ్చును. నీవు పొలియవే.

(ఆం భా. భూ. 154,155)

తెనుఁగు[1]

నాలుగు కోట్ల ప్రజానీకముచే వ్యవహృతమగుచున్న భాష.

(i) త్రిలింగ శబ్దము 'తెలుఁగు' అయినదని; అదియే 'తెనుఁగు' అను వ్యవహారమును గూడఁబొందినదని యొక యభిప్రాయము.

తెలుఁగులో లకార నకారములు మార్పు చెందును—ములగ-మునగ.

(అప్ప. I. 100)

(ii) 'తెన్' అను ద్రావిడ శబ్దమునకర్థము దక్షిణమని; (తెంగాయి, తెంకణాదిత్యుఁడను వ్యవహారములుగలవు) దిక్కులనుబట్టి భాషలకు పేళ్లేర్పడుసుగాన, తెన్+అగు — తెనగు, తెనుగు అయినదని యొక యభిప్రాయము. దీనినిబట్టి ఖండ బిందువు వ్యర్థముగాఁజేరిన దనవలయును.

(ఆం. భా. వి. పుట. 32-34)

(*iii*) తెనుఁగు శబ్దమే తెలుఁగయినదని వేఱొకయభిప్రాయము.

(తెలుఁగు భాషా చరిత్ర -
సాహిత్య అకాడమీ ప్రచురణ)

**తెనుఁగు²**

అచ్చ తెనుఁగు

సంస్కృత సమేతరమయిన తెనుఁగు.

ఒడయుఁడు, నిక్కము (అ. ఛం. IV. 105)

**తెనుఁగు కృత స్త్రీలింగములు**

సంస్కృతమునందలి కొన్ని స్త్రీలింగ శబ్దములు తెనుఁగునఁ బ్రయోగింపఁబడినచో, అవి యచేతన వాచకములగుచో, వాని విశేషణములు నపుంసక లింగమందుండనగును.

యశోదాతనయుఁగృపా దృష్టి సౌఖ్యదాయకము.

(క. సం. II. 35)

**తెనుఁగు డు మంతము**

'డుజ్'తోఁగూడిన అచ్చిక శబ్దములు.

మగఁడు, తమ్ముఁడు, అల్లుఁడు - మున్నగునవి.

ఇవి రెండు రకములు - (i) అనుదంతములు. మగఁడు, ఱేఁడు, వ్రేఁడు మొదలయినవి.

(ii) ఉదంతములు - తమ్ముఁడు, అల్లుఁడు.

(బా. వ్యా. తత్సమ. 24)

**తెనుఁగు పదము మీద సంస్కృతములకు గసడదవాదేశము.**

తెలుఁగుల మీఁది సాంస్కృతిక పరుషములకు గసడదవాదేశము రాదని శబ్దశాసనుఁడు విధించెనుగాని తద్భిన్నమగు కవి ప్రయోగములు గలవు.

(*i*) అవధానపరత నెవ్వండు వఠించును.

(ii) ఇట్లు దపంబు సేయుచుండెద.

(iii) వారి పెంపు వరీక్షింపమొ.

(స. సా. సం. I. సంధి. 114-118)

**తెనుఁగు లఘువ్యాకరణము (ల. వ్యా)**

రచన—శ్రీ వేదం వేంకటరమణ శాస్త్రి. (చూ.) 1856.

బాలవ్యాకరణమునకుఁబూర్వమే వెలసిన వ్యాకరణములలో నొకటి. దీని ప్రథమ ముద్రణము అలభ్యము. ద్వితీయ ముద్రణము బాలవ్యాకరణానుసారము కొంత సవరింపఁబడినట్లు గోచరింపకపోదు.

ఇందు (1) సంజ్ఞ (2) సంధి (3) సుబన్త (అజన్త, అచ్చ తెనుఁగు, విభక్త్యర్థక ప్రకరణములు (4) సమాస (5) క్రియాపరిచ్ఛేదములు గలవు.

**తెనుఁగు వ్యాకరణ వికాసము**

రెండు సంపుటములుగా 1969 లోఁ బ్రకటితమైన ఈ సిద్ధాంత గ్రంథము (Thesis) శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తముచే రచింపఁబడినది.

ఆంధ్రశబ్ద చింతామణివంటి సాంప్రదాయిక వ్యాకరణములను, ఆంధ్రభాషా భూషణము వంటి స్వతంత్ర వ్యాకరణములను భాషాశాస్త్రదృష్టితో సమన్వయించి, సమీక్షించిన ఈ సిద్ధాంత గ్రంథము ఈ శాఖలో ప్రప్రథమమైనది.

ఇందు (1) వర్ణవిభాగము (2) పదజాత విభజనము (3) సంధి (4) పద విభజనము (5) వాక్య విభజనమను ఐదు విభాగములనేకానేక ఉపశీర్షికల క్రింద విభజింపఁబడి, సంస్కృత, ప్రాకృతాంగ్లాది భాషావ్యాకరణ ప్రభావాదులెట్లు ప్రసరింపఁబడెనో విపులముగా చర్చింపఁబడెను.

**తెనుఁగు వ్యాకరణము**

కర్త : శ్రీ రావిపాటి గురుమూర్తి శాస్త్రి.

ప్రచురణ : ద్వి. ము. వావిళ్ళ వారు, 1957.

ఇది చిన్నయసూరి బాలవ్యాకరణమునకుఁబూర్వము వెలసిన వ్యాకరణములలో బ్రముఖమైనది.

బాలురకు సులభముగాఁ దెలియునట్లుగా నిది వచనమందుఁగలదు.

క్రీ. శ. 1836 లో చర్చి మిస్సయాన్ ప్రెస్సులో ముద్రితము. తెనుఁగు బాసకు నిఘంటువొకటి రచించిన A. D. Campbell దొరకిది యంకితము. దీనిని సూరిగారు చాలకాలము రాజధాని హైస్కూల్‌లో పాఠము చెప్పినట్లు నిదర్శనములు గలవు.

ఇందు వ్యవహార భాషారూపములు గూడ ప్రక్క-ప్రక్కన ప్రదర్శితము.

ఇందు క్రియాప్రకరణము మిక్కిలి విపులమైనది.

**తెలుఁగు**

(i) త్రిలింగ శబ్దభవమని అనేకుల యభిప్రాయము.

త్రిలింగ —తిరిలింగ —తెలింగ— తెలింగు —తెలుంగు —తెలుఁగు అను రీతిని దీని పరిణామము. (అప్ప. I. 100; కా. చూ. IX. 6; ఆం. కౌ. 9, 10)

(ii) కొందఱాధునికులు తెనుఁగే తెలుఁగయినదని భావించుచున్నారు.

(తెలుఁగు భాషా చరిత్ర, సాహిత్య అకాడమీ ప్రచురణ.)

**తెలుఁగుఁ బలుకు జాతము**

తెలుఁగు మాటలసమూహము. ఇది తత్సమము, తద్భవము, సహజాంధ్ర దేశభవమును, దేశ్యోద్భవమును, గ్రామ్యము అని పంచవిధము. (కా. చూ. IX. 11)

**తెలుఁగు మఱుఁగులు**

మఱుఁగు పడిన భావముగల అచ్చతెలుఁగు పదములు.

తత్సమ పదభావము అస్పష్టముగానెట్లో చేకూర్చబడిన అచ్చతెనుఁగుపదములు.

భూపుత్రి —అనుటకు 'కడలి మొలనూలి చేడియ (భూమి) గనిన పడుచు' అనుట.

ఇట్టి పలుకుబడులు అచ్చతెనుఁగు కబ్బములందధికము. (అప్ప. I. 111, 112)

**తెలుఁగు మాటలు**

అచ్చతెలుఁగు మాటలు. వీని మొదట యకారమును, వు, వూ, వొ, వో లు మొదట లేవు.

ఎవఁడు, ఏమి;

ఉండ, ఊరు, ఒకఁడు, ఓడ అనియేకాని యెవఁడు, యేమి: వుండ, వూరు, వొకఁడు అనురీతి నుండవు. (బా. వ్యా. సంజ్ఞా. 17)

**తెలుఁగురాజ (శిష్ట) వ్యాకరణము**

కర్త, పెన్మెత్స సత్యనారాయణరాజు.

ఆంధ్ర నలంద-గుడివాడవారు దీనిని 1957లో ప్రచురించిరి.

బాలవ్యాకరణమునకు సంస్కృతీకరణముగాఁ బ్రసిద్ధిగాంచిన కీ.శే. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి హరికారికల కిది యాంధ్ర పద్యానువాదము.

**తెల్గున శకారములు**

శెబాసు, శింగాణి, శిరి, శెలు, శివిరి, శేమంతి, శేకరించు, శేరు, శేపరము, శింగణావత్తి, శిరిమిడి, శిరాజి, శేమము, శేరబడు, శాబాసు, అను పదునాల్గు పదములందు శకారముచ్చరింపఁబడుచున్నదని ఆంధ్ర కౌముది యందుఁ బేర్కొనఁబడెను. (ఆం. కౌ. 894-'97)

**తేతేరులు**

'తెచ్చు' ధాతువునకు 'తే' అనిగాని, 'తేరు' అనిగాని యగును.

తేఁడు, తేరఁడు

తెమ్ము, తేరుము. (బా. వ్యా. క్రియా.98)

**తేల్చిపలుకుట**

(వ్యా) ఊది పలుకుట. (Tense articulation)

ఊదకుండ తేలికగాఁ బలుకుట (lax articulation)

ద్విత్వము లూదిపలుకఁబడును. అద్విరుక్తములు తేల్చి పలుకఁబడును. కొన్ని ద్విత్వములు తేల్చి పలుకఁబడి యద్విరుక్తములగును.

ఇంద్రజిత్తు—ఇంద్రజితు

పరీక్షిత్తు—పరీక్షితు.

వాక్కు—వాకు. (క. సం. వి. I 69-77)

**తోడ(న్)**

సహార్థమున టాన్ (తృతీయావిభక్తి) స్థానమునవచ్చు తృతీయావిభక్తి ప్రత్యయము. ఉదా:- శిష్యుల తోడ వచ్చెను మొ॥ ఇది తో(న్) అను విభక్తికిని ఉపలక్షణము. ఉదా:- శిష్యులతో వచ్చెను. (చింతా. అజన్త. 28)

**తోడవిభక్తి**

తోడ అను తృతీయా విభక్తి ప్రత్యయము. చూ:-తోడ. (అథ. కా. సంధి. 28)

**-తోడుత**[1]

i) అహోబల పండితీయమునందు ఇది విభక్త్యర్థాభిధాయకమగు దేశ్యశబ్దమనియు' తోడవలెనిది విభక్తి ప్రత్యయము కాదనియు తెలుపఁబడినది (అహో. అజన్త. 28). కాని మం. ఆం. కౌ. యందు మాత్రమిది సహార్థమున వచ్చు తృతీయా విభక్తి ప్రత్యయముగానే పేర్కొనఁబడినది. ఉదా:- కృష్ణుని తోడుత వచ్చి మొ॥ (మం. ఆం. కౌ. 124,150)

ii)—తోడ అనువిభక్తికి రూపాంతరము. 'పగతుర చేతిలోఁబడక, ప్రాణము తోడుత నున్నవాఁడవే?' (ప్రౌ. వ్యా. కారక. 8)

**త్యాగోద్దేశము**

దానమునకు గ్రహీతగా నుద్దేశింపఁబడినవాఁడు. దీనినే సంప్రదాన మందురు. (చూ. సంప్రదానము)

ఈ యర్థమునందు చతుర్థి వచ్చును.

జనకుఁడు రాముని కొఱకుఁగన్యనిచ్చెను. (బా. వ్యా. కారక. 8)

**త్రర్థము**

తృవర్ణకార్థము - అనఁగా కర్త్రర్థము.

ఈ యర్థమునందు 'కలుగు' నకు కలాదేశము విభాషనగును.

కలవాఁడు - కలాఁడు. (బా. వ్యా. క్రియా. 105)

**త్రల్**

సంస్కృతమున సప్తమ్యంతములగు కిమాది శబ్దములపై వచ్చు తద్ధిత ప్రత్యయము. ఇందలి లకార మిత్సంజ్ఞకమై లోపింపఁగా 'త్ర' మిగులును. ఉదా:- కుత్ర, యత్ర, తత్ర బహుత్ర మొ॥ (అష్టా 5-3-10). తెనుఁగులో తదాది వాచకములపై నున్న త్రల్ ప్రత్యయమునకు 'ందుమ్' ఆదేశమగును. ఉదా:- అందు, ఇందు, ఎందు (వై. చం. తద్ధితా. 34).

**త్రాణము**

కాచుట. ఈ యర్థమునందు 'వలన' వర్ణకమగును.

చోరుని వలనంగాచె (బా. వ్యా. కారక. 9)

**త్రికము**

మూఁడు అని శబ్దార్థము.

ఆ, ఈ, ఏ—అను నీ మూఁడు సర్వనామములకు చిన్నయసూరి త్రికమను సంజ్ఞను గల్పించెను.

ఇది మిక్కిలి వాడుకలోనున్న సంజ్ఞ. (చూ. త్రికసంధి)

ఆ : దూరనిర్దేశ సర్వనామము (చూ.) ఆ[4]

ఈ : సమీప నిర్దేశ సర్వనామము (చూ.) ఈ[2]

ఏ : ప్రశ్నార్థక సర్వనామము (చూ.) ఏ[5]

(బా. వ్యా. సమాస. 4)

**త్రిక సంధి**

త్రికము (చూ.) పై గల్గు సంధి.

ఆ, ఈ, ఏ లకు ఊష్మరేఫేతరములయిన యసంయుక్త హల్లులు పరమగుచో వానికి ద్విత్వము వికల్పముగా నగును.

ద్విరుక్తమగు హల్లు పరమగుచో. ఆ, ఈ, ఏ లు హ్రస్వములగును.

ఆ + కథ < అక్కథ / ఆకథ (బా. వ్యా. సమాస. 13, 14)

**త్రిలింగ దేశ్యములు**

త్రిలింగదేశమునందు వ్యవహారప్రసిద్ధములయిన తెలుఁగు శబ్దములు. ఇందు ఒత్తక్షరములుండవు.

పాలు, పెరుగు, నెయ్యి, రోలు, రోకలి మొదలయినవి.

(ప్ర. వ్యా. సంజ్ఞా. 18)

**త్రిలింగము**

శ్రీపర్వతము, కాళేశ్వరము, దాక్షారామమను త్రిక్షేత్రములందలి లింగములచే, ఆంధ్రదేశమునకు త్రిలింగ సంజ్ఞ ప్రసిద్ధికెక్కెను.

(కా. చూ. *IX*. 5)
(అప్ప. *I*. 99, 100)

**త్రిలింగ లక్షణ శేషము**

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు. (చూ.) క్రీ. శ. 1885 సం॥ ఫిబ్రవరిలో తొలి ముద్రణము. ఇది విజయనగరము మహారాజులు ఆనంద గజపతులకు అంకితము గావింపఁబడెను.

శబ్దరత్నాకరమను నిఘంటు రచన గావించుటకు సేకరించిన అసాధారణ ప్రయోగములాధారముగా నీ యపూర్వ వ్యాకరణము రచింపఁబడినట్లు ఆచార్యుల వారు పేర్కొనిరి.

ఇందలి లక్షణములనేకములు, అనంతుని ఛందస్సు, సర్వలక్షణ సారసంగ్రహము, కవి సంశయ విచ్ఛేదాదిగాఁగల పూర్వలక్షణ గ్రంథములందుద్ఘాటిత మగుటచే ఇది పూర్తిగా త్రిలింగ లక్షణ శేషమనిపించుకొనదు. కాని ఇందలి యనేక లక్షణములు బాలవ్యాకరణమునందు లేని కారణముగా దీనికేర్పడిన ప్రౌఢ వ్యాకరణమను నామము సార్థకమగును.

**త్రివిక్రమ మతసంధులు**

త్రివిక్రముఁడను (చూ.) ప్రాకృత వ్యాకర్త కభిహితమైన సంధులు.

పదమధ్యమందలి ర, ద లకుఁగల గుడులు విభాషగా లోపించును

కలికి—కల్కి

బుడిపి—బుడ్పి (అప్ప. V. 111-114)

**త్రివిక్రముఁడు**

ఇతఁడు ప్రాకృత వైయాకరణుఁడు. ఇతని 'ప్రాకృత వ్యాకరణము' విశాఖపట్నము ఆర్షము ద్రాక్షరశాలలో క్రీ.శ. 1896లో ముద్రితము.

'విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు లొనరఁజూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ'యని విన్నకోట పెద్దన సంస్మరించెను. ఈతని వ్యాకరణ ప్రభావము తెనుఁగు వ్యాకరణముపై కొంత ప్రసారితమై యుండును.

**త్రివిధ క్రియలు**

ఉపకృతి, పరిణతి, సంవృతి క్రియలు. ఉపకృతిక్రియలు :- పోషించు, నుతించు మొ॥ పరిణతిక్రియలు:- జయించు మొ॥ సంవృతి క్రియలు రంజించు, వసించు మొ॥ చూ:- ఉపకృతి క్రియలు, పరిణతి క్రియలు, సంవృతిక్రియలు.

**త్రోచివచ్చుట**

ఇది 'ఆదేశము'ను (చూ.) సంస్కృత సంజ్ఞకు తుల్యార్థమునందు కేతనాదులు కొందఱు ప్రయోగించిరి.

ప్రథమాంతముల పయినిగల క చ ట త ప లను గ స డ ద వ లు త్రోచి వచ్చును. (అం. భా. భూ. 62)

**త్రోచుట**

(చూ.) త్రోచివచ్చుట (కా. చూ. IX. 128)

**త్వరితానాదరార్థములు**

త్వరితార్థము, అనాదరార్థము (చూ.)

ఈ రెండర్థములందును తఱుచుగా ద్విరుక్తి యగును.

వేవేగ వచ్చెను.

పోపొమ్ము (ప్రౌ. వ్యా. శబ్ద. 118)

**త్వరితార్థసూచకము**

త్వరను సూచించునది. ఈ యర్థమునందు భవిష్యదర్థ క్రియకు మాఱుగా భూతార్థక క్రియ నొక్కొక్కచో ప్రయోగింపనగును.

'తావచ్చె సుదర్శనాయుధుఁడు'—అనఁగా రాఁగలఁడని యర్థము.

(ప్రౌ. వ్యా. క్రియా. 7)

**త్వాంతములు**

త్వా+అంతములు.

సంస్కృతమునందు భూతార్థకాసమాపక క్రియారూపముల యంతమునందు 'త్వా' అను ప్రత్యయముండును.

గత్వా, హసిత్వా మున్నగునవి.

వీనికే త్వాంతములని వ్యవహారము. ఇట్టివి తెలుఁగు బాసయం దుపయుక్తములు కావు. (ఆం భా. భూ. 29)

**త్వార్థము**

(త్వ+అర్థము) త్వ ప్రత్యయమువచ్చు అర్థము. 'తస్య భావ స్త్వతలౌ (అష్టా. 5-1-119) అను సూత్రముచే భావార్థమున త్వ ప్రత్యయము విధింపఁబడినది. కనుక త్వార్థమనఁగా భావార్థము. తెలుఁగున త్వార్థము (భావార్థము) నందు తన ప్రత్యయము వచ్చును. ఉదా:- దొరతనము, దొడ్డతనము, పెద్దతనము మొ॥ (చింతా బాల స. 28, బా వ్యా. తద్ధిత 1.) తన ప్రత్యయమును విధించు

చింతామణి సూత్రము (హలన్త. 28) నందలి చకారముచే భావార్థమున టిక ప్రత్యయము వచ్చును. ఉదా:- చిన్నటికము మొ॥

థ

దంత్య స్పర్శము (dental stop)

పైదంతముల వెనుక భాగము—స్థానము

జిహ్వాగ్రము—కరణము

స్పర్శప్రయత్నము

శ్వాసము

మహాప్రాణము.

రథము, కథ, గ్రంథము మున్నగు సంస్కృత సమములను గూడి తెనుఁగున వ్యవహరింపఁబడును.

పలువురు తెలుఁగు వారీవర్ణమును తవర్గ చతుర్థ వర్ణముగా (ధ) నుచ్చరింతురు. అందుచే నీధ్వన్యుచ్చారణమును నిల్పుటకు తోడ్పడుటకై పదపట్టికలు సిద్ధమొనర్చిరి. (చూ. ఆం. కౌ. 945-955).

కవులకుఁగూడ థ కారమును ప్రాసయందు నిల్పుట క్లేశమైనది. తవర్గ ద్వితీయ, చతుర్థ వర్ణములకుఁ ప్రాసకూర్పఁబడెను. లాక్షణికులు దీనినంగీకరించి నియమించిరి. (చూ. అప్ప. స్వవర్గజప్రాస —II. 346-362) ఇట్లు సంస్కృత వర్ణములు థ-ధ లు ధకారపుఁగాఁ గలిసి పోయినవి. దీనినే భిన్నవర్ణము లేక వర్ణమగుట (phonemic merger) అందురు.

థ — ధ
| |
ధ

థాల్

సంస్కృతమున ప్రకారమును తెలుపుచు తద్, యద్ మున్నగు శబ్దములపై స్వార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయము. ఇందలి లకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'థా' మిగులును. ఉదా:- తథా, యథా మొ॥ (అష్టా. 5-3-23). తెలుఁగులో తదాది వాచకములపైనున్న థాల్ ప్రత్యయమునకు టుక్ ఆదేశమగును. ఉదా:- అట్టు, ఇట్టు, ఎట్టు (వై. చం. తద్ధితా. 85) చూ:—టుక్.

ద

దన్త్యస్పర్శము (dental stop)

పై దంతముల వెనుక భాగము—స్థానము

జిహ్వాగ్రము—కరణము

స్పర్శప్రయత్నము

నాదము

అల్పప్రాణము

**-ందమ్**

జడవాచకములుకాని సర్వనామములపై వచ్చు ప్రత్యయము. ఇందలి మకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- అందఱు, కొందఱు మొ॥ (వై.చం.తద్ధితా.22)

**దట్**

అమహద్వాచకములగు ఆ, ఈ, ఏ అను శబ్దములకు ఏకవచనాదేశ ప్రత్యయము పరమగునపుడు వచ్చు ఆగమము. ఇందలి టకార మిత్సంజ్ఞకము. ఆద్యంతౌ టకితౌ (అష్టా.) అను నియమముచే టిత్తగు నీ యాగమము ఆ, ఈ, ఏ, అను శబ్దములకు పూర్వావయవముగా వచ్చును. ఉదా:- దానిని, దీనిని, దేనిని (వై. చం. హల. 11)

**దంతజములు**

దంతములు స్థానముగాఁ బుట్టినవి.

అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ లంగూడిన చ జ లు దంతజములు.

చలము, చట్ట, చాల, చుట్టు, చౌక

జత, జాగు, జుట్టు, జూలు, జోలె మున్నగునవి. (అప్ప. II. 118,119)

**దంతోష్ఠభవము**

దంతము స్థానముగా, ఓష్ఠము కరణముగా పుట్టిన వర్ణము — వకారము.

(ఆం. కౌ. 61 పంక్తి)

**దంత్యములు**[1]

దంతములు స్థానముగా నుత్పన్నమగు వర్ణములు.

తెలుఁగున చ జ లు దంత్యములని, తాలవ్యములని ద్వివిధములు. వీని భేదము తెలియకున్నచో విశ్రమ భంగము కల్గును.

అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ లంగూడిన చ, జ లు దంత్యములు. ఇ, ఈ, ఎ, ఏ లంగూడిన చ, జ లు తాలవ్యములు.

(అప్ప. II. 117, 118; బా. వ్యా. సంజ్ఞా. 9)

**దంత్యములు**[2]

దంతములు స్థానముగా నుచ్చరింపఁబడు వర్ణములు.

ఌకారము, లకార సకారములు, త, థ, ద, ధ, న లు.

(ఆం. కౌ. 62)

**దంత్య చ జ లు**

దంతములు స్థానముగా నుచ్చరింపఁబడు చ, జ అను వర్ణములు.

"దంత్యములగు చ, జ లు తలకట్టుతోఁగూడి యుండును." (ఇట తలకట్టు తక్కిన అ, ఉ, ఊ, ఒ, ఓ, ఔల కుపలక్షణముగా భావింపనగును.)

చక్కెర, జంట, జలుబు

(ల. వ్యా. సంజ్ఞా. 48)

**దంత్య తాలవ్య చ, జ లు**

ఈ రెండును సవర్ణములు. అనఁగా తాలవ్య చ, జ లు, దంత్య చ, జ లకును గ్రాహకమని యర్థము.

క చ ట త ప లు — పరుషములనఁగా ఇందలి తాలవ్య చకారముచే దన్త్య చకారము గూడ గ్రహింపవలయును. అపుడు 'క చ, చ, ట, త, ప' అను ఆఱును పరుషములగును.

ఇట్లే గ జ డ ద బ లు సరళములనఁగా దన్త్య జకారము గూడ గ్రహింపనగును. (బా. వ్యా. సంజ్ఞా. 7)

**దంతౌష్ఠ్యము**

దంతములు, ఓష్ఠము, స్థానముగా నుచ్చరింపఁబడునది - వకారము.

(ప్ర. వ్యా. సంజ్ఞా. 41)

**దక్కులోనగునవి**

దక్కు, దిగు, దెందము మున్నగునవి. ఇది ఆకృతిగణము.

వీని దకారము డకారము విభాషనగును.

డక్కు, డిగు, డెందము. (బా వ్యా. ప్రకీర్ణ. 14)

**దక్షిణదేశభాషాసారస్వతములు-దేశి**

కర్త : శ్రీ కోరాడ రామకృష్ణయ్య. 1949 ముద్రణము

దేశి పదజాలము, దేశీయమగు సారస్వత ప్రక్రియలు, దక్షిణ దేశ భాషలలో నెట్లు తుల్యముగా నున్నవో యిందు కొంతవఱకు నిరూపితము.

**-దనుక**

మర్యాదార్థమున నిపతింపఁబడిన యవ్యయము. ఇది సుబంతమున కనుబంధముగా వచ్చును. ఉదా;– అలరె నీకీర్తి చంద్రమండలము దనుక మొ॥(వై. చం. అవ్యయ 2)

**దయాళుశబ్దము**

ఇది యుదంత సంస్కృత నామము.

అదంతము, దీర్ఘపూర్వము, లోపథము నయిన బాల, నృపాలాది శబ్దములకే బహువచనమునందు రేఫమాదేశమగు విధానమును చిన్నయసూరి పేర్కొన్నను కేతన దయాళు శబ్దమునకు రేఫాదేశమును గావించుటచే, సూరిగూడ దాని నాదరించి, వార్తికము నందారూపమును సాధించెను.

దయాళురు (ఆం. భా. భూ. 71; బా. వ్యా. తత్సమ. 88)

**-దల**

'అఱుగు' మొదలగు ధాతువులకుఁజేరు కృత్ప్రత్యయము.

అఱుగుదల, ఒప్పుదల, పట్టుదల, అచ్చుదల (ఆం. భా. శా. కృత్. 15)

**-దా**

సంస్కృతమున సప్తమ్యంతములగు సర్వమున్నగు కొన్ని కాలార్థములపై స్వార్థమున వచ్చు తద్ధితప్రత్యయము ఉదా:-యదా, కదా, తదా (అష్టా. 5.3.15) తెనుఁగున నీప్రత్యయ స్థానమున 'పుడు' ఆదేశమగును. ఉదా;- ఎప్పుడు,అప్పుడు (వై. చం. తద్ధి. 86)

**దాని**

అవ్యయము పరమగునపుడు జాతినామవాచకముకంటె పరముగా ప్రథమా విభక్తియందు వికల్పముగావచ్చు శబ్దము. ఉదా:- గొల్లదానివలె, గొల్లది వలె మొ॥ (మం. ఆం. కౌ: 269)

**దారాది(కము)**

(దార+ఆదికము). దార మున్నగు సంస్కృత శబ్దములకు తెలుఁగున పర్యాయ వాచకములగు ఆలు మున్నగు శబ్దములు. అవి ఆలు, చెల్లెలు, కోడలు, మఱఁదలు మొదలగు లు వర్ణాంత శబ్దములు. లు, ల లు పరమగునపుడు వీని లువర్ణమునకు నిత్యముగా బిందుపూర్వక డువర్ణమును, దాని ఉకారమునకు నిత్యముగ లోపమును వచ్చును. అప్పుడు ఆలు మున్నగు శబ్దములలోని లు, ల అనువానికి క్రమముగా రు, ర లు నిత్యముగా ఆదేశములగును. ఉదా:- ఆండ్రు, ఆండ్ర- జవరాండ్రు, జవరాండ్ర, -చెలెండ్రు, చెల్లెండ్ర -కోడండ్రు, కోడండ్ర మొ॥ (చింతా. అహో. అజన్త 72.) చూ:- ఆల్వాదులు.

**దారాదులు**

దార శబ్ద పర్యాయ వాచకమగు ఆలు మున్నగు శబ్దముల గణము-అవి ఆలు, చెల్లెలు, కోడలు మున్నగునవి. ఈ శబ్దముల లు వర్ణమునకు లు, ల లు పరమగు

నపుడు బిందుపూర్వక డుపర్ణమును, దాని ఉకారమునకు నిత్యముగా లోపమును వచ్చును. ఉదా:- అండ్రు, చెల్లెండ్రు, కోడండ్రు మొ॥ (చింతా. అజంత 72).

**దారార్థము**

(దార+అర్థము) దారయను సంస్కృతశబ్ద పర్యాయమగు 'ఆలు' శబ్దము. ఇట్టి ఆలుశబ్దము పరమగునపుడు కర్మధారయ సమాసమున హ్రస్వాకారాంత పదముయొక్క అకారమునకు ఉకార మాదేశముగను, రేఫము ఆగమముగను వచ్చును. ఉదా:- ధీరురాలు (ధీర+ఆలు), శూరురాలు (శూర+ఆలు) మొ॥ చింతా సంధి. 34). ఆలుశబ్దము వ్యస్తముగా నున్నపుడు భార్యయను నర్థమును బోధించి నను సమాసవృత్తియందు స్త్రీ యను సామాన్యార్థమునే బోధించును. (అహో. సంధి. 34). కనుక దారార్థమనఁగా స్త్రీ వాచకమగు ఆలుశబ్దమనియేకాని భార్యావా చకమగు ఆలుశబ్దముకాదని భావము చూ:- ర, ఆలుశబ్దము.

**ది[1]**

స్త్రీతిర్యగ్జడవాచకములు కర్తలుగా నున్నపుడు వర్తమానార్థమున ఏకత్వార్థ మున ధాతువుపైవచ్చు వర్ణకము. ఉదా:- చిలుక ఎగురుచున్నది, మ్రానుపల్ల వించు చున్నది. మొ॥ (అథ. కారి. క్రియా. 5; చింతా. క్రియా. 20). ఘటింపఁగలయది ఇత్యాదులందు 'అది' శబ్దాన్వయము కలదని గ్రహింపవలెను. (అహో. క్రియా. 20)

**ది[2]**

(2) సమస్త శబ్దములపై సంబంధార్థమున వచ్చుప్రత్యయము. ఉదా:- రాజుది, బంటుది మొ॥ (చింతా. హలన్త. 25) ఇది యుష్మదస్మ దాత్మార్థకములగు నీ, నా, తన శబ్దములపైని అసమాసమున వచ్చును. ఉదా:- కీర్తినీది, మొ॥ నీయది, నాయది ఇత్యాదులందు తచ్ఛబ్ద పర్యాయమగు 'అది' యను శబ్దముకలదని గ్రహింపవలయును.

**ది[3]**

వాల్మీకి వ్యాకరణమున దీర్ఘమునకు సంజ్ఞ. (వాల్మీ. 1.1.6; వై. చం. సంజ్ఞా. 6)

**దిగంతరాళబహువ్రీహి**

దిక్కుల నడిమి ప్రదేశమును దెలుపు బహువ్రీహి.

దక్షిణపూర్వము(దక్షిణమునకుఁ దూర్పునకు నడిమిప్రదేశము-ఆగ్నేయమూల) పూర్వోత్తరము; (సు. వ్యా. సమాస. 61; ఆం. భా. శా. సమాస. 68)

**దిగాదులు**

(దిక్+ఆదులు) దిక్, మరుత్, రుక్, వీరుత్, మున్నగు హలంత శబ్దములు. వీనికి ప్రథమాది విభక్తులు పరమగునపుడు అంత్య హల్లునకు ద్విత్వము, ఉత్వము వచ్చును. ఉదా:- దిక్కు, మరుత్తు, రుక్కు, వీరుత్తు మొ॥. (వై. చం. హలంత. 32) దిశ్ శబ్దములలోని శకారమునకు 'క్విన్ ప్రత్యయస్య కుః' (అష్టా 8. 2. 62) అను సూత్రముచే కుత్వమురాగా దిక్ అని యగును. దిగాది శబ్దములలో అంత్య హల్లునకు ద్విత్వోత్వములతోఁ బాటు కుత్వాది కార్యములును వచ్చును.

**ది వర్ణకము**

ఏకవచనమున సంబంధార్థమందు వచ్చు ప్రత్యయము. ఇది పరమగుచుండఁగా పూర్వమందలి ఉకారాకారములకు తఱచుగా ఇకారమాదేశమగును. (అథ కా. అజంత. 36) ఉదా:- వారిది మొ॥ ఇది నామములన్నింటిపైనను సంబంధార్థమున వచ్చును. ఉదా:- రాజుది, బంటుది మొ॥ (చింతా. అజంత. 25)

**-ది, వి, వర్ణకములు**

అమహత్తు కర్తయగునపుడు క్రియలకు వర్తమానార్థమునందు -ది వి, అను వర్ణకములు చేరును.

నుతింపుచున్నది, నుతింపుచున్నవి

చూ:- -ది[1], -వి. (ల. వ్యా. క్రియా. 17)

**దివీతరంబగుడుఞ్లు**

-ది, -వి అనునవి ప్రథమపురుషైకవచన అమహత్ప్రత్యయములు. అవికాక తక్కిన క్రియావిభక్తులగు -డుఞ్, -రు; -వు, -డు; ను. -ము; అనునవి.

ఇవి పరమగునపుడు 'ఉన్న' అను అనుబంధమునకు దీర్ఘమగును.

వందుచున్నాఁడు

వందుచున్నావు - మున్నగునవి. (బా. వ్యా. క్రియా. 15)

**దీర్ఘపూర్వక లఘురేఫము**

దీర్ఘము పూర్వమందున్న రేఫము. ఇది హ్రస్వపూర్వకమగుచో శకటరేఫమగును.

చేకూరు — చేకుఱు (ప్రౌ. వ్యా. ముక్త. 1)

**దీర్ఘబిందువు**

పూర్ణబిందువునకే మఱియొక పేరు. /o/

(అప్పు. II. 22)

**దీర్ఘము**

(i) రెండుమాత్రల కాలమునందుచ్చరింపఁబడు స్వరము.

(ii) దీనికే నిడుద, నెఱయక్కరము, పొడవు, చాఁపు, అనియు నామాంతరములు. (అప్ప. *II*. 10; *IV*. 29)

**దీర్ఘము మీఁది హల్లు**

దీర్ఘముపైనున్న హల్లు.

సంస్కృత హలంత శబ్దములు తత్సమీకరింపఁబడునపుడు వాని తుది హల్లునకు ఉగాగమము, ద్విత్వము కల్గును.

దీర్ఘము మీఁద ద్విత్వము బహుళముగానగును.

వాక్ < వాక్కు / వాకు

(బా. వ్యా. తత్సమ. 69)

**దీవెన**

ఆశీర్వాదము.

ఈ యర్థమునందు -ఎడు, -కాత -కావుత అను శబ్దములు పరమగును.

శ్రీ వెలుగెడు గాత

మేలుగావుత. (ఆం. భా. భూ. 161)

**ందుమ్**

తదాది వాచకములగు ఆ, ఈ, ఏ అను శబ్దములపైనున్న త్రల్ ప్రత్యయ స్థానమునవచ్చు తద్ధిత ప్రత్యయము. ఇందలి మకారమిత్సంజ్ఞము, ఉదా:- అందు, ఇందు, ఎందు (వై. చం. తద్ధితా. 34)

**దుక్కు**

అంతాగమముగావచ్చు 'దు' వర్ణము.

ఆకర్ణింపుదురు

దంపుదురు

చింపుదురు. (బా. వ్యా. క్రియా. 90)

**దుఙ్ముత్తులు**

దుక్+ముత్తులు.

(చూ.) దుక్కు, ముత్తు (బా. వ్యా. క్రియా. 98)

**దుగాగమము**

దుక్+ఆగమము.

పూర్వపదాంతమందుఁజేరు 'దు' అను వర్ణము.

యుష్మదస్మదాత్మార్థకములకు (నీ, నా, తా) ఉత్తరపదము పరమగునపుడు దుగాగమము విభాషగా నగును.

నీదు కరుణ—నీ కరుణ

నాదు నేరమి—నా నేరమి

తనదు రూపు—తన రూపు (బా. వ్యా. సమాస. 21)

**దుత్వము**

దుకారము.

నా, నీ, తన—అను శబ్దములు షష్ఠ్యర్థమునందు ఉత్తరపదముతో సమసించునపుడు దు కారము వికల్పముగా నగును.

నాదు విద్యాప్రౌఢి

నీదు విలాసము

తనదు భుజాబలము. (కా. చూ. IX. 132, 133)
(ఆం. కౌ. 520-524)

**దుఙ్**

(చూ.) దుగాగమము

తన-, నీ-, నా-, అను పలుకులపై హలాదు లదుకునపుడు వికల్పముగా వచ్చును.

తనదు ధనము

నీదు యశము

నాదు గుణము (ఆం. భా. భూ. 128)

**దు వర్ణకము[1]**

(1) యుష్మదస్మదాత్మార్థకములగు నీ, నా, తన శబ్దములకు పరమందు సంబంధార్థమునవచ్చు వర్ణకము. ఉదా:- నీదువేడ్క, నాదుసొమ్ము, తనదుకీర్తి మొ॥ (చింతా. హలంత. 26) చూ:- దుగాగమము.

**దువర్ణకము[2]**

స్త్రీతిర్యగ్జడ వాచకములు కర్తలుగానున్నపుడు వ్యతిరేక భవిష్యదర్థములం దు ప్రథమపురుష ఏకవచనమున వచ్చు ప్రత్యయము. ఉదా:- కాంత ఘటింపదు.

కాంత ఘటింపగలదు, —చిలుక రాగలదు, చిలుక రాదు మొ॥ (చింతా. క్రియా. 20; అథ. కా. క్రియా. 5)

**దువర్ణకము**[8]

ధాతువుపై తద్ధర్మార్థమున వచ్చు ప్రత్యయము. (చింతా. క్రియా. 31) ఉదా:- పోషింపుదురు, పోషింపుదువు మొ॥ తద్ధర్మార్థమున ప్రథమపురషైకవచనమున మాత్రమే దువర్ణకమురాదు. (చింతా. క్రియా. 32.) ఉదా:- పోషించున్, మ్రొక్కున్ మొ॥ చూ:- దుక్కు

**దుష్ప్రయోగము**

దుష్టమగు ప్రయోగము

సుప్, తిఙ న్తములగు సంస్కృత పదములతోఁగావించిన వాక్యము.

సత్వరము నృపస్య పదం గత్వా.

అతఁడు కంటకులను నిహత్య. (అ. ఛం. IV. 27)

**దుస్సంధి**

దుష్టమగు సంధి

'అందు నిందు' ననుచో 'అందున్నిందు' అనిగాని; 'దొరవీవునజుఁడు' అనుటకు 'దొరవీవున్నఁజుఁడు' అనిగాని యనవసరముగా ద్విత్వము గావించిన దుస్సంధి యగును. (కవిజ V.20; అ.ఛం.IV.20; అప్ప.V.12)

**దూతాది గణము**

'దూత' మున్నగు శబ్దములు.

దూత, యోధ, శుంఠ, మున్నగునవి. వీని కత్వస్త్రీవద్భావములు బహుళముగా నగును.

దూత < దూత / దూతుఁడు.

అమహత్త్వము నందు స్త్రీత్వము నిత్యము. 'సింగంబుదూతయగు జంబుకంబు, (కవిజనాం. 57 పత్రము) (బా. వ్యా. తత్సమ. 61)

**దేశ్యక్రియలు**[1]

సంస్కృతమునుండి తెనుఁగులోనికి వచ్చు ఉపకృతి, పరిణతి, సంవృతి క్రియలు కాక అచ్చతెనుఁగుక్రియలు ఉదా:- తిను, కను, విను మొ॥ స్వార్థమున వచ్చు ఇంచుగాగమము ఉపకృత్యాది తత్సమ క్రియలకే కాని దేశ్యక్రియలకురాదని (చింతా. క్రియా. 13. అహో. క్రియా. 15) అహోబలపతి యభిప్రాయము.

**దేశ్యక్రియలు**[2]

దేశీయములగు క్రియాపదములు. వీనియంతమందు కొన్నింట-ఇంచుగాగమము గల్గును.

ఆరగించు, ఆవులించు, తిలకించు, పలవించు. (సం. వ్యా. క్రియా. 8)

**దేశ్యవర్ధకములు**

అర్థభేదమును కలిగించు తన, ఱిక, ఇమి, న, ఇక, ఉక, కత్తియ, కాఁడు, అరి, ఇడి మున్నగు ప్రత్యయములు. ఇవి స్వార్థ, భావార్థ, మతుబర్థములందు వచ్చును. ఉదా:- నెలతుక (స్వార్థము), దొరతనము, చిన్నఱికము, పేరిమి, నల్లన, అగ్గలికము (భావార్థము), ఆటకాఁడు, ఆటకత్తియ, జాలరి, ముక్కిడి మొ॥ (మతుబర్థము-ఇడి వర్ధకము అభావద్యోతకమతు బర్థము). ఈ ప్రత్యయములు పరమగునపుడొకానొకచో శబ్దాంత్యవర్ణమునకు లోపమును, ఒకానొకచో వర్ణాగమమును వచ్చును. ఉదా:- చెలికాఁడు (చెలిమి+కాఁడు-అంత్యవర్ణలోపము), మిండగీఁడు (మిండ+ఈఁడు-వర్ణాగమము) (అధ. కా. అజంత 52, 53). కాఁడు, గాఁడు, ఈఁడు, ఆఁడి మొదలైనవి యుదేశ్యవర్ధకములే.

(అథ. కా. అజంత. 50, 51)

**దేశ్యోద్భవము**

దేశమునందుఁబుట్టిన పలుకులు.—దేశ్యములు.

తెలుఁగుఁబలుకు జాతమునైదు విధములుగా కావ్యాలంకార చూడామణి కర్త విభజించెను.

(i) తత్సమము

(ii) తద్భవము

(iii) సహజాంధ్ర దేశభవము

(iv) దేశ్యోద్భవము

(v) గ్రామ్యము.

(iii)-(iv) లకుఁగల తారతమ్యము నాతఁడు వివరించలేదు.

దేశ్యోద్భవమునే యచ్చతెనుఁగుగాను నతఁడు నిరూపించెను.

గుజ్జము, పప్పు, అనుములు మొదలైనవి. (కా. చూ. IX. 11, 18, 19)

**దేవ మనుష్యాదిక్రియ**

దేవతలనుగాని మనుష్యులనుగాని దెలుపు శబ్దములు కర్తలుగా నున్నచోవాని యొక్క క్రియలు, కర్తలే వచనమునందున్న ఆవచనమందుండును.

ముని యలరెను

మును లలరిరి. (ఆం. శా. భూ. 147, 148)

**దేశజము**

దేశమునందుఁబుట్టినది.

దేశి తెనుఁగు. (అ. ఛం. IV. 105)

**దేశితెనుఁగు**

దేశ్యములగు తెనుఁగు పదములు.

ఒడయఁడు, నిక్కము, కొను, పొలింద్లు, మొదలైనవి.

(ఆం. శా. భూ. 24; అ. ఛం. IV. 105)

**దేశ్యక్రియలు**

దేశీయములైన క్రియాపదములు.

మ్రొక్కు, చేయు, కను, విను, మొదలయినవి.

ఇవి వికారములు లేక యాలాగుననే యుండును. (ప్ర. వ్యా. 852)

**దేశ్యంపుఁదెనుఁగు**

దేశమునందు వాడఁబడు తెనుఁగు మాటలు.

తనివి, వలవంత, చెంత, మంతనము. (ఆం. శా. భూ. 25)

**దేశ్యములు**

(i) ఏ దేశము మానవులకు ఆదేశము భాష దేశ్యమగును. జనవ్యవహారముచే దాని నెఱిఁగి కృతులఁజెప్పగ నొప్పును. (అప్ప. I. 104)

(ii) త్రిలింగ దేశ్యవ్యవహార సిద్ధంబగు భాష.

ఊరు, పేరు; ఇల్లు, ముల్లు, తావి, మోవి, ఇత్యాదులు.

(బా. వ్యా. సంజ్ఞా. 21)

**దేశ్యవిశేషణములు**

దేశీయములగు విశేషణశబ్దములు. ఇవి లింగ, వచన, విభక్తులను గూర్చిన భేదములను బొందవు.

చల్ల, పచ్చ, నల్ల, తెల్ల (గుః వ్యా. 209)

**దేశ్యసర్వనామములు**

దేశీయములగు సర్వనామములు (చూ.) ఇవి :

(1) పురుష సర్వనామములు

(2) నిర్దేశక సర్వనామములు

(3) సంబంధ సర్వనామములు

(4) ప్రశ్నవాచక సర్వనామములు (చూ.)

(5) సంఖ్యావాచక సర్వనామములు

(ఆం. భా. శా. సర్వ. 1)

**దొడ్డ 'ళ'**

మూర్ధన్యళకారము.

దీనిని అనంతుఁడు సంస్కృత వర్ణమాల నుండి తొలగించి, తెలుఁగు వర్ణమాలలో జేర్చెను.

తెలుఁగులో ల-ళ లు అర్థభేదక సామర్థ్యము కలవి.

మంగళము, మంగలము. (అ. ఛ. IV. 127)

**దొప్పాదులు**

దొప్ప, దెందం, దెప్పరం, మొదలైనవి. వీని 'ద' కారము విభాషగా 'డ కారమగును.

దొప్ప—డొప్ప

దెందం—డెందం (వ్యా. భా. వ్యా. శబ్ద. 264)

**ద్యుహృచ్ఛబ్దములు**

దివ్, హృత్ అను శబ్దములు తెలుఁగున దివి, హృది యని నిపతింపఁబడినవి.

(బా. వ్యా. తత్సమ. 84)

**ద్రవ్యవాచకములు**

వస్తు విశేషములను జెప్పుపదములు.

బంగారము, గాలి

నీరు, మంచు, రాయి

పాలు, బియ్యము

తేనె, కల్లు మొదలైనవి. (ఆం. భా. శా. నామ. 98)

**ద్రవ్యప్రయుక్తవిశేషణములు**

ద్రవ్యమనఁగా పదార్థము.

ధనము, దండము, పుస్తకము మున్నగునవి.

ధనవంతుఁడు, దండి, పుస్తకవంతుఁడు మున్నగునవి ద్రవ్యప్రయుక్త విశేషణములు. (ప్రౌ. వ్యా. శబ్ద. 8)

**ద్రవ్యవాచక విశేణములు**

(చూ.) ద్రవ్యప్రయుక్త విశేషణములు. (ఆం. భా. శా. విశే. 4)

**ద్రవ్యము**

గుణము కలది. (క. చి. సంజ్ఞా. 20)

**ద్రావిడభాషాపరిశీలనము**

కర్త : శ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రి

తెలుఁగు, తమిళము, మలయాళము, కన్నడము అను నాలుగు ప్రధాన ద్రావిడ భాషలలోని వ్యాకరణము లాధారముగా రచింపఁబడిన తులనాత్మక పరిశీలన గ్రంథము.

ఇది రెండు సంపుటములుగా ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచేఁ బ్రకటితము.

**ద్రావిడ భాషాసామ్యములు**

ప్రధాన ద్రావిడ భాషలగు తెలుఁగు, తమిళము, మలయాళము కన్నడము లలోఁగల వివిధ సామ్యములను విద్యార్థి జనోపయోగముగా శ్రీ వజ్ఝల చినసీతా రామ శాస్త్రి గారిచే సంతరింపఁబడిన గ్రంథము.

ప్రచురణము 1959.

**ద్రుతంబు మీఁద నకారము**

కొన్ని యెడల ద్రుతముమీఁద నకారము కానవచ్చును.

అదియునున్గాక

దివంబునుంబోలె. (బా. వ్యా. సంధి. 21)

**ద్రుతకార్యము**

ద్రుతమునకు సంబంధించి కలుగు మార్పు. ద్రుతముపైనున్న పరుషములు సరళములగును. అట్టి ఆదేశ సరళములకు ముందున్న ద్రుతము బిందు సంశ్లేష ములను బొందును.

పూచెను గలువలు (ప్రకృతి భావము)

పూచెంగలువలు (పూర్ణబిందువు)

పూచెంగలువలు (ఖండ బిందువు)

పూచెన్గలువలు (సంశ్లేషము) (బా. వ్యా. సంధి. 17)

**ద్రుతప్రకృతికములు**

(చూ.) ద్రుతప్రకృతులు (బా. వ్యా. సంజ్ఞా. 12)

**ద్రుతప్రకృతులు**

శబ్దముల పుట్టుకను బట్టికాక వాని యంతవర్ణములనుఁబట్టి తెనుఁగు పదములను ద్రుత ప్రకృతులు, కళలు అని రెండువిధములుగా విభజింపనగును. నిత్యము ద్రుతాంతములుగనుండు శబ్దములు ద్రుతప్రకృతులు. తిజ్మధ్యములు, శేషషష్ఠి మున్నగు కళలను (చూ:- కళలు) విడిచి తక్కిన శబ్దములు ద్రుతప్రకృతులు. అవి ప్రథమా, కయి, పట్టి, యొక్క -ఇవి తప్ప తక్కిన విభక్తి ప్రత్యయము, ఉత్తమ పురుషైకవచనములు (చేసితిన్, చేయుచున్నాను, చేయగలను మొ॥), భూత తద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనములు (చేసెన్, చేయున్ మొ॥) ఆశీరాద్యర్థకములు (ఎడు, త వర్ణకములు) శత్రర్థకములు (చేయుచున్ మొ॥) తుమర్థకములు (చేయన్ మొ॥), అసంతార్యార్థకములు (కొట్టుడున్ మొ॥) చేదర్థకములు (కొట్టినన్ మొ॥), మఱియు వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్ మున్నగునవి నిత్యము ద్రుతాంతములగుటచే ద్రుతప్రకృతులు. వీనిని ద్రుత ప్రకృతికములనియు సందురు వీనిలో చివరి నకారము లోపించినను అర్థ బోధకత కెట్టి లోపము లేదు. కనుక నకారమునకు ద్రుతము (జాఱిపోవునది) అను సంజ్ఞ అన్వర్థము. ఇట్టి నకారమునకు ప్రకృతులైన పదములు ద్రుతప్రకృతి కములని భావము. శాస్త్రవిధిచే ద్రుతమునకు లోపాదులు తరువాత కలిగినను తొలుతనవి ద్రుతాంతములే కావున నవి ద్రుతప్రకృతులే యగును. (చింతా. సంజ్ఞా. 41). ద్రుత ప్రకృతికములు, కళలు అను విభాగము సంస్కృతాది వ్యాకరణము లలో కానరాదు. అథర్వణుఁడు కళా ద్రుతప్రకృతిక విభాగమును గూర్చి ఏమియు చెప్పలేదు. ఇతఁడు ద్రుతమను సంజ్ఞనుపయోగించినను కళా సంజ్ఞను మాత్ర ముపయోగింపలేదు. కళ నుపయోగింపవలసినచోట అద్రుతమనియే పేర్కొనెను. (అద్రుతాత్సరసాత్. అథ. కారి. సంధి 23, అద్రుతానామజాదీనామ్. అథ. కారి. అజన్త. 81 మొ॥) ద్రుత ప్రకృతికము కంటె పరమందున్న పరుషములు సరళములగును. ద్రుతమునకు బిందువును అగును. ఉదా:- రాముంగొలిచెద (రామున్+కొలిచెద) మొ॥ చింతా. సంధి 21)

**ద్రుతము**

(i) నకారము

ఒల్లనియెడల మఱఁగి పోవును.

(అప్ప. II. 14; బా. వ్యా. సంజ్ఞా. 11; ప్రౌ. వ్యా. సంజ్ఞా. 7)

(*ii*) శబ్దాంతమందలి ని-ను-న్ లలో ఏదియైనను ద్రుతమగును.

(ఆం. భా. శా. సంజ్ఞా. 53)

**ద్రుతలోపము**

ద్రుతమునకు సరళములుగాని, స్థిరములుగాని పరమగుచో ద్రుతములోపించును.

జనియించె గరుడ కేతనుఁడు దేవకియందున్
వరలె ఖగవాహనుండు ద్రేపల్లెయందు. (అప్ప. V. 143)

**ద్రుతసంజ్ఞకము**

'ద్రుతము' అను సంజ్ఞకలది.

(*i*) తాను, నేను, వనమును, చదువుచున్నాను— ఇత్యాదులలో ప్రత్యయాత్మకమైనట్టిది.

(*ii*) నన్నును, నాచేతను,—ఇత్యాదులలో ఆగమాత్మకమైనట్టిది.

(*iii*) అన్నయును, తమ్ముఁడును—ఇత్యాదులలోని సముచ్చయార్థకావయవమునైన ఉత్వవిశిష్ట నకారము (-ను) ద్రుతసంజ్ఞకమగును.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 7)

**ద్రుతస్వరము**

ద్రుతమందలియచ్చు.

వాక్యాంతమునందుఁగాని, పాదాంతము నందుఁగాని, ద్రుతమునకుఁగాని, ద్రుత స్వరమునకుఁగాని లోపము కలుగవచ్చును.

అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్ (ద్రుతస్వరలోపము)

(బా. వ్యా. సంధి. 20)

**ద్రుతాంతము**

ద్రుతము అంతమునందుఁగల శబ్దము.

—ఎడున్,—తన్;—చేన్ మున్నగునవి.

(బా. వ్యా. క్రియా. 26)

**ద్రుతి**

ద్రుతము గలది. ద్రుతప్రకృతికమని యర్థము. చూ:- ద్రుతప్రకృతికమని యర్థము (మం. ఆం కౌ. 87)

చూ;- ద్రుతప్రకృతికము.

**ద్వంద్వము**

సమాసములలో నొకటి.

(i) ఉభయ పదార్థ ప్రధానము. ఇందుఁబూర్వపదము స్త్రీ సమము (చూ.) ఉత్తర పదము ఆచ్ఛికము ప్రాయికముగా నగును.

అన్నదమ్ములు

కూడుగుడ్డలు (ఆం. ఛం. *IV*. 87; **బా. వ్యా. సమాస. 7**)

(ii) ద్వంద్వమునందు పదముపయినున్న పరుషములు **తఱచుగా** గసడదవ లగును.

తల్లి+తండ్రి ⟶ తల్లిదండ్రులు

కూర+కాయ ⟶ కూరగాయలు (**బా.** వ్యా. సంధి. 10)

(iii) అప్రాణి వాచకములతోను, కృదంత శబ్దములతోను నేర్పడిన ద్వంద్వ సమాసము ఏకవచనాంతము నగును.

కూడుగుడ్డ, తాకుడగులు (ప్రౌ. వ్యా. సమాస. 80)

**ద్వంద్వవాక్యము**

సముచ్చయాదికముచేఁ గలుపఁబడిన రెండు మూడు సంపూర్ణవాక్యములుగల వాక్యము. (Compound Sentence)

వాఁడు సత్యమునే పలికెనుగాని, జనులాతని మాటలను విశ్వసించువారుగారు

దీనినే మహాకావ్యమందురు. (సం. వ్యా. వాక్య. 10)

**ద్విః**

ద్విత్వమును బోధించు సంస్కృత సంజ్ఞ. (మ. ఆం. కౌ. 40). సంస్కృత మున వ్రాయఁబడిన తెలుఁగు వ్యాకరణములలోనే ద్విత్వవాచకముగా నీ సంజ్ఞ వాడఁబడినది. సంస్కృత వ్యాకరణములలో నీ సంజ్ఞ ప్రచురము.

**ద్వికర్మకములు**

రెండు కర్మలు గల క్రియలు.

సంస్కృతమునందు దుహ, యాచృ మున్నగు ధాతువులవలె తెనుఁగునందు 'అడుగు' మున్నగు ధాతువులు ద్వికర్మకములు.

ఆంజనేయుఁడు సీతను క్షేమమడిగెను. (ప్రౌ. వ్యా. క్రియా. 85)

**ద్విగుగర్భబహువ్రీహి**

ద్విగు సమాసముతోఁగూడిన బహువ్రీహి సమాసము.

'పంచానాం గవాం సమాహారః'—పంచగవం; పంచగవం ధనం యస్యసః— పంచగవధనః

'పంచగవధనుఁడు' వంటి సమాసములు. (త. చం. పుట. 378)

**ద్విగువు**

రెండు గోవులని శబ్దార్థము.

సంఖ్యాపూర్వకము ద్విగువు. కొన్ని వ్యాకరణము లీ సమాసమును ప్రత్యేకముగా నిరూపింపగా కొన్ని వ్యాకరణములు సమానాధికరణమగు సమాసములలో నొక భేదముగాఁ జేర్కొన్నవి.

రెండావులు. (అ. ఛం. IX. 97;98; ఆం. కౌ. 474-75; బా. వ్యా. సమాస. 1)

**ద్వితీయ**

నామవిభక్తులలో రెండవది.

(i) చేయఁబడునది (ఆం. భా. భూ. 68)

(ii) నుకార నికారములు (కా. చూ IX. 97: ఆం. కౌ. 132)

(iii) ని, ను. ల, కూర్చి గురించి (ల. వ్యా. సుబన్త. 2)

(iv) నువర్ణంబు ద్వితీయ (బా. వ్యా. తత్సమ. 2)

కర్మార్థమందు ద్వితీయ వచ్చును. (బా. వ్యా. కారక. 2)

**ద్వితీయా తత్పురుషము**

ద్వితీయా విభక్త్యంత పదమునకు మీఁది పదముతో సమాసము.

కొండతాల్పరి, దట్టిమోపరి

పగతాల్పు, నెలతాల్పు

(ఆం. కౌ. 432 పంక్తి)

**ద్వితీయకుఁబ్రథమ**

ద్వితీయా విభక్తికి మారుగా వచ్చిన ప్రథమా విభక్తి.

ద్వితీయా విభక్తి యందుండవలసిన జడ వాచకములను ప్రథమా విభక్తి యందైనను వాడవచ్చును.

అరదము నెక్కెను—అరదమెక్కెను.

సొమ్ములను దాల్చెను—సొమ్ములు దాల్చెను.

(స. సా. సం. I. విభక్తి)
(బా. వ్యా. కారక. 24)

**ద్వితీయ దేశ్యములు**

రెండవ తరగతికిఁ జెందిన దేశ్యములు.—అము,—ఆము,—ఎము అను శబ్దము లంతమందుఁగలవి.

గుఱ్ఱము, పెండ్లాము, నాణెము. (గు. వ్యా. 109)

**ద్వితీయప్రకృతి**

ఆంధ్రభాషకు, సంస్కృతము, ప్రాకృతము అనునవి రెండు ప్రకృతులు.

సంస్కృతము ఆద్యప్రకృతికాగా, ప్రాకృతము ద్వితీయ ప్రకృతిగాఁబరిగణింపఁ బడుచున్నది. (సం. వ్యా. ఆంధ్రభాష. 3)

**ద్వితీయాది తత్పురుషములు**

ద్వితీయాది విభక్త్యంత పదములకు మీఁది పదములతో సమాసములు :

1. ద్వితీయ—నెలతాల్పు
2. తృతీయ— నెల తక్కువ వాఁడు
3. చతుర్థి—దేవర మేలు
4. పంచమి—దొంగభయము
5. షష్ఠి—రాముని బాణము
6. సప్తమి—మాటనేర్పరి

(ఛం. ద. IV. 95; బా॰ వ్యా. సమాస. 8)

**ద్వితీయాద్యేకవచనము**

ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి యను ఆఱు విభక్తుల యేకవచనములు.

ఇవి పరమగునపుడు కొన్ని దేశ్యశబ్దములకు ఇ-టి-తి యను నుపవిభక్తులాగ మాదేశము లగును.

కాలు—కాలిని, కాలిచే

నాఁగలి—నాఁగటిని, నాఁగటిచే

నేయి—నేతిని, నేతిచే ఇత్యాదులు (బా. వ్యా. అచ్ఛిక. 29)

**ద్వితీయాక్షరము**

రెండవ యక్షరము.

పద్యపాదమునందలి రెండవ యక్షరము ప్రాసమనఁబడును.

(బా. వ్యా. ప్రకీర్ణ. 28)

**ద్వితీయా బహువ్రీహి**

విగ్రహమునందు 'దేనిని' యను ద్వితీయా విభక్తి రూపము వచ్చిన అది ద్వితీయాబహువ్రీహి.

ప్రాప్తోదక గ్రామము—ఉదకము దేనిని ప్రాప్తించునో ఆగ్రామము.

(సు. వ్యా. సమాస. 67)

**ద్వితీయైకవచనాంత తుల్యము**

కొన్ని సంస్కృత హలంత శబ్దముల ద్వితీయా విభక్తి ఏకవచనాంత రూపము లతో తుల్యములగు రూపములు విభాషను తెలుఁగున ప్రాతిపదికలగును.

(i) మతుబాదికమునందు నిత్యము.

శ్రీమంతమ్=శ్రీమంత(మ్) { శ్రీమంతుఁడు, శ్రీమంతము, శ్రీమంతురాలు }

(ii) ఋత్విగాదులందు వికల్పము.

ఋత్విజమ్=ఋత్విజ(మ్)—ఋత్విజుఁడు

ఋత్వి (క్) (ప్రథమావిభక్తి తుల్యము)— ఋత్విక్కు.

(ఉత్వద్విత్వములు) (బా. వ్యా. తత్సమ. 70, 71, 72)

**ద్విత్ర్యాది సంఖ్యా శబ్దములు**

(ద్విత్రి+ఆది సంఖ్యా శబ్దములు) ద్వి, త్రి, చతుర్ మున్నగు సంస్కృత సంఖ్యావాచక శబ్దములు. ఇవి తెలుఁగులో ప్రత్యయ రహితములై తత్సమ ములుగా ప్రయోగింపబడవు. ప్రత్యయసహితములగు ద్వయము, త్రయము మున్నగునవి ప్రయోగార్హములే. అల్పములగు ద్విత్ర్యాది సంఖ్యావాచకములకే ప్రయోగము లేదు కనుక వింశతి, త్రింశతి ఇత్యాది ప్రయోగములుండవచ్చును. (అథ. కా. అజంత 20, అహో. అజంత 33, వై. చం. హలంత 2)

**ద్విత్వము**

సమాన వ్యంజన సంయోగము

అక్క, మచ్చ, అట్ట, అత్త, అప్ప అయ్య, అజ్జ, బెల్లము, అవ్వ ఇత్యాదులు దీనికే ఒత్తు, జడ్డ (చూ.) అనియు పర్యాయ పదములు. (అప్ప. II. 18)
(బా. వ్యా. సంధి. 89; తత్సమ. 68, సమాస. 14)

**ద్విత్వయుక్త 'ను' వర్ణము**

నిన్ను, నన్ను, తన్ను—వీని యందలి ద్విత్వమున కేనియు ద్విత్వయుక్త 'ను' వర్ణమున కేనియు లోపము వైకల్పికము.

నినున్, నిన్, నినున్, నన్, తన్ (ప్రౌ. వ్యా. శబ్ద. 78)

**ద్విత్వయుక్త లాంతము**

లకారము కింద లకారము—మల్ల, భిల్ల ఇట్టి శబ్దముల మీఁది లు,లకును రు,ర లాదేశములగును.

మల్లురు, మల్లురకున్ (ప్రౌ. వ్యా. శబ్ద. 23)

**ద్విత్వరహిత ద్వితీయావిభక్తి యుకారము**

ద్విత్వము కానట్టి ద్వితీయా విభక్త్యంత మందున్న 'ఉ'.

నను, నిను, మము, మిము— ఇత్యాదులందున్న ద్విత్వరహితమైన వ్యంజనాంతము లందలి ఉకారము. దీని కచ్చుపరమగునపుడు సంధిరాదు.

ననున్+అడిగె—ననడిగె అని సంధి చేయరాదు. 'ననునడిగె' యను సంధి లేని రూపమే యుండును. ఇట్టి రూపములేకాక 'గురువున్+అడిగె' గురువడిగె యని సంధి చేయరాదు. 'గురువు నడిగె' అనియే యుండును.

(ప్రౌ. వ్యా. ముక్త. 3)

**ద్విపద బహువ్రీహి**

రెండు పదములతో నేర్పడిన అన్యపదార్థ ప్రధానమగు బహువ్రీహి సమాసము.
చిగురు బోఁడి (ఆం. కౌ. 614)

**ద్విరుక్తటకారము**

'ట్ట'

(i) కుఱు, చిఱు - అను శబ్దములందలి శకట రేఫమునకు

(ii) కడు, నడు, నిడు - అను శబ్దములందలి డకారమునకు అచ్చుపరమగునపుడు ద్విరుక్తటకార మాదేశమగును.

కుఱు+ఉసురు—కుట్టుసురు.

చిఱు+ఎలుక—చిట్టెలుక

కడు+ఎదురు—కట్టెదురు

నడు+ఇల్లు—నట్టిల్లు

నిడు+ఊరుపు—నిట్టూరుపు (బా. వ్యా సంధి 12)

**ద్విరుక్తములు**

రెండుసారు లుచ్చరింపఁబడు శబ్దములు.
ధ్వన్యనుకరణ శబ్దములు తఱచుగా ద్విరుక్తములగును.
తళతళ, ఫెళఫెళ (ప్రౌ. వ్యా. సంధి. 50)

**ద్విరుక్తి**

రెండుసారు లుచ్చరించుట. ఇట్టి ద్విరుక్తి యత్యంతార్థ మందును, ఆదరార్థము నందును కల్గును.

విని విని, కృష్ణ కృష్ణ (ప్రౌ. వ్యా. శబ్ద. 111)

**ద్విరుక్తలోపసంధి**

ఒక శబ్దము రెండుసారు లుచ్చరింపఁబడునపుడు మొదటి శబ్దము యొక్క అంతమందున్న అచ్చునకు లోపము కల్గును.

అన్న+అన్న ⟶ అన్నన్న
ఏమి+ఏమి ⟶ ఏమేమి
ఓహో+ఓహో ⟶ ఓహోహో (ప్ర. వ్యా. 91,92)

**ద్విరూపములు**

తత్సమ పదములు రెండు రూపములను బొందుట.

వేదవిదులు—వేదవిత్తులు
విద్విట్టులు—విద్విషులు
భూభుక్కులు—భూభుజులు ఇత్యాదులు.

(ఆం. కౌ. 229-231)

**ద్విర్వచనము**

రెండు మాఱు లుచ్చరింపఁబడుట (చూ.) ద్విత్వము.

కింతత్+అనియె ⟶ కింత త్తనియె.

(బా. వ్యా. సంధి. 52)

**ద్వివచనములు**

రెండింటిని బోధించునవి.

తెలుఁగు బాసలో ఏకవచనములు, బహువచనములే కాని, సంస్కృతమునందు వలె ద్వివచనములు గలుగవు.

(కా. చూ. IX. 72; అ. ఛం. IV. 115; ఆం. కౌ. 210 పంక్తి)

**ద్విస్వర ధాతువులు**

రెండు స్వరములు గల ధాతువులు. గుణ, నగు

(బా. వ్యా. క్రియా. 50)

**ద్విస్థానోద్భూతములు**

రెండు స్థానములందుఁబుట్టు వర్ణములు. (వ్యతి) ఏకస్థల జమ్మలు (చూ.)

వక్రములగు ఏ, ఓ, లు
వక్రతమములగు ఐ ఔలు
అంతస్థమగు—వకారము (అప్ప. II. 15)

**ద్వ్యవయవ క్రియలు**

రెండవయవములుగల క్రియలు. ఇందు శబ్దపల్లవములకు వలె (చూ.) విలక్షణార్థము గోచరింపదు.

రెండు క్రియలును వాని వాని యర్థములనే బోధించుచు, పరస్పరమన్వితము లగు చుండును.

చననిచ్చును—చనన్, ఇచ్చున్ (ప్రౌ. వ్యా. క్రియా. 25)

**ధాతుజ విశేషణములు**

ధాతువులనుండి పుట్టిన విశేషణములు.

రథము *గడు*పునేర్పు
తనపడ్డ పన్నములు (ప్రౌ. వ్యా. కారక. 15)

**ధర్మక్రియ**

తద్ధర్మార్థమును తెలుపు క్రియ. (చూ. తద్ధర్మార్థకక్రియ) ఒకానొకచో ఆశీరర్థ మందును తద్ధర్మక్రియ ప్రయోగింపఁబడును. ఉదా:- ప్రధన జయమిచ్చుఁ దిరుమలరాయ మణికి మొ॥ (అథ. కా. క్రియా. 66)

**ధర్మాది శబ్దములు**

(ధర్మ+ఆది శబ్దములు) ధర్మ, కర్మ (న్) వర్మ (న్) మున్నగు శబ్దములు. వీనిపై ప్రథమైకవచనమున ము వర్ణకముకాని, వు వర్ణకముకాని వచ్చును. ఉదా:- ధర్మము, ధర్మువు; కర్మము, కర్మువు; వర్మము, వర్మువు ఇత్యాదులు (అథ. కారి. అజన్త. 26) చూ: అర్హాదులు.

**ధాతు పల్లవములు**

నామములకు ధాతువులు చేరునట్టివిగాని; ధాతువులకు ధాతువులు చేరునట్టివి గాని ధాతుపల్లవము లగును.

పండుకొను, చనుదెంచు (తె వ్యా. వి. పుట. 804)

**ధాతుమాల**

కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిచే 1930లో ఇది ప్రకటితము.

ఇందు సుమారు 1500 ధాతువులకు సంస్కృతమునందు తెలుఁగునందు నర్థ వివరణము గావింపఁబడెను.

ఇది చిన్నయసూరి కృతమని భావింపఁబడెనుగాని వాస్తవముగానిది 1826లో శ్రీ వేదం పట్టాభిరామశాస్త్రి గారిచే విరచితము.

అటకాయించు, ఉడాయించువంటి అన్యదేశ్యములును నిందుఁగలవు.

**ధాతువర్ణకములు**

క్రియా విభక్తులు

డు, రు; వు,రు; ను, ము - అనునవి.

(వ్యతి.) నామవర్ణకములు (చూ.) (మ. ప. వ్యా. ప్ర.ప్ర 2.)

**ధాతు విశేషణము**

ధాత్వర్థ వ్యాప్తిని విశేషింపఁజేయునది.

నల్లగుఱ్ఱము వడిగాఁ బరిగెత్తెను. (మ. ప. వ్యా. విశే. 1)

**ధాతువిశేషణవాక్యసముదాయము**

రెండువాక్యములను గలుపు ధాతు విశేషణముతోఁగూడిన వాక్యసముదాయము.

వానలు కురిసెను *గాన* సస్యములు ఫలించును. కాన : అనునట్టిదిట్టిది.

(మ. ప. వ్యా. సంధా. 4)

**ధాతువిశేషణ వాక్యపదము**

ధాతువిశేషణము వాక్యముల ననుసంధించి ప్రాధాన్యము వహించు పదము.

వానలు కురిసెనేని సస్యములు ఫలించును. (మ. ప. వ్యా. వాక్య. 15)

**ధాతువు**

క్రియా వాచకమై ప్రత్యయము చేరని శబ్దస్వరూపము.

వచ్చు, ఉండు, పోషించు మొదలైనవి.

(ఆం. భా. శా. సంజ్ఞా. 47)

**ధాత్రాదులు**

'ధాతృ' మున్నగు ఋకారాంత శబ్దములు. వీనికి అత్వస్త్రీవద్భావములు విభాషగా నగును.

ధాతృ, దాతృ, విధాతృ, సవితృ, నేతృశబ్దములు మాత్రమే ధాత్రాదులు. ఇది నియత గణము.

ధాతృ <ధాత

ధాతృఁడు

(ప్ర. వ్యా. 231)

**ధాత్వర్థకము**

ధాతు+అర్థకము

ధాతువు తుదను 'ట' వర్ణకము చేర్చుట వలన నిష్పన్నమగు శబ్దము.

పోషించుట, కొట్టుట. (సం. వ్యా. విశే. 1)

**ధాత్వర్థము**

ధాతు+అర్థము - ధాతువుయొక్క అర్థము. దీనినే 'భావము' (చూ.) అందురు.

భావార్థము నందు 'ట' వర్ణకమగును.

వండుట, పండుట

వినుట, కనుట (బా. వ్యా క్రియా. 35)

**ధాన్యవాచకములు**

ధాన్యములను దెల్పుశబ్దములు.

ఆళ్ళు, చోళ్ళు, వడ్లు, కందులు, పెసలు, మినుములు, మొదలైనవి.

ఇవి నిత్యబహువచనాంతములు. (చూ.) (ప్రౌ. వ్యా. శబ్ద. 37)

**ధూర్తముఖ్యపదచతుష్టయము**

'ధూర్త' మున్నగు నాలుగు పదములు.

ధూర్త, నీచ, మూర్ఖ, వృద్ధ శబ్దములు. వీనికి—డుఙ్ వికల్పముగాఁజేరును

ధూర్తుఁడు—ధూర్త

నీచుఁడు—నీచు

మూర్ఖుఁడు—మూర్ఖు

వృద్ధుఁడు—వృద్ధు (క. సం. 41,42)

**ధూర్వహుఁడు**

అపరాంతే సమాసేచ శబ్దే నో బిందురిష్యతే, ధూర్వహస్య మతే తత్ర కవీవాఙ్మానము చ్యతే (పద్యావసాన మందును, సమాసమందును ధూర్వాహుని మతమున బిందువులేదు. దీనికి కవి వాక్కే ప్రమాణము. అధ. కా. అజంత. 20,21 అను కారికయందీతఁడు పేర్కొనఁబడినాఁడు. ఇక్లే'ఐకారాంతం స్వరూపేణ మతే

భవతి ధార్వహే'. ధార్వహుని మతమున రై, గ్లౌశబ్దముల ఐకార ఔకారములకు ఐకారమే వచ్చును. అథ. కా అజంత. 46) అనుచోటును ధార్వహుని పేరు స్మరింపఁబడినది. దీనినిఁబటి యితఁడొక ప్రాచీన లక్షణ కర్తయని చెప్పవలసి యున్నను మఱొకచోట కనుపింపదు ఇతఁడు రచించిన గ్రంథమును తెలియరాదు (ఆం. వ్యా. వి. పేజీ 195)

ధ్వనుల మార్పులు

మార్పు భాషా స్వభావము. భాషలోని మార్పులు పద్ధతి ప్రకారము జరుగును. అందుచేతనే భాష వ్యవస్థాత్మకమైనదిగాఁ బరిగణింపఁబడుచున్నది.

అర్థమునందు మార్పులేక ఉచ్చారణమునందు ధ్వనులు మార్పులకు లోనగు చుండును. అట్టి మార్పులను గొన్నింటిని వ్యాకర్తలు గుర్తించిరి. వానినిట సూత్ర ప్రాయముగా నిరూపించుచున్నాము.

I. స్వరములలో మార్పులు

(A) పదాది దీర్ఘము హ్రస్వమగుట

| | |
|---|---|
| (1) ఆ - > అ - | మాఱు—మఱు |
| (2) ఈ - > ఇ - | పీట తాళము—పిటతాళము |
| | నీలుగు—నిలుగు |
| (3) ఊ - > ఉ : | ఊయేల—ఉయాల |
| | గూడారము—గుడారము |
| (4) ఏ - > ఎ -: | పేద—పెంద |
| | కేళాకూళి— కెళాకుళి |
| | బేహారము—బెహారము |
| (5) ఓ - > ఒ -: | ఓయారము—ఒయారము |
| | మోఱకు—మొఱకు |

(బా. వ్యా. ప్రకీర్ణ. 12)

(B) పదమధ్య దీర్ఘము హ్రస్వమగుట :

| | |
|---|---|
| (6) -ఆ- > -అ- | ఆరాటము—ఆరటము |
| | కొమారుఁడు—కొమరుఁడు |
| (7) -ఊ- > -ఉ- : | కకూ్కటిత—కకు్కటిత |
| | గంబూరము—గంబురము |

(8) -ఏ->-ఎ- నల్లేరు—నల్లెరు

తంగేడు—తంగెడు

కుందేలు—కుందెలు

(9) -ఓ->-ఒ- సంతోసము—సంతొసము

(C) పదమధ్య హ్రస్వము దీర్ఘమగుట :

(10) -అ->-ఆ-: ఏతము—ఏతాము

గాలము—గాలాము

గోతము—గోతాము

(D) పదమధ్య స్వరలోపము ;

(11) -అ->-φ-: పొలఁతి—పొల్తి

(12) -ఇ->-φ-; కలికి—కల్కి

ములికి—ముల్కి

(బా. వ్యా. ప్రకీర్ణ. 18)

(13) -ఉ->-φ-: కినుక—కిన్క (బా. వ్యా. ప్రకీర్ణ. 17)

అబ్బురము—అబ్రము

కప్పురము—కప్రము

(బా. వ్యా. ప్రకీర్ణ. 19)

(E) ఇతరములగు మార్పులు :

(14) -ఇయ>-ఎ : కన్నియ—కన్నె

వన్నియ—వన్నె

(15) -ఇయ < -ఎ / ఇలోపము

ముత్తియము < ముత్తెము / ముత్యము

(బా. వ్యా. అచ్చిక. 23)

కన్నియ < కన్నె / కన్య

దివియ < దివ్వె / దివ్య

కళ్ళియము < కళ్ళెము / కళ్యము

పీడియము < పీడెము / పీద్యము

(ప్రౌ. వ్యా. శబ్ద, 49)

II వ్యంజనములలో మార్పులు

(A) పదాది వ్యంజనములలో మార్పులు

(*a*) లోపము

(1) చ > $\phi$ : చిగురు—ఇగురు

చులకన—ఉలకన

(2) త/ద > $\phi$ : తూపర—ఊపర

దొరలు—ఒరలు

(3) న > $\phi$ నీలుగు—ఈలుగు

నీవు—ఈవు

నన—అన

నట్టి—అట్టి

(4) ప > $\phi$ : పొందు—ఒందు

పొదలు—ఒదలు

(5) వ > $\phi$ . వెక్కిరింత—ఎక్కిరింత

వెద—ఎద

(6) హ > $\phi$ : హడపము—అడపము

హలది—అలది

హారతి—ఆరతి

(బా. వ్యా. ప్రకీర్ణ. 10)

(*b*) ఒకవ్యంజనము మరియొక వ్యంజనమగుట :

(7) ద > డ : దక్కు—డక్కు

దొప్ప—డొప్ప

దెందము—డెందము

(బా. వ్యా. ప్రకీర్ణ. 14)

పదమధ్య వ్యంజనములలో మార్పులు

(8) -డ->-ణ- అడఁగు—అణఁగు

పోఁడి—పోణి

మిడుగురు—మిణుగురు

(బా. వ్యా. ప్రకీర్ణ. 18)

(9) -ద->-జ-: జూదము—జూజము

జాది—జాజి (బా. వ్యా. ప్రకీర్ణ. 21)

(10) -త->-ద- బ్రతుకు - బ్రదుకు

మెతుకు - మెదుకు

ఉతుకు - ఉదుకు

(11) -గ->-వ-: పలుగురు - పలువురు

పగలు - పవలు

తాగ - తావ

(బా. వ్యా. అచ్చిక. 27)

(12) -గ->-హ- సగము - సహము

మొగము - మొహము

(13) -గ->-య- ఓగిరము - ఓయిరము

కోగిల - కోయిల

(14) -ర-/-ల-> -న- : అరఁటి - అనఁటి

చిరుగు - చినుఁగు

గొలుగు - గొనుగు

(15) -బ->-మ- గుబురు - గుమురు

గుబిలి—గుమిలి

(16) -మ->-వ- చలిమిడి—చలివిడి

మామిడి—మావిడి

సోమరి—సోవరి.

(C) పదాంతవ్యంజనములలో మార్పులు.

(17) -గ > -వ : ఈగి—ఈవి

ఎలుగు—ఎలువు

(18) -గ >-హ : ఇఁగ - ఇహ

సెగ - సెహ

(19) -త >-ట : గుంత - గుంట,

గుమ్మెత - గుమ్మెట,

(D) ద్విత్వలోపము.

అక్కట - అకట

ప్రెగ్గడ - ప్రెగడ

అచ్చట - అచట

మజ్జ - మజ

చిట్టి - చిటి

ఎడ్డ - ఎడ

మత్తాబు - మతాబు

నిద్దుర - నిదుర

అప్ప - అప

ఉమ్మి - ఉమి

అజ్జు - అజు.

(బా. వ్యా. ప్రకీర్ణ. 7,8)

**ధ్వని - లిపి-పరిణామం.**

దీనికే 'ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారికభాష' అను నామాంతరమును గలదు.

కర్త : శ్రీ వర్లమూడి గోపాలకృష్ణయ్య. 1955 ప్రచురణ.

ఇందు వ్యావహారిక భాషా పరిణామము, ధ్వని-లిపి-పరిణామ రూపమున నిరూపించు ప్రయత్నము జరిగినది.

వ్యావహారిక భాషా ప్రాబల్యము లిపిలో మార్పులకు దారితీయును.

**ధ్వన్యనుకరణ శబ్దములు**

ధ్వనిననుకరించు శబ్దములు.

(onompoetic sounds)

న

ఇవి తఱచుగా ద్విరుక్తము లగును.

గడ గడ, ఫెళ ఫెళ (ప్రౌ. వ్యా. సంధి 19, 20)

న1

దన్త్యాను నాసికము (dental Nasal)

(తవర్గమునకుఁ బూర్వము)

పైదంతముల వెనుక భాగము-స్థానము

జిహ్వాగ్రము కరణము

ఆనునాసికము

అల్పప్రాణము

అన్తలు, గ్రన్థము, అన్దము, గ్రన్ధము ఇత్యాదులు. ఇట్టి చోట్ల బిందువు నుపయోగించుట తెలుఁగున నాచారము.

న2

దన్తమూలీయాను నాసికము (alveolar nasal)

-పదాదియందు, అంతమునందు, ద్విరుక్తియందు.

దన్తమూలము - స్థానము,

జిహ్వాగ్రము - కరణము

ఆనునాసికము

నాదము

అల్పప్రాణము

నేను, నన్ను

న1,న2 అనునవి పరస్పరాభావము నందు వర్తించు సవర్ణము (allophones in complementary distribution)

న3

ము, బు, వు వర్ణములంతమందుగల అమహచ్ఛబ్దములపైని, జడవాచకస్త్రీసమ. ఉదంత శబ్దములపైని సప్తమ్యేకవచనమునకు (జి అనుదానికి) వచ్చు ఆదేశము- (అథ. కా. అజంత 16, 17; క. సం. వి. I. 119—123) ఉదా:- వనమున, పర్వతంబున, ధనువున, పేరున మొ॥

న4

నామమునకు కువర్ణకము పరమగునపుడు వచ్చుఆగమము (చింతా. అజంత 24)

ఉదా:- రాముసకున్, కృష్ణునకున్ మొ॥ ఈ నకారాగమము ఉదంత శబ్దము లన్నింటికిని, ఋకారాంత శబ్దములకును కువర్ణకము పరమగునపుడు వచ్చును. (అథ. కా. అజంత 15) ఉదా:- గురునకున్, రామునకున్, విధాతృనకున్ మొ॥

**—న[5]**

'నల్ల' మున్నగు గుణవచనములకుఁజేరు తద్ధిత ప్రత్యయము.

నల్లన, పుల్లన

చూ. నల్లాదులు. (బా. వ్యా. తద్ధిత. 6)

**నకారపుపొల్లులకు సంధి**

పొల్లునకారములకు అచ్చు పరముగుచో ద్విత్వము కల్గును.

కొల్లలుగ రంగధరణీ వల్లభుఁడిచ్చున్న పారవస్తు వులనినన్'

(రంగ. IV-6-10)

**నకారపుఁబొల్లు నూదుట**

నకారపుఁబొల్లుల కచ్చు పరమగునపుడు దానిని ఒత్తి పలుకవచ్చును.

నందిని యన్నోటి తరఁగ (ఆం. కౌ. 123-124)

**నకారము దూలతో శ్లిష్టము**

నకారము పూర్వమందున్న 'డు' తోఁగలిసి సమీకరణమందును

ఏఁడు+నూరు⟶ఏడ్నూరు⟶ఏణ్ణూరు

రెండు+నాళ్లు⟶ రెండ్నాళ్లు⟶రెణ్ణాళ్లు.

(స. సా. సం. సంధి. 124-126)

**నకార హల్లులకచ్చుతో** సంధి

పొల్లునకారమున కచ్చుపరమగుచో సంధిఁగూర్పఁజెల్లును.

'పన్నగశయనుండు హరియోర్చున్న ఘములు'

'ధైర్యయుక్తి కిన్నరుడుగ' (క. సం. IV-12)

**నగాగమము**

న(క్)+ఆగమము. కిత్సంజ్ఞ.

(1) ఉకార, ఋకారములంతమందున్న సంస్కృతసమశబ్దములకు, -కు వర్ణకము పరమగునపుడు నగాగమ మగును.

రామునకు, విధాతృనకు. (బా. వ్యా. తత్సమ .28)

(ii) కవిత్రయేతర కవుల ప్రయోగము లందిట్టి యాగమము కొన్నియెడల లేదు.

ఉత్సవము కేగెడు క్రియ
నిషధేంద్రుఁబచ్చుకున్. (ప్రౌ. వ్యా. శబ్ద. 19)

**నజీ**

అప్పాదులకు (చూ.) పరమగు కృత్ప్రత్యయము.
అప్పన, గడన, పీవన మొదలగునవి. (బా. వ్యా. కృదన్త. 18)

**నఞ్తత్పురుషము**

వ్యతిరేకార్థమును దెలుపు 'నఞ్' అను అవ్యయముతోఁగూడిన సమాసము.

అబ్రాహ్మణుఁడు
నవృలి (అ. ఛం. IV. 96)

**నఞ్పూర్వపదబహువ్రీహి**

వ్యతిరేకార్థమగు 'నఞ్' పూర్వపదముగాఁగల బహువ్రీహి సమాసము.

అపుత్రుఁడు—(పుత్రుఁడెవరికి లేఁడో వాఁడు) (సు. వ్యా. సమాస.48)

**నన్నయ భారతము**

ఇది ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు ఉస్మానియావిశ్వవిద్యాలయమునకు డాక్టరేటు బిరుదార్థము సమర్పించిన సిద్ధాంతవ్యాసము. (Thesis)

ఇందలి 'నన్నయ భారతమందలి భాషావిశేషముల'ను ప్రకరణము ఏకకాలిక భాషా వ్యాకరణముగా (Synchronic grammar) పరిగణింపనగును.

**నప్**

నపుంసకలింగమును దెలుపు సంజ్ఞ. (వై. చం. సంజ్ఞా. 18)

**నపుంసకలింగ తుల్యములు**

నపుంసకలింగ శబ్దములకు వలె మువర్ణకము చేరు అచ్చిక శబ్దములు.

అల్లము, బెల్లము, మొల్లము
వీయము, బియ్యము, నెయ్యము
అందము, చందము, గుజ్జము ఇత్యాదులు

(ల. వ్యా. సుబన్త. 57)

**నపుంసకలింగసమములు**

నపుంసకలింగము కానట్టి మువర్ణకాంతము లైనట్టి మహద్వాచకములు.

జనము—చుట్టము. (సం. వ్యా. లింగము. 7)

**నమఆదికము**

(నమః+ఆదికము) నమః మున్నగు విసర్గాంత శబ్దములు. అనుకరణమున వీని చివరనున్న విసర్గము లోపించును. ఉదా:- రామాయ నమోనమయని, రామ స్సహాయయని మొ॥ (చింతా. సంధి. 20) చూ:- నమశ్శబ్దాదుల సంధి. అథ. కారి. యందు నమశ్శబ్దవిసర్గమునకు లోపము, ఓత్వమును పర్యాయముగ విధింపఁ బడుటచే రామాయ నమయనియె, రామాయ నమోయనియె యను రూపము లేర్పడును. (అథ. కారి. సంధి. 18)

**నమశ్శబ్దము**

'నమః' అను సంస్కృత శబ్దము. అనుకరణమునందు దీని విసర్గకు లోపము, అత్వమున కోత్వము విభాషగా నగును.

తుభ్యంనమః అనియె ⟶ తుభ్యంనమో యనియె.

(బా. వ్యా. సంధి. 50,51)

**నమశ్శబ్దాదులసంధి**

(చూ.) నమాదికము.

'నమః' అను శబ్దమునకు, తదితర శబ్దములకును అనుకరణమునందుఁ గల్గు సంధి.

నమశ్శబ్దాదుల కనుకరణమునందు విసర్గ లోపించును.

నమశ్శబ్దాదులయొక్క అత్వమునకు ఓత్వము, యకారము నగును.

'మనసిజాయనమో'యనుచుఁ మ్రొక్కె

'బ్రాహ్మణో' నహన్తవ్య'యనఁగ (స. సా. సం. I. సంధి. 76-79)

**నరలడ శృంగ సంధులు**

పదమధ్యమందలి న, ర, ల, డ ల కొమ్ములకు లోపము వికల్పముగా నగును.

కానుపు—కాన్పు

తూరుపు—తూర్పు

తెలుపు—తెల్పు

గాడుపు—గాడ్పు (అప్ప. V. 107,108)

**నల్లాదులు**

'నల్ల' మొదలగు గుణవచనములు నల్ల, తెల్ల, పచ్చ, ఎఱ్ఱ, తియ్య, చక్క ద్రేఁక మున్నగునవి. ఇది ఆకృతి గణము.

వీనికి 'న' వర్ణకము చేరిన నల్లన, తెల్లన, వంటి తద్ధిత రూపము లేర్పడును.

(బా. వ్యా. తద్ధిత. 6)

**నలడాదులు**

(నలడ+ఆదులు) న, ల, డ, ర మున్నగు వర్ణములు. ఏకపద మధ్యమున నున్న వీని ఉకారమునకు లోపము వికల్పముగా వచ్చును. ఉదా: -కినుక-కిన్క; మినుకులు-మిన్కులు; పలుకులు-పల్కులు; కాలువ-కాల్వ; కడువు-కడ్వు; మురువు-ముర్వు మొ॥ (చింతా. సంధి. 42) నలడాదులమీఁది ఉకారమునకేకాక ఇతరాచ్చులకును ప్రయోగములను బట్టి లోపము వికల్పముగా వచ్చును. ఉదా:- కలికి-కల్కి; ఉనికి-ఉన్కి మొ॥ (చింతా. సంధి. 48)

**నవర్ణకము[1]**

'న' యను సప్తమీవిభక్తి. ఉకారాంతములైన అమహత్తుల సప్తమ్యేక వచనము నందు 'న' వర్ణకము విభాషగా నగును.

వనమునన్, వనమునందున్ (ల. వ్యా. సుబన్త. 86)

**నవర్ణకము[2]**

చేదర్థము నంపును (చూ) వృత్తమగు భావలక్షణమందును ద్రుతాంతమగు నవర్ణకము చేరును.

వానలు గురిసినఁబంటలు పండును.

వాఁడు రమ్మనినఁ బోయితిని. (బా. వ్యా. క్రియా. 41)

**నవర్ణకము[3]**

భూతార్థమునుఁ జెప్పునట్టి క్రియా విశేషములకంటె పరముగా వచ్చు వర్ణకము. (చింతా. హలంత. 32) ఉదా:- జయించినవాఁడు, గెలిచిన వాఁడు. మొ॥ ఇది కర్మాది కారకములకు కర్తృత్వమును, కర్మార్థమున ప్రయుక్తమైన కర్తృవాచక పదము యొక్క తృతీయకు ప్రథమయు వచ్చినచోట్లను భూతార్థక క్రియా విశేషణములమీఁద వచ్చును. ఉదా:- నీవు నుతించిన రాజు (ఇట నీచే నుతింపఁ బడిన రాజని యర్థము) మొ॥ (చింతా. హలంత. 88)

**నవర్ణకము మీఁది తచ్ఛబ్దవకారము**

చేదర్థాదులందు వచ్చి 'న' అనుప్రత్యయమునకుఁ బరమయిన వాఁడు, వారు అను సర్వనామములలోని వకారము.

ఇట్టి వకారము లోపించుచో, అత్వమునకు సంధి తప్పక చేయవలయును. (అత్తునకు సంధి బహుళమనుటలో 'ప్రవృత్తి' కిది లక్ష్యము)

వచ్చిన వాఁడు —> వచ్చినాఁడు

తెచ్చిన వారు —> తెచ్చినారు.

(బా. వ్యా. క్రియా. 117; సంధి 4)

**నవార్థము**

'తొమ్మిది' యని యర్థము.

దీని యుపోత్తము ఇత్వమునకు, బహువచనము పరమగునపుడు ఉత్వము గలుగదు.

తొమ్మిది+లు —> తొమ్మిదులు అనియే కాని 'తొమ్ముదులు' అనికాదు. 'మేలైన రెండు తొమ్మిదులు విద్యలలోన' అను కాశీఖండ ప్రయోగమిట్లున్నను, శిష్ట వ్యవహారమునందు 'తొమ్ముదులు' అనియే శ్రుతము. (బా.వ్యా.తత్సమ.47)

**నవీన తత్సమ క్రియలు**

చూ. నవీన తత్సమములు.

ఆంగ్లాది భాషా పదములను క్రియా పదములను జేయగా నేర్పడిన క్రియలు.

నామినేట్ చేయు

కంటెన్యూ చేయు (తె వ్యా వి. పుట. 751)

**నవీన తత్సమములు**

ప్రాచీన తత్సమములు, (చూ ) అర్వాచీన తత్సమములు (చూ.) నవీన తత్సమములని తత్సమములు కాలమునుబట్టి మూఁడు విధముల విభజింపనగును.

నవీన కాలమునందు పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, ఆంగ్లాది భాషలనుండి తెలుఁగున నెక్కువ మార్పులు లేకుండ ప్రవేశించిన పదములను నవీన తత్సమము లనఁదగును.

అల్మైరా, బటను హాస్పిటలు, రోడ్డు, కమాను మున్నగునవి.

(తె. వ్యా. వి. పుట. 354)

**నవీన తద్భవములు**

సంస్కృత ప్రాకృత భాషా భవములు ప్రాచీన తద్భవములు (చూ.) అరబీ పారసీ కాదిపదభవములు అర్వాచీన తద్భవములు, (చూ.) పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, ఆంగ్ల భాషాభవములు నవీన తద్భవములు.

బతేవియా - బత్తాయి

హాస్పిటల్ - ఆసుపత్రి. (తె. వ్యా. వి. పుట. 354)

**నాంతక్రియాపదసంధి**

నకారాంత క్రియా పదముల కచ్చుపరమగు నపుడు ద్రుతము లోపించును. లేదా పొల్లు నకారము మీది యచ్చుతోఁగూడును.

వచ్చుచున్ + ఉండెను > వచ్చుచుండెను.
వచ్చుచునుండెను.

(క. సం. వి. I. 118)

**నాంతపదములు**

నకారాంత పదములు. వీనిని సాంప్రదాయిక వ్యాకర్తలు ద్రుతప్రకృతికము లనఁగా. కేతనాది స్వతంత్ర వ్యాకర్తలు నకారాంత పదము లందురు.

ఇట్టి నకారాంత పదములపైఁగల క, చ, ట, త, ప, లు గ, జ, డ, ద, బ లగును. నకారము సున్నయగును.

(ఆం. భా. భూ. 54; క. సం I. 32-36; స. సా సం I. సంధి. 82-86)

**నాంతములగు మనుజసంజ్ఞలు**

నకారాంతములైన మనుష్యుల పేళ్లు. వీనికి స్త్రీత్వము బహుళము.

దేవశర్మ—దేవశర్మఁడు. (బా. వ్యా. తత్సమ. 77)

**నాంతశబ్దములు**

నకారాంతములైన సంస్కృత శబ్దములు.

'బ్రహ్మ' శబ్దము దక్క. తక్కిన మహద్వాచకములకు డుజ్ వికల్పముగా జేరును.

అమహత్తులకు ము, వు, లు చేరును.

కృతవర్మఁడు—కృతవర్మ

దేవశర్మఁడు— దేవశర్మ

కర్మము—కర్మవు (ఆం. కౌ. 157-192)

**నామము**[1]

నామవాచకము పదార్థమును బేర్కొనును. సుదర్శనాయుధుడు, మనుష్యుఁడు, చెట్టు, గృహము.

వీనిని విశేష్యములనియు నందురు.

(ప్రౌ. వ్యా. శబ్ద 77; ఆం. భా. శా. సంజ్ఞా. 76)

**నామము**[2]

నామమనఁగా ప్రాతిపదికము.

డిద్ద, రామ, భార్గవ, రాజపురుష-ఇట్టివి ప్రాతిపదికలు. చూ:- ప్రాతిపదికము
(బా. వ్యా. తత్సమ. 21) (చింతా. సంజ్ఞా)

**నామపునర్గ్రహణము**

నామవాచకమును మఱల గ్రహించుట.

నామపదము నొకసారి గ్రహించిన తరువాత, మఱల గ్రహింపవలసియున్నచో ఆ నామపదముతోఁ గలిసి యుండిగాని, ఆ నామ పదములేక 'ఆ' శబ్దమొక్కటియ వేఱుగానుండి గాని యానామ పదము యొక్క యర్థమునే బోధించెడిని.

వాఁడె.. రాక్షస వివాహమునన్ గొని పోవునిన్ను (సుదర్శనాయుధుడను నామపదముతో నభిన్నము) (ప్రౌ. వ్యా శబ్ద 75)

**నామములు**

వస్తువాచకములు.

ఇవి విశేష్యములు, విశేషణములని రెండు దెఱఁగులు. (సం. వ్యా. పద. 4)

**నామవర్ణకములు**

నామములకుఁ జేరు విభక్తులు. డు,ము,వు,లు, ను—మొదలైనవి. (వ్యతి.)
ధాతువర్ణకములు: డుబ్, రు; వు, రు; ను, ము. (మ. ప. వ్యా. ప్రత్యయ, ప్ర1,2)

**నామవిభక్తులు**

వస్తువాచకములకుఁ జేరు—డు, ము, వు, లు. ఇత్యాది సప్తవిధ విభక్తులు. ఇవి సంస్కృతము నందలి 'సుప్పు'ల వంటివి.

(ఆం. భా. శా. సంజ్ఞా. 48)

**నామవిశేషణము**

నామముయొక్క అర్థవ్యాప్తిని నిరోధించునది.

నల్ల గుఱ్ఱము (వ్యతి.) ధాతు విశేషణము. (మ. ప. వ్యా. విశే. 1)

**నామయుష్మదస్మదర్థములు**

నీవు, నేను అను నర్థములు కాక, తక్కిన యర్థము నామమనఁబడును.

యుష్మదర్థములు—నీవు, మీరు

అస్మదర్థములు—నేను, మేము (బా. వ్యా. క్రియా. 11

**నామవిశేషణ వాక్యపదము**

నామమును విశేషింపఁజేయునది నామ విశేషణము. (చూ.) అట్టి విశేషణము వాక్యమునందుఁ బ్రాధాన్యము వహించినచో అట్టిది 'నామవిశేషణ వాక్యపదము'గును

ఎవఁడు బాగుగఁజదువునో వాఁడు దెలివి నొందును.

(మ. ప. వ్యా. వాక్య. 14.)

**నామాకాంక్షములు**

నామములను ఆకాంక్షించు విశేషణములకు 'నామాకాంక్షముల'ని వ్యవహారము.

పడుచున్న —
పడిన —
పడ్డ — ఫలము
పడఁగల —
పడని —

(సం. వ్యా. క్రియా. 18.)

**నామాఖ్యాతములు**

నామములు, ఆఖ్యాతములు (చూ.). యాస్కుఁడు తన నిరుక్తమునందు సంస్కృత పదజాతమును నాలుగు విధములుగా విభజించెను.

1. నామములు.
2. ఆఖ్యాతములు.
3. ఉపసర్గలు (చూ.)
4. నిపాతములు. (తె. వ్యా. వి. పుట. 569)

**నామార్థము**

నామముయొక్క అర్థము. ఇందు ప్రథమావిభక్తి చేరును. (ప్ర. వ్యా. 266)

**నాముడి**

నా వత్తు (న్న)

(గు. వ్యా. 18; ప్ర. వ్యా సంజ్ఞా. 43)

**నారాయణరావు, చిలుకూరి**

'కళాప్రపూర్ణ' బిరుదాంచితులు వీరి 'ఆంధ్ర భాషా చరిత్ర' (చూ) రెండు సంపుటములు ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రకటితము.

వీరు జీవితాంతము భాషాసేవ గావించి కీర్తిగడించిరి ఆంధ్రభాష ఆర్యభాషా కుటుంబమునకుఁజెందినదని వీరి మతము.

వీరు 11 శతాబ్దికిఁజెందిన నన్నయ భాషకు వర్ణనాత్మక వ్యాకరణమును రచించిరి.

**నాలుగైదక్షరములపైని సంస్కృత పదము**

సంస్కృతపదములపై తెనుఁగు పదములను జేర్పరాదు.

కాని తెనుఁగు పదములపై సంస్కృతమును జేర్పనగునని; అట్టి తెనుఁగు పదములు నాలుగక్షరములుగాని, ఐదుగాని యక్షరముల పరిమితిలో నుండుట మేలని కొన్నిలక్షణ గ్రంథములు సూచించినవి.

వాడి మయూఖములు

పునుగుందావి నవోదనంబు. (రంగ. IV. 76-87)

**నావత్తు**

నకారము ఇతర హల్లులతోఁ గూడు నప్పటి గుర్తు 'న' (గు. వ్యా. 18)

**నాసిక్యము లు**

నాసికకు సంబంధించిన ధ్వనులు—ఙ, ఞ, ణ, న, మ.

(ప్ర. వ్యా. సంజ్ఞా. 41)

**నిండు సున్న**

నిండు జాబిల్లివలె వ్రాయఁబడునది [ం]. దీనికే 'పూర్ణబిందువ'నియు వ్యవహారము. (అప్ప. II. 88)

**నింద**

ఒకవ్యక్తినిగాని, విషయమునుగాని నిందించునపుడు తద్వాచక మామ్రేడింపఁబడును. అట్టి ఆమ్రేడితము యొక్క యాద్యక్షరము హ్రస్వమగుచో దానికి 'గి', దీర్ఘమగుచో 'గీ' యాదేశమగును.

హరి+హరి ⟶ హరిగిరి. ఆమ్రేడితము

రావణుఁడు+రావణుఁడు ⟶ రావణుఁడు గీవణుఁడు

(చూ.) గిగీలు (బా. వ్యా. ప్రకీర్ణ. 22)

**నింద్యగ్రామ్యములు**

గర్హింపఁదగినగ్రామ్యపదములు

ప్రయోగ రూఢములు గాని వ్యవహార పదములు. — వస్తాఁడు, తెస్తాఁడు, ఇస్తాఁడు మొదలగునవి.

(వ్య.) అనింద్య గ్రామ్యములు (చూ.) (ప్ర. వ్యా. సంజ్ఞా. 1

**-ని¹**

మహద్వాచకమునకు టాది (తృతీయాది) విభక్తులు పరమగునపుడు ఏకవచనమున వచ్చు ఆగమము (చింతా. అజంత. 18) ఉదా:- రామునిచేత, రామునికొఱకున్, రాముని వలనన్, రామునికిన్ మొ॥ తృతీయాది విభక్తులు పరమగునపు డీయాగమము రాదనియు రాముచేతన్ ఇత్యాదులు 'ని' ఆగమమురాని రూపములే యుండునని కొందఱ మతము (చింతా. అజంత. 19). తృతీయాది విభక్తులు పరమగునపుడు ఇదంత శబ్దములపై మాత్రమీ యాగమము రాదు. ఉదా:- హరిచేతన్ మొ॥ (చింతా. అజంత. 40) కువర్ణకము పరమగునపుడు మాత్రము నివర్ణముకాక నవర్ణ మాగమముగ వచ్చును. ఉదా:- రామునకున్, కృష్ణునకున్ మొ॥ (చింతా. అజంత. 24)

**-ని²**

వ్యతిరేకార్థమును జెప్పు క్రియా పదములకు పరమందు వచ్చు వర్ణకము. ఉదా:- ఘటింపనివాఁడు, చేయనివాఁడు; ఘటింపనియది మొ॥ (చింతా హలంత. 81) వ్యతిరేకాదౌ భావిని చాత్స్యాత్ (చింతా. క్రియా. 16) అను సూత్రముచే క్రియాంత్య వర్ణమునకు హ్రస్వాకారము ఆదేశమగును.

**ని³ (న్)**

మహద్వాచక శబ్దములపై ద్వితీయైకవచన (అమ్) స్థానమున వచ్చు ప్రత్యయము. దీనికి వికల్పముగా లోపము వచ్చును. (చింతా. అజంత. 16, అథ. కా. అజంత. 18) ఉదా:- రామునిన్, రామున్ మొ॥ ఇకారాంతాది శబ్దముల కంటె పరమందున్న నివర్ణకమునకు నిత్యముగా ఉకారముకంటె పరమందున్న నివర్ణకమునకు వికల్పముగా లోపమువచ్చును. ఉదా:- హరిన్, విష్ణునిన్, విష్ణున్ మొ॥ (అథ. కా. అజంత. 13)

**-ని⁴**

అస్మచ్ఛబ్దార్థకమగు ఇకారాంత నామముకంటె పరముగా వచ్చు వర్ణము. ఉదా:- నేను కవిని మొ॥ (అథ. కా. హలంత. 14) ఇది వైకల్పికమగుటచే నేకవి వచ్చితి ఇత్యాదులలో నివర్ణము రాలేదు.

**ని⁵**

సమాసమునందు డుజ్జునకు నిత్యముగావచ్చు ఆదేశము. ఉదా:- రామినేని కులము, రంగారాయని వంగడము మొ॥ (అథ. కా. అజంత. 110)

**-నికి/-నకుల్**

పురుషాఖ్యలకు షష్ఠీ విభక్తియందు—నికి, అనిగాని,—నకు అనిగాని యుండనగును.

ధర్మజునకు—ధర్మజునికి

కృష్ణునకు—కృష్ణునికి. (స సా. సం. I. విభక్తి. 40-48)

**నిక్కలాదులు**

'నిక్కల' మున్నగునవి.

నిక్కల, కవ్వడి, పువ్విలుకాఁడు ఇత్యాదులు

నిక్క+కల ⟶ నిక్కల,

కవ+వడి ⟶ కవ్వడి

పువ్వువిల్లుగాఁ గలవాఁడు.—ఇత్యాది రూపములు ప్రక్రియచే సాధింపఁ జాలము.

ఇది యథాప్రయోగముగ గ్రాహ్యము. (బా. వ్యా. సమాస. 20)

**నిగాగమము**[1]

నిక్+ఆగమము.

డుమంతములగు శబ్దములకు ద్వితీయాద్యేక వచన విభక్తులు పరమగునపుడు ని(క్) అను నాగమము విభాషగా నగును.

రామునిని—రాముని

రామునిచేతను—రాముచేతను

రామునికిని—రామునకును. (బా. వ్యా. తత్సమ. 23.24)

**నిగాగమము**[2]

ని (క్)+ఆగమము.

గుణవచనములగు నల్లాదులకు (చూ.) కర్మధారయ సమాసము నందీ యాగమము బహుళముగా నగును.

(i) చక్కనివాఁడు, చిక్కనిపాలు (ప్రవృత్తి)

(ii) చిన్నవాఁడు, పెద్దవాడు (అప్రవృత్తి)

(iii) నల్లనివాఁడు—నల్లవాఁడు (విభాష)

(iv) కమ్మందేనియ (ఇతర కార్యము)

(బా. వ్యా. సమాస. 12) (వికాసవ్యాఖ్య)

**నిజి**

వ్యతిరేక తృవర్ణకార్థము (చూ.) నందు వచ్చు ప్రత్యయము. 'నిజి' జిత్తు కావున ఉత్వమున కత్వమగును.

వండు+ని(జి) ⟶ వండనివాఁడు (బా. వ్యా, క్రియా. 47)

**నిట్వాదులు**

(నిట్టు+ఆదులు) నీరువట్టు, ఉప్పుపట్టు మొదలగు శబ్దములు. ఈ శబ్దములలో అనేక హల్లులకు లోపము వచ్చును. ఉదా:- నిట్టు (నీరువట్టు), ఉప్పువట్టు (ఉట్టు) మొ॥ (వై. చం. సమాస 10)

**నిడుదకుంగుబడ**

దీర్ఘమునకు హ్రస్వమగుట.

అనుకరణమునందు సంస్కృత శబ్దాంత దీర్ఘము హ్రస్వమగునని అప్పకవి వచించెను. (చూ. అప్ప. v. 98)

ఈ యభిప్రాయము నిరాకరమని చిన్నయసూరి ఖండించెను.

'దుర్బలస్య బలంరాజా యనవినవే! (బా. వ్యా. సంధి. 54

**నిడుదలు**

దీర్ఘములు.

వీనికే నెఱయక్కరములు, పొడవులు, చాఁపులు, దీర్ఘములు, (చూ.) అనియు వ్యవహారము.

ఆ, ఈ, ఊ, ఏ, ఓ ఇత్యాదులు. (అప్ప. II. 10)

**నిడుపులు**

దీర్ఘములు.

(చూ.) నిడుదలు (అప్ప. II. 10)

**నిత్యబహువచనాంతములు**

ఎప్పుడును బహువచన ప్రత్యయ మంతమందుండు పదములు.

అందఱు, ఇందఱు, కొందఱు, పలుగుంద్రు (వ్య) నిత్యైక వచనాంతములు (చూ.) (ప్రౌ. వ్యా. శబ్ద 35)

**నిత్యబహువచనాంత సర్వనామము**

మనము

(సం. వ్యా. సర్వ. 9)

**నిత్యము**

వ్యాకరణ కార్యము తప్పక ప్రవర్తిలుట, "అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము *నిత్యముగా* నగును.

మగని చేత, మగని కొఱకు, (బా. వ్యా. తత్సమ. 24)

**నిత్యైక వచనాంతములు**

ఎప్పుడును ఏకవచనము అంతమందుఁగల పదములు.

(i) అక్కడ, ఇక్కడ, ఎక్కడ, అచ్చట, ఇచ్చట, ఎచ్చట, ఇరులు, కేలు.
(ii) ఆరుగ, చోడి మున్నగు సస్య వాచకములు.
(iii) ఇత్తడి, ఇనుము, కంచు, బంగారము మున్నగు లోహవాచకములు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 23-33)

**నిత్యసమాసము**

లౌకిక విగ్రహములేని సమాసము. లేదా స్వపదముతో కాక, అన్యపదముతో లౌకిక విగ్రహముగల సమాసము.

కుంభకారుఁడు —'కుంభమ్ కారః' అనికాక, 'కుంభమ్ కరోతిసః' అనురీతిని విగ్రహముండును. (ఆం. భా. శా.. సమాస 85)

**నిపాతన క్రియలు**

నిపాతముగా నేర్పడిన క్రియలు.

తుమున్నర్థము నందును, ప్రార్థనార్థమునందును. వేఱు రూపములను బొందిన క్రియలు.

అగు—కాన్, కమ్ము, కండు
వచ్చు—రాన్; రమ్ము, రండు. (సం. వ్యా. క్రియా. 8 )

**నిపాతము**

సామాన్య ప్రక్రియకు లోఁబడక, విలక్షణముగానున్న యొక్క శబ్దమునకుఁ బ్రత్యేక ప్రక్రియ చూపక, దాని రూపము 'ఇది' అని సిద్ధరూపమును మాత్రమే నిర్దేశించుటకు 'నిపాతమ'ని పారిభాషిక వ్యవహారము.

వేధ, పురోధ, పురోధసుఁడు, (రమణీ. పుట. 295)

**నిబద్ధ రూపములు**

పదములందు బంధింపఁబడిన శబ్దరూపములు. వీనికిస్వతంత్రప్రయోగముండదు.

(చూ.) అనిబద్ధ రూపములు

పుస్తకము | లు.

అనిబద్ధ రూపము | నిబద్ధ రూపము
(free form) (bound form)

వీనిముందు గీతనుంతురు.—లు

(తె. వ్యా. వి. పుట 568)

**నిమంత్రణము**

పిలుపు, ఓ రాముఁడ!

సంబోధనమునకిది పర్యాయ పదముగా మహాభాష్యమునందుపయుక్తము.

(పా. III-3-161) (తె. వ్యా. వి. పుట. 634)

**నిమిత్తము**

సప్తమీ విభక్తి క్రింద శ్రీ గురుమూర్తి శాస్త్రి తన తెనుఁగు వ్యాకరణము నందుఁ బేర్కొనెను. (గు. వ్యా. 84)

**నిమిత్తసప్తమి**

సంస్కృతమున "నిమిత్తాత్కర్మయోగే" అను వార్తికము (అష్టా. 2-3-36) చే నిమిత్తము (ఫలము) అనునర్థమున కర్మయోగ మున్నపుడు వచ్చు సప్తమీ విభక్తి. ''చర్మణి ద్వీపినం హంతి దంతయోర్హంతి కుంజరమ్, వాలేషు చమరీం హంతి సీమ్ని పుష్కలకో హతః (మ. భా. 2-3-36) అనునది నిమిత్త సప్తమికి ఉదాహరణము. ఇందలి చర్మణి, దంతయోః, వాలేషు, సీమ్ని అనుచోట్ల చర్మము నిమిత్తము, దంతముల నిమిత్తము మున్నగు విధముగా నర్థము చెప్పుటచే నిమిత్త సప్తమియని భావము. సంస్కృతమున నిమిత్తాద్యర్థములందు సప్తమీవిభక్తి వచ్చుచోట్ల తెనుఁగున ప్రథమా విభక్తి వచ్చును. (చింతా. అజంత. 33) ఉదా:- చర్మము నిమిత్తము మొ॥

**నిమిత్తార్థము**

నిమిత్తమును అనఁగా పనిని దెలుపునట్టి యర్థము.

కర్మపదముతో సంబంధమున్నపుడు నిమిత్తార్థమందు చతుర్థిగాని, షష్ఠిగాని వచ్చును.

బొగ్గుల కొఱకుఁ జెట్టునరికెను.

బొగ్గులకుఁ జెట్టు నరికెను.

బొగ్గుల కోసరము చెట్టు నరికెను. (ఆం. భా. శా. విభక్తి. 37,38)

**నియతోపస్థితికము**

నిత్యమైన స్ఫురణము కలది. అనఁగా ప్రాతిపదికము. (చూ.)

రామ, కృష్ణ, భార్గవ ఇత్యాదులు. (బా. వ్యా. కారక. 1)

**నియమము**

శాస్త్రము, లక్షణము, లేక అనుశాసనము.

(ఆం. భా. శా. అవతారిక. 3.)

**నిరనునాసికము**

నిర్+అనునాసికము.

అనునాసికము (చూ.) కాని ధ్వని నిరనునాసిక మనబడును.

(వ్యతి.) సానునాసికము. (చూ.)

'ఆ' అనుధ్వని నిరనునాసికముగా నుచ్చరించినచో సమ్మతిని దెల్పును.

'ఆఁ' అని సానునాసికముగాఁబలుకుచో (కొంచెము కాకువుగా) ప్రశ్నను, అసమ్మతిని దెలుపును. (సు. వ్యా. పీఠిక; తె. వ్యా. వి. పుట. 69)

**నిరవకాశము**

అవకాశము లేనిదగుట అని యర్థము.

'అవకాశము కలది' యను నర్థమునిచ్చు 'సావకాశము' (చూ.) అనుపదము దీనికి వ్యతిరేకము.

వ్యాకరణ సూత్రములలోఁగొన్ని సావకాశములు, కొన్ని నిరవకాశములు.

"ఇఁకాదులకుఁదప్ప ద్రుత ప్రకృతికములకు సంధి లేదు" అను బాలవ్యాకరణ సూత్రము సావకాశ సూత్రము. (సంధి. 9) అట్లుగానిచో "ప్రథమేతర విభక్తి శత్రర్థచువర్ణంబులందున్న యుకారమునకు సంధి వికల్పముగా నగును"ను సూత్రము వ్యర్థమగును. (బా. వ్యా. సంధి. 2) వ్యర్థమగుటకు సూత్రరచనసేయు టనవసరము కదా! అందువలన నీ 'నిరవకాశవిధి' 'సావకాశవిధి'ని బాధించి ప్రవర్తిల్లును. అనఁగా ద్రుతప్రకృతికములేయైనను, ఉదంతములై ప్రథమేతర విభక్త్యంతములైన ద్రుతప్రకృతికములకు, శత్రర్థ 'చు' వర్ణమునకు వికల్పముగా సంధి గల్గును (నిరవకాశాహి విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే-అని పరిభాష)

నన్నున్ + అడిగె < నన్నడిగె (సంధి కల్గిన రూపము)
నన్నునడిగె (సంధి కల్గని రూపము)

వచ్చుచున్+ఉండెను < వచ్చుచుండెను.
వచ్చుచు నుండెను. (బా. వ్యా. సం. 2,9)

**నిరాకరము**

ఆకరము—స్థానము, ప్రమాణము లేనిది.

కొందఱు లాక్షణికులు భ్రమచేత కానోపు కొన్ని నిరాకరములగు లక్షణములను నిర్దేశింతురు. ఆనంతర లాక్షణికులు వానిని నిరాకరములని త్రోసి పుచ్చుదురు. లక్ష్యముగాని, లక్షణముగాని సమర్థించుటకు లభింపని లక్షణమును నిరాకరముగా ద్రోసిపుచ్చవచ్చును.

ఉదాహరణము :

అప్పకవి "అనుకరించెడుచోట నవ్యయాదుల కొనఁగల బొట్టుగవకు దీర్ఘంబులకును వచ్చులోపము" (అప్ప. V. 98)

విసర్గకు లోపమే అప్పకవి చూపెనుగాని దీర్ఘమునకు లోపము, అనఁగా హ్రస్వమగుటకు అతఁడుదాహరింపలేదు. చిన్నయసూరి "అనుకృతిని నిడుదకుం గుఱుచయగునని యొకండు వలికెనది నిరాకరంబు" అని అప్పకవిని విమర్శించెను. దీర్ఘముహ్రస్వమగుట కొక్క ప్రయోగమును గానరాదు. "దుర్బలస్య బలం రాజా" యన వినవె. (బా. వ్యా. సంధి. 54)

**నిరాశాదులు**

'నిరాశ' మున్నగు పదములు.

వీనికి అత్వస్త్రీ వద్భావములు నిత్యముగాఁ గల్గును.

నిరాశ, దురాశ, నిర్దయ ఇత్యాదులు. (వ్యా. బా. వ్యా. శబ్ద. 98)

**నిర్జీవధ్వనులు**

ఉచ్చారణమునందు లేకున్నను, లేఖన చిహ్నములచే నిరూపింపఁబడు ధ్వనులు.

ఖండ బిందువుఁ; శకటరేఫము ఇ. కాల్వెల్ వీనిని sta'ic sounds అనెను (వ్యతి.) సజీవధ్వనులు. (చూ.) (తె వ్యా. వి. పుట. 110)

**నిర్దిష్టస్త్రీపురుషాన్యతర ప్రశ్నము**

స్త్రీ పురుషుల నిద్దఱను నిర్దేశించి వారిలో నొకరిని గూర్చిన ప్రశ్నము. ఇట్టిచో ప్రశ్నార్థక శబ్దము తఱచుగా బహువచనాంతమగును.

"సీతారాము లిద్దఱలో నెవరు మిక్కిలి కరుణగలవారు?"

తఱచుగా ననుటచేత "సీతారాము లిద్దఱలో సీత మిక్కిలి కరుణగలదా? రాముఁడు మిక్కిలి కరుణ గలవాఁడా?" అనియు ననవచ్చును.

**నిర్దిష్టస్త్రీపురుషాన్యతరగ్రహణము**

స్త్రీ పురుషుల నిద్దఱను నిర్ధేశించి, వారిలో నొకరిని గ్రహించుట. ఇట్లు గ్రహించునపుడును ప్రశ్నార్థకము తఱచుగా బహువచనాంతమగును.

ఈ స్త్రీ పురుషులిద్దఱలో దీని నొకరి కిమ్ము. (ప్రౌ. వ్యా. శబ్ద. 47)

**నిర్దేశక సర్వనామము**

ఒక ప్రాణిని గాని, ఒక వస్తువునుగాని నిర్దేశించి చెప్పునది.

ఆతడు, ఈతడు, వాఁడు, వీఁడు, ఆమె, అది, మొదలైనవి.

అల్ల, ఇల్ల, ఉల్ల— ఇవియును నిర్దేశక సర్వనామములే.

(ఆం. భా. శా. సర్వ. 8,9)

**నిర్దేశము**

వర్ణమును నిర్దేశించి పేర్కొనుట అకారము కకారము ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 2)

**నిర్దేశవిశేషణము**

విశేష్యమును నిర్దేశించి నిరూపించు విశేషణము.

ఆ బాలుఁడు, ఈ బాలిక. (మ. ప. వ్యా. విశే. 2)

**నిర్ధారణ పంచమి**

(చూ.) నిర్ధారణార్థము; నిర్ధారణషష్ఠి

ఒకానొక హేతువుచేత, నొక పదార్థము కంటె వేఱొక దానికి వేలుపాట తోఁచునపుడు అవధి వాచకమునకు 'కంటె' వర్ణకము చేరును.

జానపదుల కంటె నాగరులు వివేకులు.

మానహాని కంటె మరణము మేలు.

నిర్ధారణ కవధి భూతములగు శబ్దములు—జానపదులు, మానహాని. వీనికి 'కంటె' వర్ణకము చేరినది. (బా. వ్యా. కారక. 13)

**నిర్ధారణ షష్ఠి**

నిర్ధారణము గావించు నర్థమునందుపయుక్తమగుషష్ఠీవిభక్తి—లోపల.

(i) జాతి చేతఁగాని, (ii) గుణముచేతఁగాని (*iii*) క్రియచేతఁగాని (*iv*) సంజ్ఞ చేతఁగాని సముదాయము నుండి యొకదానిని వేరుచేయుట నిర్ధారణ మనఁబడును.

ఏ వస్తువు అవధిగా నెంచుకొని నిర్ధారణమగునో, అట్టి యవధిని తెలియజేయు శబ్దముయొక్క షష్ఠికి 'లోపల' వర్ణకమగును.

1. జాతి: మనుష్యులలోపల క్షత్రియుఁడు, శూరుఁడు.

2. గుణము: గోవుల లోపలఁగపిల బహుక్షీర.

3. క్రియా: అధ్వగులలోపలఁ బాలు వాఁడు శీఘ్రగామి.

4. సంజ్ఞ; ఛాత్రుల లోపల మైత్రుఁడు సమర్థుడు. (బా. వ్యా. కారక. 16)

**నిర్ధారణోద్భవషష్ఠి**

చూ:- నిర్ధారణషష్ఠి

**నిర్ధారణార్థము**

నిర్ధారణమును గావించునట్టి యర్థము. అనఁగా సమూహము నందొక పదార్థ మును నిర్ణయించుట.

ఈ యర్థమునందు షష్ఠీవిభక్తియందలి 'లో' 'లోపల' 'అందు' వర్ణకములగును.

మనుష్యులలోపల విద్వాంసుఁడు పూజనీయుఁడు.

(చూ.) నిర్ధారణ షష్ఠి (లఘు వ్యా. విభక్తి. 94)

**ష్ట సర్వనామములు**

నిర్దేశించి చూపునవి.

ఆ పట్టణము, ఈ గ్రామము

తొంటివారు వీనిని సర్వనామములుగాఁజెప్పిరి కాని వీనియందుఁగేవల విశేషణ ధర్మము కానవచ్చుచు గాన వీనిని విశేషణములుగా భావించు టుచితము.

(సం. వ్యా. సర్వ. 17)

**ర్ణకము[1]**

హ్రస్వ- అకారాంత గుణవాచకములగు నల్ల మొదలగు శబ్దములపై బహుళముగా వచ్చు వర్ణకము. ఉదా:- నల్లని కలువ, నల్లకలువ, తెల్లని తమ్మి, తెల్ల తమ్మి మొ॥ (అథ కా అజంత 69) బహుళమనుటచే చక్కని వాఁడిత్యాదులందు నివర్ణకము నిత్యము.

**ర్ణకము[2]**

విశేషణమగు వ్యతిరేక క్రియమీఁద నివర్ణకమగును.

చేయని, వండని (లఘు వ్యా. క్రియా 47)

**్చయము**

తిరుగు లేకుండఁ జెప్పుట ఈ యర్థమునందు—ఏత్వముపయుక్తము.

ఇతఁడే దానవ చక్రవర్తి. (ఆం. భా. భూ. 154, 155)

**్చయార్థము**

తిరుగులేమిని తెలుపు నర్థము.

పొమ్మి, పో- అను క్రియలు వాని స్వార్థము నందుఁగాక, నిశ్చయార్థమునందు దుపయుక్తము

'పొమ్మెవ్వఁడ నీకు నేను బుద్ధులు సెప్పన్'

'అంతే పో తమ్ము కపిధ్వజ ప్రభులు అంధీభూతులన్ సేయవే'.

(ప్రౌ. వ్యా. వాక్య. 22)

**షిద్ధసంధులు**

నిషేధింపఁబడిన సంధులు. విధింపఁబడిన సంధులకన్న, నిషేధింపఁబడిన సంధులు బలీయమైనవి.

క్త్వార్థకేకార సంధి, ద్రుత ప్రకృతికసంధి ఇత్యాదులు బాలవ్యాకరణమునందు నిషేధింపఁబడినవి. (బా. వ్యా. సంధి 8,9) (తె. వ్యా. వి. పుట. 468)

**నీలుగులోనగునవి**

నీలుగు, నెగయు మున్నగునవి.
ఇట్టి పదముల యాది యందున్న నకారమునకు లోపము బహుళముగానగును.
నీలుగు—ఈలుగు

నెగయు—ఎగయు (బా. వ్యా. ప్రకీర్ణ. 10)

**ను[1](న్)**

మహద్వాచకములుగాని శబ్దములపై ద్వితీయైక వచన (అమ్) స్థానమునవచ్చు ప్రత్యయము. ఉదా: వనమును, శకమును మొ॥ (అథ. కా. అజంత. 13)

**ను[2]**

భూతభవిష్య ద్వర్తమానా ద్యర్థములందు అన్ని క్రియలకును ఉత్తమ పురుషైక వచనమున వచ్చు ప్రత్యయము. ఉదా:- ఘటింపను (వ్యతిరేకము), ఘటింపుచున్నాను (వర్తమానము), ఘటింపగలను (భవిష్యత్తు), ఘటింతును (తద్ధర్మము) మొ॥ (చింతా. క్రియా. 25)

**ను[3]**

సముచ్చయము మున్నగు చార్థములందు నిపతింపఁబడిన యవ్యయము. ఉదా:- యక్షేశుండును, దైవతేశుఁడును నిత్యంబున్సుఖంబీయరో మొ॥ (వై. చం అవ్య. 10)

**ను[4]**

దేశ్యమగు అస్మచ్ఛబ్దము (నా అనునది) కంటె పరమునందున్న సు (ప్రథమైక వచన) ప్రత్యయ స్థానమున వచ్చు ఆదేశము. ఉదా:- నేను (నా+సు) (చింతా. హలంత. 14) ఇట ప్రథమాయామేదస్మదః (చింతా. హలంత. 18) అను సూత్రముచే 'నా' లోని ఆకారమునకు ప్రథమా విభక్తియందు ఏకారమాదేశముగ వచ్చినది.

**నుగాగమము**

నుక్)+ఆగమము

(1) సమాసములందుదంతములగు స్త్రీసమము కు; —పు, —ంపులకు: పరుషములుగాని, సరళములుగాని పరమగునపుడు ఈ 'ను' ఆగమము పూర్వ **పదాంతమునజేరును.**

సమాసములలో నుగాగమమునకు స్వత్వము లేదు.

చిగురుఁగయిదువు

తఱుకుంగజ్జెలు

సింగపుంగొదమ

ఉన్నతపుంగొడుగు. (బా. వ్యా. సంధి. 25; 38, 39)

(ii) తృతీయాది విభక్తులకు నీయాగమమగును. రామునిచేతను, రాముని తోడను ఇత్యాదులు. (బా. వ్యా. తత్సమ. 8)

(iii) కలజి (చూ.) పడుజులు (చూ.) పరమగునపుడును నీయాగమమగును.

వండఁగలదు, వండఁగలరు

వండఁగలవు, వండఁగలరు

వండఁగలను, వండఁగలము

వండఁబడును. (బా. వ్యా. క్రియా. 21)

## నుజి

తుమర్థము నందును (చూ.) భావలక్షణము (చూ.) నందును ధాతువునకు నుజి వర్ణకమగును. 'ను' జిత్తు కావున ఉత్వమున కత్వమగును.

వండు+ను (జి)⟶వండను

చైత్రుఁడు వండను బోయెను.

చైత్రుఁడు వండనతిథి వచ్చెను. (బా. వ్యా. క్రియా. 40)

## నుజ్యంతము

నుజి+అంతము

'నుజి' జిత్తు కావున ప్రక్కనున్న ఉత్వము అత్వమగును.

వండు+ను(జి)⟶వండను (వండుటకు) (నుజ్యంతము)

(బా. వ్యా. క్రియా. 115)

## నుడితొలి హ్రస్వము

మాటయొక్క తొలి హ్రస్వము. ఇట్టి తొలి హ్రస్వముపై ఖండబిందువుండదు. అఁట, ఇఁక, చుఁడు—అను నీమూఁడు శబ్దములును ఇందుల కపవాదము.

ముంగొంగు, క్రొంబసిఁడి. (బా. వ్యా. సంధి. 22)

## ను, ని, వర్ణములు

ద్వితీయా విభక్తియందు వచ్చు వర్ణకములు. ఇవి తుదిని జేరిన పదములు కర్మములగును.

చాళుక్య ధరిత్రీపుని, విశ్వేశ్వరుని సిరులు వొందును.

రాముఁడు రాజ్యమును త్యజించెను. (కా. చూ. IX. 74)

**నుమ్**

సమాసములందును అందు - కూర్చి - పట్టి విభక్తులును, తన అనునదియు పరమగునపుడును ఉకారాంత పదముకంటె వచ్చు ఆగమము (చిం౹తా. సంధి 31) సమాసములందు పరుష సరళములు పరమగునపుడే ఈ యాగమము వచ్చును. ఇందలి ఉకార ముచ్చారణార్థము. మకార మిత్సంజ్ఞకము. దీనికి సరళములు పర మగునపుడు బింద్వాదులు ఆదేశములగును. ఉదా;- గండుంగోయిల (గండు+న్ + కోయిల) కులుకుంబల్కులు (కులుకు+న్+పల్కులు) రామునందు, జ్ఞానముం బట్టి, జపముంగూర్చి మొ॥ నుమ్వోచతః (చిం౹తా. సంధి. 31) అను నుమ్విధాయక సూత్రమందలి చకారముచే ఈ నుగాగమము ఉకారాంతములు కాని వానికిని రావచ్చును. ఉదా:- చక్కందనము, తియ్యందనము మొ॥ (అహో. సంధి 31)

(ii) 'ఇటఁబోఁడి పరముగుచో నెల్లెడల నుమ్మగున'ని ప్రౌఢవ్యాకరణము నందొకచోనిది యుపయుక్తము.

అలరుఁబోడి, విరిఁబోఁడి॰ నననఁబోఁడి మున్నగునవి. (ప్రౌ. వ్యా. సమాస. 19)

**నుఙ్**

రేఫను ఇత్సంజ్ఞగా కేతన తన వ్యాకరణమునందుపయోగించెను.

అకార, ఇకారాంత, శబ్దములపై యు(ఙ్); ఉకారాంత శబ్దములపై ను(ఙ్) సముచ్చయార్థము నందుఁజేరును.

అన్నయు, తల్లియు

మనుమఁడును, విష్ణువును, (ఆం భా. భూ 67)

**ను, ఉ, లు, రు, లు**

సంధి యందు ను, ఉ, లు, రు, లు పొల్లులగును.

కను + కొనలు ⟶ కన్గొనలు

పదాఉ+వన్నెలు ⟶ పదార్వన్నెలు

నలు+మోములు ⟶ నల్మోములు

వారు+ పరమమునులు ⟶ వార్పరమమునులు.

(రంగ. IV. 5)

**ను వర్ణము**

ద్వితీయా విభక్తి. (దీనిని వర్ణకమనుటయే యుచితము)

డుమంతము మీఁది దీని యుత్వమున కిత్వమగును.

రాము+ను—రాముని

భార్గవు+ను—భార్గవుని (బా. వ్యా. తత్సమ. 2;25)

**ను శబ్దము**

(i) సముచ్చయము (చూ.)

అన్నయుం దమ్ముఁడును

(ii) అర్థవిశేషము

పెంపు జమదగ్నిసూనుఁడును బోలఁడు,

(iii) పాద పూరణము.

అందఱున్ వివశులైరి. (ప్రౌ. వ్యా. శబ్ద. 116)

**నృసింహ వ్యాకరణము**

కర్త : కల్లేపల్లి వరాహనృసింహ పట్నాయక్.

ఇది విశాఖ పట్టణమునందు 1872లో ప్రకటితము.

**నృసింహుఁడు**

ఆంధ్ర శబ్ద చింతామణికి నృసింహపండితీయమను పేర వ్యాఖ్యానమును రచించిన ఆంధ్రవ్యాకర్త. క్రీ.శ. 1560-1700 మధ్యభాగమునకు చెందినవాడు. ఈతని వ్యాఖ్య అలభ్యము. ఈతని పేరు అహోబలపండితీయమున నాలుగు చోట్ల పేర్కొనబడినది. (అహో. 156, 218, 229, 246 పుటలు). ఈత్కఁడు నృసింహ పండితీయమనుపేర అధర్వణకారికావళికే వివరణము వ్రాసెనని రా.శ. గారి యభిప్రాయము (ఆం. వ్యా. వి. 492. పు.)

**నెవ్నడాదులు**

నెన్నడ, నెన్నడుము మున్నగునవి.

ఇందు పూర్వపదము 'నెఱి' గా భావించుటుచితమని సూచింపఁబడెను.

నెఱ+నడ—నిండైన నడ.

నెఱి+నడ—రమ్యమైన నడ,

నెఱ+నడుము —నిండైన నడుము.

నెఱి+నడుము—రమ్యమైన నడుము.

(చూ.) నెఱ, నెఱి. (ప్రౌ. వ్యా. సంధి. 14)

**నెఱ**

పూర్ణార్థకము

నెఱ+మది—నెమ్మది. (బా. వ్యా. సంధి. 39)
(ప్రౌ. వ్యా. ,, 14)

**నెఱ యక్కరములు**

నిండైన యక్షరములు. దీర్ఘములు, చూ. నిడుదలు. (అప్ప. II. 10)

**నెఱసున్న**

పూర్ణబిందువు /ం/ (స. సా. సం. I. వర్ణ. 6.)
(బా. వ్యా. క్రియా. 90)

**నెఱసున్న లఘుసున్నలగుట**

తద్భవము లేర్పడు పద్ధతులలోనిది యొకటి.

కొన్ని పూర్ణబిందువులు ఖండ బిందువులుగా మాఱును.

తరంగములు—తరఁగలు

లాంగలము—నాఁగలి (క.సం.వి.III.1.)

**నికారము**

విశేషణములపై వికల్పముగాఁజేరు వర్ణము.

నల్లని కనుఁగవ.

నల్ల కలువ. (కా.చూ.IX.127)

**నికారలోపము**

పంచమీ విభక్తికి ముందరి 'ని' కారము వికల్పముగా లోపించును.

కృష్ణుని కంటె— కృష్ణుకంటె, (రంగ.IV.53,54,55)

**నెఱి**

రమ్యార్థకము నెఱి+నడుము ⟶ నెన్నడుము. అందమైన నడుము.
(ప్రౌ. వ్యా. సంధి: 14)

**నైజపదములు**

అన్యభాషాపదములు కాక, ఆ భాషలో సహజముగా నేర్పడిన పదములు. వీనినే దేశ్యము లందురు.

ఆంగ్లమునందలి indigenous words అను వ్యవహారమునకిది యసువాదము.

ఊరు, పేరు, ముల్లు (తె. వ్యా. వి. అనుబంధం 22 పుట)

**నైజము**

సహజము. మార్పు చెందనిది.

తత్సమ విశేషణములు — నైజము, తరము, తమము అని ముత్తెఱఁగులు

ఆంగ్లము నందలి Positive degree అనుదాని కనువాద ప్రాయము

*గురు*, గురుతరము, గురుతమము

[1]నైజము. (కు. వ్యా. పుట. 2) (తె. వ్యా. వి. పుట. 685)

**-న్ను**

దేశ్యములగు యుష్మదస్మచ్ఛబ్దముల (నీ, నా అను వాని) కంటె పరమైన అమ్ (ద్వితీయైక వచన) ప్రత్యయ స్థానమున వచ్చు ఆదేశము. ఈ యాదేశము వచ్చినపుడు నీ, నా లలోని దీర్ఘాచ్చునకు హ్రస్వమును వచ్చును. (చింతా. హలంత. 15) నిన్ను, నన్ను, 'న్ను' వర్ణకమందలి సంయుక్తాక్షరములలో నొక హల్లునకు లోపము వికల్పముగా వచ్చును. ఉదా:- నిను, నిన్ను- నను, నన్ను (చింతా. హలంత. 16)

**న్న్యంతత**

(న్ని+అంతత) 'న్ని' యను వర్ణమంత మందుఁ గలిగి యుండుట. ఎంతః కొంత మున్నగు కియదర్థాదులకు జడవాచకత్వమున 'న్న్యంతత' కలుగును. ఉదా: ఎన్ని, కొన్ని, ఇన్ని, అన్ని మొ॥ (అథ. కా. అజంత. 75)

**న్యాగమము**

ని+ఆగమము

తృతీయాది ఏకవచన విభక్తులు పరమగునపుడు మహత్తుల మీఁద నీయాగమము విభాషగా నగును.

పురుషుని చేతన్

పురుషు చేతన్. (ల. వ్యా. సుబ స్త. 26)

**న్యూనక్రియలు**

అన్ని కాలములందును, పురుషలందునుగాక కొన్ని కాలములయందును, పురుషల యందును, మాత్రమే ప్రయోగింపఁబడు క్రియలు.

ఒల్లఁడు, వలయును. (సం. వ్యా. న్యూనక్రియలు. 1)

**న్యూనపదము**

లోపించిన పదము.

''శ్రీరామ చంద్రుని శరణు చొరమి హతుఁడాయెను.''

ఇందు 'రావణుఁడు' అనుపదము న్యూనము.

న్యూన పదము వలన కొన్ని యెడల నపార్థము కూడ కల్గవచ్చును.

ఇట 'వాలి' యనియు చెప్పనగును. (సు వ్యా. పుట. 373)

**న్యూనబిందువు**

బిందువు (full stop) కన్న తక్కువ విరామముగల బిందువు [:] (colon)

దూరసంబంధముగల రెండు ప్రత్యేక వాక్యముల నడుమ నీగుఱుతు వచ్చును.

"లోకములో నాకంటెఁ బ్రాజ్ఞుడు లేఁడనుకోకు: ఒకరిని మించిన వారొక రుండనే యుందురు''

ఇది మూఁడు మాత్రల కాలపు విరతిని దెలుపును.

(సం. వ్యా. విరతులు. 1)

**న్యూనవచనములు**

ఐన, ఏని, ఏ, ఓ మొదలైనవి. ఇవి యధ్యాహార్యము లగును.

ఎత్తెఱఁగున ధర్మక్రియఁ జిత్తమునఁ జెర్పవలయు జీవించు తఱిన్.

ఎత్తెఱఁగున నైనను లేక ఎత్తెఱఁగున నేని యని యర్థము.

(ప్రౌ. వ్యా. వాక్య. 8)

**న్యూనాధికాద్యర్థయోగము**

తక్కువ, ఎక్కువలను దెల్పు అర్థసంబంధము. ఇట్టి యర్థమునందు 'కంటె' వర్ణక ముపయుక్తము.

వీఁడు వానికంటె నధికుఁడు

వీఁడు వాని కంటె నీచుఁడు. (ఆ. వ్యా. విభక్తి. 92)

**ప[1]**

ఉభయోష్ఠ్య స్పర్శము

పైపెదవి స్థానము

క్రింది పెదవి కరణము

స్పర్శప్రయత్నము

శ్వాసము

అల్పప్రాణము

**ప[2]**

లఘు పూర్వకమైన 'కనుమ్వాదుల' (చూ.) 'ము' వర్ణ స్థానమున వచ్చు వర్ణకము.

కనుము+పూలు ⟶ కనుపపూలు

ఇనుము+ముక్క ⟶ ఇనుపముక్క

జనుము+నార ⟶ జనపనార.

(ఇట్లు వ్యాకర్త పేర్కొన్నను ఇట 'ము' వర్ణము 'పు' వర్ణమై, దానిపై 'అ' త్వము సంబంధార్థమందుఁజేరినట్లు తలంపనగును. కనుపు+అ+పూలు కనుపపూలు, ఇనుపు+అ+ముక్క ⟶ ఇనుపముక్క) (బా. వ్యా. సమాస. 19)

**-ప-**[3]

కొన్నియెడల శత్రర్థ పరక 'చు' వర్ణమున కాదేశమగును.

చేరుచుచును—చేరుపుచును.

గర్జించుచు—గర్జింపుచు (ప్రౌ. వ్యా, క్రియా. 17)

**ప**[4]

'తిరియు' మున్నగు ధాతువులకుఁజేరు కృత్ప్రత్యయము.

తిరియు—తిరపము.

కలియు—కలపము.

చూ. తిరియ్యాదులు. (బా. వ్యా. కృదంత. 9)

**పంచమి**

ఒక నామ విభక్తి.

(i) పాయుటకుఁ బట్టయినది.

హిమగిరి *వలన* గంగ వొడమె. (ఆం. భా. భూ. 10)

(ii) వలన, కంటె, పొంటె, పట్టి, ఉండి, కతన

(కా.చూ.IX.97; ఆం.కౌ.184)

(iii) వలన, కంటె, పట్టి పంచమి (బా. వ్యా. తత్సమ.5)

**పంచమీ బహువ్రీహి**

విగ్రహ వాక్యమునందు పంచమీ విభక్తిని చెప్పుకొన్నచో పంచమీ బహువ్రీహి యగును.

నిరస్త దోషులు— ఎవరివలన నుండి దోషములు నిరస్తములయ్యెనో వారు— అనఁగా మునులు. (సు.వ్యా.సమాస.57)

**పంచాశద్వర్ణములు**

ఏఁబది వర్ణములు

పదునాఱు స్వరములు, కకారము మొదలు క్షకారము వఱకుఁగల ముప్పది నాల్గు వ్యంజనములు, ఇందు ళ కారము విడువఁబడెను.

ఇవి సంస్కృత భాషకుఁగల వర్ణములు. (అ. ఛం. IV. 123, 124)

**పగతాదులు**

'పగిత' మున్నగు శబ్దములు.

వీని బహువచన లకారమునకు రేఫమాదేశమగును.

పగతురు, నెయ్యురు, మార్తురు, అల్లురు, బలియురు (బా.వ్యా.ఆచ్ఛిక.5)

**పఙ్**

బిందు పూర్వక పవర్ణము

'నాము' మున్నగు శబ్దములకు (చూ. నామ్వాదులు) వృత్తియందు 'ము' వర్ణమున కాదేశమగును.

నాము+చేను—నాఁపచేను.

పాము+తేఁడు—పాఁపతేఁడు (బా. వ్యా. సమాస.19)

**పట్టాభిరామ పండితీయము**

కర్త : శ్రీ వేదము పట్టాభిరామ శాస్త్రి

క్రీ.శ. 1816

ఇది పద్యములందు రచింపఁబడినది. ఇందు సంజ్ఞాసంధి, అజన్త, హలన్త, సమాస, క్రియాపదచ్ఛేదము లాఅు గలవు.

1951లో వావిళ్లవారు దీనిని తిరిగి ముద్రించిరి.

తెనుఁగు వ్యాకరణక్రమ పరిణామచరిత్రను దెలిసికొనఁగోరు వారికి గ్రంథము పకరించునని ప్రకాశకుల యభిప్రాయము.

**పట్టాభి రామశాస్త్రి వేదం**

క్రీ.శ. 1760-1820.

చిన్నయకుఁ బూర్వులైన వైయాకరణులలో వీరు ప్రసిద్ధులు.

వీరు రచించిన "ధాతుమాల'' (చూ.)

భాషా పరిశోధనమున కుపకరించును.

వీరు పద్యములలో వ్యాకరణ రచన మాంధ్రభాషకుఁగావింప నుద్యమించిరి కాని, అది పూర్తికాలేదు.

వీరు ఫోర్టుసెంటు జార్జికోట కళాశాలలో సంస్కృతాంధ్ర ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిరి.

**— పట్టి**

పంచమీ విభక్తి ప్రత్యయము. ఇది గుణము హేతువగునపుడు 'విభాషాగుణేఽస్త్రియామ్ (అష్టా.)' అను సూత్రముచే సంస్కృతమున పంచమీ విభక్తి వచ్చు

చోట్ల వచ్చును. ఉదా:- జ్ఞానముఁబట్టి మోక్షము, జాడ్యము బట్టి బద్ధుఁడు మొ॥ (అధ. కా. అజంత 29) చూ:- పట్టి వర్ణకము.

**పట్టి వర్ణకము**

గుణవాచకములకుఁ బరమగు ప్రత్యయము. ఇది పరమగునపుడు నుగాగమమగును.

జ్ఞానముంబట్టి (ల.వ్యా.అజన్త. 28; బా. వ్యా. తత్సమ. 9)

**పట్టుఁడి**

దీనిని పంచమీవిభక్తిగా గురుమూర్తిశాస్త్రిగారొక్కరే తమ వ్యాకరణమునందుఁ బేర్కొనిరి. (గు. వ్యా. 84 అంశము)

**పడుజ్యనుబంధము**

పడుజి+అనుబంధము

పడు(జి) 'జి' ఇత్తుగావున ఉత్వమున కత్వమగును.

కర్మార్థక వాక్యరచనమందు క్రియకు పడు(జి) అను అనుబంధముచేరును.

కొట్టు+పడు(జి)—కొట్టఁబడు (బా. వ్యా. క్రియా. 49)

**-పడె,-పఱచె,-పెట్టె,-పాటులు**

ఈ నాల్గు నుడువులు సంస్కృత శబ్దములపై ప్రయోగింపఁజెల్లును.

సుఖపడె, సుఖపఱచె, సుఖపెట్టె, దుఃఖపాటు (రంగ. IV. 70-75)

**-పడ్వాదులు**

పడు+ఆదులు : ఆకృతిగణము

-పడు, - పెట్టు, - పాటు, - పట్టె - ఇత్యాదులు. ఇవి పరమగునపుడు ము వర్ణకమునకు లోప పూర్ణబిందువులు విభాషనగును. (కర్తృవాచక 'ము' వర్ణకమునకు మాత్రమిట్టి లోపముండదు)

భయము+పడె { భయపడె / భయంపడె / భయముపడె }

(బా. వ్యా. సంధి. 46)

**పడ్వాదులు**

పడు+ఆదులు.

పడు, చెడు, అడుచు, కఱచు, పొడుచు, ఓడు మున్నగు ధాతువులు.

'టు' అను కృత్ప్రత్యయము పరమగునపుడు ఈ ధాతువు లాద్యక్షర శేషములై దీర్ఘము నొందు.

పడు+టు—పాటు

చెడు+టు—చేటు

ఆడుచు+టు—ఆటు

కఱచు+టు—కాటు

పొడుచు+టు—పోటు

ఓడు+టు—ఓటు (బా. వ్యా. కృదంత. 8)

**పత్లృక్రియార్థములు**

పత్=గతౌ అను ధాతువు అర్థముగల పడు మున్నగు శబ్దములు. ఇవి పరమగు నపుడు ప్రథమా విభక్తి ము వర్ణకమునకు లోపపూర్ణ బిందువులు వికల్పముగా నగును. ఉదా:- భయపడి (మువర్ణకలోపము), భయంపడి (మువర్ణకమునకు పూర్ణబిందువు), భయముపడి (లోపపూర్ణ బిందువులు రాని పక్షమున) మొ॥ (చింతా. సంధి. 16)

**పతిధాతువు**

పతి (పత్లృ=గతౌ) ధాత్వర్థముగల 'పడు' అనునది. ఇదికర్మార్థమునధాతువుపై చేరును. ఉదా:- ఘటింపఁబడుచున్నాఁడు, ఘటింపఁబడెను, మొ॥ (చింతా. క్రియా. 49)

**పత్యర్థము**

(పతి+అర్థము) పత్లృ=గతౌ అను ధాతువుయొక్క ఆర్థముగల 'పడు' అనునది. (అథ. కా. సంధి. 9) ఇదియే చింతా లోపతి క్రియార్థమని చెప్పఁబడినది, చూ:- పతి క్రియార్థము.

**పదకొండవ శతాబ్దపు తెనుఁగు**

డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు తాము రచించిన ఆంధ్రభాషా చరిత్ర గ్రంథమున కనుబంధించిన ఈ శీర్షికగల ప్రకరణము. నన్నయనాటి తెనుఁగు భాస నభివర్ణించును.

ఇది తెలుఁగు భాష విరచితమైన ఏకకాల భాషావ్యాకరణములలో (చూ.) (synchronic grammar) మొదటిదన వచ్చును.

**పదజాతము**

భాషకుఁగల పదసమూహము. (vocabulary)

ఇందు అన్యభాషా పదములు, (విశేషమగు మార్పులు లేకుండ తత్సమ రూప

మునఁ జేరినవి, మార్పులతో తద్భవరూపమునఁ బ్రవేశించినవి) స్వభాషాప దములు నుండును.

నిఘంటువు లిట్టి పదజాతమును సమకూర్చును. (తె. వ్యా. వి . పుట. 127

**పదమధ్యఅకారలోపసంధి**

అబ్బురము—అబ్రము. (ప్ర. వ్యా. 70)

**పదమధ్యఇకారలోపసంధి**

పదమధ్య మందలి న, ల, డ, మున్నగు వానితోఁ గూడియున్న 'ఇ' కార మునకు లోపము వికల్పముగా వచ్చును.

ఉనికి—ఉన్కి

ములికి—ముల్కి

బుడిపి—బుడ్పి (ప్ర. వ్యా. 76)

**పదమధ్యఉకారలోపసంధి**

పదమధ్యమందు న, ల, డాదులతోఁ గూడియున్న ఉకారమునకు లోపము వికల్పముగా నగును.

పునుక—పున్క

చిలుక—చిల్క

గాడుపు—గాడ్పు. (ప్ర. వ్యా. 86)

**పదమధ్యద్రుతలోపబింద్వాదేశములు**

వర్తమాన క్రియారూపములమధ్య ఉత్వముతోఁగూడిన నకారములోని ఉత్వము నకు లోపము; పూర్ణబిందు వాదేశమును వికల్పముగా నగును.

అనుచును——→అన్చును——→అంచును.

వినుచును——→విన్చును——→వించును. (అప్ప. V. 131,132,133)

**పదమధ్య యకారము**

తాయెతు, ఉయ్యేల, పయ్యెద—అను రీతిని పదమధ్యమందు ఎత్వముతోఁ గూడిన యకారమే కాని, అత్వముతోఁగూడిన యకారముండదని ముద్దురాజురామన పేర్కొనుట సరిగాదని స.సా.సం. కర్త అత్వముతోఁగూడిన యకార మధ్య పదముల కుదాహరణముల నొసఁగెను.

అబ్జనాభుని తూగు టుయ్యాలలు గంటె (స.సా.సంధి. 190, 195-198)

**పదమధ్యసంధి**

ఒక పదమునందుఁగల్గు వర్ణలోపాగ మాదేశములగు మార్పులు.

వేడుక—వేడ్క

పూనిక—పూన్కి

కలిమి—కల్మి

పేరిమి—పేర్మి

(వ్య.) చూ. పదాంత సంధి (అ. ఛం. IV. 145)

**పదము**

(i) విభక్త్యంతము

నామ, క్రియా విభక్తులంతమందుఁగలవి పదము లనఁబడును.

మగఁడు, వచ్చుచున్నాఁడు

అందగాఁడు, పాట (ఆం. భా. శా. సంజ్ఞా.51)

(ii) ప్రయోగమునకుఁదగినది, ఇతరములతో నన్వయింపనిది, ఏకమైనది, అర్థమును శబ్దవ్యాపరముచే బోధించునదియైన వర్ణము, లేక వర్ణసముదాయము.

ఘటము (ప్రౌ. వ్యా. వాక్య. 2)

**పదాంతసంధి**

పదము యొక్క అంతమందుఁగల్గు సంధి.

రాముడు+అతడు ⟶ రాముఁడతఁడు

దీనినే యాధునికులు External Sandhi అందురు.

(వ్య.) పదమధ్య సంధి (Internal Sandhi) (అ. ఛం. IV. 45)

**పదాద్యమగు హ్రస్వము**

పదము యొక్క ఆదియందుండు స్వరము. ఇది హ్రస్వమగుచో, దానిపై పూర్ణబిందువే కాని ఖండ బిందువుండదు.

(ఇందులకు-అఁట, ఇఁక, చుఁడు అను శబ్దములు మూఁడు మాత్ర మపవాదములు)

ముంగొంగు, క్రొంబసిఁడి

కంటిని—ఇత్యాదులు. (బా. వ్యా. అచ్చిక. 33; సంధి 22)

**పదాద్యములు ఋ, ౠ వర్ణములు**

ఇవి ర, ల తుల్యములు. కావున

(i) అతఁడు+ఋషి—అనుచో సంధిలేదు.

(ii) అ+ఋషి—యడాగమములేదు.

(iii) వచ్చెన్+ఋషి—ఇట ద్రుతమునకు సంశ్లేషము లేదు.

(బా. వ్యా. ప్రకీర్ణ. 1.)

**పద్మనేత్రి**

(చూ.) మీననేత్రి. (బా.వ్యా.తత్సమ.85)

**పద్యాంధ్ర వ్యాకరణము**[1]

బాలవ్యాకరణ రచనకుఁ బూర్వము చిన్నయసూరి కొన్ని వ్యాకరణ రచనలు గావించెను. అందిది మొదటిది.

దీని నీతఁడు క్రీ. శ. 1840 ప్రాంతమున రచించి యుండునని భావింపఁబడు చున్నది. ఇది యసమగ్రము.

పద్యము వ్యాకరణ రచన కంతగా ననుకూలముకాదని సూరి యభిప్రాయపడి నట్లును ఈ రచన మందుకే పూర్తికాలేదనియు ననుమానింపఁబడుచున్నది.

**పద్యాంధ్ర వ్యాకరణము**[2]

ఇది శ్రీ మల్లంపల్లి మల్లికార్జున శాస్త్రి గారిచే క్రీ. శ. 1897లో విరచితము.

వీరు ఏలూరు చర్చిమిషన్ హైస్కూల్ నందు ప్రధానాంధ్రోపాధ్యాయులుగా నుండిరి. సాంకేతిక క్లిష్టత లేకుండ ఆంగ్లవ్యాకరణ పద్ధతిలో రచింప వలయునని వీరి యాశయము. ఇందు మూఁడు పరిచ్ఛేదములు గలవు (1) వర్ణ (2) శబ్ద (3) వాక్య ఇవి యనేక ప్రకరణములతోఁ గూడినవి.

**పన్**

ఇరు, తొమ్మిది, తూము శబ్దములు పరమగునపుడు పది శబ్దమునకు వచ్చు ఆదేశము. ఉదా:- పన్నిద్దఱు (పది+ఇద్దఱు) పందొమ్మిది (పది+తొమ్మిది) పందుము (పది + తూము) (వై. చం. సమా. 26)

**పయఃప్రభృతులు**

(పయస్+ప్రభృతులు) పయస్. వయస్, సరస్ మున్నగు సకారాంత శబ్దములు వీనియంత్య సకారమునకు లోపమురాదు (చింతా. హలంత. 9) ఉదా:- పయస్సు, వయస్సు, సరస్సు, మొ॥ చూ:- అపయః ప్రభృతులు.

**పయోగణము**

పయస్ మున్నగు శబ్దముల గణము. చూ:- పయఃప్రభృతులు.

**పరరూపము**

పరమందుండు దానియొక్క రూపము. ఆహా+ఆహా (పరరూపము)

ద్విరుక్తము యొక్క పరరూప మామ్రేడిత మనఁబడును.

(బా. వ్యా. సంధి. 10)

**పరరూపసంధి**

పరమందున్న వర్ణస్వరూపము నిలిచి యుండుసంధి.

పూర్వపరస్వరములకుఁ బరస్వరమేకాదేశముగా నిల్చుసంధి. ఇట్టి సంధి తెలుఁగు భాసలో నియతముగా నుండును. రాముడు+అతడు——→రాముడతడు: సంస్కృతము నందొక్క 'శకంధ్వాదుల' యందు మాత్రమే నియతము.

చూ. శకంధ్వాదులు. (మ.ప.వ్యా.సంధి.80)

**పరస్వరము**

పరమందున్న యచ్చు. రాముఁడు+అతఁడు——→రాముఁడతడు

పూర్వపరస్వరములకుఁ బరస్వర మేకాదేశమైనది.

(బా. వ్యా. సంధి. 1)

**పరాజయము**

డయ్యుట.

'డయ్యుట' దేనివలనఁ గల్గునో దానికి 'వలన' వర్ణకమగును.

అధ్యయనము వలన డస్సె. (బా. వ్యా. కారక. 9)

**పరావాక్కు**

బిందు రూపమున మూలాధార చక్రములో నచటి వాయువుచే నంస్కారీ భూతమైన వాక్కు.

ఇదిస్పంద రహితము. యోగులకు మాత్రమే యనుభవనీయము.

ప్రాచీన భారతీయులు పేర్కొన్న చతుర్విధ వాగ్భేదములలో నొకటి.

(తె. వ్యా. వి. 71-3)

**పరిణతిక్రియలు**

మార్పుఁజెందగా నేర్పడిన క్రియారూపములు.

ధాతువులు మార్పునకు లోనైన పిమ్మట వానికి 'ఇంచు' (క్) చేర్చగా నేర్ప డిన క్రియలు. తత్సమ క్రియలలో నొక తరగతి క్రియలు.

భూ——→భవ్+ఇంచు (క్)——→ప్రభవించు

జి——→జయ్+ఇంచు (క్)——→జయించు (ప్ర. వ్యా. 349)

**పరిణతి-క్రియలు**

సంస్కృత ధాతువుల నన్నింటిని తెలుఁగునఁ జేర్చుకొనుట కనువుగా నుండున నిచింతామణికర్త వానిని ఉపకృతి క్రియలు పరిణతి, క్రియలు, సంవృతి క్రియలు

అని మూఁడు విధములుగా విభజించెను. ఏ ధాతువుల ప్రకృతులుతెలుఁగున అయ్, అవ్, అర్ అనునవి అంతమందుఁ గలవిగ నుండునో అవి పరిణతి క్రియలు. ఉదా:- భూ (సత్తాయామ్), (జయే), భృ (భరణే) మొ॥ ప్రభవించు (ప్రభూ > ప్రభవ్) జయించు (జి > జయ్), భరించు (భృ > భర్) ఇత్యాది రూపములలో అవ్, అయ్, అర్ అంతమందుంగల రూపములు ప్రకృతులగుటచే భూ, జి, భృ ఇత్యాదులు పరిణతి క్రియలగుచున్నవి. (చింతా. క్రియా. 1,3,6) 'అయాద్యంత త్వేన పరిణమతే ఇతి పరిణతిః' (అయ్ మున్నగునవి అంతమందుండునట్లు పరిణ మించుచున్నది కనుక పరిణతి క్రియ) అను వ్యుత్పత్తిచే ఈ సంజ్ఞ అన్వర్థము (అహో. క్రియా. 15)

**పరిమాణకాలార్థకములు**

అంత, ఇంత, ఎంత, కొంత మున్నగునవి.

ఇవి విశేషణ ధర్మము గలవయ్యు, విశేష్య సూచకములగుచు, సందర్భోచితము గాఁ గర్తలగును.

అంతయున్నది.

ఇంత చాలును.

ఏంత కలదు?

కొంతవోయెను. (ఆం. భా. శా, సర్వ. 21)

**పరిమాణసంధి**

పరిమితిని దెల్పు ప్రత్యయమగు—ఎఁడు (చూ.) తోఁగల్గు నిత్యసంధి.

చూ. అపదాది స్వరసంధి.

మనెఁడు, కమికెఁడు, జేనెఁడు ఇత్యాదులు. దీనికి పరిమితార్థసంధి (చూ.) అనియు వ్యవహారము. (అప్ప. V. 72)

**పరిమాణార్థము**

(i) పరిమితిని దెల్పునట్టి యర్థము. ఈ యర్థము నందు ప్రథమైకవచనము మీఁదనే—ఎఁడు వర్ణకము పరమగును. అప్పుడు సంధి నిత్యము.

మానెఁడు, జేనెఁడు (ప్రౌ. వ్యా. తద్ధిత. 15)

(ii) తద్ధిత ప్రత్యయములు చేరు నర్థములలో నొకటి

కటిద్వయసము. కంఠదఘ్నము

ఊరుమాత్రము (ఆం. భా. శా. సమాస. 88)

**పరిమితార్థశబ్దసంధి**

పరిమితిని దెల్పు శబ్దముతో నిత్యముగాఁ గల్గుసంధి.

మానెఁడు, పీసెఁడు, జేనెఁడు (చూ.) పరిమాణసంధి. (అప్ప. V. 72)

**పరుషములు**

(i) ఉచ్చారణమునందు నాదతంత్రులు శ్లథనము చెందని వర్ణములు. వీనినే శ్వాసవర్ణములు (sudrs) అందురు. తెలుగు భాషలో కచటతపలకు మాత్రమే పరుషసంజ్ఞ పరిమితము. (తె వ్యా. వి. పుట. 21)

(ii) క, చ, చ ట త,ప,లు. (గు. వ్యా. అ. 10. అంశము)

(iii) కచటతపలు, (ఇట తాలవ్య చకారము దన్త్యచకారమునకు గ్రాహకము) (బా. వ్యా. సంజ్ఞా. 5,7) (చింతా. సంజ్ఞా. 88)

**పరుషేతరములు**

పరుష+ఇతరములు.

పరుషములు కాక, తక్కిన వర్ణములు.

ఇవి పరమగునపుడు, క్రొత్తశబ్దముయొక్క ఆద్యక్షర శేషమునకు నుగాగమ ప్రాప్తిలేదు. మీది హల్లునకు ద్విత్వము కల్గును.

క్రొత్త+గండి—క్రొగ్గండి
క్రొత్త+నన—క్రొన్నన
క్రొత్త+మావి—క్రొమ్మావి. (బా. వ్యా. సంధి 38)

**పరోక్షవృత్తి**

(వ్య.) ప్రత్యక్షవృత్తి, అతి పరోక్షవృత్తి. (చూ.) ప్రత్యక్షముగా స్పష్టపడని కలయిక. కొన్ని కృద్రూపములు గాని కొన్ని తద్భవ రూపములుగాని అవి యేర్పడిన విధానములు ప్రత్యక్షముగా గోచరింపక కొంత ఆలోచనము మీఁద గోచరించును.

తోఁట (< తోడు)

ఒజ్జ (< ఉపాధ్యాయ) (తె. వ్యా. వి. పుట. 845)

**పర్యుదాసము**

నిషేధార్థకమగు నఞ్ శబ్దము క్రియతో నన్వయింపక సమాసములోని యుత్తర పదముతో నన్వయించుట.

రాముఁడు అబ్రాహ్మణుఁడు — అనఁగా జాతి మాత్రముచే బ్రాహ్మణుడైనను కొన్ని గుణములచే బ్రాహ్మణుఁడనఁబడక భిన్నుఁడగుచున్నాఁడనుట.

పర్యుదాసస్స విజ్ఞేయో, యత్రోత్తర పదేన నఞ్.

(బా. వ్యా. తత్సమ. 24; గు. ప్ర. పుటలు. 1 0,101)

**పశ్యంతి**

ప్రాచీన భారతీయులు నిరూపించిన చతుర్విధ వాగ్భేదములలో రెండవది.

మూలాధార చక్రములోని వాయువు నాభికములముఁజేరి పశ్యంతియను వాక్కును వెలయించును ఇది యోగులకు మాత్రమే అనుభవనీయము.

(తె. వ్యా. వి. 71.3)

**పశ్చాన్నిర్మాణము**

వ్యవహార మందున్న పదము లాధారముగా వాని వెనుకటి రూపముల నేర్పఱచుట.

ఇది back-formation అనుదాని కనువాదము.

run - runner

win - winner ఇత్యాది పదము లాధారముగా Editor అను పదమునుండి to edit అను క్రియారూపమును నిర్మించుట.

కొలఁకులు, మ్రాఁకులు ఇత్యాది బహువచన రూపములనుండి కొలఁకు, మ్రాకు వంటి ఏకవచన రూపముల నేర్పఱుచుటలోను నిట్టి పద్ధతి కొంత గోచరించును.

(తె. వ్యా. వి పుట. 607)

**పాణినీయము — కావ్యవాఙ్మయము**

కర్త : వ్యాకరణ విద్యాప్రవీణ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి
ముద్రణ : 1944

శ్రీ వజ్ఝల చినసీతారామ శాస్త్రిగారు తన వ్యాకరణ గ్రంథములందు ప్రకటించిన సంస్కృత వ్యాకరణ సంబంధమగు నభిప్రాయము లీగ్రంథమునందు విమర్శింపఁబడినవి.

**పాదపూరణము**

పద్యము దలి పాదమును గణానుకూలముగ పూరించుట.

ఇట్లు పూరించుటకు సముచ్చయమగు 'ను' మున్నగునవి యుపయుక్తమగును.
అందరున్ వివశులై, రేయుపగలు నిద్రయు నెప్పుడెఱుఁగన్

(ప్రౌ. వ్యా. శబ్ద. 1 6)

**పొరుడి:**

పంచమీ విభక్తి ప్రత్యయముగా గురుమూర్తి గారిచేఁ బేర్కొనఁబడెను.

(గు. వ్యా. 84 అంశము)

**పార్శ్వవర్ణసమీకరణము**

ఒక వర్ణము ప్రక్కనున్న మీఁది వర్ణముతో సమానముగా మారుట.

భక్తిన్+మురహరి ⟶ భక్తిమ్ముురహరి, లతాంతములకున్+మొనసి ⟶ లతాంతములకుమ్మొనసి

దీనినే juxta Positional assimilation అందురు.

అనేక సంధులిట్టివి వ్యాకరణములలోఁ గానవచ్చును.

మూఁడు+నాళ్ళు ⟶ మూన్నాళ్ళు

వేడి+నీళ్ళు ⟶ వేన్నీళ్లు

చలి+నీళ్లు ⟶ చన్నీళ్లు (తె వ్యా. వి. పుట. 442)

**పిత్**

(ప్+ఇత్) పకారమి ద్వర్ణముగా గలది. ఇట్టి తెనుఁగు ప్రత్యయము తద్భవ ములపైనే వచ్చును. ఉదా:- ఇప్ (గొడ్డలి) మొ॥ (వై. చం. స్త్రీ ప. 6)

**పిల్లగుడుసు**

వ్యంజనముతోఁగూడిన ఇత్వము —కి, చి, పి మొదలైన యక్షరములలో నిది 'ి'/'ి' (అప్ప. II. 8)

**-ంపు**

కర్మధారయ సమాసములందు విభక్త్యేక వచనమున మువర్ణకమునకు వచ్చు ఆదేశము. ఉదా:- సరసంపు పలుకు (చింతా. సంధి. 35) చూ:-పు.

**-పు**

కర్మధారయ సమాసములందు విభక్త్యేక వచనమున మువర్ణకమునకు వచ్చు ఆదేశము. ఉదా:- సరసపు పలుకు (చింతా. సంధి 35) "ముట్వోర్భవేతాం పుంప్వా ఖ్యా వాదేశావత్ర సర్వదా, సామానాధి కరణ్యేతు బహుత్వార్థే పరేఽపిచ (సమానాధి కరణ సమాసమునందు బహుత్వార్థము పరమయినపుడును నీయాంధ్రభాషయందు ముబులకు పు; ంపులు ఆదేశములగును. (అథ. కా. సంధి. 26) ఉదా:- సరసపు పల్కులు, సరసంపు పల్కులు మొ॥

**పు**

సమాసమున గ్రామనామముకంటె పరమందున్న మువర్ణమునకొకానొక చోట వచ్చు ఆదేశము. ఈ యాదేశము భావుకుని మతము ననుసరించి చెప్పఁబడినది (అధ. కా. హలన్త. 13) ఉదా :- కొల్లాపురపుశక్తి మొ॥ "గ్రామనామ్నోఽపి" అను పై కారికయందలి అపిశబ్దముచే గుబ్బపు దడములు ఇత్యాది గ్రామనామములు కాని స్థలములలోను, పువర్ణ మాదేశముగ వచ్చును.

**—పు, —ంపులు**

కర్మధారయ సమాసములందు 'ము' వర్ణకమునకు, కేవల-పువర్ణముగాని, బిందుపూర్వక పువర్ణముగాని (-ంపు) ఆదేశమగును.

సరసము+మాట : సరసపుమాట / సరసంపు మాట

'సింగపుఁగొందమ' వంటి షష్ఠీ తత్పురుష సమాసములందును నిట్టి యాదేశము 'కర్మధారయములందు' అను బహువచన ప్రయోగముచే సూచితము.

(బా. వ్యా. సంధి. 82)

**పుంలింగము**

పురుష చిహ్నము.

పురుష చిహ్నముగల యర్థమును దెల్పు శబ్దములు పుంలింగమందుండును.

ఇట్టి పుంలింగ సంస్కృత శబ్దములు కొన్ని తెలుఁగు వ్యాకరణము చొప్పున మహద్వాచకములగును (చూ.) అట్టిచో అంతిమ 'అ' కారము 'ఉ' కారమగును. ఆ పైని బిందుపూర్వక 'డు' వర్ణకము చేరును.

రామ—రాము—రాముండు/రాముఁడు.

డిద్ధ—డిద్ధు—డిద్ధుండు/డిద్ధుఁడు. (బా. వ్యా. తత్సమ. 21, 22)

**పుంలిఁగ సమములు**

సంస్కృత పుంలింగ శబ్దములు కొన్నింటికివలె డు(జ్) చేరునట్టి యాచ్ఛికములగు అమహద్వాచకములు.

కర్తశఁడు, పరికాఁడు, మున్నగునవి.

(ల. వ్యా. అచ్చ. 58; సం. వ్యా. లింగము. 5)

**పుంస్త్వము**

పురుషత్వము

'చెడుగు, దుడుకు, నిడుపు' అనువానికి పుంస్త్వమునందు మతుబర్థకమగు 'అ' కారమగును.

చెడుగఁడు, దుడుకఁడు, నిడుపఁడు. (ప్రౌ. వ్యా. తద్ధిత. 5)

—పుక్

భావార్థమున వచ్చు కృత్ప్రత్యయము. ఇందలి కకారమిత్సంజ్ఞకమై లోపించును. ఇది ధాతువు చివరి చకారసకారముల కాదేశముగ వచ్చును. ఉదా :- మొలపు (మొలచు), తడపు (తడస) మొ॥ (వై. చం. కృదంత. 6).

**పుగాగమము**

పుక్+ఆగమము

(i) 'తామర'కు 'ఆకు' పరమగునపుడు పు(క్) ఆగమమగును. తామర+ఆకు ⟶ తామరప్+ఆకు ⟶ తామరపాకు. (ప్రౌ. వ్యా. సంధి. 8)

(ii) 'మాను' మున్నగు **ధాతువులకు ప్రేరణార్థము** నందు విభాషగానగును.

మాను { మానుపు / మానుచు } (బా. వ్యా. క్రియా. 74)

(iii) 'అను' మున్నగు ధాతువులకు 'ఇంచు' (క్) పరమగునపుడు ఈ ఆగమమగును.

అను+ఇంచు ⟶ అనుప్+ఇంచు ⟶ అనుపించు ⟶ అనిపించు.

(బా. వ్యా. క్రియా. 78)

**పుటాదేశము**

'పు', 'ట', అనువర్ణము లాదేశమగుట.

కర్మధారయ సమాసములందు 'ము' వర్ణకమునకు 'పు' ఆదేశమగును. దాని కచ్చు పరమగుచో టకార మంతాగమమగును. ఈ రెంటిని కలిపి పుటాదేశమని ఆం. కౌ. కర్త పేర్కొనెను

నెయ్యము+ఆదరము ⟶ నెయ్యపుటాదరము. (ఆం. కౌ. 493-496)

**పుటులోదవుట**

కర్మధారయ సమానములందు 'ము' వర్ణకమునకు 'పు', దాని కచ్చు పరమగునపుడు 'టు' అనువర్ణమును జేరును.

సోయగపుటాటలు

ఆరూఢపుటాలాపములు (కా. చూ. IX. 128,129)

**'పుట్టు' ప్రభృతులు**

పుట్టు, చుట్టు, తట్టు, పూ మొదలైనవి. వీనికి 'వు' అనుకృత్ప్రత్యయము చేరును.

పుట్టువు, చుట్టువు, తట్టువు, పూవు ఇత్యాదులు.

(వ్యా. భా. వ్యా. కృదంత)

**—పుడు**

సంస్కృతమున సప్తమ్యంతములగు సర్వ, ఏక, అన్య మున్నగునని కాలవాచకములగునపుడు వీనిపై 'దా' ప్రత్యయము విధింపబడినది.

అట్టి దా ప్రత్యయ స్థానమున తెనుఁగులో 'పుడు' అను తద్ధితము ఆదేశమగును. ఉదా :- అపుడు, ఇపుడు, ఎపుడు (వై. చం. తద్ధితా. 86).

**పునాదేశము**

పున్+ఆదేశము

షష్ఠీ తత్పురుషమునందు, కర్మధారయమునందు విశేష్యపదాంత "ము" కారమునకు '-పున్' ఆదేశమగును.

వాదము+పంతము ⟶ వాదపుంబంతము

సున్నము+రంగు ⟶ సున్నపు రంగు

(ఆం. కౌ. 491-'94

**-పుమ్**

వర్ణవాచక శబ్దములపై భావార్థమునవచ్చు తద్ధితప్రత్యయము. ఇందలి మకారమిత్సంజ్ఞకము. ఉదా ;- తెలుపు, నలుపు మొ॥ (వై. చం. తద్ధితా 19).

**-పురవర్ణకము**

కాఁచు, దాఁచు, దాయు మున్నగు ధాతువులకుఁజేరు కృత్ప్రత్యయము.

కాఁపురము, దాఁపురము, దాపురము, (ప్రౌ. వ్యా. కృదంత 4)

**పురార్థయోగము**

మునుపు, లేకముందు అనునర్థము నిచ్చు శబ్దములతో సంబంధము.

ఇట్టి సంబంధము కల్గినపుడు క(జి) (చూ.) వర్ణకము ధాతువునకు విభాషగాఁ జేరును.

కజి-జీత్తుగావున ధాతువుయొక్క ఉత్వమునకు అత్వమగును.

వండు+క(జి)+మునుపు

⟶ వండకమునుపు=వండుటకు మునుపు (బా. వ్యా. క్రియా. 86)

**పురుషబోధక సర్వనామములు**

పురుషములను (చూ.) దేలుపు సర్వనామములు.

ప్రథమపురుష — వాఁడు, వారు

అది, అవి

మధ్యమపురుష — నీవు, మీరు

ఉత్తమపురుష — నేను, మేము (సం. వ్యా. సర్వ. 4)

**పురుషములు**

క్రియలమీఁద వచ్చునేకవచన బహువచన ప్రత్యయములు.

వచ్చుచున్నాఁడు — వచ్చుచున్నారు

వచ్చుచున్నది — వచ్చుచున్నవి

ఇత్యాదులు. (ల. వ్యా. క్రియా. 6)

**పురుషవాచకములు**

పురుషులను దెల్పుశబ్దములు.

ఇట్టి సంస్కృత శబ్దములు అదంతములైనచో ఉదంతములగును. దానిపై బిందు పూర్వక డువర్ణకము చేరును.

రాముండు, డిద్దుఁడు. భార్గవుఁడు. (ఆం. కౌ. 144-146)

**పురుషాఖ్యలు**

పురుషలను దెలుపునవి.

ఇవి (*i*) ప్రథమ (*ii*) మధ్యమ (*iii*) ఉత్తమ అని యివి మూఁడు విధములు ఇవి క్రియలకుఁజేరి వర్తమానాద్యర్థ రూపము లేర్పఱచును.

(కా. చూ. IX. 145)

**పురుషామంత్రణము**

పురుష సంబోధనము.

ఇందు 'ఓ' అను పూర్వాగమమునకు 'యి' వర్ణమంతా గమము విభాషనగును.

ఓయి రాముఁడ!

ఓ రాముఁడః

**పురోధ, పురోధసుఁడు**

'పురోహితుఁడు' అనునర్థమునిచ్చు పురోధశ్శబ్దమునకు వికల్పముగా సలోపము, స్త్రీవద్భావము నిపతింపఁబడెను. ఇట్లు రెండు రూపములేర్పడెను.

(బా. వ్యా. తత్సమ. 82)

**పువర్ణశృంగ ముడుపుట**

'పు' అను వర్ణములోని కొమ్మును లోపింపఁజేయుట.

చప్పుడు—చప్డు

ఎప్పుడు—ఎప్డు (స. సా. సం. I. సంధి 44-46)

**పువర్ణకము**

-'పు' అను కృత్ప్రత్యయము.

'మాయు' మున్నగు ధాతువుల కిది పరమగును. అట్టిచో అంతిమ 'యు' లోపించును.

మాయు—మాపు

మేయు—మేపు

ఇత్యాదులు. (బా. వ్యా. కృదంత. 11)

**పువర్ణాదేశము**

-'పు' అను వర్ణము కర్మధారయ సమాసమునందు పూర్వపదాంతమందలి విభక్తి 'ము'కారమున కాదేశమగును.

ఇది బిందుపూర్వకము కూడ కావచ్చును. [-ంపు]

సూక్ష్మపుఁగొను

సూక్ష్మంపుఁగొను. (అప్ప. V. 127, 128)

పుషణ్వాదులు (పుష,ణు+ఆదులు) పుష (పుష్టౌ), ణు(స్తుతౌ) ఛిదిర్ (ద్వైధీకరణే), వద (వ్యక్తాయాంవాచి), మున్నగు ధాతువులు. ఇవి తెనుఁగు వ్యాకరణమున ఉపకృతి క్రియలనఁబడును. వీనిని తెనుఁగున తత్సమక్రియలుగా వాడుకొనునపుడు పోష, నుతి, ఛేద, వాద ఇత్యాది కృదంత రూపములను మూలముగా గ్రహింపవలెను. (చింతా. క్రియా. 2,5) చూ:- ఉపకృతి క్రియలు.

**పుష్పదంతుఁడు**

ప్రాచీన వ్యాకరణకర్త. ఈతఁడు మం. ఆం. కౌ. (పరిభాషా.) యందును, అధర్వణుని త్రి. శబ్దా. (కాండ 4) నందును పేర్కొనఁబడినాఁడు. 'తోడుత శ్చఘుచే పుష్పదంతః' అను పై త్రి. శబ్దా. సూత్రమున 'తోడుత' యను విభక్తి పుష్పదంతుని మతమున వచ్చునని చెప్పఁబడుటచే నీతఁడు ఆంధ్రవ్యాకరణకర్త యనియే చెప్పవచ్చును. ఈతని గ్రంథమేదియు లభింపలేదు (ఆం. వ్యా. వి. 182 పు.)

**పూ**

సమాసము కానపుడు 'పూ' శబ్దము 'పూవు' శబ్దముయొక్క పర్యాయపదము.

సింధువారమునఁ బూశిథిల పడగ. (ప్రౌ. వ్యా. సంధి. 11)

**పూజ సొన్నములు**

పూజ, సొన్న అనునవి క్రమముగా పూజ, స్వర్ణశబ్దభవములు.

ఈ రెండు తద్భవములకు మతుబర్థకమగు -'అరి' వర్ణకము పరమగునపుడు

'పూజ' శబ్దమునకు వైకల్పికముగను; 'సొన్న' శబ్దమునకు నిత్యముగను దీర్ఘము వచ్చును.

పూజ + అరి > పూజారి
పూజరి

సొన్న + అరి ⟶ సొన్నారి (ప్రౌ. వ్యా. తద్ధిత. 8)

**పూజ్యత**

గౌరవము. దీనిని ప్రకటించుటకు నామములకు, ఆ, ఈ, నీ, నా, తన శబ్దములకు ఏకవచనమునకు బదులు బహువచనము వచ్చును.

మద్గురువుల నడిగెద.

వీరెవ్వరయ్య?

మీరలు

మాచిత్తము (ప్రౌ. వ్యా. శబ్ద. 48)

**పూజ్యతాతిశయము**

గౌరవముయొక్క ఆధిక్యము.

యుష్మదర్థ బహువచనమునకు (మీరు, మీరలు మున్నగునవి) బదులుగా ఆత్మార్థ బహువచనము (తాము, తమరు) ప్రయుక్తమగును.

స్వామీ! తమరు దయచేయవలయును.

(ప్రౌ. వ్యా. శబ్ద. 45)

**పూనగ**

పూనమున్నగు శబ్దముల గణము. చూ:- పూనాదులు.

**పూనాదులు**

(పూన+ఆదులు) పూన, నెఱగ, పొదవు, పొనరు, పొలసు, పొంద, పగల మున్నగు ధాతువులు. వీని తొలిహల్లు వికల్పముగా లోపించును. ఉదా:- ఊను, ఎసగు, ఒదవు, ఒనరు మొ॥ (వై. చం. తిజన్త. 207)

**పూనుపొదవులు**

పూను, పొదవు అనుధాతువులు. వీని యాది పకారమునకు లోపమును అప్పకవి పేర్కొనెను. (అప్ప. II-75) కాని

పూను = పూనుకొను, కడగు

ఈను = మోపు అనురీతి నర్థభేదముకలదు.

పొదవు = ఆక్రమించు, వ్యాపించు, క్రమ్ము

ఒదవు = కలుగు, ఉపయోగించు ననురీతిని అర్థభేదముకలదు. అందుచేత నిట్టి పకారలోపమును జెప్పరాదని చిన్నయసూరి అప్పకవిని ఖండించెను.

(బా. వ్యా. ప్రకీర్ణ. 10; రమణీ. 474)

**పూరణార్థము**

పూరించునట్టి యర్థము.

ఈ యర్థమునందు అవ(క్) (చూ.) అను నాగమము చేరును.

పూరణము రెండు సంఖ్యనుండియే ప్రారంభమగును.

రెండు+అవ(క్)⟶రెండవ

ఇట్లే మూఁడవ, నాల్గవ, ఇత్యాదులు.

(బా. వ్యా. ఆచ్ఛిక. 25)

**పూర్ణబిందు పూర్వక డు వర్ణము**

ఔపవిభక్తికములై, '(లి)' యను వర్ణముగాని 'ల్లు' అను వర్ణములుగాని యంతమందుండు శబ్దములకు బహువచన ప్రత్యయము పరమగునపుడు పూర్ణ బిందు పూర్వకడువర్ణము దానికిఁబూర్వమందు వచ్చును.

కొడవలి+లు ⟶ కొడవండులు, కొడవండ్లు.

ఇల్లు+లు ⟶ ఇండులు, ఇండ్లు. (బా. వ్యా. ఆచ్ఛిక. 16)

**పూర్ణబిందువు**

నిండుసున్న [ం] (అప్ప. II. 32)

**పూర్ణానుస్వారము**

అచ్చునను సరించి పూర్తిగా స్వరించునది. (వ్య.) అర్ధానుస్వారము. (చూ.)

దీని లేఖన చిహ్నము [ం] అంతట, కాంతురు.

దీనినే నిండుసున్న, పూర్ణబిందువు, నెఱసున్న అనియు వ్యవహరింతురు.

(ప్ర. వ్యా. సంజ్ఞా. 35)

**పూర్వకవి సమయసిద్ధపదములు**

పూర్వకవులు ప్రసిద్ధముగాఁ బ్రయోగించిన పదములు.

ఇట్టివానినే కవులు ప్రయోగింపవలయును గాని, క్రొత్తవి కల్పింపరాదని, అందును బహువ్రీహి సమాసముల విషయమున, క్రొత్తవి కల్పించిన రూఢి యుండదని తెలుఁగు లాక్షణికుల యభిప్రాయము.

చలివెలుఁగు, నలువ, ముక్కంటి. (అప్ప. I. 126)

**పూర్వవర్ణదీర్ఘము**

పదమధ్య వర్ణలోపము కలుగఁగా దానికి పూర్వమందున్న వర్ణము దీర్ఘమగును. దీనినే యాధునికులు లోపదీర్ఘము (చూ.) అందురు. (**compensatory Lengthening**) అందురు.

పేర్కొనని—పేర్కొని

కైకొనని—కైకోని

ఇయ్యని—ఈని (క. సం. వి. I. 61-68)

**పూర్వపదార్థప్రధానము**

పూర్వపదము యొక్క అర్థము క్రియతో నన్వయించుట.

అతని బుద్ధి పెడతల బట్టెను. (ఆం. భా. భూ. 111)

**పూర్వాగమము**

పూర్వమునందు ఆగమముగా వచ్చుట.

(i) ఆ, ఈ, శబ్దములకు మహదర్థము నందు అన్ని విభక్తులందును 'వ' కారము నిత్యముగాఁ బూర్వాగమమగును.

వాఁడు, వారు, వీఁడు, వీరు.

(ii) ఏ శబ్దమునకు మహదర్థమునందు అన్ని విభక్తుల యందును, వకారము వికల్పముగాఁ బూర్వాగమమగును.

వేఁడు—ఏఁడు.

వేనిచేత—ఏనిచేత

(iii) ఆ, ఈ, ఏ, శబ్దములకు అమహదర్థము నందుఁ బ్రథమేతర విభక్తులు పరమగునపు డేకవచనమునందు దకారమును, బహువచనమునందు వకారమును నిత్యముగాఁ బూర్వాగమములగును.

దానిన్, దానితో, దానికొఱకు

వానిన్, వానితో, వానికొఱకు (ప్రౌ. వ్యా. శబ్ద. 58)

**పూర్వావయవము**

ఉత్తర పదముయొక్క పూర్వభాగము.

నడ యాడు

పూర్వావయవము ఉత్తరపదము.

ద్విరుక్తియందు శబ్దపల్లవ క్రియలయొక్క పూర్వావయవమునకు లోపము విభాషగానగును.

నడయాడి+నడయాడి

నడయాడియాడి (ప్రౌ. వ్యా. క్రియా. 24)

**పెక్కువిభక్తులం బ్రథమ**

వివిధ విభక్తులందుండవలసిన విశేషణములు ప్రథమావిభక్తియందుండవచ్చును.

'భక్తగణదయమానచిత్తుఁ దగజాధిపుకీర్తి—షష్ఠికిఁ బ్రథమ.

మాతండ్రి పరాశరసుతు చేత (తృతీయకుఁ బ్రథమ)

పార్థివ ప్రాగ్రసరుండు ధర్మసుతుపంపు (షష్ఠికి ప్రథమ)

(కం. సం. వి. I. 48-49)

**పృథగర్థకము**

'వేఱు' గా అనునర్థము నిచ్చునది.

షష్ఠ్యంతములగు 'ఆ, ఈ, నీ, నా, తా' అను శబ్దములు పూర్వమందుఁగల 'అంతట' శబ్దము 'వేఱుగా' నను నర్థము నిచ్చును.

నీ యంతట నీవున్నావు = నీవు వేఱుగా నున్నావు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 110)

**పృథ్వీవాచి 'భూ' శబ్దము**

పుడమిని తెలుపునట్టి 'భూ' యను శబ్దము ఏకాక్షరము కావున, శ్రీ, స్త్రీ, హ్రీ ఇత్యాదులకువలె దీర్ఘముతో నుండవలయును.

కాని యిది భువియను వాడుకను బడయుటచే నారీతిగా రూపము నిపతింపఁబడెను. (బా. వ్యా. తత్సమ. 62)

**పె**

తదాది శబ్దముల (ఆ, ఈ, ఏ అనువాని) పై స్త్ర్యర్థమున వచ్చు దేశ్యశబ్దము.

ఉదా:- ఆపె, ఈపె, ఏపె (మం. అం. కౌ. 390)

**పెన్వాదులు**

పెను+ఆదులు: పెను, పలు, కను మున్నగునవి. వీని కచ్చుపరమగునపుడు ద్విత్వము కలుగును.

పెన్నరదము, పల్లులుపు, కన్నాకు. (ప్రౌ. వ్యా. సంధి. 9)

**పే(ఁ)ట**

(i) ఇది దేశ్యమని చిన్నయసూరి. ఇందు ఖండబిందువులేదు.

(బా. వ్యా. సంజ్ఞా. 21)

(ii) ఇది పింఠాశబ్దభవము. తద్భవమునందు అర్థవిపరిణామముగలిగెనని బహుజనపల్లి సీతారామాచార్యుల యభిప్రాయము.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 11)

**పేచోషాదిక శబ్దములు**

(పేచ+ఊష+ఆదికశబ్దములు). పేచ, ఊష మున్నగు నప్రసిద్ధ శబ్దములు. పేచయనునది డుపచష్ = పాకే యను ధాతువుయొక్క లిట్ మధ్యమపురుష బహువచనరూపము. ఇట్లే ఊష యనునది వస = నివాసే యను ధాతువు యొక్క లిట్ మధ్యమ పురుష బహువచనరూపము. ఇట్టి శబ్దములను కవులు సాధారణముగ ప్రయోగింపరు. కాని శబ్దశాస్త్రిక దృష్టిగల కొందఱు సంస్కృత మున వీనిని ప్రయోగించిన ప్రయోగించవచ్చును. కాని తెలుఁగున మాత్రము సుప్రసిద్ధమగు సంకేతముగలవియు, ప్రామాణిక కవుల ప్రయోగములలో నెల కొన్నవియునగు శబ్దములను మాత్రమే ప్రయోగింపవలెను. అనఁగా అర్థబోధన శక్తిలేనివియు, అప్రసిద్ధములునునగు పదములను తెలుఁగున ప్రయోగింపరాదు. (చింతా. సంజ్ఞా. 43)

**పేదాది శబ్దములు**

'పేద' మున్నగు శబ్దములు

పేద, బీద, ముద్ద. బాలెంత మున్నగునవి

వీనికి 'ఆలు' శబ్దము పరమగునపుడు, కర్మధారయమునందు 'రు'గాగమ మగును.

పేదరాలు. బీదరాలు ఇత్యాదులు. (బా. వ్యా. సంధి. 30)

**పేరు శబ్దము**

వైశాల్యమును తెలుపు శబ్దము. ఉదా:- పేరురము, పేరాముదపాకు మొ॥ (అథ. కా. అజంత. 70)

**పేరుగ**

పేరు మున్నగు శబ్దముల గణము. (చూ.గ) చూ:- పేర్వాదులు 1. (వై.చం. అజంత. 69)

**పేర్వాది శబ్దములు**

'పేరు' మొదలగు శబ్దములు.

కర్మధారయమునందు వీనికచ్చు పరమగునపుడు 'టు'గాగమము విభాషగా నగును.

పేరు + ఉరము < పేరుటురము / పేరురము

పేరు, చిగురు, పొదరు మున్నగునవి. (బా. వ్యా. సంధి. 29)

**పేర్వాదులు[1]**

(పేరు+ఆదులు) పేరు, ఊరు, చూరు, పోరు, కాలు, పాలు, మేలు మున్నగు శబ్దములు. వీనికి గోటిని ఇత్యాదులందువలె టుడాగమాదికమురాదు. పేరు, పేళులు పేరులు, పేరిని, పేళుల, పేరిచేత మొ॥ (వై. చం. అజంత. 69)

**పేర్వాదులు[2]**

పేరు+ఆదులు. ఆకృతిగణము.

పేరు, కడు, ముచ్చు, మేలు, చెలి, పోఁడి, వాడి మున్నగునవి.

వీనికి భావార్థమునందు—ఇమి వర్ణకమగును.

పేరిమి, కడిమి, ముచ్చిమి, మేలిమి, చెలిమి, పోఁడిమి; వాడిమి ఇత్యాదులు.

(బా. వ్యా. తద్ధిత. 5)

**పైశాచి**

పాండ్య, కేకయ, సాల్వ, బాహ్లిక, గాంధార, నేపాళాది దేశములయందు వ్యవహృతమైన భాష. గుణాఢ్యుఁడు తన బృహత్కథను ఈ ప్రాకృతము నందు రచించెను. (అప్ప. 1. 81-88)

**పొంటె[1]**

సహార్థమున వచ్చుదేశ్యశబ్దము. ఉదా:- రామునిపొంటెచని, కృష్ణుని పొంటె కూడి మొ॥ (మం. ఆం. కౌ. 151)

**-పొంటె[2] (న్)**

చతుర్థీ విభక్తి ప్రత్యయము.

'కార్య సంప్రయోగము పొంటెన్'—కొఱకని యర్థము.

(గు. వ్యా 84 అంశము; ప్రౌ. వ్యా. కారక. 9)

**పొడవులు**

దీర్ఘములు. ఆ, ఈ, కా ఇత్యాదులు. (అప్ప. II. 10)

**పొలయ్యాదులు**

పొలయు+ఆదులు. ఆకృతిగణము. పొలయు, తిరియు, మురియు, మున్నగు ధాతువులకు 'ప' అను కృత్ప్రత్యయము చేరును.

పొలపము, తిరిపము, మురిపము మొదలైనవి.

(వ్యా. ఖా. వ్యా. కృత్. 11)

**పొల్లునకారము**

అచ్చుతోఁగూడని నకారము-'న్'. దీనికి గ జ డ ద బ లు పరమైన పొల్లు నిల్చును. లేదా నెఱసున్న యగును.

భీమాంబకున్ గారామైన తనూజుఁడు.

కార్చిచ్చుంగడచి (స.సా.సం. I. సంధి. 87-94)

**పొల్లులు**

కేవల వ్యంజనములు. అచ్చులతోఁగూడక తేల్చిపలుకఁబడు వ్యంజనములు.

న్, ల్, మ్ మున్నగునవి. (అప్ప. II. 13)

**పొల్లు హల్లుల ద్విత్వము**

అనుకరణమునందు పొల్లుహల్లులు ద్విత్వమగును.

'ఆత్మార్థం పృథివీం త్యజేత్త' నెడి వాక్యం బ్రశుతంబేన్నృపా!

(స సా.సం. I. సంధి. 81)

**-పోతు**

తాచ్ఛీల్యమునందుఁజేరు తద్ధిత ప్రత్యయము.

తిండిపోతు. (బా. వ్యా. తద్ధిత. 28)

**-పోలె ప్రభృతులు**

-పోలె, -వలె, -పగిది, -వంటి ఇత్యాదులు.

-'పోలె' మున్నగు శబ్దములు ప్రథమాంతములైన నామములకును క్త్వార్థక ప్రత్యయాంత క్రియలకును పరముగానున్నపుడు ఉత్ప్రేక్షాద్యోతకములగును. అనఁగా నివి సాదృశ్యమునేకాక సంభావనను, (ఊహను)గూడ బోధించును.

దారు చక్రంపు బిళ్లపోలె—దారు చక్రపు బిళ్లయా యని యూహింపనగును.

(ప్రౌ. వ్యా. సమాస. 41)

**ప్రకారము**

విశేషణము.

సుందరత్వము — ఇందు 'సుందర' అను ప్రకృతి వలనఁగలుగు నట్టి 'సుందరత్వవిశిష్ట' అను శాబ్దబోధమునందు 'సుందరత్వము' ప్రకారమగును. అనఁగా విశేషణ మగుఁను.

ఇట్లే మనుమఁడనఁగా మనుమని తనము (పౌత్రత్వము) గలవాఁడు.

మనుమనితనము — ప్రకారము (విశేషణము)

ఇట్లే గొప్పతనము, సల్లఁదనము.

(బా. వ్యా. తద్ధిత. 1; రమణీ. 371)

**ప్రకృతి ద్వయ పక్షము**

తెలుఁగునకు సంస్కృత, ప్రాకృతములను భాషలు మూలములుగాఁగై కొన్న వైయాకరణ పక్షము.

అథర్వ శబ్దచింతామణికర్త, వికృతి వివేక కర్త, అహోబలపతి, చిన్నయసూరి మున్నగువారు. (తె. వ్యా. వి. పుటలు 206, 207)

**ప్రకృతి ద్వయము**

ఆద్యప్రకృతి మఱియు ప్రకృతి. ఆద్య ప్రకృతి యనఁగా సంస్కృతము) ప్రకృతి యనఁగా ప్రాకృతము. ఈ రెండింటి నుండి పుట్టిన శబ్దము తద్భవము (చింతా. సంజ్ఞా. 42)

**ప్రకృతి భావము**

వర్ణలోపాదేశములాదిగాఁగల మార్పులు లేక, ఉన్నదున్నట్లుగానున్న శబ్దముల సహజస్థితి. దీనికే స్వత్వమనియు (చూ.)వ్యవహారము.

పూచెనుగలువలు.—ఇటద్రుతమునకుఁ బ్రకృతి భావము.

(అప్ప. V. 47; బా. వ్యా. సంధి. 17)

**ప్రకృతి భావ సంధి**

సంస్కృతమునందు నిరూపితమైన ఆఱు విధములగు సంధులలో (దుక్సంధి, స్వరసంధి, ప్రకృతి భావసంధి, వ్యంజన సంధి, విసర్గ సంధి, స్వాది సంధి) నొకటి.

పితృ ఋణము. (అ. ఛం. IV-39)

**ప్రకృతులు**[1]

మూల భూతములు.

"తెలుఁగునకుం బ్రాకృత భాష 'ప్రకృతి' యనిపించుకొనును. ఆ ప్రాకృతమునకు సంస్కృత భాష 'ప్రకృతి' యనిపించుకొనును. అటుగాన ప్రకృతులనఁగా సంస్కృత ప్రాకృతముల రెంటికిని పేరు".

(అప్ప. పుట 30; 1934 ము.)

**ప్రకృతులు[2]**

పదములలోని ప్రత్యయములు తొలఁగింపఁగా మిగిలిన ప్రాతిపదికములుకాని, ధాతువులుగాని ప్రకృతు లనఁబడును.

1. పెరుగుచున్న + ది
 |
 ప్రాతిపదిక.

2. పెరుగు | చున్నది
 |
 ధాతువు. (సం. వ్యా. పద. 8)

**ప్రచ్ఛన్న తద్భవములు**

పైకి కానరాని సంస్కృత ప్రాకృత భవములు.

తెనుఁగు నందలి దేశ్యపదములన్నియు ప్రచ్ఛన్నములైన తద్భవములే (disguised tatbhavas) యని, తెనుఁగునకు సంస్కృత ప్రాకృత జన్యత్వము నూహించువారందురు. (తె. వ్యా. వి. పుట. 172)

**ప్రతిపదోక్తములు**

వ్యాకరణశాస్త్రానుసారముగా నిరూపితమైనవికాక, ఏ పదమునకాపదము అవ్యయమని పేర్కొనఁబడిన అవ్యయములు.

(వ్య.) లాక్షణికములు (చూ.)

అయ్యో, ఆహా, పోలెన్, వలెన్ ఇత్యాదులు. (ప్రౌ. వ్యా. వాక్య. 8)

**ప్రతిభ**

సహజమగు శక్తి. (competence)

ప్రతిభయే వాక్యార్థమని భర్తృహరి తన వాక్యపదీయమునందుఁ బేర్కొనెను

ఇది సర్వప్రాణి సంవేద్యము. ఇదియనాఖ్యేయము. ఆత్మసంవేద్యము. గజవాజులు నిట్టి ప్రతిభచేతనే సంచరించును కోకిల కహుకుహూరావములు చేయుట కిదియే హేతువని ఆమహనీయుఁ డుద్ఘాటించెను.

మానవుఁడు భాషించుట ప్రతిభామూలకమే, ఆధునిక భాషాశాస్త్రజ్ఞుఁడు ఛోమ్‌స్కీ (Ch-msky) కూడ నిట్లే పేర్కొనెను

(తె. వ్యా. వి. పుట 1027)

**ప్రతియోగి**

విరోధి

వస్తూత్పత్తికి ముందున్న యభావము—ప్రాగభావము. అట్టి ప్రాగభావమునకుఁ బ్రతియోగి యోగి భావి. (చూ.) (బా. వ్యా. క్రియా. 4; గు. ప్ర. 308)

**ప్రతిషేధాకారోత్తర సంధి**

వ్యతిరేకార్థమును దెల్పు అకారమునకు అచ్చుపరమగునపుడు అది 'అన్' అగును.

పంకజనేత్రుఁ డనతి దూరుఁడు.

అనాద్యంతుఁడు. (అ. ఛం. IV. 57)

**ప్రత్యక్షవృత్తి**

శబ్దముల కలయిక స్పష్టముగాఁ గానిపించునది.

(వ్య.) (చూ.) పరోక్షవృత్తి, అతిపరోక్షవృత్తి

కాయు+అ ⟶ కాయ

పూ+వు ⟶ పూవు.

పండు+$\phi$ ⟶ పండు (తె. వ్యా. వి. పుట. 845)

**ప్రత్యయము**

ధాత్వాదులపై విధింపఁబడునది. ప్రతీయతే = విధీయతే ఇతి ప్రత్యయః (విధింపఁబడునది ప్రత్యయము) అని వ్యుత్పత్తి. నామములపైవచ్చు డు, ము, వు, మున్నగు నవియు, క్రియలపై వచ్చు ను, ము, వు, రు మున్నగునవియు, టిక, తన ఇత్యాదులును తెలుఁగులో ప్రత్యయములు. ప్రత్యయములు తెలుఁగున వర్ణకము లనఁబడును. (చింతా. సంజ్ఞా. 25)

**ప్రత్యయాత్మక నకారము**

ప్రత్యయముగా నున్న ద్రుతనకారము. తాను, నేను, ధనమును, చదువు చున్నాను, చదువఁగలను—ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా 7)

## ప్రత్యయాత్మక భాషలు

ప్రత్యయములు విశేషముగాఁ గల్గియున్న భాషలు. ఈ ప్రత్యయముల చరిత్ర తెలియదు. ఇవి ఆది మధ్యాంతములుగా (prefixing, infixing, suffixing) అధికముగాఁగల సంస్కృతాది భాషలు.

(తె. వ్యా. వి. పుట. 167, 599, 739.

## ప్రత్యయార్థావ్యయము

ప్రత్యయ యోగముచే నేర్పడు అవ్యయములు. ఉదా:- సర్వత్ర, సర్వదా మొ॥ ఇచట త్రల్, దా అను ప్రత్యయముల యోగముచే సర్వత్ర, సర్వదా అనునవి యవ్యయములైనవి. సంస్కృతా వ్యయములకు అనుకరణముననఁదప్ప తెలుగున ప్రవేశములేదని చింతామణిలో చెప్పఁబడినది'(సంజ్ఞా. 13). అనఁగా సంస్కృతావ్యయములు తత్సమత్వమును పొందవని భావము. కాని అథర్వణాచార్యులు సర్వత్ర, సర్వదా మున్నగు ప్రత్యయార్థా వ్యయములు కొన్నింటికి అనుకరణము కాని చోట్లను ప్రయోగము కలదని తెలిపెను. ఉదా:- సర్వత్ర నిలింపభామినులు మొ॥ (అథ. కా. సంజ్ఞా. 27) ప్రత్యయార్థములుగాని వృధా మున్నగు ఇతరా వ్యయములు కూడ కొన్ని ప్రయోగింప వచ్చుననియు అథర్వణుఁడు విష్ణుశర్మ యభిప్రాయముగా తెలిపెను. (అథ. కా. సంజ్ఞా. 28)

## ప్రత్యవసానార్థకములు

'భక్షణమ'ను నర్థముగల ధాతువులు— 'తిను' మున్నగునవి.

అట్టి ధాతువులకు అప్రేరణమునందు కర్తయగునది ప్రేరణమునందుఁగర్మ మగును.

బాలుఁడు అన్నమును దినెను. (కర్త : అప్రేరణము)

తల్లి బాలుని అన్నమును దినిపి చెను. (కర్మ , ప్రేరణము)

(బా. వ్యా. క్రియా, 123)

## ప్రత్యాహారము

వర్ణసంగ్రహ విశేషము.

తుదినుండు ఇద్వర్ణముతోఁ గలిసిన మొదటి వర్ణము. ఆ రెండిటికి నడుమనున్న వానికిని దనకును సంజ్ఞయగును.

'డుఙ్'—ఙ్ కారము ప్రత్యాహారార్థము. ఈ సంజ్ఞ డు. ఙ్ అనువాని నడుమనున్న 'డు, వు, రు, ను, ము' అను వానికిని,డువర్ణకమునకును సంజ్ఞయగును. కావున 'డుఙ్' అనఁగా ఈ ఆఱు ప్రత్యయముల సంక్షేపమని యర్థము.

(రమణీ. పుట. 378)

**ప్రథమ**

(i) —డు,—ము,—వు,—లు ; ప్రథమ

రాముఁడు, వృక్షము, తరువు, రాములు.

(ఆం. కౌ. 132, బా. వ్యా. తత్సమ. 1) (చింతా. అజంత. 1)

(ii) ద్వితీయ మొదలు ఆయావిభక్తుల యాకాంక్షలేనిచో నలరు ప్రథమ

(ఆం. కౌ. 129)

(iii) చేయువాఁడు ప్రథమ (ఆం. భా. భూ. 63)

(iv) ప్రాతిపదికార్థమునందు (చూ.)

ఉక్తార్థమునందు (చూ.)

సంబోధనార్థమునందు (చూ.) ప్రథమయగును.

(బా. వ్యా. కారక. 1)

నీ, నా మున్నగు శబ్దములపై విధింపఁబడిన వు, ను ఇత్యాదులును ప్రథమా విభక్తి ప్రత్యయములే (అహో. అజంత. 1)

**ప్రథమదేశ్యములు**

'ఁ/ండు' వర్ణము కొనయందుఁగల పురుష వాచకములైన శబ్దములు.

మగఁడు, అల్లుఁడు (గు. వ్యా. 109)

**ప్రథమపురుష**

మధ్యమ, ఉత్తమ పురుషలు కానిది. ఇతరుల పలుకులు.

| | | మహత్తు | అమహత్తు |
|---|---|---|---|
| ప్రథమ | ఏ.వ. | డుజ్ | ది |
| పురుష. | బ.వ. | రు | వి |

(అ. ఛం. IV. 113; కా. చూ. IX. 146-152)

**ప్రథమపురుషవికల్పసంధి**

ప్రథమ పురుష క్రియాపదముల యందలి 'ఇ' కారమునకు సంధి వికల్పముగా నగును.

సిద్ధిపొందిరియవిముక్త సీమలందు

కనిరప్పార్మ్వచరుల్. (స. సా. సం. I. సంధి. 21-27)

**ప్రథమలయిన నాంతపదములు**

తాను, నేను, అను పదములు నకారాంతములయినవి. ఈ నకారమునకు బిందువు కల్గును.

తాను జదివెను.

తాఁజదివెను. (స. సా. సం. I. సంధి. 119)

**ప్రథమాతత్పురుషము**

పూర్వపదము ప్రథమాంతముగా విగ్రహవాక్యము వచ్చు తత్పురుషసమాసము.

పూర్వకాయము.

—కాయముయొక్క పూర్వము, పరకాయము—కాయముయొక్క పరము. పయిమెయి, అడుగుమెయి మున్నగునవి.

(అ. ఛం. IV. 94; ఆం. కౌ. 481 పంక్తి)

**ప్రథమావిభక్తి** చూ:- ప్రథమ.

**ప్రథమా విభక్తి ప్రత్యయములు** చూ:- ప్రథమ.

**ప్రథమైక వచనాంత తుల్యము**

ప్రథమా విభక్తి ఏకవచనాంతమగు సంస్కృత పదముతో సమానమైనది. అనఁగా అదియే యని యర్థము. అట్టి పదము తెలుఁగున ప్రాతిపదికమై దానికి ఉత్వద్విత్వములగును. విభక్త్యంతమగు సంస్కృత పదము తెలుఁగున ప్రవేశింప రాదు. అట్లు ప్రవేశింపఁజేయుటకు అట్టిదిగాక, దానితో తుల్యరూపమును గ్రహించుటచే వ్యాకరణ మర్యాద రక్షింపఁబడుచున్నది. రుక్=రుక్ + క్ + ఉ——→రుక్కు (బా. వ్యా. తత్సమ. 67,68)

**ప్రధానము**

ముఖ్యము.

ఏ పదము వాక్యమునందు క్రియతో నన్వయము కల్గియుండునో అది ప్రధాన మని యర్థము.

తెల్లగుఱ్ఱము పరుగిడెను—ఇట 'గుఱ్ఱము' పరుగెత్తినది కావున—గుఱ్ఱమను పదము ప్రధానము.

విశేష్యము ప్రధానము, తక్కినవి యప్రధానములు.

అన్వయ క్రమమునందు అప్రధానమగు విశేషణము ముందుఁజెప్పబడును. ప్రధానమగు విశేష్యము తరువాత చెప్పఁబడును.

(ప్రౌ. వ్యా. శబ్ద. 6,7)

**ప్రధ్వంసాభావము**

వస్తువుగాని, క్రియగాని, నశించినపిమ్మట నుండు అభావము-అనఁగా **పూర్వ** మందుండి యిప్పుడు లేనిది.

ఘటముండెను.

**ఘటముండిన పూర్వ**కాలమందు దాని నాశములేదు, అనఁగా ఘటము **పూర్వ** మందుండెనని యర్థము.

విద్యమానమగు క్రియాభావమునకు ప్రతియోగి జరిగిన క్రియ. వస్తువు నశించిన **పిమ్మట** ఏర్పడునట్టియభావము. (రమణీ. పుట. 377)

**ప్రమాదము**

**పరాకు.**

ఇది దేనిచేఁగల్గునో దానికి 'వలన' వర్ణకమగును.

పాడివలనఁబరాకు వడియె (బా. వ్యా. కారక. 9)

**ప్రయోగము**

కర్త, కర్మ, క్రియలఁగూడినది.

రాముఁడు రావణుని సంహరించెను. (ప్రౌ. వ్యా. వాక్య. 8)

**ప్రయోజ్యకర్త**

ప్రవేశపెట్టఁబడినకర్త.

స్వార్థావస్థయందుఁగర్తయై, ప్రేరణావస్థయందు వేఱొక కర్తచే వ్యాపారము నందుఁ బ్రవేశపెట్టఁబడినకర్త.

విశ్వామిత్రుఁడు రామునకు మిథిలంగానిపించెను—ఇందు ప్రయోజకర్తకు షష్ఠి కన్యాదియోగము (చూ.) నందు నిత్యము. (బా. వ్యా. క్రియా. 124)

**ప్రవృత్తి**

ప్రవర్తించుట.

ఒక వ్యాకరణ కార్యము లక్ష్యమందు తప్పక ప్రవర్తిలుట. 'బహుళ' సంజ్ఞ లోని యొక యంశము. (చూ.) బహుళము.

'అత్తునకు సంధిబహుళము' అనుచో వచ్చుచున్న+వాఁడు—తచ్ఛబ్దవకార లోపము. వచ్చుచున్న+ఆఁడు—ప్రవృత్తి : సంధిచేసి తీరవలయును——→వచ్చు చున్నాఁడు. అనియేకాని 'వచ్చుచున్నయాఁడు' అని యనరాదు.

(బా. వ్యా. సంధి 4; క్రియా. 117)

**ప్రశంసనార్థములు**

భళీ (బళి), మజ్ఝా మున్నగునవి. ఇవి కళలు.

**ప్రశ్న (ము)**

(i) ఏత్వము ప్రశ్నమందు వచ్చును.

వానలు గలవే ? (ఆం. భా. భూ. 154, 155)

(ii) ఓత్వముగూడ నగును.

నీవో, అతఁడో పరిగణింప (ఆం. కౌ. 745-46)

**ప్రశ్న లక్షణము**

ప్రశ్నార్థకము-ఏ, ఆ ఈ రెండు వర్ణములు ప్రశ్నలక్షణములు. ఉదా :- కాచితివే మమ్మునిపుడు కమలదళాక్షా, ప్రోచితివా మమ్మ నిపుడు భువనాధీశా మొ॥ (చింతా-క్రియా. 44) చూ:- ప్రశ్నాదివాచకము.

**ప్రశ్నవాచక సర్వనామములు**

ప్రశ్నమునుగావించు సర్వనామములు.

—ఎవఁడు, ఎవరు, ఏది, ఏవి, ఎవతె, ఎందఱు మున్నగునవి.

రావణుని సంహరించిన దెవరు ?

(సం. వ్యా. సర్వ. 18)

**ప్రశ్నార్థకము**

ప్రశ్నార్థక వాక్యముల తుదను వచ్చుగుర్తు ?

ఎవరక్కడ ? (సం. వ్యా. విరామ. 1)

**ప్రశ్నాదివాచకము**

(ప్రశ్న+ఆది, వాచకము) ప్రశ్న, సంప్రార్థన, సందేహ, ఆశ్చర్యార్థములను దెలుపు పదము. హల్లుపైవచ్చు అ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ, అను వర్ణములు ప్రశ్నాది వాచకములు ఉదా.- ఇతడా మముఁ బ్రోచునట్టి యిలవేల్పు సఖీ (ప్రశ్నార్థకము) రమ్మా మముఁగావవేగ రఘుకులనాథా (ప్రార్థనార్థకము) ఏమేమీ జగతింగఠోర ములు (ఆశ్చర్యార్థము) మొ॥ (అథ. కా. అజంత. 77)

**ప్రశ్నార్థ(క)ము**

ప్రశ్నించు నర్థము గలది.

(i) ఈ యర్థమునందు క్రియలకుఁగాని నామములకుఁగాని ఏకారాకారములు వచ్చును.

వానిని పోషించితివే ?

వానిని పోషించితివా ?

(ప్ర. వ్యా. 394; ప్రౌ. వ్యా. క్రియా. 2)

(ii) తద్ధర్మభూత క్రియలు ఆర్యాద్యర్థ పరకములయి ప్రశ్నార్థకములగును.

సద్ధర్మ మార్గమ్ము సలుపుదయ్య ↑

పంచితయ్య ↑ (ప్రౌ. వ్యా. క్రియా. 3)

ఇట్లువ్యాకర్త నిరూపించినను, వాక్యంత స్వరమునుబైకి బల్కుట చేతనే ప్రశ్న మేర్పడును గాని, ఆర్యాద్యర్థ, పరకత్వము చేఁగాదనితెలియును. వాక్యాంత స్వరమును సాధారణముగా నుంచిన ప్రశ్న మేర్పడదు.

## ప్రశ్నార్థ విశేషణము

ప్రశ్నించు విశేషణము.

ఏ బాలుఁడు ? (మ. ప. వ్యా. విశే. 2)

## ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము [ప్ర. వ్యా.]

కర్త : పుదూరి సీతారామ శాస్త్రి.

చిన్నయసూరి బాలవ్యాకరణమునకుఁ బూర్వము వెలసిన వ్యాకరణములలో నిది యొకటి.

బాలురకు సులభముగా వ్యాకరణ పరిజ్ఞానము కలిగించుటకై వివిధ పరిచ్ఛేదముల క్రింద, అనేక ప్రకరణ విభజనములతోఁ గూడిన ఈ వ్యాకృతిలో మొత్తము 398 ప్రశ్నములు వానికి సమాధానములు గలవు. ఇందు ఆంధ్రశబ్ద చింతామణి యనుసరింపఁబడినది.

## ప్రసజ్య ప్రతిషేధము

నిషేధార్థకమైన నకారము క్రియతో నన్వయించుట.

రాముఁడు బ్రాహ్మణుఁడు కాడు.

ఇట 'కాఁడు' అనుక్రియతో నిషేధము సంబంధించినది కావున, రాముఁడు బ్రాహ్మణజాతి లోని వాఁడు కాఁడని తక్కిన వర్ణములలో దేనికో చెందునని యర్థము. (ప్రసజ్య ప్రతిషేధోయం క్రియయా సహయత్ర నఞ్)

(గు. ప్ర. పుట. 100, 101)

## ప్రసృత్యాదులు

(ప్రసృతి+ఆదులు) ప్రసృతి మున్నగు శబ్దములకు పర్యాయ వాచకములగు దోసిలి మున్నగు శబ్దములు. అవి దోసిలి, పిడికిలి, గుప్పిలి, మొ॥ వీని లి వర్ణము

నకు ఎఁడు వర్ణకము పరమగునపుడు లోపము నిత్యముగా వచ్చును. ఉదా:- దోసెఁడు (దోసిలి+ఎఁడు), పిడికెఁడు (పిడికిలి+ఎఁడు), గుప్పెఁడు (గుప్పిలి+ఎఁడు) ఇత్యాదులు. (అథ. కారి. సంధి. 7)

### ప్రస్థాదులు

(ప్రస్థ+ఆదులు) ప్రస్థ పర్యాయ వాచకమగు తూము మున్నగు శబ్దములు. అవి తూము, కుంచము, మానిక, పుట్టి, పట్టియ మున్నగు మానార్థకములగు పదములు. వీనిపై పరిమాణార్థమున 'ఎఁడు' అను ప్రత్యయము వచ్చును. ఉదా:- తూమెఁడు, మానెఁడు మొ॥ (మం. అం. కౌ. 394) చూ:- మానార్థము,-ఎఁడు

### ప్రాంతీయ తత్సమములు

ఒకానొక ప్రాంతమునందు, అర్థవిపరిణామము నందిన సంస్కృత ప్రాకృత సమములు.

అనుమానము—సందేహము.

ఉచితము—డబ్బులేక ఊరక లభించునది.

జాతర—కొలుపులు.

జోగి—బిచ్చమెత్తుకొని బ్రతుకువాఁడు

ఈ యర్థములు తెలుఁగు దేశమునందు ప్రసిద్ధములు.

(తె. వా. వి. పుట. 393)

### ప్రాఁతాదులు

'ప్రాఁత' మున్నగునవి—ఆకృతిగణము.

ప్రాఁత, లేఁత, క్రొత్త, పూవు మున్నగునవి.

సమాసములందు వీని తొలియచ్చు మీఁది వర్ణముల కన్నింటికి లోపము బహుళముగా నగును.

ప్రాఁత + ఇల్లు < ప్రాయిల్లు / ప్రాఁతయిల్లు.

(బా. వ్యా. సంధి. 36)

### ప్రాఁదెనుఁగులు

ప్రాఁత తెనుఁగులు.

ప్రాచీనులు వ్యవహరించుకొన్న తెనుఁగు శబ్దములు.

పుడమి, సిరి, పడఁతి మొదలైనవి. (అప్ప. I. 113,114)

### ప్రాకృత భేదము

ప్రాకృత భాషా పదము లనేకములు తత్సమములుగా, తద్భవములుగా ఆంధ్ర భాష యందుఁ బ్రవేశించిన కారణముగా ఆంధ్రము కూడ నొకప్రాకృతభేదమే యగును. (అప్ప. I. 75)

### ప్రాకృత తత్సమములు

ప్రాకృత శబ్దములతో తుల్యములగు రూపములు.

జడ, జముఁడు, జాతర (ప్ర. వ్యా. సంజ్ఞా. 7)

### ప్రాకృత తద్భవములు

ప్రాకృతశబ్దముల నుండి వర్ణలోపాగ మాదేశ వికారములతో నేర్పడిన శబ్దములు.

పవడము, కంచు, కుమ్మరి, ఒజ్జ మున్నగునవి.

(ప్ర. వ్యా. సంజ్ఞా. 10.)

### ప్రాకృత తుల్యములు

చూ. ప్రాకృత సమములు.

ప్రకృతులందు మార్పులేక ప్రాకృతముల నుండి తెలుగునఁజేరినపదములు.

శ్రీః—సిరీ—సిరి.

గౌరవమ్—గారవమ్—గారవము.

యమః—జమో—జముఁడు. (బా. వ్యా. సంజ్ఞా. 19)

### ప్రాకృత భవములు

ప్రాకృతపదములు వర్ణలోపాగమాదేశములగు మార్పులతో తెలుఁగున ప్రభవించిన పదములు.

యజ్ఞః—జణ్ణో—జన్నము.

యాత్ర—జాతర—జాతర

ఉపాధ్యాయ—ఉవాజ్ఝాయ— ఒజ్జ.

కూష్మాండ—కుమ్హాండ—గుమ్మడి, ఇత్యాదులు.

(బా. వ్యా. సంజ్ఞా. 20)

**ప్రాకృతము**

ఒకానొక భాషాభేదము. ఇది భారతీదేవి శైశవ భాషణమని అప్పకవి పేర్కొనెను.

అప్పకవి ఐదు విధములగు ప్రాకృతములను పేర్కొనెను:- (i) ప్రాకృతము (మహారాష్ట్రి) (ii) శౌరసేని (iii) మాగధి (iv) పైశాచి (v) అపభ్రంశము.

(అప్ప. I. 72)

**ప్రాకృతరీతి**

తెలుఁగునందు తద్భవములు వర్ణములలోఁగాని, మాత్రలందుఁగాని మార్పుల వలన నేర్పడును.

ఈ మార్పులు సంస్కృతమునుండి ప్రాకృత భాషా పదము లేర్పడు రీతిని నేర్పడినవని భావింపఁబడుచున్నది. (క. సం. వి. III-1)

**ప్రాకృత సమములు**

చూ. ప్రాకృత తత్సమములు.

ప్రాకృత రూపములతో సమానమైన రూపములుగల పదములు.

ప్రాకృత భాషలు సంస్కృతమునుండి ప్రభవించినవియే కావున ప్రాకృత సమములన్నియు సంస్కృత భవములేయగును కావున ఈ విభాగము గౌరవమని భావించువారుగలరు. ఇది చాల పదముల విషయములో సత్యమేకాని సంస్కృత యకారము తెలుగున లోపించును. యశము—అసము కాని సంస్కృత యకారము ప్రాకృతమున జకారమై తెలుగున దన్త్యజకార మగును. ఇట్టివి ప్రాకృత సమములనక తప్పదు. యమః - జమో - జ ముఁడు.

(తె. వ్యా. వి. పుట. 224)

**ప్రాగభావము**

ప్రాక్+అభావము.

వస్తూత్పత్తికి ముందున్న అభావము. భావి (చూ.) యనునది ప్రాగభావమునకు ప్రతియోగి. (శత్రువు) (గు. ప్ర. పుట. 868) (బా. వ్యా. క్రియా. 4)

**ప్రాఙ్నన్నయ యుగము**

నన్నయ యుగమునకు పూర్వమందున్న యుగము. ఈ యుగమునందు శాసనములే కాని కావ్యములు మృగ్యములు.

(i) ఇట్టి యుగమందలి భాషా విశేషములను ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు రచించిరి.

(ii) ఈ శాసన భాషకు వర్ణనాత్మక వ్యాకరణమును ఆధునిక పద్ధతులలో డాక్టర్ బూదరాజు రాధాకృష్ణగారు రచించిరి.

**ప్రాచీన ప్రాతిదేయపదములు**

ప్రాచీనకాలమునందే ఎరవు గొనఁబడిన పదములు. స్వభాషాపదములు అనఁగా దేశ్యములుకాక తక్కిన పదములన్నియు ప్రాతిదేయములే. సంస్కృత ప్రాకృత భాషలనుండి సమ, భవ, రూపములలోఁ దెలుఁగునఁ బ్రవేశించిన పదము లన్నియు నిట్టికోవకుఁ జెందినవిగా ఆధునికుల భావన. (ancient loan words) (తె. వ్యా. వి. పుట. 849)

**ప్రాచీన తత్సమములు**

తత్ + సమములు — ఒక భాషనుండి మఱియొక భాషలోనికి రెండు విధము లుగా పదములు ప్రవేశించును: (i) తత్సమములు (ii) తద్భవములు.

ప్రాచీన కాలమునందే సంస్కృత ప్రాకృత భాషల నుండి సమరూపములతోఁ దెలుఁగునఁ బ్రవేశించిన పదములు ప్రాచీన తత్సమములు.

రామః—రాముఁడు

యమః—జమో—జముఁడు

(చూ.) (వ్య.) అర్వాచీన తత్సమములు, నవీన తత్సమములు

(తె. వ్యా. వి. పుట. 189)

**ప్రాచీన తద్భవములు**

ప్రాచీన కాలమందే సంస్కృత, ప్రాకృతములనుండి వర్ణలోపాగమాదేశవిధాన ములతోఁ దెనుఁగునఁ బ్రవేశించిన పదములు.

పదమధ్యమందు దీర్ఘములు లేకుండుట, సంయుక్త వర్ణములు లేకుండుట మున్నగునవి వీని ముఖ్యలక్షణములు.

అమావాస్య—అమవస.

సంతోషము—సంతసము, ఇత్యాదులు.

(తె. వ్యా. వి. పుట. 206)

**ప్రాచుర్యార్థము**

వ్యాప్తిని తెల్పునట్టి యర్థము.

ఈ యర్థమునందు సంస్కృత ప్రత్యయమగు—మయట్ తెనుఁగు శబ్దముల మీదను జేరుట గమనింపనగును.

ప్రోవుల మయము. (ప్రౌ. వ్యా. తద్ధిత. 18)

**ప్రాణగొడ్డము**

దీనిని చిన్నయసూరి గ్రామ్యముగాఁ బరిగణించెను. కాని బహుజనపల్లి సీతారామాచార్యులవారు దీనిని 'ప్రాణకుట్టుక' శబ్దభవమని, ఇది 'అంచయాన' వంటి సామాసిక తద్భవమని ప్రకటించి, గ్రామ్యతాదోషమును దొలఁగించుటకుఁ బ్రయత్నించిరి.

ఆంధ్ర వర్ణఘటితమగు 'కుట్టక' శబ్దము 'గొడ్డమ' గుటట్లుంచి, అనాంధ్ర వర్ణఘటితమగు 'ప్రాణ' శబ్దము తప్పక మాఱవలసి యున్నది. అప్పటికిఁగాని దానికి తద్భవత్వము సిద్ధింపదు. హంసయాన—అంచయాన యగుటలో రావలసిన చోట మార్పు రానే వచ్చినది.

(బా. వ్యా. సంజ్ఞా. 28; ప్రౌ. వ్యా. సంజ్ఞా. 12)

**ప్రాణములు**

సంస్కృత వ్యాకరణమున చెప్పఁబడిన అచ్చులకు తెనుఁగు వ్యాకరణమందలి సంజ్ఞ. అ ఇ ఉ ణ్, ఋ ౡ క్, ఏ ఓ ఙ్, ఐ ఔ చ్ అను మాహేశ్వర సూత్రములందు అ మొదలుకొని ఔ వరకు చెప్పఁబడిన అచ్చులు తెనుఁగు వ్యాకరణమున సామాన్యముగ ప్రాణములనఁబడును.(చింతా. సంజ్ఞా. 27; అప్ప. II.24; ప్ర. వ్యా. 24; ల. వ్యా. సంజ్ఞా. 24.)

**ప్రాణసంధులు**

అచ్చులకుఁగల్గు సంధులు.

మీఁది శబ్దములలోని ఆది వర్ణములు. స్వరములైనచో అవి ప్రాణసంధులగును.

రాముఁడు+ఆతఁడు ⟶ రాముఁడతఁడు

(అప్ప. V. 34, 35)

**ప్రాణులు**

ప్రాణములు గలవి. (చూ.) ప్రాణములు.

ప్రాణములగు అచ్చుల సాయముతో నుచ్చరింపఁబడునవి.

కి, కొ, కె (అప్ప. II. 14; ల. వ్యా. సంజ్ఞా. 29)

**ప్రాతిపదికము**

(i) ధాతుభిన్నమై, ప్రత్యయభిన్నమై, ప్రత్యయాంత భిన్నమై అర్థవంతమగు శబ్దరూపమును, కృదంత శబ్దములును, తద్ధితాంత శబ్దములును, సమాస శబ్దములును – ఈ నాలుగు ప్రాతిపదిక సంజ్ఞకములు. (అష్టా.) తెలుఁగున నీ ప్రాతిపదికములు 'నామము' లని వ్యవహరింపఁబడును. (చింతా. సంజ్ఞా. 24) ఉదా:- రామ, కృష్ణ, మేత, కోత,జాలరి మున్నగునవి. దేశ్యపదములందు ప్రాతిపదికమే ప్రథమైక వచనమై పరగును. (ఆం. కౌ. 250-257)

**ప్రాతిపదికార్థము**

ప్రాతిపదికము యొక్క అర్థము.

నియతమైన అర్థస్ఫురణము కలది ప్రాతిపదికార్థము.

రాముఁడు, రావణుఁడు—అనుచో రామ, రావణ అను ప్రాతిపదికల యర్థము నియతమైన స్ఫురణము కలది. (బా. వ్యా. కారక. 1)

**ప్రాది తత్పురుషము**

ప్ర+ఆది ⟶ ప్రాది

'ప్ర' మున్నగు నుపసర్గ లాదియందుఁగల తత్పురుష సమాసము.

ప్రాచార్యుఁడు. (సు. వ్యా. సమాస. 51)

**ప్రాదులు**

ప్ర+ఆదులు.

ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప—

వీనికే ఉపసర్గములనియు (చూ.) వ్యవహారము.

(సు. వ్యా. సమాస. 51)

**ప్రాధాన్య వివక్ష**

ప్రాముఖ్యమును జేకూర్పవలయునను ఇచ్ఛ. 'కర్మ' మున్నగువానికి ప్రాధాన్యమును జేకూర్పవలయునను ఉద్దేశ్యము. అట్టిచో ధాతుజ విశేషణ ముపయుక్తము.

రాముఁడు భృత్యుని రక్షించెను (కర్మ)—ఇందు కర్తయగు రామునకే ప్రాధాన్యము. ద్వితీయావిభక్తిలోనున్న కర్మ అప్రధానము. దీనిని ప్రథమాంతము చేసినపుడే ప్రాధాన్యము సమకూరును. అట్లు చేకూరవలెనన్న ధాతుజవిశేషణము నుపయోగింపవలెను. అపుడు కర్తకు, కర్మకు ప్రాధాన్యము కల్గును.




(బా. వ్యా. సమాస. 26; రమణీ. 869)

**ప్రాప్త విభాష**

ఏ సూత్రముచేనయిన నిత్యముగాఁ బ్రాప్తించుచున్న కార్యమును వికల్పముగా విధించునది.

"కర్మధారయంబులం దుత్తునకచ్చుపరంబగునపుడు టుగాగమంబగు" అను సూత్రముచే నిత్యముగాఁ బ్రాప్తమగుచున్న 'టు'గాగమము "కర్మధారయంబునందు పేర్వాది శబ్దములకచ్చు పరంబగునపుడు 'టు'గాగమంబు విభాషనగు" అను సూత్రముచే వికల్పితమగుచున్నది.

ఇది ప్రాప్తవిభాష.

(బా. వ్యా. సంధి 28, 29; రమణీ. 68, 69 పుటలు)

**ప్రాప్తా ప్రాప్త విభాష**

ప్రాప్త+అప్రాప్త విభాష. (చూ.)

ఏదేని యొక కార్యము వికల్పముగా ప్రవర్తింపవలసిన రూపములలో, కొన్ని భాగములందు వేఱొక సూత్రముచే అంతకుముందే నిత్యముగా ప్రాప్తించు చుండుటయు; కొన్ని భాగములందు అసలే ప్రాప్తింపకుండుటయు ప్రాప్తా ప్రాప్త విభాష యగును.

ఇట్టిది తెలుఁగున నొక్కటియుఁ గానరాదని రమణీయకర్తలు పేర్కొనిరి.

(రమణీ. పుట. 66-67)

**ప్రామాణిక ప్రయోగములు**

నాచన సోమనాథుఁడు, పింగళి సూరనార్యుఁడు మున్నగు మహాకవులు కావించిన ప్రయోగములు. వీనిని గూడ పరిగణించి, లక్షణము నేర్పఱుప వలయునని కొందఱమతము (ప్రౌ. వ్యా. సంధి. 3)

**ప్రామాణిక భాష**

ప్రమాణీకరింపఁబడిన మాండలిక భాష (Standard dialect)

లండన్ నగర పరిసర మాండలిక భాష సమస్త రాజకీయ, సారస్వత వ్యవహారములకు నుపయుక్తమగు చుండుటచే ఆ భాష ప్రామాణిక భాషగా ఆంగ్లేయులచేఁ బరిగణింపఁబడెను.

నేఁడు కృష్ణా, గుంటూరు మండలములలోని శిష్టుల భాష పత్రికలందు, రేడియోలయందు, కొన్ని సారస్వత ప్రక్రియలయందు నుపయుక్త మగుచున్న కారణముగా నది వ్యవహార ప్రామాణిక భాషగా పరిగణింపనగును. (Colloquial Standard dialect) (తె. వ్యా. వి. పుట. 149)

**ప్రాయికము**

తఱుచుగానగుట.

ఇందు మూఁడు విధానములు సూచింపఁబడును. వ్యాకరణ కార్యములు.

1. సామాన్యముగాఁ గలుగుట.
2. క్వాచిత్కముగాఁ గలుగకుండుట.
3. ఒక్కొక్కచో వికల్పముగాఁ గలుగుట.

"ఖండ బిందువు మీఁది సిద్ధ చకారమునకు ముత్తు పరమగునపుడు పకారము ప్రాయికముగ నగు"ననుచో

తలఁపక, త్రేఁపక, తోఁపక అని సామాన్యముగా పకారము వచ్చును.

కాని 'నోఁచు'నకు మాత్రము పకారము గలుగదు—నోఁచక.

'ఏఁచు'నకు విభాషగాఁగలుగును:

ఏఁపక, ఏఁచక. (బా. వ్యా. క్రియా. 89)

**ప్రారబ్ధవాక్య పరిసమాప్తి**

ప్రారంభించిన వాక్యమును బరిసమాప్తము గావించుట.

ఇట్లు పరిసమాప్తము గావించునపుడు 'అనినన్' అని ప్రయుక్తమగును.

"........తదర్థమ్మెయరిగెద నాసఁజేసి | యనిన నందలునగి."
(ప్రౌ. వ్యా. వాక్య. 10)

**ప్రారబ్ధాపరిసమాప్తము**

ప్రారంభింపఁబడి పరిసమాప్తి నందనిది.

'వచ్చుచున్నాఁడు'—వచ్చుట యనుధాత్వర్థము ప్రారంభమై పరిసమాప్తము కాలేదు. ఇట్లు పరిసమాప్తమును జెందని క్రియనే వర్తమానార్థక క్రియ యందురు.

(బా. వ్యా. క్రియా. 2)

**ప్రార్థనము**

వేఁడుట

ప్రార్థనమునందు ఏత్వము వచ్చును.

వనితరావే, పోవే

రావేయీశ్వర, కావవేవరద

(ఆం. భా. భూ. 154, 155; ఆం. కౌ. 745-'46)

**ప్రార్థనాదులు**

ప్రార్థన, ఆజ్ఞ, కోరిక, ఇత్యాదులు. ఇట్టి భావములందు 'అన్' ప్రత్యయాంత క్రియలకు 'ఇమ్ము' పరమగునపుడు 'ఈ' అనునది విభాషనగును.

ఉండనిమ్ము—ఉండనీ

ఇట్లే వివనీ, పొడమనీ. కనసీ. (ప్రౌ. వ్యా. క్రియా. 10)

**ప్రార్థనార్థ(క)ము**

మధ్యమ పురుషైక బహువచనములయందు క్రమముగా ము, ఁడు, వర్ణములు ధాతువు తుదిని చేర్చుట వలన నిష్పన్నములగు క్రియారూపములు ఈ యర్థ ముఁదుండును.

పోషింపుము—పోషింపుఁడు

కొట్టుము—కొట్టుఁడు (సం. వ్యా. ప్రార్థనా. 1)

**ప్రార్థనాదులు**

ప్రార్థన, సమ్మతి మున్నగు నర్థములు.

ఈ యర్థములందు—ఇమ్ము అను శబ్దము 'అన్' ప్రత్యయాంత క్రియల కగును. దానికి 'ఈ' కారము విభాషగా నాదేశమగును.

ఉపవాస ముండనిమ్ము—ఉపవాసముండనీ

కననిమ్ము - కననీ (ప్రౌ. వ్యా. క్రియా. 10)

**ప్రాసంగిక వ్యాకరణములు**

వ్యాకరణము ప్రధానముగాఁగాక ఛందోలంకారాద్యనేక విషయములతోపాటు ప్రసంగవశమున పేర్కొనఁబడిన వ్యాకరణాంశములుగల లక్షణ గ్రంథములు - కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందము మున్నగునవి.

(తొలి ప్రాసంగిక వ్యాకరణము - భారతి : ఫిబ్రవరి 1968)

**ప్లుతము**

మూఁడు హ్రస్వముల యుచ్చారణ కాలముగల యచ్చు.

విష్ణూ[3], శంభూ[3] (సం. సా. సం. విభక్తి. 76; బా. వ్యా. తత్సమ. 85)

**ప్రేరక సంప్రదానము**

ప్రేరేపణము గావింపఁబడిన సంప్రదానము (చూ.) త్రివిధములగు సంప్రదానములలో నొకటి.

గురుపుత్ర్యుఁడగ్రజు కొఱకు నావు నిచ్చెను.

(ఆం. శా. 452-454)

**ప్రేరణకర్త్రర్థకము**

ప్రేరేపించుకర్తగలది

చైత్రుఁడు మైత్రుని మనిచెను.

చైత్రుడు - ప్రేరణకర్త. (బా. వ్యా. క్రియా. 184)

**ప్రేరణకర్మార్థకము**

ప్రేరేపింపఁబడిన కర్మ కలది.

చైత్రుని చేత మైత్రుఁడు మనుపఁబడియె.

మైత్రుఁడు - ప్రేరణకర్మ. (బా. వ్యా. క్రియా. 124)

**ప్రేరణము**

(i) ఇతరులచేత పని చేయించుట.

చైత్రుఁడు మైత్రునిచే వంట చేయించెను.

(ii) అన్ని క్రియలకుఁ బ్రేరణమునందు 'ఇంచు(క్)' అగును.

సుగ్రీవుఁడు రామునిచే వాలినిఁ జంపించెను.

(ల. వ్యా. క్రియా. 12; బా. వ్యా. క్రియా. 70)

**ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము**

క్రియాఫలము కర్తకేచెందునట్లుగా నితరులను బ్రేరేచుట.

చైత్రుఁడు మైత్రుని మనుచుకొనియెను.

ఇందు—కొను ధాతువు ఆత్మనే పదార్థమందుఁజేరును.

**(బా. వ్యా. క్రియా. 124)**

**ప్రేరణాత్మనేపద కర్మార్థకము**

క్రియాఫలము కర్తకే చెందునట్లుగా కర్మ ప్రేరేపింపఁబడుట.

ఇట కర్త తృతీయావిభక్తియందును, కర్మ ప్రథమావిభక్తియందు నుండును.

చైత్రునిచేత మైత్రుఁడు మనుచుకొనఁబడియెను.

(బా. వ్యా. క్రియా. 124)

**ప్రేరణార్థకము**

(i) ప్రేరకుఁడు కర్తగాఁగల యర్థము.

రాజుసైనికులచే శత్రువులను జంపించెను. (ల. వ్యా. క్రియా. 20)

(ii) అన్నంత క్రియకు (చూ.) 'చేయు' అను సహాయక్రియను జేర్చిన ప్రేరణార్థక మగును.

చొక్కుచు, చొక్కఁజేయుచు. (ప్రౌ. వ్యా. క్రియా. 18)

**ప్రేరణేంచుక్కు**

ప్రేరణ+ఇంచుక్కు

స్వార్థము నందుఁగాక, ప్రేరణార్థమునందువచ్చు 'ఇంచు'(క్)' అను ఆగమము.

ఇది పరమగునపుడు పకారము చకారమగును.

పచించు+ఇంచు——→పచించించు——→పచింపించు

**(బా. వ్యా. క్రియా. 87)**

**ప్రోక్తార్థము**

'చెప్పఁబడిన' అను నర్థము.

ఒకానొక తద్ధిత వృత్తి భేదము. పాణినిచేఁ జెప్పఁబడిన వ్యాకరణము—పాణినీయము. (ఆం. భా. శా. సమాస 88)

**ప్రౌఢ వ్యాకరణము**

బహుజనపల్లి సీతారామాచార్యుల వారిచే విరచితమైన "త్రిలిఙ్గ లక్షణ శేషము" (చూ.) అను వ్యాకరణమునకు సుప్రసిద్ధమగు వ్యవహారనామము.

బాలవ్యాకరణము (చూ.)నకుఁ బూరకముగా రచింపఁబడిన దగుటచే దీనికి ప్రౌఢ వ్యాకరణమను ప్రసిద్ధి యేర్పడియుండును.

ప్రౌఢ కవి ప్రయోగములకు లక్షణమేర్పరచుటను బట్టి కూడ దీనికి పేరు కల్గియుండవచ్చును.

**ప్లుతము**

త్రిమాత్రా కాలికమగు అచ్చు. కొందఱ మతమున సంబోధనమున ఉదంతములకంటె డుజ్ఞు, అదాగమమునురాక ప్లుతము వచ్చును. ఉదా:- ఓవిష్ణూ, ఓశంభూ (చింతా. అజంత. 45)

**ఫ**

ఉభయోష్ఠ్య స్పర్శము (bilabial stop)

పై పెదవి స్థానము.

క్రింది పెదవి కరణము.

స్పర్శము.

శ్వాసము.

మహాప్రాణము.

ఫణము, ఫాలము — ఇత్యాది సంస్కృత సమములనుగూడి తెలుఁగున వ్యవహరింపఁబడును.

**ఫ**

దన్త్యోష్ఠ్య స్పర్శము (labic-dental stop)

పై దన్తముల క్రింది భాగము - స్థానము

క్రింది పెదవి - కరణము

స్పర్శము

శ్వాసము

మహాప్రాణము

కాఫీ, ఆఫీసు, ఫీజు - ఇత్యాదిగాఁగల ఆంగ్లభాషా సమములనుగూడి తెలుఁగున వ్యవహరింపఁబడును.

ఫు

శబ్దము నందలి రెండవ వర్ణమునకు సంజ్ఞ. (వై. చం. సంజ్ఞా. 12) గుగ్గులౌ ఫోః (వై. చం. తద్భవ. 54) మున్నగు సూత్రములలో నీ సంజ్ఞ ఉపయుక్తము.

బ

ఉభయోష్ఠ్య స్పర్శము (bilabial stop)

పైపెదవి—స్థానము

క్రింది పెదవి - కరణము

స్పర్శము

నాదము

అల్పప్రాణము

-బంటి

లోఁతును దెలియఁజేయు తద్ధితప్రత్యయము - కుత్తుక *బంటి*

ఈ ప్రత్యయము తత్సమ పదముల మీఁదఁగూడ గానవచ్చును.

కటి *బంటి* నెత్తురు కాలువల్. (ప్రౌ. వ్యా. తద్ధిత. 17)

బంట్యాదులు

(బంటి+ఆదులు) బంటి, కొలఁది యను శబ్దములు. ఇవి దఘ్నార్థము (పరిమాణార్థము) న వచ్చును. ఒకానొకచోట వీనికి పూర్వమందు నకారము వచ్చును. ఉదా:- ముక్కున బంటి నీరు, ముక్కుబంటినీరు; ముక్కుకొలఁది; మోకాలి కొలఁది మొ॥ (అథ. కా. అజంత. 56)

బలుపుప్రాయి

పెద్దవర్ణమని యర్థము.

ఇది దొడ్డళకారము. (అప్ప. II. 17)

బల్లిదాదులు

'బల్లిద' మున్నగు అచ్చ తెనుఁగు శబ్దములు.

ఇవి సంస్కృత తుల్యములు. మహత్త్వమున వీనికుత్వడు జాదులు, అమహత్త్వి మున 'ము' వర్ణకాదులు స్త్రీత్వమునందాలు శబ్దము తోడ సమాసమును గలుగును,

బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు.

అక్కజుఁడు - అక్కజము - అక్కజరాలు

అక్కజ, కావల, బెట్టిద, బెడిద మిసిమింత మున్నగునవి.

(కవిజనాం. 53, 54 పత్రములు; బా. వ్యా. అచ్ఛిక. 8)

**బహుపద బహువ్రీహి**

(i) చలికాఁక, సెకకంటి—వంటివి (ఆం. కౌ. 615)

(ii) సమాసోత్తరపదమునకు నవ్యవహిత పూర్వముగానున్న పదమునకుఁ బుంవద్భావము వచ్చును.

మృద్వీపటుభార్యుఁడు (మృద్వీపట్వీభార్య) (త. చం. 645-క (8)

**బహువచనము**

(i) బహుత్వ సంఖ్యను బోధించు ప్రత్యయము. 'లు' వర్ణకము బహువచన మందగును.

(ii) కొన్ని తత్సమాచ్ఛిక శబ్దములమీఁది బహువచన లకారమునకు రేఫ మాదేశమగును.

బాలురు, దయాళురు,

నెయ్యురు, మార్తురు, అల్లురు

(బా. వ్యా. తత్సమ. 12, 38; అచ్ఛిక. 5)

**బహువచనాంత తుల్యములు**

బహువచన ప్రత్యయ మంతమందుఁగల రూపములతో సమానములు.

కొన్ని యవ్యయములు బహువచనాంత తుల్యములు.

అట్లు, ఇట్లు, ఎట్లు (ప్రౌ. వ్యా. శబ్ద. 34)

**బహువ్రీహి**

ఏ వస్తు వెవ్వరికిఁగలదో ఆ వ్యక్తిని దెలుపునది.

అన్యపదార్థ ప్రధానము.

స్త్రీ సమముల తోడనే తెలుఁగున బహువ్రీహి సమాస మేర్పడును.

ముక్కంటి, నలువ.

(ఛం. ద. IV. 92; ఆం. కౌ. 478; బా. వ్యా. సమాస. 2,6)

**బహుళము**

విధింపఁబడిన కార్యము.

(i) కొన్నిచోట్ల తప్పక వచ్చుట.

(ii) కొన్నిచోట్ల నసలే రాకపోవుట.

(iii) కొన్నిచోట్ల వైకల్పికముగా వచ్చుట.

(iv) కొన్నిచోట్ల పేర్కొన్న దానికంటె భిన్నముగా వచ్చుట అనెడి యర్థములు గలది.

ఈ నాల్గింటినే, ప్రవృత్తి, అప్రవృత్తి విభాష, అన్యత్, (చూ.) అని వ్యవహారము. 'అన్యత్'ను 'అవిహితకార్యప్రసక్తి' అని మ. ప. వ్యా. (సంధి-6) నందుఁగలదు. (చూ.)

"క్వచిత్ప్రవృత్తిః, క్వచిదప్రవృత్తిః
క్వచిద్వి భాషా, క్వచిదన్యదేవ
విధేర్విధానం, బహుధాసమీక్ష్య
చతుర్విధం బాహుళకం వదన్తి"

అనికాశికావృత్తికారవచనము. 'అత్తునకు సంధి బహుళము' అనుచో

(i) ప్రవృత్తి : వచ్చుచున్న+వాఁడు ⟶ వచ్చుచున్న+ఆఁడు ⟶ వచ్చుచున్నాఁడు. (బా. వ్యా. క్రియా. 117)

(ii) అప్రవృత్తి : వెల+ఆలు ⟶ వెలయాలు.

(iii) విభాష : మేన+అత్త ⟶ మేనత్త, మేనయత్త.

(iv) అన్యత్ : ఒక+ఒక ⟶ ఒకానొక (గు. ప్ర.)

(బా. వ్యా. సంధి. 4)

**బహ్వర్థకము**

బహు+అర్థకము.

అనేకమును దెల్పునది.

అందఱు, ఇందరు, కొందఱు, పెక్కండ్రు

(ల. వ్యా. అచ్చ. 78; బా. వ్యా. అచ్చిక. 24)

**బాధకము**

బాధించునది. అనఁగా తొలఁగించునది.

సర్వసాధారణముగా విశేషవిధి, సామాన్య విధికి నిత్యముగా బాధకమగును. కాని తెనుఁగునందు విశేష భావార్థక తద్ధిత ప్రత్యయమగు —టిక వర్ణకము సామాన్య భావార్థక తద్ధిత ప్రత్యయమగు—'తనము' అను దానిని విభాషగా బాధించును.

చిన్నతనము—చిన్నతికము.

నల్లఁదనము—నల్లన. (బా. వ్యా. తద్ధిత. 2,3,6)

**బాలకవిశరణ్యం**

[ ప్రయోగ దీపిక ]

కర్త : రావుసాహెబ్, మహోపాధ్యాయ

గిడుగు వెంకట రామమూర్తి పంతులు

ప్రథమ ముద్రణం : 1933.

ద్వితీయ ముద్రణం : 1958 (విశాలాంధ్ర)

గ్రామ్యములుగా నిరసింపఁబడిన అనేక కవి ప్రయోగము లిందు సమర్థింపఁబడినవి.

ప్రాచీనాంధ్ర భాషా పరిణామముగా నీ ప్రయోగములు స్వీకరింపఁబడినవి.

**బాలచంద్రోదయము**

కర్త : బహుజనపల్లి సీతారామాచార్యులు.

ప్రచురణ : 1921-వావిళ్ళవారు.

ఖండ బిందువుగల పదములు వాని యర్థములతో నిందు ప్రత్యేకముగా అకారాది క్రమమున ముద్రితములు.

**బాలవ్యాకరణగుప్తార్థప్రకాశిక**

కర్త : కళాప్రపూర్ణ మహోపాధ్యాయ

శ్రీ కల్లూరి వేంకట రామశాస్త్రి.

క్రీ.శ. 1915లో ప్రకటితము.

బాలవ్యాకరణమునకు వెలసిన తొలి వ్యాఖ్యానము. ఇందలి రూప సాధనము ప్రయోగ ప్రదర్శనము, సంజ్ఞా వివరణాదులు మిక్కిలి ప్రదర్శనీయములు.

కాని దీనిలోని బాలవ్యాకరణము హరికారికలకు (చూ.) అనువాదమను వాదము మాత్రము మెచ్చఁదగినది కాదు.

బాలవ్యాకరణమునకు సంస్కృతీ కరణమే హరికారికలను సత్యము బ్రహ్మశ్రీ దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు స్థాపించిరి. (చూ. బాలవ్యాకరణ సమీక్షా గ్రంథము—రమణీయము ఉపోద్ఘాతము )

**బాల వ్యాకరణము**

కర్త: పరవస్తు చిన్నయసూరి

ప్రథమ ముద్రణము: క్రీ.శ. 1858.

ఇన్ని ముద్రణము లందినది; ఇంతగా పఠనపాఠనము లందున్నది; ఎన్నో వ్యాఖ్యానములు, టీకలు, సమీక్షలు గల్గినదియనగు వ్యాకరణము తెలుఁగునకు, మఱొక్కటిలేదు.

"గ్రహణ ధారణ పటుఃబాలః" అను తార్కికోక్తి ఇందలి 'బాల' శబ్దమునకు బాగుగా అనువర్తించును.

ఈ వ్యాకరణమందలి సాంకేతిక కల్పనా నైపుణ్యము, సూత్రరచనాపటుత్వము, వివరణ వైశద్యము, ఉదాహరణ ప్రదర్శన చాతుర్యము, అసాధారణములు, ప్రశంసనీయములు.

**బాల వ్యాకరణ స్వారస్య సర్వస్వ పేటిక**

బాల వ్యాకరణమునకుఁగల టీకలలోఁ బ్రసిద్ధమైనది.

కర్త: విద్వాన్ దూసి రామమూర్తిశాస్త్రిగారు. వావిళ్లవారిచే నిది 1937లోఁ బ్రకటింపఁబడెను.

మూలప్రాయములైన చిన్తామణి సూత్రములను నిర్దేశించుచు, ప్రక్రియను జక్కఁగాఁ బ్రదర్శించుపట్ల విశేషశ్రద్ధ వహించిన టీకయిది. పునర్ముద్రణమును గూడ నందినది. దీనికి 'గ్రాంథికాంధ్ర కల్పకము' అను నామాంతరమును బేర్కొనఁబడెను.

**బాల వ్యాకరణోద్ద్యోతము**

కర్త: 'కళాప్రపూర్ణ' వజ్ఝల చిన సీతారామశాస్త్రి

ఇందు బాలప్రౌఢవ్యాకరణ సూత్రము లనేకములగు సవరణములతో రచింపఁబడినవి. తత్సమ భాషాస్వరూపము—సంధి, కృత్, తద్ధిత, సమాస పరిచ్ఛేదములలో విపులముగాఁబ్రదర్శితము. ఇందు సమన్వయముకన్న ఖండనము మిన్నగాఁ గనుపట్టును.

**బాహుప్రభృతులు**

బాహు, రాహు, కేతు, బిందు, రజ్జు మున్నగునవి.

వీని 'వు' వర్ణకమునకు లోపము విభాషగానగును.

(వ్యా. బా. వ్యా. శబ్ద. 92)

**బాహ్యకరణము**

బయటి నుండి గ్రహించిన సాధనము.

దేవదత్తుఁడు కత్తిచేత చెట్టును నఱకు చున్నాఁడు.

(వ్య.) శారీర కరణము. (చూ.) (ఆం. కౌ. 446-448)

**బిందుకము**

అర్ధబిందువునకు సంజ్ఞ. (వై. చం. సంజ్ఞా. 27) ఈ సంజ్ఞ వై. చం యందు మాత్రమే ప్రయోగింపఁబడినది. (వై. చం. అజంత. 58)

**బిందుపూర్వక 'డులు'**

-ండులు.

పల్లు, ఇల్లు, కొడవలి, ఇత్యాది పదములకు బహువచనమందు '-ండులు' అనువర్ణము లంతి మాక్షరమున కాదేశమగును.

పల్లు—పండులు, పండ్లు.

ఇల్లు—ఇండులు, ఇండ్లు.

కొడవలి—కొడవండులు, కొడవండ్లు. (ఆం. కౌ. 270-272

**బిందువు[1]**

అనుస్వారమును బిందు వనఁబడును. ఇది వర్గ పంచమాక్షరములకుఁ బ్రాతి నిధ్యము వహించును.

ఙ
ఞ
ణ
న
మ } → [ం]

(అప్ప. II. 14)

**బిందువు[2]**

వాక్య పరిసమాప్తిని సూచించు చిహ్నము /./ ఇది నాలుగు మాత్రల కాలపు విరతిని దెలుపును. ఇది యాంగ్ల భాషా ప్రభావమునఁ దెనుఁగు రచనలో ఆధునిక ముగాఁ బ్రవేశించెను.

పాపమునకు భయపడుము. మనుష్యుల కోపమునకు భయపడకుము.

(సం. వ్యా. విరతులు. 1)

-బిడ

తదాది (ఆ, ఈ, ఏ అను) శబ్దములపై స్త్ర్యర్థమున వచ్చు దేశ్య శబ్దము.
ఉదా :- ఆబిడ, ఈబిడ, ఏబిడ (మం. ఆం. కౌ. 390)

బిరుద శబ్దములు

బిరుదములను తెలుపు శబ్దములు. ఉదా :- చౌహత్తమల్లుఁడు. జగనొబ్బ గండఁడు, స్వామిద్రోహరగండ లాంఛనుఁడు, హనుమంత బిరుదాంచితుఁడు మొ॥ (అథ. కా. హలంత. 10)

బిరుదాద్యుత్తర పదము

బిరుదముగాని, జాతి సూచకమగు శబ్దముగాని, కర్మధారయ సమాసమునందు ఉత్తర పదమగుచో, స్త్రీ, పుం, సంజ్ఞాసూచకమగు పూర్వపదముయొక్క (సాంస్కృతి కాచ్ఛిక మిశ్రసమాసములలో) దీర్ఘము బహుళముగా వచ్చును.

రామాశాస్త్రి, రామానాయఁడు, ఎల్లా సెట్టి, ఎఱ్ఱాప్రెగ్గడ, చిన్నాదేవి;

ఎఱ్ఱప్రెగ్గడ, కృష్ణశాస్త్రి (ప్రౌ. వ్యా. సమాస. 25)

బొట్టు

సున్న, చుక్క, అనుస్వారము.

ఇది తెలుఁగు భాషలో వర్గ ప్రథమ తృతీయ వర్ణములకు ముందేవచ్చును.

వంక; కంచము, పంట, వంత, పంపు (అప్ప. II. 11)

-బోఁడి

బహువ్రీహిని స్త్రీవాచ్య మగునపుడు ఉపమానము మీఁది 'మేను' శబ్దమునకు —'బోఁడి' యాదేశమగును.

అలరువంటి మేనుగలది ⟶ అలరు బోఁడి

ఇట్లే చిగురుంబోఁడి, ననబోఁడీత్యాదులు.

(బా. వ్యా. సమాస. 28)

బ్రతుకు ప్రకృతులు

'బ్రతుకు' మున్నగు పదములు.

వీని 'త' కారము బహుళముగా 'ద' కారమగును. ఇట్లు వర్ణనాత్మకముగాఁ బేర్కొనఁబడినను, నన్నయాది ప్రాచీన కవులు 'ద' కారమధ్యములగు పదములనే వాడుక చేసిరి. శ్రీనాథాది కవుల నుండి 'త' కార మధ్యములగు పదముల వాడుక హెచ్చెను. ఇట్లు మారుటకు కారణము శ్వాసమగు కకారమని తోచును.

శ్వాసము, ప్రక్కనున్న నాదమును శ్వాసముగా మార్చినది. ఇట్టి మార్పును 'పాక్షికవర్ణ సమీకరణ' మందురు. (Partial assimilation) (చూ.)

బ్రతుకు/బ్రదుకు

ఉతుకు/ఉదుకు

ముతుక/ముదుక

అతుకు/అదుకు మున్నగునవి. (వ్యా. భా. వ్యా. 461)

**'బ్రహ్మ' శబ్దము**

(i) ఇది మహద్వాచకము. పుంలింగము. ఉత్వడుజులు రావలయును. కాని స్త్రీత్వ మాదేశింపఁబడుటచే 'బ్రహ్మ' అను రూప మేర్పడును.

ఇది చతుర్ముఖునకు, ఋత్విగ్విప్రులకు వాచకము.

(ii) పై రీతినిగాక, తత్త్వతపో వేదయోగ వాచకమగునేని 'బ్రహ్మము' అని నపుంసక లింగము వలె నగును. (బా. వ్యా. తత్సమ. 76)

**బ్రౌన్-చార్లెస్‌ఫిలిప్స్**

ఆంధ్రభాషకు వాఙ్మయమునకు మహోపకారము గావించిన ఆంగ్లేయుఁడు.

ప్రాచీన తాళపత్ర ప్రతులను, ఆంధ్రదేశము నలుమూలల నుండి సేకరించి పండితుల సాయముతో వానిలోని పాఠములను నిర్ణయించి కావ్య ప్రచురణమును గావించిన మహనీయుఁడు.

ఇతఁడు ఆంధ్రాంగ్ల నిఘంటువును గూడ రచించెను. అనేక కవి ప్రయోగములను గూడ నిందుద్ధరించెను.

ఆంధ్రభాష కాంగ్లములో నీతఁడు రచించిన వ్యాకరణము, చిన్నయసూరికిఁ బూర్వమే రెండు సంపుటములుగాఁ బ్రకటింపఁబడెను. దీని ప్రభావ మాంధ్ర వ్యాకరణములపై గోచరించును.

ఇట్లు గ్రంథపరిష్కర్తగా (Editor) నై ఘంటికుఁడుగా (lixicograpner) వ్యాకర్తగా (grammarian) ఇతఁడాంధ్ర భాషకుఁ గానించిన సేవ నాన్యతో దర్శనీయము. వీరిని గూర్చి డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావుగారు విశేషముగాఁ బరిశోధించిరి.

**భ**

ఉభయోష్ఠ్య స్పర్శము (bilabial stop)

పై పెదవి—స్థానము

క్రింది పెదవి—కరణము

స్పర్శము

శ్వాసము

మహాప్రాణము.

భయము, ఇభము మున్నగు సంస్కృత సమములను గూడి తెనుఁగున వ్యవహరింపఁబడును,

**భయము**

వెఱపు, ఇట్టిది దేనివలనఁ గల్గునో దానికి 'వలన' వర్ణకమగును.

చోరుని వలన భయపడియె.

'వలన' కు మాఱుగా షష్ఠికూడ నుపయోగింప నగును.

చోరునకు భయపడియె. (బా, వ్యా, కారక. 9)

**భవచ్ఛత్రాదులు**

భావత్+శతృ+ఆదులు

'భవత్' మొదలైన శబ్దములు

'శతృ' ప్రత్యయాంత రూపములు

రేఫాంతములును.

వీనికిఁ దెనుఁగు భాషలోఁ బ్రయోగములేదు.

అనఁగా 'భవత్, త్వత్, మత్, మొదలైనవానికి; 'లసత్, భవిష్యత్' మున్నగు శతృ ప్రత్యయాంత రూపములకు; 'ధూర్, గీర్, ప్రభృతి రేఫాంత శబ్దములకుఁ దెనుఁగు భాషలోఁ బ్రయోగములేదు.

సమాసములయందు తొలుతఁగదిసి యుందవి ప్రయుక్తములగును.

భవద్గుణములు, త్వదాశయము

లసద్రూపము, భవిష్యత్కాలము

ధూర్వహము, గీర్వాణి. ఇత్యాదులు. (బా. వ్యా. తత్సమ. 87)

**భవత్ప్రకారములు**

క్తవతు ప్రత్యయము, శతృప్రత్యయము మున్నగునవి అంతమందుగల శబ్దములు. ఉదా :- భవాన్ (శత్రంతము), గతవాన్ (క్తవత్వంతము) మొ॥ వీనకి తెనుఁగున వ్యస్తముగ ప్రయోగములేదు. (వై. చం. హలంత. 38)

**భవత్యర్థము**

భవతి+అర్థము—'భూ' అను ధాతువుయొక్క యర్థము='అగు' ధాతువు.

(i) 'అగు' ధాతువుయొక్క తద్ధర్మార్థ విశేషణములు 'అగు, అవు, ఔ' అనునవియు,

(ii) 'అగు' ధాతువుయొక్క భూతార్థక విశేషణములు 'అయిన, ఐన' అనునవియు,

(iii) 'అగు' ధాతువుయొక్క వ్యతిరేకార్థక విశేషణమగు 'కాని' అనునదియు భవత్యర్థము లగును.

ఇట్టి వానిలో దేనిచేతనైన వ్యవహితమగు విశేషణము ప్రథమా విభక్తియం దుండును.

విద్యాశాలి యగు పురుషుని సకల జనులు సన్మానింతురు.

(బా. వ్యా. కారక. 28)

**భవదర్థము**

భవత్+అర్థము

'భూ' ధాతువు కంటె వర్తమానార్థమునందు 'శతృ' ప్రత్యయ ముప్పతిలఁగా 'భవత్'అని అగును, అందుచేత వర్తమానార్థక శత్రర్థమని యర్థము.

ఈ యర్థమునందు—ఉన్న వర్ణక మగును.

వండుచు+ఉన్న+వాఁడు. వండుచున్నాడు. ఇది సుబంతము.

(బా. వ్యా. క్రియా. 46; గు. ప్ర. పుట. 335)

**భవనము**

పుట్టుట. ఇట్టిది దేనివలనఁ గల్గునో దానికి 'వలన' వర్ణకమగును.

మనువు వలనఁ బ్రజలు పుట్టెరి.

"వలన' కు మాఱుగా షష్ఠికూడ వాడ నగును.

మనువునకుఁ బ్రజలు పుట్టిరి. (బా. వ్యా. కారక. 9)

**భవిష్యదర్థము**

భవిష్యత్కాలమును దెల్పు క్రియా పదములు. (i) తత్సమ క్రియలకును, దేశ్య క్రియలకును ఈ యర్థము నందు—ఇంచుగాగమము, చకారమునకు పకారము ఉకారమునకు అకారము, దానిపై కలాను బంధము చేరును.

పోషింపంగలఁడు, పోషింపఁగలరు.

మ్రొక్కఁగలఁడు, మ్రొక్కఁగలరు. (ప్ర. వ్యా. 368)

(*ii*) కొన్ని వ్యాకరణములు భవిష్యదర్థము నందుఁ జేరు ప్రత్యయముల నిట్లు నిరూపించినవి.

| పరుష | ఏ.వ. | బ.వ. | ఏ.వ. | బ.వ. |
|---|---|---|---|---|
| ప్రథమ పురుష | —ఉను | —దురు | పలుకును | పలుకుదురు |
| మధ్యమ పురుష | —దువు | —దురు | పలుకుదువు | పలుకుదురు |
| ఉత్తమ పురుష | —దును | —దుము | పలుకుదును | పలుకుదుము |

(ఆం. భా. భూ. 145, 146; కా. చూ. 154; ఆం. కౌ. 684-88)

**భవిష్యదర్థక విశేషణము**

భవిష్యదర్థమును దెల్పు విశేషణము.

తుమున్నర్థక రూపము తుదిని 'కల' యను శబ్దమును జేర్చుట వలన భవిష్యదర్థక విశేషణ రూపము నిష్పన్నమగును.

పోషింపఁగల—

కొట్టఁగల— (సం. వ్యా. విశ. 8)

**భళి**

ప్రశంసార్థమున నిపతింపఁబడిన యవ్యయము. ఉదా:- భళి! రఘూద్వహ నీ ధనుః ప్రౌఢిమంబు మొ॥ (వై. చం. అవ్యయ. 18)

**భావకర్మార్థకము**

కర్మార్థకక్రియ యొక్క భావార్థక రూపము.

ప్రభువుచేత నొసంగఁబడుట. (ఆం. కౌ. 743-44)

**భావద్వంద్వము**

భావార్థమునందు వచ్చు—ట, —మిజీ, —ఇకి అను కృత్ప్రత్యయము లంత మందుఁగల శబ్దములతో నేర్పడిన ద్వంద్వసమాసము.

ఇట్టి సమాసమునందుఁ బూర్వ పదాంతమందలి కృత్ప్రత్యయమునకు లోపము వచ్చును.

ఔగాములు (ఔట+కామి)

వినివినములు (వినికి+వినమి) (ప్రౌ. వ్యా. సమాస. 81)

**భావము**[1]

ధాతువుయొక్క యర్థము. ఈ యర్థమునందు 'ట' వర్ణకము వచ్చును.

కొనుట, తినుట, చిన్నతనము, కన్నెఱికము, మున్నగునవి.

(బా. వ్యా. క్రియా. 35)

**భావము**[2]

త్వార్థము (చూ.) (త్వ+అర్థము)

ప్రకృతి జన్యబోధము నందు ప్రకారము త్వార్థము. సంస్కృతమునందు 'సుందరస్యభావః' అను నర్థమునందు 'త్వ' ప్రత్యయము కలిగి 'సుందరత్వమ్' అనియగును.

సుందరుఁడనఁగా సుందరత్వ విశిష్టుఁడు. సుందర—అను ప్రకృతి వలనఁ గలుగు నట్టి 'సుందరత్వ విశిష్ట' అను శాబ్ద బోధము నందు 'సుందరత్వము' ప్రకారమగును. అనఁగా విశేషణము.

ఇట్లే 'మనుమఁడ' నఁగా మనుమని తనము (ప్రౌత్రత్వము) గలవాఁడు. ఇదే ప్రకారము, లేక భావార్థము. (బా. వ్యా. తద్ధిత. 1; రమణీ. పుట. 370)

**భావ లక్షణము**

అన్యక్రియకు లక్షణభూతమగు క్రియచైత్రుఁడు *వండ*నతిథి వచ్చెను.

అతిథి యెప్పుడు వచ్చెను? చైత్రుఁడు వండఁగా వచ్చెను. ఇట 'వచ్చుట' అను క్రియా సందర్భమును 'వండుట' అనుక్రియ తెలుపుచున్నది.

వండుట : లక్షణక్రియ (చూ.)

వచ్చుట : లక్ష్యక్రియ. (చూ.)

(బా. వ్యా. క్రియా. 40; రమణీ. 401 పుట.)

**భావ వర్ణకములు**

భావార్థమునందు వచ్చు ప్రత్యయములు.

—ట,

—అమి (మ. ప. వ్యా. ప్రత్యయ. 4)

**భావార్థకము**

భావము[2] (చూ.)ను దెల్పు అర్థము కలది. ఇది తద్ధిత వృత్తియందలిభేదము.

—తనము : చిన్నతనము, పెద్దతనము

—ఱికము : కన్నెఱికము

—ఇమి : పేరిమి

—న : నల్లన.

ఇత్యాదులు భావార్థక తద్ధిత ప్రత్యయములు.

(సం. వ్యా. విశే. 6)

**భావార్థకాదియోగము**

'భావార్థకము' మున్నగు వానితో కలయిక. (i) భూతార్థక 'న'వర్ణకము (ii) భావలక్షణమగు నుజీవర్ణకము (iii) ఆనంతర్యార్థకమగు 'డు' వర్ణకము మున్నగునవి.

రాముఁడు వచ్చుట; రాముఁడు రాఁగా లక్ష్మణుఁడుగాంచె; రాముఁడు విల్లంది నఁద్రిలోకము లాకులములగు—ఇట్లు భావార్థకాది యోగమున కర్తకుఁ బ్రథమ యగును. (బా. వ్యా. కారక. 32)

**భావార్థము**

భావ మనఁగా ధాతువు. భావార్థమనఁగా ధాతువుయొక్క యర్థము.

ఈ యర్థమునందన్ని ధాతువులకు 'ట'వర్ణకము వచ్చును.

పాడుట, తినుట. (ప్ర. వ్యా. 393 ప్రశ్న.

**భావి**

భవిష్యత్కాలము.

భవిష్యత్కాలమునందు జరుగు క్రియను దెలుపు ధాతువునకు 'ల్రుట్' వర్ణకమగును.

'భావి' యనఁగా నప్పటికిఁ బుట్టకుండునది. ఇఁక మీఁదఁ బుట్టఁబోవునది.

ఘటము కాఁగలదు—వస్తూత్పత్తికి ముందున్న యభావము ప్రాగభావము అట్టి ప్రాగభావమునకు విరోధి భావి. ఘటముపుట్టుటతోడనే ఘటోత్పత్తికి ముందున్న యభావము (ప్రాగభావము) నశించును. ప్రాగభావనాశమునకు భావి ఘటమువిరోధి. (బా. వ్యా. క్రియా. 4.; గు. ప్ర. పుట 308)

**భావిక్రియాసంధి**

భవిష్యత్కాలమును దెలుపు క్రియా పదములకుఁగల్గు సంధి.

ఉత్తమ పురుషైక క్రియలు దక్క, తక్కిన భవిష్యదర్థక క్రియలన్నియు నుదంతములగుటచే సంధి నిత్యము.

కావఁగలఁగచ్యుతుఁడు

మెచ్చఁగలరమరులు
తొడరఁగల వర్కనందనున్ మున్నగునవి. (అప్ప. V. 70,71)

**భావిని భూతము**

త్వరితార్థమును సూచించుటకై కొన్ని యెడల భవిష్యదర్థమును దెలుపు క్రియాపదమునకు మాఱుగా భూతార్థక్రియ ఉపయోగింపనగును.

'తావచ్చె సుదర్శనాయుధుఁడు'—సుదర్శనాయుధుఁడు త్వరగా రాఁగలఁడని యర్థము. (ప్రౌ. వ్యా. క్రియా. 7

**భావి శత్రర్థము**

భవిష్యదర్థవిహిత శతృప్రత్యయార్థము. ఇందు కల(జి) వర్ణకమగును. ఇది జిత్తగుటచే ధాతువు ఉత్వమున కత్వమగును.

వండఁగలవాఁడు. (బా. వ్యా. క్రియా. 46; గు. ప్ర. పుట. 385

**భావుకుఁడు**

'గ్రామనామ్నోఽపి మోః పుః స్యాత్సమాస ఇతి భావుకః' (అథ. కారి. హలన్త. 18) అను కారికయందు భావుకుని మతము చెప్పఁబడినది. కాని యితఁడు లక్షణకర్తయగునోకాదో? లేక యాతనికిది సంకేతనామమో ? యను విషయము లను నిర్ణయించుట కాధారములులేవు. అథ. కారి. యందుఁ బేర్కొనఁబడిన వారిలో నెవ్వరినిగూర్చియు తెలిసికొనుటకు సరియైన యాధారములులేవు. (ఆం. వ్యా.వి ) ఈతని మతమున సమాసమున గ్రామనామముకంటె పరమైన మువర్ణమున కొకా నొక చోట 'పు' వర్ణము ఆదేశమగును. ఉదా :- కొల్లాపురపు శక్తి మొ॥ (అథ. కారి. హలన్త. 18).

**భావ్యర్థ కథన ప్రారంభము**

ముందుఁజెప్పఁబోవు దానిని ప్రారంభించుట.

ఇట్టిచో, బూర్వవాక్యాంతమునందు 'ఇట్లనియె'నని యుండును.

'అయ్యింద్రునకుఁగవి యిట్లనియె' (ప్రౌ. వ్యా వాక్య. 10)

**భావ్యర్థము**

భావి+అర్థము.

భవిష్యదర్థము. ఈ యర్థమునందు అన్నంతమగు 'అగు' ధాతువునకు (కాన్) 'ఉన్న' పరమగునపుడు హ్రస్వమును గానిపించును.

పిరువీఁకుగా నున్నది
పిరువీఁకుగ నున్నది. (ప్రౌ. వ్యా. క్రియా. 28)

**భాష**

భాషింపఁబడునది.

ఒక ప్రాంతమందలి మానవు లొండొరులకుఁదము మనోభావముల నెఱిఁగించుటకు సాధన భూతమగు వాగాజలము. ఇది సహజలబ్ధమగుభాష.

ఇది లిఖిత రూపముగానైన నుండవచ్చుచు. (సం. వ్యా. ఆంధ్రభాష.1)

**భాషాచారిత్రక వ్యాసములు**

కర్త : శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు.
ప్రచురణ : 1951.

తాము కావించిన బాషా పరిశీలనమును అప్పుడప్పుడు శ్రీ రామకృష్ణయ్యగారు వ్యాసరూపమున పత్రికలలోఁ బ్రకటించిరి. వాని సంపుటీకరణమే యీ గ్రంథము.

ఇందనేక లాక్షణిక గ్రంథములలోని వ్యాకరణాంశములు, తమిళ కర్ణాటాది భాషా వ్యాకరణములతోఁ దులనాత్మకముగాఁ బరిశీలింపఁబడినవి.

**భిస్**

సంస్కృతమున తృతీయా బహువచన ప్రత్యయము ఉదా:- మరుద్భిః (మరుత్+భిస్) మొ॥

**భిసాదులు**

(భిస్+ఆదులు) భిస్ (తృతీయా బహువచన ప్రత్యయము) మున్నగు బహువచన ప్రత్యయములు ఇవి పరమగునపుడు నామమునకు 'ల' వర్ణము ఆగమమగును. ఉదా:- రాములచేత మొ॥ (వై. చం. అజంత. 15)

**భూజ్యాదులు**

(భూ,జి+ఆదులు) భూ (సత్తాయామ్) జి (జయే). శి (శ్రయణే) ధృ (ధృతౌ) ఇత్యాది ధాతువులు అవి తెనుఁగు వ్యాకరణమున పరిణతి క్రియలనఁబడును. (చింతా. క్రియా. 3) ఈ ధాతువులు తెనుఁగున వాడుకొనునపుడు అయ్ అవ్, అర్ అనునవి అంతమందు గలవిగా ప్రకృతులగును. ఉదా:- ప్రభవించు జయించు, ధరించు మొ॥ (చింతా. క్రియా. 6) చూ:- పరిణతి క్రియలు.

**భూతకాలము**

వెనుక జరిగిన కాలము. అపుడు జరిగిన క్రియలు భూత కాలికములు.

పోషించెను, పోషించిరి

పోషించితివి, పోషించితిరి

పోషించితిని, పోషించితిమి. (సం.వ్యా. క్రియా. 12)

**భూతకాలికా సమాపక క్రియ**

భూతకాలమునకుఁ జెందిన అసంపూర్ణక్రియ (past incomplete verb) ధాతువునకు 'ఇ' ప్రత్యయమును జేర్చుటచే నిట్టి క్రియారూపము సిద్ధించును.

వచ్చు+ఇ ⟶ వచ్చి

తిను+ఇ ⟶ తిని

ఇట్టి క్రియల కచ్చుపరమగుచో సంధిని సంప్రదాయ వ్యాకరణములు చాల వఱకు నిషేధించినవి. కాని సకృత్తుగా సంధికల్గిన రూపములు లభింపకపోవు.

అంది+ఇమ్ము ⟶ అందిమ్ము

ఎఱింగి+ఎఱింగి ⟶ ఎఱింగెఱింగి.

ఇట కాలిక మనుటకన్న అర్థకమ నుటుచితము. (ప్రౌ. వ్యా. సంధి. 2)

**భూతార్థకాసమాపకక్రియ**

భూతార్థమును దెల్పునట్టి యసంపూర్ణ క్రియ. (past incomplete verb) చూ. భూతకాలికా సమాపకక్రియ.

భూతకాలమునకు (time) సంబంధించిన దనుటకన్న, భూతార్థకమనుట (tense) వ్యాకరణ శాస్త్రోచితమగును.

ఈ రెండు వ్యవహారములను ప్రౌఢవ్యాకరణ కర్త కావించియున్నాఁడు.

ఈ యర్థమునందు ధాతువునకు 'ఇ' చేరును. ఇట్టి యసమాపకక్రియ హేత్వర్థకమును నగును. (చూ.)

రాహుకంఠము దెగి దేహము ధరణిఁబడియె—తెగిన కారణముగా ననియర్థము (ప్రౌ. వ్యా. క్రియా. 15) (ప్రౌ. వ్యా.వాక్య. 16)

**భూతార్థక విశేషణము**

క్త్వార్థక రూపముయొక్క తుదను నవర్ణకమును జేర్చుట వలన భూతార్థక విశేషణము నిష్పన్నమగును.

పోషించిన, కొట్టిన. (సం. వ్యా. విణ. 2)

**భూతము**

విద్యమాన ధ్వంస ప్రతియోగి - ముందుండి యప్పటికి లేకుండునది. (ప్రస్తుతమున్న అభావము దేనిదో అది)

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిట్టగు (చూ. లిట్)

ఘట ముండెను. (బా. వ్యా. క్రియా. 3)

**భూతార్థకము**

జరిగిపోయిన వ్యాపారమును దెల్పునది.

వచ్చెను, వచ్చిరిఁ వచ్చితివి, వచ్చితిని. మున్నగునవి.

(ల. వ్యా. క్రియా. 4)

**భూతార్థక్రియాసంధి**

భూతార్థ మందలి క్రియలకుఁగల్గు సంధి.

ఉత్తమ పురుషైక వచనమునందుఁదక్క భూతక్రియా పదాంతము లందలి ఇత్తునకు మీఁద అచ్చులు హత్తునపుడు సంధి నిత్యముగా ఘటించును.

ఏలితివి + అఁట ⟶ ఏలితివఁట.

ఏలితి+అఁట ⟶ ఏలితఁట. (అప్ప. V 61-67)

**భూతార్థము**

జరిగిన యర్థము.

ఈ యర్థము నందేకవచన బహువచనములలో నీ క్రింది ప్రత్యయములు ధాతువులకుఁజేరును

| | ఏ.వ. | బ వ. |
|---|---|---|
| ఒరులకు .. ... | —ఎను | —ఇరి |
| ఎదిరికి ...... | —తివి/—తి | —తిమి |
| తనకు....... | —తిని | —తిమి |

చేసెను, చేసిరి; చేసితివి, చేసితి, చేసితిరి; చేసితిని, చేసితిమి యిత్యాదులు.

(అం. బా. భూ. 140,141 కా. చూ. IX. 147; 152-153)

(ఆం. కౌ. 679-684)

**భేదకము**

భేదించునది—విశేషణము (చూ.)

భేదింపఁబడునది—భేద్యము-విశేష్యము (చూ.) భేద్యము ఏ లింగమందు, ఏ వచనమందు, ఏ విభక్తి యందున్న చో భేదకము గూడ ఆ లింగమఁదు, ఆ వచనమఁదు ఆ విభక్తియందు నుండవలయునని, భేద్య భేదకములకు భేదము చెల్లదని సంస్కృత పద్ధతి ననుసరించి కొన్ని తెలుఁగు లక్షణగ్రంథములు పేర్కొన్నవి.

(క. చిం. I. 70-72; ఆం. కౌ. 543 పంక్తి; బా. వ్యా. కారక. 1౯)

**భేద్యము**

భేదింపఁబడునది—విశేష్యము (చూ.)

కపిల—గోవు

 

భేదకము—భేద్యము

విశేషణము—విశేష్యము. (క. చిం. I. 70; ఆం. కౌ. 548 పంక్తి.)

**భ్వాదులు**

(భూ+ఆదులు). i) పాణిని కృతమగు సంస్కృత పాఠములోని దశగణములలో మొదటి (భ్వాది) గణమునకుఁ జెందిన భూ, ఏధ, స్పర్ధ మున్నగు ధాతువులు. ii) ఉపపద సహితములుగనే తెలుఁగున ప్రయోగింపఁబడు భూ, స్థా (ష్ఠా), కృ మున్నగు ధాతువులు. ఉదా:- ఉద్భవించెన్, అనుష్ఠించెన్, అనుకరించెన్, మొ॥ భవించెన్, కరించెన్. ఇత్యాదిగా నిరుపపదములుగా వీనిని ప్రయోగింపరాదు. (బా. వ్యా. క్రియా. 121)

**మ**

ఉభయోష్ఠ్యను నాసికము (bilabial nasal)

పై పెదవి—స్థానము

క్రింది పెదవి—కరణము

అనునాసికము

నాదము

అల్పప్రాణము

రెండచ్చులమధ్యను, పదాంత మందును, వ, స, హలకుఁ బూర్వమందును నున్న ఈ మకారము 'వఁ' (దన్త్యోష్ఠ్యను నాసికము (labio-dental nasal) గా నుచ్చరింపఁబడును.

| | |
|---|---|
| /మామ/ | [మావఁ] |
| /చీమ/ | [చీవఁ] |
| /మామిడి/ | [మావిఁడి] |
| /సింహం/ | [సివ్ఁహవ్ఁ] |
| /సంవత్సరం/ | [సవ్ఁవత్సరవ్ఁ] |
| /మాంసం/ | [మావ్ఁసవ్ఁ] |

**-మంత**

మతుప్ప్రత్యయాంతములగు సంస్కృత పదములను తత్సమీకరించునపుడు మతుప్ స్థానమునవచ్చు ఆదేశము. ఉదా:- హనుమంతుడు, నీతిమంతుఁడు మొ॥ (మం. ఆం. కౌ. 231. 232, వై. చం. హలంత. 31)

**మకార ద్విత్వము**

నకారమునకు మకారము పరమైన నకారము మకారమగును.

లతాంతములకున్+మొనసి — లతాంతములకుమ్మొనసి.

చేసెన్+మహానదులు — చేసెమ్మహానదులు.

(స. సా. సం. I. 95-97)

**మగఁటిమాశ్రదులు**

మగఁటిమి+ఆదులు

మగఁటిమి, పేదటిమి, ఒజ్జనము, కోటరము, కోడంట్రము ఇత్యాదులు.

ఇవి యథాప్రయోగముగా గ్రాహ్యములు. వీనిని నిర్దిష్టమగు ప్రక్రియచే సాధింపంజాలము. (బా. వ్యా. తద్ధిత. 8)

**మగాదులు**

"మగ" మున్నగు అచ్చిక శబ్దములు. వీనికి "డుజ్" చేరును. కాని అత్వము నకు ఉత్వము కలుగదు.

వీనికి ద్వితీయాది విభక్తులు చేరునపుడు నిగాగమము నిత్యము.

మనుమఁడు—మనుమనిచేత బాపఁడు, పాపఁడు, ప్రేఁడు, జేఁడు, ఈ, కా ప్రత్యయాంత రూపములు—అటమటీఁడు, అందగాఁడు మున్నగునవి.

(బా. వ్యా. అచ్చిక. 4)

**మణిప్రవాళరీతి**

మణులను, ప్రవాళములను గలిపినరీతి.

సంస్కృత విభక్త్యంత రూపములను భాషావిభక్త్యంత రూపములను, మణులను, ప్రవాళములను గలిపినట్లుగాఁ గలిపి రచన గావించు పద్ధతి.

ఇట్టి రచనా సంప్రదాయము మలయాళ భాషలోఁ బ్రచురము.

"వృక్షేణ", 'పక్షిభిః' వంటి విభక్త్యంతములు అనఁగా పదములు తెలుఁగునఁ జొరవని ఆంధ్ర భాషా భూషణమునందు హెచ్చరిక కలదు. ఇతర లాక్షణికులును నిట్టి కట్టడి కావించిరి. అందుచే మణిప్రవాళ రచన తెలుఁగు దేశమునందు మొదటి నుండియు వ్యతిరేకింపఁబడెను.

'అనయము చేతులందు భవదంఘ్రియుగం నమామి; నెమ్మనమున సంస్మరామి' అనుగీతి రచన మణిప్రవాళ రచనగా వృషాధిప శతకము నందు పాల్కురికి సోమనాథుఁ డుదాహరించెను.

(తె. వ్యా. వి. పుట. 325; ఆం. భా. భూ. 29)

**మతుప్ప్రత్యయాంతములు**

కలవాఁడు, కలది యను నర్థము నిచ్చునట్టి "మతుప్" అను ప్రత్యయము లంతమందుఁగల శబ్దములు.

అకారాంత శబ్దములకు "—వంత' అను ప్రత్యయమును; అకారేతరాచ్చ లంతమందుఁగల శబ్దములకు —"వంత' అను ప్రత్యయమును మతుబర్థమునందుఁ జేరును.

గుణవంతుఁడు—గుణవంతురాలు—గుణవంతము.

బుద్ధిమంతుఁడు—బుదిమంతురాలు—బుద్ధిమఁతము. (ఆం. కౌ. 193–195)

**మతుప్సమాసము**

కలవాఁడు, కలది యను నర్థము నిచ్చు సమాసము.

తావిగలమొల్ల—తావిమొల్ల

వలపుగల గంధపుపొడి—వలపుగంధపుపొడి. (ప్ర. వ్యా. 292 ప్రశ్న)

**మతుబర్థము**

'కలవాఁడు', 'కలది' యను నర్థము.

పూవుఁబోఁడి. మెఱుఁగుఁబోఁడి వంటి రూపములు సౌకుమార్యమును, మనోహరతను గలిగి యుండుటను దెలుపు నిపాత రూపములు.

(ఆం. కౌ. 409, 410)

**మతుబర్థబహువ్రీహి**

"కలవాఁడు", "కలది" యను నర్థమునిచ్చు అన్యపదార్థ ప్రధానమగు సమాసము.

మేలిమి జాళువాసేలువాఁడు (ఆం. కౌ. 616)

**మతుబర్థకప్రత్యయములు**

"కలవాఁడు, కలది" యను నర్థమునిచ్చు తద్ధిత ప్రత్యయములు.

—కాఁడు,—కత్తియ,—ఈఁడు,—అరి, —ఇ,—త, ఆఁది,—ఆఁడు మొదలైనవి.

తేరకాఁడు—తేరకత్తియ

అటమటీఁడు—కల్లరి—బిత్తరి

ధాకిత - వగలాఁడు - వగలాడి ఇత్యాదులు.

(ఆం. కౌ. 687-688; సం. వ్యా. విశే. 7)

**మతుబాదికము**

మతుప్+ఆదికము.

మతుబర్థము నిచ్చు ప్రత్యయము లంతమందుఁగల శబ్దములు, తదితరములు.

శ్రీమంతమ్, గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్, శ్వానమ్, ఉపానహమ్, అప్సరసమ్ - ఇత్యాదులు.

వీని ద్వితీయైక వచనాంత తుల్యరూపములు తెలుఁగున ప్రాతిపదికము లగును. వాని యంతిమ 'మ' కారమునకు లోపము, అజంతములకు వలె డుజాదులు యథాయోగ్యముగా నగును.

అతఁడు శ్రీ మంతుఁడు.

వాని వంశము శ్రీ మంతము.

ఆమె శ్రీ మంతురాలు. (బా. వ్యా. తత్సమ. 70)

**మత్వర్థీయము**

మతుబర్థము (చూ.) నకు సంబంధించినది. తద్ధితవృత్తి భేదము.

శ్రీ మంతుఁడు, యశస్వి

వాగ్మి, కృషీవలుఁడు (ఆం. భా. శా. సమాస. 83)

**మధ్యమ పదలోపి సమాసములు**

సమాసమందుఁ బూర్వోత్తర పదముల కర్థసందర్భము కలుపునట్టి నడిమి పదము లోపించిన సమాసములు.

గుఱ్ఱమెక్కురౌతు—గుఱ్ఱపురౌతు.

వంటలుసేయుఅక్క—వంటలక్క

పాలనుగాచుటకు వాడఁబడుకుండ—పాలకుండ

పూటకు కూడమ్ముకొని జీవించు ఆడుది—పూటకూళ్ళమ్మ.

(ఆం. భా. శా. సమాస. 43)

**మధ్యమపురుష (ము)**

ఎదిరివానిఁగూర్చి చెప్పునది

నీవు - పలికితివి, పలుకుచున్నావు, పలుకుదువు, పలుకఁగలవు.

మీరు - పలికితిరి, పలుకుచున్నారు, పలుకుదురు, పలుకఁగలరు

(కా. చూ. IX. 146-164; ఛం. ద. IV. 118.

**మధ్యమపురుషక్రియలు**

ఎదిరివారిని గూర్చి తలుపు క్రియలు.

పలికితివి, పలికితిరి మున్నగునవి.

వీని యిత్తునకు సంధి నిత్యము.

పలికితి (వి) + అపుడు ▷ పలికితపుడు / పలికితివపుడు

(బా. వ్యా. సంధి. 7)

**మధ్యమ పురుష ము వర్ణకము**

మధ్యమపురుష ఏకవచన ప్రత్యయమగు 'ము'. దీనికి హల్లుగాని, అవసానము గాని పరమగుచో లోపము విభాషనగును.

చూడుము + నన్ను > చూడునన్ను / చూడుమునన్ను హల్లుపరము.

ఇటు + చూడుము > ఇటు చూడు / ఇటు చూడుము (బా. వ్యా. సంధి. 47)

**మధ్యమ పురుషేకారసంధి**

మధ్యమపురుష ఇకారమునకు సంధి నిత్యముగారాని రూపములు కూడ కలవని స. సా. సం. కర్త ప్రయోగము నొకదానిని జూపెను.

త్రోచితిరి + ఎచ్చట — త్రోచితిరి యెచ్చట.

(స. సా. సం. I. సంధి. 27)

**మధ్యమ పురుషయోగము**

మధ్యమ పురుష క్రియతో నన్వయము.

ఇట్టిచో—ఆరగాగమము (చూ.) విభాషగా నగును.

వినుఁడు బాలకులు

వినుఁడు బాలకులార! (బా. వ్యా. తత్సమ. 87)

**మధ్యమ ముఙ్ఞలు**

మధ్యమ పురుష ఏ.వ.— ము

మధ్యమ పురుష ఏ.వ.—డుఙ్. మధ్యమ పురుష క్రియలు ఆమ్రేడితమగుచో ము, డుఙ్ములకు లోపము విభాషగా నగును.

ఉండుము+ఉండుము < ఉండుండుము / ఉండుముండుము

కొట్టుఁడు+కొట్టుఁడు < కొట్టుకొట్టుఁడు / కొట్టుఁడు కొట్టుఁడు

(బా. వ్యా. సంధి. 49)

**మధ్యమాక్షరలోపము**

కొన్ని పదములందలి మధ్యమాక్షరమునకు లోపము వికల్పముగా నగును.

చావక—చాక

పోవక—పోక (క. సం. వి. I. 61)

**మధ్యమావాక్కు**

నాభికమలమునుండి హృదయమును జేరిన వాయువు, హృదయ దేశమునందలి వ్యక్తమై బుద్ధివిషయమై 'మధ్యమ' యనఁబడును. ఇది చెవి మూసికొని విన్నచో ఎవరిలో వారికి వినఁబడును.

శ్రోత, వక్తయొక్క వాక్కును మధ్యమగా మార్చుకొని గ్రహించును.

(తె. వ్యా. వి. పుట. 1021)

**మధ్యముఁడు**

లక్ష్యములు మాత్రమెఱిఁగిన వాఁడు.

లక్ష్యలక్షణ సమన్వయ జ్ఞానము లేనివాఁడు. (అప్ప. I. 12)

**మనఃప్రభృతులు**

'మనః' మున్నగునవి.

మనసు, శిరసు, సదసు, ఇత్యాదులు. వీని సకారమునకు ద్విత్వము విభాషగా నగును.

మనసు—మనస్సు

శిరసు – శిరస్సు

సదసు – సదస్సు. (బా. వ్యా. తత్సమ. 83)

**మను వట్వాది శబ్దములు**

(మనువటు+ఆది శబ్దములు) మను, వటు, దను మున్నగు శబ్దములు. వీనికి

ప్రథమైకవచనమున డుజ్ఞురాదు. ఉదా:- మనువు, వటువు, దనువు మొ॥. ఇట దనుఁడు మున్నగు రూపము లుండవు. (అథ. కా. అజంత. 26)

**మన్వాదులు**

మను+ఆదులు : 'మను' మున్నగు ధాతువులు.

మను, కొలుచు, చచ్చు, తడయు, నిలుచు, పూచు, ఇత్యాదులు.

వీనికి – వు వర్ణకము చేరిన మనువు, కొలువు, చావు, తడవు, నిలువు, పూవు, వంటి కృదన్త రూపము లేర్పడును. (బా. వ్యా. కృదన్త. 17)

**మహతి**

స్త్రీ వాచకములు, వాని విశేషణములు.

అంబ, రమ, గౌరి, వాణి, అమ్మ, తల్లి

(బా. వ్యా. ఆచ్ఛిక. 24; బా. వ్యా. తత్సమ. 71)

**మహతీతరములగు**
**స్త్రీలింగముల విశేషణములు**

స్త్రీ వాచకములు కాని స్త్రీలింగ శబ్దముల యొక్క విశేషణములు, ఇవి ద్వివిధ ములుగా తెలుఁగున నుండును.

సంస్కృత పద్ధతి ననుసరించి యివి స్త్రీలింగములగుటచే స్త్రీలింగ రూపములు గాని; తెలుఁగు వ్యాకరణానుసారమివి అమహద్వాచకము లగుటచే అమహద్వి శేషణ రూపములు, అనఁగా ము వర్ణకాంత రూపములు ప్రవర్తిల్లును.

విద్య (మహతీతరమగు స్త్రీలింగము)

1. హృద్యయగు విద్య
   | —విశేషణము స్త్రీ లింగము.
2. హృద్యమగు విద్య
   | —అమహద్విశేషణము. (బా. వ్యా. తత్సమ. 86)

**మహత్తులు**

స్త్రీ వాచకములును, వానికి విశేషణములగు శబ్దములును పశుపక్ష్యాది వాచక శబ్దములును, వానికి విశేషణములగు శబ్దములును, అప్రాణి వాచకములును, వానికి విశేషణములగు శబ్దములును దప్ప ఇతరములగు శబ్దములు మఱియు వాని విశే షణములు. ఉదా:- రామ, కృష్ణ, బాలక మొ॥ స్త్రీ తిర్యగ్జడ వాచకములగు శబ్దములును, వాని విశేషణములును అమహత్తులు. (చింతా. అజంత. 9,10) ఇకారాంతముకాని మహద్వాచక శబ్దములపై వచ్చును. (ప్రథమైక వచన) ప్రత్య యమునకు పుంలింగమున డుజ్ఞు వచ్చును. ఉదా:- రాముఁడు, కృష్ణుఁడు మొ॥

(చింతా. అజంత. 12) కవిశిఖామణి మతమున కొన్ని అమహత్తులగు శబ్దములును పురుషాఖ్యములగునని అథ,కా. కర్త తెలిపియున్నాడు. కనుక మహమహద్భేదము వివక్షాధీనము, ఉదా:- మేఘుఁడు, సముద్రుఁడు, ఉరగులు మొ॥ (అథ. కా అజంత. 9)

**మహత్త్వము**

మహద్వాచకముల యొక్క ధర్మము. మహత్త్వమున బల్లిదాదులకు (చూ.) ఇట్టి ధర్మమారోపింపఁబడఁగా ఉత్వడు జాదు లగును.

బల్లిదుఁడు, అక్కజుఁడు ఇత్యాదులు. (బా. వ్యా. అచ్చిక. 8)

**మహత్త్వమునందు మతుప్రకారము**

మహద్వాచకములగు హనుమంతుఁడు, భగవంతుఁడు అనువాని యందలి మతు బర్థకమగు త కారమునకు 'ఆన' అనుశబ్దము విభాషగా నాదేశమగును.

హనుమంత < హనుమానుడు / హనుమంతుడు

భగవంత < భగవానుఁడు / భగవంతుడు

(బా. వ్యా. తత్సమ. 74)

**మహత్ప్రయోగములు**

మహాకవులయొక్క ప్రయోగములు, ఇవి శిరోధార్యములు.

కవిత్రయము వారి ప్రయోగము లిట్టి వానిలోఁదొలుతగాఁ బరిగణింపఁబడును.

(బా. వ్యా. తద్ధిత. 28)

**మహత్సమూహార్థక శబ్దము**

మహత్తులను దెలుపు సమూహ వాచకము.

సమూహ వాచకముల మహత్కార్య యుక్తములయ్యె, తద్విశేషణ క్రియలు, మహత్కార్య యోగ్యములు విభాషనగును.

మునినికాయము < పూజించెను / పూజించిరి

గీర్వాణ గణము < అఖర్వ పరాక్రమము / అఖర్వ పరాక్రములు

(ప్రౌ. వ్యా. శబ్ద. 17).

**మహదమహద్విశేష్యకము**

మహద్వాచకము కాని, యమహ ద్వాచకము గాని విశేష్యముగాఁ గలది.

సంఖ్య ప్రయుక్త విశేషణము—

(i) ఏకాంతమయి, యమహద్విశేష్యకమయ్యు, వ్యస్తమగుచో విశేష్యము పూర్వ పదము బహువచనాంతమగును.

రథములు దెబ్బది యొక్కటి

(ii) తదంశాంతమయి, సమస్తమగుచో విశేష్య ముత్తర పదము ఏక వచనాంతమగును.

రెండున్నర మానిసి

రెండున్నర రూపాయి.

(iii) తదం శాంతమయి, వ్యస్తమగుచో విశేష్యము పూర్వపదమును బహు వచనాంతము నగును.

మానసులు రెండున్నర

రూపాయలు రెండున్నర

(ప్రౌ. వ్యా. శబ్ద. 4)

**మహద్ద్వంద్వము**

మహద్వాచకములకుఁ గాని; మహతీ వాచకములకుఁగాని: రెండింటికిని గాని చేయఁబడిన ద్వంద్వ సమాసము.

ఇట్టి సమాసములందుఁ బూర్వ పదాంత్య స్వరమునకు దీర్ఘముగూడ నగును,

అన్నదమ్ములు — అన్నాదమ్ములు

తల్లిదండ్రులు — తల్లీదండ్రులు

అక్క సెల్లెండ్రు — అక్కా సెల్లెండ్రు.

(ప్రౌ. వ్యా. సమాస. 28)

**మహద్బహు కర్తృక క్రియ**

మహద్వాచకము లనేకములు కర్తలుగాఁగల క్రియ. ఇదియు బహువచనము నందే యుండవలయును. కాని విభాషగా నేకవచనమునందును నుండును.

| | |
|---|---|
| తనయెఱిఁగిన యర్థం బొరుఁ<br>డనఘా! యిది యెట్లు చెప్పుమని<br>యడిగి (i) నఁజెప్పని వాఁడును;<br>(ii) సత్యము చెప్పని వాఁడును | ఘోరనరక<br>పంకమునఁబడున్<br>లేదా<br>పడుదురు. |

(ప్రౌ. వ్యా. క్రియా. 6)

**మహద్వాచకములగు సాంతములు**

మహత్తులనుదెల్పు సకారాంత శబ్దములు. వీని సకారము లోపించి, యుత్వ డుజ్‌లు చేరును.

లేదా వాని ద్వితీయైక వచనాంత తుల్యరూపమందలి మకారమునకు లోపము, ఉత్వడుజులు చేరును.

అంగిరస్ < అంగిరుఁడు / అంగిరసుఁడు.

(బా. వ్యా. తత్సమ. 81)

**మహద్వివక్ష**

మహత్తులుగాఁ జెప్పు నిచ్ఛ.

కొన్నియమహచ్ఛబ్దములను మహత్తులుగాఁ బేర్కొనుట.

సముద్రుఁడు, మేఘుఁడు, హిమవంతుడు (సం. వ్యా. లింగము. 4)

**మహద్విశేష్యకము.**

మహద్వాచకము విశేష్యముగాఁగలది.

(i) ఇది యుత్తరపదమై, పూర్వపదము సంఖ్యాప్రయుక్త విశేషణము, తదంశాంతమయి, సమస్తమగుచో ఏకవచనాంతమగు, రెండున్నర మానిసి

(ii) విశేష్యము పూర్వపదమై, సంఖ్యాప్రయుక్త విశేషణము తదంశాంతమయి పరమందున్నచో ఏకవచనాంతమగును.

మానుసులు రెండున్నర. (ప్రౌ. వ్యా. శబ్ద. 4)

**మహాప్రాణములు**

ఏ వర్ణముల నుచ్చరించునపుడు వాయువు విశేషముగా వినిర్గతమగునో ఆ వర్ణములు మహాప్రాణములు.

వర్గ ద్వితీయ, చతుర్థాక్షరములు.

శ, ష, స, హ లు (రంగ. II. 154)

**మహావాక్యము**[1]

వాక్యసముదాయము.

రామాయణము, మహాభారతము. (ప్రౌ. వ్యా. వాక్య. 8)

**మహావాక్యము**[2]

(i) అనేక ముఖ్యాఖ్యాతములుగల వాక్యము.

రాముఁడాటల నాడుచు, పాఠములఁ జదువును. ఇందు 'ఆడుట' 'చదువుట' ముఖ్యాఖ్యాతములు. (మ. ప. వ్యా. వాక్య. 4)

(ii) అసంపూర్ణములు, అవాంతరములు, సంపూర్ణములునగు కొన్ని వాక్యముల కూడిక.

మంథర చెప్పిన మాటలకుఁ జెవియొగ్గి, లోకాపవాదమునకు వెఱవక, తన్నుఁ జూడ వచ్చిన దశరథునితో, రామునడవికిఁ బంపియు, భరతునకుఁ బట్టాభిషేకము గావించి; తనకిచ్చిన రెండు వరముల, దీర్పుమని పలికెను.

(ఆం. భా. శా. కారక. 6)

**మహావిసంధి**

పొల్లు హల్లుల కచ్చుపరమగు చుండఁగా ఆ రెంటిని గలిపి యొకే యక్షరము గావింపక యడాగమము గావించినను; అచ్చును జూపినను మహావిసంధి యగును.

భూమి వరున్ యండజధ్వజుండు.

సురల్ అద్భుతంబు నొంద. (అప్ప. V. 10)

**'మయట్' ప్రత్యయము**

ఇది సంస్కృతము నందు ప్రాచుర్యార్థము నందు వచ్చు తద్ధిత ప్రత్యయము. —వాఙ్మయము, అన్నమయము.

ఇది సకృత్తుగాఁ దెలుఁగు పదములకును జేరును.

తనమయము.

ప్రోవుల మయము. (ప్రౌ. వ్యా. సమాస. 18)

**మాండలికము**

మండల సంబంధమైనది మాండలికము. మండల మనఁగా భూభాగము. వృత్తికిఁగాని కులమునకుఁగాని సంబంధించిన జనసమూహమును గూడ మండల మందురు. ఇట్టి మండలమునకు దేనికైనను సంబంధించిన భాషను మాండలిక భాష (dialect) యందురు.

మాండలిక భాషను గ్రామ్యమని నిరసింపరాదని ఆధునిక వ్యాకరణములు కొన్ని పేర్కొన్నవి. లావు, మస్తు, దుడ్డు, బొట్టు

(ఆం. భా. శా. ప్రయోగ. 77)

**మాగధీభాష**

మగధదేశోక్తులు.

ఇవి వేటకాండ్రు, నీచజాతులు మాటలాడునవి. (అప్ప. I. 81-83)

**మాతృకలు**

వర్ణములకుఁ బర్యాయపదము. (ఛం. ద. IV. 129; అప్ప. II. 6)

**-మాత్ర**

మానార్థక శబ్దములపై దఘ్నార్థము (ప్రమాణార్థము) నవచ్చు తద్ధిత ప్రత్యయము. ఉదా:- కటిమాత్ర మిచ్చటి పుష్కరములు మొ॥ ఈయర్థమున బంటి, కొలది ప్రత్యయములును వచ్చును ఉదా:- ముక్కున బంటి నీరు, ముక్కుకొలది నీరు మొ॥ (అథ. కా అజంత. 58) 'మాత్రో దఘ్నేతు బంట్యాదిః' అను పై అథ. కా. కారికకు 'మాత్ర జర్థేతు బంట్యాదిః' అని అహోబలపండితుని పాఠము. పాణినీ యమున నీప్రత్యయము చకారేత్కముగా (మాత్రచ్) చెప్పఁబడినది. అట్లు చెప్పుట వేదమున చిత్స్వరార్థము ఈ ప్రత్యయమును చిన్నయసూరి చెప్పలేదు.

**మాత్రైక వికృతి**

ఒక్క వర్ణమునందు మాత్రము గల్గుమార్పు.

కులము—కొలము (క. సం. వి. III. 10)

**మానవాచకము**

ప్రమాణార్థమును బోధించు శబ్దము. ఉదా :- ఇంత. దీనిపై నొకానొకచో లువర్ణకము వచ్చును. ఉదా :- ''ఇంతలు కన్నులుండ'' మొ॥ (అథ. కా. అజంత. 54).

**మానార్థము**

కొలతను దెల్పునర్థము. ఈ యర్థములో ఏకత్వమునందు—ఎఁడు (చూ.) వర్ణకమగును.

మానెఁడు, బొచ్చెఁడు, (బా. వ్యా. తద్ధిత. 25)

**మాన్వాదులు**

మాను, మను మున్నగునవి.

వీనికిఁ బ్రేరణమునందు పుగాగమము చేరును.

మానుపు, మనుపు. (బా. వ్యా. క్రియా. 74)

**మానార్థము**

(మాన + అర్థము) కొలతకు యోగ్యమైన (సాధనమైన) వస్తువును దెలుపు పదము. ఉదా :- జేన, మూర, బార, తూము, గిద్ద, అడ్డ మొ॥ దీనిపై పరిమాణార్థమున ఎఁడు వర్ణకము వచ్చును. ఉదా :- జేనెఁడు, మూరెఁడు మొ॥ (అథ. కా. సంధి. 7).

**మాముడి**

చూ. మావత్తు. (గు. వ్యా. 13; బా. వ్యా. తత్సమ. 42)

**మాయాదులు**

(మాయా+ఆదులు) మాయ, కంధర మున్నగు శబ్దములు. ఇవి వికల్పముగ క్లీసమములగును. ఉదా:- మాయము-మాయ; కంధరము-కంధర మొ॥ (వై చం. అజంత. 80).

**మాయ్వాదులు**[1]

మాయు+ఆదులు.

ప్రేరణార్థమునందు మాయు, ఉడుగు, కడచు మున్నగు ధాతువులకు—పుగామము వికల్పముగా చేరును. అపుడు వానికడ యక్షరము లోపించును.

మాయు < మాపు / మాయించు

ఉడుగు < ఉడుపు / ఉడుగించు

**మాయ్వాదులు**[2]

మాయు+ఆదులు

మాయు, ఏయు, కాచు, చూచు, మున్నగు ధాతువులు. వీనికి—పు వర్ణకము చేరఁగా మాపు, ఏపు, కాపు, చూపు నను కృదంత రూపము లేర్పడును.

(బా. వ్యా. కృదన్త. 11)

**-మారి**

తాచ్ఛీల్యార్థము (చూ.) నందుఁజేరు తద్ధిత ప్రత్యయము

మంటమారి. (బా. వ్యా. తద్ధిత 8)

**మాఱ్వాదులు**

'మాఱు' మున్నగు ధాతువులు

మాఱు, అమ్ము, అంపు, పంచు, తోము, అద్దు మున్నగు ధాతువులు.

వీనికి—అక వర్ణకము చేరఁగా మాఱకము, అమ్మకము, అంపకము, పంపకము, తోమకము, అద్దకము, అనురీతిని కృదన్త రూపము లేర్పడును.

(బా. వ్యా. కృదన్త. 19)

**మావత్తు**

మకారమును హల్లులతోఁగలిపి వ్రాయునప్పటి గుర్తు '్మ' నకుఁబేరు.

(గు. వ్యా. 13)

**మిఙ్**

వ్యతిరేక భావార్థమునందు ధాతువునకుఁజేరు ప్రత్యయము.

ఇది ఙిత్తుగావున ధాతువుయొక్క ఉత్వమున కత్వమగును.

వండు+మి(ఙ్) → వండమి. (బా. వ్యా. క్రియా. 37)

**మిత్తు[1]**

మకారము ఇత్సంజ్ఞ.

ఇది యన్ని విధముల కిత్తు (చూ.) వంటిది. దీనిని చిన్నయసూరి వాడలేదు. కాని ప్రౌఢ వ్యాకరణకర్త యొకటి రెండుచోట్ల దీనిని వాడెను.

'ఇటఁబోఁడి పరమగుచో నుమ్మగు' నుమ్—మిత్తు. పూర్వపదాంతమునందు నకారము చేరును.

ననఁబోఁడి, విరిఁబోఁడి, మున్నగునవి. (ప్రౌ. వ్యా. సమాస. 19)

**మిత్తు[2]**

(మ్+ఇత్) మకారమిత్తుగాఁగలది. మిత్తులగు ప్రత్యయములు వికృతి శబ్దముల పైనే వచ్చును. (వై. చం. స్త్రీ ప్ర. 6) ఉదా:- తమ్ (బాపత మొ॥) తుమ్ (పగతుండు మొ॥) ఇడిమ్ (వెరవిడి మొ॥) ఎడుమ్ (బారెడు మొ॥) మొ॥ ఇట్టి పద్ధతి ఇతరాంధ్ర వ్యాకరణములందు కానరాదు.

**మిత్తు[3]**

పాణినీయమున మిత్తగు ఆగమము దేనికి విధింపఁబడినదో దాని యంత్యాచ్చునకు పరముగా వచ్చును (మిదచోఽన్త్యాత్పరః) ఉదా:- నుమ్ మొ॥ ఉదా:- పయాంసి (పయ+న్+స్+ఇ) మొ॥

**మిత్రాదులు**

'మిత్ర' మున్నగు శబ్దములు.

మిత్ర, శరణ, ప్రధాన, పాత్రాదులు—మిత్రాదులు.

ఇవి నపుంసకలింగ శబ్దములైనను, తెనుఁగునందు మహద్వాచకములగుటచే విభాషగా డుఙ్ చేరును.

మిత్రము
మిత్ర <
మిత్రుఁడు ఇత్యాదులు.

(బా. వ్యా. తత్సమ 18)

**—మిరి**

'చలి' శబ్దమునకు స్వార్థమునందుఁజేరు తద్ధిత ప్రత్యయము

చలిమిరి. (ప్రౌ. వ్యా. తద్ధిత. 14)

**—మి వర్ణకము[1]**

వ్యతిరేక భావార్థమునందు క్రియలమీఁద వచ్చు ప్రత్యయము.

చేయమి, పోమి. (ల. వ్యా. క్రియా. 88)

**—మి వర్ణకము[2]**

ధాతువుపై వ్యతిరేకార్థమునవచ్చు ప్రత్యయము (అధ కా. క్రియా. 21)
ఉదా – ఘటింపమి, చేయమి మొ॥

**మిశ్ర ద్విగువు**

(చూ.) ద్విగువు.

పూర్వపదము సంఖ్యావాచకము తెనుఁగుగాను; ఉత్తరపదము తత్సమముగాను నున్న మిశ్రద్విగు సమాసమగును.

(i) మిశ్ర ద్విగువు బహువచనాంతమగును.

రెండు లోకములు.

నాలుగు పురుషార్థములు (సు. వ్యా. సమాస. 10)

(ii) ఇది ఏకవచనాంతము నగును.

నల్దిక్కు, ముల్లోకము (ప్రౌ. వ్యా. సమాస. 20

**మిశ్రము**

సమాస భేదము.

సంస్కృత సమములతోడను, అచ్చిక శబ్దములతోడను గూడిన సమాసములు మిశ్ర సమాసములనఁబడును.

రాజుముదల, చెఱువు నుదకము, సిరివల్లభుఁడు.

(బా. వ్యా సమాస 3

్రశవాక్యము

అప్రధానమగు ఆఖ్యాతముతోఁగూడిన సామాన్యవాక్యము.

సువృష్టి కలిగెనేని దేశము సుభిక్షమగును. (మం. ప. వ్యా. వాక్య. 8)

్ర్శ సమాసము

సంస్కృత సమశబ్దములును, శుద్ధాంధ్ర శబ్దములును కలిసి సమసించిన సమాసము. ఉదా:- పద్మాకరపుఁదావిచెలువు, సర్వైశ్వర్యపు లక్ష్మినెలవు. యో॥ ఈ సమాసమున శుద్ధాంధ్ర శబ్దములు సంస్కృతసమశబ్దములతోను సమసింపవచ్చును. ఉదా:- పంట కలువకంటిపట్టి రామణీయకము మొ: (చింతా. హలంత. 47; స. సా. సం. II సమాస. 16, 17) చూ:- మిశ్రము.

మీననేత్రి

(i) అజ్ఞాదులకుఁదప్ప సంయోగోపథలకు జీప్రత్యయము లేకపోవుటనుబట్టి యందు చేరని నేత్ర శబ్దమునకు జీ (ఈ) చేరదు. ఇది పాణినీయ నియమము. అందుచే 'మీననేత్రి' శబ్దము సాధువుకాదని చిన్నయసూరి యుద్ఘాటించెను.

(బా. వ్యా. తత్సమ. 83)

(ii) మీనముల నేత్రములవంటి నేత్రములుకలది—ఈ యర్థమునందసాధువైనను 'మీనములకు నాయకురాలు' అను నర్థము నందీ పదము సాధువగునని యొకానొక సమర్థనము. (గు. ప్ర. పుటలు. 48,49)

(iii) "పాణినీయము ననుసరించి సూరి "మీననేత్రి, పద్మనేత్రి" మున్నగునవి యసాధువులని తలంచుట సరికాదు. ముగ్ధబోధ వ్యాకరణము 265 సూత్రపు వ్యాఖ్యలో 'నేత్ర' శబ్దమంగాదులలో చేర్పఁబడెను."

(బా. వ్యా. ఉ. పుట. 142)

మీన్వాదులు

(మీను+ఆదులు) మీను, చేను, పేను, మున్నగు శబ్దములు. బహువచనము పరమగునపుడు వీని నువర్ణమునకు లోపము బహుళముగా వచ్చును. ఉదా:- మీలు, మీనులు మొ॥ (వై. చం. అజంత. 63)

ముకారము

అకారాంతములగు స్థావర తిర్యక్పదములను దెనుఁగుసేయునపుడు మకారమంతమందుఁజేరును.

దాన కల్పకుజము

(కా. చూ. IX. 25,23)

దర్పోగ్రసింహము

**ముకారాంతములకు నాలు**

ముకారాంత శబ్దములకు ముకార లోపము,-ఆలు శబ్దము బహువచనము నందొక్కొక్కచోఁగల్గును.

వృక్షములు—వృక్షాలు.

వజ్రములు—వజ్రాలు. (స. సా. సం. I. విభక్తి. 70,71)

**-ము**[1]

అమహద్వాచక నామములకంటె పరమందు విభక్తి పరమగునపుడును, సుప్రత్యయస్థానమునను వచ్చు మువర్ణకముమీద వచ్చు వర్ణకము. **ఉదా:-** వనమ్ము (వనము+ము) (చింతా. అజంత. 35). ఇది పరమగునపుడు **పూర్వ** మువర్ణకము లోని ఉకారమునకు లోపము వచ్చును.

**-ము**[2]

స్త్రీ వాచకములుకాని అమహన్నామములకంటె విభక్తి ప్రత్యయము పరమగునపుడును, సు(ప్రథమైకవచన) ప్రత్యయ స్థానమునునువచ్చు వర్ణకము. ఉదా:- వనములు, వనముల (విభక్తి పరముకాగా), వనము (సు ప్రత్యయస్థానమున) (చింతా. అజంత. 34). ప్రాచీనుల మతమున ఈ మువర్ణకముమీఁద మరల మువర్ణకము వచ్చును. ఉదా:- వనమ్ము మొ॥ (చింతా. అజంత. 35)

**-ము**[3]

దేశ్యమగు అస్మచ్ఛబ్దము (నా అనునది) కంటె పరమైన జస్ (ప్రథమాబహువచన) ప్రత్యయస్థానమున ఆదేశముగ వచ్చు ప్రత్యయము (చింతా. హలంత. 14) ఉదా:- మేము. ఇట ఏతయోర్బహుత్వేమః (చింతా. హలంత. 19) అను సూత్రముచే నాలోని నకారమునకు మకారాదేశమును 'ప్రథమా యామేదస్మదః, (చింతా. హలంత. 18) అను సూత్రముచే అకారమునకు ఏకారాదేశమును వచ్చును.

**-ము**[4]

ప్రార్థనార్థమున మధ్యమపురుష - ఏకవచనమునవచ్చు ప్రత్యయము. పద్యావసానమున్ననిది వైకల్పికమని కొందఱ మతము. **హల్లు** పరమగునపుడీ మువర్ణమునకు లోపము వైకల్పికము. అచ్చుపరమగునపుడు మాత్రము లోపమురాదు. (అథ. కా. క్రియా. 7; చింతా. క్రియా. 28) ఉదా:- చూడుముతోయజేక్షణ, ననుఁగృపతోడఁజూడు (పద్యావసానమున ములోపము) కృపఁజూడు భారతీ (హల్లు పరమగునపుడు ములోపము) రక్షింపుమునన్ను వేగ ఘటింపు మమల చరిత మొ॥

**-ము**[5]

మధ్యమపురుష - ఏకవచనప్రత్యయమగు వు వర్ణకమునకు ఆశీరర్థమునవచ్చు ఆదేశము. ఉదా:- దీర్ఘాయువగుము మొ॥ (అథ. కా. అజంత. 66) ఈ యాదే

శము శాప, సంప్రార్థన, విధ్యర్థములందును వచ్చును. ఉదా :- రాక్షసుఁడవగుము (శాపార్థము), నన్ను రక్షింపుము (ప్రార్థనార్థము), ఈ కార్యము చేయుము (విధ్యర్థము) మొ॥

**ముక్కులోనగునవి**

'ముక్కు' లోనగు నవయవములకు, తదితరములకు, అవి లోపించునపుడు మతుబర్థమందు- ఇఁడి వర్ణకమగును.

ముక్కిఁడి - ముక్కులేనివాఁడు.

ముక్కు, వాలు, సిగ్గు, వెరవు మున్నగునవి.

(బా. వ్యా. తద్ధిత. 24)

**ముఖ్యము**

(వ్య.) గౌణము

సమాసాంతర్గత పదప్రవృత్తి గౌణము. వ్యస్తమగు పదప్రవృత్తి ముఖ్యము.

రాజు——ముఖ్యము.

హతరాజుఁడు——గౌణము. (క. చిం. సంజ్ఞా. 44)

**ముఖ్యవాక్యసంధాయకము**

రెండుస్వతంత్ర వాక్యములను గలుపుశబ్దము.

నారదుఁడు దమయంతీ స్వయంవర వృత్తాంత మింద్రాదుల కెఱిగించి, నిజవాసమునకేగె మఱియు నింద్రాదులు భూలోకమున కేతెంచిరి.

(మ. ప. వ్యా. సంధా. 5)

**ముఙ్జు**

మధ్యమపురుష ఏకవచనమగు -ము; బహువచనమగు - డుఙ్ అను రెంటి ప్రత్యాహార సంజ్ఞ ముఙ్జు.

ఇందు ఙకార మిత్సంజ్ఞకావున బిందుపూర్వకమగును.

రక్షింపుఁడు. (బా. వ్యా. క్రియా. 81)

**ముగంతము**

ముక్+అంతము.

(చూ.) ముగాగమము.

వృక్షములు, వృక్షమును, (బా. వ్యా. సమాస. 5)

**ముగాగమము**

మువర్ణకాంతములగు శబ్దములకు మువర్ణకేతరమయిన విభక్తి పరమగుచో ముగాగమ మగును.

వృక్షములు.

వృక్షమునందు ఇత్యాదులు. (బా. వ్యా. తత్సమ. 40)

**ముత్తియ శబ్దేతరములు**

'ముత్తియము'ను శబ్దముకాక, తదితరములగు - ఇయాంత శబ్దములు.

'ముత్తియ' శబ్దమునకే చిన్నయసూరి ఇత్వలోపమును వేరొక్కానగా, బహుజనపల్లి సీతారామాచార్యులవారు, కన్నియ, దివ్వియ, కల్లియము, పల్లియము, వీడియము మున్నగు మఱికొన్ని శబ్దములకుఁగూడ ఇత్వలోపము ననేకప్రయోగములను ప్రదర్శించుచు నిరూపించెను.

కన్నియ < కన్నె / కన్య

దివ్వియ < దివ్వె / దివ్య ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 49)

**ముత్తు**

ముఙ్ + జీత్తులు (చూ.) కలిసి ముజ్జీత్తులనఁబడును. వీనికే 'ముత్తు' అను ప్రత్యాహార పద్ధతిని చిన్నయసూరి సంజ్ఞా కల్పనముగావించెను.

| | |
|---|---|
| మధ్యమ ముదుజ్జులు | —2 |
| జీత్తులు | 11 |
| | 18 |

మొత్తము 18 ఇత్సంజ్ఞ లీ సంక్షిప్త సంజ్ఞలో నిమిడియున్నవి.

(బా. వ్యా. క్రియా. 86)

**ముత్తు[2]**

అమహత్పదములమీఁది సుప్రత్యయ (ప్రథమైకవచన) స్థానమునవచ్చు ప్రత్యయము. ఇందలి తకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ము' మిగులును. ఉదా:- వనము, ధనము, గుణము మొ॥ (మం. ఆం. కౌ. 160).

**ముత్వము**

ముకారము.

స్థావర తిర్యక్పదములకిది చేరును.

వృషము, హంస (ము), చరిత్ర (ము). (ఆం. కౌ. 222, 228)

**ముదాదులు**

ముత్+ఆదులు.

'ముత్' మున్నగు హలంత స్త్రీలింగ శబ్దములు. వీని ప్రథమైక వచనమునకు లోపము గలుగదు.

ముదము, ఉపానహము, స్రజము ఇత్యాదులు. (బా. వ్యా. తత్సమ. 72)

**మువ్వంతము**

(మువు+అంతము) ప్రథమైకవచనమునవచ్చు ము, వు అనునవి అంతమందుఁ గల పదము. ఉదా:- వనము, వనంబు మొ॥ వీనిపై వచ్చుజీ ప్రత్యయమునకు (సప్తమ్యేక వచనమునకు) 'న' ఆదేశమగును. ఉదా:- వనమున, వనంబున మొ॥ (అథ. కా. అజన్త. 16).

**ముయ్యేడ్వాదులు**

ముయ్యేడు+ఆదులు—ముయ్యాఱు, ముమ్మడుగు మున్నగునవి.

ఇందు 'మూఁడు' శబ్ద లుప్తశేషరూపమగు 'మూ' అనునది హ్రస్వమగుట, మీది హల్లు ద్విత్వమగుట నిత్యము. (పౌ. వ్యా. సమాస. 10)

**ముజంతములు**

ముజ్+అంతములు.

ముకారాంతములగు శబ్దములు.

వృక్షము, ఋక్షము, ఇత్యాదులు. (ఆం. భా. భూ. 92)

**మువర్ణకము[1]**

అదంతములయిన అమహద్వాచకములకును; నపుంసకలింగ శబ్దములకును ము వర్ణకమగును.

వృక్షము, ఋక్షము, దైవము.

కళత్రము, అపత్యము. (బా. వ్యా. తత్సమ, 89)

**మువర్ణకము[2]**

అస్మద్యుష్మచ్ఛబ్దార్థకమగు 'మన' యను శబ్దముపైని వచ్చు ప్రథమా బహువచన ప్రత్యయము. ఉదా:- మనము భక్తులము మొ॥ (అథ. కా. హల్లన. 15).

**మువర్ణకాంత విశేషణము**

మువర్ణక మంతమందుఁగల విశేషణము,

దీని విశేష్యము బహువచనమందున్నను ఈ విశేషణము బహుళముగానేక వచనమందుండనగును.

కులిశధారలు < కుంఠితమయ్యెను / కుఁఠితములయ్యెను

ఇష్టములగు / ఇష్టమగు > పదార్థములు (బా. వ్యా. కారక. 20)

**మువర్ణకేతర విభక్తి**

మువర్ణకముకాక ఇతరమగు విభక్తి.—లు, —ను, చేత, —కొఱకు ఇత్యాదులు.

ఇవి పరమగునపుడు ముగాగమమగును.

పుస్తకము (ము: వర్ణకము).

పుస్తక+ము+లు (మువర్ణకేతర విభక్తి).
↓
ముగాగమము. (బా. వ్యా. తత్సమ. 40)

**మూర్ఖ ధూర్త వృద్ధ నీచపదాళి**

ఈ పదములకు—డుఙ్ వికల్పముగాఁజేరును.

మూర్ఖుఁడు—మూర్ఖు

ధూర్తుఁడు—ధూర్తు

వృద్ధుఁడు—వృద్ధు

నీచుఁడు—నీచు. (రంగ. IV. 59-62)

**మూర్ధన్యములు**

మూర్ధము స్థానముగా నుచ్చరింపఁబడుధ్వనులు.

ఋ, ౠ, ట, ఠ, డ, ఢ, ణ, ర, ఱ, ష, ళ అనునవి.

(ప్ర. వ్యా. సంజ్ఞా. 41)

**మూర్ధభవములు**

మూర్ధస్థానమునుండి పుట్టిన ధ్వనులు.

(చూ.) మూర్ధన్యములు. (ఆం. శా. 62 పంక్తి)

**మృదుభాషుఁడు**

"జని చాత్ర భవేదేనిరిత్యాహ మృదుభాషణః" (స్త్రీలింగేతర ప్రథమాబహు వచనమునకును 'ఏని' వర్ణకమువచ్చును. అథ. కా. అజన్త. 88) అను కారిక యందీతఁడు పేర్కొనబడియున్నాఁడు. ఇతఁడొక లక్షణకర్తయని నిరూపించుట కితరాధారములు కానరావు. అథ. కా. యందు మృదుభాషణమ్ అనియే పాఠ మున్నను మృదుభాషణః అను అహోబలపండితీయపాఠమే(పేజీ 859) యుక్తము, ససందర్భము. (ఆం. వ్యా. వి. పేజీ. 196).

**-మె**

తదాది (అ, ఈ, ఏ అను) శబ్దములపై స్త్ర్యర్థమునవచ్చు దేశ్య శబ్దము ఉదా:- ఆమె, ఈమె, ఏమె (మ్సం. ఆం. కౌ. 390)

**-మెయి**

(చూ.) మై.

జడ పదముల మీఁది - తోడ వర్ణకమునకు 'మెయి'గాని 'మై'గాని వికల్పముగా నగును.

తెనుఁగున రచయింపు మధికధీశక్తిమెయిన్. (ప్రౌ. వ్యా. శబ్ద. 18)

**-మై**

చూ. మెయి.

జడ పదముల మీఁది - తోడ వర్ణకమునకు వికల్పముగానగును.

మోహముఁబాయఁగఁద్రోచి భక్తిమైన్.

(ప్రౌ. వ్యా. శబ్ద. 18; స, సా. సం. 1. విభక్తి. 86, 87)

**మైత్రి**

స్నేహము.

స్నేహపూర్వక సంబోధనమునందు ఓరి-; ఓసి - అను శబ్దములు పూర్వాగమములగును.

ఓరి చిన్నికృష్ణ!

ఓసి ముద్దుబాల!! (బా. వ్యా. తత్సమ 16)

**మ్ము**

దేశ్యములగు యుష్మదస్మచ్ఛబ్దముల(నీ, నా యనువాని) కంటె పరమందున్న శస్ (ద్వితీయా బహువచన) ప్రత్యయ స్థానమున వచ్చు ఆదేశము. ఇది పరమగునపుడు నీ, నా శబ్దములలోని దీర్ఘమునకు హ్రస్వము వచ్చును. ఉదా:-

మిమ్ము, మమ్ము (చింతా. హలంత. 15) బహుత్వమున నీ, నా శబ్దములలోని నకారమునకు మకారాదేశము, (చింతా. హలంత. 19) సంయుక్తాక్షరమగు 'మ్ము' అని దాని యందొక హల్లునకు వికల్పముగా లోపమువచ్చును. ఉదా:- మిము; మము - మిమ్ము మమ్ము (చింతా. హలంత. 16).

**మ్లేచ్ఛభాష**

తురుష్కభాష.

ఇది శ్రుతి గర్హితమైనను యుద్ధరంగమందు తురుష్కసైనికుల సంభాషణాదికమును నిరూపించుటకు దీని సుపయోగింపవలసి యున్నది.

"ఖూబుఖోడాకితే, తుముకీభాయిల భాయిధేములికి" యని సైనికులు మింటికిఁబోవుచు సంభాషించుకొందురఁట. (అప్ప. I, 66-70)

**య**

తాలవ్యాంతస్థము (Palatal semi-vowel)

కఠిన తాలువు—స్థానము

జిహ్వామధ్యము—కరణము

ఈషత్ స్పృష్టము—ప్రయత్నము

నాదము

అల్పప్రాణము

**యంతము**

(ఇ+అంతము) ఇకారమంత మందుఁగల శబ్దము (ఇట ఇ+అంతము అని యుండఁగా యణాదేశముచే యంతమని రూపము, (అథ. కా. అజంత. 22).

**యకారము**

అచ్చుపై నచ్చున్నచోనది యకారమగును.

'ఎంత యమ్మా! యింతి! యివి' యనినయట్లు. (ఆం. కౌ. 70)

**యకారాగమసంధి**

ద్రుతమంతమందులేని శబ్దముల తుదినున్న యచ్చుల కచ్చులు పరమగుచో యకార మాగమముగా వచ్చును.

మేన యత్త

హరి యతఁడు

శ్రీ యిచ్చెన్

(ప్ర. వ్యా. 58)

**యడాగమము**

యట్+ఆగమము

యకారము టిత్తుగావున పరపదముయొక్క ఆదియందు వచ్చును.

సంధిలేనిచోట స్వరమునకు స్వరము పరమగుచో యడాగమము వచ్చును.

హరి+అతఁడు

హరియ్+అతఁడు ⟶ హరియతఁడు.

ఈ యాగమ యకారము లఘువు. (చూ.) (బా. వ్యా. సంధి 4)

**యణ్ సంధి**

ఇ, ఉ, ఋలకు సవర్ణములుకాని యచ్చులు పరమైన య్, వ్, ర్, లు ఆదేశమగును.

పత్+ఇ+ఆజ్ఞ ⟶ పత్య్+ఆజ్ఞ ⟶ పత్యాజ్ఞ

గుర్+ఉ+ఆనతి ⟶ గుర్వ్+ఆనతి ⟶ గుర్వానతి

మాత్+ఋ+ఆదరము ⟶ మాత్ర్+ఆదరము ⟶ మాత్రాదరము

ఇ, ఉ, ఋ లకు యణ్ణులని వ్యవహారము.

(ఆం. భా. శా. సంధి 100, 101, 102)

**యత్ప్రకృతులు**

ఏ, ఆ, మున్నగునవి.

యద్గుణము, తత్పురుషము. (ఛం. ద IV. 112)

**యత్కిమర్థకము**

ఎవఁడు లేక ఎద్ది యనునర్థము నిచ్చునది.

ఎవఁడు విద్వాంసుఁడో అతఁడు మాన్యుఁడు-(యదర్థకము).

ఎవఁడు విద్వాంసుఁడు? (ప్రశ్నార్థకము=కిమర్థకము).

(బా. వ్యా. అచ్చిక. 24)

**యదాదులు**

యత్, తత్ మున్నగునవి.

వీనికిఁగూడ భవచ్ఛత్రాదులకువలె తెలుఁగున స్వతంత్ర ప్రయోగములేదు.

యదర్థము, తత్కాలము. (క. మం. పుట 128)

**యదార్థకము**

(యదా+అర్థకము) యదా అను సంస్కృత శబ్దము అర్థముగల ఎపుడు అనునది. ఇది కళాసంజ్ఞకము. (చింతా. సంజ్ఞా 40) 'నేనెప్పుడుఁగొల్చెదన్' ఇత్యాది వాక్యములలోని 'ఎప్పుడు' సదాయను నర్థమిచ్చునది ద్రుత ప్రకృతిక మే (అహో. సంజ్ఞా. 40).

**యాదులు**

యకారము మొదలైన యంతస్థములు య, ర, ల, వ లు.

(మ. ప. వ్యా. వర్ణ. 14)

**యాయొదవుట**

యకార మచ్చునకుఁజేరుట.

అచ్చున కచ్చుపరమగునపుడు సంధిలేనిచో యకారము పరాచ్చునకొదవును.

హరి+ఇతఁడు ⟶ హరియితఁడు. (స. సా. సం. సంధి. I. 18)

**యి, సి, రి వర్ణములు**

ఈ వర్ణములు 'ఓ' అను శబ్దమునకు పురుష, నీచస్త్రీ, నీచపురుష సంబోధనమునందంతాగమములుగా విభాషనగును.

ఓయి—పురుషసంబోధనము: ఇది స్వతంత్రముగను బ్రయోగింపఁబడును.

ఓసి—నీచస్త్రీ సంబోధనము ఓసి దుష్టురాల!

ఓరి—నీచపురుష సంబోధనము. *ఓరి దుష్టుఁడ!*

ఓసి, ఓరి యనునవి మైత్రియందును నుపయుక్తము.

(బా. వ్యా. తత్సమ. 15)

**యుగ్మము**

జంట, జత

వర్గ ద్వితీయ, చతుర్థవర్ణములు.

ఖ—ఘ

ఛ—ఝ

ఠ—ఢ

థ—ధ

ఫ—భ

వర్గయుక్కులకు (చూ.)యుగ్మములనియు వ్యవహారము. (తె. వా. వి. పుట. 28)

**—యుఙ్**

అకారాంత, ఇకారాంత పదములపై —'యు' అనునది చేరును.

అన్నయు, తల్లియు (ఆం. భా. భూ. 67)

**యువర్ణకము:-**

ఇకారాంత శబ్దములపైనను, ఒకానొకప్పుడు ఇకారాంతేతర శబ్దములపైనను స్వార్థకమునను, సముచ్చయార్థమునను వచ్చు వర్ణకము. ఇది ప్రథమా ద్వితీయా విభక్తులందే వచ్చును. ఉదా:- ప్రీతియున్, భారత శ్రవణాసక్తియు, తద్దయు వేడ్కన్ మొ॥ (అధ. కా. అజంత 22, 23)

**యుష్మచ్ఛబ్దము**

'నీవు' అనునర్థమిచ్చుశబ్దము.

ఏ. వ.—నీవు

బ. వ—మీరు (ఆం. కౌ. 238-240)

**యుష్మత్ పదములు**

నీవు, మీరు—ప్రథమా విభక్తి

నిన్ను, మిమ్ము—ద్వితీయా విభక్తి

ఇట్లే యితర విభక్తులందు వచ్చునవి. (ఆం. భా. భూ. 106)

**యుష్మదర్థకము**

నీవు, మీరు అనునర్థము నిచ్చు సర్వనామము.

(బా. వ్యా. ఆచ్ఛిక. 24)

**యుష్మదర్థ బహువచనోక్తి**

మీరు— { ఘనులు, ఘనులరు / ప్రసిద్ధులు / ప్రసిద్ధులరు } (స. సా. సం. I. సంధి. 162)

**యుష్మదస్మదుక్తులు**

ఏ.వ. { నీవు / నేను } > మనము బ. వ. (కా. చూ. IX. 116)

**—యొక్క—**

షష్ఠీ విభక్తి ప్రత్యయము. షష్ఠీ శేషే (అష్టా. 2-3-50) అను సూత్రముచే కర్తృ, కర్మ, కరణాదికారకములకంటెను, ప్రాతిపదికార్థముకంటెను భిన్న

మగు స్వస్వామిభావాది సంబంధ విషయమున సంస్కృతమున షష్ఠి విధింపఁబడి నది. దీనినే శేషషష్ఠి యందురు. అట్టి షష్ఠి వచ్చుచోట్ల తెలుఁగులో 'యొక్క' అను ప్రత్యయము వచ్చును. ఉదా:- రామునియొక్క గుణములు, సీతయొక్కభక్తుఁడు మొ॥ (చింతా. అజంత. 32) చూ:- శేషషష్ఠి.

**యొక్క షష్ఠి**

షష్ఠ్యర్థమునందు, అనఁగా సంబంధార్థమునందు వచ్చు 'యొక్క' అనువిభక్తి. ఇది తఱచుగా కానిపింపక యడఁగి యుండును.

రాజు కొడుకు. (స. సా. సం. 1. విభక్తి. 14)

**యోగ్యత**

వాక్యార్థ జ్ఞానమునకు హేతువులగు ఆకాంక్షాదులలో నొకటి. అర్థమునకు బాధలేకుండుటయే యోగ్యత (అర్థాబాధో యోగ్యతా. త. సం. శబ్ద) 'అగ్నినా సించతి' మున్నగు వాక్యములలో యోగ్యత లేకుండుటచే వాక్యార్థ జ్ఞానముకలు గదు, 'అహమాదీనాం ద్విత్వమ్ (చింతా. సంధి, 19) అను సూత్రముచే విధింపఁ బడిన ద్విత్వము అనుకరణేతర స్థలములందు చెప్పిన అర్థబాధ కలుగును. కనుక యోగ్యతాబలముచే నీ ద్విత్వము అనుకరణమునందే వచ్చును.

**య్యంతశబ్దములు**

(యి+అంత, శబ్దములు) 'యి' వర్ణము అంతమందుఁగల పొయి, రాయి మున్నగు శబ్దములు. వీనిలో కొన్నింటికి లు ల లు యథాయోగ్యముగానగును. ఉదా:- పొయులు, పొయులన్ మొ॥ (అథ. కా. అజంత. 49).

**ర[1]**

దన్తమూలీయ తాడితము

దన్తమూలము—స్థానము

జిహ్వాగ్రము—కరణము

తాడిత ప్రయత్నము. ఈషత్ స్పృష్టము

నాదము

అల్పప్రాణము

దీనిని ద్రుతవర్ణము (liquid sound) అందురు.

**ర[2]**

లకారాంత శబ్దములకు పరమందున్న శస్ - (ద్వితీయాబహువచన) ప్రత్యయ స్థానమునవచ్చు ఆదేశము. ఉదా:- బాలురన్, సుశీలురన్ మొ॥ (చింతా. అజంత. 15) ఇట లకారాంత శబ్దములనఁగా అకారాంతములగు లోపధములని భావము (అహో. అజంత. 15). కనుకనే ధీశాలి, బుద్ధిశాలి మున్నగునవి లాంతములైనను

అవర్ణాంతములు కాకపోవుటచే వీనిపై రవర్ణకమురాదు. ఉదా:- బుద్ధిశాలులన్, ధీశాలులన్, మృదుశాలులన్ మొ॥

**ర$^{3}$**

ఋకారాంత శబ్దముల ద్వంద్వసమాసమున పూర్వపదమందలి ఋవర్ణమునకు వచ్చు ఆదేశము. (చింతా. అజంత. 66) 'ఉర్ధ్వంద్వేరః'అను పై సూత్రములోనికి తరువాతి 'క్వచిద్గికారోవః'అను సూత్రమునుండి క్వచిత్ అను పదము అపకర్షింపఁబడుటచే ఈ రేఫాదేశము వైకల్పికము. రేఫాదేశము రాని పక్షమున 'ఆనఙృతో ద్వంద్వే (అష్టా. 6.3.25) అను సూత్రముచే ఆనజాదేశము వచ్చును. ఉదా:- మాత్రపితృబుద్ధి (ర-ఆదేశము), మాతాపితృబుద్ధి (ఆనజాదేశము) రాదేశము శౌరికవికి ఇష్టమని అథ. కా. యందు తెలుపఁబడినది. (అథ. కా. అజంత. 47).

**ర$^{4}$**

సమాసమునందాలు శబ్దము పరమగునపుడువచ్చు ఆగమము. ఈ యాగమము వచ్చినపుడు పూర్వపదాంత్య వర్ణమునకు ఉకారాదేశము వచ్చును. ఒకానొకచో ఉకారాదేశము రాక కేవలము రేఫాగమమే వచ్చును. ఉదా:- ధీరురాలు (ధీర+ఆలు), బుద్ధిమంతురాలు (బుద్ధిమంత+ఆలు – ఉకారాదేశ, రేఫాగమములు), పేదరాలు, (పేద+ఆలు), గొడ్డురాలు (గొడ్డు+ఆలు) – కేవలరేఫాగమము (అథ. కా. సంధి. 25; చింతా. సంధి. 84). ఈ రేఫాగమము సామానాధికరణ్యములందే (కర్మధారయములందే) వచ్చుటచే వెలయాలు, ఇల్లాలు మున్నగు సామానాధికరణ్యములేని సమాసములందురాదు (అహో. అజంత. 84).

**రంగరాయ కవి, కస్తూరి**

ఆనంద రంగరాట్ ఛందము (చూ.) అను లక్షణగ్రంథమును రచించెను.

ఇందనేక వ్యాకరణాంశములు గలవు.

ఈతనికి 'లక్షణకవి'యను బిరుదమున్నది.

ఇతఁడు క్రీ. శ. 16వ శతాబ్దివాఁడుగా భావింపఁబడెను.

**రంగవల్లి**

సంస్కృతమునందును, నవీనార్యభాషలయందును ఆనునాసిక్య సూచకముగా అక్షరముపై భాగమునందు అర్ధచంద్రాకారముగా ౕ అనుగుర్తు నుంతురు, దీనికే 'రంగవల్లి' యని పేరు.

తక్రాఁ, హాఁస్, దాఁత్

ఇట్టి రంగవల్లినే తెలుఁగున చుక్కలేకుండ నిలువబెట్టి యర్ధానుస్వార చిహ్నముగావించి యుందురని కొందలు భావించుచున్నారు.

(తె. వ్యా. వి. పుట. 102)

**రంజతి ఘట్యాదులు**

(రంజతి, ఘటి+ఆదులు) రంజించు, ఘటించు, భేదించు, శోభించు, వర్తించు మున్నగు అకర్మక క్రియలు. వీనిలోని బిందుపూర్వక చకారమునకు ద్విత్వలకార మాదేశమగును. ఉదా:- రంజిల్లు, ఘటిల్లు, భేదిల్లు, శోభిల్లు మొ॥ (చింతా. క్రియా. 39) ప్రేరణార్థకమగు ఇంచుగాగమములోని చకారమునకు ద్విత్వలకార మాదేశముగరాదు. ఉదా:- రంజించెను (రంజిల్లఁజేసెను), ఘటించెను (ఘటిల్లఁ జేసెను) మొ॥ (చింతా. క్రియా. 40) ఇట స్వార్థమునవచ్చిన ఇంచుక్కునకు లోపము వచ్చినది.

**రంజాదులు**

రంజ, భిద, సంధి, రాజ్, భాస్, మున్నగునవి.

వీనికి స్వార్థమందు పరమగు - ఇంచు(క్) లోని బిందుపూర్వకమగు చకార మునకు ద్విరుక్త లకార మాదేశమగును.

రంజిల్లు, భేదిల్లు, సంధిల్లు, రాజిల్లు, భాసిల్లు మొదలైనవి.

(బా. వ్యా. క్రియా. 71)

**రంజివస్యాదులు**

(రంజి, వసి+ఆదులు) రంజ (రాగే), వసఁనివాసే, అర్థ (యాచ్ఞాయామ్), లిఖ (లేఖనే) మున్నగు ధాతువులు. వీనిని తెనుఁగులో తత్సమక్రియలుగా వాడు కొనునపుడు ఇవి ఎట్టి మార్పు లేకుండనే మూలములగును. ఇవి తెనుఁగున సంవృతి క్రియలనఁబడును. (అథ. క్రియా. 4,7) ఉదా:- రంజించు, వసించు, అర్థించు. చూ:- సంవృతిక్రియలు.

**రమణీయము**

కర్త: 'కళాప్రపూర్ణ' దువ్వూరి వేంకటరమణశాస్త్రి.

బాల వ్యాకరణమున కిదియొక యపూర్వమగు సమీక్షాగ్రంథము. 160 పుటల లోఁగల దీని యుపోద్ఘాతమునందనేక విశేషాంశములతోపాటు బాలవ్యాకరణము హరికారికల కనువాదముకాదని బాలవ్యాకరణమునకు సంస్కృతీకరణమని స్థాపింపఁబడెను.

చిన్నయసూరి యాత్మీయత, శాస్త్ర నైశిత్యము నిందు సూక్ష్మముగా నిరూపితము.

**రయుగము**

మధ్యమ పురుషైకవచనము హీనత్వ, ప్రియత్వార్థములనుఁదెలుపు 'రారా' యనునాగమము ఉదా :- రారా ప్రల్లదములేల రణమొనరింపన్ (హీనత్వము) రారా శ్రీరామ నన్ను రక్షింపంగన్ (ప్రియత్వము) వీనిలో ద్వితీయరేఫమునకు హ్రస్వమును, ఒకానొకచో ఒకేరేఫమును వచ్చును. ఉదా :- రార దాసుల రక్షింప

(హ్రస్వము), 'మమ్ము రక్షింపరా, చేయరా (ఒకేరేఫము) మొ॥ అథ. కా. క్రియా. 27).

**రసబోధకము**

ఆకస్మికతను, విస్మయాదికమును దెల్పుపదము.

ఔర, ఆహా, కటా, భళిర ఇత్యాదులు. (మ. ప. వ్యా. శబ్ద. 14)

**రాగ చిహ్నము**

ఆశ్చర్యము, సంతాపము, మున్నగు భావములను దెలుపు గుర్తు [ ! ].

ఇవి యేటి మాటలు !

ఆ! ఎంతపని జరిగెను ?

ఎంత మంచివాఁడు పోయెను !? (సం. వ్యా. విరతులు 1.)

**రాజకీరగ**

రామచిలుక, నెలవుకొనుట మున్నగు శబ్దముల గణము. (చూ :-గ) ఈ శబ్దములలోని పూర్వపదము చివరి వర్ణము లోపించును. ఉదా :- రాచిలుక, నెలకొనుట మొ॥ (ప్రై. ఛం. సమాస. 9).

**రాజు**

(i) మహద్వాచకమగు 'రాజు' శబ్దము అప్రధానార్థమందు గాక 'రాజు' అని నిపతింపఁబడెను.

రాజు, ఖగరాజు, మృగరాజు.—ఇందలి జకారము దన్త్యమని చిన్నయ సూరి పేర్కొనెను.

హతరాజుఁడు పరశురాముఁడు—ఇట రాజ శబ్దార్థమప్రధానము.

(బా. వ్యా. సంజ్ఞా. 10; తత్సమ. 78)

(ii) తాలవ్యోచ్చారణముగల 'రాజు' శబ్దము తత్సమమని; దన్త్యోచ్చారణము గల 'రాజు' శబ్దము తద్భవమని కొందఱ మతము.

(క. సం. వి. III—1; ప్రౌ. వ్యా. సంజ్ఞా. 6)

**రామకృష్ణయ్య, కోరాడ**

తెలుఁగు దేశమునందు భాషావిషయిక పరిశోధనమునకు శ్రీకారమును జుట్టినవారిలో ఆద్యులు.

మద్రాసు విశ్వవిద్యాలయము తెలుఁగు శాఖాధిపతులుగను; శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాల యాధ్యక్షులుగను చాలకాలము పనిచేసిరి.

వీరి 'సంధి' పుస్తకము విశేషముగా పఠన పాఠనములందున్నది.

వీరి వ్యాసములనేకములు (i) భాషాచారిత్రక వ్యాసములు (ii) దక్షిణదేశ భాషా సారస్వతములు, దేశి అను గ్రంథములుగాఁ బ్రకటితములైనవి.

**రామభద్రకవి, ముద్దరాజు**

ఇతఁడు 'కవిజనసంజీవని' అను లక్షణగ్రంథమును రచించెను. క్రీస్తు. శ. 16 వ శతాబ్ది వాఁడు. 'శాబ్దిక స్తవనీయ భాష్యకై యట ముఖ్య శబ్ద విద్యానిరూఢి' గలవాఁడుగా నీతఁడు చెప్పుకొనెను. ఈ చిన్ని పుస్తకమునం దట్టి నిరూఢి కానరాదు. అయినను లక్ష్యలక్షణ సమన్వయము కావించు ప్రాచీన లక్షణ గ్రంథములలో నిది యొకటి.

**రాయాదులు**

(రాయ+ఆదులు) రాయ, రెడ్డి మున్నగు శబ్దములు. ఈ శబ్దములు పరమగునపుడు పూర్వశబ్దమందలి హ్రస్వాకారమునకు దీర్ఘము వచ్చును. ఉ:- రామారాయుడు, కోనారెడ్డి మొ॥ ఆర్యాంబా వాచకములగు అయ్య, అమ్మ అను శబ్దములలోని చివరి అకారమునకు ఈదీర్ఘమురాదు. ఉదా:- రామయరాయుఁడు, కోఁనమరెడ్డి మొ॥ (వై. చం. సమాస. 19)

**రావణుఁడు:-**

i) ప్రాచీనాంధ్ర వ్యాకరణ కర్త. ఈతడు మం. ఆం. కౌ. (పరిభాషా..)యందును, అథర్వణుని త్రి. శబ్దా. (కాండ4. సూ. 12, 13) నందును పేర్కొనబడి యున్నాడు.

ii) ప్రాకృత వ్యాకరణ కర్త. ఈతడు "ప్రాకృత కామధేను" వను ప్రాకృత వ్యాకరణమును రచించెను. ఆంధ్ర వ్యాకర్తయగు రావణుఁడు, ప్రాకృతవ్యాకర్తయగు రావణుఁడును ఒక్కరేయనుట కాధారములులేవు.

(ఆం. వ్యా. వి. 183, 184 పు)

**రాహు, బాహు శబ్దములు**

ఈ రెండు శబ్దముల కంతట పువర్ణకలోపము వైకల్పికము.

రాహువు—రాహు; రాహువులు—రాహులు

బాహువు—బాహు; బాహువులు—బాహులు ఇత్యాదులు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 26)

**రి**

పుంలింగమున నీచత్వార్థమున సంబుద్ధి వాచకమగు ఓయి యను వర్ణకమందున్న 'యి' కారమునకు వచ్చు ఆదేశము. ఉదా:- ఓరి తుచ్ఛుడ మొ॥ ఒకానొకప్పుడీ యాదేశము మైత్రి యందును. వచ్చును. ఉదా:— ఓరి మిత్రుఁడా మొ॥ (అథ. కా. అజంత 2).

**రిలు సంధి నడగుట**

'రి'యను నక్షరములోని 'ఇ' సంధిలో వికల్పముగా లోపించుట.

తనరిచి—తనర్చి

ఒనరిచి—ఒనర్చి ఇత్యాదులు (స. సా. సం. I. సంధి 187)

**-రు[1]**

తచ్ఛబ్దాద్యర్థకములగు ఆ, ఈ, ఏ అను శబ్దముల కంటె పరమందున్న ప్రథమా బహువచన ప్రత్యయ (జస్) స్థానమున వచ్చు ప్రత్యయము. ఉదా:- వారు, వీరు, ఎవరు. ఒకానొకచో లు వర్ణకము పరమగునపుడు రు వర్ణకములోని ఉవర్ణమున కత్వము వచ్చును. ఉదా:- వారలు, వీరలు మొ॥ (అథ. కా. అజంత. 35)

**రు[2]**

దేశ్యమగు యుష్మచ్ఛబ్దము (నీ యనునది) కంటె పరమందున్న జస్ (ప్రథమావచన) ప్రత్యయ స్థానమున వచ్చు ప్రత్యయము. (చింతా. హలంత. 14) ఉదా:- మీరు. ఇట "ఏతయోర్బహుత్వేమః" (చింతా. హలంత. 19) అను సూత్రముచే నీలోని నకారమునకు మకారాదేశము. ఉడిగించెదఁదొలఁగి చూచుచుండుడు మీరల్ (భార. ఆది. 7-193) అని యాచార్య ప్రయోగము న్నందున 'మీరల్' అను రూపమును సాధువే యగుచున్నది. (అహో. హలంత. 14)

**రు[3]**

లకారాంత శబ్దములకు పరమందున్న జస్ (ప్రథమాబహువచన) ప్రత్యయ స్థానమున వచ్చు ప్రత్యయము. ఉదా:- బాలురు, సుశీలురు మొ॥ (చింతా. అజంత. 15) ఇచట లకారాంత శబ్దములనఁగా అకారాంతములగు లోపధములని భావము. కనుకనే ధీశాలి, బుద్ధిశాలి ఇత్యాదులు లోపధములైనను అవర్ణాంతములు కాక పోవుటచే వీనిపై ప్రథమా బహువచన ప్రత్యయ స్థానమున రు వర్ణకము రాదు. ఉదా:- బుద్ధిశాలులు, ధీశాలులు మొ॥ (అహో. అజంత. 15)

**రు[4]**

ఉత్తమ పురుషమునందప్ప ఇతర పురుషములందు అన్ని యర్థములందు సమస్త క్రియాపదముల బహువచనము నందు వచ్చు ప్రత్యయము. ఉదా:- పోషించుచున్నారు, పోషింపఁగలరు, పోషింపరు, పోషింతురు మొ॥ (చింతా. క్రియా. 26)

**రుగాగమము**

రుక్+ఆగమము : కిత్సంజ్ఞ

(i) పేదాదులగు అచ్ఛిక శబ్దములకు 'ఆలు' శబ్దము పరమగునపుడు రుగాగమము వచ్చును.

పేద+ఆలు ⟶ పేదర్+ఆలు ⟶ పేదరాలు.

ఇట్లే బీదరాలు, బాలింతరాలు, ఐదువరాలు మున్నగునవి.

(ii) 'ధీర' మున్నగు తత్సమ శబ్దములకు కర్మధారయమునందాలు శబ్దము పరమగునపుడు అత్వమునకు ఉత్వమును, రుగాగమము నగును.

ధీర+ఆలు ⟶ ధీరుర్+ఆలు ⟶ ధీరురాలు.

ఇట్లే గుణవంతురాలు, బుద్ధిమంతురాలు, కాని 'విధవరాలు' అనుచో అత్వమునకుత్వము కలుగుట లేదు. (బా. వ్యా. సంధి. 30,31)

**రుత్వములు**

కొన్ని లాంతములైన శబ్దముల యొక్క తుదలనున్న లుత్వములు రుత్వములగును.

గోపాలులు ⟶ గోపాలురు.

బాలులు ⟶ బాలురు

దీనదయాళులు ⟶ దీనదయాళురు (ఆ. కౌ. 223 224)

**రుఙ్**

బహువచనమందు కొన్ని శబ్దముల మీఁద రు(ఙ్) ఆదేశమగును.

బాలురు, మహీపాలురు,

లలిత దయాళురు. (ఆం. భా. భూ. 71)

**రులుప్రత్యయులు**

రు, లు మున్నగునవి. చూ:- రుల్వాదులు (మం. ఆం. కౌ. 111)

**రుల్వాదులు**

(రు+లు+ఆదులు) రు, లు, డు, లి మున్నగునవి. ప్రాతిపదికముల చివరనున్న వీనికి విభక్తి పరమగునపుడును, సమాసమందును టి, ంటి, తి, ్రి మున్నగు ఔపవిభక్తికము లాదేశములగును (చింతా. సంధి. 39). ఉదా:- ఏరు-ఏటికి; విల్లు - వింటికి; త్రాడు - త్రాటికి మొ॥ (విభక్తి పరమగునపుడు) ఏటికాలువ, వింటికొప్పు, తాటిచెట్టు, గొడ్డంటి చిప్ప మొ॥ (సమాసమున)

**రువర్ణకము**

ప్రథమ, మధ్యమ పురుష బహువచన క్రియల యొక్క అంతమందుండు క్రియావిభక్తి.

(వారు) పోషించుచున్నారు

(మీరు) కొట్టుచున్నారు (ల. వ్యా. క్రియా. 18)

**రూపకసమాసములు**

ఉపమానోపమేయము లభేదముగాఁ జెప్పఁబడిన సమాసములు.

కేలనెడి తమ్మి ⟶ కేలుఁదమ్మి

మోమనెడి తామర ⟶ మోముఁదామర

ఇట్లే కైచిగురు, మోవిపండు మున్నగునవి. (ప్ర. వ్యా. 291)

**రూపగణము**

రూపము—రూపు

సీతము—సీతు

కళంకము—కళంకు మొదలైనవి. (కవిజనాం. 58. పుట)

**రూపాంతరములు**

అర్థము సమానము, శబ్దము భిన్నమునైనవి. రూపాంతరములలో ఈషదర్థ భేదముండునను వాదమున్నను, మాండలిక భేదము లసలైన రూపాంతరము లనఁదగును.

వక్కపొడి—చెక్కపొడి

చెప్పులు—పాపోసులు

అద్దె—బాడుగ

బఱ్ఱె—ఎనుము—గేదె ఇత్యాదులు. (తె. వ్యా. వి. పుట. 118)

**రెండుమాఱు లుచ్చరించు శబ్దములసంధి**

రెండుమాఱులొకే శబ్దము నుచ్చరించినచో రెండవమాఱుచ్చరింపఁబడినది ఆమ్రేడిత మనఁబడును. (చూ.) ఆమ్రేడితము.

'ఆమ్రేడితసంధి' యని యర్థము.

ఒక శబ్దము రెండుమాఱు లుచ్చరించుచో, మొదట నుచ్చరింపఁబడిన శబ్దము యొక్క అంత్యాచ్చు లోపించును.

అన్న+అన్న ⟶ అన్నన్న

ఏమి+ఏమి ⟶ ఏమేమి. (స సా సం. I సంధి. 69-71)

**రేఫగదియుట**

సంస్కృత పదమును విశేషణమును గావించి, సంధి గూర్చుచో రేఫము చేరును. అపుడు సంధి నివారింపఁబడును.

పుణ్య+ఆలు ——→ పుణ్యురాలు

ధన్య+ఆలు ——→ ధన్యురాలు (స. సా. సం. I. సంధి. 127)

**రేఫము**

ర+ఇఫము (చూ.)

ఊది పలుక కున్నచో రేఫము, ఊదిపలుకుచో శకట రేఫము

(స. సా. సం. II. 1)

**రేఫసంధి**

కొన్ని క్రియా పదముల యొక్క అంతమందున్న రేఫకుఁ బూర్వమందున్న చకారములోని గుడికి లోపము వికల్పముగా నగును.

పేరిచిరి ——→ పేర్చిరి

పరిమారిచిరి ——→ పరిమార్చిరి (అప్ప. V. 108,104)

**రేఫాంతములు**

రేఫయంత మందున్న సంస్కృత శబ్దములు. వీనికి తెనుఁగుభాషలోఁ బ్రయోగము లేదు. సమాసములందుఁ దొలుత గదిసి తెలుఁగునఁ బ్రయుక్తములగును.

గీర్వాణి, ధూర్వహము. (బా. వ్యా. తత్సమ. 87)

**రేఫాగమసంధి**

రేఫ ఆగమముగా వచ్చు సంధి.

కర్మధారయ సమాసముల యందు అకారాంత, ఉకారాంత శబ్దములకు 'ఆలు' శబ్దము పరమగునపుడు రేఫ ఆగమము వచ్చును.

పేద+ఆలు ——→ పేదర్+ఆలు ——→ పేదరాలు

ధీరు+ఆలు ——→ ధీరుర్+ఆలు ——→ ధీరురాలు

(ప్ర. వ్యా. సంధి. 60)

**రేయిప్రభృతులు**

'రేయి' మున్నగు శబ్దములు.

బహువచనము పరమగునపుడు వీని యంతిమాక్షరమునకు లోపము కల్గును.

రేయి+లు ——→ రేలు.

బాయి+లు ——→ బాలు.

ఇట్లే వేయి, వ్రాయి మున్నగునవి. (బా. వ్యా. ఆచ్ఛిక. 20)

**రై, గ్లౌశబ్దములు**

వీనికి ఓత్వము విభాషగా నగును.

వీని ప్రథమైక వచనమునకు లోపము.

రో, రై (ధనము)

గ్లో, గ్లౌ (చంద్రుఁడు) (బా. వ్యా. తత్సమ. 64)

**-రో**

సంబోధనార్థమున స్త్రీ వాచక శబ్దముల కంటె పరమందు వచ్చు వర్ణకము (అథ. కా. అజంత. 1,2) ఉదా:- అమ్మరో మొ॥ ఈ రోవర్ణకము వైకల్పికమగుటచే అమ్మ ఇత్యాదులును సిద్ధించును. చూ:- రోశబ్దము.

**-రోశబ్దము**

సంబోధనమునందు స్త్రీ వాచకమునకుఁ బరమగును.

ఇది హ్రస్వాంతము గూడ నగును.

'కమల దళాక్షిరో! వినవుగా'

'రమణిరో! భృత్యులందు (ప్రౌ. వ్యా. శబ్ద. 14)

**ఱ**[1]

దీనినే బండిఱా యనియు, శకట రేఫమనియు నందురు.

(i) ఇది రేఫము యొక్క అలఘూచ్చారణ భేదమని చిన్తామణికర్తయు, అతని ననుసరించి చిన్నయ సూరియుఁ బేర్కొనిరి.

(బా. వ్యా. సంజ్ఞా. 18)

(ii) ఛందోదర్పణమునందు మాత్రమిది ప్రత్యేక వర్ణముగాఁ బేర్కొనఁబడెను. (అ. ఛం. IV. 127)

**-ఱ**[2]

లక్షణములు దెలుపునపుడు, అక్షరములను దెలియఁజేయుట కనువుగా శిక్షార్థము తేతన ఈ శకట రేఫము నుపయోగించెను.

అఱ్ఱంతముపై వుఱ్ఱగును

పురుషాఖ్యలపై ఉఱ్ఱగును, డుఱ్ఱగును (ఆం. భా. భూ. 33,34)

**-ఱిక ప్రత్యయము**

భావార్థమునందు వచ్చు తద్ధిత ప్రత్యయము.

కన్నెఱికము, మన్నెఱికము

పేదఱికము ఇత్యాదులు. (ఆం. కౌ. 789-790)

**ఱే ప్రభృతులు**

ఱే మున్నగు శబ్దములు.

ఱ్ఱేడు, మొక్కలీఁడు మున్నగునవి. వీనికి బహువచనమందు డుజ్ణగు.

ఱేఁడులు—ఱేండ్లు

త్ర్వేఁడులు—త్ర్వేండ్లు (బా. వ్యా. ఆచ్ఛిక. 8)

**ల**[1]

దన్తమూలీయ పార్శ్వికము (alveolar lateral)

దన్తమూలము—స్థానము

జిహ్వాగ్రము—కరణము

పార్శ్వక ప్రయత్నము

నాదము

అల్పప్రాణము

**ల**[2]

మహదమహద్వాచకములకు టాది (తృతీయాది) విభక్తులు పరమగునపుడు బహువచనమునవచ్చు ఆగమము. ఉదా:- భామలచేతన్, అన్నలతోన్, అడవులకు మొ॥ (చింతా. అజంత. 18) "మహతో నితా" (చింతా. అజంత. 18) అను పై యాగమమును విధించు సూత్రమున ని, ల యను నాగమములు మహద్వాచకములపైనే వచ్చునని తెలిపినను అందలి విభక్తౌ అను ఏకవచన ప్రయోగ సామర్థ్యముచే 'ని' మాత్రమే మహత్తులపై వచ్చుననియు, 'ల' మహదమహత్తుల రెండింటిపైనను వచ్చుననియు గ్రహింపవలెను. (అహో. అజంత. 18)

**ల**[3]**(న్)**

లకారాంతములు కాని ప్రాతిపదికములపైనున్న శస్ (ద్వితీయాబహువచన ప్రత్యయ) స్థానమున వచ్చు ప్రత్యయము. ఉదా;- రాములన్ మొ॥ (చింతా. అజంత. 14; అథ. కా. అజంత. 14) ఇట లకారాంతములనగా లోపధములయిన అకారాంతములని భావము. అకారాంతములగు లోపధ శబ్దములపై నున్న శస్ ప్రత్యయస్థానమున మాత్రము రువర్ణకము వచ్చును. ఉదా;- బాలురస్, సుశీలురస్ మొ॥ (చింతా. అజంత. 15) ధీశాలి, బుద్ధిశాలి ఇత్యాదులు లోపధములైనను అకారాంతములు కాకపోవుటచే వీనిపై శస్ స్థానమున లవర్ణకమే వచ్చి ధీశాలులన్, బుద్ధిశాలులన్ మొ॥ రూపము లేర్పడును. (అహో. అజంత. 15)

**లక్షణజ్ఞులు**

లక్షణ జ్ఞానము కలవారు. వీరిని మూఁడు విధములుగా అప్పకవి పేర్కొనెను.

(i) ఉత్తముఁడు:- లక్ష్యలక్షణ పరిజ్ఞానము కలవాఁడు.

(ii) మధ్యముఁడు:- లక్ష్యపద్యవేది

(iii) అధముఁడు:- లక్షణ శ్లోకవేది. (అప్ప. I. 12)

**లక్షణ నవరత్నమాలిక**

కర్త : చిలుమర్తి నరసింహము

క్రీ. శ. 1814-1894

దీనిని ఆచార్య నిడదవోలు వేంకటరావు గారు పరిష్కరించిరి. విపులమగు పీఠిక రచించిరి.

ఇది సీసపద్యమాలిక. ఇందు తొమ్మిది ప్రకరణములు గలవు. తొలి ప్రకరణము వర్ణములను గూర్చి, ఎనిమిదవది సంస్కృత శబ్దములను గూర్చి, తొమ్మిదవది సంధిని గూర్చి.

తక్కినవి ఛందస్సునకు సంబంధించినవి.

**లఘుయకారము**

లఘువుగా నుచ్చరింపఁబడు 'య' కారము (చూ.) లఘూచ్చారణము.

(వ్య.) అలఘు యకారము (చూ.)

సంధిగతమగు యకారము లఘువు.

హరి+య్ అతఁడు —హరియతఁడు. అవయవికమగు కాయ, బోయ మున్నగువానిలోని యకారము అలఘువు. (అప్ప. II. 222, 224)

**లఘురేఫము**

లఘూచ్చారణముగల రేఫము - ర. (చూ.) (వ్య.) అలఘురేఫము (అ) రేఫమునకు లఘురేఫమనియు, సాధురేఫమనియు వ్యవహారము.

(బా. వ్యా. క్రియా. 88)

**లఘువులు**

అంతస్థములగు య-ర-ల-వ అనువానిని ఉచ్చారణమును బట్టి రెండు తెఱఁగులుగా విభజింపనగును.

(i) **లఘువులు** :- లఘూచ్చారణము కలవి. స్థానకరణ సంయోగమందు వీని నుచ్చరించునపుడు శైథిల్యముండును. (loose contact)

హరియతఁడు—అనుచో సంధిగతమగు యకారము

గిరి, **హరి**—ఇత్యాదులలోని రేఫము

తల, నెల—ఇత్యాదులలోని లకారము

నిద్రపోయెను,—పాదేశ పకారము ఇవి లఘువులు.

(ii) అలఘువులు (చూ.) స్థానకరణ సంయోగము నందు శైథిల్యములేనివి.

(అప్ప. II. 171; బా. వ్యా. సంజ్ఞా. 18)

**లఘూపధము**

లఘువు ఉపధ (చూ.)గాఁ గలది.

ఇట్లున్న సంస్కృత ధాతువునకు ఇంచు(క్) (చూ.) ఆగమము పరమగుచో గుణము (చూ.) వచ్చును.

ఛిద్+ఇంచు (క్) —ఛేదించు

ఘుష్+ఇంచు (క్) —ఘోషించు

హృష్+ఇంచు (క్) —హర్షించు. (బా. వ్యా. క్రియా. 66)

**లజీ**

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకు లజి వర్ణకమగును.

జీత్తు పరమగునపుడు ధాతువుయొక్క ఉత్వమున కత్వమగును.

వండఁడు, వండరు; వండదు, వండవు

వండవు, వండరు;

వండను, వండము (బా. వ్యా. క్రియా. 7;80)

**లఙ్**

ప్రత్యక్ష భూతకాలమును దెల్పు ధాతువునకు లఙ్ వర్ణకమగును.

గడచిన రాత్రి రెండుజాములు తరువాతి కాలము - అగచ్ఛత్, అభవత్ వంటివి.

ఇట్టి లకారమును చిన్నయసూరి పేర్కొనలేదు. (ఆం. కౌ. 658-659)

**లట్టు[1]**

వర్తమాన క్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణకమగును.

వండుచున్నాఁడు—వండుచున్నారు
వండుచున్నది— వండుచున్నవి

వండుచున్నావు—వండుచున్నారు

వండుచున్నాను—వండుచున్నాము

(ఆం. కౌ. 663-664; బా. వ్యా. క్రియా. 2;15)

**లట్టు[2]**

లడాగమము.

బహువచనమందు ద్వితీయాది విభక్తులకు ఆదియందు చేరు లకారము.

రాములను, రాములతో, రాములయొక్క, రాములయందు ఇత్యాదులు

సమాసములయందు ఈ లట్టునకు లోపములేదు.

రాములయొక్క బాణములు.

రాముల బాణములు. (బా. వ్యా. సమాస. 25)

**లడయోభేదము**

లకారమునకు, డకారమునకు భేదము కొన్నిపదములందు కానరాదు.

దడము—దలము

మొసలి—మొసడి

వెడలె—వెలలె (క. సం. I. 29-31)

**లడర్థము**

(లట్+అర్థము) "వర్తమానేలట్" (అష్టా.) అను సూత్రముచే వర్తమానార్థమున లట్టు విధింపఁబడుటచే లడర్థమనఁగా వర్తమానార్థము. లడర్థము వివక్షితమగునపుడు తెనుఁగు ధాతువులపై వస్ ధాత్వర్థముగల 'ఉన్న' యనునది అనుబంధకమగును. ఉదా:- చదువుచున్నాఁడు, వ్రాయుచున్నాఁడు మొ॥ (చింతా. క్రియా. 11)

**లడాగమము**

లట్+ఆగమము.

బహుత్వమునందు ద్వితీయాది విభక్తుల కాదియందుఁ జేరును.

రాము+ను —రాము+లను

ఇట్లే రాములతో, రాములయొక్క ఇత్యాదులు.

(బా. వ్యా. తత్సమ. 31)

**లత్వములు**

లకారములు.

ద్వితీయ మొదలు ఆఱువిభక్తులు పైనున్నతఱిని, బహువచనమందు లత్వము వచ్చును.

రాములను, రాములచేతను, రాములకొఱకు, రాములకు, రాములయందు

(ఆం. కౌ. 215-217)

**లాంతములు**

లకారాంతములగు శబ్దములు.

అదంతములయిన తత్సమ శబ్దములకు ఉపధయందు లకారముండగా, బహు వచనమందు లకారము పరముకాగా, దానికి రేఫమాదేశ మగును.

బాలు+లు బాలురు, బాలురను, బాలురచే

(ల. వ్యా. అజన్త. 82)

**లాక్షణికములు**

లక్షణములచే నిరూపితములైనవి.

అవ్యయములు - (i) లాక్షణికములు (ii) ప్రతిపదోక్తములని (చూ.) ద్వి విధములు.

చేసి, చేయక, చేయుచు, చేయుడున్ ఇత్యాదులు.

(సం. వ్యా. అవ్య. 2; ఆం. భా. శా. అవ్య. 1)

**లాక్షణికుఁడు**

లక్షణజ్ఞానము గలవాఁడు.

ఇతఁడు రాజరాజును భిక్షునిగాఁ జేయఁగలడని; కూటిపేదను యశాధ్యక్షునిగా మార్పఁగలఁడని భావింపఁబడుచున్నది. (అప్ప. I.-11)

**లాట్టు**

తద్ధర్మాదులందు (చూ.) లాట్టగు.

తద్ధర్మాది క్రియావృత్తియగు ధాతువునకు లాద్వర్ణకమగును.

వండును, వండుదురు

వండుదువు, వండుదురు

వండుదును, వండుదుము (బా. వ్యా. క్రియా. 22)

**లాముడి**

(చూ.) లావత్తు

కల్ల, మొల్ల ఇత్యాదులు (గు. వ్యా. 12)

**లావత్తు**

లకారము హల్లుల క్రింద వ్రాయునపుడు ఉపయోగించు గుర్తు [ ౢ ]

కల్ల, తెల్లము (గు. వ్యా. 12)

**లింగము**

చిహ్నము.

స్త్రీ, పురుష, చిహ్నములందలి భేదములను బట్టి లౌకికలింగ మేర్పఱుపఁబడును.

శబ్దమునకుఁ జేరు ప్రత్యయములను బట్టి యేర్పఱుపఁబడిన లింగమును 'శబ్దలింగమ'ని (చూ.) 'వ్యాకరణలింగమ'ని (చూ.) యందురు.

లతా—స్త్రీ.లిం.

వృక్షః—పుం.లిం

మిత్త్రమ్, కళత్రమ్—నపుంసక లింగము.

(సం. వ్యా. లింగము. 1; ఆం. భా. శా. నామ. 12)

**లిఙర్థక్రియ**

'లిఙ్' అర్థమునందు ఉపయుక్తమగు క్రియ. (చూ.) లిఙ్లు (చూ.) లూట్టు

? మెచ్చునే - మెచ్చుడు

? చూచెనే - చూచుడు (ఆం. కౌ. 714)

**లిఙ్లు**

ఆశీర్వాదమునందు; విధి, నిమంత్రణాధిష్ట సంప్రార్థన ప్రశ్నసరణియందు లిఙ్లగును. ఇది సంస్కృతాను కరణముగా నేర్పఱుపఁబడిన సంజ్ఞ.

కాని బాలవ్యాకరణము నందిట్టి యర్థములుగల లకారము 'లూట్టు'గా నిరూపితము.

చూ. లూట్టు. (ఆం. కౌ 665, 664)

**లిట్టు**

(i) ఎఱుఁగరాని కాలము. పరోక్షభూతము (remote past)

( ఆం. కౌ. 660)

(ii) భూత క్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకమగును.

వండెను—వండిరి.

వండితివి—వండితిరి.

వండితిని—వండితిమి. (బా. వ్యా. క్రియా. 8;18)

**లిత్తు**

లకారమిద్వర్ణముగాఁగల ప్రత్యయము. ఇట్టి ప్రత్యయమునకు సామాన్యముగా వికల్పముండదు. (వై. చం. సంజ్ఞా. 14)

**లిపులు**

వర్ణములు, అక్షరములు

(అప్ప. II-6)

**లు**

లకారాంతములు కాని ప్రాతిపదికములపైని జస్ (ప్రథమాబహువచన) ప్రత్యయ స్థానమున వచ్చు ప్రత్యయము (చింతా అజంత. 14). ఉదా :— రాములు మొ॥ ఇట లకారాంతములనగా లోపధములగు అకారాంతములని భావము. కనుక అకారాంతములగు లోపధ శబ్దములపై జస్ ప్రత్యయ స్థానమున మాత్రము 'రు' వర్ణకము వచ్చును. ఉదా:— బాలురు, సుశీలురు మొ॥ (చింతా. అజంత. 15) ధీశాలి, బుద్ధిశాలి మున్నగు శబ్దములు అకారాంతములు కాకపోవుటచే 'లు' వర్ణకమే వచ్చును. ఉదా:— ధీశాలులు, బుద్ధిశాలులు మొ॥ (అహో. అజంత 15).

**లుక్సమాసము**

సమాస విభక్తి (చూ.) లోపింపఁగా నేర్పడిన సమాసము.

(వ్య.) అలుక్సమాసము (చూ.) అడవి పంది., చెవిపోగు.

(ఆం. కౌ. 684, 685)

**లుగలుక్ సమాసములు**

లుక్+అలుక్ సమాసములు.

విభక్తిలోపించినట్టియు, లోపింపనట్టివియునగు సమాసములు.

అట్లు, పోలె, బలె, వలె వంటి ఇవార్థక శబ్దములతో నేర్పడు సమాసములందు కొన్నిట విభక్తిలోపించును. కొన్నిట లోపింపదు.

నారాయణుని యొక్క అట్లు⟶ నారాయణునట్లు (లుక్ సమాసము)

మమ్ముంబోలె - (అలుక్ సమాసము) (ప్రౌ. వ్యా. సమాస. 38)

**లుఙ్**

గతకాలము. దీనినే సామాన్య భూతార్థక మందురు. (general past tense)

బాలవ్యాకరణము నందీలకారము లేదు. (ఆం. కౌ. 659)

**లుట్**

రానున్న రాత్రియందు రెండుజాముల తరువాతి కాలమును దెలుపునది.

దీనినే యనద్యతన భవిష్యదర్థ మందురు (remote future)

బాలవ్యాకరణము నందిది నిరూపితము కాలేదు. (ఆం. కౌ. 663)

**లు ప్తవర్ణపదసంధులు**

వర్ణములోపింపగా పదములందుగల్గు సంధులు.

(i) తెనుఁగు నుడుల యంతమందుఁగల డు, రు, ను, లు అనువానికి పదాది హల్లు పరమగునపుడు వీని యుత్వమునకు లోపము విభాషగా నగును.

తోడుగలిగె——→తోడ్గలిగె

ఊరు గాయ——→ఊర్గాయ

వినువాక——→విన్వాక

మేలుకనె——→మేల్కనె.

(ii) ఏక పదమునందును నిట్టిలోపము వికల్పముగాఁగల్గును. దీనినే 'అంతస్సంధి' (చూ.) అందురు. (Internal Sandhi).

గాడుపు—గాడ్పు

నేరుపు—నేర్పు

నెత్తురు—నెత్రు

కానుపు—కాన్పు

పలుకు—పల్కు. (ఆం. శా. 94-117)

**-లు,-రు, వర్ణకములు**

-లు బహువచన ప్రత్యయము. దీనికి ఆదేశముగా వచ్చునది—రు.

ఈ రెండింటికి హల్లుగాని, అవసానముగాని పరమగుచో వీని యుత్వమునకు లోపము వికల్పముగా నగును.

వారిదప్రతతుల్ సాల్పడి (హల్లుపరము)

భయంబంది భూ పాలుర్ (అవసానము). (ప్రౌ. వ్యా. శబ్ద. 16)

**లులకు రూలు**

బాలులు—బాలురు

బాలులను—బాలురను.

ఇట్లే నరపాలురు, నరపాలురను అనురీతిని లు,లకు రు,రలు ఆదేశమగును.

కరుణాశాలులు, దృఢతాలులు—ఇట్టి చోట్ల రూలు రావు.

(స. సా. సం. I. సంధి-185, 188)

**లులలకు రురలాదేశము**

(i) అద్విరుక్తము లయిన లులలకే కాక, ద్విత్వయుక్త లాంతముమీఁది లుల లకును రురలాదేశములగును.

మల్లులు—మల్లురు.

(ii) సర్వనామములకు మహదర్థము నందుఁ దఱచుగా లులకు రురలగును.

ఎల్లరు, ఎల్లరన్

వారు, వీరు (ప్రౌ. వ్యా. శబ్ద. 23,86)

**లూట్టు**

ఆశీశ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు.

ఆశీస్సు : మీకు మేలు గలిగెడును/గలుగుతను

శాపము : మీకు కీడు గలిగెడును/గలుగుతను

సంప్రార్థనము : హరిననుఁ గృపఁగాంచెడును/గాంచుతను.

ఇట్లు - ఎడు - తవర్ణకములు ద్రుతాంతములై యీ లకారమునందు ధాతువులకుఁ జేరుచున్నవి. (బా. వ్యా. క్రియా. 6,26-29)

**లృఙర్థము**

భవిష్యత్కాలమునందుఁ గలుగఁదగు ఆకాంక్షాదులను దెలుపునర్థము.

వానలు గురిసిన వసుధ ఫలించును. (ఆం. కౌ. 661)

**లృట్టు**

(*i*) రాఁగల కాలము నెల్లఁదెల్పునది.

దీనినే సామాన్య భవిష్యదర్థమందురు (general future)

సత్పురుషులు పుట్టఁగలరు. (ఆం. కౌ. 662)

(*ii*) భావిక్రియావృత్తియగు ధాతువునకు లృడ్వర్ణక మగును. ఈ వర్ణకము పరమగునపుడు ధాతువునకు - కల (జి) అను బంధమగును.

కలజి - జిత్తుకావున ధాతువుయొక్క ఉత్వమున కత్వమగును.

వండగలఁడు । వండగలఁదు

వండఁగలరు । వండఁగలవు

వండఁగలవు

వండఁగలరు

వండఁగలను

వండఁగలము (బా. వ్యా. క్రియా. 4,19)

**లేఖన పునరుద్ధరణము**

ఒకప్పుడు ఉచ్చారణమునకుఁ బ్రాతినిధ్యము వహించిన లేఖనము, తరువాతి కాలమున వ్యర్థమై, నామమాత్రముగా నుపయుక్తమగుచువచ్చి, తిరిగి సార్థకముగా ఉచ్చారణకుఁ బ్రాతినిధ్యమున కుపయుక్తమగుట.

ప్రాచీన కాలమునందు ఆనునాసిక చిహ్నముగా బిందువు (ఖండబిందువునకు మాఱుగాఁ బ్రాచీనకాలమున పూర్ణబిందువే యుపయుక్తము) ఉపయుక్తము. ఉచ్చారణము నందాను నాసిక్యము లేకున్నను, చారిత్రకముగానున్న ఆనునాసికతకు సూచకముగా చీఁకటి, ఆఁకలి, మఱఁదలు ఇత్యాదులలో ఖండబిందువు వాడఁబడెను.

కాని నేఁడు ఈ ఖండ బిందువు 'ఁ' నవలలలో, నాటకములలో, కథలలో ఆనునాసికోచ్చారణమునకుఁ బ్రాతినిధ్యము వహించుచున్నది. ఏఁవోఁయి, ఆఁ, ఊఁ, మాఁవఁ ఇత్యాదులు. ఇట్లు ప్రాచీనధర్మము లేఖనమునందు తిరిగి యుద్ధరింపఁబడెను. (తె. వ్యా. వి. పుట. 112)

**—లో**

'లోపల' వర్ణకముయొక్క ప్రథమాక్షరము శేషించిన రూపము.

గోవులలోఁగపిల బహుక్షీర. (బా. వ్యా. తత్సమ. 10)

**లోకనిరుక్తి**

భిన్నార్థములుగల పదములను, సామాన్య ప్రజానీకము, తమకుఁ పరిచయమైన పదములతో (వానికిఁగల శబ్ద సన్నిహితత్వమునుబట్టి) వ్యవహరించును.

ఇట్లు లోకములోని వారు తమకున్న బుద్ధి కుశలతతోఁజేకూర్చిన యుక్తికి లోకనిరుక్తి (Folk etymology) యందురు.

నార్సింహాచలం—నారదసింహాచలం

ఇన్లాండు కవరు—ఇంగ్లాండు కవరు

శూర్పనఖ—చుప్పనాతి. (తె. వ్యా. వి. పుట. 218)

**లోక వ్యవహారము**

తమ తమ దేశములందు పెద్దలైన వారలాడు భాషావ్యవహారము.

కవులకు దేశ్యపదములు లోకవ్యవహారము మూలమునఁ దెలియును.

(అప్ప. I. 115,116)

**లోకోక్తి**

లోకమున జనవ్యవహారమున ప్రయోగింపఁబడు ఉక్తి. ఉదా:- అమ్మకచెల్ల,

సీవెట్టి బంగారయ్యేన్, సీయిల్లు బంగారయ్యేన్, అయోలక్క మొ॥ జనరంజకము లగు నిట్టి లోకోక్తులు ప్రయోగార్హములే (అథ. కా. అజంత. 82)

**లోట్టు**

ఆశీరర్థము నందును విధ్యర్థము నందును వచ్చు వర్ణకము.

చూ. లూట్టు (ఆం. కౌ. 670)

**లోపదీర్ఘము**

ఒక పదము నందొక వర్ణముగాని, అక్షరముగాని లోపింపగా అట్టి లోపమును బూరించుటకై ప్రక్కనున్న స్వరము దీర్ఘమగుట. ఇట్లు లోపము పూర్తిగావింపఁ బడును. దీనిని బట్టి భాషలలోఁగల సమతాగుణము (balancing nature) తెలియనగును.

వజ్రములు—వజ్రాలు

దనుక—దాక

సగము—సాము

(ఆం భా. వి. పుటలు. 299-300; తె. వ్యా. వి పుట. 558)

**లోపధము**

(ల+ఉపధము) లవర్ణము ఉపధగాఁగలది. (అంత్యవర్ణమునకు పూర్వమం దుండు వర్ణము ఉపధ) ఉదా:- బాల, సుశీల, మొ॥ లకారముపధగాఁగల బాలాది శబ్దములకు పరమగు ప్రత్యయ లకారమునకు రేఫమాదేశమగును. ఉదా:- బాలురు (బాలు+లు) మొ॥ (వై. చం. అజంత. 80)

**లోపము**

వర్ణము తొలఁగి చనుట (అష్టా. 1-1-60)

మొగము - మోము : గకారలోపము

భయము+పడు : భయపడు : ములోపము

(బా. వ్యా. సంధి. 18; ప్రౌ. వ్యా. సంధి. 10)

**-లోపం**

'యతశ్చ నిర్ధారణమ్' (అష్టా. 2-3-41) అను సూత్రముచే సంస్కృతమున నిర్ధారణార్థమున విధింపఁబడిన షష్ఠీవిభక్తి స్థానమున వచ్చు ప్రత్యయము. ఉదా:- దేవతలలోపల శ్రీకాంత యధికురాలు మొ॥ 'సౌధంబులోపల' ఇత్యాదులలోని లోపల యనునది 'అంతః' అను నవ్యయమునకు పర్యాయమైన దేశ్యశబ్దము.

నిర్ధారణార్థములేదు కనుక నిది షష్ఠికాదు. (చింతా. అహో. అజంత. 31; బా. వ్యా. తత్సమ. 6; కారక. 16) చూ:- నిర్ధారణోద్భవషష్ఠి:

**లోహవాచకములు**

ఇత్తడి, ఇనుము, కంచు, బంగారము, వెండి మొదలైనవి.

ఇవి నిత్యైక వచనాంతములు. వీనికి బహువచన రూపము లుండవు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 81)

**లౌకిక లింగము**

లోక సంబంధమగు చిహ్నము.

స్త్రీని, పురుషుని తెలుపు శరీరమందలి చిహ్నము.

'లింగమ'ను పదము లోకవ్యవహారమునకు సంబంధించినది. ఆపదమే వ్యాకరణ శాస్త్రమునందును వ్యవహృతమగుట మూలమున కొన్ని చిక్కులు కల్గును. ఆంగ్లమునందట్లుకాక ఈ రెండింటికి భిన్న శబ్దములు (Sex, gender) వాడఁ బడును.

లౌకికమగు లింగ వ్యవస్థను నిరూపించుట కొక్కొక్క భాషకు ఒక్కొక్క పద్ధతి యుండును. సంస్కృతమునందు స్త్రీ ప్రత్యయ ప్రకరణ మిట్టిది. తెనుఁగు మున్నగు ద్రావిడ భాషలలో స్వతంత్ర శబ్దములను జేర్చి లింగభేదము తెలుపఁ బడును.

—పోతు, —పెంటి; —పుంజు —పిట్ట;

—కాఁడు, —కత్తియ;— అఁడు—ఆడి ఇత్యాదులు.

(తె. వ్యా. వి. 263, 582)

**లౌకిక విగ్రహము**

(వ్య.) అలౌకిక విగ్రహము. (చూ.)

లోకమునందు వ్యవహృతమగుచున్న విభక్తులను జేర్చి సమాసము యొక్క అర్థమును వివరించి చెప్పు వాక్యము.

చెఱువు చేప.

చెఱువు నందలి చేప.

(తె. వ్యా. వి. పుట. 822)

**ల్యప్ప్రత్యయార్థము.**

'ల్యప్' అను ప్రత్యయము యొక్క అర్థము.

భూతార్థక అసమాపక క్రియా ప్రత్యయ మొకదానికి 'ల్యప్' ప్రత్యయమని పేరు.

అట్టి యర్థమునందుఁ దెనుఁగున ధాతువునకు—'ఇ' ప్రత్యయము చేరును.

ప్రణుతించి, విరచించి, (చూ.) ల్యప్పు.

(ఆం. కౌ. 773)

**ల్యప్పు**

భూతార్థకాసమాపక క్రియా ప్రత్యయమున కొకదానికి సంస్కృతమునందు 'ల్యప్పు'ని వ్యవహారము. (ప్రకాశ్య, సంత్యజ్య వంటివి).

ఒక్కొక్కచో నిట్టి ప్రత్యయార్థమునందుఁ దెనుఁగునందు ధాతువునకుఁ జేరు 'ఇ'త్తునకు 'ఇ'కారము పరమగుచో సంధి చేయనోపును.

కోరి+ఇందు శేఖరు⟶కోరిందు శేఖరు

ఎఱిగించి+ ఇప్పుడే⟶ఎఱిగించిపుడే.

(క. సం. వి. I. 14, 15)

**ల్యబంతములు**

ల్యప్+ అంతములు.

'ల్యప్' అను భూతార్థకాసమాపక క్రియా ప్రత్యయ మంతమందుఁగల శబ్దములు.

ప్రకాశ్య, సంత్యజ్య వంటివి. ఇట్టివి తెనుఁగు బాస లోనికిఁ బ్రవేశింపవు.

(ఆం. భా. భూ. 29

**ల్వాది వర్ణకము**

(లు+ ఆది వర్ణకము) లు (ప్రథమా బహువచనము), లవ్ (ద్వితీయావిభక్తి బహువచనము) మున్నగు బహు వచన ప్రత్యయములు. ఇవి పరమగునపుడు తెలుఁగు పదముల యందలి ము వర్ణమునకు లోపమును, తత్పూర్వ-అ వర్ణమునకు దీర్ఘమును సాధారణముగ వచ్చును. ఉదా: — చందాలు, చందములు— అందాలు, అందములు మొ॥ కొన్ని సమ పదములందును పై ము లోపము, తత్పూర్వాచ్చునకు దీర్ఘమును వచ్చును. ఉదా :—ముత్యాలు, నీలాలు (అధ. కా. అజంత. 24) పై కారికయందలి 'ప్రాయశః' యను శబ్దమహిమచే ప్రాణానన్, నిటలానన్ ఇత్యాదులు సాధువులు (అహో. అజంత 42).

**—'ళుఙ్'**

—'ళు' అను వర్ణము.

—రు, —లు, —డు, —లు, అను వర్ణము లంతమందుఁ గల పదములకు బహువచనమందు ఆదేశమగును.

గోళ్లు, వ్రేళ్లు, గూళ్లు మున్నగునవి.

(ఆం. భా. భూ. 78)

వ[1]

ఉభయోష్ఠ్యాంతస్థము(bilabial Semi—Vowel)

పైపెదవి — స్థానము

క్రింది పెదవి — కరణము

ఈషత్ స్పృష్టము

నాదము

అల్ప ప్రాణము.

వ[2]

తెగ (తెగు) ధాతువుపై భావార్థమున వచ్చు కృత్ప్రత్యయము. ఉదా :—తెగువ (వై. చం. కృదంత. 8)

వ[3]

కొన్నిచోట్ల వికృతి పదములలో గ కారమున —కాదేశముగ వచ్చు వర్ణము. ఉదా :—ప్రేవులు—ప్రేగులు: ఈవి – ఈగి; ప్రోవులు — ప్రోగులు మొ॥ (చింతా. అజంత. 67) పదాదియందలి గకారమునకు మాత్రము ఈ వకారాదేశము రాదు. ఉదా :— గఱువు, గిరక, గరిక మొ॥ ఈ వకారాదేశమును విధించు 'క్వచిద్గకారోవః' అను చింతా. సూత్రము (అజంత. 67) న క్వచిత్ అనుటచే రేగు, వాగు, బాగు ఇత్యాది స్థలములలో పదాద్యము కాని గ కారమునకును వ కారము రాదు. (అహో. అజంత. 67)

వఁ

దన్త్యోష్ఠ్యాను నాసికము (labio-dental nasal)

పై దన్తముల క్రింది భాగము — స్థానము

క్రింది పెదవి—కరణము

ఈషత్స్పృష్టాను నాసికము

నాదము

అల్పప్రాణము

(i) రెండచ్చుల నడుమ, పదాంతమునందును నున్న మ కారము.

/ మామయ్య / [ మావఁయ్య ]

/ చీమ / [ చీవఁ ]

(ii) వ, స, హ లకుఁ బూర్వమందున్న మకారము.

'వఁ' గా నుచ్చరింపఁ బడును.

[ సివ్ఁ హవ్ఁ ] [ కవ్వవ్ఁ ]

[ సవ్ఁ వఁ త్సరవ్ఁ ] ఇత్యాదులు.

**— వంత**

మతుప్ప్రత్యయాంతములగు సంస్కృత పదములను తత్సమీకరించునపుడు మతుప్ స్థానమున వచ్చు ఆదేశము. ఉదా:— వీర్యవంతుఁడు, ధనవంతుఁడు (మం. ఆం. కౌ. 231).

**వకార లోపము**

లేవనెత్తుట, చావక యుండుట, వెఱవకుండుట, మఱవకుంట — ఇత్యాదులు కొన్ని పదముల యందు వ కారము లోపించుటయు కద్దు.

లే నెత్తుట, చాకుండుట ఇత్యాదులు.

(స. సా. సం. I సంధి. 174 - 180)

**వక్రతమములు**

ఐ ఔ అను రెండు వర్ణములు (చింతా. సంజ్ఞా. 30) వీని యుచ్చారణమున వక్రత యధికముగాఁ గన్పించుటచే వీనికి సంజ్ఞ సార్థకము. ఈ సంజ్ఞ చింతా - కర్త స్వోపజ్ఞముగా కల్పించినట్టిది. ఈ సంజ్ఞ పాణినీయమున లేదు.

**వక్రములు**

ఏకార, ఓకారములు. (చింతా. సంజ్ఞా. 29). ఉచ్చారణమునను వ్రాతయందును ఇవి వక్రతను కలిగి యుండుటచే నీ సంజ్ఞ సార్థకము. ఏఙఓవక్రః (చింతా. సంజ్ఞా. 29) అను సూత్రము నందలి ఏఙ్ ప్రత్యాహార బోధ్యములగు దీర్ఘఏకార ఓకారములే వక్రములని భావము. ఎ, ఒ, లు హ్రస్వవక్రములని అప్పకవీయము (II. 18) నందును, ప్రాకృత వ్యాకరణము లందును తెలుపఁబడినది. కొందఱు ఎ, ఏ, ఒ, ఓ, లను వక్రములుగా గ్రహించిరి. చి. సూ. ఎ, ఏ, ఒ, ఓ, లు వక్రములని ఐ, ఔలు వక్రతములని ప్రాచీనులు వ్యవహరింతురని తెలిపెను. (బా. వ్యా. సంజ్ఞా. 2)

**వగాదులు**

వగ, చిన్నె, కులుకు, దొమ్మి, ఎమ్మె ఇత్యాదులు.

(i) వీని బహువచనాంత రూపములపై మత్వర్థమందు '-ఆఁడి' యను తద్ధిత ప్రత్యయము స్త్ర్యర్థము నందుఁజేరును.

వగలాఁడి, చిన్నెలాఁడి

(ii) వీని బహువచనాంత రూపములపై పుంస్త్వమునందు మతుబర్థమగు '-ఆ' కారము చేరును. ఇది మగాది గణములోనిది కావున డుజ్ చేరును.

వగలాఁడు, చిన్నెలాఁడు (బా. వ్యా. తద్ధిత. 22,23)

**వచనము**

చెప్పుట. ఒకటిని దెల్పునది. ఏకవచనము (చూ.) ఒకటికన్న నెక్కువను జెప్పునది. బహువచనము. (చూ.)

గోడ—గోడలు

వృక్షము—వృక్షములు. (బా. వ్యా. తత్సమ. 11,12)

**వచ్యర్థాముఖ్యకర్మము**

'అను' అను అర్థమిచ్చు ధాతువుయొక్క అముఖ్యకర్మము (చూ.) నకు-తోడ వర్ణకముగాని,—కు వర్ణకముగాని ప్రాయికముగా నగును.

1. మైత్రుఁడు చైత్రుని **తోడ** నిట్లనియె.

2. మైత్రుఁడు చైత్రున కిట్లనియె.

3. మైత్రుఁడు చైత్రునిట్లనియె. (ప్రాయికముగా ననుటచేత ద్వితీయయు నొక్కొక్కచో నగును) (బా. వ్యా. కారక. 6)

**వట్**

తవర్ణకములేని తదిదం శబ్దములకు (ఆ, ఈ అనువానికి) విభక్తిప్రత్యయములు పరమగునపుడు వచ్చు ఆగమము. (వై. చం. హలంత. 14) ఇందలి టకారమిత్తై లోపించును. టిత్తగుటచే నీ యాగమము ఆ, ఈ, శబ్దములకు పూర్వావయవములుగావచ్చును. ఉదా:- వాడు, వారు-వీడు, వీరు మొ॥ ఇతఁడు, ఈతఁడు మున్నగుచోట్ల తకారము పరమగుటచే నీ యాగమము రాదు.

**వట్రుసుడులు**

కృతి, కృప, మున్నగు పదములయందు ఋ, 'ృ' అను రీతిని నిరూపితము. దీనికే వట్రసుడి యని వ్యవహారము. చూ. వట్రువసుడి.

ఇది యచ్చ తెనుఁగు పదముల యందుండదు. అ్రదువ, వి్రదువ, ఇత్యాది క్రియాపదములందలివి వట్రుసుడుల భంగివినిపించును. కాని యివి క్రారకొమ్ములు. (అప్ప. II, 71)

**వట్రువలు**

ఋకారములను హల్లులతోఁ జేర్చి వ్రాయునప్పటి గుర్తులు ృ, ౄ.

వట్రువలు తెనుఁగున లేవు. వీనివలె పలుకఁబడునవి యెల్ల క్రారవడులే.

అ్రదువ, వి్రదువ - ఇత్యాదులు.

కృష్ణ, వృత్రాంతకా, హృషీకేశ, పృథ్వీకుమార మున్నగు సంస్కృత పదములందు వట్రువలే కాని క్రారలుకావు. (అప్ప. II, 66, 72)

**వట్రువసుడి**

ఋకారమును హల్లులతోఁజేర్చి వ్రాయునప్పటి గుర్తు.

'ృ' కృప, కృతి ఇత్యాదులు. (గు. వ్యా. 11)

**వట్రువ సుడి దీర్ఘము**

ౠకారమును హల్లులతోఁజేర్చి వ్రాయునప్పటి గుర్తు. 'ౄ'

పితృ+ఋణము ⟶ పితౄణము. (గు. వ్యా. 11)

**వడి ప్రకృతులు**

-వడి మున్నగు శబ్దములు. ఇవి కృత్ప్రత్యయములు.

| -వడి | -వి, | అవు, | ఇ | కలి |
|---|---|---|---|---|
| కొలువడి | తెలివి | తగవు | చేయి | కనుకలి |
| నడవడి | తనివి | నగవు | వ్రాయి | వినుకలి |

ఇత్యాదులు మహాజన వ్యవహారములను బట్టి తెలియఁదగును.

(బా. వ్యా. కృదన్త. 22)

**-వడు**

యచ్ఛబ్ధ వాచకమునకు పరముగావచ్చు ప్రత్యయము. ఉదా:- ఎవడు, ఎవ్వడు (మం. ఆం. కౌ. 283) ఎవ్వడు అనురూపమున ద్విస్తదాది ర్భ్యః (మం. ఆం.కౌ. 282) అను సూత్రముచే వకారమునకు ద్విత్వము.

**వతె**

యచ్ఛబ్దము (ఏ) కంటెను, కింశబ్దము (ఏ) కంటెను, స్త్ర్యర్థమున వచ్చు ప్రత్యయము. ఉదా:- ఎవతె, ఎవ్వతె (మం. ఆం. కౌ. 392) ఎవ్వతె యనుచోట ద్విస్తదాదిర్భ్యః (మం. ఆం. కౌ. 282) అను సూత్రముచే వకారమునకు ద్విత్వము.

**వనసమములు**

'వనము' అను శబ్దమునకువలె కార్యములు, రూపములు గలుగు అచ్చిక శబ్దములు.

గుబ్బము, పల్లము, అందము, చందము మొదలగునవి.

(ప్ర. వ్యా. 186)

**వన్నియ**

వర్ణకము లేక ప్రత్యయము. (బా. వ్యా. క్రియా. 44)

**వరితె**

యచ్ఛబ్ద, కింశబ్దముల (ఏ అనుదాని) కంటె స్త్ర్యర్థమున వచ్చు ప్రత్యయము.

ఉదా:- ఎవరితె, ఎవ్వరితె (మం. ఆం. కౌ. 392) ఎవ్వరితె యనుచోట ద్విస్త దాడిభ్యః (మం. ఆం. కౌ. 282) అను సూత్రముచే వకారమునకు ద్విత్వము.

**వర్గములు**

స్పర్శములగు కాదులు (చూ.) ఐదునైదు వర్ణములు వర్గములనఁబడును.

క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

ఇఱువది యైదు వర్ణములు. (ఆం. భా. భూ. 16 ప)

(అప్ప. II. 7)

**వర్గయుక్కులు**

వర్గము నందలి రెండు, నాలుగు వర్ణములు.

ఖ—ఘ

ఛ—ఝ

ఠ—ఢ

థ—ధ

ఫ—భ (బా. వ్యా. సంధి. 19)

**వర్ణకము**

ప్రత్యయము. అర్థవంతమైన వర్ణము లేక వర్ణములు.

—లు-వృక్షములు (బహువచనార్థము)

—అక—చేయక, కొట్టక (వ్యతిరేకక్త్వార్థకము)

—ఇమి—కలిమి (కలిగియుండుటను దెలుపును) ఇత్యాదులు.

ఆధునికులు వీనిని నిబద్ధ పదాంశము లందురు. (bound morphemes) పాణినీయమున (చింతా. సంజ్ఞా. 25) ప్రత్యయమనియేకాని వర్ణకమను వ్యవహారము లేదు. చూ:- ప్రత్యయము.

(బా. వ్యా. తత్సమ. 10 సూ, కారక. 3, సూ)

**వర్ణద్వయమేళనము**

రెండు వర్ణముల యొక్క కలయిక. దీనినే సంధి (చూ.) యందురు.

(వ్యా. సం. స. పుట. 202)

**వర్ణనాత్మకపద్ధతి**

త్రివిధములగు వ్యాకరణరచనా విధానములలో నొకటి.

(i) చారిత్రక పద్ధతి (Historical method)

(ii) తులనాత్మక పద్ధతి (Comparative method)

(iii) వర్ణనాత్మక పద్ధతి (Descriptive method)

అప్పటి స్థితిని వర్ణించు పద్ధతి వర్ణనాత్మక పద్ధతి. సంస్కృతభాషకు పాణిని వ్యాకరణము తెలుఁగునకు బాలవ్యాకరణము నిట్టి పద్ధతిలోనే విరచితము. లిపిలేని భాషలను వ్యాకరించుటలో నీ పద్ధతియే మిక్కిలి యనుకూలము. సాధారణముగా ఎట్టి విశేషమును జేర్పక వ్యాకరణమన్నను భాషాశాస్త్రమన్నను నదివర్ణాత్మకమే (discriptive) యని భావింపనగును. (తె. వ్యా. వి. పుట. 89)

**వర్ణప్లుతి**

(చూ.) వర్ణవ్యత్యయము (metathesis)

(తె. వ్యా. వి. పుట. 493)

**వర్ణము**

అక్షరము, అర్ణము, మాతృక యనునవి దీని పర్యాయపదములు.

వర్ణించునది వర్ణము. భాషాధ్వనిని వర్ణించునది.

(ధం. ద. IV. 129; అప్ప. 6)

వర్ణమున కర్థములేదు. ఇది యర్థభేదక సామర్ధ్యము కలిగినదని యాధునికుల యభిప్రాయము.

కంప }
గంప } ఇందు 'ంప' రెండు పదముల

లోను గలదు. క, గల వలన నీ రెంటికి నర్థభేదము కలిగినది, కావున క, గలు వర్ణములు (Phonemes)

**వర్ణములు**

వాగ్రూపమగు భాషాధ్వనులు లేక దాని సంకేతకమగు లిపి చిహ్నములు ఇట్టి వానిని క్రోడీకరించి కూర్పఁబడిన మాలకే **వర్ణమాల** యనియు వర్ణసమామ్నాయమనియు వ్యవహారము. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ అం, అఁ, క, ఖ, చ, చ̄, జ, జ̄, ట, డ, ణ, త, ద, న, ప, బ, మ, య, ర ల, వ, స, హ, ళ యను నీ ముప్పదియాఱు తెనుఁగు భాషకు వర్ణములు. ఇందలి రవర్ణము సాధురేఫము (ర), శకటరేఫము (ఱ) అని రెండు విధములు, ప్రాకృతసమ, ప్రాకృతభవ, సంస్కృతభవ, దేశ్యరూపమగు తెనుఁగునకే పై వర్ణ సమామ్నాయము. సంస్కృత భాషకు అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః, క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష స, హ, ళ యను నీ యేఁబది వర్ణములు. ఋ, ౠ, ఌ, ౡ, విసర్గము, ఖ, ఛ ఠ, థ, ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ, ఙ, ఞ, శ, ష అను సంస్కృత వర్ణములు. తెనుఁగున సంస్కృత పదములతో గూడియే ప్రయోగింపఁబడును. **ఉదా:-** ఋతువు, పితౄణము మొ ప్రాకృతమునకు సంస్కృతమునకు పైన చెప్పఁబడిన యేఁబది వర్ణములలో ఋ, ౠ, ఌ, ౡ, ఐ, ఔ, ఙ, ఞ, శ, ష అను నీ పదివర్ణ ములు తక్కఁతక్కిన నలువది వర్ణములుండును. సంస్కృతవర్ణములలో 'ౡ' వర్ణము లేదనియు, హల్లులలో క్షవర్ణము కలదనియు కొందఱ మతము. వీరి మత మున సంస్కృతమందలి ఋ, ౠ, ఌ, ఐ, ఔ, ఙ, ఞ, శ, ష, క్ష అను పది వర్ణములు తక్కఁతక్కిన నలువది వర్ణములు ప్రాకృతమునకుండును. (చింతా. అహో, సంజ్ఞా. 12,13,14, 18)

**వర్ణలోపము**

రెండు పదములు తారసిల్లినపుడు అందొక వర్ణము లోపింపవచ్చును. ఇట్టి లోపము సామాన్యముగా రెండు సమాన హల్లులు కలిసినపుడు సంభవించును. దీనినే ఆధునికులు (Haplology) అందురు.

నిప్పు+పుల్ల ——> నిప్పుల్ల (తె. వ్యా. వి. పుట. 473)
ఆ+కడ ——> ఆడ

ఈ+కడ ——> ఈడ

ఫలములు ——> ఫలాలు (స. సా. సం. I. 68-70)

**వర్ణవిభేదము**

(i) సమాన హల్లులు పరమగునపుడు అందొక హల్లు భిన్నహల్లుగా మాఱి ఉచ్చారణ సౌకర్యమును కలిగించును. దీనినే dissimilation అందురు.

బొమ్మలు+ఇల్లు ⟶ బొమ్మలిల్లు ⟶ బొమ్మరిల్లు

కొడవలి+లు ⟶ కొడవలులు ⟶ కొడవళులు ⟶ కొడవళ్లు.

(ii) ఇట్టిమార్పు సమానస్వరము పరమగునపుడును గలుగవచ్చును.

అమ్మ+అమ్మ ⟶ అమ్మమ్మ ⟶ అమ్ముమ్మ

(తె. వ్యా. వి. పుట. 502)

**వర్ణవ్యత్యయము**

వర్ణముల తడబాటు. ఉచ్చారణము నందలి తొందరపాటుచే ముందు వర్ణము వెనుకకు, వెనుకవర్ణము ముందునకు వచ్చును. ఒక్కొక్కచో అనవధానత వలనఁ గూడ నీ తడబాటు కల్గవచ్చును. దీనినే metathesis అందురు.

ఏడు+పది ⟶ దే+పది ⟶ దే+బది ⟶ దే+బది ⟶ డెబ్బది.

నవ్వులు+ఆట ⟶ నవ్వులాట ⟶ నవ్వుటాల

(ప్రౌ. వ్యా. సమాస. 24)

**వర్ణసమామ్నాయము**

వర్ణముల సమూహము.

అ, ఆ, ఇ, ఈ మున్నగునవి. (సం. వ్యా. వర్ణ. 2)

**వర్ణస మీకరణము**

భిన్నవర్ణము లేకవర్ణ మగుట. ఈ సమీకరణము ఒక్కొక్కచో పాక్షికముగాఁ గాని, పూర్తిగాఁగాని యుండవచ్చును.

భిన్నవర్ణోచ్చారణ మందలి క్లేశమిందువలనఁ దొలఁగును.

భక్తి ⟶ బత్తి (పూర్వవర్ణము పరవర్ణముతో సమీకరింపఁబడెను)

అగ్ని ⟶ అగ్గి (పరవర్ణము పూర్వవర్ణముతో సమీకరింపఁబడెను.

ఇవి పూర్తి సమీకరణమున కుదాహరణములు(Complete assimilation)

పూచెను+కలువలు ⟶ పూచెనుగలువలు: ఇందు నాదధ్వని ప్రభావముచే శ్వాసము నాదముగా మాఱినది. ఇది పాక్షికవర్ణ సమీకరణము (Partial assimilation), (తె. వ్యా. వి. పుట. 777)

**వర్ణస్థాయి**

ఒక వర్ణమునకు రెండుగాని, మూడుగాని ఉపవర్ణము లుండవచ్చును. (allophones) కాని లేఖనము నందు వర్ణములే నిరూపితము.

/మామిడి/ [మావిఁడి]

/చీమ/ [చీవఁ]

వర్ణస్థాయి. ఉచ్చారణస్థాయి

(phonemic status) (phonetic Status)

(ii) సంధిలో కొన్నిచోట్ల ఉచ్చారణస్థాయి పోయి వర్ణస్థాయి నిలుచును.

కడ+కడ→కట్టకడ.

(ఉచ్చారణ స్థాయి) వర్ణస్థాయి.

(తె. వ్యా. వి. పుట. 472)

**వర్తమానము**

ప్రారంభించిన పని పరిసమాప్తము కాకుండుట·

వర్తమాన క్రియావృత్తియగు ధాతువునకు లడ్వర్ణక మగును.

వండుచున్నాఁడు, వండుచున్నారు ఇత్యాదులు.

(బా. వ్యా. క్రియా. 2,22)

**వర్తమానార్థకము**

వర్తమాన కాలమును (present time) దెలుపు క్రియాపదములు, వర్తమానార్థకమునకుఁ (present tense) జెందును.

వండుచున్నాఁడు.

పలికెదిని, పలికెదవు, పలికెదరు.

(ఆం. భా. భూ. 143,144; ఆం. కౌ. 688-91)

**వర్తమానార్థక విశేషణము**

వర్తమాన క్రియారూపము తుదిని—ఉన్న అను అనుబంధమును జేర్చిన వర్తమానార్థక విశేషణ రూపము నిష్పన్నమగును.

పోషించుచు+ఉన్న ⟶ పోషించుచున్నవాఁడు.

కొట్టుచున్నయది - ఇత్యాదులు. (సం. వ్యా. విశ. 1)

**వర్తమానార్థ 'చు' వర్ణసంధి**

వర్తమానార్థమందు ధాతువునకు -'చున్' చేరును. దీనినే శత్రర్థక మందురు (చూ.) ఇట్టి చువర్ణకమున కచ్చుపరమగుచో సంధి వికల్పముగా నగును.

నగుచున్+అరిగెను < నగుచరిగెను / నగుచునరిగెను.

(స. సా. సం. I. సంధి. 38)

**వర్తమానార్థపద'ను'వర్ణము**

వర్తమానార్థమందలి కొన్ని క్రియాపదముల మధ్యనున్న 'ను' వర్ణము సున్నగా మాఱును.

అనుచు—అంచు

వినుచు—వించు

కనుచు—కంచు

ఇట్లు వ్యాకరణములు నిరూపించుచున్నను ఈ ధాతువులు అన్, విన్, కన్ తిన్ అనునవి. వీనికి వర్తమానార్థము నందు 'చు' వర్ణకము చేరగా అన్చు, విన్చు, కన్చు, తిన్చు అనురీతిని రూపము లేర్పడగా లేఖన సౌకర్యముగా బిందువు ఉపయుక్తముకాగా అంచు, వించు, కంచు, తించు, అనురీతిని నిరూపితము లాయె నని గ్రహింపనగును.

(స. సా. సం. I. సంధి. 41-44)

**వలపలగిలక**

బాహ్యమందుండునట్టి గిలక యాకారముగల [ ] లేఖన చిహ్నము.

ఇది రేఫకుఁగల మఱియొక రూపము.

నేఁడిది వాడుకలో లేదు.

తాటియాకు ప్రతులలోను 19వ శతాబ్ది ముద్రణము నందును గలదు.

శకర్ర—శర్కర (గు. వ్యా. 14)

**—వలన**

పంచమీ విభక్తి

ఇది అపాదానార్థమునందు (చూ.) వచ్చును.

అపాయము, భయము, జుగుప్స, పరాజయము, ప్రమాదము, గ్రహణము భవనము, త్రాణము, విరామము, అంతర్ధి, వారణము (చూ.) అనునవి యెద్దాని

నగునో దానికి 'వలన' వర్ణకముపయుక్తము.

(బా. చూ. IX. 77; బా. వ్యా. తత్సమ. 5; బా. వ్యా. కారక. 9)

**వర్గాదులు**

వర్గ, అంతర, ధర్మ మున్నగునవి. వీని అత్వమునకు ఉత్వము,- వువర్ణకము వికల్పముగా వచ్చును.

వర్గము—వర్గువు.

అంతరము—అంతరువు.

ధర్మము—ధర్మువు. (వ్యా. భా. వ్యా. శబ్ద. 89)

**వలెప్రకృతులు**

వలెన్, ఎంతయున్, పోలెన్, అయ్యున్ మున్నగు నవ్యయములు.

ఇవి ద్రుతప్రకృతికములు. (బా. వ్యా. సంజ్ఞా. 12)

**వా**

వికల్పమను నర్థమున ప్రయోగింపఁబడు సంస్కృత శబ్దము (చింతా. సంధి 2,7,11,25). వికల్పార్థమున విభాషా అన్యతరస్యామ్ అను పదములును ప్రయోగింపఁబడును. ఒకానొకచో 'వా' అనునది సముచ్చయార్థమునను ప్రయోగింపఁబడును (చింతా. అహో. సంధి. 8)

**-వాఁడు[1]**

మత్వర్థమందు వచ్చు ప్రత్యయము. పసులవాఁడు, చంటివాఁడు, వింటివాఁడు మున్నగునవి. (అం. కౌ. 646-648)

**వాఁడు[2]**

తచ్ఛబ్దార్థకమగు పుంలింగైకవచన రూపము. ఇది సంబంధార్థమునను, 'జాతిలో పుట్టిన పురుషుడు' అను నర్థమునను వచ్చును. ఉదా:- మావాఁడు, వారివాఁడు, చాకలవాఁడు, కాపువాఁడు మొ॥ (మం. అం. కౌ. 280,281)

**వాక్యము**

(i) యోగ్యత, ఆకాంక్షా సహితమగు నర్థముగల యాసత్తి యుక్తపద సమూహము.

రాముఁడు రావణుని సంహరించెను.

(ii) విషయ బోధకము వాక్యము. (ప్రౌ. వ్యా. వాక్య. 2,5)

(iii) రెండు పూర్తి విరామముల మధ్యగల పదనిర్మాణము.

(తె. వ్యా. వి పుటలు. 1042-44)

**వాక్యసంధాయకము**

వాక్యములను గలుపునట్టి శబ్దము.

వానలు కురిసెనేని సస్యములు ఫలించును.

(మ. ప. వ్యా. సంధి. 2)

**వాక్యాంతరజనిస్థానము**

వేఱొక వాక్యము పుట్టుచోటు.

భూతార్థక అసమాపకక్రియ యిట్టిది. ఇందుండి వేఱొక వాక్యము పుట్టునపుడు దానికర్త ఆ అసమాపక క్రియాకర్తృ సముదాయము నందుండునది యేదైన నొక్కటియగును.

"ధవళాక్షుల్ చనికాంచిరి."

"కని కద్రువ వినతంజూచి"—'కని' యను అసమాపక క్రియకు 'ధవళాక్షులందఱు కర్తలు. (ప్రౌ. వ్యా. వాక్య. 16)

**వాక్యాంశబిందువు**

వాక్యము నందొక భాగమునఁగల్గు కించిద్విరామమునకు సూచకముగా నుంచు చిహ్నము. దీనినే యాంగ్లమునందు 'comma' అందురు.

అన్వయమునందు సమీప సంబంధమును గలిగియు, నించుకవిరతి నపేక్షించు వాక్యాంశముల తుదినీగుర్తు /,/ వాడఁబడును.

సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, ఆకాశము నలంకరించును.

ఇది యేక మాత్రాకాలపు విరతిని దెలుపును.

ఆంగ్ల భాషకుఁ గలలిపి మూలమున నిట్టిది తెలుఁగు లిపిలోనికిఁ బ్రవేశించెను.

(సం. వ్యా. విరతులు. 1)

**వాక్యావసానము**

వాక్య+అవసానము : వాక్యము యొక్క అంతము.

వాక్యాంతమందు సంధిచేయకుండుట దోషముకాదు.

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు.

(బా. వ్యా. సంధి. 55)

**వారణము**

వారించుట.

ఈ యర్థమునఁబడు—'వలన' వర్ణకము వచ్చును.

శోకంబు వలన వారించె. (బా. వ్యా. కారక. 9)

**వారార్థకశబ్దము**

'పర్యాయము' అను నర్థము నిచ్చు శబ్దము.

ఇట్టి శబ్దము తఱచుగా నద్విరుక్తము, సంఖ్యాపూర్వకమును నగును.

ఒక తడవ, ఒకతూరి

తఱచుగా ననుటచే—తడవ తడవకు ననియు ననవచ్చును.

(ప్రౌ. వ్యా. సమాస. 21)

**వాసుదేవవృత్తి**

ఆంధ్ర శబ్దచింతామణికి సంస్కృతమున వ్రాయఁబడిన వ్యాఖ్య. దీనికి ఆంధ్ర శబ్ది చింతామణి వృత్తియని నామాంతరము కలదు. ఇది యముద్రితము. చూ:- ఆంధ్రశబ్ద చింతామణివృత్తి.

**వి[1]**

అచేతన వాచకములగు ఆ, ఈ, ఏ యను శబ్దములకు పరమందున్న ప్రథమా బహువచన (జస్) ప్రత్యయస్థానమున వచ్చు ఆదేశము. ఉదా:- అవి, ఇవి, ఏవి (వై. చం. హలంత. 10)

**వి[2]**

ఇకారాంతమగు యుష్మదర్థక విశేషణము కంటె పరమందు వచ్చు వర్ణము. (అథ. కా. హలంత. 14) ఉదా:- నీవు కవివి మొ॥

**వి[3]**

తిర్యగ్జడములు కర్తలుగా నున్నపుడు వర్తమానార్థమున ప్రథమ పురుష బహువచనమున వచ్చువర్ణకము. ఉదా:- చిలుకలు రంజిల్లుచున్నవి మొ॥ (చింతా. క్రియా. 23)

**వికల్పము**

(i) వ్యాకరణ కార్యమొకసారి కలుగుట, మఱియొకమాఱు కలుగకుండుట.

(చూ.) విభాష.

వచ్చుచున్+ఉండెను > వచ్చుచుండెను.<br>వచ్చుచునుండెను.

(బా. వ్యా. సంధి. 2)

(ii) అప్పకవి దీనినిట్లు వివరించెను—వ్యాకరణకార్యము—

(క) ఒకమాఱు కలుగుట, మఱియొకమాఱు కలుగకుండుట.

(చ) ఒక్కొక్కమాఱు తప్పక కల్గుట.

(ట) ఒక్కొక్కపరి యసలు కలుగనే కలుగకుండుట. (అప్ప. V. 17)

**వికల్పసంధాయకము**

అవాంతర భావములను కలుపునది.

రాముఁడేని, కృష్ణుడేని, యాపని చేయుదురు.—రాముఁడుకాని, కృష్ణుడుకాని, ఎవరేని యొకరనుట వికల్పము. (మ. ప. వ్యా. సంధా. 6)

**వికారార్థము**

మార్పును దెలుపునట్టి యర్థము.

ఈ యర్థమునందు సంస్కృతమునందు వచ్చు 'మయ(ట్)' ప్రత్యయము కొన్ని యాచ్ఛిక శబ్దముల మీఁదను గానవచ్చును.

మెదడు ప్రోవులమయమయ్యె. (ఆం. భా. శా. తద్ధిత. 28)

**వికృతిశబ్దము**

సంస్కృత సమేతరశబ్దము. సంస్కృతభవములు, ప్రాకృతసమములు, ప్రాకృతభవములు, దేశ్యములు – ఈ చతుర్విధ శబ్దములు వికృతి శబ్దములు. వీని కంటె పరమందున్న సాంస్కృతిక పరుషములకు గసడదవలురావు. (చింతా. సంధి. ఉదా:- దొరకరుణించె, సిరి చంచలము మొ॥ సంస్కృత సమములకంటె పరమందున్న సాంస్కృతిక పరుషములకు గసడదవలు రావచ్చును. ఉదా:- రాముఁడు గరుణించె మొ॥ (అహో. సంధి. 24) 'ఏషా తయోర్భవేద్వికృతి' (చింతా. సంజ్ఞా. 11) అనుసూత్రమున తత్సమాదులగు పదముల కన్నిటికిని వికృతిసంజ్ఞ యున్నను గసడదవాదేశమును నిషేధించు నీ "నవికృతి శబ్దాత్" (చింతా. సంధి. 24) అను సూత్రమున తత్సమేతరములగు తెనుఁగు శబ్దములనే గ్రహింపవలెను. (అహో. సంధి. 24).

**వికృతి**

మార్పు చెందినది యని శబ్దార్థము.

(i) సంస్కృత, ప్రాకృతములు తెలుఁగు భాషకుఁ బ్రకృతులు. అందుండి మార్పులతో నేర్పడినది తెలుఁగు భాషయని, అందుచే నారెండింటికిని 'తెలుఁగు' 'వికృతి' యగును. (అప్ప. I. 84)

(ii) సంస్కృత సమేతరమైన తెలుఁగు బాస. (బా. వ్యా. తత్సమ. 46)

**విగ్రహము**

వృత్తి (చూ.) యొక్క యర్థమును బోధించు వాక్యము విగ్రహము. (ఇట వాక్యమనఁగా సమాసమందలి శబ్దములకు పృథక్ప్రయోగ మర్థము).

ఇది లౌకికము, అలౌకికమని రెండు విధములు. (i) లోకమునందుఁ బ్రయోగమగునది లౌకికము—రాజ్ఞః పురుషః

(ii) శాస్త్రప్రకార కల్పితము—రాజన్+అస్; పురుష+సు.

(తె. వ్యా. వి. పుట. 822)

**విధాతృగ**

విధాతృ మున్నగు శబ్దముల గణము. చూ:-గ. విధాతృ, సవితృ, ధాతృ, నేతృ, దాతృ, అను ఋకారాంత శబ్దములీగణమునకు చెందినవి. వీని ఋకారమునకు డాప్ వికల్పముగా వచ్చును. ఉదా:- విధాత-విధాతృఁడు; సవిత-సవితృఁడు; ధాత-ధాతృఁడు మొ॥ చూ- డాప్. (వై. చం. అజంత. 73)

**విధాత్రాదులు[1]**

(విధాతృ+ఆదులు) విధాతృ, సవితృ, ధాతృ, నేతృ, దాతృ మున్నగు ఋకారాంత మహద్వాచక శబ్దములు. వీని ఋకారమునకు వికల్పముగా డాప్ వచ్చును. (చింతా. అజంత. 49) డాప్‌లోని పకారముచ్చారణార్థము. డకారమిత్సంజ్ఞకమై లోపింపఁగా 'ఆ' మిగులును. డావ్‌రాని పక్షమున డుజ్ఞు వచ్చును. (చింతా. అజంత. 12) డాబంత రూపము రమాశబ్దసమమగుటచే డావ్ వచ్చిన పక్షమున సులోపము. ఉదా:- విధాత, విధాతృఁడు - సవిత, సవితృఁడు - నేత, నేతృఁడు-మొ॥

**విధాత్రాదులు[2]**

విధాతృ, ధాతృ, దాతృ, సవితృ, నేతృ, అను ఋకారాంత శబ్దము లైదు మాత్రమే. ఇది నియతగణము.

వీనికొక పక్షమున అత్వత్రీ వద్భావములు, పక్షాంతరమున డుజ్ కలుగును.

విధాతృ < విధాత / విధాతృఁడు

(బా. వ్యా. తత్సమ. 52)

**విధానము**

పద్ధతి, రీతి.

'అ' వర్ణాదుల నుచ్చరించురీతిని దెల్పుటకు 'కార' ప్రత్యయమును జేరును.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 2)

అకారము, ఉకారము, కకారము

**విధానసామర్థ్యము**

కార్యవిధానము యొక్క బలము.

సమాసములందు ద్రుతమునకు లోపము కల్గును. అయినను. సమాసములందు ఉదంత స్త్రీసమములకు; పుంపులకు; పరుషసరళములు పరమగునపుడు 'ను' గాగమ మగునను విధానము యొక్క బలముచే. అచటి ద్రుతమునకు లోపము కలుగదు.

చిగురుం గైదువు

చిగుర్గైదువు (బా. వ్యా. సంధి. 25)

విధాశబ్దము

బాలవ్యాకరణము నందీశబ్దము స్త్రీలింగముగా గ్రహింపఁబడి, దానికి క్లీబతుల్య మతిదేశింపఁబడినది. ఈ క్లీబతుల్యత్వాతిదేశము బహుళమగుటచే, ఈ శబ్దమునకు 'ము' వర్ణకము నిత్యముగా విధింపఁబడెను. ఇట్లు 'విధము' అను శబ్దము సిద్ధించు చున్నది.

అజయుని సంస్కృతకోశమాధారముగా ప్రౌఢ వ్యాకరణము నందీశబ్దము పుంలింగముగాఁ బేర్కొనఁబడెను. ఇది అమహద్వాచకమగుటచే 'ము' వర్ణకము చేరి 'విధము' అనురూప మేర్పడును.

బాలవ్యాకరణమునందు ప్రక్రియా గౌరవముకలదు. అది ప్రౌఢ వ్యాకరణము నందు వారింపఁబడెను.

సంస్కృత శబ్దముల లింగ నిర్ణయము క్లిష్టమైనది. ఒకేశబ్దమున కొకకోశము ఒక లింగమును నిర్ణయింపగా వేఱొక కోశము వేఱొక లింగమును జూపును.

(బా. వ్యా. తత్సమ. 66; ప్రౌ. వ్యా. శబ్ద. 24)

విధి

ఆజ్ఞ, నియమము.

ఈ యర్థమునందు రెండు వచనములలోను, మూఁడు పురుషలందును–'అది' అను శబ్దము ధాతువునకుఁజేరును.

బుద్ధుఁడు ధర్మము సేయునది.

మీరు శివునకుఁ దపము సేయునది మొదలైనవి

(కా. చూ. IX. 148,156,158; బా. వ్యా. క్రియా. 27)

విధేయము

(చూ.) ఉద్దేశ్యము ననుసరించి యుండునది. ఇది వక్తకు మాత్రమే తెలియును.

క్రియాదికము— అనఁగా క్రియ, విశేష్యము, విశేషణము, సర్వనామము విధేయమగును.

| ఉద్దేశ్యము | విధేయము |
|---|---|
| (i) గుఱ్ఱము | వేగముగాఁబరుగిడును. |
| (ii) వాగ్భూషణమే | సుభూషణము |

(ప్రౌ. వ్యా. వాక్య. 6)

**విధేయవిశేషణము**

విశేష్యము ముందుగాఁజెప్పి ఆ పైని విశేషణమును జెప్పినచో అది విధేయ విశేషణము.

రాముఁడు *సుగుణాభిరాముఁడు*

(ఆ. కౌ. 768-770; చూ. ప్రౌ. వ్యా. క్రియా, 229; కారక. 24)

**విధ్యాద్యర్థకములు**

ఆజ్ఞ మున్నగు నర్థములతోఁగూడి, ఆకస్మికగుణ విస్ఫురణ సముద్రేక బోధకములగు శబ్దములు.

నిలు నిలు, పోపో, లేలే, వచ్చెనుపో, అంతేపో, రాడులే యిత్యాదులు.

(మ. ప. వ్యా. రస. 8)

**వినార్థము**

(వినా+అర్థము) వినాయను సంస్కృత శబ్దముయొక్క అర్థము. కాక, కాని యనునవి వినార్థకములు. ఉదా:- అదికాక మఱియొక్కటిలేదు. అదికాని వేఱేలేదు. మొ॥ (మం. ఆం. కౌ. 419)

**విప్రకర్ష**

చూ. స్వరభక్తి.

సంయుక్తముగా నున్న హల్లుల మధ్యమునందచ్చును జేర్చుట.

కొన్ని తద్భవములు తెలుఁగునందీ పద్ధతి ననుసరించి యేర్పడును.

చంద్ర— చందురుఁడు

సముద్ర—సందరము (తె. వ్యా. వి. పుట. 54)

**విభక్తి**

(i) వి+భజ్+తి—విభజనము, వేఱుపాటు, అని యర్థము. ప్రకృతిని వేఱుపఱుచునది.

(ii) విభక్తియనఁగా సాధారణముగాఁ నామవిభక్తియనియే స్ఫురించును

కాని సంస్కృతమునందు నామవిభక్తులనియు, క్రియా విభక్తులనియు విభజనము కలదు.

కతిపయ తద్ధిత ప్రత్యయములకుఁగూడ విభక్తులను వ్యవహారము కలదు.

(తె. వ్యా. వి. పుట. 627)

(*iii*) శబ్దముల పరస్పర సంబంధమును దెలుపునది విభక్తి.

అర్జునుఁడు పాశుపతాస్త్రముచే సైంధవునిఁ దెగటార్చె

ఇటఁ బాశుపతాస్త్రమునకుఁ దెగటార్చు వ్యాపారకరణత్వ సంబంధము గలుగుటను; సైంధవునకుఁ దెగటార్చు వ్యాపార ఫలాశ్రయత్వ సంబంధము గలుగుటను అర్జునునకు వ్యాపారాశ్రయత్వ సంబంధము గలుగుటను సౌరిదిని—చేత;—ని; —డు(జ్) అను విభక్తుల వలననే యని తెలియును.

(మ. ప. వ్యా. శబ్ద. 24)

**విభక్తి పరిణామము**

విభక్తి ప్రయోగమునందు మార్పు.

"ఈతనితోసాటి యనఁగ మేలన—" అనుచో ఈతనితోసాటి, ఈతని కంటె మేలను నర్థము వచ్చును.

ఇక్కడ తృతీయకు తొలుత తృతీయార్థము, పిమ్మట పంచమ్యర్థము గలిగెనని తెలియును. (ప్రౌ. వ్యా. కారక. 26)

**విభక్తిప్రతిరూపకావ్యయములు**

విభక్తుల వలెనుండి, వానియర్థమిచ్చునవి.

(*i*) ద్వితీయా విభక్తి ప్రతిరూపములు : కూర్చి, గుఱిఁచి, గుఱించి

(*ii*) తృతీయా విభక్తి ప్రతిరూపములు : మెయిన్, మైన్; చేసి

(*iii*) చతుర్థీవిభక్తి ప్రతిరూపములు ; కోసరము, కోసము, పొంటెన్

(*v*) పంచమీ విభక్తి ప్రతిరూపములు : ఉండి, ఉంచి, పట్టి.

(ఆం. భా. శా. అవ్యయ. 14)

**విభక్తిసంధి**

ప్రథమకాక, యితర విభక్తులందుఁగొమ్ములుగల విభక్తులకు, కాగుడికి సంధి వైకల్పికము.

రామునకున్+ఇచ్చె < రామునకిచ్చె / రామునికినిచ్చె

హరికిన్+ఇచ్చె < హరికిచ్చె / హరికినిచ్చె

(అప్ప. V. 56,60

**విభక్తులు**

(i) ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, సంబోధనము నన నెనిమిది తెఱఁగుల విభజింపఁబడుటను జేసి **విభక్తు** లనఁ బరఁగెను. (ఆం. భా. భూ. 68; ఆం. కౌ. 128-131)

(ii) (సంబోధనమును ప్రథమా విభక్తి లోఁజేర్చి) ఏడువిధములగు విభక్తులే కొన్ని వ్యాకరణములు పేర్కొన్నవి. (బా. వ్యా. తత్సమ. 1-7)

(iii) సప్త విభక్తి ప్రణాళిక సంస్కృత వ్యాకరణాను సారముగా నేర్పడిన దని, తెలుఁగు మున్నగు ద్రావిడ భాషలలో విభక్త్యర్థాభిదాయకములగు పదములెన్నో యున్నవని, కాల్డ్వెల్ పండితుఁడు ఆతని ననుసరించి ఆంధ్రభాషాభిజ్ఞులు పేర్కొనిరి. (తె. వ్యా. వి. పుట. 680)

**విభక్త్యర్థాభిధాయకములు**

(విభక్తి+అర్థ+అభిదాయకములు) విభక్త్యర్థమును జెప్పునట్టి గుఱించి, చేసి, మై మున్నగు తెనుఁగు అవ్యయములు. ఉదా:- విరించి *గుఱించి* తపంబుఁ **జేసెను** (ద్వితీయా విభక్త్యర్థము), దిగ్విజయమున్నతిఁ **జేని మహావిభూతితోన్** (పంచమీ విభక్త్యర్థము), ఒక నిశ్చయంబు మై నున్నవాఁడు (తృతీయావిభక్త్యర్థము) (అథ. కా. అజంత. 14)

**విభక్త్యేక లోపములు**

విభక్తి లోపించునట్టి పదములు. ఇవి తద్భవము లగును.

పనసః—పనస

కుండః—కుండ (క. సం. వి. III. 10)

**విభాష**

విధి యొకమాఱు ప్రవర్తిలుట, మఱియొక మాఱు ప్రవర్తిల్లకపోవుట.

**విభాష**, వికల్పము అనునవి సమానార్థకములు. (చూ.) వికల్పము.

ఇది త్రివిధములు :

(*i*) ప్రాప్తవిభాష.
(*ii*) అప్రాప్తవిభాష.
(*iii*) ప్రాప్తాప్రాప్త విభాష. } (చూ.)

(ల. వ్యా. సంధి. సూ. 1; రమణీ. పుటలు. 63-65)

**విరతులు**

చక్కగా నర్థమగుటకు, భాషించునవుడుకాని, పఠించునపుడుగాని, వాక్యాదుల యంతమందు యుక్తకాలము వఱకును నూరకుండుట 'విరతి' యనఁబడును.

సులభముగా నన్వయించుకొనుట కొఱకు గ్రంథమును వాక్యములుగాను, వాక్యములను వాక్యాంశములుగాను విభజించుటకయి వివిధములగు విరతులను దెలుపు సంజ్ఞలు (గుఱుతులు) వాడఁబడును. (pauses),/./:/;/. మున్నగునవి.

ఇట్టి గుర్తులు ఆంగ్ల లిపిపద్ధతుల ననుసరించి యేర్పడినవి. నవీనవ్యాకరణములు కొన్ని వీనిని వివరించినవి. (స. వ్యా. విరతులు. 1)

**విరామము**

విరమించుట.

ఈ యర్థమునందు 'వలన' వర్ణకమగును.

భోగంబు వలన విరమించె. (బా. వ్యా. కారక. 9)

**విరోధ సంధాయకము**

విభిన్న భావములను గోచరింపఁజేయు పదములను గలుపునది.

హిరణ్యకశిపుఁడు దుష్టుఁ డయిన ప్రహ్లాదుఁడు శిష్టుఁడు.

(మ. ప. వ్యా. సంధా. 6)

**విలీన ప్రాచీనపు తెరవు పదములు**

బాగుగా లీనమైన ప్రాచీనకాలమునకుఁ జెందిన అన్యభాషాపదములు.

దేశియములగు పదముల యాకృతితో తుల్యమైన యాకృతిగల సంస్కృత ప్రాకృత భవములు. (assimilated ancient loan - words)

జముఁడు, కారము

సిరి, ఆకసము మున్నగునవి. వీనినే ప్రాచీన తద్భవము లందురు.

(తె. వ్యా. వి. పుట. 388; అనుబంధము. పుట. 22)

**విలీన నవీనపు తెరవు పదములు**

దేశ్యపదాకృతి కనువగు రీతిని మార్పుచెందిన నవీనములగు అన్యదేశ్యములు'

వీనినే నవీనతద్భవములు (చూ.) అనియునందురు. (assimilated modern loans)

కిరసనాయిలు (< (ఆంగ్లము) కిరోసిన్)

ఆసుపత్రిరి (< (,,) హాస్పిటల్)

(తె. వ్యా. వి. పుట. 388; అనుబంధము. పుట. 22)

**విలీనార్వాచీనపు తెరవు పదములు**

నైజపదాకృతితో తుల్యమగు శబ్దాకృతి నందినట్టి, మధ్యకాలమునందు

దెలుఁగు బాసలోనికిఁబ్రవేశించినట్టి అన్యదేశ్యములు.

వీనినే యర్వాచీన తద్భవము లందురు. (assimilated mediaeval loan-words)

చూ. అర్వాచీన తద్భవములు.

కద్దరు< ఖద్దర్

కారుకానా< కార్ఖానా. (తె. వ్యా. వి. పుట. 388; అనుబంధం. పుట. 22)

**వివరణాత్మక వ్యాకరణములు**

ఆంగ్లవ్యాకరణ పద్ధతిలో, సాంకేతికమగు పారిభాషిక పదక్లిష్టత లేకుండ సూత్రపద్ధతిలోఁగాక, విశదమగు వ్యాకరణ పద్ధతిలో రచింపఁబడిన వ్యాకరణములు.

కందుకూరి వీరేశలింగముగారి 'సంగ్రహవ్యాకరణము', (చూ.) వావిలికొలను సుబ్బారావుగారి 'సులభవ్యాకరణము' (చూ.) మున్నగు నవీన వ్యాకరణము లిట్టివి.

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి 'తత్సమచంద్రిక'యు నిట్టిది. (తె. వ్యా. వి. పుట. vi)

**వివర్ణకము**[1]

అది, ఇది, ఏది అను శబ్దములకంటె పరమందున్న బహువచనమున వచ్చు వర్ణకము. ఇది స్త్రీలింగమున మాత్రము రాదు (అథ. కా. అజంత. 87) ఉదా:- అవి, ఇవి, ఏవి.

**వివర్ణకము**[2]

బహువచనమున సంబంధార్థమున వచ్చు ప్రత్యయము. ఇది పరమగునపుడు పూర్వమందలి ఉకారమునకు తఱచుగా ఇకారమాదేశమగును. (అథ. కా. అజంత. 86) ఉదా:- వారివి (వారు+వి) మొ॥

**వివృతి**

బాలవ్యాకరణమునకు శిరోమణి సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారిచేత సులభముగా రచింపఁబడిన వ్యాఖ్యానము.

1970లో ప్రచురింపఁబడినది.

**వివృత్తి**

పూర్వపదాంతము నందును, పరపదము యొక్క ఆదియందును గల యచ్చులను సంధి నివారకాగమముల (glides) సాయము లేక యుచ్చరించుట.

దీనినే 'hiatus' అందురు.

రాముఁడు అప్పుడు అట్లు అరణ్యములకు ఏగెను.

(తె. వ్యా. వి. పుట. 378)

కొందఱు నరులు.

(iii) సంఖ్యావాచక సర్వనామములు

నలువురు నరులు (సం. వ్యా. సర్వ. 15,16)

**విశేషణోత్తరపదకర్మధారయము**

విశేషణము ఉత్తర పదముగాఁగల కర్మధారయ సమాసము.

తమ్మి కుఱ్ఱ, చిలుక ముకరి. (వ్య.) విశేషణ పూర్వపద కర్మధారయము (చూ.) దీనినే విశేష్య పూర్వపద కర్మధారయమనియు వ్యవహారము (చూ.)

(ప్రౌ. వ్యా. సమాస. 16)

**విశేషణోభయపదకర్మధారయము**

పూర్వోత్తరపదములు రెండును విశేషణములయిన సమాసము.

సంస్కృతమునందు 'స్నాతానులిప్తః (పూర్వం స్నాతః, పశ్చాత్ అనులిప్తః) (ఇట స్నాతః లిప్తః అనునవి విశేష్యనిఘ్నములు) వంటివి తెనుఁగునందుఁ గూడ నున్నట్లు నిరూపింప యత్నింపఁబడెను.

ఆయానేరములు, కొట్టిన తిట్టిన యాతఁడు. కాని ఆంధ్రకౌముదియందు 'చలివేఁడి' 'కనుఁగవ' 'వెలిగప్పు' వంటి విట్టి సమాసములుగాఁ బేర్కొనఁబడెను.

(ప్రౌ. వ్యా. సమాస. 17; ఆం. కౌ. 599-600)

**విశేషము**

విశేషవిధి. సామాన్యవిధి కానిది.

సామాన్య విధికి విశేషవిధి, నిత్యముగా బాధకముగా నుండుటయే వ్యాకరణమువ సార్వత్రికమయిన సాధారణ పద్ధతి.

ఇట్టి నియమమున కపవాదముగా విశేషవిహితములగు—ఱికాది తద్ధిత ప్రత్యయములు ప్రవర్తించు చోటులందన్నిటను సామాన్య విహితమగు—తన వర్ణకము సయితము కల్గును.

చిన్న < చిన్నఱికము, చిన్నతనము

(బా. వ్యా. తద్ధిత. 2; రమణీ. 371 పుట)

**విశేష్యనిఘ్నములు**

విశేష్యాధీనములు.

సంస్కృతమునందు విశేష్యమును బట్టి కొన్ని విశేషణములకు మూఁడులింగములందును రూపము లుండును.

1. సున్దరః పురుషః
2. సున్దరీసీతా
3. సున్దరమ్ వనమ్

ఇట్టి సున్దరాది శబ్దములు విశేష్యనిఘ్నములు.

తెనుఁగునఁ గూడ నిట్టి విశేష్యనిఘ్నములు కొన్నిగలవు. 'బల్లిదాదులు (చూ.) ఇట్టివి. ఇవి సంస్కృత తుల్యములు.

బల్లిదుఁడు రావణుఁడు
బల్లిదురాలు శూర్పనఖ
బల్లిదము హృదయము (రమణీ. పుట. 302)

**విశేష్యపూర్వపదకర్మధారయము**

సాధారణముగా విశేషణము పూర్వపదముగను, విశేష్య ముత్తర పదమ్ముగను కర్మధారయ సమాసముండును.

అట్లుగాక విశేష్యము పూర్వపదముగానుండు మయూర వ్యంసకాది సంస్కృత సమాసములట్లు తెలుఁగునను కొలఁదిగా విశేష్యము పూర్వమందున్న కర్మధారయ సమాసములును గలవు.

తమ్మిగుత్తి
చిలుకమొకరి.

వీనినే (చూ.) విశేషణోత్తరపద కర్మధారయములనియు నందురు.

(ఆం. కౌ. 597-98; ప్రౌ. వ్యా. సమాస. 16)

**విశేష్యము**

విశేషణముచేఁ (చూ.) దెలియఁచేయఁబడిన విశేషము కలది.

హరి కరుణాకరుఁడు. (అ. ఛం. IV. 120; ప్రౌ. వ్యా. శబ్ద. 2)

**విశేషశిలతకములు**

విశేషణములు కొన్నియెడల విశేష్యములను స్ఫురింపఁజేయును.

అప్రియములు = అప్రియ కార్యములు,
దేవతల కప్రియములు గావించి మనుష్యులు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 12)

**విశ్వకర్మాదులు**

విశ్వకర్మ, కృష్ణవర్త్మ, అశ్వత్థామ, యువ, యజ్వ ఇత్యాదులు. వీనికి

స్త్రీత్వము తరుచుగా నగును. అనఁగా ఉత్వాదుఙ్ఞులు చేరవు.

తఱుచుగా ననుటచే 'విశ్వకర్మని కూఁతురు' అను ప్రయోగమునుబట్టి 'విశ్వకర్ముఁడు' అను రూపముకూడ సకృత్తుగా నుండవచ్చును.

(బా. వ్యా. తత్సమ. 75; ప్రౌ. వ్యా. శబ్ద. 25)

**విషయము**[1]

ఉద్దేశ్యవిధేయములతోఁ గూడినది. అనఁగా విషయమునందు ఉద్దేశ్యము (చూ.) విధేయము (చూ.) అనునవి రెండును గలవు.

విషయము వక్తకుఁదెలియును. (ప్రౌ. వ్యా. వాక్య. 69)

**విషయము**[2]

సప్తమీ విభక్తిగా నొకానొక వ్యాకరణమునఁగలదు.

(గు. వ్యా. 84)

**విష్ణుశర్మ**

ప్రత్యయార్థావ్యయస్యాపి ప్రయోగః కుత్రచిద్భవేత్, అవ్యయస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా, కథితః (సర్వత్ర మున్నగు ప్రత్యయార్థావ్యయములయు, ప్రత్యయార్థేతరా వ్యయములయు, తద్భవావ్యయములయు, ప్రయోగము విష్ణుశర్మచే చెప్పఁబడెను. (అథ. కా. సంజ్ఞా. 28) అను కారికయందు విష్ణుశర్మ మతము పేర్కొనఁబడినది. ఈతఁడు రచించిన లక్షణగ్రంథముకాని తదితర విషయములుకాని తెలియవచ్చుటలేదు. 'విష్ణుం చంద్రం సురగురుమహం సోమచంద్రం నమామి' అను మం. ఆం. కారిక యందును (పీఠిక 1. శ్లో) విష్ణువను నాతఁడు ప్రాచీనాంధ్ర వ్యాకరణకర్తగా పేర్కొనఁబడియున్నాడు. ఈ విష్ణువు అథ. కా. యందు పేర్కొనఁబడిన విష్ణుశర్మయే కానోపు.

(ఆం. వ్యా. వి. పేజీ. 188)

**విసంధి**

(*i*) సంధిచేయక అచ్చులను నిల్పి వ్రాయుట :

హరి ముసలికిని అనుజుండు. అర్జునునకుఁజెలి. (అప్ప. V. 9)

(*ii*) విరుద్ధ సంధి విసంధి, సంధిలేమి అసంధి (చూ.)

(రమణీ. పుట. 285-86)

**విసంధిదోషము**

సంధి చేయవలసిన పట్ల సంధిచేయక అచ్చులను నిలుపుట.

అమృత ఉదధి శయన

అమర ఈశానుఁడు

అబ్జమందిరాస్య అబ్జమిత్ర. (అ. ఛం. IV. 6,88)

**విసర్గ(ము)**

(i) అః—ఇట రెండు సున్నలు, ఒకదాని క్రింద నొకటి యున్నవి—విసర్గ యనఁబడును. (అప్ప. II. 11)

(ii) అనుకరణమునందు విసర్గకు లోపమగును.

'వర్ధతాం శ్రీః' అనియె

'వర్ధతాం శ్రీ' యనియె. (బా. వ్యా. సంధి. 50)

**వీణాదులు**

వీణ, దండ, ముస్త మున్నగునవి. వీనికి ఎత్వము కూడ కల్గును.

వీణ—వీణె

దండము—దండెము

ముస్తము—ముస్తె (కవిజనాంజనము, 58 పత్రము)

**వీప్స**

వరుసగా ననేక వస్తువులను వ్యాపించుట. అట్టి వీప్సార్థమునందు ద్విరుక్తి కల్గును.

నామములకు వీప్సయందు కువర్ణకము వచ్చును.

ప్రమానిప్రమానికి

ఇండ్లిండ్లకు. (ప్రౌ. వ్యా. కారక. 14)

**వీరేశలింగం, కందుకూరి**

అధునికాంధ్ర వాఙ్మయ పితామహుఁడనఁ దగిన ఈయన ఆంధ్రభాషకు సంగ్రహ వ్యాకరణము (చూ.) నొకదానిని రచించెను.

ఆంగ్లవ్యాకరణ పద్ధతిలో నిది వివరణాత్మకముగా (explanatory) రచింపఁబడినది.

ఇందు అలంకారములు (Figures of speech), విరామచిహ్నములు (punctuation marks) కూడ కలవు.

ఈయన సమగ్రవ్యాకరణము నొకదానిని రచింపవలయునని యుద్దేశించినట్లు తెలియును. కానియది నెఱవేరలేదు.

**వుగాగమము**

వు(క్)+ఆగమము, కిత్సంజ్ఞ.

(i) ఉదంత సంస్కృత నామమున కనుకరణమునందు వుగాగమము వచ్చును. 'పాపీచిరాయుః' అనియె ——→ పాపీచిరాయువనియె.

(బా. వ్యా. సంధి. 54)

(ii) వువర్ణకము కాక, ఇతర విభక్తులు పరమగుచో ఉకారాంతములకు బహుళముగను, గోశబ్దమునకు నిత్యముగను వుగాగమమగును.

తరు—తరులు, తరువులు

గో—————గోవులు (బా. వ్యా. తత్సమ. 49)

-వు

ఉకారాంత శబ్దముల కంటెను, ఓకారాంత శబ్దములకంటెను విభక్తి పరమగునపుడును, ప్రథమైకవచన ప్రత్యయ (సు) స్థానమునను మూడు లింగములందును వచ్చు ప్రత్యయము (చింతా. అజంత. 48), ఉదా:- విష్ణువు (పుం), ధేనువు (స్త్రీ) మధువు (నపుం), గోవు (ఇట సుస్థానమున వువర్ణకాదేశము) విష్ణువులు, వస్తువులు గోవులు (విభక్తి పరమగునపుడు వువర్ణకాదేశము) సంబుద్ధీతరస్థలమందు స్త్రీలింగములుకాని ఉకారాంత శబ్దములకు ఈ వువర్ణకము వికల్పముగా వచ్చును. ఉదా:- గురువులు-గురులు; గురువులన్-గురులన్ మొ॥ (అథ. కా. అజంత. 24) 'డుజ్మహత్పదానాంవా' (మహద్వాచక పదములపై సుప్రత్యయమునకు డుజ్ఞు వికల్పముగా వచ్చును. (చింతా. అజంత. 44) అను సూత్రముచే ఉదంత మహద్వాచకములకు డుజ్ఞు వికల్పముగా రాఁగా విష్ణుఁడు, జిష్ణుఁడు ఇత్యాది రూపములును ఏర్పడును.

-వు

దేశ్యమగు యుష్మచ్ఛబ్దము (నీ యనునది) కంటె పరమందున్నను (ప్రథమైక వచన ప్రత్యయ) స్థానమునవచ్చు ప్రత్యయము. (చింతా. హలంత. 14) ఉదా:- నీవు.

-వు

తిర్యగ్జడములు కర్తలుగా నున్నపుడు భవిష్యదర్థమందును, వ్యతిరేకార్థమందును ప్రథమపురుష బహువచనమున వచ్చు ప్రత్యయము. ఉదా:- చిలుకలురంజిల్లఁగలవు, రంజిల్లవు మొ॥ (చింతా. క్రియా. 28)

-వు

అన్ని ధాతువులకును భూతభవిష్యద్వర్తమానా ద్యర్థములందు మధ్యమ పురుష ఏకవచనమున వచ్చు ప్రత్యయము. ఉదా.- ఘటింపవు (వ్యతిరేకము) ఘటింపుచున్నావు (వర్తమానము) ఘటింపఁగలవు (భవిష్యత్తు), ఘటింతువు (తద్ధర్మము) మొ॥ (చింతా. క్రియా. 25)

**వువర్ణకము**

కొన్ని దేశ్యశబ్దములపై ఒకానొకచో నిత్యముగను, ఒకానొకచో వికల్పముగను వచ్చు వర్ణకము. ఉదా:- అన్నువు, దండువు, (నిత్యము) పుట్టు - పుట్టువు; అన్ను అన్నువు మొ॥ (వికల్పము) (అథ. కా. అజంత. 54)

**వుమ్**

జడవాచకములు కాని సంఖ్యేయముల కంటె పరముగా వచ్చు తద్ధితము. (వై. చం. తద్ధితా. 20) ఇందలి మకార మిత్సంజ్ఞకమై లోపించును. ఉదా:- ముప్వురు, నలువురు. ఇది నడచువారను నర్థమున కాలు శబ్దముపైనను వచ్చును. ఇది బహువచనమున మాత్రమే యుండును. ఉదా:- కాల్వురు (వై. చం. తద్ధితా 21)

**వువర్ణకము**

(i) ఉకారాంత సంస్కృత శబ్దములను దెలుఁగు సేయునపుడు వువర్ణకము విభాషగాఁ జేరును.

ప్రభు < ప్రభువు / ప్రభుఁడు

విభు < విభువు / విభుఁడు

(ii) మను, వటు శబ్దాదులకు వువర్ణకమే కాని డుజ్ చేరదు.

మనువు, వటువు. (బా. చూ. IX. 28,29; ఆం. శ. 171-175)

**వుశ్**

భావార్థమున చచ్చుధాతువు తుది సంయుక్తాక్షరమునకు ఆదేశముగా వచ్చు కృత్ప్రత్యయము. ఇందలి శకార మిత్సంజ్ఞకము. ఉదా:- చావు (వై. చం. కృదంత. 7) ఇట వుశ్ అనునది శిత్తగుటచే 'శితిదీర్ఘః' (వాల్మీ. సంజ్ఞా. 16) అను సూత్రముచే పూర్వస్వరమునకు దీర్ఘము.

**వృత్తార్థము**

వృత్తములో సగభాగము. ( )

అముఖ్యము అగునట్టికాని, పర్యాయములగు నట్టికాని పదముల యొక్కయు, వాక్యముల యొక్కయు రెండు ప్రక్కల నుంచునట్టి గుఱుతులు.

నిష్కారణముగా నీచుఁడు (పాపమునకు వెఱవడు కాఁబట్టి) సత్పురుషుల కెగ్గుచేయును. (సం. వ్యా. విరతులు. 1)

**వృత్తి**

కలయికయని శబ్దార్థము.

(i) అనేక శబ్దములేకమై, ఆయా శబ్దార్థములనుగాక, వాని సామూహికార్థమును జేకూర్చుటకు 'వృత్తి' యనిపేరు.

(ii) "విపులమైన యర్థమును లఘుమార్గమునఁ దెలుపు విధమును వృత్తి" యందురు.

'మృగనేత్రా' యను చతురక్షర పరిమిత సమాసవృత్తి యందు 'మృగస్య నేత్రౌ ఇవనేత్రౌ యస్యాఃసా' అను విపులార్థ మిమిడి యున్నది.

(త. చం. పుటలు. 16,17)

(iii) తెనుఁగునందు త్రివిధ వృత్తులే కలవు.

(క) కృద్వృత్తి : ఆట, చేఁత

(చ) తద్ధితవృత్తి : అందగాఁడు, బోయత

(చూ.)

(ట) సమాసవృత్తి : రామునాజ్ఞ

(iv) వృత్తియందు పదముల సామాన్యార్థము (general meaning) నిల్చియుండును.

వెలయాలు , ధీరురాలు (స్త్రీమాత్రము) (బా. వ్యా. సంధి. 31)

**వృత్తివిచారము**

వృత్తినిగూర్చి వివరించు గ్రంథము. సంస్కృతమందలి కృత్తద్ధిత సమాసైక శేషసనాద్యన్త ధాతు విచారమును శ్రీ పేరి సూర్యనారాయణ శాస్త్రిగారు తెనుఁగు నందుఁ గావించి ప్రకటించిన గ్రంథము

**వృద్ధాదులు**

వృద్ధ, నీచ, మూర్ఖ, గృహస్థ, చార్వాకాది శబ్దములు.

వీనికి డుజ్ విభాషగా లోపించును.

వృద్ధ—వృద్ధుఁడు, వృద్ధు. (బా. వ్యా. తత్సమ. 56)

**వృద్ధిసంధి**

అకారమునకు ఏ, ఐలు పరమైన ఐకారము; ఓ,ఔలు పరమైన ఔకారము క్రమముగా నేకాదేశమగును.

కరుణా+ఏకనిలయము ——> కరుణైక నిలయము

గంగా+ఓఘము ——> గంగౌఘము

(ఆం. భా. శా. సంధి. 99)

**వేంకట రామమూర్తి పంతులు, గిడుగు**

పీరు రావుసాహెబ్, మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బిరుదాంకితులు.

పర్లాకిమిడి కళాశాలలో వీరు చిరకాలము చరిత్రాధ్యాపకులుగా నుండిరి.

ఆంగ్లము, ఫ్రెంచి మున్నగు భాషలందువలె, తెలుఁగునందును శిష్టజనులు వ్యవహరించు భాషయే సారస్వతాది విశిష్టప్రయోజనములకును నుపయుక్తము కావలయునని, పూర్వమట్లే జరుగుచుండెనని వీరివాదము.

కాలక్రమమున నీ వాదము విజయమును సాధించినది. వివిధ సారస్వత ప్రక్రియలు నేఁడు విశేషముగా శిష్టజన వ్యవహారభాషయందే నిర్వహింపఁబడుచున్నవి.

వీరు రచించిన 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము' అర్వాచీనాంధ్ర భాషాస్వరూపమునకు దర్పణము.

**వేంకటపతికవి - గణపవరపు**

ఈతఁడు క్రి.శ. 18వ శతాబ్ది మొదటి వాఁడని, కూచిమంచి తిమ్మకవి సమకాలీనుఁడని భావింపఁబడు చున్నది.

ఇతఁడు "సర్వలక్షణ శిరోమణి"యను విపులమగు లక్షణ గ్రంథమును సీస పద్యమాలికగా రచించెను.

దీనిలోని "ఆంధ్రకౌముది" అను వేయి పద్యపాదములుగల సీస మాలిక వ్యాకరణమునకు సంబంధించినది.

ఈ రచనలో సంస్కృత వ్యాకరణ ప్రభావ మత్యధికముగా కాననగును.

**వేంకట రమణశాస్త్రి, వేదము**

చిన్నయసూరికిఁ బూర్వులైన తెలుఁగు వ్యాకర్తలలో నొకరు.

వీరు విశాఖపట్టణము నందు నార్మల్ పాఠశాలలో ఆంధ్రోపాధ్యాయులుగా పనిచేసిరి.

వీరు 'నరసాపుర వ్యాకరణము' 'లఘు వ్యాకరణము' అను వానిని రచించిరి. లఘు వ్యాకరణమును వావిళ్లవారు పునర్ముద్రణము గావించిరి.

బాల వ్యాకరణమునకీ లఘు వ్యాకరణమెంతవఱకు మార్గదర్శకమో తొలి ముద్రణమును జూచినగాని నిర్ణయింపఁజాలము. అది లభింపకున్నది.

**వేంకటరమణశాస్త్రి, దువ్వూరి**

విద్వాన్, కళాప్రపూర్ణ శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు రెండు దశాబ్దములకు పైగా ఆంధ్ర విశ్వకళాపరిషదాంధ్ర శాఖా పండితులై ఆనర్సు, యం.ఏ.,

విద్యార్థులకు బాల వ్యాకరణమును బోధించి, అందనేకులను వ్యాకరణ ప్రవణులను, ప్రవీణులను గావించిన గురువరేణ్యులు.

1964లో వీరు బాల వ్యాకరణమునకు రచించిన సమీక్షాగ్రంథము 'రమణీయమ'ను పేర ప్రకటితము.

వీరు బాల వ్యాకరణము హరికారికలకు, అనువాదము కాదని; హరికారికలే బాల వ్యాకరణమునకు సంస్కృతీ కరణమని సూక్ష్మేక్షికతో పరీక్షించి నిరూపించిరి. దీనితో వీరి కీర్తి పతాక యుప్పరమెగసినది.

**వేంకటరామశాస్త్రి, కల్లూరి**

చిన్నయసూరి కృతమగు బాల వ్యాకరణమునకు 'గుప్తార్థప్రకాశిక' (చూ.) అను పేర విపులమగు వ్యాఖ్యానమును రచించిన పండితవరేణ్యులు. మహామహోపాధ్యాయులు, కళాప్రపూర్ణులు.

వీరు బహుకాలము రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో సీనియర్ పండితులుగాఁ బనిచేసిరి.

శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి విరచిత హరికారికావళికి బాల వ్యాకరణ మనువాదమని శ్రీ శాస్త్రిగారి వాదము.

**వేధ**

'వేధస్' అను శబ్దము. దీని యంత మందలి సకారమునకు లోపమును, స్త్రీవద్భావమును నిత్యముగానగును. (బా. వ్యా. తత్సమ. 82)

**వైకల్పికము**

వికల్పమునకు సంబంధించినది వైకల్పికము.

విధించిన కార్యమొకమాఱు కల్గుట, వేఱొకమాఱు కల్గకుండుట వైకల్పికము. దీనికే 'విభాష' యనియు వ్యవహారము.

వచ్చుచున్+ఉండెను< వచ్చుచుండెను / వచ్చుచునుండెను.

(బా. వ్యా. సంధి. 2)

**వైకృతము**

'వికృతి' (చూ.) సంబంధమైనది వైకృతము.

'రాజు' శబ్దమును సంస్కృత సమముగా చిన్నయసూరి నిపతింపఁజేసెను. కాని బహుజనపల్లి వారు దీనిని 'వైకృతమని కొందఱందురు' అని పేర్కొనెను. ఇది అచ్చ తెనుఁగు కావ్యముల యందుపయుక్తము కారాదు.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 6)

**వైఖరివాక్కు**

పరా, పశ్యన్తి, మధ్యమా, వైఖరి—అను చతుర్విధములగు వాగ్భేదములలో చివరిది.

హృదయ కమలము నుండి వాయువు మూర్ధమును దాకి, వెనుదిరిగి, కంఠ తాల్వాది స్థానములకు తాకుటచే వెలువడు వాక్కు.

ఇది శ్రోతయొక్క హృదయమందలి మధ్యమా వాక్కును ప్రేరేచును.

(తె. వ్యా. వి. పుట. 1021)

**వైజ్ఞానికాన్యదేశ్యములు**

శాస్త్రీయ వ్యవహారార్థము ఉపయుక్తమగు అన్యదేశ్యములు.

రేడియో, రిలెటివిటి, రిలే మున్నగునవి.

(తె. వ్యా. వి. పుట. 854)

**వైరి పదము**

తెనుఁగు విభక్తి చేరని సంస్కృతశబ్దమును తెనుఁగు పదముతో నదికినయది.

పుష్పవిల్లు, భూరుహపండ్లు, క్షీరార్ణవ కూఁతురు, సంసారార్ణవయోడ, ఇత్యాదులు.

(క. చిం. I. 93; కా. చూ. IX. 85; అ. ఛం. IV. 22)

**వైషయికము**

విషయ సంబంధమైనది.

విషయ మనఁగా ఇంద్రియము. కోర్కెలను గల్గించునది.

త్రివిధములగు అధికరణములలో (చూ.) ఒకటి.

మోక్షమం దిచ్చకలదు.

(ఆం. కౌ. 470; బా. వ్యా. కారక. 17)

**వ్యంజనములు**

(i) స్వరములచేఁ బ్రకాశింపఁబడునవి. వీనికే 'హల్లులను' (చూ.) పాణినీయ వ్యవహారము ప్రసిద్ధము.

కాదులు వ్యంజనములు. (ఆం. భా. భూ 16; క్రా. చూ. IX. 9)

(ఆం. కౌ. 58; అప్ప. II. 7)

(ii) కా మొదలు క్ష కారము తుదగాఁగల ముప్పది నాల్గు హల్లులు వ్యంజనములు. (అ. ఛం. IV. 123)

**వ్యంజన సంధులు**

పరపదాది వర్ణములు వ్యంజనములు కాగా, వానితోఁగల్గు సంధులు.

పూచెను+కలువలు ⟶ పూచెనుగలువలు.

తల్లి+తండ్రి ⟶ తల్లిదండ్రులు.

కడ+కడ ⟶ కట్ట కడ. ఇత్యాదులు

(అప్ప. V. 34, 35, 50)

**వ్యతిరేకక్రియలు**

(i) వ్యతిరేకార్థమునిచ్చు క్రియాపదములు—వండక, వండమి, వండకుండ ఇత్యాదులు. (ప్ర. వ్యా. 395)

(ii) వ్యతిరేకార్థక క్రియలు సందర్భానుకూలముగా భూత, భవిష్యద్వర్తమానార్థములను దెలుపును

కానము—కనినవారముకాము (భూతము)

రాఁడు—రాఁగలవాఁడుకాడు (భవిష్యత్తు)

పాఁడు—పాడుచున్నవాఁడుకాఁడు (వర్తమాన)

(ప్రౌ. వ్యా. క్రియా. 8)

**వ్యతిరేకక్త్వార్థము**

(చూ.) అకప్రత్యయాంతావ్యయము.

వ్యతిరేక భావమును దెలుపు భూతార్థకాసమాపక క్రియ,

ఈ యర్థమునందు ధాతువునకు-కజి యగును.

'కజి' జీత్తు కావున ధాతుయొక్క యుత్వమున కత్వమగును.

చేయు+క (జి) ⟶ చేయక (ప్రౌ. వ్యా. క్రియా. 39)

**వ్యతిరేకభావము**

ఇందు—'మిజి' (చూ.) వర్ణకమగును. ఇది జీత్తు కావున ధాతువుయొక్క ఉత్వమున కత్వమగును.

వండమి, తినమి. (బా. వ్యా. క్రియా. 37)

**వ్యతిరేక మధ్యమము**

వ్యతిరేకార్థమును దెలుపు మధ్యమ పురుషక్రియ.

దీని 'ము' వర్ణకమునకు (i) అచ్చు పరమైనను, (ii) హల్లుపరమైనను (iii) అవసానమునను లోపము విభాషగానగును.

(i) నమ్మకము+ఇట < నమ్మకిట / నమ్మకుమిట

(ii) నమ్మకుము+నన్ను < నమ్మకు నన్ను / నమ్మకుము నన్ను

(iii) ఇట+నమ్మకుము < ఇట నమ్మకు / ఇట నమ్మకుము

(బా. వ్యా. సంధి 43)

**వ్యతిరేకార్థక విశేషణము**

తుమున్నర్థక రూపముయొక్క తుదను నివర్ణమును జేర్చుటవలన నిట్టిరూపము లేర్పడును.

పోషింపని, కొట్టని (సం. వ్యా. విణ. 5)

**వ్యతిరేకవంజక ప్రశ్నార్థకము**

(i) నామపదమునకు ఆర్యాద్యర్థక శబ్దమునుజేర్చుట చేత వ్యతిరేకార్థమును సూచించు ప్రశ్న మేర్పడును.

తగునటయ్యా ? (తగదని యర్థము)

(ii) ఒక్కొక్కచో తద్ధర్మక్రియ, ఆర్యాద్యర్థపరకమయి వ్యతిరేకతను దెల్పు ప్రశ్నార్థకమగును.

తమ్ముఁడనం **జనునయ్యా** (చనదు) ఇట్టి నీ **చేతకు** మెత్తురమ్మ ? (మెచ్చరు)

నిజమునకీ వ్యతిరేకార్థము అయ్య, అమ్మ మున్నగువానియంతమందలి కాకువు వలన జనించుచున్నది. (పౌ. వ్యా. శబ్ద 115; క్రియ. 4)

**వ్యతిరేకము**

వ్యతిరేక విశిష్ట క్రియావృత్తియగు ధాతువునకు లజి వర్ణకమగును.

'లజి' యనునది జిత్తు గావున ధాతువుయొక్క యుత్వమున కత్వమగును.

వండు+కు (జి)+ము ⟶ వండకుము,

వండు+కు(జి)డు⟶ వండకుఁడు

ఇత్యాదులు. (బా. వ్యా. క్రియా. 7, 32)

**వ్యతిరేకార్థక భూతకాలికాసమాపక క్రియ**

వ్యతిరేకార్థమును దెల్పునట్టి, గతకాలమునకుఁజెంది, యర్థపరి సమాప్తినొందని క్రియ. దీనినే 'అకప్రత్యయాంతావ్యయ' మందురు. ఇది కళయేకాని ద్రుతము కాదు.

కాదన కిట్టిపాటి
లేకతగన్ (ప్రౌ. వ్యా. సంజ్ఞా. 8)

**వ్యతిరేకార్థకము**

క్రియయొక్క అభావార్థమును దెల్పుక్రియ.

రాముఁడాపని చేయఁడు. (ల. వ్యా. క్రియా. 5)

**వ్యతీహారము**

తన విషయమునం దొకఁడే విధముగవర్తించునో, అట్టులే యాతని యందును దానువర్తించుట.

కచా కచి

దండాదండి.

(చూ.) వ్యతీహార లక్షణ బహువ్రీహి. (సు. వ్యా. సమాస. 6)

**వ్యతీహార లక్షణ బహువ్రీహి**

(చూ.) వ్యతీహారము. ఇట్టి లక్షణముగల బహువ్రీహి.

కచాకచి—ఒకని జుట్టు మఱియొకఁడు పట్టుకొని చేయు యుద్ధము.

(సు. వ్యా. సమాస. 62)

**వ్యత్యస్తము**

ముందుది వెనుక, వెనుకది ముందు వచ్చుట.

ముందు విశేషణము, ఆ పైని విశేష్యము వచ్చుట క్రమము. ఒక్కొక్కచో ఈ క్రమము వ్యత్యస్త మగును.

నీ మాఱుదల్లి త్రిభువనభామారత్నము
↓ విశేష్యము ↓ విశేషణము

(ప్రౌ. వ్యా. శబ్ద. 9)

**వ్యధికరణ తత్పురుషము**

భిన్నములగు విభక్తులకు ప్రథమాంతములతోడి సమాసము.

(i) నెలదాల్పు—నెలను ధరించినవాఁడు—ద్వితీయా తత్పురుష

(ii) నెల తక్కువవాఁడు—నెలచేత తక్కువవాఁడు—తృతీయా తత్పురుష

(iii) దేవరమేలు—దేవరకొఱకు మేలు—చతుర్థీ తత్పురుష

(iv) దొంగభయము —దొంగవలన భయము—పంచమీ తత్పురుష

(v) మల్లెపువ్వు—మల్లెయొక్క పువ్వు—షష్ఠీ తత్పురుష

(vi) మాట నేర్పరి—మాటయందు నేర్పరి—సప్తమీ తత్పురుష

(ల. వ్యా. సమాస. 103)

(బా. వ్యా. సమాస. 3)

**వ్యధికరణ బహువ్రీహి**

భిన్నమగు విభక్తిగల బహువ్రీహి,

భిన్నవిభక్తి షష్ఠీ, సప్తములయందు మాత్రమే యుండును.

పద్మగంధి—పద్మముయొక్క గంధము వంటి గంధ మెవతకుఁగలదో యది—దమయంతి. (షష్ఠి).

చక్రపాణి యందుఁజక్రమెవనికి గలదో వాఁడు—విష్ణువు.

ఇట్లే చంద్రశేఖరుఁడు—శివుఁడు. (సు. వ్యా. సమాస. 57)

**వ్యధికరణము**

వి+అధికరణము-భిన్నమగు ఆధారము, అనఁగా భిన్నమగు విభక్తి.

ద్వితీయాది విభక్తులకు మీఁది పదముతో సమాసము.

నెలతాల్పు-నెలను ధరించువాఁడు ఇత్యాదులు. (బా. వ్యా. సమాస. 8)

**వ్యపేక్ష**

(i) వి+అపేక్ష. అనఁగా సామర్థ్యము (చూ.)

వేఱు వేఱుగనున్న యర్థములకు నేకార్థము కలుగుట. లేక, వేఱువేఱు అర్థముగల పదము లేకార్థమునందు కలియుట,

రాజపురుషుఁడు (రాజ, పురుష అను భిన్నార్థములుగల పదములు సమసించి రాజకీయోద్యోగి యనునర్థము నిచ్చుచున్నవి. (మ. ప. వ్యా సమాస 1)

(ii) స్వార్థమునందు పర్యవసన్నములగు పదములకు ఆకాంక్షాది వశమున నగు పరస్పరాన్వయము. (త. చం. 519)

**వ్యపేక్షా భావము**

(చూ ) వ్యపేక్ష. (తె. వ్యా. వి. పుట. 868)

**వ్యవధాన సంధానము**

అపుట, కలుపుట.

రెండు పదముల నుచ్చరించు నపుడు ఒకచో వ్యవధానము నిచ్చి, తక్కిన భాగమును గలిపి చదివిన యొక యర్థము; వేఱొకచో వ్యవధానమునిచ్చి, కలిపి, చదివిన మఱియొక యర్థము ఏర్పడును.

దీనినే యాధునికులు Juncture అందురు.

రెం - డెడ్ల బండ్లు
రెండెడ్ల - బండ్లు.

ఏనుంగని కరమరయక
ఏనుం గనికరమరయక.

(తె. వ్యా. వి. పుట. 469)

## వ్యవస్థిత విభాష

కట్టుబాటు కావింపఁబడిన విభాష. ఈ కట్టుబాటు నిషేధరూపముగానే యుండ వలయునను నియమములేదు. విధిముఖముగాను నుండవచ్చును.

ఒక పక్షమున వచ్చుట, ఒక పక్షమున రాకుండుట, అను భావాభావ రూప మగు ఉభయాంశములను ప్రవర్తించుచు, ఏదేని యొక స్థలమునందు నిత్యముగా వచ్చునట్లుగాని; అసలే రాకుండునట్లుగాని 'వ్యవస్థ' చేయఁబడునది వ్యవస్థిత విభాష.

"సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు"

ప్రాఁత + కెంపు ⟶ ప్రా + కెంపు

"లుప్తశేషమునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు"
ప్రా + ను + కెంపు.

"ద్రుత ప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు-"

ప్రా + ను + గెంపు ⟶ ప్రాఁగెంపు

"ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషములు విభాష నగు" కాని ''వ్యావస్థిత విభాషచే నీ ద్రుతమునకు సంశ్లేషములేదు." కాని 'ప్రాన్గెంపు' అను రూపముండదు. (రమణీ పుటలు. 63-65)

## వ్యవహితము

దూరముగా నుండుట.

(వ్యతి.) అవ్యవహితము.

తఱుచుగా విశేషణము, విశేష్యమున కవ్యవహితముగా నుండును.

అయినను విశేషణములు కొన్ని వ్యవహితములును నగు—

'ఈలోకంబున వెదకితి, మేలొల్లడగానవరుని' అనుచో 'మేలు' అను విశేషణము, విశేష్యమగు 'వరుని' అనుశబ్దమునకు వ్యవహితముగా నున్నది.

కవితాభాషలో నిట్టి వ్యవహితములు గోచరించును.

(ప్రౌ. వ్యా. శబ్ద. 11; ప్రౌ. వ్యా. సమాస. 18)

**వ్యవహితోత్తర పదము**

వ్యవహితముగా, అనఁగా మఱియొక పద మడ్డుగా, నుండఁగా, ముందు ముందు భాగము నందున్న పదము.

ఇట్టి పదముతో సమాసగత పూర్వపదము ఒక్కొక్కచో నన్వయించును.




(ప్రౌ. వ్యా. సమాస. 84)

**వ్యస్తపదము**

విడిమాట, వేఱుపడినమాట.

(వ్య.) సమస్త పదము (చూ.)

గళము, అలరు, విల్లు ఇత్యాదులు. (సం. వ్యా. పద. 2)

**వ్యాకరణము**

'వి + ఆ' అను నుపసర్గలతోఁ గూడిన 'కృ' ధాతువునకు కర్మణి 'ల్యుట్' ప్రత్యయము చేరఁగా సిద్ధమైన రూపము.

వ్యవహృతములగు శబ్దములను అర్థవంతముగా విభజించు శాస్త్రము.

(Cf. వ్యాక్రియన్తే, వ్యుత్పాద్యన్తే, అర్థవత్తయా ప్రతిపాద్యన్తే శబ్దా యేన తత్—వ్యాకరణమ్—మహాభాష్యః—పస్పశాహ్నికమ్).

(తె. వ్యా. వి. పుట. 4)

**వ్యాకరణ లింగము**

సంస్కృత భాషలో లింగము (gender) చాలవఱకు అర్థమునుబట్టికాక, శబ్దములకుఁ జేరెడి ప్రత్యయములనుబట్టి నిర్ణయింపఁబడును. ఇట్టి లింగమునకు 'వ్యాకరణ లింగము' (grammatical gender) లేక 'శబ్ద లింగము'న్ని వ్యవహారము

మిత్రమ్ — నపుంసక లింగము.

కళత్రమ్ — నపుంసకలింగము
వృక్షః — పుంలింగము.
నదీ, లతా — స్త్రీలింగములు.

(తె. వ్యా. వి. పుట. 583)

**వ్యాకీర్ణము**

భ్రాంతి కరమగు నన్వయము

"ఆయింతి దిద్దుడు తిలకము, కురులందుఁ బూలు ముడువుడు.

(సు. వ్యా. పుట. 322)

**వ్యాపారోన్ముఖత్వము**

ధాత్వర్థమగు వ్యాపారము జరుగుటకు సంసిద్ధత.

ఇట్టి సంసిద్ధతను దెల్పుటకు అన్నంత క్రియలకుఁ 'బోలు' ధాతువు అను ప్రయుక్తమగును.

పండఁబాఱిన పొలమెండఁ బాఱె. (ప్రౌ. వ్యా. క్రియా. 19)

**వ్యావహారిక భాషా వ్యాకరణము**

కర్త: 'వాఙ్మయ మహాధ్యక్ష
శ్రీ వర్ణమూడి గోపాలకృష్ణయ్య

ప్రథమ ముద్రణం - 1958.

పత్రికలలోను, నవలలలోను, వ్యాస రచనలయందును వ్యవహారిక భాష విశేషముగా నుపయుక్తము.

అట్టి లిఖిత వ్యావహారిక భాష నాధారముగాఁగాని, ప్రాచీన సాంప్రదాయిక ఫణితిలో, సూత్రములలో విరచితమైన వ్యాకరణమిది.

**వ్యాస వాక్యము**

విస్తరింపఁబడిన వాక్యము. ఇది సంగ్రహ వాక్యానంతరము (చూ.) వచ్చును.

"అయ్యా! యేను నీ కుంబ్రియంబు సేసెద"—ఇది సంగ్రహవాక్యము.

"నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికింబోయి, నీగుణంబులు దానికి వర్ణించి చెప్పి, అక్కన్య యన్యుల నపేక్షింపక, నీయందబద్ధాను రాగ యగునట్లు చేసెద."—వ్యాసవాక్యము. (ప్రౌ. వ్యా. వాక్య. 20)

**వ్యుత్పత్తులు**

పదముల పూర్వపూర్వ రూపములను నిరూపించుట.

ఇట్టి పూర్వ రూపములను నిర్ణయించుటకు సోదర భాషలలోని సజాతీయ రూపములు (cognates) తోడ్పడును.

పూవు < పూ = వికసించు.

ప్రొద్దు < పొఱు = దూరు.

అగడ్త < అగళ్ = త్రవ్వు.

ఈ ధాతువులు తమిళ భాషలో లభించును.

(తె. వ్యా. వి. పుట. 844)

**వ్రాలు**

వర్ణములు.

(అ. ఛం. *IV*. 129; అప్ప. *II*. 6)

**శ**

తాలవ్యోష్మము (palatal friction or spirant)

కఠిన తాలువు—స్థానము

జిహ్వామధ్యము—కరణము

ఊష్మ ప్రయత్నము

అల్పప్రాణము (సంస్కృతమునందు మహాప్రాణము)

శ్వాసము

శరము, శాస్త్రము మున్నగు సంస్కృత సమములనుగూడి తెలుఁగున వ్యవహృతము.

**శకంధ్వాదులు**

శకంధు + ఆదులు

కర్కంధు, సీమంత, మనీషా, లాంగలీషా, సారంగ మున్నగునవి.

వీనికి పరరూపసంధి (చూ.) ప్రవర్తిలును.

(అప్ప. *III*. 126)

(మ. ప. వ్యా. సంధి. 6)

**శకట రేఫ (ము)**

దీనికే 'బండి ఱ' అని ప్రసిద్ధ వ్యవహారము.

(1) అలఘూచ్చారణము (చూ.) గల రేఫము.

మెఱపు, విఱుపు. ఇత్యాదులు. (బా. వ్యా. సంజ్ఞా. 18)

(ii) ఊది పలుకుచోట తేల్చి పలికినయది శకట రేఫము.

కిఱ్ఱుచెప్పులు—కిఱుచెప్పులు

గొఱ్ఱె—గొఱియ. (క. సం. వి. II-1)

(iii) తద్భవములందు శకటరేఫ ముండదని అప్పకవి, చిన్నయసూరి మున్నగు లాక్షణికుల మతము. తద్భవము లందును శకటరేఫముండునని ఆహోబలపతి, బహుజనపల్లి సీతారామాచార్యులవారు మున్నగువారి మతము.

(బా. వ్యా. సంజ్ఞా 18; ప్రౌ. వ్యా. సంజ్ఞా. 7)

**శతృప్రత్యయము**

ప్రథమేతర విభక్త్యంతముతో సామానాధికరణ్యమున్నప్పుడు లట్‌స్థానమున ఆదేశముగవచ్చు కృత్ప్రత్యయము (అష్టా. 2-2-124). లట్‌స్థానమున వచ్చుటచే నిది వర్తమానార్థకము. ఇందలి శకార, ఋకారములిత్సంజ్ఞకములై లోపింపగా "అత్" మిగులును. ఉదా:- పచంతం చైత్రం పశ్య ఇత్యాదులలోని 'పచంతం' మున్నగు శబ్దములు శతృప్రత్యయాంతములు. వీనికి తెలుఁగులో తత్సమములుగా ప్రయోగములేదు. (వై. చం. హలంత. 88).

**శతృప్రత్యయాంతములు**

సంస్కృతమందలి 'శతృ' ప్రత్యయముతో తుల్యముగా తెలుఁగున వచ్చు ప్రత్యయము.

—చున్.

ఇది యంతమందుఁగల పదములు ద్రుత ప్రకృతికములు.

కొట్టుచున్. (బా. వ్యా. సంజ్ఞా. 12)

**శతృప్రత్యయార్థము**

సంస్కృతము నందలి శతృప్రత్యయము వచ్చు నర్థమునందు తెనుఁగున —'చున్' వర్ణకము వచ్చును.

నచ్చుచున్, పోవుచున్.

వీనినే వర్తమానార్థక అసమాపక క్రియలందురు. చూ:- శతృప్రత్యయము.

(ఆం. కౌ. 764-765)

**శత్రర్థకము**

(శతృ+అర్థకము) శతృప్రత్యయముయొక్క అర్థముగల వర్ణము. సంస్కృత వ్యాకరణమున "లటః శతృశానచా..." అష్టా 2-2-124) అను సూత్రముచే వర్తమానార్థకమగులట్టు స్థానమున శతృప్రత్యయము విధింపఁబడినది. గచ్ఛన్, పఠన్ మున్నగునవి శతృప్రత్యయాంతములు. ఇవి సంస్కృతమున వర్తమానార్థక

విశేషణములుగా కన్పట్టుచున్నవి. తెలుఁగులో శత్రర్థమున 'చు' వర్ణకమువచ్చును. ఉదా :- అనుచు, వినుచు మొ॥ కాని యీ రూపములు గచ్ఛన్, పఠన్ మున్నగు శత్రంతరూపములవలె వర్తమానార్థక విశేషణములుకాక వర్ధమానార్థక అసమాపక క్రియాపదములుగా కన్పట్టుచున్నవి. సంస్కృతము శత్రంతపదములు సుబంతములు కాగా తెలుఁగున నివి విలాక్షణికావ్యయములగు చున్నవి. ఈరీతిగా సూక్ష్మభేదమున్నను వర్తమానాసమాపక క్రియకు శత్రర్థక సంజ్ఞ తెలుఁగు వ్యాకరణము లందు ప్రసిద్ధము.

శత్రర్థము

శతృ + అర్థము.

సంస్కృతమునందు శతృప్రత్యయము యొక్క యర్థమునే యిచ్చునట్టి తెలుఁగు ప్రత్యయము.

(i) ద్రుతాంతమగు-చు వర్ణకము తెలుఁగు నందు శత్రర్థమగును.

రాముఁడు రేడియో వినుచుఁ బాఠము చదివెను.

(బా. వ్యా. క్రియా. 128)

(ii) దీని యుత్వమునకు సంధి వైకల్పికము.

వచ్చుచున్ + ఉండెను < వచ్చుచుండెను. / వచ్చుచునుండెను.

(బా. వ్యా. సంధి. 2)

శబ్ద కర్మములు

ధ్వని వాచకములు కర్మములుగాఁగల ధాతువులు.

మాటను వినెను.

పాఠమును జెప్పెను.

ఇత్యాది వాక్యములలో కర్మార్థక ద్వితీయాంతములైన 'మాటను' 'పాఠమును' అనునవి యక్షర రూపమైన ధ్వనులే కావున 'విను' 'చెప్పు' ఇత్యాది ధాతువులు శబ్ద కర్మము లగును. (బా. వ్యా. క్రియా. 128; గు. ప్ర. పుట. 420)

శబ్ద లక్షణ సంగ్రహము

కర్త: పరవస్తు చిన్నయ సూరి క్రీ శ. 1858.

ఇది బాల వ్యాకరణమునకుఁ బూర్వ రచన. ఇందలి సూత్రములకు వృత్తి లేక పోవుటచేత, కొన్ని సూత్రములు దురవగాహముగా నున్నవి.

దీనిని 1902లో ఓ. వై. దొరస్వామయ్యగారు జూబ్లీ ముద్రాక్షర శాలలో ముద్రించిరి. తిరిగి 1958లో శ్రీ కొండవీటి వేంకటకవిగారు దీనిని ప్రచురించిరి.

చిన్నయసూరిగారి వ్యాకరణ రచనా పరిణామమును బరిశీలించుటకీ వ్యాకృతి తోడ్పడును.

ఇందు సంజ్ఞా, సంధి, శబ్ద, క్రియా ప్రకీర్ణములను పంచ పరిచ్ఛేదములు గలవు.

**శబ్ద సంధాయకము**

శబ్దములను గలుపు నవ్యయము

రాముఁడేని, లక్ష్మణుఁడేని యాపని చేయును. (మ. ప. వ్యా. సంధి. 2)

**శబ్దాతి దేశము**

ఇది యాంగ్ల వ్యాకరణ మందలి 'Parsing' అను సంజ్ఞ కనువాదము. దీనిని ఆధునికాంధ్ర వ్యాకరణములు కొన్ని వాడుక చేసెను.

వాక్యమునందలి పదముల సంబంధమును నిరూపించు విధానము.

రాముఁడు రావణుని సంహరించెను-రాముఁడు సంస్కృతసమము.

ప్రథమావిభక్తి

ఏకవచనము

పుంలింగము, మహద్వాచకము

'సంహరించెను' అనుక్రియకు కర్త. (సం. వ్యా శబ్ద.)

**శారీర కరణాధి దానము**

శరీరమందలి యవయవములు క్రియాసిద్ధియందు ప్రకృష్టోపకరణ వాచకము గానగునది.

శ్రీశుఁడు కన్నులచే రూపమును గ్రహించుచున్నాడు.

(ఆం. కా. 449-50)

**శిష్ట వ్యవహారము**

ఒకానొక సంఘము నందలి విద్యావంతులు, సంస్కార సంపన్నులు వ్యవహరించు భాష. ఇది కావ్యభాషావ్యవహారముకన్న భిన్నముగా నుండుటచే పూర్వ లాక్షణికులు ఈ వ్యవహారమును గ్రామ్యమనిరి. (చూ. గ్రామ్యము)

వస్తాఁడు, తెస్తాఁడు,

శిష్ట వ్యవహారమందే రచనావ్యాసంగము సాగుచున్నప్పుడు, ఆ వ్యవహారమునకు విరుద్ధమైనది గ్రామ్యమగును.

వస్తాఁడు—వత్తడు. (వ్యా. భా. వ్యా. సంజ్ఞా 59, 60)

శేషమనఁగా సంబంధము. సంబంధార్థమునందు వచ్చు షష్ఠిని, శేష షష్ఠి, లేక సంబంధషష్ఠి యందురు

శేష షష్ఠికి యొక్కయునగు.

రామునియొక్క తమ్ముఁడు— రాముని తమ్ముఁడు.

(బా. వ్యా. కారక. 15)

**శ్రేష్ఠతా వాచకములు**

ఘనతను దెల్పు శబ్దములు.

అయ్య, అమ్మ, అక్క, మున్నగు శబ్దములు. ఇవి పరమగునపుడు అన్ని యచ్చులకును సంధి నిత్యము.

రామ+అయ్య ——→ రామయ్య ఇట్లే సీతమ్మ, లక్ష్మమ్మ, సుబ్బక్క, తిమ్మరుసు మున్నగునవి. (ప్రౌ. వ్యా సంధి 1)

**శ్రేష్ఠ వాచకములు**

తిర్యగ్వాచకములు శ్రేష్ఠ వాచకములయినచో వానిని పురుషవాచకములుగాను గావింపవచ్చును

పన్నగేంద్రము—పన్నగేంద్రుఁడు

మృగరాజము—మృగరాజు

అశ్వోత్తమము—అశ్వోత్తముఁడు (రంగ. IV. 68-69)

**శ్రేష్ఠ శబ్ద సంయుతములు**

(చూ.) శ్రేష్ఠ వాచకములు.

**శబ్ద పల్లవ క్రియలు**

(చూ.) శబ్ద పల్లవములు.

ఇవి ద్విరుక్తము లగునపుడు ఉత్తర పదముయొక్క పూర్వావయవమునకు లోపము విభాషగా నగును.

తూఁటాడి+తూటాడి < తూఁటాడి యాడి / తూఁటాడి తూటాడి (ప్రౌ. వ్యా. క్రియా. 24)

**శబ్ద పల్లవ ధాతువులు**

(చూ.) శబ్ద పల్లవములు.

ఆవటిల్లున్, నివ్వటిల్లున్

సొమ్మసిల్లున్ ఇత్యాదులు. (ల. వ్యా. క్రియా. 56)

**శబ్ద పల్లవములు**

ధాత్వాదులకు ధాతువులను ప్రయుక్తములయి విలక్షణార్థాభిదాయకములగునవి.

కూరుచుండు, మేలుకొను

విజయంచేయు, కయిప్రాలు

తూపొడుచు మున్నగునవి. (బా. వ్యా. క్రియా. 118)

**శస్**

సంస్కృతమున ద్వితీయావిభక్తి బహువచనప్రత్యయము ఇందలి శకార మిత్సంజ్ఞకము. ఉదా - రమాః (రమా+శస్) తెలుఁగున లకారాంతములు కాని ప్రాతిపదికములకంటె పరమైన శస్ ప్రత్యయ స్థానమున 'ల' వర్ణక మాదేశ మగును (చింతా అజంత. 14) ఉదా.- రాములన్ మొ॥ లకారాంత ప్రాతిపదిక ములపైనున్న శస్ ప్రత్యయ స్థానమున 'ర' వర్ణక మాదేశమగును. (చింతా అజంత. 15) ఉదా;- బాలురన్ మొ॥

**శిత్**

(i) (శ్ + ఇత్) శవర్ణమిత్సంజ్ఞకముగాఁగలది. ఉదా:- శ్లుక్ మొ॥ శ్లుక్ అనునది లోపమునకు సంజ్ఞ. ఇందలి శకారమిత్సంజ్ఞక మగుటచే నిది శిత్తు. శిత్తు పరమగునపుడు పూర్వస్వరమునకు దీర్ఘము వికల్పముగా వచ్చును. ఉదా:- కారాలు (కారము+లు), కారములు. మొ॥ (వై. చం. సంజ్ఞా. 16) ఇట లు, ల, నలు పరమగునపుడు సంస్కృతేతర ప్రాతిపదికముల మువర్ణకమునకు శ్లుక్కు వచ్చినది. (వై. చం. అజంత. 48)

(ii) పాణినీయమున శిత్తగు ఆదేశము సర్వాదేశముగ వచ్చును. (అనే కాల్శిత్సర్వస్య. అష్టా 1-1-55) ఉదా:- శీ. (అష్టా. 7-1-17) మొ॥ జస్సు స్థానమున విధింపబడిన 'శీ' శిత్తగుటచే నిది జస్సునకు సర్వాదేశముగ వచ్చును.

**శల్**

శ, ష, స అను మూఁడు వర్ణములకు సంజ్ఞ. (వాల్మీ. 1-1-7, వై. చం. సంజ్ఞా. 8)

**శుద్ధాంధ్రములు**

ఆంధ్ర దేశమునందు నివసించు సకల జనములు తేటతెల్లముగా బలుకు పదములు.

ఇల్లు, ముల్లు

చేయు, కాయు ఇత్యాదులు. (అప్ప. I. 106)

**శూన్య విభక్తి**

విభక్తి లేక పోయినను, విభక్త్యర్థముండుటను బట్టి, రూపరహితముగా నున్న యట్టి విభక్తిని 'శూన్యవిభక్తి' (zero suffix) అందురు.

హరి—శూన్యవిభక్త్యంతము. (తె. వ్యా. వి. పుట. 1007)

**శృంగార భూషణుఁడు**

'పరుషా వా స్వరూపేణ ప్రథమాంతోపరిస్థితాః, కాకౌ సంబోధనే చాపి హ్యవ్యయే కర్మధారయే, అచేతనార్థకే శబ్ద ఇతి శృంగార భూషణః" (అథ. కారి. సంధి. 14,15) అను నథర్వణ కారికలయందు గసడవాదేశసంధి విషయమున ఈతని మతము చెప్పఁబడినది. ఈతఁడు లక్షణ కర్తయనికాని, కవి యని కాని ఎక్కడను పేర్కొనఁబడలేదు కావున నీతనిగూర్చిన వివరములేమియు తెలియరావు. పై యాథర్వణ కారికలననుసరించి ఈతని మతమున ప్రథమా విభక్తికంటెను, కాక్వర్థమునను, సంబోధనము నందును, అవ్యయిమందును, కర్మధారయ సమాసమునను, అచేతనార్థమునందును పరుషములకు గసడదవలు వికల్పముగా వచ్చును. ఉదా :- శక్యమౌనె దాపసమందార (కాకువు), రామా గొనియాడెదనిను (సంబోధనము), సంసార భీతుండనైన గర్కశుననుఁగావుము. (అవ్యయము) మొ॥

**శేషషష్ఠి**

కర్మాది కారకములకంటెను, ప్రాతిపదికార్థముకంటెను భిన్నమైన స్వస్వామి భావాది సంబంధమున వచ్చు షష్ఠీ విభక్తి. ఈ షష్ఠి "షష్ఠీ శేషే" (అష్టా. 2-3-50) అను సూత్రముచే సంస్కృతమున విధింపఁబడినది. తెనుఁగున 'యొక్క' అనునది స్వస్వామి భావాది సంబంధమును బోధించుటచే శేషషష్ఠి. (చింతా. అజంత. 32) దీనికి క్రియాన్వయిత్వము లేనందున నిది కారకషష్ఠికాదు. ఇది కళాసంజ్ఞకము (చింతా. సంజ్ఞా 40). తెనుఁగున శేషషష్ఠియే ఉత్తర పదముతో సమసించును. కి,కు అను కారకషష్ఠి సమసించదు. (అహో. అజంత. 32)

**శౌరసేని**

ఒకానొక ప్రాకృత భాషాభేదము.

(i) 'శూరసేన' దేశమునందు, అనఁగా రాజస్థాని, గుజరాతి, ప్రాంతములందు జనులు వ్యవహరించిన ప్రాకృత భాష.

(సం) లోక — లోఅ

నగ — ణఅ

(ii) వైశ్య, శూద్ర ప్రభృతి పాత్రలకు రూపకములందు ఈ ప్రాకృతము ఉపయుక్తమగును. (అప్ప. I. 81, 82)

శ్రీకవి

"వికృత్యాది గతో యోఽత్ర స్యాచ్ఛబ్దాంతర యోగతః, ప్రాణమాత్రావశేషః స్యాదత్ర శ్రీకవి సమ్మతేః" (అథ. కా. సంజ్ఞా. 22 - శ్రీకవి మతమున వికృతి పదాదిని యకారముకలదు. పదాంతర సంయోగమువలన స్వరము మాత్రము మిగులును) అను శ్లోకమున నీతఁడు పేర్కొనఁబడియున్నాఁడు. శ్రీకవి శబ్దము వ్యక్తినామము కాదని కొందఱ మతము. ఇచ్చటి శ్రీకవి శబ్దముచే నన్నయ భట్టారకుఁడే యుద్దేశింపఁ బడెననియు కొందఱ మతము. ఈ శ్లోకమునఁదప్ప ఇతరత్ర శ్రీకవి నామము కానరానందున ఈతఁడు ఆంధ్రవ్యాకర్తయగునో కాదో నిర్ణయింప వీలు లేదు. (ఆం. వ్యా. వి. పేజీ. 190).

శ్లేష

కలయిక. ఒక శబ్దము నందనేకార్థములు కలసి యుండుట.

(i) ఇట్టి శ్లేషలో 'జ' కారమొక యర్థమునందు దన్త్యము.

మఱియొక యర్థమునందు తాలవ్యము.

ధర్మరాజిత రక్షమాపాల - రామాయణార్థము, తాలవ్యము.

ధర్మరాజు+ఇతర క్షమాపాల - భారతార్థము, దన్త్యము.

(ప్రౌ. వ్యా. సంజ్ఞా. 5)

(ii) ఒకే పదము నందలి చకార జకారములను తాలవ్యముగా నుచ్చరించిన యొక యర్థము. దన్త్యముగా నుచ్చరించిన వేఱొక యర్థము.

అచ్చు - (i) తాలవ్యము : స్వరము (కాని యిది దన్త్యముగానే యుచ్చరింపఁబడుచున్నది).

(ii) దన్త్యము : ముద్రణము.

చాటు - (i) తాలవ్యము - ప్రకటించు.

(ii) దన్త్యము - మఱుగుపడు. (గు. ప్ర. పుట. 7)

ష

మూర్ధన్యద్రోణి కోష్మము (retroflex groove fricative)

మూర్ధము—స్థానము.

ప్రతివేష్టిత జిహ్వాగ్రము—కరణము

ఊష్మ ప్రయత్నము

అల్పప్రాణము (సంస్కృత వ్యాకరణానుసారమిది మహాప్రాణము)

శ్వాసము

ఝషము, షండము, కషాయము మున్నగు సంస్కృత సమములనుగూడి తెలుఁగున వ్యవహరింపఁబడును.

**షట్సంజ్ఞకము**

షకారాంత, నకారాంతములగు సంఖ్యావాచక శబ్దములు ("ష్ణాంతాషట్" అష్టా. 1-1-24) ఉదా:- షట్ (షకారాంతము) పంచన్, సప్తన్, అష్టన్, నవన్ దశన్, (నకారాంతములు) మొ॥ వీనికి క్రమముగా ఆరు, ఏను, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది యనునవి ఆదేశములుగా వచ్చును. (వై. చం. హలంత. 20)

**షట్సంధులు**

ఆఱు విధములగు సంధులు—

(1) దుక్సంధి
(2) స్వరసంధి
(3) ప్రకృతిభావసంధి
(4) వ్యంజనసంధి
(5) విసర్గసంధి
(6) స్వాదిసంధి

(చూ.)

వీనిలో ప్రకృతిభావసంధి యనునది యాంధ్రభాషలోనికిఁ జొరదు.

(అ. ఛం. IV. 89)

**షష్ఠి**

ఆఱవ విభక్తి

(1) కిన్, కున్, యొక్క లోన్, లోపల—ఇవి షష్ఠీ విభక్తులు.

(కా. చూ. IX. 97,98; ఆం. కౌ. 135-142)

(2) సంబంధార్థమునందు షష్ఠీవిభక్తి వచ్చును.

రామునియొక్క భృత్యుఁడు. (ఆం. భా. భూ. 68)

(3) తుల్యార్థయోగము నందును వచ్చును.

చైత్రునకు మైత్రుఁడు తుల్యుఁడు (బా. వ్యా. కారక. 5)

(4) వచ్యార్థాముఖ్యకర్మమునకు— మైత్రుఁడు చైత్రున కిట్లనియె.

(బా. వ్యా. కారక. 6)

(5) త్యాగోద్దేశ్యములకు—జనకుఁడు రామునకుఁ గన్యనిచ్చెను.

పురుషార్థమునకు యత్నింపవలయును. (బా. వ్యా. కారక. 8)

(6) భయ, జుగుప్సా, పరాజయ, ప్రమాద, భవనములకు—చోరునకు వెఱచె

పాపమునకు నేవగించె

అధ్యయనమునకు దస్సె.

పాడికింబరాకు పడియె.

మనువునకు నిక్ష్వాకుఁడు పుట్టె (బా. వ్యా. కారక. 9)

(7) అన్యార్థాది యోగజమగు పంచమికి—

రామున కన్యుఁడు ధానుష్కుఁడు లేఁడు.

(బా. వ్యా. కారక. 12)

**షష్ఠికినకారము**

షష్ఠ్యర్థమునందు, అనఁగా సంబంధార్థమునందు నకారమాగమముగా వచ్చును ఒకప్పుడు రాదు.

(i) చెంచు యొక్క ఇంటికి ⟶ చెంచు+న్+ఇంటికి ⟶ చెంచునింటికి

(ii) అలరఁజేసితి నిషధ రాజంతవాని. (స. సా. సం. I. 65,66)

**షష్ఠికిప్రథమ**

షష్ఠీవిశేషణములకుఁ బ్రథమావిభక్తియు నొకానొకచో నుండఁదగును.

దోహల బాహుబలుఁడు సీరజాక్షునకున్, సుగుణాభిరాముఁడు రామునకు జోహారువు నొనర్చె. (క. సం. I. 33; స. సా. సం. I. విభక్తి. 44-48)

(బా. వ్యా. కారక. 27)

**షష్ఠిమీఁదసంధి**

షష్ఠీవిభక్తి కచ్చుపరమగునపుడు సంధి వికల్పముగా నగును

నాకున్+ఆనతి < నాకానతి / నాకునానతి

(క. స. వి. I. 117)

**షష్ఠీతత్పురుషము**

షష్ఠీవిభక్తి లోపింపగా నేర్పడిన సమాసము.

దొరయొక్క శీవి ⟶ దొరశీవి

ఇట్లే కందోయి, పగడాలగని, కల్వదండ ఇత్యాదులు.

(ఆం. కౌ. 489-91)

**షష్ఠీ బహువ్రీహి**

పీతమైన అంబరము ఎవనిదో వాఁడు పీతాంబరుఁడు-ఇత్యాదులు.

(సు. వ్యా. సమాస. 57)

**షష్ఠీ సమాస ద్రుతాగమము**

షష్ఠీ సమాసమందు ఉకారమునకు అచ్చు పరమగుచో ద్రుతమగు నకార మాగమముగా వచ్చును.

కొడుకు యొక్క ఆలు ⟶ కొడుకు నాలు.

రాజు యొక్క ఆనతి ⟶ రాజు నానతి. (అప్ప. V. 95)

**షష్ఠీ స్థానికమగు 'కు'**

షష్ఠీ విభక్తి స్థానమునందు వచ్చు 'కు' వర్ణకము, ఒక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగా ఆయా యర్థములందుపయుక్తము.

(i) ద్వితీయకుమాఱు : వేటఁబోయిరి—వేటకుఁబోయి.

(ii) తృతీయకుమాఱు : నీ చే నారాధ్యను—నీకునారాధ్యను.

(iii) పంచమికి మాఱు : విలువిద్య నీకంటె నారులగ్గలముగ—విలువిద్య నీకు నారులగ్గలముగ

(iv) సప్తమికి మాఱుగా కోమలి నీ యందనురక్త—కోమలి నీకనురక్త ఇత్యాదులు (ప్రౌ. వ్యా. కారక. 18)

**షష్ఠ్యర్థసంధి**

(చూ.) షష్ఠీ సమాస ద్రుతాగమము (అం. కౌ. 518, 519)

**షోడశస్వరములు**

పదునాఱు అచ్చులు.

| | |
|---|---|
| అ, ఇ, ఉ, ఋ, ఌ—వీని దీర్ఘములు — | 10 |
| ఏ, ఐ, ఓ, ఔ | 4 |
| అం, అః | 2 |
| | 16 |

(అ. ఛం. IV. 124)

**స¹**

దన్తమూలీయ విస్తారి ఊష్మము (alveolar slit fricative)

దన్తమూలము—స్థానము

జిహ్వాగ్రము—కరణము

ఊష్మప్రయత్నము

అల్పప్రాణము

శ్వాసము

జిహ్వాగ్రము బల్లపరుపుగా నుండి, దన్తమూలమును సమీపించుటలో నేర్పడిన చీలిక ద్వారా ఒరపిడితో గాలి నిర్గమించుటచే నిది విస్తారితోష్మము.

స[2]

ఇది "సః సమాసః'' అను వాల్మీకి ప్రాకృత వ్యాకరణ సూత్రమున సమాసమునకు సంజ్ఞగా చెప్పఁబడినది. సంస్కృతమున రచింపఁబడిన కొన్ని తెలుఁగు వ్యాకరణములయందు ఈ సంజ్ఞ ఉపయోగింపఁబడినది ("షష్ఠ్యాఉతోఽచినుమ్సే" చింతా. సంధి. 17; క్వచిత్సస్య భవేత్ అథ. కారి. అజన్త 8) తెలుఁగున రచింపఁబడిన వ్యాకరణములయందు మాత్రమీసంజ్ఞ కానరాదు. చూ:- సమాసము

**సంజ్ఞాప్రయుక్త విశేషణము**

పేరునకు సంబంధించిన విశేషణము.

దేవదత్తుఁడు

హిమాలయము

గంగ

హైదరాబాద్. (ప్రౌ. వ్యా. శబ్ద. 8)

**సంఖ్యాప్రయుక్తవిశేషణము**

సంఖ్యయనఁగా లెక్క. దానికి సంబంధించిన విశేషణము.

ఒకఁడు

డెబ్బది

రెండున్నర (ప్రౌ. వ్యా. శబ్ద. 8)

**సంఖ్యాభిధానములు**

సంఖ్యను దెలియఁజేయు శబ్దములు. రెండు, లక్ష, వేయి ఇత్యాదులు.

(బా. వ్యా. కారక. 26)

**సంఖ్యార్థకములు**

లెక్కను మాత్రము తెలుపు సంఖ్యావాచకములు సంఖ్యార్థకములు. అనఁగా ఒకటి, రెండు, మూఁడు, పది నూఱు, వేయి, మొదలైన యంకెలు.

(ఆం. భా. శా. సర్వ. 18)

**సంఖ్యావాచకములు**

సంఖ్యను దెల్పు శబ్దములు. ఒకటి, రెండు మూఁడు మున్నగునవి.

(ఆం. భా. శా. సర్వ. 18)

**సంఖ్యావాచక విశేషణములు**

సంఖ్యనుదెల్పు విశేషణములు.

(చూ.) **సంఖ్యాప్రయుక్త విశేషణములు.**

ఇరువురు మనుజులు

రెండుబండ్లు

మూవురుస్త్రీలు

ద్వితీయుఁడు, ద్వితీయ, ద్వితీయము మున్నగునవి తత్సమ సంఖ్యావాచక విశేషణములు. (ఆం. భా. శా. విశే. 6)

**సంఖ్యావాచక సర్వనామములు**

సంఖ్యను దెలుపు సర్వనామములు.

ఇవి రెండు విధములు.

(i) సంఖ్యార్థకములు
(ii) సంఖ్యేయార్థకములు — (చూ.)

రెండు మూఁడు

రెండవ, మూఁడవ ఇత్యాదులు. (ఆం. భా. శా. సర్వ. 18)

**సంఖ్యేయార్థకములు**

సంఖ్యచేఁదెలియఁజేయఁబడిన అర్థము గలవి.

తిర్యగ్జంతువులను, స్త్రీ పురుషులను లెక్కించునపుడు చెప్పు సంఖ్యావాచకములే సంఖ్యేయార్థకము లనఁబడును.

రెండు బండ్లు

ఇద్దఱు పురుషులు

ఇద్దఱు స్త్రీలు (ఆం. భా. శా. సర్వ. 16)

**సంఖ్యోభయపద బహువ్రీహి**

సంఖ్యావాచకము, మఱియొక సంఖ్యావాచకముతోఁగలసిన బహువ్రీహి.

ద్విత్రము—ఇద్దఱో ముగ్గురో

ద్విదశకము—రెండు పదులు. (సు. వ్యా. సమాస. 60)

**సంగ్రహ వాక్యము**

వ్యాస వాక్యమునకు (చూ.) ముందుండు సంక్షిప్త వాక్యము.

'అయ్యా ! యేను నీ కుంభ్రియంబు సేసెద'—సంగ్రహ వాక్యము.

ఎట్లు ప్రియముసేయునో విస్తరించి చెప్పు వాక్యము వ్యాస వాక్యము.

(ప్రౌ. వ్యా. వాక్య. 20)

**సంగ్రహ వ్యాకరణము**

కర్త : క్రీ. శే. కందుకూరి వీరేశలింగము

ప్రథమ ముద్రణము : క్రీ.శ. 1905.

ఇందు (i) వర్ణపరిచ్ఛేదము (ii) పదపరిచ్ఛేదము (iii) వాక్యపరిచ్ఛేదము (iv) కావ్యపరిచ్ఛేదము అను నాల్గు విభాగములు గలవు.

తెలుఁగు భాషాలక్షణములు, సాంకేతికమైన క్లిష్టితను దొలఁగించి సంగ్రహముగా విద్యార్థి జనోపయోగముగా విరచితమైన తొలి నవ్యాంధ్ర వ్యాకరణము.

దీనిపై ఆంగ్ల వ్యాకరణ ప్రభావమెంతగనో గలదు.

**సంజ్ఞలు**

గుర్తులు.

వేని మూలమున పదార్థములను జక్కఁగాఁ దెలిసికొనుటకు వీలగునోయవి, సంజ్ఞలు.

ఇట్టి సంజ్ఞలు శాస్త్రగ్రంథములందు రచనా సంగ్రహము కొఱకుపయుక్తము.

లఘు సంజ్ఞలు, గురు సంజ్ఞలని యివి రెండు విధములు.

లఘు సంజ్ఞలకే రూఢ సంజ్ఞలనియు వ్యవహారము. ఇవి యర్థవంతములు, అర్థరహితములని ద్వివిధములు.

గురుసంజ్ఞలకే మహాసంజ్ఞలనియు వ్యవహారము ఇవి యోగికములని, యోగరూఢములని, తదితరములని మూఁడు విధములు.

కిత్తు, టిత్తు, లుక్, డుజ్ ఇత్యాదులు లఘుసంజ్ఞలు.

సర్వనామములు, అవ్యయములు మున్నగునవి గురుసంజ్ఞలు.

(చూ. రమణీ. 48)

**సంజ్ఞావాచకములు**

గుర్తులు. వ్యావహారిక సౌకర్యార్థములు మనుజులు, నదులు, పర్వతములు మున్నగు వానికేర్పడిన పేర్లు.

వీనినే యాంగ్ల వ్యాకరణమునందు Proper nouns అందురు.

రాముఁడు, కోసలము, ద్వారక, నీలగిరి, గోదావరి, ఇత్యాదులు.

(సం. వ్యా. విశే. 8)

**సంజ్ఞావిశేష్యము**

హరిశ్చంద్రుఁడు, చంద్రమతి. (చూ.) సంజ్ఞాప్రయుక్త విశేణము.

(మ. ప వ్యా. శబ్ద. 1)

**సంజీవనీవ్యాఖ్య**

ఇది 'కళాప్రపూర్ణ' శ్రీ వజ్ఝల చిన సీతారామామశాస్త్రిగారు తాము రచించిన వ్యాకరణమునకు రచించిన విపులమగు వ్యాఖ్యానము.

ఇది 1951లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రకటింపఁబడిన 'ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము'లో (చూ.) నొక భాగము.

ఇందు బాలవ్యాకరణ లక్షణములకనేక ప్రయోగములు ప్రదర్శింపఁబడినవి· అనేక దోషములనెత్తి చూపుటకుఁదగిన ప్రయత్నము గావింపఁబడినవి.

ఇట్టి వన్నియు కూలంకషముగాఁ బరిశీలించి, వ్యాకరణ శాస్త్రాధ్యయనము నాంధ్ర విద్యార్థులు కావింపవలయునని శ్రీ శాస్త్రిగారి యాకాంక్ష.

**సంతాపార్థకములు**

(సంతాప+అర్థకములు) సంతాపార్థమునుఁదెలుపు అక్కట, అయ్యో మున్నగు పదములు. ఇవి కళా సంజ్ఞకములు (చింతా.సంజ్ఞా. 40)

**సందేహార్థము**

సంశయమును దెలుపునట్టి యర్థము.

(i) క్రియలమీఁదగాని, నామములమీఁదఁగాని యీ యర్థమునందు—ఒ,—ఓ లలోనేదేని యనుప్రయుక్తమగును

రాముఁడొ ! కృష్ణుఁడో ! !

పోషించునొ, పోషింపఁడో (ప్ర. వ్యా. 396)

(ii) —ఒ, —ఓలపై 'కదా', 'కదే'యను శబ్దములుకూడ ననుప్రయుక్తము కావచ్చును.

ఎంత కృతార్థులమో కదా ! (ప్రౌ. వ్యా. క్రియా. 28)

**సంధాయకము**

వాక్యములనుగాని పదములనేని కలుపు శబ్దము.

వానలు గురిసె నేని పంటలు పండును.

ఇందు వానలు గురియును, పంటలు పండును అను రెండు వాక్యములుగలవు. ఈ రెండింటిని 'ఏని' యను నవ్యయము కలుపుచున్నది.

రాముఁడేని కృష్ణుఁడేని యీ పనిచేయగలఁడు. ఇందు 'ఏని' పదములను గలుపుచున్నది. (మ. ప. వ్యా. శబ్ద. 12)

**సంధి**[1]

కలయిక, కూడిక యని శబ్దార్థము

(i) మొదలి పదము తుదివర్ణము, వదలక పైపదము మొదలి వర్ణము తోడన్ గదియుట (ఆం. భా. భూ. 44; కా. చూ. IX. 45)

(ii) పూర్వపదాంత హల్లుతోడఁ గూడినట్టి స్వరమును లోపింపఁజేసి ఆ పొల్లుతో మీఁది యక్షరమును గూర్చుట.

రాముడు+అతఁడు

రాముఁడ్+అతఁడు ⟶ రాముఁడతఁడు. (అప్ప. V. 33,37)

(iii) పూర్వపర స్వరములకుఁ బరస్వరము ఏకాదేశమగుట. (చూ. ఏకాదేశము)

రాముఁడ్+ఉ+అతఁడు

అ

రాముఁడతఁడు.

(బా. వ్యా. సంధి. 1; అథ. కా. సంధి. 1)

**సంధి**[2]

కర్త : శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు.

ఇందు ఆంధ్రభాషలోని వివిధ సంధులను గూర్చిన చారిత్రక పరిశీలనము గలదు.

తెలుఁగు భాషకుఁగల చారిత్రక గ్రంథములలో నిది మొదటిది.

తొలి ముద్రణము 1935.

బహు ముద్రణముల నంది విశేషముగా పఠన పాఠనములందున్నది.

**సంధిదోషచతుష్టయము**

నాల్గు సంధి దోషములు.

(చూ.) సంధి దోషములు.

1. విసంధి
2. మహావిసంధి
3. కుసంధి
4. దుస్సంధి

} (చూ.)

(అప్ప. V. 8)

**సంధిదోషములు**

సంధి చేయుటవలనఁగల్గు గల్గుదోషములు.

వీనిని నాల్గు విధములుగా లాక్షణికులు పేర్కొనిరి. అవి

(1) వి సంధి
(2) మహావిసంధి
(8) కుసంధి
(4) దుస్సంధి
(చూ.)

(అప్ప. V. 8)

**సంధులు**

ఇవి స్థూలముగా రెండు విధములు.

(i) అజంత సంధులు
(ii) హలంత సంధులు
(చూ.)

(ఆం. కౌ. 69)

**సంధినివార కాగమములు**

అనిష్టమగు సంధిని నివారించుట కుపకరించు ఆగమ వర్ణములు.

(i) కలకు+అమ్మ ——→ కలకు టమ్మ (టకారము)

(ii) ధీరు+ఆలు ——→ ధీరురాలు (రేఫము)

(iii) రాజు (యొక్క)+అజ్ఞ ——→ రాజునాజ్ఞ (నకారము)

(iv) హరి+ఆతఁడు ——→ హరియతఁడు (యకారము)

మొదటి మూఁడును సమాసములు. నాల్గవది వ్యస్తపదములకు సంబంధించినవి.

ట, ర, న. యనువానినే కిత్తులు (చూ.) కావించి టుగాగమను, రుగాగమము, నుగాగమము అని వ్యవహరింతురు.

యకారమును మాత్రము టిత్తు (చూ) గా వ్యవహరింతురు.

(తె. వ్యా. వి, పుట 481)

**సంధ్యక్షరములు**

రెండచ్చుల కలయికచే నేర్పడిన యక్షరములు

వీనినే diphthongs అందురు.

ఐ, ఔ లు

(తె. వ్యా. వి. పుట 17)

**సంపూర్ణ వాక్యము**

అర్థ పరిసమాప్తి గల వాక్యము, అర్థ పరిసమాప్తి సామాన్యముగా సమాపక క్రియవలన గలుగును.

(వ్య.) అసంపూర్ణ వాక్యము (చూ.)

అంతరిక్షమున హంసలెల్లఁబిండుగట్టి తిరుగుచుండె.

(ప్రౌ. వ్యా. వాక్య. 7)

**సంప్రదానకారకము**

సంప్రదానమునకు సంబంధించిన క్రియాన్వయము.

(చూ.) సంప్రదానము.

ఈ కారకమునందు సామాన్యముగా - కు అను షష్ఠీవిభక్తినే వాడుదురు. జనకుఁడు రామునకు కన్యనిచ్చెను.

కాని కావ్యభాషలో సంస్కృత సంప్రదాయాను కూలముగా చతుర్థీవిభక్తి ప్రయోగముండుటచే వ్యాకరణములు దీనినే తొలుత నిరూపించినవి.

జనకుఁడు రాముని **కొఱకు** కన్యనిచ్చెను.

(ఆం కౌ. 416; ఆం. భా. శా. కారక. 36)

**సంప్రదానము**

బాగుగా నిచ్చుటయని శబ్దార్థము.

ఇట్టి దానాది క్రియల కుద్దేశ్యమగు దానికిఁ జతుర్థివచ్చును.

జనకుఁడు రాముని **కొఱకు సీత** నిచ్చెను.

కన్యాదాన క్రియ కుద్దేశ్యమయినవాఁడు 'రాముఁడు' గావున 'కొఱకు' అను చతుర్థీ విభక్తి చేరినది

సాధారణముగా నిట్టిచో - కు షష్ఠియు నుపయుక్తము.

జనకుఁడు రామునకు **సీత** నిచ్చెను. (ఆం. కౌ. 451; బా. వ్యా. కారక. 8)

**సంప్రదానార్థము**

సంప్రదానమునకు సంబంధించిన యర్థము.

(చూ.) సంప్రదానము. (ప్ర. వ్యా. 266)

**సంప్రశ్నము**

సమాధాన సాపేక్షమగు ప్రశ్నకాక, సమాధాన నిరపేక్షమగు విలక్షణమగు ప్రశ్న.

ఉందునా? పోదునా?

ఇది యొకరిని ప్రశ్నించుటకాదు. అనిశ్చితమగు మానసికస్థితిలో(dilemma) తన్నుతాను ప్రశ్నించుకొనుట.

(బా. వ్యా. క్రియా 22; చూ. రమణీ. పుట. 388)

**సంప్రార్థనములు**

మిక్కిలి వేఁడుకొనుట, ఇత్యాదులు

ఈ యర్థములందు వచ్చుము, డుజ్జులకు (చూ.) అదాదులు (చూ.) విభాష నను ప్రయుక్తమగును.

వండుము; వండుమా:

వండుమి, వండుమీ

వండుఁడ, వండుఁడా

వండుఁడి, వండుఁడీ

వండుఁడయ్య, వండుఁడమ్మ ఇత్యాదులు (బా. వ్యా. క్రియా. 33)

**సంబంధషష్ఠి**

సంబంధమును దెలుపు షష్ఠీ విభక్తి.

రాజు యొక్క ఆనతి :

(i) ఈయర్థమునందు ప్రథమ వచ్చును. గురువుమాట, సైన్యమురభటి (ఆం. కౌ. 583)

(ii) అకారాంత పుంలింగములుకాక తక్కిన శబ్దములు సంబంధషష్ఠిలోఁ ప్రథమాంతములయి అచ్చిక శబ్దములతో సమసించును.

దంతి కొమ్ములు

కవి పల్కులు

తరువు కొమ్మ (క. చిం. I. 84)

(iii) తెనుఁగులపై సంస్కృత పదములుంచ నగును.

కొన శాఖ

దొంగ విద్య (ఆం కౌ. 580-82)

**సంబంధ సర్వనామములు**

తదాద్యర్థకములతో సంబంధించు యదాద్యర్థకములు.

(చూ.) తదాద్యర్థకము, యదాద్యర్థకము.

వీనినే యాంగ్లమునందు Relative Pronouns అందురు.

ఎవఁడు చేసిన కర్మ మ్వాఁడనుభవింపక తప్పదు.

(ఆం. భా. శా. సర్వ. 10)

**సంబంధార్థము**

ఇరువురకుఁగాని, రెండింటికిఁగాని గల సంబంధమును దెలుపునట్టి యర్థము.

(i) ఇది యనేక రీతులుగా నుండును. స్వస్వామి సంబంధము, సంసర్గ సంబంధము, జన్యజనక సంబంధము, సంసర్గ సంబంధము ఇత్యాదులు.

షష్ఠీ విభక్తి ఈ యర్థమునందు వచ్చును.

రాజు (యొక్క) సేవకుఁడు

అతని (యొక్క) తమ్ముఁడు

నాకు పుత్రుఁడు.

వాని సన్నిహితుఁడు మొదలైనవి. (ఆం. భా. శా కారక. 44)

(ii) తద్ధితవృత్తి భేదము—

మదీయము (నాకుసంబంధించినది)

వన్యము (వనమునకు సంబంధించినది)

దైవికము (దైవమునకు సంబంధించినది)

(ఆం. భా. శా. సమాస. 88)

**సంబుద్ధి**

సంబోధనము (చూ.)

(శా చూ. *IX*. 80,114; ఛం.ద. *IV*. 107; స.సా. సం. *I*. విభక్తి. 76,77)

**సంబోధనము**

(i) 'ఎదిరి పిలుపు'

ఎదిరి వానిని సమ్ముఖము సేయునది.

(ఆం. భా. భూ. 68; ఆం. కౌ. 186)

(ii) ఇందు ప్రథమ వచ్చును.

ఓ రాముఁడ ! ఓ రావణుఁడు!! (బా. వ్యా. కారక. 1)

**సంబోధనవాచకము**

(i) సంబోధింపఁబడిన శబ్దము

రామా! కృష్ణా!!

ఓ రాముఁడ!

(ii) 'ఓ' శబ్దమునకు, సంబోధ్య వాచకమునకు మధ్యకొన్ని సందర్భోచిత మైన పదము లుండవచ్చును.

ఓ | వినువీథి నున్న | ఖచరోత్తములార!!

(ప్రౌ. వ్యా. శబ్ద. 13)

**సంభారవాచకములు**

గృహోపకరణములగు సామగ్రిని దెల్పు శబ్దములు.

ఇంగువ, ఉప్పు, చింతపండు, ఆముదము, చమురు, పసుపు

ఇవి నిత్యైక వచనాంతములు. (ప్రౌ. వ్యా. శబ్ద. 80)

**సంభావన**

ఊహ

తద్ధర్మాద్యర్థకములలో (చూ.) నొకటి.

ఇప్పుడు వాఁడింట నుండును. (బా. వ్యా. క్రియా. 22)

**సంభావనాపూర్వపదకర్మధారయము**

సంజ్ఞావాచకము పూర్వపదముగానున్న కర్మధారయము.

వేఁపచెట్టు, అప్పయమంత్రి.

(ఆం. కౌ. 605,606; సు. వ్యా. సమాస. 26)

**సంయుక్తము**

కూడినది.

ఒకహల్లు అదేహల్లుతోఁగాని, భిన్నహల్లుతోఁగాని కూడినది.

దీనికే ఒత్తు, జడ్డ, ద్విత్వము అనియు నామాంతరములు.

(అప్ప. II. 18)

అక్క, వ్రాఁత మొదలైనవి.

**సంయోగము**

భిన్నహల్లుల కలయిక

(బా. వ్యా. అచ్చిక. 15)

తేంట్లు, ఆంధ్రుడు.

**సంయోగాత్మక భాషలు**

స్వతంత్రార్థములు గలశబ్దములే యొకదానితో వేరొకటి చేరి గొలుసు కొక్కెములవలె కలిసి యుండునట్టి భాషాస్వరూపముగలభాష

తెలుఁగు, తమిళము, కన్నడము మున్నగు ద్రావిడ భాషలిట్టివి. వీనికే (agglutinative languages) అని వ్యవహారము.

రామునిచేత అశీర్వదింపఁబడెను.

చెఱువునీరు త్రాగిన పంటిపోటు తగ్గును. (తె. వ్యా. వి. పుటలు. 167,599)

**సంవృత స్వరము**

ఆస్యభాగము తెఱచుకొనకుండనే యుచ్చరింపఁబడు స్వరములు.

ఇవి రెండు విధములు. ఆస్యముయొక్క అగ్రభాగమునందుచ్చరింపఁబడు స్వరములు—అగ్రస్వరములు. (Front Vowels) (చూ.)

ఆస్యముయొక్క పశ్చాత్ భాగమునందు ఉచ్చరింఁపబడు స్వరములు (Back Vowels).

| ఇ, ఈ | ———— | ఉ, ఊ. |
|---|---|---|
| అగ్రసంవృతస్వరములు (Front closed Vowels) | | పశ్చాత్ సంవృతస్వరములు (Back closed Vowels) |

(తె. వ్యా. వి. పుట 25)

**సంవృతిక్రియలు**

సంస్కృత ధాతువుల నన్నింటిని తెనుఁగున జేర్చుకొనుట కనువుగా నుండునని చింతా. కర్త ఉపకృతి క్రియలు, పరిణతి క్రియలు, సంవృతి క్రియలు అనిమూడు విధములుగా విభజించెను ఉపదేశకాలమున నుండు రూపములతోనే తెల్ుగున ప్రకృతులగు క్రియలు సంవృతి క్రియలు. ఉదా:- రంజ (రాగే), వస (నివాసే) మొ॥ రంజించు, వసించు మున్నగు చోట్ల రంజ్, వస్ అను క్రియలు ఉపదేశ కాలమందలి రూపములతోనే అనగా ఎట్టి మార్పులేక తెనుఁగున ప్రకృతులగు చున్నవి (చింతా. క్రియా. 1,4) సమ్యక్‌వృతిః = వరణం నైయత్యేనస్వరూపస్య ప్రాప్తిర్యస్యాస్సా (సమీచీనమైన వరణము అనగా నియతముగా తనకు సహజమైన రూపముతో (మార్పులులేక ఉండునది) అని వ్యుత్పత్తిచే నీ సంజ్ఞ అన్వర్థము. ప్రతిబింబించు (బింబ=అభోగే) ఆగ్రహించు (ఆఙ్+గ్రహ=ఉపాదానే) ఇత్యాది రూపములందలి బింబ, గ్రహ మున్నగు ధాతువులు సంవృతిక్రియలైనను ఉపకృతి క్రియలైనను రూపములొక విధముగానే యుండును. (అహో. క్రియా. 15)

**సంశయము**

సందేహము.

దీనిని తెల్పుటకు నామములకుఁగాని, క్రియలకుఁగాని —ఒ,—ఓలు అను ప్రయుక్తమగును.

అమృతమొ ! విషమో !!

ఏగునో ! ఏగదొ !! (అం. భా. భూ. 154,155 అం. కౌ. 745-49)

**సంశ్లిష్ట బహువచనాంత తుల్యము**

వేఱొక హల్లుతోఁ గూడిన బహువచన ప్రత్యయము అంతమందుఁగల దానితో సమానము.

ఇట్టి వానిపై మఱల బహువచన ప్రత్యయములు చేరు సందర్భములు కొన్ని గలవు. ఇట్టివానిని పునరుక్త బహువచన ప్రత్యయములు (చూ.) అందురు. (redundant plural)

కొడవండ్లు—కొడవండ్లులు

కోడండ్రు—కోడండ్రురు

సంశ్లిష్టము కాకున్నను నొక్కొక్కచో పునరుక్త బహువచనము చేరుచుండును

[illegible]

మీరు—మీరలు (బా. వ్యా. ఆచ్ఛిక. 17; ప్రౌ. వ్యా. శబ్ద. 18)

**సంశ్లిష్టవాక్యము**

అసంపూర్ణ వాక్యముతోఁగాని, ఉపవాక్యముతోఁగాని కూడియున్న సంపూర్ణ వాక్యము.

దీనినే యాంగ్లము వ్యాకరణమునందు (Complex Sentence) అందురు.

సూర్యుఁడుదయింపగాఁ బద్మములు వికసించును.

(సం. వ్యా. వాక్య. 9; ఆం. భా. శా. కారక. 5)

**సంశ్లేషము**

(i) మీఁది హల్లుతోఁ గూడికొనుట. పూచెన్గలువలు

(బా. వ్యా. సంధి. 17)

ఇట్లు లిపిలోఁగల రెండు హల్లులయొక్క కూడికయే సంశ్లేషముగాఁ బేర్కొనఁబడినను 'పూచెన్ గలువలు అని యున్నను ఉచ్చారణము నందు సంయోగము శ్రుతమగును. (బా. వ్యా. సంధి. 17)

(ii) మీఁది హల్లుతో కలిసిపోవుట. ద్రుతప్రకృతికముల కంటె సరళములుగాని, స్థిరములుగాని పరమగునపుడు నకారమునకు లోపము వికల్పముగా విధింపఁ బడి నది. (చింతా. సంధి. 25) లోపమురాని పక్షమున నకారమునకు సంశ్లేషము వచ్చును. (చింతా. సంధి. 26) ఉదా:- వచ్చెన్గదాధరుఁడు మొ॥

**సంస్కారము**

మార్పు అని శబ్దార్థము.

(i) వర్ణలోపము, వర్ణాగమము, వర్ణాదేశము, ప్రకృతిభావము సంస్కారము.

[సంస్కారోలోపాగమ. వర్ణ వికార, ప్రకృతిభావ లక్షణాః—కాత్యాయన ప్రాతిశాఖ్యాభాష్యమ్]. (ఆం. భా. శా. అవతారికపుట. 8)

(ii) లక్షణవంతము (అప్ప. II. 194)

(iii) లక్షణ వంతములైన కావ్యముల నెఱుగుట. (అప్ప. I. 120)

**సంస్కృత భవములు**

సంస్కృతము నుండి వర్ణలోపాగ మాదేశములగు వివిధ పద్ధతుల ననుసరించి తెలుఁగునఁ బ్రవేశించిన పదములు.

ఆకాశః—అకసము [-ఆ->-అ-;-శ->-స-]

చన్ద్రః —చందురుఁడు [తాలవ్యము>దంత్యము ద్ర>దురు]

ముఖమ్—మొగము [ఉ>ఒ;-ఖ->-గ-] ఇత్యాదులు.

(బా. వ్యా. సంజ్ఞా. 20)

**సంస్కృతము**

ప్రాకృతమును సంస్కరింపగా నేర్పడిన భాష.

ఇది పాణిని మహర్షిచే సూత్రములద్వారా వ్యాకరింపఁబడగా, వానికి వరరుచి వార్తికములు, పతంజలి మహాభాష్యము వెలసినవి.

ఇది స్వర్గలోక ప్రశస్తము.

దేవ, భూసుర, ముని, ధరిత్రీ తలేంద్ర, సచివ, కంచుకి, విదూషకాదులచే నిది రూపకములందు భాషింపఁబడుభాష. (అప్ప. I. 78,81,82)

**సంస్కృత తత్సమములు**

సంస్కృతము నుండి విశేషముగా మాఱక, తెనుఁగు ప్రత్యయములనుగూడి వ్యవహరింపఁబడు పదములు.

దేవః—దేవుఁడు

వనితా—వనిత

వనమ్—వనము మున్నగునవి.

('సంస్కృతసమ' మన్నచాలును) (ప్ర. వ్యా. సంజ్ఞా. 7)

**సంస్కృత తద్భవము**

సంస్కృతము నుండి వర్ణలోపాగ మాదేశాద్యనేక వికారములతోఁ దెలుఁగునఁ బ్రభవించిన పదములు.

సముద్రః—సంద్రము

చంద్రః—చందురుఁడు ('సంస్కృతభవము' అన్నచాలును)

(ప్ర. వ్యా. సంజ్ఞా. 10)

**సంస్కృత తుల్యములు**

సంస్కృత శబ్దములకువలె విశేష్యముల ననుసరించి మారునట్టివి.

వీనినే 'విశేష్య నిఘ్నముల'ందురు. (చూ.)

సుందరః రామః

సుందరీ సీతా

సుందరమ్ వనమ్

తెలుఁగు 'సుందరమ్' శబ్దముతో తుల్యములైనవి 'బల్లిదాదులు' (చూ.)

రావణుఁడు బల్లిదుఁడు.

శూర్పణఖ బల్లిదురాలు

వానివంశము బల్లిదము.

ఇట్లే కావల, బెట్టిదాదులు, (బా. వ్యా. అచ్చిక. 8)

**సంస్కృత నామములు**

సంస్కృత ప్రాతిపదికలు. రామ, ఒద్ధ, విష్ణు మున్నగునవి.

(బా. వ్యా. తత్సమ. 34,35)

**సంస్కృతమునఁదెన్గు**

సంస్కృత శబ్దముతోఁ గూడిన తెనుఁగు.

ఇట్లు సంస్కృత శబ్దముతోఁ దెన్గు శబ్దములను కలిపి సమాసములను జేయరాదు.

అనిమిష నెలఁత

అర్ణవ కొడుకు (ఆం. కౌ. 539,540)

**సంస్కృతములైచాఁగు కొన్నిశబ్దములు**

సంస్కృతములైనను, తెనుఁగులవలె చాఁగు కొన్ని శబ్దములు గలవు. వానితోఁ దెనుఁగు శబ్దములను గూర్చి సమాసములను జేయవచ్చును.

పనసకుండ

కుండలోపల

కందదుంపలు

(కా. చూ. *IX*: 138; ఆం. కౌ. 516; 17)

**సంస్కృత సమములు**

(i) సంస్కృత శబ్దములతో సమానమగు శబ్దములు

విశేషముగా మార్పులకు లోనుగాక, తెలుఁగు విభక్తితోఁ గూడి వ్యవహరింపఁబడును.

రామః — రాముఁడు

వనితా — వనిత. (బా. వ్యా. సంజ్ఞా. 19)

(ii) ఋ, ౠ, ఌ, ౡ, విసర్గ (ః)

ఖ, ఛ, ఠ, థ, ఫ

ఘ, ఝ, ఢ, ధ, భ

ఙ, ఞ, శ, ష — అను పదునెన్మిది వర్ణములలో నేదియున్నను అది సంస్కృత సమమని నిర్ణయింప నగును. ఇవి సంస్కృత సమములయందే యుండును. (బా. వ్యా. సంజ్ఞా. 4)

**సంస్కృత సమేతరము**

సంస్కృత సమము కాక, ఇతరము.

అనఁగా (*i*) ప్రాకృత సమము — సిరి, గారవము

(*ii*) సంస్కృత భవము — అసము, సంద్రము,

(*iii*) ప్రాకృత భవము — జాతర, ఒజ్జ

(*iv*) దేశ్యము — ఇల్లు, ముల్లు

ఇన్ని విభేదములతోఁ గూడిన పదజాలమునే ఆచ్ఛికమ'ని వ్యవహరింతురు.

(చూ.) వికృతి. (బా. వ్యా. ఆచ్ఛిక. 1)

**సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణము**

శ్రీ పరవస్తు చిన్నయసూరి గారిచే తెనుఁగు భాసకు, సంస్కృత సూత్రము లందు రచింపఁబడిన వ్యాకరణము.

ఈతని వ్యాకరణ రచనలలో నిది రెండవది.

ఇందు (i) సంజ్ఞా (ii) సంధి (iii) అజన్త (iv) కారక (v) సమాస (vi) తద్ధితములను ఆఱు పరిచ్ఛేదములు గలవు.

791 సూత్రములు గలవు. వీనికి వృత్తి లేకపోవుటచేత చాల సూత్రములు బోధపడకున్నవి.

కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిచే 1931లో నిది ముద్రితము.

చిన్నయసూరి వ్యాకరణ రచనా పరిణామమును గ్రహించుటకీ వ్యాకృతి తోడ్పడును.

బాలవ్యాకరణము పీఠికయందు సూరి పేర్కొన్న సమగ్రమగు వ్యాకరణము సంస్కృత భాషలో విరచితమైనదిది గాదని విజ్ఞుల యభిప్రాయము.

**సంస్కృతాభాసములు**

సంస్కృతములవలె కనిపించునవి.

వర్ణలోప వర్ణవికారాదులను జెందిన సంస్కృత పదములు.

మహాదేవుఁడు

మహదేవి

యాయవారము (అం. భా. శా. ప్రయోగ. 84)

**సంస్కృతావ్యయములు**

సంస్కృత భాషలోని అవ్యయములకు తెలుఁగు భాషలో ప్రయోగము లేదు. కాని సమాస రూపమునఁ బ్రయోగింపఁదగును.

ప్రాతర్—ప్రాతఃకాలము

పునర్—పునర్జన్మము

అలమ్—అలంకారము

నక్తమ్—నక్తంచరుఁడు మున్నగునవి. అథవా, బహుశః వంటి అవ్యయ ములు కొన్ని వ్యస్తముగాను నుపయుక్తము లగుచున్నవి.

(అం. భా. శా. అవ్య. 1)

**సంస్కృతీయము**

సంస్కృత శబ్దమునకు సంబంధించినది. అనఁగా సంస్కృతసమసంబంధి.

అదంతములగు సంస్కృతసమ శబ్దముల కచ్చు పరమగునపుడు సంధియగు నని అథర్వణ కారికావళిలోఁ బేర్కొనఁబడెను.

కాని యథర్వణునకుఁ బూర్వమందలి కావ్యభాషలో నిట్టి సంధికి ప్రయోగ ములు మృగ్యములు.

తత్కారణముగా ఆకారిక ప్రక్షిప్తమనిభావింపవలసి యున్నది.

అథర్వణానంతర కావ్యభాషలో నిట్టి ప్రయోగములు కొన్ని గలవు.

గంగ+అనుకాసె ⟶ గంగనుకాసె. (బా. వ్యా, సంధి. 4)

**సంస్కృతీయ తద్భవము**

సంస్కృతము నుండి పుట్టిన తద్భవ శబ్దము. ఉదా:- సంద్రము చందురుఁడు తామర మొ॥ (అథ. కా. సంజ్ఞా. 8) చూ:- తద్భవము.

**సంహిత**

ఉచ్చారణమునందు వర్ణము లవ్యవహితముగా నుండుట.

ఇట్టి 'సంహిత' ఈ క్రింది వానిలో నిత్యము.

(i) ఏకపదమునందు—రాముఁడు

(ii) ధాతూపసర్గలయందు—వ్యవహరించు (వి+అవ-అనరాదు)

(iii) సమాసమునందు : కవీశ్వరుఁడు (కవి ఈశ్వరుఁడనరాదు)

వాక్యమునందు మాత్రమిది వివక్షాధీనము. తస్యఇదంగృహమ్—అననగును.

ఇది సంస్కృత మందలి సంహితా నియమము.

తెలుఁగున వాక్యమునందును సంహిత నిత్యమే. వాక్యావసానమందు మాత్రమే వివక్షాధీనము—సత్యము సర్వత్రశ్రేయము. అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థ ములు. (త. చం. 1,2 పుటలు. బా. వ్యా. సంధి. 55)

**సకర్మము**

కర్మాకాంక్షోత్థాపకము.

కర్మను గూర్చిన ఆకాంక్షను బుట్టింపఁజేయు క్రియ.

రాముఁడు రావణుని *సంహరించెను.* (బా. వ్యా. క్రియా. 48)

**సగమునున్న**

సగము జాబిల్లివలె వ్రాయఁబడినది /◡/ కాని ప్రకృతము ముద్రణము నందిది /ఁ/ అవి నిలువఁబెట్టఁబడి యుండును.

లోఁగు, తాఁగతనము

దాఁచు, ఆఁకలి ఇత్యాదులు. (అప్ప. II. 88)

**సజాతీయ రూపములు**

ఒక భాషాకుటుంబమునకుఁ జెందిన భాషలలో తుల్యమగు శబ్దాకృతి, అర్థాకృతి గల పదములు.

(త) కిళి (క) కిళి/గిళి (తె) చిలుక. ఇట శబ్దాకృతిలో మార్పు కానవచ్చు చున్నను, ఆ మార్పు నియమాను సారముగా జరుగుటను బట్టి అట్టి మార్పు క్రింద రాదు. (తె. వ్యా. వి. పుట 171)

**సతిసప్తమి**

సంస్కృతమునందు భావలక్షణము (చూ.) నే 'సతిసప్తమి' యను నామాంతరముతో వ్యవహరింతురు. అనేకోదాహరణములయందు సప్తమితోపాటు 'సతి' యను శబ్దము నుపయోగించుటను బట్టి 'సతిసప్తమి' యను వ్యవహారము నాధునికులు గావించిరి.

మేఘేవర్షతి (సతి) బహిర్న గచ్ఛామి.

మేఘము వర్షించుచుండగా బయటికి వెళ్ళను.

ఇట్టి 'సతిసప్తమి' వంటి ప్రయోగములు తెలుఁగున మృగ్యము. కానికొన్ని తెనుఁగు వ్యాకరణములు పేర్కొన్నవి.

సతిసప్తమి కల్గుపట్ల సప్తములెల్ల ప్రథమా విభక్త్యంతములగును.

హరి యర్జునునకుఁ బ్రాపగుచునుండ నేకొఱఁతయు నుండదు.

(ఆం. కౌ. 338-39. తె. వ్యా. వి. పుట. 788)

**సత్యర్థము**

సతి+అర్థము.

తెనుఁగున నీ యర్థమందు 'కాన్' అను ప్రయుక్తమగును. ఇది విభాషను గుఱుచయగును.

దమయంతి నలుని వరించుచుండగా (గ)

దేవతలు చూచిరి. (ల. వ్యా. క్రియా. 41)

**సత్త్వము**

ద్రవ్యము.

సుబంతముచేఁ జెప్పఁబడునది.

వచ్చుచున్నవాఁడు—వచ్చుచున్నాఁడు.

పండఁగలవాఁడు—పండఁగలాఁడు

పండినవాఁడు—పండినాఁడు. ఇత్యాదులు.

ఇవి ద్రవ్యములకే విశేషణములగును. క్రియలకుఁగావు.

(బా. వ్యా. క్రియా. 46)

**సద్రుతము**

సంస్కృత విభక్తి ప్రత్యయముల స్థానమున తెనుఁగు నందాదేశముగా వచ్చు ప్రత్యయము (వై. చం. సంధి. 6,7,8) ఇట్టి ప్రథమావిభక్తి ప్రత్యయములు మాత్రము ఆద్రుత సంజ్ఞకములు (వై. చం. అజంత. 5) షష్ఠీ విభక్త్యాదేశము లగు కి,కు వర్ణకములు, వర్తమానార్థక చువర్ణమును, క్త్వార్థమునవచ్చు కవర్ణమును వికల్పముగా సద్రుత సంజ్ఞకములు (వై. చం. సంధి. 9) యు మున్నగునవి యంతమందుఁగలవి సద్రుతములని కొందఱ మతము (వై. చం. సంధి. 24)

**సనాద్యన్త ధాతువృత్తి**

సంస్కృత ధాతువుల కర్థ విశేషములందు సనాది ప్రత్యయములు చేరుట— సనాద్యన్త ధాతువృత్తి.

బుభుక్ష, ముముక్షువు

జిజ్ఞాస, జేగీయ మానుఁడు. (ఆం. భా. శా. సమాస. 96)

**సప్తమి**

(i) ఉనికిపట్టు (ఆం. భా. భూ. 68)

(ii) -అందు,-న (కా. చూ. IX; 97)

—అందు—మహదమహత్తుల కుపయుక్తము.

—న : ఉదంతములైన అమహదేక వచనములకే యుపయుక్తము.

(బా. వ్యా. తత్సమ. 7)

**సప్తమికి ప్రథమ**

(i) కాలవాచకములకు, అధ్వవాచకములకు సప్తమికి మారుగా ప్రథమా విభక్తి వచ్చును.

వాఁడు నిన్నటి దినము నందు వచ్చె – ననుటకు మారుగా వాఁడు నిన్న వచ్చెనని ప్రథమ నుపయోగింతము.

ఇది కాలవాచకము.

ఇట్లే తేపటి దినమునందు పొమ్ము - తేపుపొమ్ము

(ii) అధ్వవాచకములు :-

వారామడ దూరమునందు నడచిరి.

వారామడ నడచిరి. (ప్రథమ.) (బా. వ్యా. కారక. 25)

(iii) ఇట్లు కాలాధ్వములకే కాక కొన్ని యితర సందర్భములందును జడమైన సప్తమికి ప్రథమ వచ్చును.

వాఁడు చిచ్చునందురికె—వాఁడు చిచ్చురికె.

వాఁడు తీర్థమునందాడె—వాఁడు తీర్థమాడె.

భవ్యాద్రి చాటునందందరు—భవ్యాద్రిచాటుందరున్.

ఏకతము నందుండిరి—ఏకతముండిరి.

(స. సా. సం. I. విభక్తి. 66; ప్రౌ. వ్యా, కారక. 20)

**సప్తమీతత్పురుషము**

సప్తమీ విభక్త్యర్థము నందేర్పడిన తత్పురుష సమాసము.

ఇట్టి తత్పురుష సమాసమునందు —అందు అను విభక్తికి మారుగా 'న' వర్ణకమగును.

కువలయంబునవారు.

చిత్తమున దుఃఖంబుల్ (ప్రౌ. వ్యా. సమాస. 87)

**సప్తమీ తృతీయలకు ద్వితీయ**

సప్తమీ విభక్తికి మాఱుగాను, తృతీయా విభక్తికి మాఱుగాను ద్వితీయా విభక్తి నొక్కొక్కచో నుపయోగింపనగును.

రాముఁడు వాలినొక్కకోలతోఁ గూలనేసె- అనుటకు మాఱుగా

రాముఁడు వాలినొక్క కోలన్ గూలనేసెయని ద్వితీయ నుపయోగింపనగును. ఇట తృతీయకు ద్వితీయ యుపయుక్తము.

లంక యందుఁగల కలంబు వుట్టె-అను సప్తమికి మాఱుగా

లంకన్ గలకలంబు వుట్టె—అని ద్వితీయ నుపయోగింపనగును.

(స. సా. సం. I. విభక్తి. 19; బా. వ్యా. కారక. 22)

**సమము**

సంస్కృత ప్రాకృత భాషాపదములతో సమానమగు తెనుఁగు భాష. ఇట్టి

తెనుఁగు భాషాపదములు తత్సమములని వ్యవహరింపఁబడును. ఇవి సంస్కృత, ప్రాకృత భాషాపదముల చివర కొలఁది మార్పులు కలిగి తెలుఁగు ప్రత్యయములు చేరఁగా నేర్పడునట్టి శబ్దములు. సంస్కృత పదములతో సమానమగునవి సంస్కృత సమములు. ప్రాకృత పదములతో సమానమగునవి ప్రాకృత సమములు. ఉదా:-

| సంస్కృతము | సంస్కృత సమము |
|---|---|
| రామః | రాముఁడు |
| విద్యా | విద్య |
| ధేనుః | ధేనువు మొ॥ |

| ప్రాకృతము | ప్రాకృత సమము |
|---|---|
| అగ్గి | అగ్గి |
| జమో | జముఁడు |
| రాణీ | రాణి మొ॥ |

(చింతా. సంజ్ఞా. 42) చూ.- తత్సమములు.

**సమయాదులు**

(సమయ+ఆదులు) సమయ, తరంగ మున్నగు శబ్దములు. ఇవి తద్భవములుగా మారునపుడు సురాదులవలె స్త్రీ సమములగును. ఉదా:- సమ్మయ, తరగ మొ॥ (వై. చం. అజంత. 35)

**సమవాక్యసంధాయకము**

రెండు స్వతంత్ర వాక్యములను గలుపు శబ్దము—

రాముఁడాటల నాడును మఱియుఁ బాఠములఁజదువును.

(మ. ప. వ్యా. సంధా. 8)

**సమస్తము**

కలిసిపోయినదని శబ్దార్థము.

(వ్య) వ్యస్తము (చూ.)

రెండు పదములు కలసి యేకపదమగుట. అంకెలలో చెప్పిన ఇట్లుండును 1+1=1.

చెఱువుయొక్కనీరు ⟶ చెఱువునీరు (ప్రౌ. వ్యా. శబ్ద. 67)

**సమానకర్తృకములు**

ఏక కర్తృకములు.

ఒకేకర్తగల క్రియలు. రాముఁడు లంకకేగి, రావణుని బరిమార్చెను.

లంకకేగినవాఁడు, రావణుని బరిమార్చినవాఁడు రాముఁడే. అందుచే ఏగు, పరిమార్చు అను క్రియలు సమాన కర్తృకములు.

(బా. వ్యా. క్రియా. 88; రమణీ. 399)

**సమాన పదము**

ఏకపదము. అఖండపదము.

అనఁగా రెండుగా విభజింప వీలులేని పదము.

అనఁటులు.

తేఁటులు — ఇత్యాదులు.

ఇట్టి సమానపదమునందలి బహువచన ప్రత్యయము పూర్వవర్ణముతో సంయోగమందిన ఖండ బిందువునకుఁ బూర్ణబిందువు, దీర్ఘముల మీఁదను నగును.

అనంట్లు, తేంట్లు

(బా. వ్యా. ఆచ్ఛిక. 15)

**సమాన విభక్తికము**

ఏక విభక్తి కలది.

(వ .) అసమాన విభక్తికము.

ఇట్ట భేదములచే తత్పురుషము ద్వివిధము.

సమాన విభక్తికమునకే సమానాధికరణము (చూ.) అందురు. ఇట్లేర్పడిన సమాసము కర్మధారయ సమాసము.

నల్లకలువ

కపిల గోవు

(ల. వ్యా. సమాస. 97, 98)

**సమానాధికరణము**

సమానమగు విభక్తి కలది.

నల్లనయిన కలువ——→నల్లకలువ

విశేషణమునకు విశేష్యముతో సమాసము.

(బా. వ్యా. సమాస. 8 సూ)

**సమానాధికరణాన్వయము**

పదములకు లింగ, వచన, విభక్త్యాదులయం దైకమత్యముగల యన్వయము.

సుగుణాభిరామునకు రామునకు జోహారులు.

(సం. వ్యా. వాక్య. 12)

**సమానార్థకములు**

సమానము, తుల్యము, అను నర్థము నిచ్చు తెలుఁగు శబ్దములు.

ఈడు, ఎన, సరి, సాటి, మొదలైన విశేషణములు.

ఇవి నిత్యైక వచనాంతములు. (ప్రౌ. వ్యా. శబ్ద 32)

**సమానాశ్రయములు**

ఏకాశ్రయములు.

కర్తృరూపమునఁ గాని, కర్మరూపమునఁ గాని, యొకే వ్యక్తి నాశ్రయించిన క్రియలు.

చైత్రుని చేత మైత్రుఁడు కొట్టఁబడి, మడిసె —

ఇట 'కొట్టిన' వాఁడు — చైత్రుఁడు.

'మడిసిన' వాఁడు — మైత్రుఁడు.

కాగా, 'కొట్టు', 'మడియు' అను క్రియలు భిన్న కర్తృకములు, కాని యివి సమానాశ్రయములు.

| | |
|---|---|
| 'కొట్టు' అను క్రియకు కర్మ<br>'మడియు' అనుక్రియకు కర్త | మైత్రుఁడు |

తొలి క్రియకు కర్మగా. మలి క్రియకు కర్తగా మైత్రుఁడే యాశ్రయము.

ఇట్టి క్రియలు సమానాశ్రయములు.

ఇట్టి చోట పూర్వము జరిగిన క్రియకు తెనుఁగున 'ఇ' ప్రత్యయము చేరును— 'కొట్టఁబడి'.

(బా. వ్యా. క్రియా. 38, రమణీ. 399-400)

**సమాపకములు**

ముగిసినవి, పూర్తిగా నిర్వహింపఁబడినవి.

క్రియలు సమాపకములు, అసమాపకములు అని ద్వివిధములుగా ఆంగ్ల వ్యాకరణ ప్రభావముచే కొన్ని యాధునిక వ్యాకరణముల యందు నిరూపితము.

సమాపక క్రియగల వాక్యము సంపూర్ణ వాక్యము.

రాముఁడు వచ్చుచున్నాఁడు. (ప్రౌ. వ్యా వాక్య. 7)

సం. వ్యా. క్రియా. 9)

**సమాప్త పునరావృత్తము**

పూర్తి అయిన దానిని తిరిగి చెప్పట.

వాక్యము సమాప్తమైన పిమ్మట విశేషణము నొకదానిని తిరిగి చెప్పట.

శాశ్వతు. నభవుని, గమలాక్షు, గమలనాభుని గమలాపతిని ముక్తికై కొలిచెదను, విభుని.

(సు. వ్యా. వ్యాసము. 328)

**సమాసకము**

ప్రథమాచార్యుఁడు ఆంధ్రభాషలోని సమాసములను సమాసకములు, మిశ్ర సమాసములు, సమాసములు అని మూఁడు విధములుగా విభజించెను. కేవల వికృతి (శుద్ధాంధ్ర) పదములతో నేర్పడునది సమాసకము. ఉదా :- నిండు పున్నమ జాబిల్లి, వెన్నెలతేట, పేరామని చిగురు, కెమ్మోవి ఇత్యాదులు. (చింతా. హలన్త 46) సంస్కృత సమాసములవలె తెలుఁగు సమాసములు సుదీర్ఘములు కాకపోవుటచేఁ గాబోలు ప్రథమాచార్యుఁడు అల్పార్థ సూచకముగా 'క' ప్రత్యయాంతముగా 'సమాసక' సంజ్ఞను నిబంధించి యుండును.

(తె. వ్యా. వి. 872 పే.)

**సమాస పదము**

వేఱు వేఱుగా నున్న పదములు ఏక పదముగా నయినది.

నలుగడలు

పాలకడలి

పాల కడలి పట్టి

పాల కడల పట్టి యందము (సం. వ్యా. సమాస. 1)

**సమాసపదము తెనుఁగు సేయుట**

సంస్కృత సమాసపదములు కొన్ని తెనుఁగునఁ బ్రవేశించునపుడు పూర్వ పదములు కొన్ని తెనుఁగు బాస కనుకూలముగ మార్పు చెందును.

వీనినే 'సామాసిక తద్భవములు' (చూ.) అందురు.

కర్పూరగంధి—కప్పురగంధి

హంసయాన—అంచయాన (స. సా. సం. II. సమాస. 9)

**సమాసము**

సమ్ పూర్వకమగు అస్ ధాతువునకు ఘఞ్ ప్రత్యయము చేరఁగా 'సమాస' శబ్దము నిష్పన్నమగును.

అనఁగా 'కలయిక', 'కూడిక' అని యర్థము.

వేఱువేఱు అర్థములుగల పదములు ఏకార్థమందు కలయిక సమాసము.

రాజునకు సంబంధించిన పురుషుఁడు—

రాజపురుషుఁడు = రాజకీయోద్యోగి (Official)

పదము లీరీతిని విభక్త్యాదులలోపముచే సంగ్రహింపఁబడి ఏకపదమగుట సమాసము.




(ఆం. భా. వి. 446, ప్రౌ. వ్యా. సమాస. 1)

**సమాసవిభక్తి**

సమాసము నేర్పఱచుటకు లోపింపఁజేయనగు విభక్తి.

బహువచనమందలి లడాగమము విభక్తిలోని భాగమేయైనను, సమాస విభక్తితోపాటు లడాగమమునకు లోపముండదు.

రాముల | యొక్క | బాణములు
రాముల బాణములు

తటాకము | యొక్క | ఉదకము
విభక్తి సమాసవిభక్తి
తటాకము + ఉదకము
తటాకపుటుదకము (బా. వ్యా. సమాస. 25)

**సమాసవృత్తి**

సమాస మేర్పడుటకు పదముల కలయిక.

తెలుఁగు భాషలోఁగల త్రివిధ వృత్తులలో నొకటి. (చూ.) వృత్తి.

రాముని యొక్క బాణము
రాముని బాణము (ఆం. భా. శా. సమాస. 86)

**సమాసాంత కార్యములు**

సమాసముల తుదిని కలుగు వర్ణలోపాగమాది కార్యములు. ఇట్టివి సంస్కృత వ్యాకరణమునకు ప్రత్యేక ప్రకరణమునందు నిరూపితము. తెనుఁగున స్వల్పము. బహువ్రీహి సమాసములందే పొడగట్టును.

అలరు విలుతుఁడు—తకారము చేరుట

వాలుగంటి, ముక్కంటి ; 'ంటి' చేరుట

తమ్మిచూలి—ఇకారము చేరుట

నలువ— దీర్ఘము హ్రస్వమగుట.

(బా. వ్యా. సమాస. 22; ప్ర. వ్యా. 298)

**సమాసాంతర్గత విశేష్యములకగు విశేషణములషష్ఠి**

సమాస మధ్యభాగముననున్న విశేష్యములకు సంబంధించిన విశేషణముల యొక్క షష్ఠి.

ఇట్టి షష్ఠికి ప్రథమ చూపట్టెడిని.

పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్ను. పార్థివప్రాగ్రసరు యొక్క ధర్మసుతు యొక్కపన్ను.

ఇట్లు విశేషణముకూడ షష్ఠిలోనుండ వలసియుండగా ప్రథమ చూపట్టెడిని.
(ప్రౌ. వ్యా. కారక. 21)

**సమాసాంత విధులు**

చూ :- సమాసాంతకార్యములు

**సమాహార ద్వంద్వము**

సామూహికమైన ద్వంద్వ సమాసము. ఇందు ప్రత్యేకాన్వయము ముఖ్యము కాదు. సమూహార్థమే ముఖ్యము.

ఆహార నిద్రాభయమైథునములు,

దరిదాపు, కూడుగుడ్డ (సు. వ్యా సమాస. 10)

**సమాహార ద్విగువు**

సమూహముగాఁ జేర్కొనబడిన ద్విగువు. ఇది ఏకవచనాంతమగును.

త్రిలోకి—మూఁడు లోకముల సమాహారము

ఇట్లే త్రిభువనము, పంచపాత్రము (సు. వ్యా. సమాస. 29)

**సమాహారము**

సమూహము (సు. వ్యా. సమాస. 29)

**సమీపకర్త**

సన్నిహితముగానున్న కర్తృపదము.

ఒకక్రియ కనేక కర్తలున్నచో, అందు దగ్గఱగానున్న కర్తతో క్రియ అన్వయించును.

ఏవాని | బంధుమిత్రులు | (1) | జీవధనములు | (2) డప్పిఁ | జెందును | .

(సమీపకర్త: జీవధనములు ... జెందును)

(ప్రౌ. వ్యా. వాక్య. 15)

**సమీపార్థకము**

సమీపార్థమును దెల్పునది.

ఈ యర్థమునందు—కంటె వర్ణకము వచ్చును.

ఊరికంటె వనము చేరువు. (ప్ర. వ్యా. 270)

**సముచ్చయ ద్వంద్వము**

సముచ్చయము (చూ.) తోఁగూడిన ద్వంద్వసమాసము.

హరియును గిరియును

రమయును నుమయును. (ఆం. కౌ. 623-24)

**సముచ్చయములు**

పదముల నొండొంటితోఁ గలుపుట కుపయోగింపఁబడు నవ్యయములు

ఇవిరెండు – యు,ను.

ఇవి ద్రుతాంతములు.

ఉకారాంతములమీఁద 'ను', ఉకారేత రాంతములమీఁద 'యు' వచ్చును.

రాముఁడును, హరియు ద్వారకకు వచ్చిరి. (సం. వ్యా. అవ్యయ. 6)

**సముచ్చయ సంధాయకము**

సముచ్చయముచే రెండు పదములను గలుపుట

రాముఁడును, గృష్ణుఁడును సాందీపనికడ వేదములు చదివిరి.

(మ ప. వ్యా. సంధా. 6)

**సముచ్చయాద్యర్థము**

సముచ్చయము, అన్వాచయము, ఇతరేతర యోగము, సమాహారము అను నర్థములు. ఈ యర్థములందు 'ను' అను నవ్యయము నిపతింపఁబడినది. చూ:- చార్థము.

**సముచ్చయార్థము**

సముచ్చయార్థమునందు ఉపయోగించు -ను/-యు.

విశేషణములు పెక్కున్నచో కడపటి విశేషణముపై సముచ్చయ ముపయుక్తము.

ఆద్యుఁడ ప్రమేయుఁడునౌ హరిని గొలుతు. (బా. వ్యా. కారక. 30)

**సముదాయవాచకము**

సమూహమును దెలుపు శబ్దము.

కొందఱియొక్కకాని, కొన్నింటి యొక్కకాని సమూహమును జెప్పుశబ్దము.

సేన, మూఁక, సభ, గుంపు మొదలయినవి.

(ఆం. భా. శా. నామ. 6)

**సమేతరము**

సంస్కృత సమముకాక తద్భవములుకాక పదములు.

చూ. సంస్కృత సమేతరము. (బా. వ్యా సంజ్ఞా. 9)

**సరళములు**

నాదోచ్చారణముగల వర్గ తృతీయ వర్ణములు.

గ జ (జ) డ ద బ

(అప్ప. II. 14: బా. వ్యా. సంజ్ఞా. 5)

**సరళతా పరిణామసంధి**

పరుషములు సరళములుగా పరిణమించుసంధి. ఇట్లు పరిణమించుటకు కారణము ప్రక్కనున్న ద్రుతము. ఇది నాదవంతమైన ధ్వని.

సన్నిహితోచ్చారణము నందు ఈ నాదధ్వని ప్రభావముచే శ్వాసములు (surds) నాదములుగా (sonants) గా పరిణమించును.

ఆధునికులు ఇట్టి మార్పును 'పాక్షికవర్ణ సమీకరణము' (partial assimilation) అందురు.

పూచెను+కలువలు——→పూచెనుగలువలు.

తోచెను+చుక్కలు——→తోచెనుజుక్కలు.

చేసెను+టక్కులు——→చేసెను డక్కులు.

నెగడెను+తమములు——→నెగడెనుదమములు.

మొగిడెను+పద్మము——→మొగిడెను బద్మము.

ఇట్టిమార్పు మార్దవికోచ్చారణమును జేకూర్చును (Euphony). ఇట్టి లక్షణములనేకము లుండుటను బట్టియే తెలుఁగునకు 'ప్రాచ్యదేశపు ఇటలీభాష' అను కీర్తి కల్గెను. (తె. వ్యా. వి. పుట. 485)

**సరళములు**

చింతామణి. కర్త విభజించిన మూఁడు విధములగు హల్లుల భేదములలో నొక

భేదము. వర్గముల తృతీయాక్షరములగు గ, జ, డ, ద, బ యను నైదక్షరములు సరళములు. (చింతా. సంజ్ఞా 34) దంత్య, తాలవ్య జకారములకు రెండింటికిని సరళసంజ్ఞ ప్రవర్తించును. ఈ సంజ్ఞ పాణినీయమున కానరాదు. ఇది చింతా కర్త స్వోపజ్ఞముగా కల్పించిన సంజ్ఞ. ద్రుతప్రకృతికము కంటె పరుషములకు సరళము లాదేశములగును. ఉదా:- రాముఁగొలిచెదన్ (రామున్+కొలిచెదన్), మిగులఁజక్కని (మిగులన్+చక్కని) మొ॥ (చింతా. సంధి. 21) సరళములు పరమగునపుడు ద్రుతప్రకృతికము కంటె పరమైన నకారమునకు లోపము వికల్పముగా వచ్చును. ఉదా:- రాము జగదీశుఁ బ్రార్థించెద మొ॥. లోపమురాని పక్షము ద్రుతమునకు సంశ్లేషముగాని, బిందువుగాని వచ్చును. ఉదా:- రామున్జగదీశున్ (సంశ్లేషము), రాముంజగదీశున్ (బిందువు) మొ॥ (చింతా. సంధి. 26,27)

**సరళస్థిరములు**

సహజములైన సరళములు, స్థిరములు (చూ.)

వర్గ ప్రథమ వర్ణములుకాక, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ వర్గాక్షరములు.

ద్రుతమునకివి పరమగుచో లోప సంశ్లేషములు విభాషనగును.

వచ్చెను+గోవులు { వచ్చెగోవులు (లోపము)<br>వచ్చెన్గోవులు (సంశ్లేషము)<br>వచ్చెను గోవులు (ప్రకృతి భావము)

మెఱసెను+ఖడ్గము { మెఱసె ఖడ్గము (లోపము)<br>మెఱసెన్ఖడ్గము (సంశ్లేషము)<br>మెఱసెను ఖడ్గము (ప్రకృతి భావము)

(బా. వ్యా. సంధి. 18)

**సర్వతావదర్థకము**

అందఱు, అన్ని అను నర్థము నిచ్చునది. (బా. వ్యా. ఆచ్ఛిక. 24)

**సర్వనామములు**

'సర్వ' ఆదిగాఁగల నామములు.

(i) 'అన్ని' మున్నగునవి—అన్ని, ఇన్ని, ఎన్ని, పెక్కు, పలు, ఆ - ఈ ఏ - నీ - నా - తా - మన - సంఖ్యావాచకములు

(బా. వ్యా. ఆచ్ఛిక. 24)

(i) విశేష్యముల పునరుక్తిని నివారించుటకయి వానికి మాఱుగా నుపయుక్తములగు నామములు. (సం వ్యా. సర్వ. 8)

(iii) అన్ని నామముల స్థానమునందుపయుక్తమగునవి—రాముఁడు వనమున కేగెను. రాముఁడు రావణుని సంహరించెను. రెండవసారి రామశబ్దమునకు మాఱుగా 'అతఁడు' అననగును. అది సర్వనామము.

(ఆం. భా. వి. పుట. 459-60)

## 'సర్వ'పర్యాయమైన'ఎల్ల'శబ్దము

'సర్వ' అను సంస్కృత శబ్దమునకు సమానార్థకమైన (Synonym) 'ఎల్ల' అను తెనుఁగు శబ్దము.

(i) 'ఎల్ల' శబ్దమునకు 'అన్ని' 'అందఱు' అని అర్థము.

ఇది ద్రుతాంతమైన అవ్యయము.

దీనిని విశేష్యమునకు ముందు ప్రయోగించుచో సమాసమగును. సమాసమునందు ద్రుతమునకు లోపము కల్గును.

ఎల్లయర్థములు, ఎల్ల కలుషములు (బా. వ్యా. సంధి. 24)

(ii) ద్రుతమును లోపింపఁజేయకయే విశేష్యమునకు ముందు 'ఎల్ల' శబ్దమునకు ప్రయోగము కానవచ్చును,

ఎల్లన్ శిష్యులఁ గొంచువత్తునా (ప్రౌ. వ్యా. సంధి. 7)

ఇట్టి ప్రయోగమొకేయొకటి చూపఁబడెను. ఇది ఛందోనియమ మనుల్లంఘనీయమగుటచేఁ గావింపఁ బడెనని భావింపఁ బడుచున్నది. (Prosodical contingency)

## సర్వలక్షణ సారసంగ్రహము

కర్త: కూచిమంచి తిమ్మకవి.

ఇది మూఁడాశ్వాసముల గ్రంథము.

ప్రథమాశ్వాసమునందు (i) సంజ్ఞా
(ii) సంధి
(iii) విభక్తి ప్రకరణములు గలవు.

ద్వితీయాశ్వాసమునందు (iv) సమాస
(v) క్రియావిశేషణ
(vi) ప్రాస

(vii) విశ్రమ

(viii) శబ్ద ప్రకరణములు గలవు.

తృతీయాశ్వాసమునందు (ix) రేఫద్వయ నిర్ణయము

(x) శకటరేఫ ప్రకరణము గలవు.

ఆంధ్ర శబ్ద చిన్తామణి, వికృతి వివేకాదుల నుండియు, ఆంధ్రభాషా భూషణాదుల నుండియు నిందు అనేక విషయములు గ్రహింపఁబడినను, ప్రామాణిక కవి ప్రయోగ ప్రదర్శనముతో పరిశీలనాత్మకముగా రచింపఁబడిన లక్షణ గ్రంథమిది.

ఆంధ్ర సాహిత్య అకాడమీ దీని నీమధ్య పరిష్కరించి, ప్రచురించినది.

**పర్యాప్త్యర్థకములు**

అందఱు, అన్ని - అనునర్థమును దెల్పునవి.

(ల వ్యా. అచ్చ. 78; ఆం. భా. శా. సర్వ. 22)

**సవర్ణ దీర్ఘ సంధి**

సమాన స్వరము పరము కాగా దీర్ఘమేకాదేశముగా వచ్చు సంధి. ఇది సంస్కృతమునకు సంబంధించినది.

'సంహిత యున్నపుడు అ, ఇ, ఉ, ఋ కారములకు అ, ఇ, ఉ, ఋ వర్ణములు పరమగునపుడు దీర్ఘమేకాదేశమగును.

(i) అ+అ > ఆ : దేవ+అగారము ⟶ దేవాగారము

అ+ఆ > ఆ : దేవ+ఆలయము ⟶ దేవాలయము

ఆ+అ > ఆ : లతా+అంతము ⟶ లతాంతము

ఆ+ఆ > ఆ : వనితా+ఆరాధనము ⟶ వనితారాధనము

(ii) ఇ+ఇ > ఈ : హరి+ఇందిర ⟶ హరీందిర

ఇ+ఈ > ఈ : కవి+ఈశ్వరుఁడు ⟶ కవీశ్వరుఁడు

ఈ+ఇ > ఈ : మహీ+ఇంద్రుఁడు ⟶ మహీంద్రుఁడు

ఈ+ఈ > ఈ : మహీ+ఈశ్వరుఁడు ⟶ మహీశ్వరుఁడు

(iii) ఉ+ఉ > ఊ : భాను+ఉదయము > భానూదయము

ఉ+ఊ > ఊ : ధేను+ఊధస్యము > ధేనూధస్యము

ఊ+ఉ > ఊ : వధూ+ఉక్తము > వధూక్తము

ఊ+ఊ > ఊ : వధూ+ఊర్జితము > వధూర్జితము

(iv) ఋ+ఋ>ౠ: పితృ+ఋణము>పితౄణము/పితృఋణము
(త. చం. సంధి, 1-4)

**సవర్ణములు**

సమాన వర్ణములు.

తెలుఁగున చ, జలు దన్త్యతాలవ్యములను భిన్నోచ్చారణము గల్గియు, సవర్ణ ములుగా నిర్దేశింపఁబడినవి.

ఇందు మూలమున క, చ, ట; త, ప, లు పరుషములన్నచో, దన్త్యచకారము గూడ గ్రాహ్యమగును. అందుచే క, చ, చ̄, ట తపలు పరుషములగును. ఇట్లే గ, జ, డ, ద, బ, లు సరళములనుచో గజ (జ̄) డ ద బ లు సరళములగును. సవర్ణత్వమును నిర్దేశింపకున్నచో చ̄, జ̄లు పరుష సరళములందుఁజేరక, స్థిరము లందుఁ జేరవలసి యుండును (బా. వ్యా. సంజ్ఞా. 7)

**సస్యవాచకములు**

పంటల పేళ్లు.

అరుగ, చోడి, వరి, కంది, పెసర, మినుము మున్నగు పంటలు.

ఇవి నిత్యైకవచనాంతములు (ప్రౌ. వ్యా. శబ్ద. 9)

**సహజ బహువచనములు**

బహువచన ప్రత్యయ మంతమందు చేరక, లు అను వర్ణమంతమందావయ వికముగా నున్న పదములు.

పాలు, తెమ్మెరలు. (కా చూ. IX. 91)

**సహజసరళములు**

క, చ, ట, త, ప లకు ఆదేశముగా వచ్చిన సరళములు గాక; శబ్దమునందు సహజముగా నున్న సరళములు సరళములు.

(వ్య.) ఆదేశ సరళములు.

ఎట్టి విశేషణమును జేర్చక సరళము లన్నచో సహజ సరళములని యర్థము.

గోవులు, జగడము, జగము

డంబువు, దండ, బరువు ఇత్యాదులు. (తె. వ్యా. వి. పుట. 485)

**'సహ'పూర్వపదబహువ్రీహి**

'సహ' అను శబ్దము పూర్వమందున్న బహువ్రీహి.

తృతీయావిభక్త్యంత నామముతో సహశబ్దము చేరి బహువ్రీహియగును. అట్టిచో 'సహ' శబ్దము 'స' యని వైకల్పికముగా నగును.

సహపుత్రుఁడు — సపుత్రుఁడు

(సు. వ్యా. సమాస. 59)

**సహాయక్రియలు**

(చూ.) ఉపక్రియలు (సం. వ్యా. క్రియా. 8)

**సహార్థము**

కూడియున్న, వెంటనున్న అను నర్థము.

ఈ యర్థమునందు 'తోడ' వర్ణకము వచ్చును.

రాజు సైన్యముతో దండయాత్ర గావించెను.

కమల జ్వరముతో పరీక్ష వ్రాసెను.

కమల కలముతో పరీక్ష వ్రాసెను.

(బా. వ్యా. కారక. 5)

**సహితాది పదములు**

(సహిత + ఆది పదములు) సహితము, అందము మొదలగు పదములు. క్రియా విశేషణములుగ ప్రయోగింపఁబడునపుడు వీనికి ప్రథమా విభక్తియు, గకారాంతత్వమును వచ్చును. ఉదా :- భూమిజాత - సహితంబుగ నుండెడు రాముఁగొల్చెదన్, అందముగ నిట్లనియెన్ మొ॥ (అథ. కా. అజంత. 79)

**సాంతము**

(స + అంతము) సమాసాంతము - ప్రాకృత - వ్యాకరణమున 'స' అను నది సమాసమునకు సంజ్ఞ. (అథ. కా. అజంత 46) చూ:— 'స'

**సాంతములు**

సకార మంత మందుఁగల సంస్కృత శబ్దములు.

ఇట్టి శబ్దములను తెనుఁగులోనికిఁ జేర్చుకొనవలయునన్న సకార లోపము బహుళముగా నగును.

ఉరము — ఉరస్సు

అర్చి — అర్చిస్సు

ఇట్టి వానిలో సకార లోపము వికల్పము.

'పయః ప్రభృతు'ల యందు (చూ.) సకారమునకు లోపము లేదు.

పయస్సు. ఎయస్సు మున్నగునవి.

(బా. వ్యా తత్సమ 80)

**సాంప్రదాయిక వ్యాకరణములు**

సంస్కృత సంప్రదాయము ననుసరించి, పాణినీయ సంజ్ఞలతో, పరిభాషలతో, ప్రక్రియా పద్ధతిని తెనుఁగు బాసకు, సంస్కృతము నందును, తెనుఁగునందును విరచితములైన వర్ణనాత్మక వ్యాకరణములు.

ఆన్ధ్ర శబ్ద చింతామణి (చూ.) ఈ కోవకుఁ జెందిన తొలి వ్యాకరణము. ఇది సంస్కృతము నందు కారికలలో విరచితము దీనికి పూరకమగు 'వికృతి వివేకము' లేక 'అథర్వణ కారికావళి' (చూ ) రెండవది.

ఆన్ధ్ర శబ్ద చిన్తామణికి బాలసరస్వతి రచించిన టీక, అహోబలపతి వ్రాసిన వ్యాఖ్య ఈ పద్ధతిలోనివే.

ఈ కోవలో చివరిది, చిరస్మరణీయమైనది పరవస్తు చిన్నయసూరి బాల వ్యాకరణము (చూ.). (తె. వ్యా. వి. పుట VI)

**సాంస్కృతిక కతపలు**

సంస్కృత పదముల యొక్క యాది యందుండు క, త, ప అను వర్ణములు.

తెలుఁగు పదముల మీఁది సంస్కృత సమ పదముల యాదినున్న క, త, ప, లు-గ, ద, వలు కావచ్చును. (ప్రాస స్థలములందు మాత్రమే యిట్టి యాదేశములు ప్రయోగములందు కానవచ్చును).

పీరల్ గోపించిన

ఇట్లు దపంబుసేయు

వేవణములు (ప్రౌ. వ్యా. సంధి 5)

**సాంస్కృతిక పరుషములు**

సంస్కృత సమపదముల యాది యందున్న క, చ, ట, త, ప అను వర్ణములు.

తెలుఁగు పదముల మీఁది యిట్టి వర్ణములు గ, స, డ, ద, వ, లు కావు.

వాఁడు కంసారి (గంసారి యనరాదు). అతఁడు చక్రపాణి (సక్రపాణి యనరాదు).

ఇత్యాదులు. (బా. వ్యా. సంధి 14)

**సాంస్కృతికము**

సంస్కృత శబ్ద సంబంధము గలది.

సమాసములు త్రివిధములు

1. సాంస్కృతికము
2. ఆచ్ఛికము (చూ.)
3. మిశ్రమము (చూ.)

ఈ విభజనము భాషలను బట్టి కావించినది.

సంస్కృత భాషలోనే యేర్పడి తెలుఁగు విభక్తులతో తెనుఁగు నందు వ్యవహరింపఁబడు సమస్త పదములు సాంస్కృతికములు.

తటాక + ఉదక ——→ తటాకోదక

తటాకోదక + ము ——→ తటాకోదకము.

ఇట్లే రాజాజ్ఞ, రామ వాగ్రజుఁడు, భానూదయము, కామధేనువు మున్నగునవి·

(బా. వ్యా సమాస. 2)

**సాంస్కృతికములు**

సంస్కృతమునకు సంబంధించిన శబ్దములని శబ్దార్థము. సంస్కృత సమము లని భావము. సంస్కృత సమేతరములగు తెనుఁగు శబ్దములకంటె పరమందున్న సాంస్కృతిక శబ్దాది యందలి పరుషములకు గసడదవలు రావు (చింతా సంధి 24)

**సాతత్యము**

సతతము నుండుట.

చిన్నయసూరి పేర్కొన్న 'తద్ధర్మాద్యర్థకముల'లో నొక యర్థము.

సర్వమునం దీశ్వరుఁడుండును.

సర్వమీశ్వరునియందుండును (బా. వ్యా. క్రియా. 22)

**సాదృశ్య శబ్దము**

సాదృశ్యమును తెలుపు 'అంత' యను శబ్దము. ఈ శబ్దము కొన్నిచోట్ల వర్ణ్యోత్కర్షయందు ప్రయోగింపఁబడును. ఉదా:-ఒక నాడింద్రుని యంత వేలుపు, అటు దగునే సురేశ్వరుని యంతటి వానికి మొ॥ (అథ. కా. అజంత 88)

**సాధ్యపూర్ణ బిందువు**

(i) వ్యాకరణ నియమానుసారము సాధింపఁబడిన పూర్ణబిందువు.

(వ్య.) సిద్ధ పూర్ణబిందువు (చూ )

కెంపు + తమ్ములు, కె + తమ్ములు,

కె + ను + తమ్ములు, కె + ను + దమ్ములు ——→ కెందమ్ములు.

ఇట్లే చెంగలువలు, ముంగొంగు, క్రొంబసిఁడి ఇత్యాదులు.

(అప్ప. II. 25)

(ii) దీర్ఘము మీఁద సాధ్య పూర్ణబిందు వుండదు. అనఁగా వాండు, పాండి, అండబిడ్డ వంటి పూర్ణబిందుయుత రూపములుండవని యర్థము.

(బా. వ్యా. సంజ్ఞా 15)

**సాధ్య పూర్ణము**

(చూ.) సాధ్య పూర్ణబిందువు (బా. వ్యా. సంజ్ఞా 15)

**సాధ్యము**

(i) వ్యాకరణ నియమానుసారము సాధింపఁబడినది.

(చూ.) సాధ్య పూర్ణబిందువు; సాధ్యఖండము.

రాముండు; వచ్చెంగమలాక్షుఁడు

(ii) తెనుఁగు వ్యాకరణ నియమానుసారము సాధింపఁబడిన సంస్కృత సమ పదములతో నిర్మించిన సమాసము.

తటాక పుటుదకము

లక్ష్మీ వల్లభుఁడు

(స. సా. సం. I. వర్ణ. 45, అప్ప II. 22, బా. వ్యా. సమాస. 2)

**సాధ్యానుస్వారము**

(సాధ్య+అనుస్వారము) సహజముగ శబ్దగతముకాక శాస్త్రవిధి వలన ఏర్పడిన యనుస్వారము. ఇది సాధ్య పూర్ణానుస్వారము, సాధ్య-అర్ధానుస్వారము అని రెండు విధములు. (చింతా-సంజ్ఞా 18) ఉదా:- చెందొవ (చెన్ను+తొవ), కెందమ్మి (కెంపు+తమ్మి), మొ॥ (ఇట సాధ్య పూర్ణానుస్వారము) రాముఁడు, కృష్ణుఁడు మొ॥ (ఇట డు డుజ్జు జీత్తగుటచే జీత్తు బిందు పూర్వమగునని శాస్త్ర విధిచే వచ్చుటచే సాధ్య-అర్ధానుస్వారము) మొ॥ హ్రస్వము మీఁది సాధ్య సిద్ధ బిందువులు పూర్ణబిందువుగాను, అర్ధ బిందువుగాను ఉండుననుటచే (చింతా. సంజ్ఞా 18) రాముండు, కృష్ణుండు ఇత్యాది రూపములును ఏర్పడును. హ్రస్వము మీఁది సాధ్య బిందువు పూర్ణ బిందువుగాను, అర్ధ బిందువుగాను కాఁదగియున్నను పదమందలి తొలి హ్రస్వము మీఁద అర్ధ బిందువురాదు (అథ. కా. సంజ్ఞా 10) అను నిషేధముచే కెందమ్మి, చెందొవ, ఇత్యాదులలో ప్రథమ హ్రస్వముపై అర్ధబిందువు రాదు. (అహో. సంజ్ఞా. 18) చూ:- సిద్ధానుస్వారము.

**సాధ్యోద్భవ ఖండము**

వ్యాకరణ నియమాను సారము సాధింపఁగా, పుట్టినట్టి ఖండబిందువు.

పూచెను గలువలు

పూచెఁగలువలు. (అప్ప. II. 24)

**సామర్థ్యము**

పదములు సమసించుటకుఁగల శక్తి. అన్ని పదములును అట్టి శక్తిని గలిగి యుండవు.

(i) వేఱువేఱుగా నున్న అర్థములు ఏకార్థమును గలిగియుండుట.

దేవదత్తుఁడు—గురువు : ఇవి వేఱువేఱు అర్థములను గలిగియున్న పదములు

దేవదత్తుని యొక్క గురువు.

దేవదత్తుని గురువు - అని సమసించుటకీ రెండు పదములు సమర్థములై యున్నవి. (బా. వ్యా. సమాస 1)

**సామానాధికరణ్యము**

సమానమైన యధికరణము కలిగియుండుట అని శబ్దార్థము. చిగురుటాకు మున్నగుచోట్ల చిగురుదనమునకును, ఆకుదనమునకును ఆశ్రయము సమాన మగుటచే చిగురు, ఆకు అను పదములు సమసించి సమానాధికరణములగు చున్నవి. ఇట్టి సామానాధి కరణ్యము కర్మధారయ సమాసములందే యుండుటచే సామానాధి కరణ్యమను పదము సమాస పర్యాయ పదముగా వాడఁబడుచున్నది. సామానాధి కరణ్యములందు హ్రస్వోకారాంతములగు పదముల కచ్చు పరమగునపుడు టుగాగమము వచ్చును. ఉదా - కఱకుటమ్ము, చిగురుటాకు మొ॥ (చింతా. సంధి. 33)

**సామ్యము**

ప్రసిద్ధమగు పదస్వరూపము ననుసరించి క్రొత్తపదములను గల్పించు విధము. దీనినే యనాలజీ (analogy) అందురు.

సేవకత్వము, దాసత్వము - ఇత్యాది పదసామ్యమున బానిసత్వము అను పదకల్పనము.

'త్వ' అను భావార్థక సంస్కృత ప్రత్యయము తెనుఁగు పదమగు 'బానిస' పైఁ జేర్పఁబడెను.

'కండ్లు' అను బహువచన రూపసామ్యమున

'పండ్లు' అను బహువచన రూపము

'కన్ను' అను ఏకవచన రూపసామ్యమున

'పన్ను' అను ఏకవచన రూపము నేర్పడినది.

పల్లు (tooth)—పండ్లు
కన్ను —కండ్లు

కండ్లు—కన్ను
పండ్లు—పన్ను

(ఆం. భా. వి. పుట. 501; తె. వ్యా. వి. పుట. 421)

**సామాన్యవాక్యము**

ఒక్క సమాపక క్రియతో నేర్పడినది. శ్రీరాముఁడయోధ్యనేలెను.

(ఆం. భా. శా. కారక. 4; సం. వ్యా. వాక్య. 8; మ. ప. వ్యా. వాక్య. 2)

**సామాన్యవాచకము**

(i) అందఱనుగాని, అన్నింటినిగాని సమానముగాఁజెప్పునది.

Common Noun అను ఆంగ్లవ్యాకరణ సంజ్ఞకిది యనువాద ప్రాయము.

పశువులు, దేవతలు, మనుష్యులు.

(ii) జాతి సామాన్యమును జెప్పునది. హిందువులు, ఆవులు, బ్రాహ్మణులు

(ఆం. భా. శా. నామ. 5)

**సామీప్యాధికరణము**

సామీప్య+అధికరణము

దగ్గఱగానున్న ఆధారము.

'గంగయందు గొల్లపల్లె'—గంగానది కత్యంత సమీపము నందుఁగల గొల్ల పల్లెయని యర్థము.

'గంగాయామ్ ఘోషః' అను సంస్కృతోక్తి కిది యనువాదము.

(ఆం. కౌ. 471)

**సావర్ణ్యసంధి**

సమాన వర్ణములకు సంబంధించిన సంధి. అని యర్థము.

కాని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు సంధిలో ద్రుతముపైనున్న పరుషములు సరళములగు సంధి నీపేరుతో నిరూపించిరి.

పూచెను+కలువలు ⟶ పూచెను గలువలు. (సంధి. పుట. 228)

**సింప్లిఫైడ్ గ్రామర్ ఆఫ్ ది తెలుగు లాంగ్వేజ్**
**(Simplified grammer of the Telugu Language)**

కర్త : మోరిస్ హెన్రీ

ఈయన నర్సాపురం సబ్ కలక్టరుగా నున్నపుడు ఈ వ్యాకరణమును రచించెను.

దీనిని లండన్‌లో క్రీ. శ. 1890తో ప్రచురించిరి.

**సింహాద్రి నరసింహరాజు సింహబలారి**

'కవిజనాంజనము'ను పేర, ఆంధ్రశబ్ద చింతామణికి విపులమగు టీకను రచించు నాశయము గలవాఁడుగాఁ గనుపట్టును. ఇతఁడు శ్రీరామచంద్ర పదారవిందపూజా పవిత్రుఁడుగాఁ జెప్పుకొన్నాడు.

**-సి-**

నీచత్వార్థమున స్త్రీలింగమున ఓయి యను సంబుద్ధి వాచకమందలి యి వర్ణమునకు వచ్చు ఆదేశము. ఉదా:- ఓసిదుష్టురాల మొ॥. ఈ యాదేశమొకానొకచో మిత్రత్వార్థమునను వచ్చును. ఉదా:- ఓసితల్లి మొ॥ (అథ. కా. అజంత. 2)

**సిద్ధఖండ బిందువు**

వెలఁది, చెలఁగి, తలఁపు ఇత్యాదులలో శబ్దగతముగానున్న ఖండబిందువు.

వీనిని వికల్పముగాఁ బూర్ణబిందువులను గావింపనగును.

వెలంది, చెలంగి, తలంపు (అప్ప. II. 28,27; బా. వ్యా. సంజ్ఞా. 14)

**సిద్ధపూర్ణ బిందువు**

పదమునందు సహజముగానున్న పూర్ణబిందువు.

పొంకము, కాంతి, ఇంతి ఇత్యాదులు. (అప్ప. II. 28)

**సిద్ధము**

(i) ఇంకొక భాషలో నేర్పడినది. కేవల సంస్కృత శబ్దములతో నేర్పడిన సమాసము. దీనినే సిద్ధసమాస మందురు

తటాకోదకము, లక్ష్మీవల్లభుఁడు.

(ii) శబ్దము తోడనే జనియించు బిందువు. ఇది సిద్ధపూర్ణము (చూ.) సిద్ధ ఖండము (చూ.) అని రెండు విధములు.

అందము చందము,

అడఁకువ, అరఁటి (అప్ప. II. 22; స. సా. స. I. 4,5)

**సిద్ధసమాసము**

(i) సంస్కృత శబ్దములతో నేర్పడిన సమాసము.

తటాక+ఉదక ⟶ తటాకోదకము.

(ii) రామశాస్త్రి. (ప్రౌ. వ్యా. సమాస. 6)

**సిద్ధానుస్వారము**

(సిద్ధ+అనుస్వారము) శాస్త్ర విధివలన కాక శబ్దమున సహజముగా నుండు అనుస్వారము. ఇది పూర్ణానుస్వారము, అర్థానుస్వారము, అని రెండు విధములు. అనఁగా సిద్ధ పూర్ణాను స్వారము, సిద్ధార్థానుస్వారము అనురీతి రెండు విధములని భావము. ఉదా:- చెలంగి, తలంగి, తొలంగి, మొ॥ (ఇట సిద్ధపూర్ణాను స్వారము) వాఁక, వీఁక, తేఁక మొ॥ (ఇట సిద్ధార్థాను స్వారము) (చింతా. అహో. సంజ్ఞా. 18) చూ:- సాధ్యానుస్వారము.

**-సు-**

సంస్కృత మందలి ప్రథమా విభక్త్యేకవచన - ప్రత్యయము - తెనుఁగులో అనిదంతమగు మహచ్ఛబ్దముపై వచ్చు సుప్రత్యయమునకు పుంలింగమున డుఙ్ ఆదేశమగును. ఉదా:- రాముఁడు మొ॥ (చింతా అజంత. 12) అమహచ్ఛబ్దముల 'సు' ప్రత్యయమునకు 'ము' ఆదేశమగును. ఉదా.- వనము మొ॥ (చింతా. అజంత 34). ఇకారాంతముల 'సు' ప్రత్యయమునకు లోపము వచ్చును. ఉదా:- హరి, మతి, వారి మొ॥ (చింతా. అజంత 36)

**సున్న**

అనుస్వారమునకు లిపి చిహ్నము

[ ం ] (అప్ప. II 11)

**సుప్పు**

నామములపై ప్రథమాది విభక్తులపై వచ్చు ప్రత్యయములు. ఇవి మొత్తము 21 అవి యివి.

| ఏ. వ. | ద్వి. వ. | బ. వ. | |
|---|---|---|---|
| సు | ఔ | జస్ | (ప్రథమా విభక్తి) |
| అమ్ | ఔట్ | శస్ | (ద్వితీయా ,, ) |
| టా | భ్యాం | భిస్ | (తృతీయ ,, ) |
| ఙే | భ్యాం | భ్యస్ | (చతుర్థీ ,, ) |
| ఙసి | భ్యాం | భ్యస్ | (పంచమీ ,, ) |
| ఙస్ | ఓస్ | ఆమ్ | (షష్ఠీ ,, ) |
| ఙి | ఓస్ | సుప్ | (సప్తమీ ,, ) (అష్టా ) |

ప్రథమా విభక్త్యేక వచనమగు 'సు' ప్రత్యయమునకు సప్తమీ బహువచనమగు సుప్‌లోని పకారముతో ప్రత్యాహారము చేయగా 'సుప్' సంజ్ఞ సిద్ధించును. తెలుఁగు పదములపైనను ఆయా విభక్తులలో ఈ సుప్ ప్రత్యయములే తొలుత వచ్చి పిదప వాని స్థానమున డుముపు ఇత్యాదులాదేశమగును. 'నకేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః' అను నియమముచే సుప్ ప్రత్యయములు చేరని కేవల నామములకుఁగాని నామములుచేరని కేవల ప్రత్యయములకుఁగాని ప్రయోగ ముండదు.

**సుప్పులు**

సంస్కృత మందలి సు—ఔ—జస్ మున్నగాఁగల ప్రథమాది విభక్తులతో తుల్యములగు డు — ము—వులు మున్నగు తెలుఁగు నామవిభక్తులు.

(ఆ. వ్యా సుబన్త, 1.)

**సుబంతము**

(సుప్+అంతము) సుప్ ప్రత్యయము అంతమందు గలది. పాణిని సంస్కృత పదజాలమును సుబంతములు, తిఙంతములు అని రెండు విధములుగా విభజించెను. సు, ఔ, జస్ మున్నగు నామ విభక్తులు అంత మందుగలవి సుబంత శబ్దములు. ఉదా.- రామః, రామమ్, రామేణ మొ॥. సంస్కృతమున అవ్యయములును సుబంత ములే. ఈ సుబంత పదములకు తెలుఁగున యథాతథముగ ప్రయోగము లేదు. (చింతా. సంజ్ఞా 38) వీని యనుకరణమున సుబంత ఘటిత వాక్యమైనను ప్రయోగింపఁదగును (చింతా. సంజ్ఞా 39) చూ:- సుప్పు.

**సుబంతములు**

సంస్కృత నామ విభక్తులగు సుప్పులు (చూ.) అంతమందుఁగల నామరూప ములు. వీనితో తుల్యములగు డు-ము-వు-లు మున్నగు తెలుఁగు నామవిభక్తులంత మందుఁగల శబ్దములను కొందఱు తెలుఁగు వ్యాకర్తలు సుబంతములనిరి.

రాముఁడు, వృక్షము, ధేనువు, ధేనువులు

రామునిచేత ఇత్యాదులు. (ప్ర వ్యా. 343)

**సుబోధినీ వ్యాఖ్యానము**

ఇది త్రిలిఙ్గలక్షణశేషము అను ప్రౌఢ వ్యాకరణమునకు శ్రీ బులుసు వేంకట రమణయ్య గారిచే రచింపఁబడిన టీకకు పేరు.

1966లో వావిళ్ళవారు దీనిని ప్రకటించిరి.

**సుబ్బారావు, వావిలకొలను**

'ఆంధ్ర వాల్మీకి' బిరుదాంచితులగు వీరు విశేషముగా గ్రాంధిక వాదులు.

బహుగ్రంథ కర్తలు. సంస్కృతాంధ్రాంగ్ల భాషాకోవిదులు.

వీరు బాల, ప్రౌఢ వ్యాకరణములను రెండింటి ననుసరించి, అక్లిష్టముగా విద్యార్థి జనోపయోగ కరముగా సులభ వ్యాకరణమును రచించిరి. ఇది యనేక ముద్రణముల నందినది.

**సురగణము**

సుర, దూత, ప్రేత, కుంత, మున్నగు సంస్కృత శబ్దములు.

వీనికి ప్రథమైకవచన లోపము గల్గును.

(శబ్దానాంజనము 57 పత్రం)

**సురశబ్దము**

ఇది నిత్యముగా స్త్రీ తుల్యము. సంస్కృత సమాసమునందు మాత్రముకాదు.

సురలు,

నిఖిల సురులు.

ఎల్ల సురలు (మిశ్రసమాసము) (బా. వ్యా. తత్సమ. 60)

**సురాదులు**

(సుర+ఆదులు) సుర మున్నగు శబ్దములు. అవి సుర, లాజ, అక్షత మొ॥. వీనికి అసమాసమున స్త్రీత్వ బహుత్వములు వచ్చును. ఉదా:- సురలు, లాజలు, అక్షతలు మొ॥. సమాసమందునో ఘూసురులు, కుత్రలాజములు, కుభాక్షతములు ఇత్యాదిగా స్త్రీత్వము రాని రూపములే యుండును. (చింతా. అజంత. 58; మం. అం. కౌ. 186)

**సులభవ్యాకరణము**

కర్త ; శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు.

ప్రచురణ : 1957.

మూడు భాగములుగానున్న ఈ వ్యాకరణము, బాల, ప్రౌఢ వ్యాకరణము లందలి విషయముల సంకలనముతో పాటు స్వకీయ పరిశీలనములను గూడ గల్గియున్నది.

ఇందు సాంకేతిక క్లిష్టతలేదు. ఇది విద్యార్థి జనోపయోగముగా నుండుట చేత అనేక ముద్రణముల నందుకొన్నది.

**సుసంతము**

(సుస్+అంతము) సుస్ (ప్రథమా విభక్తి ప్రత్యయములు) అంతమందుగల పదము. చూ - సుస్సు. షష్ఠీవిభక్త్యంత శబ్దముల విశేషణములు వికల్పముగా సుసంత (ప్రథమా విభక్త్యంత) ములుగా నుండును. ఉదా:- అకుటిలాత్ముండు

శ్రీరామునకు వినతులు, అకుటిలాత్మునకు శ్రీరామునకు వినతులు మొ॥ (అథ. కారి అజన్త 41, చింతా. అజంత .55).

**సుస్సు**

ప్రాకృత వ్యాకరణమునందు ప్రథమా విభక్తి

ఈ సంజ్ఞను కొందఱు తెలుఁగు వ్యాకర్తలు వాడిరి

(కవిజనాంజనము. పత్రం. 31 చింతా. సంజ్ఞా. 40)

**సూచనార్థకము**

హస్త నిర్దేశాదులచే సూచించుటను బోధించునది.

సమాస ఘటితమగు 'ఈ' శబ్దమిట్టి యర్థము నిచ్చును.

'ఈయున్న పొమ్మ్యప్రోలికిఁబోయి'. —— అనఁగా 'ఇదిగో యీ సమీపము నందున్నయని యర్థము. (ప్రౌ. వ్యా. సమాస. 11)

**సూత్రములు**

సూచించునది సూత్రము (సూచ్యతే ఇతి సూత్రమ్).

అల్పాక్షరములై, అసందిగ్ధములై, సారవంతములయి. బహురూప సాధకములై సార్థకములయి. నిర్దుష్టములయిన రచనలు సూత్రములనఁబడును. (అల్పాక్షర మసందిగ్ధం సారవత్ విశ్వతోముఖమ్, అస్తోక మనవద్యంచ, సూత్రమ్ సూత్ర విదో విదుః).

శ్రుతి హితత్వము, తూనిక (balance)వీని కత్యవసరము. శాస్త్రరచనకు సూత్ర రచన యత్యంతాను కూలము

సూత్ర రచనలో ఒక్క మాత్రకాలమునయిన పొదుపు చేసినచో వైయాకర ణుఁడు పుత్రోద్భవమైనంత మహానంద మనుభవించునట !!

ఇట్టి సర్వలక్షణములతు లక్ష్యము లనఁదగినవి చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రములు. (రమణీ. పుటలు 86-87)

**సూరకవి అడిదము**

క్రీ. శ. 1720—1785.

ఇతఁడు కవిజన రంజనమను ప్రబంధమును, చంద్రాలోకమను అలంకార శాస్త్ర గ్రంథమును, కవిసంశయ విచ్ఛేదమను లక్షణ గ్రంథమును; ఆంధ్ర నామ శేషమను నిఘంటువును రచించి ప్రసిద్ధి గాంచిన వాఁడు.

"ఆంధ్ర మర్మంబు తెలియంగ ననువు పడునె

ప్రకట సంస్కృత రచిత సూత్రముల చేత ?

అవని పాణిని ఘటిత సూత్రార్థ సరణి

తెనుఁగు టీకల చేత సాధింపనగునె?"

అను నీతని ప్రశ్నను బట్టి, సంస్కృతము కన్న భిన్నమైన వ్యాకరణ రచన తెనుఁగున కవసరమని యీతఁడు భావించినట్లు విదితము.

"కవిజన సంజీవనిలో

దవిలిన పద్ధతులు, మఱి యితర లక్షణ లక్ష్యవి నిర్దిష్టగతుల్ చెప్పవలయు"నను లక్ష్యముతో ఈతఁడు "కవిసంశయ విచ్ఛేదము"ను రచించినట్లు తెలియును.

**సూర్యగణ ప్రాతిపదికము**

గురువు తరువాత లఘువుగల ప్రాతిపదికము (నగణము కూడ సూర్యగణమే యైనను నగణ రూపముననున్న ప్రాతిపదికము మాత్రము సూర్యగణ ప్రాతిపదికము కాదు) ఉదా:- కాపు మొ॥. సూర్యగణ ప్రాతిపదికమగు జాతి వాచక శబ్దమునకు స్త్రీత్వమున 'తమ్' అను ప్రత్యయము వచ్చును. ఉదా:- కాపత మొ॥ (వై. చం. స్త్రీ ప్ర. 7)

**సూర్యనారాయణీయము**

ఆంధ్ర విశ్వకళా పరిషత్తునందు బహుకాలము ఆంధ్ర పండితులుగానున్న బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిచే విరచితమైన ఆధునికాంధ్ర వ్యాకరణము.

'ఆంధ్ర భాషాను శాసనమ'ను నది ప్రసిద్ధనామము. ఇది నామాంతరము.

**సృజి**

'నిర్మాణము గావించు' అను నర్థమునందీ ధాతువునకు గుణము రాదు.

'వదలివేయు' అను నర్థమునందు గుణము వచ్చును.

చతుర్ముఖుఁడు ప్రజలను సృజించెను.

అతఁడు విషయములను విసర్జించెను. (బా. వ్యా. క్రియా. 69)

**సౌమ్యము**

లక్షణము నందినది.

(వ్య.) గ్రామ్యము (చూ.)

**స్తు**

ప్రాకృత వ్యాకరణమున సంయుక్తాక్షరమునకు సంజ్ఞ. (వాల్మీకి 1-1-12) ఈ సంజ్ఞ వై. చం. యందును గ్రహింపఁబడినది (వై. చం. సంజ్ఞా. 10)

**స్త్రీతుల్యము**

స్త్రీలింగ శబ్దముతో తుల్యము.

'సుర' శబ్దము నిత్యముగా స్త్రీ తుల్యము. కావున 'సురలు' అనియే యుండును.

'అసుర' శబ్దము వికల్పముగా స్త్రీ తుల్యము. అనఁగా ప్రథమైకవచనము చేరిన రూపమొకటి; లోపించిన రూపమొకటి.

అసుర < అసురుఁడు / అసుర

సంస్కృత శబ్దములకు "తుల్య' అను వ్యవహారమును ఆచ్ఛిక శబ్దములకు 'సమ' అను వ్యవహారమును చిన్నయసూరి పాటించెను. (బా. వ్యా. తత్సమ. 60)

**స్త్రీత్వము**

స్త్రీలింగత్వము.

దీనినిబట్టి ప్రథమైక వచనము లోపించును.

దూతాదులకు స్త్రీత్వము బహుళము.

దూత < దూతుఁడు / దూత (బా. వ్యా. తత్సమ. 71, 75-77)

**స్త్రీప్రత్యయములు**

స్త్రీత్వమును దెలుపు ప్రత్యయములు.

(i) సంస్కృతమునందు ఙీష్ (ఙీ=ఈ) ఇట్టిది.

జనయిత్రీ—జనయిత్రి

విదుషీ—విదుషి ఇత్యాదులు.

(ii) ఆచ్ఛికములగు కొన్ని స్త్రీ ప్రత్యయములు.

—కత్తె—ఆటకత్తె

—ఆఁడి—వగలాఁడి

—ఎత—చాకెత, బోయెత

—పోఁడి—పూవుఁబోఁడి (ఆం. కౌ. 400-409)

**స్త్రీలింగపదములు**

స్త్రీలింగ ప్రత్యయములు చేరు పదములు. లతా, ధేనుః మున్నగునవి.

కొన్ని ఉకారాంత శబ్దములు స్త్రీలింగ మందున్న వానికి — వువర్ణకము చేరును. ధేనువు, వధువు మున్నగునవి. (ఆం కౌ. 169-170)

## స్త్రీలింగము

సంస్కృతమునందు స్త్రీ ప్రత్యయము లంతమునందుఁగల శబ్దము.

గౌరీ, సీతా

లతా, నదీ, ఇత్యాదులు.

వీని దీర్ఘము హ్రస్వమగుట, ప్రథమైకవచన లోపము తత్సమీకరణ విధానము.
గౌరి, సీత
లత, నది. (బా. వ్యా. తత్సమ. 48)

## స్త్రీలింగము తెనిగించుట

సమాస మధ్యమందున్న స్త్రీలింగ శబ్దమును హ్రస్వము గావించి, తెనిగింప నగును.

కాళిందీతటము — కాళింది తటము

తమసాతీరము — తమస తీరము

నదీసుత — నదిసుత

(క. సం. III. 13-14; ఆం. కౌ. 534, 85; స సా. సం. II. సమాస. 80, 81)

## స్త్రీలింగరీతి

స్త్రీలింగ శబ్దములకువలె ప్రథమైకవచన లోపము కలుగుట.

అభిలాష. భ్రమ, శబ్దము లకారాంతములగుట అభిలాషము, భ్రమము అని యగును. అట్లుగాక అభిలాష, భ్రమయనియు నుండును. ఇది స్త్రీలింగరీతి.

చరిత, అసుర వంటి వీరీతికిఁ జెందును.

(క. సం. II. 20-22; ఆం. కౌ. 207-209)

## స్త్రీవద్భావము

స్త్రీలింగ శబ్దము రీతిగా నగుట.

ఇట్లగుటచే ప్రథమైక వచనము లోపించును.

విధాతృ < విధాత (స్త్రీ వద్భావము)<br>విధాతృఁడు (పుంలింగము)

ఇట్లే ధాత. సవిత, నేత మున్నగునవి. ఇవి వికల్పముగా స్త్రీవద్భావమును బొందును.

భ్రాత, జామాత, కర్త మున్నగునవి, నిత్యముగా స్త్రీవద్భావమును బొందును.

(బా. వ్యా. తత్సమ. 52,53)

**స్త్రీవాచకములు**

స్త్రీని తెలుపు శబ్దములు.

అమ్మ, నెలఁత ఇత్యాదులు. వీనికి అచ్చుపరమగుచో సంధి చేయరాదు.

అమ్మ+ఇచ్చెను → అమ్మయిచ్చెను (బా. వ్యా. సంధి. 4)

**స్త్రీసమత్వాతిదేశము**

స్త్రీ సమత్వమును ఆరోపించుట.

ఇట్లతిదేశము (చూ.) గావించుట వలన ప్రథమైక వచన లోపాదికము కల్గునని యర్థము.

అన్న, మిన్న, అద్ద, గద్ద, జాణ మున్నగునవి. (బా. వ్యా. ఆచ్ఛిక. 2)

**స్త్రీసమములు**

ప్రథమైకవచన విభక్తులగు డు, ము, వు అనునవి లోపించునట్టి ఆచ్ఛిక శబ్దములు.

చిగురు, అన్న, అక్క, దున్న, గోద

(బా. వ్యా. సంధి. 25: బా. వ్యా. కారక. 20)

**స్త్ర్యర్థకము**

స్త్రీ+అర్థకము.

స్త్రీని తెల్పునది.

ఈ యర్థము నందు – త వర్ణకము వచ్చును.

బోయత, చెంచిత, ఎవరిత మున్నగునవి. (ప్రౌ. వ్యా. శబ్ద. 64)

**స్థానకరణములు**

భాషాధ్వని పుట్టు ప్రదేశము; అది పుట్టుట కుపకరించు సాధనము.

భాషాధ్వని నుచ్చరించునపుడు కదలక యున్న ఆస్యముయొక్క పై భాగము స్థానము.

కదలుచు ఆయా స్థానములందు వివిధ ప్రయత్నముల వలన ధ్వనుల నుత్పన్నము చేయు సాధనము—కరణము. నాలుక యిట్టిది.

స్థానకరణ సంయోగముచే ధ్వనులుత్పన్న మగును.

(తె. వ్యా. వి. పుట. 448)

**స్థాని**

దేని స్థానమున ఇతరము విధింపఁబడునో యదిస్థాని. ("యస్యస్థానే అన్యద్వి

ధీయతే తత్ స్థాని." బా. మ. స్థానివదాదేశః (1-1-56) అను సూత్రవ్యాఖ్య సి.కౌ. అచ్సంధి ప్రకరణము) ఉదా:- సరసపు పలుకులు అనుచోట 'పు' అను నాదేశము మువర్ణస్థానమున విధింపఁబడిన దగుటచే మువర్ణము స్థాని.

**స్థావరతిర్యక్ప్రకృతులు**

కదలలేనివి, ప్రాణములేనివి—స్థావరములు.

అడ్డముగా తిరుగాడు పశు పక్ష్యాదులు తిర్యక్సమూహములు.

వీనినే అమహద్వాచకములు (చూ.) అందురు. (ఆం. భా. భూ. 147)

**స్థిరములు**

స్థిరముగా నుండునవి, మార్పునకు లోనుగానివని యర్థము.

పరుషములు, సరళములు గాని హల్లులు స్థిరములు.

వర్గ ద్వితీయ, చతుర్థ, పంచమ వర్ణములు; య, ర, ల, వ, లు; శ, ష, స, హ, లు

(చింతా. సంజ్ఞా. 82; అప్ప. II. 14; గు. వ్యా. 10; బా. వ్యా. సంజ్ఞా. 6)

**స్పర్శములు**

స్థానకరణ స్పర్శ పూర్ణముగాఁ గలుగుట వలన నుత్పన్నములైన ధ్వనులు.

క, చ, ట, త, ప అనునైదు వర్గములకుఁ జెందిన ఐదేసి వర్ణములు.

(ఛం. ద. IV. 125; అప్ప. II. 7)

**స్పృశి**

ఈ ధాతువునకు గుణము విభాషగా నగును.

స్పృశి < స్పర్శించు / స్పృశించు (బా. వ్యా. క్రియా. 67)

**స్పృష్టోష్మములు**

స్పృష్ట+ఊష్మ ⟶ స్పృష్టోష్మములు

తొలుత స్పృష్ట ప్రయత్నము, అనఁగా స్పర్శ ప్రయత్నము, పిమ్మట ఊష్మ ప్రయత్నముతో నుచ్చరింపఁబడు ధ్వనులు.

చ, ఛ, జ, ఝ, ఞ (తె. వ్యా. వి. పుట. 27)

**స్ఫోటబ్రహ్మవాదులు**

శ్రవణేంద్రియ గోచరమగు ప్రాకృత ధ్వనులు కాక, వానిచే నభివ్యక్తమగు నట్టి బుద్ధి నిష్ఠమైనట్టి శబ్దము - నిత్యము, అఖండము, అవికారము, అచలమునని

భావించు వైయాకరణులకు స్ఫోటబ్రహ్మవాదులని, శబ్దబ్రహ్మ వాదులని వ్యవహారము. (తె. వ్యా. వి. పుట. 71-4)

**స్వంతము**

(సు+అంతము) సుఅంతమందుగలది అని శబ్దార్థము. సుఅనునది సంస్కృత వ్యాకరణమున ప్రథమైకవచన ప్రత్యయము కనుక స్వంతము అనగా ప్రథమైక వచన ప్రత్యయాంతమగు శబ్దమని భావము. (అథ. కా. సంధి. 82)

**స్వతంత్ర క్రియలు**

ఉపక్రియలు గాని సహాయ క్రియలు గాని లేని క్రియలు.

పోషించు చున్నాఁడు, పోషించెను. మొదలైనవి.

(సం. వ్యా. క్రియా. 4)

**స్వతంత్ర వ్యాకరణములు**

సంస్కృత సంప్రదాయానుసారము కాక, స్వతంత్రముగాఁ దెనుఁగు బాసకు తెనుఁగు పద్యాదులలో రచింపఁబడిన సంక్షిప్తములైన వ్యాకరణములు.

ఆంధ్రభాషా భూషణము

కావ్యాలంకార చూడామణి (నవమోల్లాసము)

కవిజన సంజీవని యిత్యాదులు. (తె. వ్యా. వి. పుట VI)

**స్వతంత్రాచ్చులు**

హల్లులతోఁ జేరని యచ్చులు.

అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ ఇత్యాదులు (గు. వ్యా. 16)

**స్వత్వము**

ప్రకృతి భావము (చూ.) సహజస్థితి యని యర్థము.

పూచెను గలువలు — అనుచోట ద్రుతమునకు స్వత్వము.

(బా. వ్యా. సంధి 17; బా. వ్యా. ప్రకీర్ణ. i)

**స్వదేశ్యములు**

నిజ దేశమునకుఁ జెందిన నుడులు. (వ్య.) అన్యదేశ్యములు. (చూ.)

అక్క, మేడ, అన్న, కుక్క ఇత్యాదులు. (అప్ప. I. 60)

**స్వయమర్థకములు**

'తనంత తాను' అను నర్థము నిచ్చు శబ్దములు.

'అంత' శబ్దము తన-, తమ - పూర్వకమయి, స్వయమర్థక మగును.

అయి. కాన్ అను నవ్యయము లిట్టివి.

'వనిత తనంతతా వలచి వచ్చిన'

వాఁడయి వచ్చెను. (ప్రౌ. వ్యా. శబ్ద. 107; క్రియా 82)

**స్వరభక్తి**

సంయుక్తాక్షరమును, స్వరముచే విడఁగొట్టి, యుచ్చారణమునందు సౌలభ్యమును సంపాదించు పద్ధతి.

దీనినే '**anaptyxis**' అందురు.

సంస్కృత సమ పదములనేకము లీరీతిని తద్భవము లగుచ్చువి.

చంద్రుఁడు — చందురుఁడు

దర్శనము — దరిసెనము (తె. వ్యా. వి. పుట 282)

**స్వరములు**

స్వయముగాఁ ప్రకాశించునవి.

అన్య సాహాయ్యము లేక స్వతంత్రముగా నుచ్చరింపఁబడు ధ్వనులు.

అదులు (చూ.)

అ ఆ ఇ ఈ

ఉ ఊ ఋ ౠ

ఌ ౡ ఎ ఏ

ఐ ఒ ఓ ఔ అను నీ పదాఱు వర్ణములు స్వరములని, అచ్చులని వ్యవహరింపఁబడు చున్నవి.

(ఆం. శా. భూ. 16 కా. చూ. IX. 9 అ. ఛం. IV. 128 అప్ప. II. 9; ఆం. కౌ. 58)

**స్వరసంధి**

స్వరములకు స్వరములు పరమగునపుడు కల్గు మార్పులను దెల్పుసంధి.

(i) రాముఁడు+అతఁడు ⟶ రాముఁడతఁడు

స్వరమునకు స్వరము పరమగుచో పరరూపము నిల్చును.

(అప్ప. V. 38,39)

(ii) సంస్కృతమునందు సవర్ణదీర్ఘ సంధి, వృద్ధిసంధి, గుణసంధి, యణాదేశ సంధి స్వరసంధులనఁబడును. (ఆం. ఛం. IV. 42,43)

**స్వరాకర్షణము**

అచ్చుయొక్క ఆకర్షణము.

పూర్వము నందుఁగాని, పరమునందుఁగాని యుచ్చారణమునందు బలీయమై తన ప్రక్కనున్న స్వరమును తనవలె మార్చుట.

దీనినే Vowel harmony అందురు. Vowel assimilation అనియు దీనికి పేరు.

భిన్న స్వరోచ్చారణము నందలి క్లేశ మిందుమూలమున తొలఁగింపఁబడును.

తెలుఁగున విశేషముగా నీ స్వరాకర్షణము ఇ, ఉ లకు జరుగును.

కవి+లు ⟶ కవులు.

హరి+లు ⟶ హరులు.

అటు+తిని ⟶ అటితిని.

సుకృతి+వు ⟶ సుకృతివి. ఇత్యాదులు.

(తె. వ్యా. వి. పుటలు. 283, 623, 624)

**స్వరాగమము**

స్వరమును అదనముగాఁ జేర్చుట.

కొన్ని హల్లుల నుచ్చరించుటలోఁగల క్లేశమును దొలగించుటకు, వానికి ముందొక స్వరము సాయముగా వచ్చుట.

దీనినే Prothesis అందురు.

ఈ పద్ధతిని గూడ ననేక తద్భవము లేర్పడుచున్నవి.

రథము—అరదము

రాజు—అరసు

రంగము—అరుగు మున్నగునవి. (తె. వ్యా. వి. పుట. 282)

**స్వర్గివాచిదేవసురశబ్దములు**

(i) స్వర్గమందుండు వానిని దెల్పు దేవశబ్దము. ఇది యెప్పుడు నేకవచనము నందే యుండును.

దేవుఁడు.

భూమిపైనుండు వానిని దెల్పు దేవశబ్దము ఏకవచన బహువచనము లందుండును.

భూదేవుఁడు—భూదేవులు

భూసురుఁడు—భూసురులు.

(ii) స్వర్గమందుండు వానిని దెల్పు 'సుర' శబ్దమున కేకవచనము నందు రూపము లేదు. బహువచన రూపమే - సురలు.

భూమిపై నుండు వానిని దెల్పు సురశబ్దమున కేకవచన, బహువచనరూపములు రెండును నుండును.

భూసురుఁడు, భూసురులు. (బా. వ్యా. తత్సమ. 62)

**స్వస్వామిసంబంధము**

స్వ=ద్రవ్యము=వస్తువు; స్వామి=అధిపతి

ఈ రెండింటికిని పరస్పర సంబంధము

అట్టి సంబంధమే రెండు పదములకేని యున్నచో స్వామి వాచకము యొక్క షష్ఠికి ద్వితీయ వచ్చును.

నా యొక్క చెట్టవట్టనన్

నన్నుఁజెట్టవట్టినన్ (ప్రౌ. వ్యా. కారక. 28)

**సార్థణిచ్చు**

తన యర్థమునందు వచ్చునట్టి ప్రేరణార్థకమగు ఇంచుగాగమము.

భువిభక్తులు హరిగుణములు కీర్తింతురు.

ఇందన్య ప్రేరణము లేదు. (ఆం. కౌ. పంక్తులు 781-88)

**స్వార్థము**

ఏ శబ్దమునకేది నిశ్చితార్థమో అదియే స్వార్థము.

వేఱు—వేఱడము (ఇట - అడ వర్ణకము చేరుటచే వేఱునకుఁగల యర్థము నందు మార్పులేదు)

ఇట్లే అరమర—అరమరిక మున్నగునవి.

(బా. వ్యా. తద్ధిత. 9; ప్రౌ. వ్యా. తద్ధిత. 6)

**హ1**

కంఠోష్మము (guttaral aspiration)

సప్తపథ కుడ్యము—సౌనము

జిహ్వాపృష్ఠము—కరణము

ఊష్మము

శ్వాసము

మహాప్రాణము

ఈ ధ్వని దేశ్యశబ్దములయందు విశ్రుతము కాకున్నను, తెలుఁగు వర్ణమాల లోనిది చూపఁబడెను.

**హ²**

ప్రాకృత వ్యాకరణమున హ్రస్వమునకు సంజ్ఞ (వాల్మీ. 1-1-5) ఈ. సంజ్ఞ మం, ఆం. కౌ. యందును గ్రహింపఁబడినది (సూ. 25)

**హంస పాదము**

లేఖన చిహ్నము — h

ఈ గుర్తు, లుప్త వర్ణాదులు మీఁద వ్రాయఁబడి యున్నవని తెలుపును.

సీతతో

"అంతట రాముఁడు వనములకు | వెడలెను"

(సం వ్యా. విరతులు 1)

**హరి**

అథ. కా. లో అప్రయుక్తత్వ దోషస్తు (సంజ్ఞా 81), శబ్దానామంత్య భాగేషు (సంధి 11. 12), వికృతాః పరుషాశ్చ సుః... (సంధి 16, 17) అను మూఁడు చోట్ల నీతఁడు స్మరింపఁబడినాఁడు. పై కారికలను బట్టి యీతఁడు ఆంధ్ర వ్యాకర్తయనియే తెలియుచున్నది. ఈతఁడు హరికారికా కర్త యని కొందఱ యభిప్రాయము. కాని హరికారికా కర్త నవీనులగు శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారని నిశ్చితమగుటచే ఈతఁడు హరికారికా కర్త కాఁడని నిర్ణయింపవచ్చును. అథ. కా. యందు తప్ప ఇతరత్ర ఆంధ్ర వ్యాకరణములందు 'హరి' యను వ్యాకర్త పేర్కొనఁబడక పోవుటచే నితఁడు ఆంధ్ర వ్యాకర్తయగునో? కాదో? ఇతఁడెప్పటి వాఁడో? ఎక్కడి వాఁడో? అను విషయములను నిర్ణయింప వీలులేదు. సంస్కృత వ్యాకరణమున వాక్యపదీయకారుఁడగు భర్తృ హరికి హరి యను వ్యవహారమున్నను ఈ హరి భర్తృ హరికన్న భిన్నుఁడే.

(ఆం. వ్యా. వి. పేజీ. 191)

**హల్/హల్లు/హల్లులు**

(i) పాణిని మహేశ్వర సూత్రములందు 'హ'కారము మొదలు 'ల్' వఱకుఁ గల వర్ణములలో నేదియైనను 'హల్' అనఁబడును.

వీనినే 'హల్లులు' అందురు. వీనికే 'వ్యంజనము' లనియు వ్యవహారము.

(బా. వ్యా సంజ్ఞా 1)

(ii) కాదులు, అనఁగా కకారాదులు హల్, వ్యంజనాఖ్యలననగును.

(కా. చూ. IX. 9; అప్ప. II. 7; ఆం. కౌ. 58; బా. వా. సంజ్ఞా. 1)

**హలంత సంధులు**

హల్లు అంతమందుఁగల పదములకుఁ గల్గు సంధులు (చూ.) (వ్య.) అజంత సంధి.

పొల్లు నకార మంత మందుఁగల పదములకు క, చ, ట, త, ప లు పర మగుచో అవి గ. జ, డ, ద, బ లు క్రమముగా నగును.

అనకారము సున్న అగును.

పూచెన్ + కలువలు ——→ పూచెన్ గలువలు

——→ పూచెం గలువలు

పూచెఁ గలువలు (ఆం. కౌ. 86-98)

**హలవసానములు**

హల్ + అవసానము

(i) హల్లుగాని, అంతముగాని పరమగుచో మధ్యమపురుష 'ము' వర్ణకమునకు లోపము విభాషగా నగును.

చూడుము + నన్ను < చూడునన్ను / చూడుము నన్ను

నన్ను + చూడుము < నన్నుచూడు / నన్నుచూడుము (బా. వ్యా. సంధి. 47)

(ii) 'ఏమి' శబ్దము యొక్క 'మి' కారమునకును నిట్లు లోపము కల్గును.

నీకే బ్రాఁతియె? (హల్లుపరము)

శవము క్రియ నుండెడిదే? (అవసానము పరము) (ప్రౌ. వ్యా. సంధి. 16)

**హలాదితోడనూదుట**

హల్లు ఆదియందుఁగల పదములు పరమగునపుడు కొన్ని ద్విత్వాంతములైన పదములను వికల్పముగా నూదవచ్చును.

కన్నుంగవ, కనుఁగవ (క. సం. II. 17)

**హల్ఙ్యాదిసూత్రము**

"హల్ఙ్యాబ్భ్యో దీర్ఘాత్సుతి స్యపృక్తంహల్" (అష్టా. 6-1-68) అను పాణినీయ సూత్రము. హలంతముల కంటెను, దీర్ఘములగు ఙీప్, ఆప్ అను స్త్రీ ప్రత్యయము లంతమందుఁగల శబ్దముల కంటెను పరమందున్న అపృక్తము లగు సు, తి, సి అనునవి లోపించును. ఉదా; జలముక్, రమా, గౌరీ మొ॥ ఇట క్రమముగా హలంతము కంటెను, ఆ బంతము కంటెను, ఙీబంతము కంటెను

పరమందుగల 'సు' ప్రత్యయమునకు లోపము.. అబిభర్ (అబిభర్+తి), అభినః (అభినద్+స్) ఇట క్రమముగా హలంతముపై నున్న తి, సి ప్రత్యయములకు లోపము.

**హాదులు**

హకార మాదియందుఁగల శబ్దములు.

ఇందలి హకారమునకు లోపమును గలుగును.

హడపము — అడపము

హరి దళము — అరి దళము

హలఁది — అలఁది (బా. వా. ప్రకీర్ణ. 10)

**హే**

సంబోధనమును తెలుపు శబ్దము. (అ. కో. అవ్యయ. 7-(వై. చం. అజంత 9)

**హేత్**

(హ+ఏత్) హ్రస్వమైన ఎకారము (చూ:-హ). (వై. చం. అజంత 88)

**హేతుకర్త**

హేతువుతోఁ గూడిన కర్త.

'వినయవంతులు హితమును బొందుదురు' అనుచో హితమును బొందుటకు కారణము వినయము. అదికలవారు కర్త కావున నిది హేతుకర్త యగును.

(ఆం. కౌ. 422, 423)

**హేతుగర్భ విశేషణము**

హేతువుతోఁ గూడిన విశేషణము

"జూదరి యగు మనుజుఁ డవమానమును బొందును"—

అవమానమునకు హేతువు — జూదము. విశేషణ మిట్టి హేతువుతోఁ గూడి యున్నది కావున నది హేతుగర్భ విశేషణము. (తె. వ్యా. వి. పుట 687)

**హేతువు**

ఫలమును సాధించుటకుఁ దగినది.

హేత్వర్థము నందు చేత వర్ణకము వచ్చును.

ధనముచేత సౌఖ్యము గలుగును. (బా. వ్యా. కారక. 4)

**హేత్వకారము**

హేతు+అకారము

హేతువును దెల్పు 'అ' కారము

ఏవ కారార్థము నందు వచ్చు అకారము హేతువును గూడఁ దెల్పును గాన దానిని హేత్వకార మనఁ జనును.

'కొల్వర (రు+అ) యేని — కొల్వకుండుటే కారణమగునేని.

నియ తమ (ము+అ) యేని — నియతముగా నుండుటే కారణమగునేని.

(క. సం. వి. I-8, 10)

**హేత్వర్థము**

హేతు+అర్థము.
(చూ.) హేతువు.

హేతువును జెప్పునట్టి యర్థము ఈ అర్థమునందు 'చేత', 'చే' అను విభక్తులు వచ్చును.

ధనము **చేత** సుఖము కలుగును.

యోగ్యత చే గౌరవము కలుగును. (ల. వ్యా. విభక్తి. 88)

**హేత్వర్థసంధాయకము**

హేతువును దెల్పునట్టి శబ్దము, రెండు వాక్యములను గలుపుచోనది హేత్వర్థ సంధాయక మగును.

అతఁడు బాగుగాఁ జదివెను **గానఁ** బరీక్షలోఁ గృతార్థుఁడాయెను.

(మ. ప. వ్యా. సంధా. 6)

**హేమచంద్రుఁడు**

సుప్రసిద్ధుడగు ప్రాకృత వ్యాకర్త.

తెలుఁగుగూడ నొక ప్రాకృత భేదమని; హేమచంద్ర త్రివిక్రమాదులు ఈ భాషను వ్యాకరించుటలో మార్గము చూపినారని విన్నకోట పెద్దనాదుల యభిప్రాయము. (కా. చూ. IX. 8)

**హేమాచార్యమతసంధులు**

హేమాచార్యుని పేరట వెలసిన సంధులు.

ద్వంద్వ సమాసమునందు ఉత్తరపదాదియందు క చ ట త ప లున్నచో నవి నిత్యముగా క్రమముగా గ స డ ద వ లగును.

ఈ సంధులను అప్పకవి హేమాచార్య మత సంధులని వ్యవహరించుటలోఁగల యౌచిత్యము బోధపడదు.

కసవు గట్టెలు

కాలుసేతులు

నిక్కుడెక్కులు

ఒప్పు దప్పులు

ఊరు వల్లెలు (అప్ప. V. 168,169)

**హ్రోత్**

(హ+ఓత్) హ్రస్వమగు ఒకారము. ప్రాకృత వ్యాకరణమున 'హ' అనునది హ్రస్వమునకు సంజ్ఞ. చూ:- హ. (వై. చం. 145. పు)

**హ్రైకాచ్**

(హ+ఏకాచ్) హ్రస్వమైన ఏకాచ్చు. దీనికి పరమందున్న బిందుకము (అర్ధ బిందువు) నిత్యముగా పూర్ణబిందువగును. ఉదా:- కొంచు - కొనుచు; కొందును -కొనుదును (వై. చం. సంధి. 38) ఇట కొను ధాతువులోని ఉపధానకారమునకు చు, దులు పరమగునపుడు వికల్పముగా అర్ధబిందువు వచ్చినదని గ్రహింపవలెను. (వై. చం. సంధి. 37)

**హ్రస్వబిందువు**

పూర్ణబిందువునకు దీర్ఘబిందు వనియు, ఖండ బిందువునకు హ్రస్వ బిందు వనియు వ్యవహారము. (తె. వ్యా. వి. పుట. 99)

**హ్రస్వము**

ఏకమాత్రా కాలికమయిన స్వరము.

అ, ఇ, ఉ, ఋ, ఌ

(వ్య.) దీర్ఘము. (అ. ఛం. IV. 124)

**హ్రస్వలిపులు**

కుఱచలైన వర్ణములు.

అ, ఇ, ఉ, ఋ, ఎ, ఒ లు (అప్ప. II 10)

**హ్రస్వవక్రములు**

హ్రస్వములైన వక్రములు (చూ)




(వ్య.) దీర్ఘములు ఏ, ఓ

ప్రాకృత వైయాకరణులలో కొందఱ మతమునందు హ్రస్వవక్రములు లేవు. వీరి యభిమతాను సారము ప్రాకృతమునకు వర్ణములు నలువది యగును.

కొందఱ మతమునందు హ్రస్వవక్రములు గలవు. అట్టిచో ప్రాకృతమునకు వర్ణములు నలువది రెండగును. చిన్నయసూరి, నలువది వర్ణములను మతమునకు జెందినవాఁడు. (బా. వ్యా. సంజ్ఞా. 2)

**హ్రస్వవ్యస్తత్రికము**

హ్రస్వములై, వ్యస్తముగా నున్నట్టి త్రికము. (చూ.)

ఆ, ఈ, ఏ—దీర్ఘవ్యస్త త్రికము

అ ఇ ఎ—హ్రస్వవ్యస్త త్రికము

హ్రస్వవ్యస్తములైన త్రికముపై నున్న 'ది', 'వి' వర్ణములకు ద్విత్వము నగును.

అద్ది, అవ్వి; ఇద్ది, ఇవ్వి, ఎద్ది, ఎవ్వి యిత్యాదులు.

(ప్రౌ. వ్యా. శబ్ద. 59)

**ళ[1]**

**మూర్ధన్య పార్శ్వికము (retroflex lateral)**

**మూర్ధము—స్థానము**

**ప్రతివేష్టిత జిహ్వాగ్రము—కరణము**

**నాదము**

**అల్పప్రాణము**

సంస్కృతము నందిది **లకారముతో** నభిన్నము.

సంస్కృత పదములు విశేషముగాఁ 'ళ' కారోచ్చారణమునే తెలుఁగునఁ గల్గియున్నవి. 'ల' కారోచ్చారణము అర్థభేదమును గల్గించును.

కళ (art) (సం) - కల (తె) (dream)

మంగళము (సం.) (శుభము)

మంగలము (తె.) (వేపుడుబొచ్చు)

ళ[2]

లకారమునకుఁగల అలఘూచ్చారణము. "ళ"

బహుత్వమందు ర, ల, డల కాదేశమగు ళకారము.

ఏళులు, పాళులు, త్రాళులు ఇత్యాదులు. (బా. వ్యా. సంజ్ఞా. 18)